# Geervana kavula kavithaa geervanam-2

by

**Gabbita Durga Prasad**

First Edition: **December 4, 2016**

Copies: 1000



Price. Rs.**400/-**

Cover Design: **Kalasagar**

For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com

Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

## అంకితం



మా తలిదండ్రులు

కీ.శే. శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి

కీ.శే. శ్రీమతి భవానమ్మ దంపతులకు



# నాన్న అమ్మ

**మా** తండ్రిగారు శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారు క్రీ. శ. 1900, వికారి నామ సంవత్సరంలో కృష్ణాజిల్లా ఉయ్యూర లో శ్రీ గబ్బిట దుర్గాపతి శాస్త్రి, శ్రీమతి నాగమ్మ దంపతులకు జన్మించారు. మాది వైదిక తెలగాణ్య శాఖ . గౌతమస గోత్రం ఆంగీరస, అయాస్య, గౌతమ త్రయార్షేయం. మా తాతగారిది పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు దగ్గర దెందులూరు మండలంలోని రామారావు గూడెం అగ్రహారం. బాగా స్థితిపరులైన అగ్రహారీకులు. అక్కడ మాకు ఒక భక్తాంజనేయ స్వామి వారి చిన్న దేవాలయం ఉంది. మా నాన్నగారు జన్మించిన కొద్దికాలానికే తండ్రిగారు చనిపోయారు. ఆస్థికూడా తగ్గి పోయింది. మా నాయనమ్మ నాగమ్మ గారి తండ్రి శ్రీ గుండు లక్ష్మీ నరసింహావధానులు గారు ఉయ్యూరు నివాసి. అందుకని మా నాయనమ్మగారు భర్త మరణంతో తండ్రి వద్దకు కుమారునితో సహా ఉయ్యూరు చేరారు. దౌహిత్రుడైన మా నాన్న గారికి, మాతామహులు ఉయ్యూరులోని ఆయన పొలం, ఇల్లు, స్థలం రాసి ఇచ్చి అల్లారు ముద్దుగా పెంచారు. మా మామ్మ అక్క చెల్లెళ్ళలో అప్పటికి ఎవరికీ సంతానం లేనందున అందరూ మా నాన్నగారిని అతి గారాబంగా చూసుకోనేవారు. చిన్నప్పటి నుంచే సంగీత, నాటక, సాహిత్యాలపై పరిచయం బాగా ఉండేది. ఇప్పుడు మేము అనుభవిస్తున్న ఉయ్యూరు ఆస్థినంతా దౌహిత్రుడుగా మా నాన్న గారికి, మా నాయనమ్మగారి తండ్రి శ్రీ లక్ష్మీ నరసింహావధానులు గారి ద్వారా సంక్రమించినదే. ఇది కాక రామారావు గూడెంలో పిత్రార్జితమూ మా నాన్న గారికి దక్కింది. మా అమ్మ గారు శ్రీమతి భవానమ్మగారు గుండు వారి ఆడబడుచు. ఉయ్యూరులో మా ఇంటి ప్రక్కనే ఉత్తరాన వారి ఇల్లు ఉంది. తలిదండ్రులు శ్రీ గుండు సింగిరి శాస్త్రి, శ్రీమతి దుర్గ. మాఅమ్మగారు తన 12వ ఏటనే మా నాన్నగారిని వలచి వరించటంవలన, పెద్దలు అనుమతించి ఇద్దరికీ వివాహం జరిపించారు.

### చదువు ఉద్యోగం

మా తండ్రిగారు విద్వాన్ పరీక్ష రాసి ఉత్తీర్ణులై, బ్రహ్మశ్రీ చెరుకుపల్లి లక్ష్మీ

నరసింహశాస్త్రి మొదలైన గురువులవద్ద వేద, వేదాంతాలను, కావ్యాలను అభ్యసించి సంస్కృత, ఆంధ్రాలలో గొప్ప ప్రావీణ్యం సంపాదించారు. కవిత్వమూ బాగానే అబ్బింది. ఉయ్యూరులోని సి.బి.ఎం.స్కూల్‌లో తెలుగు పండితులుగా కొంత కాలం పని చేశారు. ఆ తర్వాత అనంతపురం జిల్లాలోని హిందూపూర్‌లో ఉన్న ఇ.సి.ఎం. హైస్కూల్‌లో సీనియర్ తెలుగు పండితులుగా చేరి, 22 సంవత్సరాలు అక్కడే పని చేశారు. మా బాల్యంలో కొంత భాగం అక్కడే గడిచింది. మాంచి రేషన్ కాలంలోను పేద విద్యార్థులకు మా ఇంట్లో వారాలు ఇచ్చి చదువుకొనే విద్యార్థులను ప్రోత్సహించారు. ఇంటి వద్ద ఉచితంగా తెలుగు బోధించేవారు. రాయలసీమ ప్రాంత కవి పండితులైన శ్రీ కల్లూరి సుబ్బారావు మొదలైన వారితో ప్రత్యక్ష పరిచయం ఉండేది. ఆంధ్ర ప్రాంతం నుండి ఉపన్యాసాలకై హిందూ పురం వచ్చే కవిపండితులకు, గాయకులకు, హరి కథకులకు మా ఇంట్లోనే వసతి, భోజన సౌకర్యం కల్పించేవారు. ఇలా ఆతిధ్యం పొందిన వారిలో కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, శ్రీ జటావల్లభుల పురుషోత్తం ఉన్నారని మా అమ్మ చెప్పింది. నాన్నగారి నాటకం, సంగీత కచేరీలు మహా ఇష్టం. ఎంతదూరమైనా వెళ్లి చూసి వచ్చేవారట. బ్యాడ్‌మింటన్ బాగా ఆడేవారట. ప్రసిద్ధ హరికథకులు శ్రీ పిల్లలమఱ్ఱి రామదాసు గారి హరికథలు నెలల తరబడి హిందూపూర్‌లో జరిగేవి. దీనికి నాన్నగారి ప్రోత్సాహమే కారణం అని చెప్పేవారు. హిందూపుర వైశ్య ప్రముఖులు గొప్ప వదాన్యులు, వితరణ శీలురు కూడా. వీరందరికీ నాన్నగారంటే మహా గౌరవం. కవి పండితులను ఆహ్వానించి ఘన సన్మానం చేసేవారు. వీటన్నిటికి వెనుక నాన్నగారి చేయూత ఉండేది.

**ఉయ్యూరుకు బదిలీ**

కృష్ణాజిల్లా బోర్డ్ ప్రెసిడెంట్‌గా శ్రీ కాకాని వెంకట రత్నం గారున్నప్పుడు, మా నాన్న గారిని హిందూపురం మునిసిపల్ హైస్కూల్ సర్వీస్‌తో కృష్ణా జిల్లా జగ్గయ్యపేట హైస్కూల్‌కు జిల్లామార్పు ప్రాతి పదిక మీద తీసుకొని వచ్చారు. ఆ తర్వాత ఉయ్యూరు ఉన్నత పాఠశాలకు బదిలీ అయి, 1954లో పదవీ విరమణ చేశారు. పిమ్మట తాత్కాలిక ప్రాతిపదికపై ఉంగుటూరు హైస్కూల్‌లో రెండేళ్ళు పని చేశారు. రిటైర్డ్ హెడ్ మాస్టర్ శ్రీ పుచ్చా శివయ్యగారు, శ్రీ అన్నే హనుమంతరావు గారు అనే లెక్కల మేష్టారు కలిసి స్థాపించిన శ్రీ సరస్వతి ట్యుటోరియల్ కాలేజిలో 5 సంవత్సరాలు తెలుగు పండితులుగా పని చేశారు. ఎక్కడ పని చేసినా నాన్న గారు అద్భుతంగా పాఠాలు బోధిస్తారనే పేరుండేది. కృష్ణాజిల్లాలో ఆంధ్ర, సంస్కృతాలలో అంతటి పండితుడు ఆనాడు లేరని పెద్దలు చెప్పుకోగా నేను విన్నాను.

## గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2

### గాంధీజీకి స్వాగతం చెప్పిన నాన్న

భారత జాతీయ కాంగ్రెస్ అంటే నాన్నగారికి గొప్ప అభిమానం. గాంధీ మహాత్ముడు 1922 ఏప్రిల్‌లో ఆంధ్రదేశం పర్యటిస్తూ 11,12 తేదీలలో ఉయ్యూరు వచ్చినప్పుడు ఉయ్యూరులో మహాత్మునికి స్వాగతం చెప్పిన వారిలో, ఏర్పాట్లు చేసిన వారిలో మా నాన్న గారి ప్రముఖ పాత్రను గురించి, శ్రీ సూరి శోభనాచలపతి, శ్రీ వల్లభనేని వెంకటరావు శ్రీ గాయత్రి అనంత రామయ్య గారి తోడ్పాటునూ శ్రీ కొడాలి ఆంజనేయులు గారు 'ఆంధ్రప్రదేశ్ లో గాంధీజీ' గ్రంథంలో గ్రంథస్థం చేశారు. శ్రీ కొడాలి ఆంజనేయులు నాన్నగారికి ముఖ్య మిత్రులు కూడా. స్వాతంత్రోద్యమంలో పాల్గొన్న దేశభక్తులు మా తండ్రి గారు అని చెప్పుకోవటం మాకు గర్వ కారణం. ఎప్పుడూ ఖద్దరు దుస్తులనే ధరించేవారు. రాట్నం వాడికి నూలు తీసేవారు. ఖద్దరు పంచె, లాల్చి, ఖండువా, నుదుట విభూతి రేఖలతో, వెనక పిలకతో అపర పరమేశ్వరులుగా ఉండేవారు. మా అమ్మ అపర భవానీదేవిగా ఉండేవారు. ఈ జంట పార్వతీ పరమేశ్వరులుగా గోచరించేవారు. వారి పేర్లకు సార్ధకత కలిగించారు.

### సాహితీ సేవ

ఉయ్యూరు హైస్కూల్‌లో పనిచేసినప్పుడు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిని ఆహ్వానించి రామాయణ కల్ప వృక్షంపై ఉపన్యాసాలనిప్పించారు. ఎందరో కవులు తాము రాసిన కవిత్వాన్ని నాన్నగారికి చూపించి తప్పులు దిద్దించుకొని, మెళకువలు నేర్చుకొనేవారు. అలాంటివారిలో ఉయ్యూరుకు చెందిన 'సంగ్రహ రామాయణం' రాసిన శ్రీ సూరి సుబ్బయ్యగారు, 'తపతి' కావ్యం రాసిన మా గురువు గారు శ్రీ భమిడిపాటి వీరభద్రరావు గారు, మరో గురువు శ్రీ మహంకాళి సుబ్బరామయ్య గారు వంటి వారున్నారు. ఉయ్యూరులో ఆనాడున్న పాలిటెక్నిక్ లో చదివే విద్యార్ధులకు వారాలు ఇచ్చి ప్రోత్సహించారు. పేద విద్యార్ధులైన పెద్ది భొట్ల శ్రీరాములు, కోట లక్ష్మీనరసింహ శాస్త్రి, వంగవీటి కాళీ వరప్రసాద్‌లు మా ఇంట్లోనే ఉండేవారు. మా అమ్మ అన్నపూర్ణ లాగా అతిధి మర్యాదలు చేసేది. సహధర్మచారిణిగా చక్కని సహకారం నాన్నకు అందించేది. పాలిటెక్నిక్ కాలేజిలో జరిగే సాంస్కృతిక కార్యక్రమాలకు నాన్నగారిని ఆహ్వానించి సలహా సంప్రదింపులు చేసేవారు. విద్యార్ధుల వక్తృత్వ, వ్యాస రచనల పోటీలకు నాన్నగారిని న్యాయనిర్ణేతగా ఆహ్వానించేవారు.

మా నాన్న గారు త్యాగవీరుల జీవితాలను ప్రబోధాత్మకంగా రాసిన 'త్యాగధనులు' అనే పుస్తకం ఉపవాచకంగా హైస్కూళ్లలో బోధించేవారు. దీనికి మంచి ఖ్యాతి వచ్చింది. సాహితీ ప్రసంగాలు నాన్నగారికి ఇష్టం. స్వంత లైబ్రరీ ఉండేది. ఆ పుస్తకాలన్నీ భద్ర పరచాము.

**మేం ముగ్గురం**

మా అమ్మ కన్న పన్నెండు మంది సంతానంలో ఆరేళ్ళ క్రితం మా పెద్దక్కయ్య శ్రీమతి లోపాముద్ర చనిపోగా, ఇప్పుడు ముగ్గురమే మిగిలాం. మా చిన్నక్కయ్య శ్రీమతి వేలూరి దుర్గ, నేను, మా తమ్ముడు కృష్ణ మోహన్.

మా అన్నగారు శ్రీలక్ష్మీ నరసింహశర్మగారు హోస్పేట రైల్వే స్టేషన్ మాస్టర్‌గా పని చేస్తూ 1958లో హఠాత్తుగా మరణించి, మా కుటుంబానికి తీవ్ర మనో వేదన మిగిల్చారు. మా వదిన శ్రీమతి కమలమ్మను ఆదరించి, కుమార్తె వేదవల్లి, కుమారుడు రామనాథ బాబులను మా అమ్మా నాన్నే పెంచి పెద్ద చేశారు.

**శ్రీ సువర్చ లాంజనేయ స్వామి సేవలో**

మా నాయనమ్మగారి తండ్రిగారు శ్రీ గుండు లక్ష్మీ నరసింహావదానులుగారు ఉయ్యూరులో రావిచెట్టు బజారులో శ్రీ సువర్చలాంజ నేయ స్వామిని ప్రతిష్టించి దేవాలయం నిర్మించారు. ఆయన తర్వాత మా తండ్రిగారు, ఆయన గతించాక నేను వంశ పారంపర్య ధర్మకర్తలుగా ఉండి ఆలయ అభివృద్ధికి కృషి చేశాం.

**నాన్న, అమ్మ నిర్యాణం**

నాన్నగారు 1961 నవంబర్ 21 న కార్తీక శుద్ధ ఏకాదశి నాడు స్వర్గస్తులయ్యారు. వృద్ధురాలైన మా నాయనమ్మగారు అప్పటికి జీవించే ఉన్నది. ఆమె 1967లో నా చేతుల మీదుగా చనిపోయింది. మా అమ్మ గారు 1982 ఫాల్గుణ శుద్ధ పాడ్యమి నాడు మరణించారు.

**సాహితీ సేవలో నేను**

నాన్న గారిచ్చిన సంస్కారం, నేను నేర్చిన విద్య వలన తెలుగులో ఎం.ఎ.చేశాను. చిన్నప్పటి నుండి తెలుగుపై ఉన్న మక్కువ, ఆనాటి నా తెలుగు ఉపాధ్యాయులైన శ్రీ త్రిపురనేని సుబ్రహ్మణ్యం, శ్రీ తాతినేని లక్ష్మయ్య, శ్రీ గురజాడ పూర్ణచంద్రశర్మ, శ్రీ మహంకాళి సుబ్బరామయ్య, మా మేనమామ శ్రీ గుండు గంగాధరశాస్త్రి గార్లు, కాలేజీలో శ్రీ విశ్వనాధ సత్యనారాయణ, శ్రీ పాటిబండ్ల మాధవ రామశర్మ గార్ల బోధనాపటిమ నన్ను ప్రభావితుడిని చేశాయి. శ్రీ వంగల కృష్ణదత్త శర్మ గారి సాహచర్యంలో సాహిత్యంలో కొత్త లోకాలు చూశాను. ఆయనతో కలిసి 'నన్నయ కళా సమితి' స్థాపించాం. 'బాలభారతి' నిర్వహించాం. గొప్ప సాహిత్య విమర్శకులైన ఉయ్యూరు హైస్కూల్‌లో మా సహ సైన్స్ ఉపాధ్యాయుడు స్వర్గీయ టి.ఎల్. కాంతారావుతో పరిచయం ఆధునిక కవిత్వంపై ఆసక్తి కలిగించింది. హైస్కూల్‌లో ఎన్నో కవి సమ్మేళనాలు నిర్వహించాం. 'వేమన త్రిశత

జయంతి'ని జరిపి డా.జి.వి. కృష్ణారావు గారిని ఆహ్వానించి ప్రసంగం ఏర్పాటు చేసి సత్కరించాం. సైన్స్ లాబరేటరి మాకు సాహితీ క్షేత్రంగానూ ఉపయోగ పడింది. మా గురువులు స్వర్గీయ శ్రీ లంకా బసవాచారి గారు 1987లో స్థాపించిన 'సాహితీ మండలి'కి వ్యవస్థాపక సభ్యునిగా, కన్వీనర్‌గా ఎన్నో వైవిధ్య భరిత కార్యక్రమాలు నిర్వహించి ఎందరెందరో ప్రముఖులను ఆహ్వానించి ప్రసంగాలు చేయించి, మా తలిదండ్రుల పేరిట స్మారక పురస్కారాలు వారందరి అందజేశాం. ఇదంతా నాన్న గారి ఆశీస్సులలే అని భావిస్తాను. కృష్ణా జిల్లా రచయితల సంఘంలో కార్య వర్గ సభ్యుడుగా ఉన్నాను.

**సరస భారతి**

2009 నవంబర్ లో 'సరసభారతి' సాహిత్య సాంస్కృతిక సంస్థను స్థాపించి వ్యవస్థాపక అధ్యక్షునిగా ఉన్నాను. మా తలిదండ్రుల పేరిట స్మారక పురస్కారాలను ప్రసిద్ధ కవి పండితులకు ప్రతిభ గల విద్యార్ధులకు అందజేస్తున్నాను. 2010 సంవత్సరం మా తండ్రి గారి 110వ జయంతి సందర్భంగా వారు రచించిన కొన్ని రచనలను కూర్చి 'జ్యోతిస్సంశ్లేషణం' పేరిట తొలి గ్రంథాన్ని ముద్రించి మా తలి దండ్రులకు అంకితమిచ్చాను. ఇది ఎలా ఉందంటే శంకర భగవత్పాదులు 'శివానంద లహరి'లో ఈశ్వరునితో 'స్వామీ !సముద్రంలోని జలాన్ని సముద్రునికి, చంద్ర కాంతామణి జలాన్ని చంద్రునికి అర్ఘ్యం ఇచ్చినట్లుగా నువ్వు ఇచ్చిన వాక్కులను నీకే అంకితమిస్తున్నాను' అన్నట్లు మానాన్న గారి రచనలను వారికే అంకితమిచ్చాను. ఈ సాహిత్య కృషికి నా శ్రీమతి శ్రీమతి ప్రభావతి, కుమారులు చి.మృత్యుంజయ శాస్త్రి, లక్ష్మీనరసింహశర్మ, నాగ గోపాలకృష్ణమూర్తి, వెంకట రమణ, కుమార్తె శ్రీమతి కోమలి విజయలక్ష్మి దంపతులు చక్కని సహాయ సహకారాలు అందిస్తున్నారు. ఇప్పటికి సరసభారతి 22 పుస్తకాలను ముద్రించింది. 100 సమావేశాలు నిర్వహించింది. సరసభారతి బ్లాగ్‌ను, శ్రీ సువర్చలాన్జనేయస్వామి బ్లాగ్‌ను నిర్వహిస్తున్నాను. ఈ రెండిటికి కలిపి నాలుగున్నర లక్షల మంది వీక్షకులున్నారని సవినయంగా తెలుపుకొంటున్నాను.

**గీర్వాణం -2 అంకితం**

'గీర్వాణ కవుల కవితా గీర్వాణం' అనే ఈ 22వ బృహత్ గ్రంథాన్ని మా తలిదండ్రులైన స్వర్గీయ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, స్వర్గీయ శ్రీమతి భవానమ్మ దంపతులకు సవినయంగా అంకితమిచ్చి నా జన్మ చరితార్ధం చేసుకొంటున్నాను. ఇది నా 14వ రచన. సంస్కృత మంత్రాలకు ప్రామాణికమైన అర్ధం చెప్పటంలో నాన్నగారి ప్రతిభ చాలా ప్రసిద్ధం. మాకు వేసవి సెలవులలో కాళిదాస విరచిత కుమార సంభవం, మేఘ సందేశం నాన్నగారు బోధించేవారు. సంత వేయించి వల్లింప జేసేవారు. నిత్యం

రామకోటి వ్రాసి భగవద్గీత పఠించేవారు. ఉభయ సంధ్యలలో సంధ్యావందనం చేసేవారు. వేద సభలకు వచ్చే వేద పండితులను, కూచిపూడి నాట్యాచార్యులకు వారి వారి అర్హతలను బేరీజు వేసి సత్కరించేవారు. కనుక ఈ గ్రంథాన్ని అంకితమివ్వటం సముచితమని భావిస్తున్నాను.

**గ్రంథ ముద్రణకు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి సౌజన్య సహకారాలు**

నాపై శ్రీ గోపాలకృష్ణ గారికి అమితమైన ఆత్మీయత ఉంది. ఎన్నో అమూల్యమైన గ్రంథాలు నేను చదవాలని భావించి, కొని, పోస్ట్ లో పంపుతూనే ఉన్నారు. నా పుట్టిన రోజు పండుగనాడు, గీర్వాణం ఆవిష్కరణ రోజున వారు అందజేసిన బహుమానాలు 'అమూల్య'మైనవి. నేనెప్పుడూ ఋణం తీర్చుకోలేనివి. వారి అవ్యాజాను రాగానికి కృతజ్ఞతలు. దైవ భక్తీ, పెద్దల యెడ గౌరవం, సనాతన ధర్మంపై అభిమానం, ఆచరణలో శుద్ధ మనస్కత, సర్వ జనుల సౌభాగ్య చింతనాశీలి, 'దైవ చిత్తం' గ్రంథానికి స్పాన్సర్‌గా తానే ఉండాలి అని ముందుకొచ్చిన శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి అంకితమివ్వటం సముచితం అని భావించి, సరసభారతికి వారిపై ఉన్న గౌరవాదరణలకు నిదర్శనంగా వారికి మనస్ఫూర్తిగా అంకితమిచ్చాను.

గీర్వాణ కవుల కవితా గీర్వాణం మొదటి భాగాన్ని శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి అంకితమిచ్చిన సంగతి, దాని ముద్రణకు అమెరికాలోని వారి మేనకోడళ్ళు శ్రీమతి జ్యోతి, శ్రీమతి సంధ్య, మేనల్లుళ్ళు శ్రీ సుధాకర్, శ్రీ రమేష్‌లు ప్రాయోజకులు (స్పాన్సర్స్)గా ఉన్న సంగతి మీకు తెలిసిందే. గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండవ భాగంను అంతర్జాలంలో రాయటం మొదలు పెట్టిన దగ్గర్నుంచి దీని ముద్రణకు తామే ప్రాయోజకులుగా (స్పాన్సర్ )గా ఉంటామని ముందుగానే తెలియజేసి, ఈ గ్రంథాన్ని మా తలిదండ్రులకే అంకితం ఇవ్వటం అన్ని విధాలా సముచితంగా ఉంటుందని సూచించి, హితవు చెప్పి, నన్ను ఒప్పించిన సరసభారతికి ఆత్యంత ఆప్తులు, ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి (అమెరికా) దంపతుల సహృదయతకు, సౌజన్యానికి, సరస భారతిపై వారికున్న ఆదరాభిమానాలకు, వారిస్తున్న ప్రోత్సాహక ప్రోద్బలాలకు కృతజ్ఞతలు. ఇలా గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండుభాగాలు వెలువడడంలో శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి ఉన్న గణనీయమైన పాత్ర అనిర్వచనీయమని సవినయంగా తెలుపు కొంటున్నాను.

**- గబ్బిట దుర్గాప్రసాద్**



## గ్రంథ ప్రాయోజకులు

సౌజన్యశీలి, సహృదయులు ఆత్మీయులు

## శ్రీ మైనేని గోపాలకృష్ణ

**జననం - విద్యాభ్యాసం**

శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు కృష్ణాజిల్లా ఉయ్యూరుకు సమీపంలోని కుమ్మమూరు గ్రామంలో శ్రీ మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ దంపతులకు 10-1-1935న ఆరవ సంతానంగా జన్మించారు. వీరి అన్నగార్లు స్వర్గీయ సూర్యనారాయణ, స్వర్గీయ తాతయ్య అనే రాజశేఖర్, అక్కయ్యలు శ్రీమతి అన్నపూర్ణాదేవి, స్వర్గీయ శ్రీమతి కనక దుర్గాదేవి, శ్రీమతి భారతీదేవి. చెల్లెళ్ళు శ్రీమతి హేమలతా దేవి, శ్రీమతి సత్యవాణి. బాల్యంలోనే పిల్లల చదువుకోసం తండ్రిగారు కుటుంబాన్ని ఉయ్యూరుకు మార్చారు. ప్రాధమిక విద్యను గోపాలకృష్ణ గారు కీ.శే. కోట సూర్యనారాయణ శాస్త్రి గారి వద్ద నేర్చారు. కోటమాస్టారు అంటే మైనేని వారికి అమితమైన గౌరవం భక్తి. వారి పేరు చెబితే పులకించి పోతారు. 1950 వరకు తాడంకి స్కూల్‌లోచదివి ఎస్. ఎస్. ఎల్.సి. పాసై, తరువాత విజయవాడ ఎస్.ఆర్.ఆర్.కాలేజిలో ఇంటర్ చదివి 1954లో ఉత్తీర్ణులయ్యారు. కొంతకాలం నాటకాలు, సోషలిస్ట్ పార్టీ సభలతో కాలేజీకి దుమ్మా కొట్టారు. బెజవాడ హోటల్ వర్కర్స్ యూనియన్‌తో చేరి, వర్కర్ల జీవన పరిస్థితులను మెరుగు పరచటానికి వారిని యాజమాన్యం గౌరవంగా చూడటానికి కృషి చేశారు.

**ఉన్నత విద్య - వివాహం - మొదటిసారి అమెరికా ప్రయాణం**

1953-54లో ఉయ్యూరులో డ్రమాటిక్ అసోసియేషన్ స్థాపించి ఆత్రేయ గారి యెన్.జి.వో నాటికను ప్రాక్టీస్ చేశారు. 1955-58 కాలంలో విశాఖ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ మెయిన్ సబ్జెక్ట్‌గా ఎడ్యుకేషనల్, సోషల్ అండ్ చైల్డ్ సైకాలజీ మైనర్ సబ్జెక్ట్‌లుగా తీసుకొని చదివి 1959లో ఏం.ఎ.సెకండ్ క్లాస్‌లో పాసైనారు. 1960లో గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా నల్లూరు గ్రామవాసి కీ.శే. పరుచూరి భావ నారాయణ చౌదరి, శ్రీమతి రత్నమాణిక్యమ్మ దంపతుల కుమార్తె శ్రీమతి సత్యవతిని వివాహం చేసుకొన్నారు. 1960-61లో అమెరికా వెళ్లి మిన్నియా పోలీస్‌లోని మిన్నెసోటా యూనివర్సిటిలో ఎడ్యుకేషన్ సైకాలజీ, స్టాటిస్టిక్స్‌లో కొంత కోర్సు వర్క్ చేశారు. గోపాలకృష్ణ గారు 1961-62లో మాడిసన్‌లోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో ఇండియన్ స్టడీస్‌కు అనుబంధంగా ఉన్న తెలుగు గ్రంథాలను కేటలాగ్ చేయటానికి సహాయ పడుతూ, కొన్ని లైబ్రరీ కోర్సులు పూర్తి చేశారు. 1962లో ఇండియా తిరిగి వచ్చి కొంతకాలం చిరు ఉద్యోగాలు చేస్తూ, కొంతకాలం నిరుద్యోగిగా ఉంటూ, కొంతకాలం ఉయ్యూరు కే.సి.పిలో అతి చిన్న ఉద్యోగం చేసి, స్థిరమైన రాబడి లేక కుటుంబాన్ని పోషించలేక ఇబ్బంది పడుతూ మంచి రోజుల కోసం ఎదురు చూస్తూ 1968వరకు ఆరేళ్ళు గడిపారు.

**తలపు తట్టిన అదృష్టం లైబ్రరీ సైన్స్ కోర్స్ -ఉద్యోగం**

అదృష్టం తలుపు తట్టగా 1969లో అమెరికా వెళ్లి టెన్నేసిలో లైబ్రరీ సైన్స్‌లో ఎం.ఎస్.చేసి, అందరి ఆదరాభిమానాలు పొంది డిగ్రీ తీసుకొని సంతృప్తి చెందారు. సుమారు ఏడేళ్ళు పడిన మానసిక వేదనకు, శారీరక శ్రమకు విముక్తి కలిగింది. కోర్సులో ఉండగానే కెంటకీలోని లూవిల్ యూనివర్సిటిలో కేటలాగర్ అండ్ ఇన్ స్ట్రక్టర్ ఇన్ లైబ్రరీ సైన్స్‌కు ఎంపికై, పదవీ బాధ్యతలు చేబట్టారు. అమెరికన్ లైబ్రరి ఆఫ్ కాంగ్రెస్, న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరి, ఇతర విశ్వ విద్యాలయాల లైబ్రరీలను సందర్శించారు. మెషీన్ రీడబుల్ కేట లాగింగ్‌కు ఇన్ హౌస్ ట్రెయినింగ్ ఇచ్చారు. ఆంగ్లో అమెరికన్ కేటలాగింగ్ రూల్స్‌పై వర్క్ షాప్ నిర్వహించారు. ఆబ్ స్ట్రాక్ట్ ఆఫ్ అకడేమిక్ ప్లాన్ అండ్ బిల్డింగ్ ప్రోగ్రాంకు సహకరించారు. లాంగ్ రేంజ్ బడ్జెట్, పర్సనల్ అండ్ రిసోర్సెస్ ప్రొజెక్షన్‌కు సహాయకుడిగా సేవలందించారు. యూనివర్సిటి ఆఫ్ లూయీ విల్ లైబ్రరి సిస్టంకు టెక్నికల్ సిస్టం అందించటంలో ప్రముఖ పాత్ర పోషించారు. మైనేనిగారి బాస్

ప్రోత్సాహంతో కేటలాగింగ్ కన్సల్టంట్‌గా 1974నుంచి 76 వరకు రెండేళ్ళు యునైటెడ్ స్టేట్స్ డిపార్ట్ మెంట్ ఆఫ్ డిఫెన్స్ ఫోర్ట్ నాక్స్ లైబ్రరీ, నేషనల్ ఆర్కైవ్స్, సన్స్ ఆఫ్ అమెరికన్ రివల్యూషన్ లో 1976-78 వరకు సలహాదారుగా, కెంటకీలోని లూయీ విల్‌లో ఉన్న లైబ్రరీ ఆఫ్ వరల్డ్ ఫెయిత్ సెంటర్‌లో 1980-82 వరకు ఎంతో సంతృప్తిగా సేవలందించారు. తనపై బాస్ కున్న నమ్మకానికి ఎంతో కృతజ్ఞత చూపిస్తారు శ్రీ గోపాలకృష్ణ. పై ఉద్యోగులచేత ప్రశంసలు, సహోద్యోగుల చేత ఆత్మీయ మిత్రులుగా అభినందనలు పొందారు. 1997లో అసోసియేట్ ప్రొఫెసర్ అండ్ స్పెషల్ అసిస్టంట్ టు యూనివర్సిటి లైబ్రేరియన్‌గా పదవీ విరమణ చేశారు.

## కుటుంబం

మొదటి నుండి సత్యం ధర్మం న్యాయంలపై మక్కువ ఉన్న గోపాలకృష్ణగారు కెంటకీ సదరన్ బాప్టిస్ట్ దియలాజికల్ సెమినరి, ముర్రె స్టేట్ యూనివర్సిటీలలో హిందూధర్మంపై ప్రసంగాలు చేశారు. లూయీవిల్ యూనివర్సిటిలో రెలిజియన్ స్టడీ డిపార్ట్‌మెంట్ ఆహ్వానంపై బౌద్ధధర్మంపై దార్మికోపన్యాసమిచ్చి అందరి మన్ననలు అందుకొన్నారు. అతిధులను గౌరవంగా ఆదరించటం. బాధితులకు సానుభూతి సహవేదనలను చూపటం మైనేని వారికి తలిదండ్రుల నుండి సంక్రమించిన గొప్ప సుగుణం. గోపాలకృష్ణ దంపతులకు ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు శ్రీ కృష్ణ, కోడలు శ్రీమతి రమ. మనుమరాళ్ళు చి॥ శ్రేయ, సెరీన. చిన్న కుమారుడు శ్రీ రవి, కోడలు శ్రీమతి కవిత. మనుమడు చి॥ కిరణ్. మనుమరాళ్ళు చి॥ రియా, కరీనా. మన సాంప్రదాయం ప్రకారం వివాహాలు చేసుకొని సంతానం పొంది, అమెరికాలోనే తాము ఎంచుకొన్న వృత్తిలో రాణిస్తూ, తలిదండ్రులను కనిపెడుతూ ఆదర్శంగా ఉంటూ సంతోష పెడుతున్నారు. గోపాలకృష్ణగారు భార్య శ్రీమతి సత్యవతి గారితో అనుకూల దాంపత్యం వలన సుఖ సౌఖ్య ఆనందమయ జీవితాన్ని గడుపుతున్నారు.

## ఉయ్యూరుపై అభిమానం – వితరణ

అమెరికాలో ఉన్నా గోపాలకృష్ణ గారికి ఉయ్యూరుపై అభిమాన, మమకారాలు ఏ మాత్రమూ తగ్గలేదు. ఇక్కడి విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకొంటూనే ఉంటారు. దక్షిణ భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా ఏర్పడిన ఉయ్యూరు ఏ .సి .లైబ్రరీకి వారి తలిదండ్రులు కీ.శే. మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ గార్ల పేరు మీద

5లక్షల రూపాయలు భూరి విరాళం ఇచ్చి మరో లక్ష రూపాయల విలువైన రిఫరెన్స్ గ్రంథాలను బహూకరించి, లైబ్రరీ ప్రారంభోత్సవ సభకు మరో లక్ష రూపాలు ఖర్చు చేసి ఘనంగా నిర్వహించారు. మచిలీపట్నం కృష్ణా విశ్వవిద్యాలయానికి ఇరవై వేల రూపాయలు, భగవద్గీతలో రాణిస్తున్న చి॥ మాదిరాజు బిందు దత్తశ్రీకి ఉన్నత విద్యాభ్యాసం కోసం 15 వేల రూపాయలు, ఉయ్యూరులోని హిందూ స్మశానవాటిక (స్వర్గ పురి)ని ఆధునీకరిస్తూ అభివృద్ధి చేస్తున్న ఉయ్యూరు రోటరీ క్లబ్ వారికి 25 వేల రూపాయలు సరస భారతి ద్వారా అందజేయించారు.

## పెద్దల యెడ గౌరవం

పెద్దలను ఎలా గౌరవించి సత్కరించాలో గోపాలకృష్ణ గారిని చూసి మనం నేర్చుకోవాలి. ప్రపంచ ప్రసిద్ధ ఆర్ధికవేత్త ఉయ్యూరు వాసి, ప్రస్తుతం అమెరికా నివాసి శ్రీ ఆరిగపూడి ప్రేమ్‌చంద్ గారిని ఉయ్యూరు రప్పించి, ఖర్చు అంతా భరించి వారికి మాతో ఘనసన్మానం చేయించి ఆనందించారు. బౌద్ధ ధర్మ ప్రచారకులు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి గారికీ ఇలాగే గొప్ప సత్కారం చేయించారు. బాపు రమణలు అంటే గోపాలకృష్ణ గారికి అమితమైన ఆరాధనాభావం. వారిద్దరితో మంచి పరిచయం ఉన్నవారు. ఉత్తర ప్రత్యుత్తరాలు, ఫోన్ సంభాషణ జరిపేవారు. రమణ, బాపుల మరణం తర్వాత బాపు-రమణల స్మారక నగదు పురస్కారాన్ని మొట్టమొదటిసారిగా ఏర్పాటు చేసి ప్రముఖ కథకులు శ్రీ వేదగిరి రాంబాబుకు అయిదు వేలు, ప్రఖ్యాత చిత్రకారులు కవి శ్రీ శీలా వీర్రాజు గారికి 10వేల రూపాయలు సరస భారతి ద్వారా అందజేశారు. ప్రముఖ కథకులు శ్రీ కాళీ పట్నం రామారావు గారు నిర్వహిస్తున్న 'కథా నిలయం'కు 15 వేల రూపాయలు, ప్రఖ్యాత ఆధ్యాత్మిక గురువులు, సాహిత్య సాంస్కృతిక ధార్మిక కార్యక్రమ నిర్వాహకులు స్వర్గీయ సద్గురు శివానందమూర్తి గారి 'సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్'కు 11,116 రూపాయలు అందజేసిన సంస్కారి. 'ఇండియన్ పికాసో' అని పిలువబడే అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన గుడివాడ వాసి అమెరికాలో స్థిరపడిన నైరూప్య చిత్రకారులు పద్మశ్రీ ఎస్.వి.రామారావు గారికి సరసభారతి, స్థానిక శ్రీనివాస విద్యా సంస్థలు ఆధ్వర్యంలో 1-9-16న ఆ కాలేజి సెమినార్ హాల్ లో ఎం.ఎల్.సి. శ్రీ వై.వి.బి.రాజేంద్ర ప్రసాద్ చేతుల మీదుగా ఘన సన్మానం చేయించి, శ్రీ రామారావు గారికి 11,116 రూపాయలు నగదును కానుకగా అందింపజేసిన కళాప్రియులు శ్రీ గోపాలకృష్ణ గారు. ఇవన్నీ వారు అమెరికాలో ఉంటూ సరసభారతి చేత చేయించిన

సత్కారాలు, సత్కార్యాలు.

తన జీవితానికి మార్గదర్శి స్నేహితులు, ఆత్మీయులు అయిన శ్రీ కోగంటి సుబ్బారావు గారికి 11-1-2015న సభూతోగా సరసభారతి చేత సన్మానం చేయించి ఆ కుటుంబంలోని వారందరికీ నూతన వస్త్రాలను కొనిపించి, అందజేయించి నేను రాసిన 'దర్శనీయ దైవ క్షేత్రాలు' గ్రంథాన్ని శ్రీ సుబ్బారావు గారికి అంకితమిప్పించి, జన్మ ధన్యమైందని కృతజ్ఞతలు తెలిపి, దీన్ని లైవ్ టెలికాస్ట్ చేయించి చూసి పరవశించిన మహోన్నతులు మైనేని గారు. ఈ కార్యక్రమానికి మొత్తం ఖర్చు తానే భరించిన సజ్జన హృదయులు శ్రీ గోపాలకృష్ణ గారు.

70 ఏళ్ళ క్రితం ప్రాథమిక విద్య నేర్పిన గురుదేవులు కీ.శే. కోట సూర్యనారాయణ శాస్త్రి గారిని మర్చిపోక, వారి కుమారుల చిరునామాలు సేకరించి ఫోన్‌లో మాట్లాడి 5-9-15 ఉపాధ్యాయ దినోత్సవం రోజున వారందరినీ సకుటుంబంగా ఆహ్వానించి గురువుగారి చిత్రపటాన్ని ప్రముఖ ఆర్టిస్ట్ టి.వి.ఎస్.బి.శాస్త్రి (ఆనంద్) చిత్రింపజేసి, శాసన మండలి సభ్యులు శ్రీ వై వి బి రాజేంద్ర ప్రసాద్‌తో ఆవిష్కరింపజేసి, ప్రముఖ సంగీత విద్వాంసులు శ్రీమతి సింగరాజు కల్యాణి, శ్రీమతి కాళీపట్నం ఉమా గార్లచే సంగీత కచేరీ జరిపించి గురుపూజోత్సవంగా సరసభారతి చేత ఘనంగా నిర్వహింపజేయించి, వారందరికీ నూత్న వస్త్రాలు అందజేయించి కార్యక్రమాన్ని ప్రత్యక్ష ప్రసారం చేయించి అమెరికాలో చూసి తన్మయం చెంది తన జన్మ చరితార్థమైం నదని సంతృప్తి చెందిన ఆదర్శ వ్యక్తి శ్రీ గోపాలకృష్ణ గారు. తమ ప్రియ తమ గురువులు స్వర్గీయ కోట సూర్యనారాయణ శాస్త్రి గారి స్మారక నగదు పురస్కారాన్ని ఏర్పాటుచేసి ఇద్దరు అతి పేద ప్రతిభగల హైస్కూల్ విద్యార్థికి, విద్యార్థినికి ఒక్కొక్కరికి 10వేల రూపాయల 2014, 2015, సంవత్సరాలలో అందజేసిన వితరణ శీలి శ్రీ గోపాలకృష్ణగారు. 3-9-16న శ్రీ కోట గురువరేణ్యుల గురుపూజోత్సవాన్ని సరసభారతి, స్థానిక ఉయ్యూరు పబ్లిక్ స్కూల్ సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహింపజేసి గురు పుత్రులకు, ఉపాధ్యాయులకు సన్మానాలు చేయించి పేద ప్రతిభ గల విద్యార్థినికి విద్యార్థికి 10 వేల రూపాయలు ఒక్కొక్కరికి అందజేయించిన వదాన్యులు. 2015, 2016లలో జరిగిన ఈ గురుపూజోత్సవాలలో ప్రేరణ పొందిన మా గురుపుత్రులు శ్రీ కోట సోదరులు శ్రీ కోట చంద్ర శేఖర శాస్త్రి, శ్రీ సీతారామాంజనేయులు, శ్రీ గాయత్రి ప్రసాద్ గార్లు ఇంటర్ చదువుతున్న పేదరికం ప్రతిభ ఉన్న విద్యార్థినికి తమ తలిదండ్రుల పేరిట స్మారక నగదు బహుమతి 10 వేల రూపాయలు తమ చేతుల మీదుగా ఈ రెండు సంవత్సరాలు అందజేసి, ఇక ముందు కూడా ఇస్తామని తెలియ జేసి మాతా, పితరుల

యెడ తమకు గల అనన్య భక్తిని చాటి, విద్యకు ప్రోత్సాహం కలిగించారు. అంతటి ప్రేరణ శ్రీ మైనేని గారు కల్గించారు.

**సరసభారతికి ఆత్మీయులు**

సరసభారతికి పరమ ఆత్మీయులు శ్రీ గోపాలకృష్ణ గారు. తాను స్పాన్సర్‌గా ఉండి, నా రచనలు, సరసభారతి ప్రచురణలు అయిన 'సిద్ధ యోగి పుంగవులు', 'మహిళా మాణిక్యాలు', 'పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు', 'దర్శనీయ దైవ క్షేత్రాలు', గ్రంథాలను వరుసగా తమ తల్లిగారు కీ.శే. మైనేని సౌభాగ్యమ్మ గారికి, తమ ప్రియతమ అర్ధాంగి శ్రీమతి మైనేని సత్యవతి గారికి, తమ బావ గారు డా. శ్రీ రాచకొండ నరసింహశర్మ–ఎం.డి.గారికి, తనకు మార్గదర్శి, మెంటార్ అయిన కోగంటి సుబ్బారావు గారికి అంకిత మిప్పించి వారిపై తన కున్న గౌరవ ఆత్మీయ అనురాగాలను, కృతజ్ఞతను చాటుకొన్న ఉదార హృదయులు మైనేని వారు. అందుకనే వారికి తెలియకుండా, చెప్పకుండా 'గీర్వాణ కవుల కవితా గీర్వాణం–1 మొదటి భాగం' అనే బృహత్ గ్రంథాన్ని శ్రీ గోపాలకృష్ణ గారికి ఆన్‌లైన్ అంకితమిచ్చి నా ఋణం తీర్చుకొన్నాను. ఈ పుస్తకాన్ని వారి మేనకోడళ్ళు మేనల్లుళ్ళు స్పాన్సర్ చేసి సరసభారతి చేత ముద్రింపజేసి తమ ప్రియతమ 'కృష్ణ మామ' ఆదరాన్ని, ఆశీస్సులను అందుకొన్నారు.

నాపై శ్రీ గోపాలకృష్ణ గారికి అమితమైన ఆత్మీయత ఉంది. ఎన్నో అమూల్యమైన గ్రంథాలు నేను చదవాలని భావించి, కొని, పోస్ట్‌లో పంపుతూనే ఉన్నారు. నా పుట్టిన రోజు పండుగనాడు, గీర్వాణం ఆవిష్కరణ రోజున వారు అందజేసిన బహుమానాలు 'అమూల్య'మైనవి..నేనెప్పుడూ ఋణం తీర్చుకోలేనివి. వారి అవ్యాజాను రాగానికి కృతజ్ఞతలు. దైవ భక్తి, పెద్దల యెడ గౌరవం, సనాతన ధర్మం పై అభిమానం ,ఆచరణలో శుద్ధ మనస్కత, సర్వ జనుల సౌభాగ్య చింతనాశీలి, 'దైవ చిత్తం' గ్రంథానికి స్పాన్సర్‌గా తానే ఉండాలి అని ముందుకొచ్చిన శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి అంకిత మివ్వటం సముచితం అని భావించి, సరసభారతికి వారిపై ఉన్న గౌరవాదరణలకు నిదర్శనంగా వారికి మనస్ఫూర్తిగా అంకితమిచ్చాను. ఇప్పుడు గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండవ భాగానికి తామే స్పాన్సర్‌గా ఉంటామని మొదటి నుంచీ చెబుతూ ఈ బృహద్గ్రంథం వెలువడటానికి సౌజన్య సహాయ సహకారాలు అందజేసిన శ్రీ మైనేని గోపాలకృష్ణ శ్రీమతి సత్యవతి దంపతుల ఔదార్యానికి, సరసభారతిపై వారికున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

**– గబ్బిట దుర్గాప్రసాద్**



శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతులు

## మా మాట

**"మా**తృదేవోభవః పితృదేవోభవః ఆచార్యదేవోభవః అతిథిదేవోభవః" వీరంతా దేవుని ప్రతిరూపాలే (తైత్తరీయోపనిషత్) అన్న సంస్కృతి మనది.
శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి సంకలిత "గీర్వాణకవుల కవితా గీర్వాణం-2" వారి కీ.శే.లైన తలిదండ్రు అంకితమివ్వడం, దానికి మేము ప్రయోజకులుగా ఉండడానికి నేను చేసిన సూచన, అభ్యర్ధనకు వారు అంగీకరించడం మా అదృష్టంగా భావిస్తున్నాము.

నేను చదువుకొనే రోజుల్లో మాస్టారు క్లాసు రూంలోకి 'ప్రవేశించేప్పుడు లేచి నిల్చుని నమస్కరిస్తే పిచ్చివానిగా పరిగణించేవారు. సంస్కృతం ప్రత్యేక కోర్సు (ఆప్షనల్ సబ్జెక్టు)గా తీసికొంటే "ఎందుకు,పెళ్లిళ్లు చేయటానికా, తద్దినాలు పెట్టటానికా అని అవహేళన చేసేవారు. కానీ, నేను అమెరికాలో లైబ్రేరియన్‌గా ఉన్నపుడు, నా వద్ద పనిచేసే స్టూడెంట్ అసిస్టెంట్ వారానికి ఒకరోజు 60 మైళ్ళు ప్రయాణం చేసి సంస్కృతం నేర్చుకోవడం విని ఆశ్చర్యపోయా. ఎందుకని నేనడిగితే ఆపిల్ల సమాధానం " I like it". విచిత్రమేమంటే దానివల్ల ఆ అమెరికా అమ్మాయికి ఏవిధమైన ప్రత్యేకమైన లాభం కానీ, స్కాలర్షిప్ గానీ అప్పట్లో లేకపోవటం. సంస్కృత భాషలో ఉన్న మాధుర్య, దానిలో నిగూఢ గుప్తమయిన సంస్కృతీ ఆమెను ఆకర్షించాయి అనేది నిర్వివాదాంశం.

కరదీపికగా నిలచే ఈ సంకలనం, శ్రీ దుర్గాప్రసాద్ గారు ఎంతో ఓర్పు, పట్టుదలలతో శ్రమించి పూర్తి చేశారు. శ్రీ దుర్గాప్రసాద్ గారంటే మాకు, కవి కె.ఆంజనేయ కుమార్ గారి మాటల్లో "ఆశ్చర్యం, అభిమానం, ప్రేమ, మరియూ గౌరవం" కూడా.

ఆఖరున, ఈ కవి సమ్మేళనానికి, బుక్ రిలీజ్‌కు ఏతెంచి పాల్గొన్న పెద్దలందరకూ అనేకానేక వందనములతో శెలవు.

"శుభం భూయాత్. ధర్మో రక్షతి రక్షితః" **– మైనేని గోపాలకృష్ణ, సత్యవతి**

**హంట్స్ విల్ , అలబామా , యూ.ఎస్ .ఏ.**

**అక్టోబర్ 20, 2016.**



# నతి -నుతి

- డా. శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి

### సజ్జన సాంగత్యం

బహు భాషాకోవిదులు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారు, నాకంటే వయసులోనూ, జ్ఞానంలోను పెద్ద వారు. ఏ పూర్వ పుణ్యమో, వారితో పరిచయ భాగ్యాన్ని నాకు కలుగజేసింది. 'సతాంసంగస్సద్భిః కథమివహి పుణ్యేన, భవతి' అన్న భవభూతి వాణి అక్షరాలా నిజమని తెలిసింది. మన భారతదేశం యొక్క గొప్పతనాన్ని చాటి చెప్పేవి సంస్కృతీ, సంస్కృత భాష అని పెద్దలు వివరించారు. అవి వీరికి ప్రాణ నాడులై నిలిచాయి.

### మాతృదేవో పితృదేవో భవ

గొప్ప సంప్రదాయ కుటుంబంలో పుట్టి, ఉత్తములైన తల్లిదండ్రుల సంస్కార సంపద పుణికి పుచ్చుకొన్న శ్రీ దుర్గాప్రసాద్ గారు, వారిని దైవములుగా భావించి, సేవించి, తమ కృషికి ఫలితమైన ఈ గ్రంథాన్నివారికి భక్తితో సమర్పించటం చాలా సంతోషాన్ని కలిగించింది. చక్కని సంప్రదాయాన్ని పాటించి, ఇతరులకు మార్గదర్శకంగా నిలిచారు. వృత్తిరీత్యా సైన్సు, లెక్కలు, ఇంగ్లీషు భాష అభ్యసించి కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా కొంతకాలం, ప్రదానోపాధ్యాయులుగా మరి కొంతకాలం ఉద్యోగ బాధ్యతలు నిర్వహించి, ఉత్తమ ఉపాధ్యాయులుగా కీర్తి గడించి, ఎందరో విద్యార్ధులకు జ్ఞాన దానం చేసిన మనీషి శ్రీ దుర్గాప్రసాద్ గారు.

### సాహిత్యాభిలాష

స్నేహ సంపన్నమైన హృదయం కావటంచేత, బంధువులతో, మిత్రులతో సత్సంబంధాలు కలిగి ఉండి, జీవితాన్ని అన్ని విధాలా, బహు పుష్ప ఫల భరితంగా పండించుకొన్న శ్రీ దుర్గాప్రసాద్ గారు, అమర సాహితీ నందనోద్యాన వనంలో ప్రవేశించి,

ఆ సౌందర్యాన్ని చూసి, పరవశించి, తన ఆనందాన్ని సమకాలీన సమాజానికి అందిస్తూ, భావి తరానికి భద్ర పరచాలనే సంకల్పం తో, ఎంతో శ్రమ కోర్చి, వ్యయ ప్రయాసలను లెక్క చేయక, నిత్యకృషీ వలులై బంగారు పంట పండించారు. అది వారి జీవ సంస్కారము. పూర్వ జన్మ వాసనా వాసితముగా బోధ పడుతుంది.

## భాషా సేవ

ఆ కార్య క్రమంలో ఎందరో పండితులను స్వయంగా కలుసుకొని, వారితో సంభాషించి, వారిలో గల ప్రతిభను గుర్తించి, అభి నందిస్తూ, వారి కావ్య విశేషాలను అక్షరబద్ధం చేశారు. వీరు మరి కొన్ని గ్రంథములను కూడా తెలుగులో రచించి, ప్రచురించి, ఆంధ్ర భాషామ తల్లికి ఎనలేని సేవ చేశారు. ఇతరులు వ్రాసిన కొన్ని గ్రంథములకు వెలుగు చూపించారు.

'సరసభారతి' అనే పేరుతో సాహిత్య సంస్థనొక దానిని స్థాపించి, సభలు, సమావేశాలు, సన్మానాలు నిర్వహిస్తూ, సంగీత సాహిత్యములను సమాదరిస్తున్నారు. సంస్థ పక్షాన ఇతర కవుల గ్రంథములను ప్రచురించి ప్రోత్సహిస్తున్నారు.

సాహిత్య, విజ్ఞాన విశేషముల నెన్నింటినో నిత్యము అంతర్జాలము నందు విద్యుల్లేఖల ద్వారా అందరికి అందజేస్తూ, అభినంద నీయులయ్యారు. ప్రపంచ ఇంగ్లీష్ కవులను, వారి రచనలను కూడా పరిశీలించి, తెలుగు వారికి పరిచయం చేస్తూ గ్రంథములు రచించారు. 77 సంవత్సరములు పైబడిన వయస్సును లెక్క చేయకుండా, నిత్య నూతనమైన ఉత్సాహంతో చక్కని పని చేస్తున్నారు. శ్రమ వారిది, ఫలితం మనందరిది. కాలాన్ని వృథాగా గడుపుతూ, చింతలతో వంతలతో కృంగి, కృశించే వారికి మంచి స్ఫూర్తి నిస్తూ, జగము వర్ధిల్లు వార్తనిస్తున్నారు– ప్రగతి మార్గదర్శనం చేస్తున్నారు.

ఇటువంటి వారిని సత్పురుషులని కీర్తిస్తూ పెద్దలు ఉన్నతవృక్షములతో పోల్చారు. వృక్షములు ఎండలో ఉండి, చెంత చేరిన వారికి నీడనిచ్చి, సేద తీరుస్తాయి. ఫలాలనిచ్చి, తృప్తిని గూర్చి, ఆనందింప జేస్తాయి. ప్రశాంత వాతావరణాన్ని కలిగిస్తాయి. పరోపకారమే ప్రకృతి పరమార్ధము.

శ్లో – 'ఛాయా మన్యస్య కుర్వంతి,తిస్ఠంతి స్వయ మాతపే
ఫలాన్యపి పరార్ధాయ వృక్షాస్సత్పురుషా ఇవ'

వీరికి లభించిన మరో వరం, మనసెరిగి మెలగే భార్యా, బిడ్డలు. అది వారిని విజయపథంలో పయనించటానికి మరింత బలవంతులను చేసింది.

## ఉద్యమ స్ఫూర్తి

కోరిక మాత్రం చేతనే కాక, ప్రయత్నంతోనే కార్యములు ఫలిస్తాయి. అది సింహమే

అయినా ఎప్పుడూ నిద్రపోతూ ఉంటే, ఆకలి ఎలా తీరుతుంది. 'మృగ రాజు' అనే పేరు ఎలా వస్తుంది ?

'ఉద్యమే నహి సిద్ధ్యంతి కార్యాణి, నమనోరథైః
నహి సుప్తస్య సింహస్య ,ముఖే ప్రవిశంతి మృగాః'

సంస్కృత కవుల జీవిత విశేషాలను వివరిస్తూ, కావ్య పరిమళాలను ఆస్వాదించటానికి పూనుకొన్న శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ గారికి ప్రొఫెసర్ గారి సలహా, మైనేని వారి సహాయం లభించాయి. చేతిలో నిఘంటువులు అంతర్జాలం ఉండనే ఉన్నాయి. చక్కని సమన్వయంతో ఇంతటి బృహత్కార్యాన్ని తలపెట్టి సాధించారు. సంస్కృత పరిరక్షణ, సంస్కృత భాషా ప్రచారమే కాని, స్వార్ధ మెరుగని వారు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారు. తమ శక్తి యుక్తులన్నీ లోకహితం కొరకు వెచ్చించారు. ఇతరులకు సాయం చేయటంలో ముందుంటారు.

**గుణ గ్రహణ పారీణత**

కవిలో, కావ్యంలో గుణాన్ని గుర్తించి, ప్రకటించే మంచి లక్షణం శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారికి వెన్నతో పెట్టిన విద్య. సద్విమర్శకునికి ఉండవలసిన ఉత్తమ గుణమది. శివుడు గరళమును కంతము నందు నిలుపుకొని, చంద్ర కళను శిరసున ధరించుట ఇందులకు నిదర్శనము.

శ్లో– "గుణ దోషౌబుధో గృహ్ణన్, ఇందు క్ష్వేడా వివేశ్వరః
శిరసా శ్లాఘ్యతే పూర్వం ,పరం కంఠే నియచ్ఛతి".

**హనుమదుపాసన**

ఇంతటి మహత్కార్యాన్ని అవలీలగా సాధించిన శ్రీ దుర్గాప్రసాద్ గారికి ఉపాస్య దైవమగు శ్రీ హనుమదనుగ్రహం పరిపూర్ణంగా ఉంది. ఇప్పటికి వారు 50పైగా సుందర కాండ పారాయణలు పూర్తి చేసి, స్వామి పాదముల చెంత సమర్పించారు. ఉయ్యూరులో గల శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయం కేంద్రంగా చేసుకొని వారు పారాయణాలు వ్రతములు, హోమములు, ఉత్సవములు నిర్వహిస్తూ, భక్తకోటికి స్ఫూర్తినిస్తూ, ప్రీతిపాత్రులైనారు. దేశ, విదేశాలలో ఉన్న ఆంజనేయ దేవాలయాలను, దర్శనీయ స్థలాలను తెలియజేసి, ప్రజలకు మహోపకారం చేశారు.

**పరోపకారము**

వారి విద్యా, ధన.శక్తి యుక్తులు, జ్ఞానానికి, దానానికి, సంస్కృతి పరి రక్షణకు

వినియోగపడి, లోకంలో శాశ్వతములయ్యాయి.

**గీర్వాణ కవుల కవితా గీర్వాణం**

దేశంలో, విభిన్న కాలాలలో, భిన్న రాష్ట్రాలలో గల సంస్కృత కవులు, వారి రచనలతోబాటు, కవుల జీవిత విశేషాలను కూడా పరిశీలించి ప్రకటించారు. ఆయా కవుల చారిత్రిక నేపధ్యం వివరింపబడి, చరిత్ర గ్రంథంగా కూడా ఇది పరిగణింప దగి ఉన్నది. విశ్వవిద్యాలయం వారు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారికృషికి మెచ్చి, నిర్నిబంధంగా డి.లిట్.(డాక్టర్ ఆఫ్ లిటరేచర్ )పట్టము నిచ్చి గౌరవించ వలసి ఉంటుంది. ముందు ముందు పి.హెచ్.డి.చేసే విద్యార్ధులకు ఈ గ్రంథం పరిశీలింపదగిన 'ఆకర గ్రంధము'గా (రిఫరెన్స్ బుక్) ఉంటుంది. ఈ గ్రంథము ద్వారా నేను ఎన్నో నూతన విషయాలు తెలుసుకోగలిగాను. ఇందులోని ప్రాచీన కవులు, స్వాతంత్ర్యానంతర సంస్కృత కవులు, ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు కూడా ప్రస్తావింపబడ్డారు. ఎందరో మహాను భావులు అందరికి వందనాలు.

శ్రీ దుర్గా ప్రసాద్ గారు ఈ గ్రంథంలో ఉట్టంకించిన 'ఉప శీర్షికలు' సహితం, అన్వర్ధములై, ఆలోచింప జేస్తూ వారి పరిశీలనా దృక్పధమునకు, అభిరుచికి అద్దం పడుతున్నాయి. ఇందులోని విశేషాలను వివరిస్తూ వ్రాయటం మొదలు పెడితే మరొక గ్రంథం అవుతుంది. వారి కృషికి ప్రత్యక్ష సాక్ష్యమీ కరములను అలంకరించిన ఈ సాహిత్య లక్ష్మి అని చెప్పటం అతిశయోక్తి కాదు. సూర్యునకు దివిటీ పట్టటం (దీపం చూపించటం), భక్తి ప్రకటనము మాత్రమే అని విన్నవిస్తూ, వాత్సల్యంతో నాకీ అవకాశాన్ని కల్పించిన బ్ర.వే.గబ్బిట దుర్గా ప్రసాద్ గారికి, సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను. వారి కృషికి జేజేలు పలుకుతున్నాను.

శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ గారిని ఒక వ్యక్తిగా కాక సాహితీ సంస్థగా సంభావిస్తూ, వారి బహుముఖ ప్రజ్ఞా విశేషములను ప్రస్తుతిస్తున్నాను.

**– డా. తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి**

రిటైర్డ్ ప్రిన్సిపాల్, శ్రీ భావనారాయణ సంస్కృత కళాశాల,

పొన్నూరు.



# వందనం అభివందనం

గీర్వాణ కవుల కవితా గీర్వాణం మొదటి భాగం గ్రంథాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత ప్రాచార్యులు డా. శ్రీ ఇప్పగుంట సాయిబాబా గారికి పంపగా, క్షుణ్ణంగా చదివి అభినందిస్తూనే, నేను చేసిన తప్పులను సవివరంగా వ్రాత పూర్వకంగా తెలియజేశారు. ఆ పత్రాలను అందరికి అంతర్జాలం ద్వారా తెలియబర్చాను. అందులో వారు నాకొక గొప్పసూచన చేశారు. శ్రీ ఎం.కృష్ణమాచారియార్ గారు ఆంగ్లంలో రాసిన 'హిస్టరీ ఆఫ్ క్లాసికల్ సాంస్క్రిట్ లిటరేచర్' తెప్పించుకొని చదవమన్నారు. ఈ విషయాన్ని గుర్తించిన నా ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు సుమారు వెయ్యి పేజీలున్న ఆ గ్రంథాన్ని నాకు తెలియకుండానే ఆర్డర్ ఇచ్చి తెప్పించి నాకు పంపారు. అద్భుతం అనిపించింది చదువుతుంటే. దాని ఆధారంగా గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండవ భాగం నెట్‌లో రాయటం ప్రారంభించాను. ఇందులో ఉన్న దాదాపు అందరు కవులను, అన్ని ప్రక్రియలను గురించి రాయగలిగాను. దీనికి శ్రీ సాయిబాబాగారికి శ్రీ మైనేని వారికీ ఎంతైనా రుణపడి ఉంటాను.

మొదటిభాగానికి ముందుమాట రాసిన డా.రామడుగు వెంకటేశ్వర శర్మ గారు కూడా ఇంకా రాయవాసిన కవులు చాలా మంది ఉన్నారని వారిని గూర్చి కూడా రెండవ భాగంలో రాయమని మంచి సలహా ఇస్తూ ఆ కవుల వివరాలు గుంటూరు జిల్లా పొన్నూరు సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ డా.తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు ఇవ్వగలరని వారి ఫోన్ నంబర్ నాకు ఇవ్వగా కిందటి ఏడాది సెప్టెంబర్‌లో వారితో ఫోన్‌లో మాట్లాడి వివరాలు తెలుసుకొన్నాను. వారి వలననే బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారు, వారి తండ్రిగారు శ్రీ వెంకటప్పయ్య శాస్త్రిగారు, శ్రీ తూములూరు వారి బావగారు, శ్రీ రాఘవ నారాయణ శాస్త్రి గారి దౌహిత్రులు అయిన శ్రీచెరువు సత్యనారాయణ శాస్త్రిగారు, శ్రీ కొలచిన యజ్ఞనారాయణ దీక్షితులు గార్ల

గురించి శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు పై వారు రచించిన పుస్తకాలు పంపగా రాయగలిగాను. శాస్త్రి గారి ద్వారానే శ్రీ ముళ్ళపూడి జయ సీతా రామ శాస్త్రి గారిని పరిచయం చేసుకొని సీతారామ శాస్త్రి గారు పంపిన తమవీ, తమ తండ్రి గారు శ్రీ నారాయణ శాస్త్రి గారి గ్రంథాలనాధారంగా వీరిద్దరి సంస్కృత సేవను వివరించాను. అలాగే శ్రీ ములుకుట్ల నరసింహావధాని గారు రచించిన 'రామాయణ సారోద్ధారం' 7 భాగాలు శ్రీ తూములూరు వారు నాకు అందజేయగా అవధాని గారి గూర్చి సవివరంగా రాయగలిగాను.

చీరాల విశ్రాంత లెక్చరర్, సంస్కృత భాషా సేవకులు, ఆత్మ జ్యోతి మాసపత్రిక సంపాదకులు శ్రీ రావి మోహన రావు గారినీ శ్రీ తూములూరు వారు పరిచయం చేయగా, వారు పంపిన వాటి ఆధారం గా శ్రీ చింతగుంట సుబ్బారావు గారి గురించి రాశాను. శ్రీ మోహనరావు గారి ద్వారాశ్రీ గరిమెళ్ళ సోమయాజులుగారు పరిచయమవ్వగా వారు పంపిన రచనల ఆధారంగా శ్రీ గరిమెళ్ళ వారి గూర్చి రాశాను. గుంటూరు జిల్లా జిల్లెళ్ళమూడి అమ్మ సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గారితో ఉన్న పూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని వారి ద్వారా జిల్లెళ్లమూడి సంస్కృత కళాశాల విశ్రాంత ప్రిన్సిపాల్ డా.శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ గారి ఫోన్ నంబర్ తెలుసుకొని, హైదరాబాద్‌లో వారి స్వగృహంలో కలిసి ఇంటర్వ్యూ చేసి, వారు అందజేసిన తమ రచనల నాధారంగా శర్మ గారి గీర్వాణ కృషిని పరిచయం చేయగలిగాను.

ఆచార్య సార్వభౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు వారంతకు వారే నాగురించి తెలుసుకొని వారి గ్రంథాలను పంపగా వారి గూర్చి రాసే భాగ్యం దక్కింది. ఈ రెండవ భాగం తీగ కదలటానికి ముఖ్య కారకులు, నాపై అమితమైన ప్రేమ ఆదరణ కురిపిస్తూ, అభినందిస్తూ "ప్రసాద్ గారూ! సంస్కృతం చదువుకొన్న మేమెవ్వరం చేయలేని మహత్కార్యాన్ని మీరు చేస్తున్నారు. మిమ్మల్ని చూసి నాకు గర్వం గా ఉంది" అని ఎప్పటికప్పుడు ఫోన్‌లో దీని ప్రగతిని తెలుసుకొంటూ నన్ను ఎంతగానో ప్రోత్సహించిన శ్రీ తూములూరు వారి సౌజన్యానికి ఎంతో రుణపడి ఉంటాను.

శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ గారి పరిచయంలో మరో గొప్ప ముందడుగు పడింది. వారు ఆచార్య శ్రీ బిరుదరాజు రామరాజు గారు ఆంగ్లంలో రాసిన 'కంట్రి బ్యూషన్ ఆఫ్ ఆంధ్ర టు సాంస్క్రిట్ లిటరేచర్' గ్రంథం చదివారా అంటే, లేదని చెప్పాను. ఎక్కడైనా దొరుకుతుందేమో నెట్‌లో వెతకమని శ్రీ మైనేని వారిని కోరటం వారు వెంటనే దాన్ని ఆర్డర్ ఇచ్చి స్వర్గీయ సద్గురు శ్రీ శివానందమూర్తి గారి

గారి కుమారులు శ్రీ బసవరాజు గారితో ఫోన్‌లో మాట్లాడగా తమ వద్ద ఉన్నదని చెప్పి కొరియర్‌లో 700 పేజీలున్న దానిని భద్రంగా ఉచితంగా పంపి అందజేశారు. దీన్ని ఆధారంగా ఆంధ్రదేశంలోని సంస్కృత కవులను, వారి రచనలను చదివి రాయగలిగాను. పుస్తకం ఇంగ్లీష్‌లో ఉండటం, కవుల రచనలను సంస్కృత లిపిలోనే శ్రీ రాజు గారు ఇవ్వటం వలన అర్ధం చేసుకొని రాయటం కష్టమనిపించినా ఇష్టంగా చేస్తున్నందుకు మహా తృప్తినిచ్చింది. అదే సమయంలో శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి 'సంస్కృత వాఙ్మయ చరిత్ర' దృష్టిలోపడి శ్రీ గోపాలకృష్ణ గారిని వాకబు చేయమని కోరటం, వెంటనే వారు రెండుభాగాలుగా ఉన్న ఆ ఉద్గ్రంథానికి ఆర్డరిచ్చి తెప్పించి నాకు పంపటం యిట్టె జరిగి పోయింది. గ్రంథం బృహత్తరమైనదే కాని, ఒకరిద్దరు కవుల గురించి తప్ప, ఇది నాకు పెద్దగా ఉపయోగ పడలేదనే చెప్పాలి.

ఇంకెవరు మిగిలారా అని ఆలోచిస్తుంటే శ్రీ తూములూరు వారిచ్చిన సూచనతో శతావధాని డా.పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ గారిని వారితో నాకున్న పూర్వ పరిచయంతో కోరగా 2008లో విజయవాడ మేరీస్ స్టెల్లా కాలేజిలో సంస్కృత భాషపై జరిగిన సెమినార్ సందర్భంగాఆంధ్ర ప్రదేశ్ లో "భారత స్వాతంత్ర్యానంతర సంస్కృత కవులు ,రచన"లపై వెలువరించిన 'సంహూతిః' (సామూహిక పిలుపు) అనే సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లాలలో రచనలున్న గ్రంథాన్ని ఆత్మీయంగా పంపారు. ఇందులో ఆంధ్రప్రదేశ్‌లో జిల్లాల వారీగా ఉన్న సంస్కృత కవులు వారి రచనా విశేషాలను ఆయా జిల్లాలో ప్రముఖులైన సంస్కృత కవులు రాసిన వ్యాసాలున్నాయి. కాని కవుల గురించి సమగ్రమైన సమాచారం ఇందులో లేదు. అదే ఆధారంగా రాశాను. దీని సాయంతో అందులోని కవుల కవితా గీర్వాణాన్ని రాసి దాదాపు సమగ్రంగా రాశానేమోననే భ్రమ కలిగింది.

రెండవ భాగం ప్రారంభించి నెట్‌లో రాస్తున్న దగ్గర్నుంచి శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారు మదిలో మెదులుతూనే ఉన్నాను. వారిని ప్రత్యక్షంగా చూసిన వాడిని, వారి విద్వత్తు ఎరిగిన వాడిని కనుక వారి గురించి ఎక్కడైనా ఏదైనా లభిస్తుందేమోనని ఎదురు చూశాను. ఫలితం దక్కలేదు. చివరికి శ్రీ తూములూరు వారు ఇచ్చిన ఫోన్ నంబర్ ప్రకారం బెజవాడలో ఉన్న శాస్త్రి గారి కుమారులు డా. శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారికి ఫోన్ చేయగా పరమానందం పొంది శ్రీ మాణిక్య శాస్త్రి గారికి ఢిల్లీ లో రాష్ట్రపతి పురస్కారం అందజేసినప్పుడు వెలువడిన ప్రత్యేక సంస్కృత సావనీర్‌ను పంపారు. దానిలో శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు తమ తండ్రిగారు శ్రీ మాణిక్య శాస్త్రి గారిపై

హిందీలో రచించిన వ్యాసం ఆధారంగా కష్టపడి చదివి అర్ధం చేసుకొని శ్రీ మాణిక్య శాస్త్రిగారి పాండితీ ప్రకర్షను వివరించ గలిగాను.

స్వర్గీయ శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి గురువరేణ్యుల గురుపూజోత్సవానికి 3-9-16 న ఉయ్యూరు వచ్చిన మా గురుపుత్రులు శ్రీ కోట సీతా రామాంజనేయులు గారు నాకు కానుకగా అందజేసిన ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామ చంద్రుడు గారి రచన 'జగద్వంద్యుడైన గురుదేవుడు' గ్రంథం ఆధారంగా శృంగేరి జగద్గురువులు శ్రీ శ్రీ భారతీ తీర్ధ స్వామి వారి జీవితం, సంస్కృత రచన గురించి రాయగలిగాను. సాహిత్య అకాడెమీ ప్రచురించిన శ్రీ శశిశ్రీ రచన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్య పుస్తకం ఆధారంగా సరస్వతీ పుత్రుల గీర్వాణ కవితా ప్రతిభను రాయగలిగాను. మా ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి కోరికపైనా, వారు నెట్ ద్వారా పంపిన వాటి ఆధారంగా శ్రీ కున్హన్ రాజా, డా శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రిగార్ల గురించి రాశాను. అలాగే ఉస్మానియా యూనివర్సిటీ సంస్కృత ప్రొఫెసర్ శ్రీ బూరగడ్డ నరసింహాచార్యగారు మైనేని గారి ప్రోత్సాహంతో ఫోన్ ద్వారా పరిచయం అవ్వగా వారు పంపిన బయోడేటా ఆధారంగా శ్రీ ఆచార్యుల వారి గురించి రాయగలిగాను.

శ్రీ ఏ.సి.పి శాస్త్రి గారి పరిచయంతో డా. కొరిడే రాజన్న శాస్త్రి గారి సంస్కృతాంధ్ర పాండిత్య ప్రకీర్ష అర్ధమై వారి ద్వారా రాజన్న శాస్త్రిగారి కుమారులు, ధర్మపురి శ్రీ లక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల సంస్కృత అధ్యాపకులు డా. కొరిడే విశ్వనాధ శర్మగారి పరిచయ భాగ్యం కలిగి వారు పంపిన తమ తండ్రిగారి వ్యాస సంకలనం 'మంజూష' ఆధారంగా శ్రీ రాజన్న శాస్త్రి గారి గీర్వాణ సేవను విస్తృతంగా రాయగలిగాను. శ్రీ శాస్త్రి, శ్రీ శర్మ గార్లకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

భారతదేశానికి చుట్టు ప్రక్కల ఉన్న సింహళం, నేపాల్‌లలో ఉన్న సంస్కృత కవుల గురించి రాయగలిగాను. మనదేశంలో వివిధ రాష్ట్రాల కవుల గురించి, ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలో జిల్లాల వారీగా ఉన్న కవుల గురించి వారి సాహిత్యం గూర్చికొద్దో గొప్పో రాసే అవకాశం లభించింది. కావ్యం నాటకం, నవల, వ్యాసం, సంగీతం, నాట్యం, వాస్తు, జ్యోతిషం, కామశాస్త్రం, రాజకీయం, దేశ చరిత్ర, రాజ వంశ చరిత్ర, భక్తీ, శతక సాహిత్యం, నిఘంటువులు, అలంకార, ఛందస్ శాస్త్రాలు, హిందూ బౌద్ధ జైన మతాలు దర్శనాలు, ద్వ్యర్ధి, త్ర్యర్ధి, చతురర్ధ, అనేకార్ధ, కావ్యాలు, చాటువు, స్తుతి స్తోత్ర, అవధానాలు మొదలైన అన్ని ప్రక్రియలు రాసిన వారందరి గురించి రాయటం నా అదృష్టం.

ప్రతి కవిపైనా పుస్తకాలలో ఉన్న విషయాలే కాక అదనపు సమాచారం దొరుకు

తుందేమోనని ఇంగ్లీష్, తెలుగు వీకీపీడియా వెతికి అందిన సమాచారం నిక్షిప్తం చేశా. ఇందరు మహానుభావులు ఇన్నిరకాలుగా నాకు సహకరించటం వలన గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2 రెండవ భాగం పూర్తి చేయగలిగాను. నాకు సంస్కృత, తెలుగు భాషలలో లోతైన పాండిత్యమూ లేదు, అవగాహనా లేదు. తెలిసిన విషయాలను మాత్రమే రాశాను. ప్రముఖ కవి శ్రీ శివారెడ్డి చెప్పినట్లు 'నేను తేనే టీగ లాగా ఎక్కడ మధువు లభిస్తే దాన్ని సేకరించి భద్ర పరచాను 'అంతే'. ఇంకా ఎందరో మహా కవులు మిగిలే ఉంటారు. వారందరికీ వందనాలు. అందుకే ఇది సంపూర్ణమూమూ కాదు, సమగ్రమూ కాదు అని సవినయంగా మనవి చేస్తున్నాను. సంస్కృత భాషపై ఉన్న మమకారం, మా తండ్రి గారిచ్చిన సంస్కారమే నన్నుమొదటి భాగంలో 146 మంది, రెండవ భాగంలో 482 మొత్తం 628 మంది గీర్వాణ కవులపై రెండుభాగాల ఈ ఉద్గ్రంథాన్ని రచింపజేసింది. ఇందరు కవులను, వారి గురు, శిష్య పరంపరను గురించి రాసే గొప్ప అదృష్టం నాకు దక్కిందని పరమ సంతృప్తిగా ఉంది. వీరందరినీ కూడా లెక్కిస్తే దాదాపు 700మంది కవీశ్వరులు లెక్కకు తేలుతారు. "Dates are the greatest obstacle in the history of India" అన్న జర్మనీ పండితుడు మాక్స్ ముల్లర్ మాట నిజం. మన ప్రాచీన కవుల కాలాలు నిర్దుష్టంగా లేక పోవటం పెద్ద ఇబ్బందే. తెలిసిన వారి కాలాలను గుర్తించాను. కొన్ని ఊహించి పేర్కొన్నాను. ఇందులో లోపాలు ఉండవచ్చు. కాలాల లోతు పాతులు తెలుసుకొనే చారిత్రిక పాండిత్యమూ నాకు లేదు. అటు కృష్ణమాచారి గారికీ, ఇటు బిరుద రాజు వారికీ అందని కవుల కాలాలను చూసి వీరిని 'కాలం తెలియని కవులు'గా పేర్కొన్నాను. పుస్తకం చదివించేట్లుగా ఉండాలని, ఈతరం విద్యార్ధులకు అందుబాటులో ఆసక్తికరంగా ఉండాలని తపన పడ్డాను. ఎంత వరకు సఫలీ క్రుతుడనయ్యానో తెలియదు.

ఈ గ్రంథ రచనకు మా ఇలవేలుపు శ్రీ సువర్చలాంజనేయ స్వామి వారల ఆశీస్సు, శ్రీ శారదా దేవి కరుణా కటాక్షం, పెద్దల ప్రోత్సాహం, సాహితీ బంధువుల ఆదరణ కారణం. నేను నిమిత్త మాత్రుడిని. ఇందులో నేను చేసింది తలస్పర్శ మాత్రమే.

ఇంతటి బృహద్గ్రంథానికి సమీక్ష లాంటి ముందుమాట ఎవరితో రాయించాలా అని ఆలోచిస్తే, దీని ప్రేరణకు కారకులు అనేక కవుల గ్రంథాలను నాకు ఆప్యాయంగా పంపినవారూ సంస్కృత ఆంధ్ర ఆంగ్లాలలో నిష్ణాతులైన కవి, పండితులు, పొన్నూరు సంస్కృత కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పని చేసి రిటైర్ అయిన, నా శ్రేయోభిలాషి మార్గదర్శి, డా. శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు మనసులో మెదిలి, వారిని ఫోన్‌లో సంప్రదిస్తే రాస్తానని నాకు వెంటనే ఫోన్‌లో చెప్పారు. వారి సౌజన్యానికి కృతజ్ఞతలు.

అతి తక్కువ సమయంలోనే విపులమైన, విలువైన ముందుమాట ''నతి-నుతి ' రాసి, గ్రంథం స్థాయి పెంచిన శ్రీ తూములూరు వారికి ఏమిచ్చి ఋణం తీర్చుకోగలను ఒక్క నమస్కారం చేయటం తప్ప.

నా మీదా, సరసభారతిపైనా ఉన్నవిపరీతమైన ఆత్మీయతాను రాగాలున్న మా శ్రేయోభిలాషులు, ప్రాయోజకులు శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతులు తమ అమూల్యమైన అభిప్రాయాన్ని 'మా మాట'గా రాసినందుకు కృతజ్ఞతలు.

ఎప్పటిలాగే అర్ధవంతమైన ముఖచిత్రం డిజైన్ చేసిన శ్రీ కళాసాగర్ గారికి, ఇంతటి పెద్ద రచనకు డి.టి.పి. చేసి, అందంగా ముద్రింపజేసి అందించిన రమ్యభారతి సంపాదకులు, ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ చలపాక ప్రకాష్ గారి తోడ్పాటు మరువలేనిది. నా వెంట నాతో పదం, పాదం కలుపుతూ నడుస్తున్న సరసభారతి కార్యవర్గ సభ్యులకు, సాహితీ బంధువులకు, అభిమానులకు, ఈ గీర్వాణ సాహితీ యజ్ఞానికి తోడ్పాటు అందించిన వారందరికీ వందనం, అభివందనం.

గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2 రెండవ భాగం 4-12-2016 ఆదివారం స్థానిక రోటరీ క్లబ్ వారితో కలిసి నిర్వహిస్తున్న సరసభారతి 100 సమావేశంలో ముఖ్యఅతిధి శాసనసభ ఉప సభాపతి మాన్యశ్రీ మండలి బుద్ధ ప్రసాద్ గారు ఆవిష్కరించటం, పూరీలోని శ్రీ జగన్నాథ్ సంస్కృత విశ్వవిద్యాలయ న్యాయ శాఖ అసోసియేట్ ప్రొఫెసర్ శ్రీ గబ్బిట జయ మంగళ శాస్త్రి గారు విశిష్ట అతిధిగా, విజయవాడ మేరీస్ స్టెల్లా కళాశాల సంస్కృత ప్రొఫెసర్ శ్రీ ధూళి పాళ రామ కృష్ణ గౌరవ అతిధులుగా, శాసనమండలి సభ్యులు శ్రీ వై.వి.బి. రాజేంద్ర ప్రసాద్, కె.సి.పి. సి ఓ.ఓ. శ్రీ జి.వెంకటేశ్వరరావు గార్లు మాన్య అతిదులుగా, అమృతం ఫేం ఆంకర్ ఝాన్సి, ప్రముఖ హాస్యనటులు అమృతం ఫేం శ్రీ గుండు హనుమంతరావు, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి.వి. పూర్ణచంద్, రమ్యభారతి సంపాదకులు శ్రీ చలపాక ప్రకాష్ ఆత్మీయ అతిధులుగా, సరసభారతి గౌరవాధ్యక్షులు మరియు రోటరీక్లబ్ ఆఫ్ ఉయ్యూరు అధ్యక్షులు శ్రీమతి జ్యోశ్యులాదేవి వంటి పెద్దలు పాల్గొనటం సరసభారతి అదృష్టం. ఈ సందర్భంగా 'గీర్వాణ భాషా వైభవం' (సంస్కృత సంస్కృతి)పై సరసభారతి నిర్వహించిన 'పద్య కవి సమ్మేళనం'లో పాల్గొన్న ప్రముఖ కవులకు నిర్వహించిన విజయవాడ లయోలా కాలేజి తెలుగు శాఖాధ్యక్షులు డా గుమ్మా సాంబశివరావు గారికి సవినయంగా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము.

**- గబ్బిట దుర్గా ప్రసాద్**

## గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 రెండవ భాగం రచనకు ఉపయుక్తమైన గ్రంథాలు

1) హిస్టరీ ఆఫ్ క్లాసికల్ సాంస్క్రిట్ లిటరేచర్ - శ్రీ ఎం .కృష్ణమాచారియార్

2) కాంట్రి బ్యూషన్ ఆఫ్ ఆంధ్రా టు సాంస్క్రిట్ లిటరేచర్ - డా. శ్రీ బిరుద రాజు రామ రాజు

3) సంహూతిః (అందరూ కలిసి ఇచ్చిన పిలుపు)ః -ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యానంతరంగత 60 ఏళ్ళలో సంస్కృత సాహిత్య రచనపై యు జి .సి ఆధ్వర్యంలో విజయవాడ మేరీస్ స్టెల్లా కాలేజిలో సంస్కృత శాఖాధిపతి డా. ధూళిపాళ రామకృష్ణ గారి ఆధ్వర్యంలో రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం వైస్ చాన్సెలర్ ప్రొఫెసర్ హరే కృష్ణ శతపది, శ్రీ వెంకటేశ్వర వేదిక్ యూనివర్సిటి వాస్ ఛాన్సెలర్ శ్రీ సన్నిధానం సుదర్శన శర్మ, మద్రాస్ యూనివర్సిటి వైష్ణవిజం ప్రొఫెసర్ శ్రీ నరసింహాచార్యులు, రాజస్థాన్ సంస్కృత యూనివర్సిటి వైస్ ఛాన్సెలర్ శ్రీ వి.రామ కృష్ణమాచార్యులు వంటి ఉద్దండుల సమక్షంలో, 2008 ఆగస్ట్ 11, 12 తేదీలలో జరిగిన సదస్సులో పత్ర సమర్పకుల రచనల కదంబం.

4) సంస్కృత వాఙ్మయ చరిత్ర - రెండు భాగాలు - శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి.

5) వరూధినీ ప్రవరం, తత్వమసి, కల్యాణం (నాటిక) శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

6) లింగోద్భవ వృత్త మాలికా స్తుతి , గజేంద్ర మోక్షం, ఉమాకల్యాణం, రాజవాహన విజయకావ్యం - శ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రి

7) డా. చెరువు సత్యనారాయణ శాస్త్రి సమగ్ర సంస్కృత శతావధానం - శ్రీ నోరి భోగేశ్వర శర్మ విశ్లేషణ

8) శ్రీ శైల సారోద్ధారం - శ్రీతాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి

9) మత్స్యప్నః - శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి

10) పుత్ర సంజీవనం - శ్రీ ముళ్ళపూడి నారాయణ శాస్త్రి

11) హర్శనైషధ, దర్శన పరామర్శ - డా. శ్రీ ముళ్ళపూడి జయ సీతా రామ శాస్త్రి

12) మానస పూజ, వర్షోత్సవ కీర్తనలు - శ్రీ కొలచిన యజ్ఞ నారాయణ సోమయాజి

13) జగద్వంద్యులైన జగద్గురువులు - ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామ చంద్రుడు

14) పుట్టపర్తి నారాయణాచార్య - శ్రీ శశిశ్రీ

15) శ్రీ సువర్చలాంజనేయం - శ్రీ గురజాడ పూర్ణ చంద్ర శర్మ

16) గుప్త పాశుపతం, అమృత శర్మిష్ట - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
17) పావక ప్రభ, శృంగార లహరి, అంబికా కరావలంబ స్తోత్రం - డా.శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ
18) బ్రహ్మశ్రీ కాశీ భట్ట బ్రహ్మయ్య - శ్రీ జటావల్లభుల పురుషోత్తం
19) పైడి చూపు - శ్రీ మాడభూషి నరసింహాచార్యుల గారి పల్లవీ పల్లవోల్లాసం (జాంబవతి చరిత్ర) రచనకు 'పైడి చూపు' అనే ముందుమాట రాసిన శ్రీ ఉన్నం జ్యోతి వాసు
20) శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారికి రాష్ట్ర పతి పురస్కారం లభించిన సందర్భంగా పై వెలువడిన 'సంస్కృత విద్యా' ప్రత్యేక సంచిక - అందులో శ్రీ డా. మద్దులపల్లి దక్షిణామూర్తి శాస్త్రి గారు తండ్రి గారిపై హిందీలో రాసిన వ్యాసం.
21) రామాయణ సారోద్ధారం -7 భాగాలు- శ్రీ ములుకుట్ల నరసింహావధాని
22) మంజూష - డా కొరిడే రాజన్న శాస్త్రి శాస్త్రి గారి ఆధ్యాత్మిక సాహిత్య వ్యాస సంకలనంలో ఆచార్య బిరుదరాజు రామ రాజు గారు రాజన్న శాస్త్రి గారిపై వ్రాసిన 'పస్ప శము' వ్యాసం, శ్రీ కొరిడే విశ్వనాథ శర్మగారి 'మా నాన్న గారు' వ్యాసం .

## సరస భారతి ప్రచురణకు విరాళాలు అందజేసిన వదాన్యులకు కృతజ్ఞతలు

1) శ్రీ వేలూరి రామకృష్ణ, శ్రీమతి వేదవల్లి దంపతులు- గరివిడి- రూ. 2,501/-

2) శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, శ్రీమతి సమత దంపతులు - హైదరాబాద్ - రూ. 1,116/-

3) శ్రీ పువ్వుల నరసింహా రావు, శ్రీమతి కరుణానిధి దంపతులు - ఉయ్యూరు- రూ. 1,116/-

4) శ్రీ టి.వి.ఎస్.బి.శాస్త్రి (ఆనంద్), శ్రీమతి రుక్మిణి దంపతులు - హైదరాబాద్ - రూ. 500/-

# విషయ సూచిక

**గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2**

**కాలం తెలియని కవులు**

# గీర్వాణకవుల కవితా గీర్వాణం రెండవ భాగం



## 1.సంప్రదాయ ఆయుర్వేద సృష్టికర్త-
## ధన్వంతరి ఆచార్యుడు (క్రీ.పూ)

**స**ంప్రదాయ ఆయుర్వేదాన్ని మొదటగా సుశ్రుతుడు మొదలైన శిష్యులకు ధన్వంతరి బోధించాడు. మన దేహం పంచ భూత అంశాలతో నిర్మితమైనదని, దేహంలోని ఈ మూలకాల మధ్య సమతౌల్యం కాపాడటమే ఆయుర్వృద్ధికి కీలకం అని ఆయుర్వేదం చెబుతోంది. వ్యాధి లక్షణాలను క్రోడీకరించి వర్ణించి, ఓషధుల వివరాలను తెల్పి, మానసిక చింతనను కూడా జోడించి తనదైన శైలిలో సశాస్త్రీయ సంప్రదాయ వైద్యాన్ని వృద్ధి పరచాడు. ఇదే 'ఆయుర్వేదం' పేరుతో చలామణి అయింది. ధన్వంతరి 'ఆయుర్వేద సృష్టి కర్త' అయ్యాడు. సూర్యుడికి ఉన్న పదహారు మంది శిష్యులలో ధన్వంతరి కూడా ఒకడని అంటారు. క్షీర సాగర మధనంలో పుట్టిన వారిలో ధన్వంతరి కూడా ఒకడని నమ్ముతారు.

ధన్వంతరి రూపకల్పన చేసిన సంప్రదాయ వైద్యంలో ఎనిమిది భాగాలున్నాయి.

1. కాయ చికిత్స - ఇది శరీర భాగాలన్నిటికి చేసే సంపూర్ణ చికిత్స. కడుపులోకి

తీసుకొనేవాటిగురించి తెలియజేస్తుంది.

2. బాల చికిత్స – శిశు రోగాలకు సంబంధించిన అనేక విషయాలు, చికిత్సా విధానాలు తెలియజేస్తుంది. బాలారిష్టాలకు సున్నిత చికిత్స ఇందులో ఉంది.

3. గ్రహ చికిత్స – మానసిక వైద్యానికి సంబంధించిన అనేక విషయాలను చర్చిస్తుంది. మనో విశ్లేషణ చేసి మనస్తత్వాలను బేరీజు వేసి చికిత్స చేసే విధానం వివరించారు.

4. శల్యాక తంత్ర – శరీరంలో వివిధ భాగాలకు సంబంధించిన రోగాలను గురించి చెబుతుంది. కన్ను, ముక్కు, చెవి మొదలైన వాటి రోగాల నివారణ తెలియజేస్తుంది.

5. శల్య తంత్ర – చిన్నా, పెద్ద శస్త్ర చికిత్సల వివరాలున్నాయి. ఏ సూత్రాలు పాటించాలో వివరాలూ ఉన్నాయి.

6. విష తంత్ర – అశ్వినీ కుమారుడు రాసిన విష శాస్త్రంలోని విషయాలు క్రోడీకరించి ఇందులో చెప్పాడు. ప్రకృతిలో లభించే విషాలు, అందులో లాభం కలిగించేవి నష్టం కలిగించేవి తెలిపాడు. ఆధునిక 'టాక్సీ కాలజి' ఇది ఎంతో ఉపయోగించింది.

7. రసాయన తంత్ర – వన మూలికలతో రూపొందించిన రసాయనాలను ఏయే వ్యాధులకు చికిత్స చేయ వచ్చో చెప్పుతుంది.

8. వాజీ కారణం – నపుంసక లక్షణాన్ని పోగొట్టటానికి, పుంసత్వాన్ని పెంపొందించటానికి చికిత్సా వివరాలున్నాయి. ఇదే ఆధునిక వైద్య శాస్త్రానికి మూలాధారం అయింది.

ఇలా ఎనిమిది రకాల విధానంతో సమగ్ర వైద్య శాస్త్రాన్ని రూపొందించాడు ధన్వంతరి ఆచార్య. నేటి అనాటమీ, ఎంబ్రియాలజి, ఫిజియాలజీ, పాథాలజి, పాథో జేనేసిస్, ఫార్మకాలజీ మొదలైన అనేక వైద్య విభాగాలకు బీజం వేసిన వాడు ధన్వంతరి. అంటే ఏదో కేవలం ఆయన్ను వైద్య శాస్త్ర పితామహుడు అని గుడి కట్టి పూజించటం కాదు ఇన్ని విభాగాలలో నిష్ణాతుడు, రూపశిల్పి అని లోకానికి చాటి చెప్పాల్సిన బాధ్యత మనందరిది.❁

## 2. ఆల్వారుల దివ్య ప్రబంధాలు (క్రీ.పూ. 3075)

**త**మిళదేశంలో 12 మంది ప్రసిద్ధులైన మునులను ఆల్వారులు అంటారు. గరుడ వాహన పండితుడు తన దివ్య సుచరిత్రలో అనంతాచాన్య తన ప్రపన్నామృతంలో ఆల్వారుల దివ్య చరిత్రను రాసారు. వీరి జీవిత కాలాలను ఆధునికులు అంగీకరించటం లేదు. వారి కథనం ప్రకారం కొందరు ఆళ్వారులు ద్వాపర యుగంలో కొందరు కలియుగంలో జన్మించారు. కులశేఖర ఆల్వార్ మొదటివాడు. క్రీ.పూ 3075కు చెందినవాడు. ద్రుదావర్తుని కుమారుడు. అతని ముకుందమాల గొప్ప ఆధ్యాత్మిక సోత్రం.

వీరిలో నమ్మాళ్వార్ లేక శఠగోప యతీన్ద్రుడు లేక వకుళాభరణుగా ప్రసిద్ధుడు. తిరుక్కుల్‌లో క్రీ.పూ. 3059లో జన్మించాడు. అసలు పేరు మారన్. కొద్దికాలం తపస్సు చేసాక ఆత్మజ్ఞానం కలిగి నాలాయిరం అనే తమిళ ప్రబంధం రాసాడు. దీనిని సంస్కృతంలో పురుకేశ గాధానుకరణగా రామానుజాచార్య అనువదించాడు. యమునాచార్యులు అని పిలవబడే ఆలవందార్ శ్రీరంగంలో మహా పండితుడు. ఈశ్వరభట్ట రంగనాయకిల కుమారుడు. మహా భక్తుడైన నాదముని మనమడు. చతుస్శ్లోకి, స్తోత్రరత్న, శ్రీస్తుతి అనే గొప్ప మాధుర్యవంతమైన కావ్యాలు రాసాడు. ఈయన కాలం క్రీ.శ. 950–1040.❁



## 3. యోగశాస్త్ర రచయిత - పతంజలి మహర్షి (క్రీ.పూ.1300)

**సు**ఖం, సంతోషం, ఆనందం మన జీవితానికి ఆలంబన. శరీరానికి లభించే సంతృప్తిని 'సుఖం' అంటాము. మానసిక సంతృప్తియే సంతోషం. ఈ రెండిటికి సంతృప్తి కలిగించేది ఆత్మనందం. ఇది ఉత్తమమైనది. దీన్ని సాధించటానికి ఉపయోగ పడేదే 'యోగ'.

యోగ అంటే సంపూర్ణ స్థాయిలో ఆధ్యాత్మిక పరిభాషకు చెందింది యోగ. మనసు వేరు ఆత్మ వేరు. ఆత్మకు సంబంధించిన అన్వేషణ మార్గం ఆధ్యాత్మిక చింతన, ఆధ్యాత్మిక సాధకులను ''యోగులు ''అంటారు.

యోగికి భౌతిక, మానసిక అవస్థల మీద సాధికారత లభిస్తుంది. మేధావులు, జ్ఞానులు కంటే యోగిని ఉన్నతుడుగా భావిస్తారు. ఆధ్యాత్మికవేత్త యోగి ఒక్కడే. మన ప్రాచీన రుషి పుంగవులు అందించిన యోగ విద్యను 'పతంజలి మహర్షి' అభివృద్ధి చేసి సామాన్య జనానికి అందుబాటులోకి తెచ్చారు. యోగ సాధన వల్ల మన శరీరంలోని.. నిరోటోనిన్ 'ధాతువు' వృద్ధిచెంది మెదడులోని 'న్యూరో ట్రాన్స్ మిషన్'ను క్రమ బద్దీకరణ చేస్తుంది అని ఆధునిక వైద్య శాస్త్రవేత్తలు కూడా ధ్రువీకరించారు. శరీరంలో సమ తుల్యత సాధిస్తుందని చెప్పారు.

ఈ రోజు ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల్లో విస్తృత స్థాయిలో శిక్షణనిస్తున్నారు. జీవశక్తికి మూల భూతమైన ఆధ్యాత్మిక వైభవానికి ప్రతీక పతంజలి యోగ. అధర్వ వేదంలో యోగాభ్యాస సూత్రాలున్నాయి. వీటిని శాస్త్రీయంగా,

సమర్ధవంతంగా విశ్లేషించిన ఘనత పతంజలి మహర్షిదే. పతంజలి, ఆశ్వలాయన మహర్షితో కలిసి క్రీ.పూ. 1300లోనే ధ్రువ నక్షత్రాన్ని గుర్తించి ఖగోళ శాస్త్ర అభివృద్ధికి తోడ్పడ్డాడు. క్రీ.పూ. 184లో మగధను ఏలిన పుష్య మిత్ర కాలం వారే పతంజలి, ఆశ్వ లాయనులు. పుష్య మిత్ర చేసిన 'ఆశ్వ మేధయాగం'కు పతంజలి సాక్షీ భూతుడు పతంజలిని ఆదిశేషుని అవతారంగా భావిస్తారు.

పతంజలి బీహార్ రాష్ట్రం పాట్నాకు దగ్గరలోని గోవర్ధన నగరంలో జన్మించాడు. పుష్యమిత్రుని ఆస్థాన శాస్త్రవేత్తగా, వ్యాకరణ పండితుడుగా పతంజలి వ్యవహరించాడు. రాజ్యపాలనకు సహకరించాడు. పాణిని వ్యాకరణ సూత్రాలను సరళీకరణం చేసి 'చూర్నిక' పేరుతో భాష్యం రాశాడు. అందుకే పతంజలిని 'చూర్నికా కారుడు' అంటారు. పాణిని, కాత్యాయనుల తర్వాత వ్యాకరణ శాస్త్రంలో చివరి వాడు పతంజలి. 'యోగేన చిత్తస్య పదేన వాచాం మలం శరీరస్య చ వైద్య కేన

యో పాఠ కోత్తమ పవరం మునీనాం పతన్జలిం ప్రాంజలి రానతో' అంటే మనస్సు, వాక్కు, శరీరాలను మూడింటిని స్పటికంలాగా తేటగా శుద్ధిగా పోషించుకోవాలని అర్ధం. పతంజలి యోగ శాస్త్రాన్ని, వైద్య శాస్త్రాన్ని, శబ్దశాస్త్రాన్ని క్రోడీకరించాడు. వీటిలో యోగ శాస్త్రానికే ప్రామాణికత లభించింది. ప్రపంచమంతా వ్యాపించింది. ఆయన యోగ సూత్రాలు గొప్ప కీర్తి సాధించాయి.

జగత్తుకు మూలం ప్రకృతి శక్తి మాత్రమేనని, ధ్యాన యోగాన్ని ఆశ్రయించి అంతర్ముఖాన్ని పొంది ఆంతరంగిక ప్రకృతిని ఏకం చేసిన వారే ప్రకృతిలో మమేకం అవుతారని పతంజలి చెప్పాడు. మన శరీరంలో ఉన్న నాడీ స్థానాలే చక్ర స్థానాలు.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే ఎనిమిది రకాల యోగా భ్యాసాల ద్వారా మనిషి ప్రకృతి శక్తి ఏమిటో తెలుసుకోవచ్చునని పతంజలి చెప్పాడు.

పతంజలి యోగం ఆధారంగా అనేక గ్రంథాలు వచ్చాయి. యోగా చారి.కే.ఎస్.అయ్యంగార్ ఇందులో ప్రధములు. డెబ్బై రెండేళ్ళు ఈయన యోగాలో

గడిపారు 'లైట్ ఆన్ యోగా ', 'లైట్ ఆన్ లైఫ్' రచించారు ఇందులో మొదటిది పది హేడు భాషల్లోకి అనువాదం పొందింది.

యోగ శాస్త్రం మీద మొట్ట మొదటి సూత్ర గ్రంథాన్ని రాసినవాడు పతంజలి. 'ప్రాణం' సర్వ వ్యాప్త చైతన్యంగా నిరూపిస్తూ, స్పందనా శక్తిని పెంచే యోగ సూత్రాలను ప్రపంచానికి అందించిన పతంజలి మహర్షి యావత్ మానవాళికీ ఆరాధ్యుడు.

కాత్యాయని తర్వాత పతంజలి వచ్చాడు. ఆయన రాసిన మహాభాష్యంలో అనేక శ్లోకాలను పేర్కొన్నాడు. టి.ల్.హార్న్ అనే పరిశోధకుడు వీటిని కృత్రిమ కవిత్వం అన్నాడు. అందులోని వృత్తాలు మాలతీ, మిత్రాక్షర ప్రహర్షిణి, వసంత తిలకకు చెందినవి అన్నాడు. ఇది పతంజలి అంటే ముకిళిత హస్తాలతో పడినవాడు అని అర్థం. ఎవరిని విజలల ముకిళిత హస్తాలతో శక్తిస్తారో ఆయనే పతంజలి అని మరో అర్థమూ వుంది. తమిళనాడు తిరుచికి 30 కి.మీలో వున్న బ్రమ్మపురి దేవాలయలంలో ఆయన విగ్రహం వుంది. పతంజలి స్పోటవేదాన్ని చెప్పాడు. దీనినే ఫోన్‌మక్స్ అంటారు. ❁



## 4. కణాదుడు (క్రీ పూ .800)

ప్రపంచంలో ప్రతి పదార్ధం సూక్ష్మ కణాల మయం అని రెండు వేల ఎనిమిది వందల క్రితమే చెప్పిన భారతీయ శాస్త్రవేత్త కణాదుడు. ఈతని తర్వాతే డెమాక్రటీస్ అనే గ్రీకు శాస్త్రవేత్త ప్రతి వస్తువు సూక్ష్మకణ సముదాయం అని అంతకంటే చిన్న కణాలుగా విభజించటం కుదరదని చెప్పాడు. వీటినే అణువులు అన్నాడు గ్రీకు లో ఆటోమాస్ అంటే విభజించటానికి వీలుకానిది అని అర్థం. అణువులున్నాయని నిరూపించ లేక పోయాడు.

కఠోపనిషత్తులో ప్రపంచ పరిణామానికి జడ పదార్ధమే కారణం అని ఉంది. దీనినే ప్రధాన అవ్యక్త తత్వానికి ఆధారంగా తీసుకొని మన వాళ్ళు వేరే మార్గంలో పయనించారు కపిల, కణాదుల భౌతిక సిద్ధాంతం తర్వాత బౌద్ధం వచ్చింది. తర్వాత జైనమతం హేతువాదంతో వృద్ధి చెందింది. బౌద్ధ, జైన శాస్త్రవేత్తలు కణాన కపిలులనే ఆధారంగా తీసుకొన్నారు. దేమోక్రాతిస్‌కు ముందే కణాదుడు జన్మించాడు. వైశేషిక దర్శనంలో 'అన్విక విశిష్టత' ఉంది. వైషేశికంలో ఆధునిక శాస్త్రవేత్త 'ఔలూక్యుడు'. ఈనాడు మనం చెప్పే శాస్త్రవేత్త, పరిశోధకుడు అనే పేర్లు ఆయనకే సరిపోతాయి ఆయనే కణాదుడు. దేమోక్రాటిస్‌కు నాలుగు వందల ఏళ్ళ క్రితమే కణాదుడు పుట్టాడు.

'ఆధునిక అణు వైశేషిక సిద్ధాంతం' నూతన అధ్యాయానికి దారి తీసింది.

'అణు భక్షకుడు' అని కణాదుడు పేరు పొందాడు. కణాదుడు అంటే కణాలు తినే వాడని అర్ధం. 'అణుస్' అనే సంస్కృత్సపదమే ఆటం అయింది ఇంగ్లీషులో. సూదులను అయస్కాంతం ఆకర్షించటం, మొక్కలలో జల ప్రసరణ జడం అనేది ఈథర్ లేక అయస్కాంతంలో ప్రసారం చేయటానికి ఆధారమవటం, అన్ని రకాల వేడికి సూర్యుడు, అగ్నియే కారణం, భూమి అణువులలో ఉండే ఆకర్షణ శక్తియే గురుత్వాకర్షణకు కారణం అన్ని శక్తులకు ఉండే చలన స్వభావానికి మూల కారణం శక్తి వ్యయం లేక తిరిగి తిరిగి చలనం కోన సాగటం అణు విచ్చేదం ద్వారా విశ్వ ప్రళయం, ఉష్ణ, కాంతి కిరణాలు అతి సూక్ష్మ కణాలుగా ప్రసరించటం వల్లనే కణాలు అనూహ్య వేగంతో అన్ని వైపులకు దూసుకు పోతాయి (విశ్వ కిరానా సిద్ధాంతం), దేశ కాలాల సాపేక్షత మొదలైన వాటిని కణాదుడు స్పష్టంగా చెప్పాడు.

ఒకే గుణం కలిగిన అణువుల కలయిక వస్తువు ఉత్పత్తికి కారణం అవుతుంది ఈ కలయిక రెండు రకాలుగా జరుగుతుంది. అణువుల్లో అంతర్భాగంగా ఉన్న సహజ భౌతిక శక్తి, బహిర్గతమైన మానవాతీత శక్తి అన్నాడు కణాదుడు. ప్రపంచ సృష్టికి అణువులే కారణం. అణువులు గుండ్రగా ఉంటాయి. అణువులు ఒకదానినుంచి ఒకటి వేరైనప్పుడు కాని, కదలిక లేనప్పుడు కాని ఏ పనీ జరుగదు అన్నాడు. అగోచర శక్తి వల్ల అణువులు కలిసి కణాలుగా మారి ప్రపంచ సృష్టికి కారణ మౌతాయి. కణాలు ఏర్పడటానికి అందులోని అణువులే కారణం. అణువులు ఎప్పుడూ చేతనా స్థితిలో ఉంటాయని కణాదుడు ఊహించ లేకపోయాడు. డిమొక్రటిస్ సిద్ధాంతాల కంటే కణన సిద్ధాంతాలు భౌతిక వాదాన్ని బాగా బల పరుస్తాయి.

'పరిమితి గల పదార్ధం అనంతకోటి వస్తువులకు పదార్ధం కాజాలదు' అన్న వైశేషికం మాదిరిగా సాంఖ్యం అన్ని వస్తువులకు మూల పదార్ధం అణువు అనే నిర్ధారించింది.

కణాదునికి ఔలూఖ్య, కాశ్యప అనే పేర్లున్నాయి. క్రీ.పూ.ఆరవ శతాబ్ది వాడని ఆధునికులు అంగీకరించారు. ఉత్తర ప్రదేశ్ లో అలహా బాద్ జిల్లా పభోస ప్రాంతంలో ప్రభాసలో కణాదుడు జీవించాడు. ఆయనది 'పావురం జీవితం'

అన్నారు కొందరు. అంటే రోడ్డు మీద పడి ఉన్న ధాన్యపు గింజలను ఏరుకొని తిని బతికాడని అర్ధం. చిన్న చిన్న రేణువులు అంటే కణాదులు మీద ఆధారపడి జీవించాడు కనుక 'కణాదుడు' అని పించుకొన్నాడు. ఆయనకు 'కణ', కణ భూకర్, కణ భక్ష' పేర్లు కూడా ఉన్నాయి. ఈయన సోమ శర్మకు శిష్యుడు. 'సూర్య కారణ సంబంధం' అనే సిద్ధాంతాన్ని మొదటి సారిగా ఆవిష్కరించిన వాడు కణాడుడే. 'వైశేషిక సూత్ర' రచయిత. ఇది పది గ్రంథాల సంపుటి. ప్రతి గ్రంథంలో రెండేసి అధ్యాయాలు, ప్రతి అధ్యాయంలో అనేక సూత్రాలు ఉన్నాయి. ప్రతి గ్రంథంలో కనీసం 370 సూత్రాలుంటాయి. పరమాణువులతో ప్రపంచం ఏర్పడిందని వాటిని మళ్ళీ విభజించినా ఆ తర్వాత విభజించటం సాధ్యం కాదు అని చెప్పాడు.

కణాద సిద్ధాతం ప్రకారం ఈ విశ్వం ఆరు స్థితులలో ఉంది ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయ స్థితులు. పదార్ధాలు తొమ్మిది అస్తిత్వాలను కలిగి ఉంటాయి. భూమి జాలం, అగ్ని, తేజ, వాయు ఈథర్, కాలం, అంతరిక్షం మనస్సు, ఆత్మ. కణాదుడు నిరీశ్వర వాది. చనిపోయే ముందైన దేవుడిని ప్రార్ధించమని శిష్యులు కోరితే 'పీలవః' అని అన్నాడట. అంటే 'పరమాణువు, పరమాణువు' అని అర్ధం. ఈయన భావనలో మనస్సు ఆత్మ రెండు ద్రవ్యాలే. ప్రతి ద్రవ్యం అణురూపంలోనే ఉంటుంది. స్పేస్ అండ్ టైంకూడా ద్రవ్యాలేనివని ఐ న్ స్టీన్ కాలాని కంటే ముందే కణాద మహర్షి చెప్పాడు. నిరీశ్వర వాదికావటం వల్ల తగినంత ప్రచారం పొందలేకపోయాడు.❋



## 5. విమాన శాస్త్రజ్ఞుడు భరద్వాజ మహర్షి (క్రీ.పూ 7వ శతాబ్దం)

**భా**గవతంలో సాల్వుడు 'సౌంభక' అనే విమానంలో ద్వారకా నగరం మీద యుద్ధం చేశాడని ఉంది. గయోపాఖ్యానంలో గయుడు ఆకాశంలో రథంలో వెడుతూ ఉమ్మి వేస్తె అది శ్రీ కృష్ణుడు సూర్యునికిచ్చే అర్ఘ్యజలంలో పడటం, అది శ్రీ కృష్ణార్జున యుద్ధం దాకా వెళ్ళటం తెలిసిందే. రామాయణంలో కుబేరుని 'పుష్పక విమానాన్ని' రావణుడు లాక్కొని అనుభవించాడు. దానిలోనే శ్రీ రామాదులు లంక నుంచి అయోధ్యకు చేరారని తెలిసిన విషయమే. వసురాజుకు ఇంద్రుడు ఒక విమానం ఇచ్చాడు అది 'ఎయిర్ కండిషన్డ్ విమానం'. దానిలో సకల సౌకర్యాలు ఉన్నాయి.

వి అంటే పక్షి. గాలిలో పక్షిలాగా ఎగిరేది విమానం అని పిలువబడింది. మహాభారత కాలానికే విమాన శాస్త్రం వృద్ధి చెందింది. ఋగ్వేదంలో విమాన యాన ప్రసక్తి ఉంది. మూడు చక్రాలతో ఆకాశంలో విహరించే రథాలున్నట్లు మన పురాణాలలో ఉంది. 'బృహత్ యంత్ర సర్వస్వం'లో విమానయానంకు సంబంధించిన రచన ఉంది. దీనికి అనుబంధంగా 'సంస్కార రత్నావలి', 'శకట యానం', 'లోహ తంత్ర', 'యాన బిందువు' మొదలైన గ్రంథాలు వచ్చాయి. 'బృహత్ యంత్ర సర్వస్వం'ను భూర్జర పత్రాల మీద రచించిన భారద్వాజ మహర్షి వివరాలు అందు బాటులో లేవు.

క్రీ.పూ.ఏడవ శతాబ్దిలో భరద్వాజుడు జన్మించినట్లు తెలుస్తోంది. తండ్రి బృహస్పతి. తల్లి మమత. హిమాలయ పర్వత సానువులలో జన్మించినట్లు భావిస్తారు. ఋగ్వేద అధర్వణ వేదం, రామాయణ, మహా భారతాలలో భరద్వాజ ప్రసక్తి ఉంది. ఈయనే విమాన శాస్త్ర రచయితగా అందరు భావిస్తారు. భరద్వాజుడు రాసిన 'బృహత్ యంత్ర సంహిత'లో విమాన శాస్త్రం ఒక భాగం మాత్రమే. ఇందులో అనేక పూర్వ గ్రంథాలను ఆధారం చేసుకొని రాసినట్లు చెప్పాడు. ప్రాచీన విజ్ఞాన గ్రంధాలు ముఖ్యమైనవి 25ఉన్నాయి. అవి 'వైశ్వానర తంత్రం, ధూమ ప్రకరణం,సౌదామిని కళ, శక్తి సూత్రం, అంశు బోధిని, వాయు తత్వ ప్రకరణం, ఆకాశ తత్త్వం.

భరద్వాజుడు రాసిన విమాన శాస్త్రంకు విపులమైన వ్యాఖ్యానం రాసిన వాడు 'బోధా నంద'. ఆయన రాసిన ప్రకారం భరద్వాజుడు వేదాలను మధించి, ఈ యంత్ర శాస్త్రాన్ని తయారు చేశాడు. భారద్వాజునికి పూర్వమే కొంతమంది విమాన శాస్త్రంపై అనేక పరిశోధనలు చేశారని, గ్రంథస్థం చేశారని తెలుస్తోంది. అయితే అవి అస్పస్టాలు అసంపూర్ణాలు అవటంతో అసలు విషయం తెలియలేదు. శౌనక మహర్షి రాసిన 'వ్యోమ యాన యంత్రం' వాచస్పతి రాసిన 'యాన బిందు', నారాయణ రాసిన 'విమాన చంద్రిక' దుండి నాధుడు రాసిన 'వ్యోమ యానార్క ప్రకాశిక', గార్గ్య మహర్షి రాసిన 'యంత్ర కల్పం', చక్రాయన రచించిన 'భేత యాన ప్రదీపిక' మొదలైనవి భరద్వాజుని విమాన శాస్త్రానికి ముందువే.

భరద్వాజ విమాన శాస్త్రంలో ఎనిమిది అధ్యాయాలు వంద అధికరణాలు, 500 సూత్రాలున్నాయి, ఇదీ అసంపూర్తి గ్రంధమే. పూర్తి గ్రంథం అలభ్యం. భరద్వాజుడు తన విమాన శాస్త్రం లో మొత్తం 32 విమాన శాస్త్ర సిద్ధాంతాలు ఉన్నాయని పేర్కొన్నాడు. విమాన నిర్మాణంలో

32 యంత్రాలున్నట్లు, వాటిని ఎక్కడెక్కడ అమర్చాలో వాటి పనులేమిటో కూడా తెలియజేశాడు. 2005లో హరిద్వార్‌లో ఆవిష్కరింపబడిన ఆమంచి బాల సుధాకర శాస్త్రిగారి రచన 'భరద్వాజ వైమానిక 'శాస్త్రం'లో కావలసిన వివరాలున్నాయట. శాస్త్రి గారు విజయవాడలో 'మహర్షి కాల జ్ఞానం' సంపాదకులట. ఇందులో

మూడు వేల శ్లోకాలు వంద అధ్యాయాలు ఉన్నాయి. తెలుగు ఇంగ్లీష్‌లలో ఈ పుస్తకం వెలువడిందట. మన దేశంలో రైట్ సోదరులకు పూర్వమే బొంబాయిలో 'శివ శంకర్ బాపూజీ తల పడే' అనే శాస్త్రవేత్త 1895లో మొదటి విమానాన్ని తయారు చేసి ఆకాశంలో ఎగిరెట్లు చేశాడట. ఈయన బొంబాయి చైనా బజార్‌లో ఉండేవారు. సంస్కృత ఆంగ్లలో నిష్ణాతుడు. విజ్ఞాన పరిశోధనల్లో ఆరి తేరినవాడు. బొంబాయి జే.జే.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ లో లెక్చరర్. వేదవాగ్మయాన్ని అవలోడనం చేసినవారు. 1913లో శివకర్ గారు 'ప్రాచీన విమాన విద్వేచా శోధ' పేరుతో మరాఠీలో ఒక గ్రంథం రాశారు. భార్య, మిత్రుల సహకారంతో వేదంలోని విజ్ఞాన శాస్త్రాన్ని ఆధారం చేసుకొని విమానాన్ని నిర్మించారు. తన విమానానికి 'మరుత్సఖ' (వాయు మిత్రుడు) అని పేరు పెట్టారాయన. బొంబాయిలోని ఆర్ట్ సొసైటీ నిర్వహణలో ఉన్న టౌన్‌హాల్‌లో ప్రదర్శించారు. పాదరసాన్ని, సౌరశక్తిని ఇంధనాలుగా ఉపయోగించారు. బొంబాయిలోని 'చౌ పట్టి' సముద్ర ప్రాంతంలో ప్రయోగించి నడిపించారు. 1500 అడుగుల ఎత్తు వరకు 'మరుత్సఖ' యెగిరి క్షేమంగా భూమి మీదకు దిగింది. ఆనాటి బరోడా యువరాజు సాయాజీ రావు గైక్వాడ్, ప్రసిద్ధ న్యాయ వేత్త మహా దేవ గోవింద రానడే, వాణిజ్య వేత్త లాల్జీ నారాయణ్ జీ మొదలైన ప్రముఖులందరూ ఈ విమానాన ప్రయోగాన్ని చూశారు. దీన్ని అభివృద్ధి చేయటానికి కావలసిన ఆర్థిక సాయం చేస్తామని వీరందరూ ప్రకటించారు. కొద్దికాలానికే ఆయన ఆరోగ్యం క్షీణించటం భార్య మరణించటంతో, శివాకర్ గారు కూడా చని పోవటంతో ఈ ప్రయోగం ఆగిపోయింది. ఈయన వారసులు ఈ తొలి విమానాన్ని బ్రిటిష్ కంపెనికి అమ్మేశారు. బాల గంగాధర తిలక్ తన కేసరి పత్రికలో 1953 10న ఒక వ్యాసం రాశారు. 'శివకర్ తల పడే' విమాన ప్రయోగం గురించి పూర్తి వివరాలు అందులో రాశారు. బ్రిటిష్ ప్రభుత్వం పరువు పోతుందనే భయంతో ఈ విషయాన్ని అంతకు ముందు బయటికి పొక్క కుండా చేసింది. కాని తిలక్ గారి వల్లనే మొదటిసారి లోకానికి తెలిసింది. 1950లో 'శిల్ప సంసార' అనే పత్రిక వేదాలలో విమాన శాస్త్ర వివరాలను ధారావాహికగా ప్రచురించింది. 1956లో జనవరి ఎనిమిదిన 'త్రిపుర' పేరుతో

ఒక ప్రత్యేక విమానానికి సంబంధించిన కొన్ని రేఖా చిత్రాలను ప్రచురించారు. ఈ విమానం భూమి మీద, గాలిలోను ఎగురగలదని తెలిపింది.

భరద్వాజుడి విమాన శాస్త్ర అధ్యయనాన్ని అనేక మంది ఆధునిక శాస్త్రవేత్తలు చేశారు. ఇందులో డాక్టర్ రామ ప్రభు, డాక్టర్ మహేశ్వర్ సేరోన్, డాక్టర్ యెన్ జి దొంగ్రే, పి. రామచంద్రరావు మొదలైన వారున్నారు.

1963లో రష్యా నుంచి ఉయ్యూరుకు వచ్చిన ఉయ్యూరు వాస్తవ్యులు రష్యాలో ఆయిల్ శాస్త్రవేత్త శ్రీ కొలచల సీతా రామయ్య గారు ఇక్కడ జరిగిన పౌర సన్మానంలోను విడిగా బంధువుల ఇంటిలోను మాతో మాట్లాడినప్పుడు భరద్వాజ మహర్షి రాసిన విమాన శాస్త్రాన్ని జర్మనీ దేశశాస్త్రజ్ఞులు ఇండియా నుంచి తీసుకొని వెళ్లి జర్మనిలో విమానాన్ని తయారు చేశారని చెప్పారు.❋

## 6. రాహులకుడు (400- బీ.సి)

**రా**హులకుడు లేక రాహులకుడు క్రీ.పూ.నాలుగవ శతాబ్దం కంటే పూర్వం వాడు. అతని వ్యాఖ్యానాలన్నీ కవిత్వంగానే ఉన్నాయి. తమిళ గ్రంథం 'మణిమేఖల'లో ఈ కవి గరించి ఉంది. అభినవ గుప్తుడు ఇతనిని శాక్యాచార్య రాహులకుడు అన్నాడు. బౌద్ధమతాను యాయి అని అందుకే భరతుని వ్యాఖ్యలను ఇష్టపడలేదని చెప్పాడు. ముఖ్యంగా అలంకార విషయంలో. హేమచంద్రుడూ కావ్యానుశాసనంలో ఉటంకించాడు. సారంగ ధరుడు రాహులకుని ఒక శ్లోకం ఉదాహరించాడు.

'ఉన్నిద్ర కంద లలాట లాంతర లీయమాన గ్రుష్యంద్ర న్మదాంధ మధుపాంచిత మేవ కాలే – సప్నోతి యఃప్రవ సాతి ప్రవిహాయ కాంతాం తస్మై విషాపార హితాయ నమో వృషాయ'

వార్తిక వ్రాత ప్రతి మధ్య భారతానికి చెందిన ఏం ఆర్ కవికి దొరికింది. అందులో మొదలు చివర లేదు. రెండు వందల గ్రంథాలున్నట్లు తెలుస్తోంది. రచయిత పేరు లేదు. ఇది నాట్య శాస్త్రానికి అనుబంధం అని బరోడా నుండి ప్రచురణ జరిగిందని భావిస్తున్నారు. ❁

## 7. వాత్సాయనుడు (400-300 బిసి)

**వా**త్సాయనుడు అనగానే కామసూత్రాలు జ్ఞాపకం వస్తాయి. అంత పాప్యులర్ పేరు ఆయనది. వాత్సాయన ముని లేక మహర్షి అని కూడా అంటారు. అసలు పేరు మల్లనాథుడు. వీరిది వాత్సాయన గోత్రం. న్యాదు భాష్యం రాసిన పాక్షిల స్వామితో సంబంధం ఉన్నవాడు అంటారుకాని రుజువులేదు. ఈయన తన రాజు కుంతలా శాతకర్ని భార్య రాణి మలయావతి హత్యతో సబంధం ఉన్నవాడనే ప్రచారం ఉంది. చరిత్రలో పదమూడవ శాతకర్ణి అనే ఆంధ్ర శాతవాహన రాజు మృగేంద్ర స్వేతకర్ని కొడుకు. ఇతని పాలనా కాలం క్రీ.పూ. 615-607 అని మత్స్య పురాణం, కలియుగ రాజ వృత్తాంతాలలో ఉంది. ఇది అసంబద్ధమని చరిత్రకారులు భావించి వాత్సాయనుని కాలం క్రీ.పూ.మూడు నాలుగు శతాబ్దాల మధ్య అన్నారు. 'వాత్సాయనుడు, కౌటిల్యుడు ఒక్కరే అనే భ్రమలో కొందరు పడ్డారు. అది నిజం కాదు. కామసూత్ర సాంఘిక శాస్త్రమే కాక యుజేనిక్స్ కూడా. సద్ధర్మచారిణి అయిన భార్య ఉత్తమ ఇల్లాలుగా, ఇంటిని తీర్చిదిద్దుకొనే మహిళగా భర్త మనీపర్స్‌పై పెత్తనదారుగా, ఉండాల్సిన విధానం అంతా ఇందులో వివరించాడు. పురుషుడు విలాసవంతంగా, బహు సంస్కృతుల ప్రలోభంలో పడి దారి కాననివాడుగా, విశ్రుంఖల విహారిగా, పరకాంతా సక్తుడుగా, విహార వినోద వేశ్యాలోలుడిగా ఉంటే, అమ్మాయిల వెంట తిరిగే జులాయిగా ఉంటే అతనికి కావలసిన సకల సౌకర్యాలు ఇంట్లోనే కలుగజేసి కొంగుకు ఎలా కట్టేసుకొని అతని సౌఖ్యం తన సంతృప్తి ఎలా తీర్చుకోవాలో చెప్పిన దాంపత్య శృంగార నీతి శాస్త్రం.

వెయ్యి సూత్రాలున్న ఈ శాస్త్రం సులభంగా అందరికీ బోధపడేట్లు రాశాడు. పూర్వకవులందరూ కామసూత్రాధ్యయన సంపన్నులే. వారి కావ్యాలలో ఉన్న నాయకా నాయికలే దీనికి ఉదాహరణ. కాళిదాసు శకుంతలను అత్తవారింటికి పంపే సన్నివేశంలో కణ్వ మహర్షి చేత చెప్పించిన "శుశ్రూణత్వగురూ" శ్లోకంలో నీతులే కాకుండా, కామసూత్రాలోని ఏకచారిణీ వృత్తం లోనిదే అవటమే గొప్ప నిదర్శనం. మాలతీమాధవంలో "ఏవం హి కామసూత్ర కారామామన నంతి" అని చెప్పాడు. పెద్దనగారు మనుచరిత్రలో ప్రవరుని చేత వరూధునితో "కామ శాస్త్రాధ్యాయిని నావచిం చెదు" అనిపించిన సంగతి మనకు తెలిసిందే. వ్యాఖ్యాతలు కూడా కామసూత్రాలను ఉదాహరించారు. వీటి ప్రాచుర్యం అంతటిది. వాత్సాయనుడు ఈ గ్రంథానికి మొదటి శ్లోకంలో "ధర్మార్థ కామేభ్యోనమః" అని ప్రారంభించి గ్రంథాంతంలో "తదేత బ్రహ్మ చర్యేణపరేణచ సమాధినా- వివాతం లోక యాత్రార్థం న రాగార్థోన్య సంవిది

"రక్షణే ధర్మార్థ కామానాం స్థితిం స్వం లోక వర్తినీం- అస్య శాస్త్రస్య తత్వజ్ఞో భవల్యేవజితేద్రియః" అని పూర్తి చేశాడు. కామశాస్త్ర ఫలం ఏమిటో విస్పష్టం చెప్పాడు. గృహస్త ధర్మాలను చక్కగా జరుపుకోవటానికి ఉద్దేశిందే తప్ప రాగం కోసం కాదన్నాడు. దీని సారం గ్రహిస్తే ధర్మార్థ కామాలకు పరస్పర వైషమ్యం లేకుండా జితేంద్రియుడై ఐహిక ఆముష్మిక సాధనంగా జీవన యాత్ర సాగించాలని బోధించాడు.

భార్యను వదిలి పరభార్యల వెంటబడే వారి చేష్టల్ని చూపించే భాగం మాత్రమే చదివితే ఆ కోరిక పెరుగుతుంది కాని సాకల్యంగా చదివి అర్థం చేసుకొంటే కులపాలికా ప్రణయానికే అధిక ప్రాధాన్యమిస్తారు, ఇవ్వాలి అని వాత్సాయనుని కామం లేక కోరిక. భర్తకు గృహ కృత్యాలలో చేదోడు వాదోడుగా ఉండటం మాత్రమే కాదు అతని కామానికి ఇంట్లోనే కళ్ళెం వేయాలి. దానికి కావాలసిన "దినుసులన్నీ" చెప్పాడు వాత్సాయనుడు.వాటిని అర్థం చేసుకొని భర్తకు తనకూ సుఖాన్ని సంతృప్తిని కలిగించాలి, పొందాలి. భర్త గృహం దాటి శృంగారానికి బయటికి పరిగెత్తకుండా కట్టడిచేసే సమస్త విదద్యలు భార్య నేర్వాలని ఆయన

భావన. దాంపత్యం చక్కగా పండాలి. సత్సంతానం కలిగి వంశాభివృద్ధి జరగాలి. పడక గది సౌఖ్యం కోరుకోవటం మగాడి ఆంతర్యం దాన్ని అర్థం చేసుకొని ప్రవర్తించాలి. వివిధ భంగిమలలో, కోణాలలో రతి సౌఖ్యం అందుకోవాలి దంపతులు. అప్పుడే పరిపూర్ణత అని వాత్సాయనుని ఆలోచన. ఈ కామసూత్ర వ్యాఖ్యానాలే మనకు మధ్యప్రదేశ్‌లోని ఖజురాహో దేవాలయాలపై ఉన్న అద్భుత శిల్పాలు. అవేవో కామకేళీ విలాసాలు కావు. సుఖ సంసారానికి మార్గదర్శకాలు. మనం బజారులో చూసే చౌకబారు కామసూత్రాలు చూసి అదే ఆయన చెప్పాడని అనుకొంటే "కామపప్పు"లో కాలేసినట్లే దిగజారి నట్లే.

కామసూత్రాకు యశోధరుని జయ మంగళ వ్యాఖ్య, వీరభద్రుని "కందర్ప చూడామణి" భాస్కర నరసింహ శాస్త్రి "వృత్తి" ఉత్తమమైనవి. "వాత్సాయనీయం కిల కామ సూత్రం వ్యాఖ్యాయితత్రైశ్చ్య దిహాన్య దైవ అనేదాన్ని బట్టి యశోధరునికి ముందే కొన్ని వ్యాఖ్యాలున్నాయని అర్థమవుతోంది. కాని అవి కనిపించలేదు. భాస్కర వంశ సంజాతుడు నరసింహ శాస్త్రి కాశీ నివాసి. సర్వేశ్వర శాస్త్రి శిష్యుడు. ఇతడు వ్యాఖ్యాన కారికలో "వత్సోపరి వాత్సల్యా ద్వాత్సాయన నామ కామ శాస్త్రం యః" అని ఉన్నందున వత్స రాజు మీది ప్రేమచే కామసూత్ర రాశాడని చెప్పాడు. ఈ వత్సరాజు ఎవరో మాత్రం చెప్పలేదు.

వీరభద్రుడు కామసూత్రాలకు "కందర్ప చూడామణి" వ్యాఖ్యను స్మరించిన నరసింహి శాస్త్రి వృత్తి కంటే అర్వాచీనమైనది అని తేల్చారు మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. శాస్త్రి పద్దెనిమిదవ శతాబ్ది పూర్వార్థంవాడు. శాస్త్రి "అజ్ఞాత ఆనందమైన మోక్షం కంటే జ్ఞాతానందమైన కామమే ఉత్తమ పురుషార్థం" అన్నాడు. ఇతని ఇంటి పేరు భాస్కర కనుక ఆంధ్రుడు అయి ఉండచ్చు. కామసూత్ర అన్ని భాషల్లోకి అనువాదం పొంది ప్రపంచ ప్రసిద్ధమై చలన చిత్రంగానూ వచ్చింది.❁

## 8. బృహద్దేశి కర్త- మాతంగుడు (400 బిసి)

**"బృ**హద్దేశి" రచించిన మాతంగుడు దేశీ సంగీతానికే ప్రాముఖ్యమిచ్చాడు. ఆరు అధ్యాయాలున్న గ్రంథం. శృతి స్వరాలపై విస్తృత చర్చ. భరతుని గురించి చెబుతూనే చాలా విషయాలలో విభేదించాడు. ముఖ్యంగా "మూర్ఛన"లో పన్నెండు స్వరాలపై బాగా భేదించాడు. అందుకే తర్వాత "మతంగ మతం" అనేది ఏర్పడింది. ఈ మతాన్ని అభినవ గుప్త, సారంగధరులు ఉటంకించారు. "హరి విలాసం" అనే ప్రబంధాన్ని, "జక్కిణి" అనే నాట్య విశేషాన్ని రాశాడు. జక్కిణిలో కాళికాదేవి తనను మతంగ ముని అని సంబోధించి నూతన మార్గాన్ని సృష్టించమని కోరింది. తమిళ 'సిలప్పాదికారం'లో మాతంగుడు సంగీత నాట్యశాస్త్రవేత్త అని ఉంది. ఈ గ్రంథం క్రీ.పూ నాల్గవ శతాబ్దం పూర్వంది. దీన్నిబట్టి మాతంగుడు కాళికి తండ్రి. అందుకే ఆమెను "మాతంగి" అని పిలుస్తారు. ఆయన రాసిన దానికి గొప్ప విలువనిచ్చారు. కోహల, శార్దూల కవులను మాతంగుడు పేర్కొన్నాడు.❁




## 9. అష్టాధ్యాయి రాసిన పాణిని - క్రీ.పూ.350

**దా**క్షి కుమారుడైన పాణిని సాలతురాలో ఉన్నాడు. కథాసరిత్సాగరం ప్రకారం పాణిని, వ్యాడి కాత్యాయన ఇంద్రదత్తులు ఉపాధ్యాయ ఉప వర్ష వద్ద విద్యనభ్యసించారు. చదువులో బాగా వెనుకబడి ఉండటం చేత పాణిని శివుని గురించి తపస్సు చేసి ఆయన అనుగ్రహంతో ప్రత్యాహార సూత్రాలు పొందాడు. దీని ఆధారంగా అష్టాధ్యాయి అనే వ్యాకరణాన్ని రచించాడు. ఇది ప్రపంచంలోనే తొలి వ్యాకరణం. నిర్దుష్టమైనది, అనన్య సాధారణమైనది. దీనికి మించిన వ్యాకరణం లేదని అంటారు. వేద, వేదాంగాల అధ్యయనానికి ఇది ముఖ్యమైనది. ఎనిమిది భాగాలుగా కనక అష్టాధ్యాయి అనే పేరు వచ్చింది. పంచతంత్ర కథనం ప్రకారం పాణిని ఒక సింహానికి బలయ్యాడు. అతని కాలం క్రీ.పూ.350గా అందరూ ఒప్పుకున్నారు. కానీ హుయాన్ సాంగ్ బుద్ధ నిర్యాణం తర్వాత 500 ఏళ్ళకు జన్మించినట్లుగా రాసాడు. కనిష్కుని సమకాలీకుడు అని అన్నాడు. కానీ బుద్ధుని మరణం తర్వాత 500 ఏళ్ళకు కాశ్మీరు నుండి సాలతూరకు ఒక కాశ్మీర్ దేశస్థుడు వచ్చినట్లు ఒక బ్రాహ్మణ గురువు వద్ద విద్యనభ్యసించినట్లు తెలుస్తోంది. ఆ విద్యార్థియే పాణినిగా మరల జన్మించాడని అంటారు. పాణిని ప్రముఖ వ్యాకరణకర్త, కవి. జాంబవతీ విజయం రాసాడు. తన సదూక్తి కర్ణామృతంలో శ్రీధర దాసుడు పాణిని దాక్షి పుత్రుడు అని చెప్పాడు. క్షేమేంద్రుడు సువ్రృత్తి

తిలకంలో పాణిని ఉపజాతి వృత్తాలలో అందరినీ మించిపోయాడని రాసాడు. రుద్రుటుడి కావ్యాలంకారంపై వ్యాఖ్య రాసిన నమిసాదు కవి పాణిని రాసిన పాతాళ విజయంలోని కొన్ని శ్లోకాలను ఉదాహరించాడు. ఆ కావ్యం మలబారు తీరంలో లభించింది. పాతాళ భల్లూక రాజు అయిన జాంబవంతుని కూతురు జాంబవతి కృష్ణుడు అతడిని జయించి శమంతకమణితో పాటు జాంబవతిని పాణిగ్రహణం చేసిన కథ. ఈ కథ భారత, భాగవత, విష్ణు పురాణాలలో ఉంది. దీనినే విజయనగర రాజు కృష్ణదేవరాయలు జాంబవతీ కల్యాణం నాటకంగా రాసాడు. పాణిని కవిత్వం సహజ సుందరంగా ఉంటుంది. కృష్ణలీల సుకుడు భోజరాజు రాసిన సతాస్వతీ కంఠా భరణం వ్యాఖ్య రాస్తూ పాణిని శ్లోకాలను ఉదాహరించాడు. అమరకోశంపై వ్యాఖ్య రాసిన రాయ ముక్కుట కవి పాణిని శ్లోకాలను పేర్కొన్నాడు.❁



## 10. పాణినిపై వార్తికం రాసిన వరరుచి- (క్రీ.పూ 343-378)

**కా**త్యాయనుడు అనే పేరున్న వరరుచి సంకృతి గోత్రీకుడైన సోమదత్తుని కుమారుడు. యమునా నది తీరాన ఉన్న కౌశాంబిలో జన్మించాడు. పాణిని వ్యాడిలతో కలసి పాటలీపుత్రంలోని ఉపవర్షుని వద్ద విద్య నేర్చారు. అతని కుమార్తె ఉపకోశను వివాహం చేసుకున్నాడు. పాణినిపై వార్తికమ్ రాసాడు. పతంజలి మహాభాష్యంలో వరరుచి శ్లోకాలను పేర్కొన్నాడు. అవంతీ సుందరి కథాసారం ప్రకారం వరరుచి మహానంది రాజు క్రీ.పూ.1678- 1635లో పరిపాలించిన నంది వర్ధనుడి కుమారుడు మహా పద్మని కుమారుడు నందుడు మగధ సామ్రాజ్యాన్ని క్రీ.పూ. 1635-1547 వరకూ 88 ఏళ్ళు పరిపాలించారు. కనుక వరరుచి క్రీ.పూ 345-378 శతాబ్దపు వాడు అయివుంటాడు. పాణిని సూత్రాలకు కాత్యాయనుడు వార్తికాలు రాసాడు. ఇందులో నిర్వాణ గురించి వివరించాడు. నిర్వాణం అంటే పేల్చివేయటం అని చెప్పాడు. దీనినే పతంజలి అనేక ఉదాహరణల ద్వారా వివరించాడు. నిర్వాణం అనేది భౌద్ధ పారిభాషిక పదం. ముక్తి అనే అర్థం. ఇవన్నీ గమనిస్తే కాత్యాయన పతంజలులు ముందే జీవించి ఉన్నట్లు తెలుస్తోంది.

విక్రమాదిత్య మహారాజు ఆస్థాన నవరత్న కవులలో వరరుచి ఒకడుగా భావిస్తారు. కాత్యాయనుకి యుద్ధాలు, దేవుళ్ళు, రాక్షసులు మొదలైన వాటిపై అవగాహన ఉన్నట్లు తెలుస్తోంది. పతంజలి వారరుచం అనే కావ్యాన్ని గురించి చెప్పాడు. అందులో వరరుచి శ్లోకాలు ఉన్నాయి. రాజశేఖర, జల్హణలకు వరరుచి

గురించి పూర్తి అవగాహన ఉంది. వరరుచి రాసిన ఉభయాభిసారిక భాణంలో అందమైన కవిత్వం కన్పిస్తోంది. అతడొక మునిగా దర్శనమిస్తాడు. వరరుచి శ్లోకాన్ని ఒక దానిని తన వల్లభదేవుడు తన సుభాషితావళిలో ఉదహరించాడు.

ఆలోహిత మాకలయన్కంద లమితీ కంపితం మధుకరేణ- సంస్మరతి పాయీా స పాక్షికే దాతు క్షుల్తర్జనం లలితం

భోజదేవుడు శృంగార ప్రకాశికలో వరరుచి శ్లోకాన్ని వివరించాడు. ఇవి చారుమతిలోనివి. ఎనిమిది శ్లోకాల మార్యాష్టకం దుర్గాదేవి గురించిన శ్లోకం. అద్భుతమైన రచన. మలబారులో ప్రచారం ఉన్న కథనం ప్రకారం వరరుచి అన్ని కులాలకు చెందిన స్త్రీలను 18 మందిని వివాహమాడినట్లు ఉన్నది. అందుకని అతనిని చండాలునిగా భావించి దూరం చేసారు. ఈ విషయాన్ని భోజుడు కూడా ఒక శ్లోకంలో వివరించాడు.

వరరుచి ప్రాకృత భాషకు అధిక ప్రాధాన్యం ఇచ్చి ప్రాకృత ప్రకాశ అనే వ్యాకరణం రాశాడు. నాలుగు ప్రాకృత భాషలను గుర్తించాడు. అవి మహారాష్ట్రి, సౌరసేని, మాగధి, పైశాచి పైశాచి భాష అంతరించింది. ఈ గ్రంథంలో పన్నెండు అధ్యాయాలున్నాయి. మొదటి దానిలో మహారాష్ట్రి ప్రాకృతానికి కేటాయించి 424 సూత్రాలు చెప్పాడు. చివరిమూడు అధ్యాయాలు పైశాచి భాషకు కేటాయించి పద్నాలుగు సూత్రాలు మగధకి పదిహేను, సౌరసేనికి ముప్పై రెండు రాశాడు. వరరుచిది కాత్యాయన గోత్రం కనుక కాత్యాయనుడు అనే పేరు వచ్చి ఉండవచ్చు. వేద గణితాభ్యాసానికి వరరుచి సులభ సూత్రాలు రాశాడు.

చతుర్భాణి అనే ఉభయాభిసారిక రాశాడు. వరరుచి సింహాసన ద్వాత్రింసిక రాశాడు. ఇందులోని కథలు పరమాద్భుతంగా ఉల్లాసభరితంగా ఉంటాయి. విక్రమ చరిత్ర కూడా వరరుచి రాశాడని అంటారు. ఇతర కావ్యాలుగా కంఠాభరణం, చారుమతిలను పేర్కొన్నారు. ఎన్నో చాటువులు అతనిపై ఉన్నాయి. నీతి రత్నం యాస్కుని నిరుక్తంపై భాష్యం నిరుక్త సముచ్చయం అయన రచనలే అంటారు. సామవేదానికి ప్రతీశాఖ్య రాశాడు. ఒక నిఘంటువు అలంకార గ్రంథమూ రాశాడని అంటారు. ❋

## 11. కోహలుడు (బిసి 300- ఎడి 100)

**భ**రతముని అంతటి పాండితీ గరిమ ఉంది. ఆయనకు అత్యంత విధేయుడనిపించుకొన్నవాడు కోహలుడు. నాట్యశాస్త్రంలో పదకొండు విషయాలుంటే కోహలుడు దాన్ని పదమూడు విషయాలకు పెంచాడు. నాట్యశాస్త్రం ప్రకారం కోహలుడు "ప్రస్థాన త్రయం"కు భాష్యం రాయవలసి ఉంది. తరువాతి ఆలంకారికుడైన అభినవ గుప్తుడు, సారంగ దేవుడు, కోహలుని బహుధా ప్రశంసించారు. కాని దురదృష్టవవాత్తు కోహలుడు రాసినది కాలగర్భంలో కలిసిపోయి లభించలేదు. కాని "తాళాధ్యాయం" ఒక్కటి మాత్రమే లబించింది. భరతుని అనుసరించినా కోహలుడు దానికి మెరుగులు దిద్దాడు. "అభిన్యాస శాస్త్రం" కర్త కోహలుడే నంటారు. "దత్తిల- కోహలీయం" కోహలుని నుంచి దత్తిలుని వరకు గురించిన వివరణ "కోహలా రహస్యం"లో కోహలుడు, కోహలుని నుండి మాతంగుని వరకు చరిత్ర రాశాడు. కోహల రచనలు కోహలుని నుండి శార్దూలుని వరకు ఉన్న వర్ణన కల్లినాథుడు రాసిన సుదీర్ఘ ఉక్తి.❀

## 12.ప్రయోక్త స్తబకం రాసిన- దత్తిలుడు ( బిసి 300- ఏడి 100)

**భ**రతమునితో దగ్గర సంబంధం ఉన్న వందమంది శిష్యులలో దత్తిలుడు కూడా ఉన్నాడని భరతుని నాట్యశాస్త్రంలో రాశాడు. దత్తిల, కోహలులు దీనిపై వేర్వేరు వ్యాఖ్యానాలు రాశారు. భరతుని తుచగా అనుసరించినవాడు దత్తిలుడు. అందుకే భరతుని సిద్ధాంతాలను తరువాతివారు బాగా ఆదరించారు. దత్తిలునికి నాట్య సంగీతాలపై అపార పాండిత్యం ఉన్నది. భరతుని నాట్యశాస్త్రంపై దత్తిలుని "ప్రయోగ స్తబక" వ్యాఖ్యానం చాలా ప్రసిద్ధి పొందింది. భరతుని పూర్తిగా అర్థం చేసుకొని ఆయన సిద్ధాంతాలను దత్తిలుడు చక్కగా ఆవిష్కరించాడు.❁

## 13. మనుస్మృతి అనే ధర్మశాస్త్రం రచించిన - మహామహుడు మనువు (క్రీ.పూ.184)

**భా**రత దేశానికి 'ధర్మ శాస్త్రాన్ని' అందించిన మహానుభావుడు మనువు. అందుకే ఆయన పేరు మీదుగా 'మను స్మృతి' పేర చెలామణి అయింది. 2694 శ్లోకాలలతో పన్నెండు అద్యాయాలతో ఇది ఉంది. అత్యున్నత ఆలోచనా ధోరణికి ప్రతీకగా నిలుస్తుంది. కాని కాలంలో వచ్చిన మార్పుల వల్ల అది 'బ్రాహ్మణులు బ్రాహ్మణుల కోసం' రాసుకొన్నదని, స్త్రీకి చాలా అన్యాయం చేసిందనే పెద వాదాలు వచ్చినా అదే ఇప్పటికి సర్వోత్కృష్టం అని ప్రపంచమంతా భావించి గౌరవిస్తోంది. ఒక నాటిపంజాబ్ హర్యానా ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఏం.రామజొయ్స్ మనుస్మృతిపై ఒక సాధికార గ్రంథం రాశాడు. భారత రాజ్యంగ స్పూర్తికి అనుకూలం గా ఉన్న అనేక అంశాలను ఆయన ఇందులో ఉన్నాయని వివరించాడు. మత విషయాలున్నా అవి పెద్దగా అవరోధాలు కావన్నవారే అనేకులు. సంస్కృత మను స్మృతిని 1913, 1920లలో పి హెచ్ పాండ్య, జి ఆర్ ఘర్పూరేలు ఎడిట్ చేశారు. తర్వాత దీన్ని ఇంగ్లీష్‌లోకి 1974లో అనువదించిన వాడు సర్ విలియం జోన్స్, స్మృతులు అంటే భిన్న కాలాలకు చెందిన సామాజిక, రాజ కీయ రాజ్యాంగాలని అర్ధం. శాత వాహనుల కాలంనాటి నాణాలు ఈ రోజు చెల్లుబడి కావు. కానీ వాటిని కరగించి ఉపయోగించుకోవచ్చు. అమ్ముకుంటే వాటి విలువా ఎక్కువే. ఇలానే మను స్మృతి అనేక శతాబ్దాల పాటు అమలు అయింది. ఇది తిరుగు లేని సత్యం. 'మనువు'శబ్దం నుంచి మనిషి వచ్చింది. మనిషి మనీషిగా ఉన్నతం అవటానికి కావలసిన సకల విషయాలు ఉన్న శాస్త్రం మను స్మృతి .

అందరు అనుకొంటున్నట్లు మనువు బ్రాహ్మణుడు కానే కాదు. ఋగ్వేదంలో 'మనుర్భవః' అనే మాట ఉంది. అంటే 'ముందుగా మనిషిగా రూపొందు' అని అర్ధం. 'సర్వ జీవ రాశిని కాపాడటానికి ఉపయోగపడే విధంగా, ధర్మ స్వరూపంగా ఉంచేందుకు బ్రహ్మ తేజస్సు కల వాడినిగా చేయటానికి రాజుకు 'దండము' ఏర్పడింది. ఆ దండం మీద భయంతో సకల ప్రాణాలు సుఖాన్ని పొందటమే కాక తమ తమ ధర్మాలను అనుసరిస్తాయి' అనేదే మను స్మృతి సారం. దండంను అమలు పరిస్తేనే ప్రజలు సక్రమ వర్తన కలిగి ఉంటారు. కేవల స్వభావం వల్ల నడవడిక ఉండదు. దండానికి భయపడే లోకం సుఖంగా ఉంటుంది" అని రాజ దండానికి ఉన్న ప్రాధాన్యతను తెలిపాడు మనువు. అదే 'దండం దశ గుణం భవేత్'గా లోకంలో మారింది.

మనువు చెప్పిన 'దండ నీతి శాస్త్రం'లో కొన్ని మార్పులు చేసి చాణక్యుడు అర్ధ శాస్త్రంలో ఇమిడ్చాడు. దండం అంటే కర్ర పెత్తనం అనే భయం లోకంలో వ్యాపించింది. ఈ భయం పోగొట్టటానికి స్వర్గీయ ఆచార్య మామిడి పూడి వెంకట రంగయ్య గారు 'కౌటిల్యుని అర్ధ శాస్త్రం' రాసి సామాన్యులకూ అందులో ఉన్న విశేషాలను అర్ధం చేసుకోవటానికి వీలు కల్పించారు. తన లక్ష్యాన్ని మనువు వివరించాడు–

'యో దద్యా జ్ఞాన మజ్ఞానం కూద్యాద్వా ధర్మ దర్శనం –

సక్రుత్స్నాం పృధివీం దద్యాత్ తేన తుల్యం సతద్భవేత్'. దీని అర్ధం– అజ్ఞానుల ముంగిటికి జ్ఞానాన్ని తీసుకొనిపోవటం, వారికి సన్మార్గాన్ని బోధించటంకు మించిన దానం లేదు. సమస్త భూ మండలాన్ని ధారాదత్తం చేసినా కూడా అది దీనికి సమానం కానే కాదు. స్త్రీ హితం కోసం చెప్పిన విషయాలు మనం అందరం వల్లే వేసి చెప్పే 'యత్ర నార్యస్తు పూజ్యం తే – రమయతే

యత్రై తాంతున పూజ్యతే – సర్వాస్తత్రా ఫలాః క్రియాః' అంటే ఏ ఇంట్లో స్త్రీలు వస్త్ర, అలంకార, మంచి భోజనాలతో సంతోషింపబడుతారో, ఆ ఇంట దేవతలు ప్రసన్ను లౌతారు. ఎక్కడ స్త్రీకి గౌరవం ఉండదో, మనస్తాపం కలిగిస్తారో ఆ ఇంటి యజమాని చేసే ధర్మ కార్యాలన్నీ నిష్ప్ర యోజనమే.

అలాగే ఇంట్లో దంపతులతో పోషింపబడే కుమార్తెలు, కోడళ్ళు మొదలైన వారి పట్ల మర్యాద లేకపోతే ఆ ఇల్లు అతి త్వరగా నశిస్తుంది. ఏ ఇంట్లో వారు సుఖ సంతోషాలతో ఉంటారో ఆ ఇల్లు వృద్ధి చెంది ఇంకా వృద్ధి చెందు తూనే ఉంటుంది.

స్త్రీకి సంపూర్ణ స్వాతంత్రంతో ధనం ఆరు రకాల వస్తుంది. మొదటగా వివాహ సమయంలో అగ్ని హోత్రం ఎదుట తలి దండ్రులు, తోబుట్టువులు ఇతర బంధువులు ఇచ్చిన దానం, దీనినే 'అధ్యగ్ని' అంటారు. రెండవది 'ధ్యా వాహనికం' అంటే కూతురు అత్త వారింటికి వెళ్ళేటప్పుడు తలిదండ్రులు అరణంగా ఇచ్చే డబ్బు వగైరా. మూడవది 'దత్త' అంటే స్త్రీకి భర్త సంతోషంతో ఇచ్చేది. శోభన సమయంలో భార్య కొంగుకు ముడివేసిన ఆభరణాలు ధనం మొదలైనవి కూడా దత్త కిందకే వస్తాయి. నాల్గవది అన్నదమ్ములు ఇచ్చేది దీన్ని 'భ్రాత్రు దత్త' అంటారు. అయిదవది తల్లి ఇచ్చేది ఇదే 'మాతృ దత్త'. ఆరవది తండ్రి ఇచ్చేది 'పితృ ప్రాప్త'. స్త్రీ స్వయంగా సంపాదించుకొన్నదాన్ని 'ఆనవా ధ్యేయం' అంటారు. దీనిపై, భర్తకు, బంధువులకు ఏ విధమైన అధికారం హక్కూ ఉండదు. భర్త బ్రతికి ఉండగా భార్య చనిపోతే ఆమె పేర ఉన్నది సంతానానికే చెందుతుంది. ❁

## 14. అదృష్టం వల్ల రాజైన– మాతృ గుప్తకవి (100 ఏడి)

క్రీస్తుశకం ప్రారంభంలోని అంతకు ముందుకాని మాతృగుప్తుడు ఉండేవాడు. రాజ తరంగిణిలో కల్హణుడు ఇతని గూర్చి చాలా రాశాడు. కాశ్మీర్ రాజు హర్షవర్ధనున, విక్రమాదిత్యునితో ఈ కవికి మంచి సంబంధాలుండేవి. హర్ష వర్ధనుడు అనే విక్రమాదిత్యుని కొలువులో మాతృ గుప్తుడు ఉన్నాడని, రాజు ఉదారంగా ఉండేవాడు కాదని అందువల్ల ఈ కవిని పట్టించుకోలేదని అతని ప్రతిభను గుర్తించలేదని, ఆయన తాహతుకు సరిపడా గౌరవం ఇవ్వలేదని తెలుస్తోంది. దాదాపు అతన్ని నిర్లక్ష్యం చేశాడు. అందువల్ల కవి గర్భ దరిద్రంతో బతికాడు. తినటానికి తిండి కంటినిండా నిద్రా , ఉండటానికి గూడు కూడా లేవు. కొంతకాలానికి అదృష్టం పండింది. సుడి తిరిగింది. క్రమంగా సోపానాలు అధిరోహించటం ప్రారంభమైంది.

ఒకరోజు అర్ధరాత్రి కాపలా వారంతా హాయిగా నిద్రిస్తుండగా విపరీతమైన గాలి వీచి దీపాలు ఆరిపోయాయి. రాజు కాపలా వారిని యెంత గట్టిగా పిలిచినా ఎవరూ రాలేదు. అప్పుడు మాతృగుప్తుడు ద్వారాలు తెరుచుకొని లోపలికొచ్చి రాజుగారి దగ్గరున్న దీపాన్ని వెలిగించాడు. అతనెవరో తెలుసుకోవాలని పించింది రాజుకు. ఇంత అర్ధరాత్రి నిద్రపోకుండా ఆగంతకుడు ఎందుకు మెలకువగా ఉన్నాడో కారణం తెలుసుకొనే ప్రయత్నం చేశాడు. ఆ సంఘటనపై మాతృగుప్తుడు రెండు శ్లోకాలు రాశాడు. విన్న రాజు తప్పు తెలుసుకొని కవిని నిర్లక్ష్యం చేసినందుకు బాధ పడ్డాడు. కవికి ఏదో రకంగా గొప్ప సాయం చేయాలనుకొన్నాడు. మర్నాడు సభకు పిలిపించి ఒక లేఖ చేతికిచ్చి ఏమీ చెప్పకుండా కాశ్మీర్ వెళ్ళి అక్కడ

రాజోద్యోగికి ఇవ్వమన్నాడు. మాతృగుప్తుడు కాశ్మీర్ వెళ్ళాడు. అక్కడ రాజోద్యోగికి లేఖ అందించాడు. అ సమయంలో కాశ్మీర్‌కు రాజు లేడు. లేఖలో రాజు రాసిన దాన్నిబట్టి కాశ్మీర్ రాజ్యానికి మాతృ గుప్తుడిని రాజు చేయమని ఉంది. అలాగే చేసి రాజుగా పట్టాభిషేకం జరిపించారు. మెంథ కవి మాత్రు గుప్తుని సమక్షంలో తన "హయ గ్రీవ వధ" నాటకాన్ని ప్రదర్శించి మెప్పు పొందాడు. మాతృ గుప్తుడు నాట్యశాస్త్రంపై వ్యాఖ్యానం రాసి ఉండవచ్చు. సంగీత, నాట్య అలంకార శాస్త్రాలపై మాత్రు గుప్తుని అబిప్రాయాలను విశేషంగా అభినవ గుప్తుడు, కుంతకుడు, బహురూప మిశ్రుడు, శారదానందుడు మెచ్చుకొన్నారు. తమ వ్యాఖ్యానాలలో వాసుదేవుడు, రంగనాథుడు, శర్వానందుడు, క్షేమేంద్ర, వల్లభ దేవులు కూడా మాత్రు గుప్తునిపై రాశారు. ❁

## 15. సామంత భద్ర (క్రీ.శ 100)

**క్రీ.** శకం మొదటి శతాబ్దపు జైనకవి సామంత భద్ర. 'వీర వంశా వలి' శ్వేతాంబరుల కావ్యంలో పదహారవ ఆచార్యుడిగా గుర్తింప బడ్డాడు. 'ఆరాధన కథా కోశం' అనే ప్రభ చంద్రుని కథల గ్రంథంలో భద్రుని గురించి ఉంది. కంచిలో ఆచార్యుడుగా ఉండి ఉండాలి. గర్భకోశవ్యాధి పీడితుడు. అయినా కంచి నుండి పౌండ్రపురం గుండా బెనారస్ నడిచి వెళ్ళాడు. కాశీలో శివుని విగ్రహాన్ని పార్శ్వనాథుడిగా మార్చి తన మాయా జాలం చూపాడు. 'దేవాగమ స్తోత్రం', 'స్వయంభు స్తోత్రం' రాశాడు. ఆది పురాణంలో అతనిపై ప్రశంస ఉంది.

"నమస్తమ్మాంత భద్రాయ మహాతే కవి వేధసే - యద చీవజ్ను పాతేన నిర్భిన్నః కుమతా ద్రయః
కవీనాం గమకానాం చ వాదీనాం వాగ్మిమానపి - యశాస్సమంత భద్రీయం మూర్ధ్ని చూడా మణీయతే".❁

## 16. సిద్ధ సేన దివాకర (100)

**'న్యాయ**వార్త' రాసిన సిద్ధ సేన దివాకరుడు సమంత భద్రతో పాటు ఉటంకింప బడ్డాడు. ఇద్దరు రెండురకాల జైన సంప్రదాయాలకు చెందినవారు. ఎవరి సంప్రదాయంలో వారు ఘనులని కీర్తింపబడ్డారు. సిద్ధ సేనుడుకూడా శివ విగ్రహాన్ని తీర్థంకరుడిగా మార్చాడని ఉంది. కొన్ని సందర్భాలలో ఇద్దరు వేరు కాదు ఒకరేనేమో ననిపిస్తుంది. కాని హరి భద్ర సూరి, జిన సేనులు వీరిద్దరిని వేరు వేరు వ్యక్తులుగా పేర్కొన్నారు దివాకరుని తల్లి దేవాశికా. తండ్రి ఉజ్జయిని రాజ పురోహితుడు. వృద్ధ వాదిగురువుకు శిష్యుడై కుముద చంద్రగా గుర్తింపు పొందాడు. సూరి బిరుదు పొందాడు .తర్వాతపేరు సిద్ధ సేన దివాకర అయింది .ప్రాకృత సాహిత్యాన్ని అంతటినీ సంస్కృతం లోకి మార్చేస్తానని ఒక సారి గురువుతో అన్నాడు. ఈ తప్పుకు గురువు 'పరాహ్నిక ప్రాయశ్చిత్తం' చేయించాడు. పన్నెండేళ్ళు మూగగా ఉండి పవిత్ర క్షేత్ర సందర్శనం చేస్తూ గడపమన్నాడు. అలా తిరుగుతూ ఉజ్జయిని చేరాడు. మహాకాళి దేవాలయంలో బస చేశాడు. శివుని యడల భక్తీ చూపక పోవటంతో పూజారులు అసహ్యించుకొన్నారు. విక్రమాదిత్యునికి చెప్పారు ఆయన వచ్చి సిద్ధ సేనుడిని శివుడికి మొక్కమన్నాడు. 'కళ్యాణ మందిర' మంత్రాలను చదువుతూ శివలింగాన్ని జైన తీర్థంకరుడిగా మార్చాడు. అతని ప్రతిభకు మెచ్చి విక్రమాదిత్యాదులు జైన తీర్థం పుచ్చుకోన్నారట. దీన్ని జ్ఞాన సింధు ఆది పురాణంలో రాశాడు. ❁



## 17. దత్తకుడు (380)

**పా**టలీ పుత్రంలో మధుర అనే బ్రాహ్మణ కుమారుడు. తల్లి చిన్నప్పుడే చనిపోతే తండ్రి ఒక బ్రాహ్మణ స్త్రీకి దత్తత ఇచ్చాడు కనుక "దత్తకుడు" అనే పేరు స్థిరపడింది. ప్రపంచ గతిని పరిశీలిస్తూ, దానికి తగిన క్షేత్రం ఒక నాట్యకత్తె ఇల్లు అనుకోని అక్కడ ఉండి వారి కళా రహస్యాలన్నీ బాగా పరిశీలించి అర్థం చేసుకొన్నాడు. ఆమె దత్తకుడి తమ వృత్తి అయిన కామశాస్త్రంపై రాయమని ప్రోత్సహించింది. ఈ విషయం వాత్సాయనుడు కామ సూత్రాలలో తెలియజేశాడు. దత్తకుడు "దత్తక సూత్రాలు" రాస్తే జయమంగళుడు వ్యాఖ్యానం రాశాడు. అయితే ఈ సూత్రాలు దొరకలేదు కాని శ్యామలకుడు, ఈశ్వర దత్తుడు తామ నాటకాలలో ఇందులోని శ్లోకాలను ఉదాహరించారు. శూద్రకకవి "పద్మ ప్రాభ్రుతక"లో ఒక పాత్ర దట్టక రచనను పేరడీ చేస్తుంది. అది ఓంతో ప్రారంభమౌతుంది.

గంగ వంశపు రెండవ మాధవవర్మ రాజు దత్తక సూత్రాలపై "వృత్తి" రాశాడు. ఇతడు దుర్వినీతుడికి అయిదవ తరంవాడు. క్రీ.శ.380లో ఉండేవాడు. ఈ వృత్తిలో రెండుపాదాలలో రక్త, విరక్త, వేశ్యలు, శయనోపచారాలు ఉన్నాయి. ఇందులో మొదటి పాదం-

"యద్దత్తకేన ప్రమదాహితార్థం కాంతానువృత్తం కదితం స్వతంత్రే- తస్మాన్ సమాహృత్య సమస్త మన్యం వేశ్యాంగ నా వృత్త మహం ప్రవక్ష్యే"

దత్తక సూత్రాలతోబాటు "కూచిమార గ్రంథం" అనేది కనిపిస్తోంది. వాత్సాయనుడి కాలానికంటే ముందే శయనోపచారాదికాలు సంగ్రహించి దత్తకుని

పేర ఈ సూత్రాన్ని నిర్మించినట్లున్నది అంటారు" సంస్కృత వాఙ్మయ చరిత్ర"లో మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

"కూచిమారేణ తపసా యత్కృతం క్రీడనం పురా– తత్రవక్ష్యామి చిత్రార్థం నానార్థ పద నిశ్చయం"

కూచిమారుని పేర ఎవరో ఈ తంత్రాన్ని రాసినట్లు తెలుస్తోంది అన్నారు శాస్త్రీజీ. మూడు పటలాలు ఉన్న ఈ తంత్రంలో వృష్య యోగాలు ఎక్కువగా చూపించాడు.

వీరణాచార్యుడు మొదలైనవారు "పంచ రత్నం" మొదలైన స్వతంత్ర కామ శాస్త్రాలు రాశారు. ఇంతకీ కామశాస్త్రం అంటే ఏమిటి? ఇది ఒక ప్రాచీన శాస్త్రం. ప్రజాపతి ప్రజల్ని సృష్టించి ధర్మార్థ కామాలకు సాధనాలై వారి జీవనానికి కారణమయ్యే లక్ష అధ్యాయాలకు పరిమితమైన శాస్త్రాన్ని చెప్పాడు. ధర్మ ఒకటే అయినా దేశాలను బట్టి మారింది. వైవస్వత మనువు ధర్మాదికారమైన శాస్త్రం రాశాడు. అర్థం మొదలైన వాటి గురించి చెప్పే అర్థశాస్త్రం బృహస్పతి ప్రవచించాడు. శివుని అనుచరుడైన నంది కామాన్ని వేరు చేసి వెయ్యి అధ్యాయాల కామ సూత్రం రాశాడు. దీన్ని స్వేతకేతువు సంగ్రహించి అయిదు వందల అధ్యాయాల కామశాస్త్రం రచించాడు. దీన్ని ఇంకా సంక్షేపం చేసి కాభ్రువ్యుడు "సాంప్రయోగికం, కన్యా సంప్ర యుక్తం, భార్యాదికారిక, పర దారికం, వైశిరం, ఔపనిషదికం మొదలైన వాటితో నూట ఎనిమిది అధ్యాల శాస్త్రంగా మార్చాడు.

ఇందులో వైశిరంను ఆదారంగా చేసుకొని పాటలీ పుత్ర వేశ్యల కోరిక మేరకు దత్తకుడు "వేశ్యాధికరణం" రాశాడు. చారాయనుడు సాధారణాధికరసం, సువర్ణనాధుడు సంసాంప్ర యోగికం, ఘోటక ముఖుడు కన్యా సంప్ర యుక్తాన్ని, గోవర్ధనుడు భార్యాధికారాన్ని, గోణికా పుత్రుడు పరదారికాన్ని కుమారుడు ఔపనిషధ మును, వేర్వేరు గ్రంథాలుగా రాశారు. ఇందులో భద్ర వేయ నిర్మితమైన గ్రంథం చాల విస్తృత రూపంలో ఉంది. కనుక దత్తకుడు మొదలైనవారు సింప్లీపై చేశారు. కాని ఇవి అసంపూర్ణాలు అని గ్రహించి వాత్సాయనుడు చదవటానికి వీలుగా ఉండే చిన్న గ్రంథంగా కామసూత్ర రాశాడు. ధర్మార్థ కామ మోక్షాలలో మూడవది కామం. కామంలో శృంగార సంబంధమైన విషయాలను చెప్పింది కామసూత్ర. ❀

# 18. 100 అధ్యాయాల రామాయణం రాసిన మెంధ కవి (430)

**భ**ర్తృ మెందగా ప్రసిద్ధుడైన ఈ కవిని కొందరు కాళిదాసు కంటే ఘనుడు అని తమకావ్యాలలో పేర్కొన్నారు. మెంద అనే పదానికి అర్థం ఏనుగును నడిపే మావటి వాడు అని. జల్హనుడు తన సూక్తి ముక్తావళిలో రాజ శేఖరుడు ఈ విషయంపై రాసిన శ్లోకాన్ని ఉదాహరించాడు. మిగిలిన చరిత్రకారులు కూడా ఈకవిని మెంద అనే పేరుతోనే పిలిచారు. అతని 'హస్తి పాల' మొదలైన వాటిలో అడవి ఏనుగులను ఏ విధంగా మాటుపెట్టి గోతులలో పడేట్లు చేస్తారో వివరింపబడి ఉంది. దీన్నిబట్టి మెందకు ఈ విద్యతో సంబంధం ఉన్నట్లు తోస్తుంది.

కల్హణుడు మెందను కాశ్మీర్ రాజు మాతృ గుప్తుని ఆస్థానంలో ఉన్నట్లు రాశాడు. మాతృ గుప్తుని కాలం క్రీ.శ.430గా భావిస్తే ఈ కవి ఆ కాలంలో జీవించాడని చెప్పచ్చు. మృచ్ఛ కటికం 'లింఫ తీయ తమొంగూని' అనే ప్రసిద్ధ శ్లోకం లోను, అవిమారకుని బాల చరితంలోను, కావ్యాదర్శంలోను, సారంగ ధర పద్ధతిలోను విక్రమాదిత్యుడు, మెంధతో కలిసి కావ్యం అల్లినట్లు ఉంది. దీనితో మళ్ళీ కాలానికి గొళ్ళెం పెట్టాల్సొస్తోంది. ఏతా వాతా తేలిందేమిటంటే మెందకవి విక్రమాదిత్యుని కాలం వాడేనని. మంఖ కవి 'శ్రీ కంఠ చరిత్ర'లో మెందను సుబందు, భారవి, బాణులతో ముడిపెట్టాడు. రాజశేఖరుడు మాత్రం ఆయన్ను వాల్మీకి అవతారం ఆ తర్వాత భవభూతి అవతారమని చివరికి తాను కూడా మెంద అవతారాన్నే అని మెచ్చుకొని చెప్పుకొన్నాడు. దీన్నిబట్టి మెంద కవి 100 అధ్యాయాల 'రామచరిత్ర' రాశాడని తేల్చారు. దీని వ్రాత ప్రతి నకలు ఇప్పటికీ బెనారస్ విశ్వ విద్యాలయంలో భద్రంగా ఉందని కృష్ణమాచారియార్ రాశారు.❋

## 19. 'ప్రశస్తి' రచించిన వత్స భట్టి (473-74)

మందసార్ సూర్య దేవాలయంలో శిలా ఫలకాలపై ఉన్న 'ప్రశస్తి' శ్లోకాలను వత్స భట్టికవి, మాళవ సంవత్సరంలో అంటే 529లో రాశాడని భావిస్తున్నారు. బూలర్ లెక్క ప్రకారం ఇది క్రీ.శ.473-74 అవుతుంది. ప్రశస్తిలో 44 పద్యాలున్నాయి. మొదలు చివర మంగళా శాసనంలు వచనంలో ఉన్నాయి. చక్రవర్తి కుమార గుప్తుని గురించి రాజులు విశ్వవర్మ, బంధువర్మల గురించి సూర్య దేవాలయ నిర్మాణాన్ని గురించి శీతాకాల వర్ణన అందులో కవి రాశాడు. అనేక ఛందస్సులను ప్రయోగించాడు. ఈ రకమైన రచనలు తూర్పు దేశ కవులే చేస్తారని దండి వివరించాడు. మొత్తం కవిత్వం చాలా ధారా శుద్ధితో ఉంటుంది.

నాలుగో శతాబ్దం రెండవ భాగంలో దశ పురా - మందసోర్‌లోని సూర్య దేవాలయ ప్రశస్తి గౌడీయ విధానం లో ఉన్నట్లు కనిపిస్తుంది. ఈ గౌడకవులు తూర్పు భారతానికి చెందిన వారుగా భావిస్తారు. వత్సభట్టి రాసిన ప్రశస్తిలో కవిత్వాన్ని అధ్యయనం చేస్తే కవి మహా కావ్య పరిచయం బాగా ఉన్నవాడని తెలుస్తుంది. ఛందస్సులో గొప్ప పాండిత్యం ఉన్నవాడుగా తోస్తుంది. అతనిలో గొప్ప కవిత్వం ఉందని మహా కావ్య నిర్మాణం చేసే సమర్ధత ఉందని అనిపిస్తుందని పరిశోధకులు అంటున్నారు. కాని నిరర్ధక పాదపూరక ప్రయోగాలు, అసందర్భ పదాలు కొన్ని వాడాడు. ఒక్కో చోట వ్యాకరణ మూల విషయాలనే వదిలేశాడు. సంప్రదాయ కవులు పాటించిన నియమాలను కాదని స్వేచ్ఛతో కూడా రాశాడు. కొత్త పోలికలనూ చెప్పాడు. మేఘాలకు ఇళ్ళకూ పోలిక చూపాడుకాని అది ఆకర్షించ లేదు. ఇవన్నీ చూస్తే వత్స భట్టి, ఆనాటి సమాజంలో ఉన్న యదార్ధ

స్థితికే అద్దం పట్టాడనిపిస్తుంది.

దీన్నిబట్టి చూస్తే 472 నాటికే గొప్ప ప్రశస్తమైన కావ్య సాహిత్యం ఉందని తెలుస్తోంది. ప్రశస్తిలోని పదవ పద్యం పునరావృత్తమైంది. కాళిదాసు మేఘ దూతంలోని 65వ శ్లోకంను భట్టి కవి వాడుకున్నాడని, కాళిదాసులాగానే ఈతనికీ 'శుభగ' పదం ఇష్టమని తెలుస్తుంది. 11వ పద్యం కూడా కూడా కాళిదాసుకు కాపీ యేననిపిస్తుంది. కాళిదాసు రఘు మహా రాజును వర్ణించినట్లే వత్సభట్టి రఘువర్మను వర్ణించాడు. కనుక వత్సభట్టికి కాళిదాస మహాకవి కావ్య రచనలన్నీ పరిచయమేనని అనిపిస్తుంది. ప్రశస్తిలో కాళిదాస ఋతు సంహారంలోని అయిదవ సర్గలోని రెండు మూడు శ్లోకాలను శబ్ద ప్రయోగం భావంలలో పూర్తిగా పోలి ఉన్నాయని ప్రొఫెసర్ కీల్హాన్ అన్నాడు. కాని అది అసంబద్ధం అని ఈ గ్రంథ రచయిత కృష్ణమాచారియార్ అభిప్రాయపడ్డారు. ఇవన్నీ గమనిస్తే కాళిదాసు క్రీ.శ.472కు పూర్వం వాడే అని నిర్ధారణగా చెప్పవచ్చునంటారు ఆచార్య.

వత్స భట్టి రాసిన గ్రంథాలేవీ లభ్యం కాలేదు. మందశౌర ప్రశస్తి అనేది మాత్రమే శిలాఫలక రూపంలో దొరికింది. ఇందులో అక్కడి సూర్య దేవాలయాన్ని చేనేత పనివారు క్రీ.శ. 437లో నిర్మించిన వైనాన్ని వర్ణించాడు. మొదట శివుని గూర్చి ప్రార్థన ఉంటుంది. తర్వాత మంద సౌర ప్రశస్తిని చెప్పాడు. సమకాలీన రాజు అయిదవ శతాబ్దానికి చెందిన నరపతివర్మను వర్ణించాడు. వత్సభట్టి కవిత్వంపై కాళిదాస మహాకవి ప్రభావం బాగా కనిపిస్తుంది.❁



## 20. సరస్వతీ పుత్ర- భట్టార హరిశ్చంద్ర (500)

**హ**ర్ష చరితలో బాణ కవి భట్టార హరిశ్చంద్ర కవిని మెచ్చుకొన్నాడు. హరిశ్చంద్రకవి 'మాలతి' అనే ప్రేమ కావ్యం రాశాడు. కనుక ఇతను ఐదవ శతాబ్ది కవి అని అనుకోవచ్చు. 'సదుక్తి కర్ణామృతం'లో ఈ కవి మహాద్భుత కవిగా పేర్కొన బడ్డాడు. మహా కవుల సరసన చేర్చారు. చాటు పద్యాలలో ఈ కవి శ్లోకాలు విశేషంగా కనిపిస్తాయి. ఈ భట్టార హరిశ్చంద్ర కవి దిగంబర జైన మతానికి చెందినవాడు. తండ్రి ఆర్ద్ర దేవుడు. తల్లి రాధ. సోదరుడు లక్ష్మణ. వీరిది కాయస్తకులంలోని సనోముఖ కుటుంబం. ఈ కవి పాండిత్య ప్రకర్షకు 'సరస్వతీ పుత్ర' బిరుదం అందుకొన్నాడు. ఈ కవిని రాజశేఖరుడు 'కర్పూర మంజరి'లో పేర్కొన్నాడు. ఇతను 'ధర్మ సార మహాభ్యుదయం' అనే 21 ఖండాల కావ్యాన్ని పదిహేనవ తీర్ధంకరుడైన ధర్మనాధుని జీవిత చరిత్రగా రాశాడు. ఇందులో ధర్మపాలుని జననం నుండి నిర్యాణం దాకా వర్ణించాడు. నాయకుడైన ధర్మనాధుడు ఇక్ష్వాకు వంశానికి చెందిన రత్నపుర రాజు మహాసేనుడు. భార్య సువ్రతిల కుమారుడు. హరిశ్చంద్ర కవి కవిత్వం మాధుర్యానికి నిలయం. స్వచ్ఛమైన తేట యైనకవిత్వం రాశాడు.

భట్టార హరిశ్చంద్ర కవి 'జీవనాధార చంపు'ను కూడా 13 లంభాలలో జైన రాజు జీవనాధారుని జీవిత చరిత్రగా రాశాడు. ఈ జీవనాధరుడు సత్యంధర రాజు కుమారుడు. ఇందులో కవి ఉపయోగించిన భాష ఆకర్షణీయంగా, అత్యుత్తమంగా ఉందని విమర్శకులు కీర్తించారు. టి.ఎస్.కుప్పుసామి గారు ఈ కవి 'జీవనాధార చరిత్రం' అనే నాటకం కూడా రాశాడని తెలియ జేశారు.❀



## 21. సుశ్రుతుడు(6వ శతాబ్దం) (501-600)

**నూ**తన మిలీనియం సందర్భంగా 2000 సంవత్సరంలో బ్రిటన్‌లోని వైద్య శాస్త్ర అంతర్జాతీయ సంస్థ ప్రపంచ ప్రసిద్ధ శాస్త్ర చికిత్స వైద్యుల జాబితాను ఫోటోలతో సహా ప్రచురించింది. అందులో మొదటి పేరు ఆచార్య సుశ్రుతుడిదే. ఆయన పరి శోధనలు ప్రయోగ శాస్త్ర విద్యతోనే ప్రారంభమైంది.

సుశ్రుతుడు క్రీ.శ.ఆరవ శతాబ్దిలో జన్మించినట్లు తెలుస్తోంది. ఈయన విశ్వామిత్ర మహర్షి కుమారుడని అంటారు. ధన్వంతరికి ముఖ్యశిష్యుడు. సుఖ ప్రసవం కోసం శస్త్ర చికిత్స కూడా చేశాడు. మూత్ర పిండాలలో రాళ్ళను కూడా తొలగించే వాడు. విరిగిన ఎముకలు అతికించటంలో, కంటి శుక్లాలు తొలగించటంలో కృషి చేశాడు. ప్లాస్టిక్ సర్జరీ, రైనో ప్లాస్టీ అంటే ముక్కు నిర్మాణం ప్లాస్టిక్ శస్త్ర చికిత్సలో నిష్ణాతుడు సుశ్రుతుడు శస్త్ర చికిత్స మీద 'సుశ్రుత సంహిత ' అనే బృహత్ గ్రంథాన్ని రచించాడు. ఇందులో నూటొక్క శాస్త్ర పరికరాలను పేర్కొన్నాడు. ఇది ఇప్పటి శాస్త్ర వైద్యానికి మణి దీపంగా నిలుస్తోంది. ఈయన ప్రకృతి ఆరాధకుడు కూడా. జంతు వృక్ష ప్రపంచం మీద దృష్టి సారించి అమూల్య సమాచారాన్ని సేకరించి నిక్షిప్తం చేశాడు. భిన్న ఋతువులలో వాతావరణ పరిస్థితులలో ఆరోగ్యంగా ఎలా ఉండాలి అన్న వాటిని వివరించాడు.

ఒకసారి ఒక ప్రయాణీకుడు అడవి గుండా వెడుతుంటే ప్రమాద వశాన అతని ముక్కు తెగింది తెగిన ముక్కును చేత్తో పట్టుకొని దగ్గిరున్న సుశ్రుత ఆశ్రమానికి చేరాడు. ఆయన గమనించి ముందు నీటితో గాయాన్ని తుడిచాడు. దానికి మూలికా రసం అద్దారు సెప్టిక్ కాకుండా. ఒక గిన్నెడు మద్యం తాగించాడు. అతను స్పృహ కోల్పోగానే సూక్ష్మమైన కత్తులతో సూదులతో శస్త్ర చికిత్స చేశాడు. ఒక ఆకుతో ముక్కు కొలత కొలిచాడు చిన్న పదునైన వేడి చేసిన కత్తితో దవడ కండలో కొంత భాగం కోసి దాన్ని సరిగ్గా కావాలసినంతగా రెండు భాగాలు చేసి ముక్కు పుటాలలో అమర్చాడు. ముక్కు

ఆకారాన్ని సరి చేసి బియ్యపు పిండి, గంధంతో పట్టు వేశాడు. దాని మీద బూరుగు దూది పెట్టి, ఔషధ నూనె పోసి కట్టు కట్టాడు. రెండు రోజుల్లో ఆ వ్యక్తి తేరుకొన్నాడు. అతడు ఏ ఏ ఆహార నియమాలు పాటించాలో ఏయే మందులు వాడాలో సూచించాడు సుశ్రుతుడు.

సుశ్రుత సంహిత గ్రంథాన్ని ఎనిమిదో శతాబ్దిలో అరెబిక్ భాషలోకి 'కితాబ్ పాశూన్ – హింద్ ', కితాబ్ – సుస్రుద్' పేరా అనువదించారు. విరిగిన ఎముకలను సరి చేయటానికి అనేక రకాలైన కఱ్ఱ బద్దల వివరాలున్నాయి ఇదే 'శల్య తంత్రం'. మత్తు మందుగా మద్యాన్ని వాడే వాడు

పిస్తులా వ్యాధికి 'క్షార సూత్రా' చికిత్స చేసే వాడు మొలలు నాడీ వరణం మొదలైన వాటికీ దీన్ని ఉపయోగించేవారు. ఒక దారాన్ని తీసుకొని ఇరవై ఒక్క సార్లుక్షార ఔషధాలతో సమ్మిళితం చేయటాన్నే క్షార చికిత్స అంటారు దీన్ని వాడితే అయిదారు వారాలలో ఫిస్తులా మాయం.

అతి నైపుణ్యంగా శాస్త్ర చికిత్స చేయటానికి కొన్ని జంతువుల వెంట్రుకలను, బాగా ఎదిగిన వెదురు బొంగులను, కొన్ని ప్రత్యేక లక్షణాలున్న బెరడులతో చేసిన కుంచెలను ఉపయోగించేవాడు. సున్నితమైన అవయవాలను అతికించే ముందు ఏ మాత్రం వీలున్నా పూర్వ కర్మ చికిత్స అంటే 'ఫిజియో తెరపి' చేయాలని సూచించాడు. ఆయన వాడిన శస్త్ర పరికరాల వివరాలనూ వివరంగా వర్ణించాడు తన గ్రంథంలో సుశ్రుతుడు, చరకుడు చెప్పిన వైద్య విధానం క్రీస్తు పూర్వమే ఆగ్నేయ ఆసియా ఉత్తర ఆసియా, మధ్య ప్రాచ్యాలలో బాగా వాడుకగా ఉంది చరిత్ర కారుడు 'ఫరిస్తా' రాసిన చరిత్రలో పదహారు ప్రాచీన భారత వైద్య శాస్త్ర గ్రంథాలు ఎనిమిదో శతాబ్దం నాటికే అరబ్బులకు పరిచయమైనాయి. గర్భధారణకు అనువైన ఔషధాలు యవ్వనోత్సాహానికి మందులు సూచించాడు. ఆయన తయారు చేసిన 'ఫార్ సెప్స్', డిసేక్టింగ్ అండ్ డ్రెస్సింగ్ ఫొర్సేప్స్' ఈనాటి శాస్త్ర చికిత్సా సాధనాలకు మార్గ దర్శకలయ్యాయి. తెగిన ముక్కు పెదవులకు ప్లాస్టిక్ సర్జరీ చేసి అతికించిన మహానుభావుడాయన.

మహా రాష్ట్రలో పది హేనవ శతాబ్దంలోనే ఇటుకలు తయారు చేసే కాంగ్రా వంశీకులు ప్లాస్టిక్ సర్జరీలో సిద్ధ హస్తులయ్యారు. ఈ కుటుంబాలలో హకీమ్ దీనా నద కుటుంబం ఇరవైవ శతాబ్దంలో ఈ చికిత్స చేసిన చివరి కుటుంబం. బ్రిటీష్ వాళ్ళు ఈ దేశంలో బలపడిన తర్వాత ఈ చికిత్సా విధానాన్ని బ్రిటిష్ పాలకులు తెలుసుకొని 1794లో పాశ్చాత్య దేశాలకు తెలియ జేశారు. ఇదంతా సుశ్రుత మహర్షి కృషి ఫలితమే. ❋

## 22. గణక చక్రవర్తి చూడామణి- బ్రహ్మ గుప్తుడు (క్రీ.శ.598)

'గణక చక్ర వర్తిచూడామణి' అని బిరుదు పొందిన బ్రహ్మ గుప్తుడు గుజరాత్‌లో భిల్లమాల గ్రామం లో 598లో జన్మించాడు. ఆర్యభట్టు రాసిన ఖగోళ శాస్త్రంలోని గణిత విషయాలన్నీ క్షుణ్ణంగా పరిశోధించాడు. శూన్యం అంటే సున్నాను, అనంతం అంటే ఇన్‌ఫినిటి మొదట కని పెట్టాడు. భౌతికంగా ఇవి లేక పోయినా మానసికంగా వీటిని సృష్టించాడు. సున్నాను ఏ సంఖ్యతో హెచ్చించి నా సున్నాయే వస్తుందని, ఏదైనా ఒక సంఖ్యను సున్నాతో భాగిస్తే అనంతం వస్తుందని తెలిపాడు. దీనికే 'ఖహారం' అన్నాడు. దీన్ని ఈయన తరువాతి వాడైన భాస్కరా చార్య ఒక శ్లోకం లో నిబద్ధం చేశాడు. 'వాదా దౌవియత్ ఖం ఖేన దాతే -ఖహారో భవేత్ ఖేన భక్తశ్చ రాశిః'

బ్రహ్మ గుప్తుని ప్రతిభ ను గుర్తించిన వ్యాఘ్రముఖ మహారాజు తన ఆస్థానానికి ఆహ్వానించి, సన్మానించి ఆస్థాన పండిత గౌరవాన్ని కల్పించాడు. అప్పటిదాకా జీవనానికి చాలా ఇబ్బంది పడ్డ బ్రహ్మ గుప్తునికి పరిశోధనకు మహదవకాశం లభించింది. అంక గణితాన్ని బీజ గణితాన్ని మొదటిసారిగా రెండు ప్రత్యేక విభాగాలుగా గుర్తించిన ఘనత కూడా ఈయనదే. ఈయన శిష్యుడు భాస్కరాచార్య గురువును సత్కరించి 'గణక చక్ర వర్తి చూడామణి' బిరుదును ఇచ్చాడు.

12.23. The square-root of the sum of the two products of the sides and opposite sides of a non-unequal quadrilateral is the diagonal. The square of the diagonal is diminished by the square of half the sum of the base and the top; the square-root is the perpendicular [altitudes].[11]

He continues to give formulas for the lengths and areas of geometric figures, such as the circumradius of an isosceles trapezoid and a scalene quadrilateral, and the lengths of diagonals in a scalene cyclic quadrilateral. This leads up to

Brahmagupta famous theorem

గణితంలో ప్రత్యేక విభాగం అయిన 'న్యూమరికల్ ఎనాలిసిస్' అని పిలవ బడే 'అంక గణిత విశ్లేషణ' చేసిన మొదటి వాడు కూడా బ్రహ్మ దత్తుడే. సున్నా వినియోగంలో ఉపయోగించే సూత్రాలను నిబద్ధం చేసిన ఘనత ఈయనదే. అప్పటివరకు అందరుకష్ట సాధ్యం అని భావించిన అనే సమీకరణాన్ని సాధించింది బ్రహ్మ గుప్తుడే. అంటే గణితానికి బ్రహ్మ లా అన్నీ సృష్టించాడన్నమాట.

బ్రహ్మ దత్తుడు తన 30వ ఏట 'బ్రహ్మ స్పుట సిద్ధాంతం' అనే గ్రంథాన్ని రాశాడు. మొదటి సారి ఈయన కనిపెట్టిన 'దశాంశ పద్ధతి' క్రమంగా అన్ని దేశాలకు వ్యాపించింది. ఈ పుస్తకం ప్రపంచ గణిత శాస్త్రానికే కొత్త ద్వారాలు తెరిచింది. పాశ్చాత్య దేశాల అంకెల కంటే బ్రహ్మ గుప్తుని అంకెల విధానం శాస్త్రీయంగా ఉందని ప్రపంచం, ప్రపంచ గణిత మేధావులు మెచ్చుకొన్నారు. తన రెండవ పుస్తకం 'కరణ ఖండ ఖద్యక'లోను గణిత శాస్త్రానికే ప్రాధాన్యత నిచ్చాడు. అంక గణిత, బీజ గణిత మొదలైన విభాగాలపై ప్రాధమిక సిద్ధాంతాలు ఇందులో చేశాడు.

$ax+b=0, ax^2+bx+c=0$మొదలైన సమీకరణాలను పరిష్కరించాడు.

ఖగోళ శాస్త్ర అధ్యయనంలో, పరిశోధనలో ఆల్జీబ్రాను మొదట ఉపయోగించిన వాడుకూడా బ్రహ్మ గుప్తుడే. రెండవ గ్రంథంలో ఖగోళ గణితం విపరీతంగా ఉంది. అనేక కొత్త విషయాలు జోడించాడు. బ్రహ్మస్పుట సిద్ధాంత గ్రంథం దేశ విదేశాలలో మంచి పేరు తెచ్చుకోంది. ఇందులో 'శ్రేడులు (సర్డ్స్) జ్యామితి అనేక నిరర్ధారిత సమీకరణ సాధనా, వర్గ సమీకరణ సాధన మొదలైన ప్రతి సులభ విధానంలో ఉన్నాయి. బ్రహ్మ గుప్తుడు కనిపెట్టిన సున్నాను ఆరబిక్ భాషలో సిఫర్ అంటే, గ్రీకులో జిఫర్ అన్నారు. అదే ఇంగ్లీష్‌లో 'జీరో' అయింది. 'భాస్కరుడికి ముందే బ్రహ్మ స్పుట సిద్ధాంతం చాలా దేశాల్లో ప్రచారమైంది.

క్రీ.శ.770లో ఉజ్జయినిలోని ప్రముఖ గణిత పండితుడు 'కంక'భట్టును బాగ్దాద్ రాజ దర్బారుకు పిలిపించి ఆరబ్ పండితులకు భారతీయ అంకెల గణన పద్ధతిని నేర్పాడు. అప్పుడే బ్రహ్మ స్పుట సిద్ధాంత గ్రంథం అరబిక్ భాషలోకి

తర్జుమా అయింది. ఇలా ఏడవ శతాబ్ది పూర్వార్ధంలోనే భారతీయ అంకెలు, సంఖ్యామానం సిరియా అరేబియా, ఈజిప్ట్, క్రమంగా పాశ్చాత్య దేశాలకు వ్యాపించింది. అరేబియా నుంచి వచ్చిన అంకెలు కనుక పాశ్చాత్యులు 'ఆరబిక్ అంకెలు' అన్నారు. కాని ఆరబ్బులు మాత్రం 'హిందూ అంకెల విధానం'( ఆల్ ఆర్కాన్ ఆల్ హింద్)గా పిలుస్తారు.

సున్నాకు ఏ సంఖ్యను కలిపినా ఏ సంఖ్య నుండి సున్నాను తీసివేసినా ఏ మార్పు ఉండదు అని సూత్రీకరించాడు బ్రహ్మదత్తుడు. మొదట్లో బ్రహ్మ దత్తుడు ఏ సంఖ్యనైనా సున్నాతో భాగిస్తే సున్నాయే వస్తుందని పొరబడి చెప్పాడు. కాని అనంతం వస్తుందని తర్క శాస్త్ర నిబద్ధతతో పేర్కొనటం జరిగింది. పై విలువ10 యొక్క వర్గ మూలంగా నిర్ణయించాడు. ఫస్ట్ అండ్ సెకండ్ డిగ్రీ ఈక్వేషన్స్ సాధించాడు. 'ఫ్రస్టం ఆఫ్ పిరమిడ్ 'కు ఖచ్చిత విలువ కని పెట్టాడు. బీజ గణితంలో సంఖ్యలకు సంబంధించిన విషయాన్ని తెలుపుతూ వర్గ సమీకరణణాలను అందించాడు.

'కరణ ఖండ ఖద్యక 'గ్రంథంలో బ్రహ్మ గుప్తుడు ఆర్య భట సిద్ధాంతాలను గాఢంగా అధ్యయనం చేసి చాలా విషయాలు చెప్పాడు. భూమి గుండ్రంగా ఉందని భూమి స్థిరంగా ఉండక గమనం కలిగి ఉందని ఆర్య భట్టు కూడా చెప్పాడు. గురుత్వాకర్షణ గురించి విపుల చర్చ చేశాడు. భూమికి ఆకర్షణ ఉందన్నాడు. నీటికి ప్రవహించటం ఎలా సహజమో అలాగే భూమికి ప్రకృతిలోని అన్నిటిని ఆకర్షిస్తుందని వివరించాడు. ఇది ప్రకృతి సిద్ధంగా భూమికి ఉన్న విశిష్ట గుణం అన్నాడు. ఈయన వాడిన 'స్పుట' అన్న మాటకు పూర్వం ఉన్న అంశాలను సరి చేయటం అని అర్ధం చెప్పుకొన్నాడు. జీవితంలో చివరి భాగంలో 645లో కరణ ఖండ ఖాద్యరాశాడు. 648లో బ్రహ్మ గుప్తుడు బ్రహ్మైక్యం పొందాడు.

ప్రొఫెసర్ 'వాలెస్' అనే చారిత్రిక పరిశోధకుడు భారతీయుల గణిత, ఖగోళ విషయాలు చాలా నిర్దుష్టమైనవి అనీ, జ్యామెట్రీ, సూత్రాల నాధారంగా ఖగోళ రహస్యాలు సాధించారని ఇదంతా క్రీ.పూ 3,000. సంవత్సరాలకు ముందే సాధించిన భారతీయ విజ్ఞానం అని మెచ్చుకొన్నాడు. జ్యామెట్రీ అనేది ఇండియాలోనే

పుట్టిందని ఇది పాశ్చాత్య దేశాల వారి దృష్టి సోకని ఎంతో ముందు కాలంలోనే జన్మించిందని ఎన్నో 'ఎలిమెంటరి ప్రపోజిషన్లు' భారత దేశం నుండే గ్రీసుకు వ్యాపించాయని భారతీయ విజ్ఞులైన ప్రాచీన శాస్త్రజ్ఞులను ఆరాధనా భావం తో మెచ్చుకొన్నాడు వాలెస్.

**వైద్య శాస్త్రంలో మన భాగస్వామ్యం**

ప్రాచీన భారతంలో 'సిద్ధ వైద్యం' ప్రచారంలో ఉండేది. చరకుడు ప్రస్తావించిన వాటిల్లో ఇది కూడా ఒకటి. లోహాలను మందులతో మిశ్రమం చేసే ప్రక్రియే సిద్ధ వైద్యం. శతాబ్దాల బాటు ఇది ఎంతో మందికి ఉపయోగపడింది. ఈ వైద్యంలో మానవ శరీరాన్ని అయిదు భాగాలుగా పరిగణించారు. అంటే మానవ శరీర నిర్మాణం గురించి అప్పటికే వారికి పూర్తీ అవగాహన ఉందన్న మాట. దీని పుట్టుకలో మూడు సిద్ధాంతాలు ముఖ్యమైనవి. ఒకటి 'మెమోరియల్ కాంటి నెంటల్, రెండవది మెడిటేరెనియన్, మూడోది 'సౌత్ ఇండియన్'.

వేమోరియన్‌గా పిలువబడే హిందూ మహా సముద్రంలో ఒక ద్వీపం కాల గతిలో సముద్రంలో కలిసి పోయింది. మానవత్వ భావన మానవుడిలో ఏర్పడి యెంత ప్రాచీనమిందో అంత పాతది ఈ వైద్యం. దీనినే 'హీలింగ్ శాస్త్రం' అంటారు. అంటే స్పర్శ ద్వారా రోగ నిర్ధారణ చేయటం అన్న మాట. మానవ తోలి పుట్టుక ఈ ద్వీపంలోనే అని ఈ సిద్ధాంతం చెబుతోంది.

మెడిటరేనియన్ సిద్ధాంతంలో ద్రావిడులు ఇక్కడి వారే. ఆర్యుల బాధ పడలేక దక్షిణ భారతం చేరారు. వీరి ద్రుష్టి లోహ శాస్త్రంపై కేంద్రీకరించారు. దీనిద్వారా సిద్ధ వైద్యం ప్రచారమైంది.

సౌత్ ఇండియన్ సిద్ధాంతం – తమిళులు దక్షిణ భారతంలోనే ఆవిర్భవించారు. సిద్ధ వైద్యం ఇక్కడే పుట్టిందని చెబుతారు. ఈ వైద్యం ఇప్పటికి బ్రహ్మ పుత్రా లోయలో, తుంగ భద్ర లోయలో తమిళనాడులో అమల్లో ఉంది దీన్ని 'సిద్దా మెడికల్ సైన్స్' అంటారు.

సిద్ధ వైద్యం ఒక గొప్ప సంస్కార వైద్యం. మానవత్వ వికాస వైద్యం.

రోగుల్ని ఆత్మీయులుగా భావించే వైద్య విధానం. నాడిని పరీక్షించి రోగ నిర్ధారణ చేయటం ఇందులో విశేషం. మణి కట్టుకు అంగుళం కింద నాడి ఉంటుంది. ఆ భాగంలో మెత్తగా నొక్కితే మూడు నాడుల స్పందన తెలుస్తుంది మొదటి నాడిని వాత నాడి అని రెండో దాన్ని పిత్త నాడి అని, మూడవ దాన్ని కఫ నాడి అంటారు. ఈ నాడులు 4 2 1 నిష్పత్తిలో పని చేస్తాయి. వీటి కదలికలను బట్టి వ్యాధి నిర్ధారణ చేస్తారు.

ఈ సిద్ధాంతం ప్రకారం లోకంలో 4,448 రోగాలున్నాయి. అందులో నాలుగు వేల వరకు మనుష్యుల ద్వారా వ్యాపించేవే. సిద్ధ వైద్యంలో అనేక శ్రేణులు రకాలు ఉన్నాయి. కూరగాయలు, ఆకు కూరలు నుంచి 1008 రకాల మందులు, విష పదార్థాల నుంచి 64 మందులు, అనేక లవణాల నుంచి 28 లోహాల నుండి 9సేంద్రియ సమ్మేళనాల నుంచి 12 రకాల మందులు, ఇతర పదార్థాల నుండి మరి కొన్ని మందులు తయారు చేస్తారు.

శైవ మతం విజృంభించటం వల్ల సిద్ధ వైద్యం తెర మరుగైంది. ఈ వైద్యంలో ఎన్నో మర్మ సిద్ధాంతాలు, క్లిష్ట పదజాలం ఉన్నందున అందరికి అర్థం కాదు. ఈనాడు సిద్ధ వైద్య ప్రచారకర్తగా ప్రాచుర్యం పొందిన వారు డాక్టర్ చిదంబర నాద పిళ్లే. 44 తరాలుగా ఈ వైద్యం చేస్తున్న కుటుంబం వాడు. 4-3-1934లో కన్యాకుమారి జిల్లాలో ఎరినిఅల్ గ్రామంలో జన్మించిన ఈయన సిద్ధ వైద్యం మీద నాలుగు దశాబ్దాల పాటు పరి శోధన చేశారు. మద్రాస్‌లో 'సిద్ధా మెడికల్ లిటరేచర్ రి సెర్చ్ సెంటర్'ను 1955లో స్థాపించారు. మైసూర్, మద్రాస్, పూనా యూనివర్సిటీలలో 'ధానూలజి'లో పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లమో కోర్స్ ఏర్పాటు చేయించారు. 'వర్మం' (దానూలజి) మీద 32 సిద్ధాంతాలను పిళ్లేప్రతి పాదించారు ."దానూ ఫౌండేషన్ "స్తాపించి సిద్ధ వైద్యానికి గొప్ప ప్రచారం చేస్తున్నారు .

నాగరకతకు చిహ్నం చక్రం. మానవ నాగరకతను వేగవంతం చేసిన 'చక్రం' రూప కల్పన ప్రాచీన భారత దేశంలోనే జరిగింది. కాని పాశ్చాత్యులు మెసపొటేమియాలో చక్రం రూపు దాల్చిందని అంటారు. మన విష్ణుదేవుని ఆయుధం

'చక్రం' అన్న మాట అందరు మరచిపోయారు. అలాగే ఆయన చేతిలో ఉండే శంఖం శ్రమ శక్తికి ఆలంబనం. జన జాగృతిని చేసి కార్యోన్ముఖులను చేసేది శంఖం. శంఖమే 'సైరన్'గా మారిందేమో? మానవ జాతికి చక్రం రూపాన్ని సైరన్‌ను అందించింది భారతీయులే అని అర్థమవుతోంది.

బ్రహ్మ వర్చస్సు పెంచే 'యజ్ఞోపతి'

ప్రాచీన భారతీయ వైద్య విధానాల సమ్మిళితమైనదే 'యజ్ఞోపతి'. హరిద్వార్‌లో శాంతి కుంజ్‌లో 'బ్రహ్మ వర్చస్సు' పరి శోధనాసంస్త 'యజ్ఞోపతి'ని ఆవిష్కరించింది, ఇంటిగ్రేటెడ్ మెడిసిన్‌గా యజ్ఞోపతి ప్రచారమైంది.

వ్యాధి నివారణకు మూలికలను ఇస్తారు. మందులే వాడకుండా ఆరోగ్యవిధానం చెప్పే ఆహారపు అలవాట్లను అలవాటు చేయటంలో ఇందులో భాగం. 'డ్రగ్ లెస్ తెరపి' ఇందులో భాగమే. యోగా, ప్రకృతి వైద్యం, సిద్ధ వైద్యం, ద్రవ ఘన మందులు అవసరమైతే వాడుతారు. వాయురూపంలో మందులు ఇస్తే వ్యాధులు ఇంకా త్వరగా నయమవుతాయని భావించి ఆ విధానాన్ని ఉపయోగిస్తున్నారు.

యజ్ఞాలలో వాడే 'హవన ద్రవ్యాలు' వల్ల వచ్చే పొగ, మంత్రోచ్చారణ వల్ల శబ్ద వాయు తరంగ కాలుష్యం నివారింపబడుతుంది. హిమాలయ ప్రాంతంలో అనేక ప్రక్రుతి సిద్ధ వన మూలికలున్నాయి. అవి ఎన్నో వ్యాధులకు ఉపయోగ పడతాయి. బ్రహ్మ వర్చస్సు పరిశోధనా సంస్తదీన్ని నిరూపించింది. మందు వాయు రూపంలో ఊపిరి తిత్తుల ద్వారా చర్మం ద్వారా శరీరంలోకి ప్రవేశించి మానసిక శారీరక రుగ్మతలను నివారిస్తుంది.

అగ్ని హోత్రమే ఒక ప్రాధమిక చికిత్సా విధానం. 'వాతావరణానికి చికిత్స జరిగితే అది మిమ్మల్ని స్వస్త పరుస్తుంది' అనేది యజ్ఞోపతి ప్రధాన సూత్రం. వాతావరం, ప్రాణం, మనస్సు ఒక దాని మీద ఒకటి ఆధార పది ఉంటుంది. 'రహ్మవర్చస్సు'లో 450 రకాల ఔషధాలు, మూలికలు ఉన్నాయి. ఒక ప్రయోగశాలలో ఒక గాజు గదిలో 'హవాన కుండ'ను ఏర్పాటు చేశారు. దానికి కలుపుతూ, ఒక వాయు విశ్లేషణ విభాగం ఉంచారు. యజ్ఞంలో ఉత్పత్తి అయిన

వాయువులను సేకరించి విశ్లేషణ చేయటానికి ఇది ఏర్పాటైంది. రక్తంలో వివిధ భాగాలు, రకరకాల గ్రంధులు వాటి పని తీరు యజ్ఞానికి ముందు, యజ్ఞం తర్వాత విశ్లేషించారు. సత్ఫలితాలు వచ్చాయి. మనుషుల మీదే కాక పశు పక్ష్యాదుల మీద కూడా వృక్షాల మీద కూడా ప్రయోగాలు చేయటం గమనార్హం. అందుకే యజ్ఞాలు చేయమని వీరు హితవు చెబుతారు. సామూహికంగా చేస్తే 'యజ్ఞం' అవుతుంది. వ్యక్తిగతంగా చేస్తే 'అగ్ని హోత్రం' అవుతుంది. ప్రతి ఇంట్లో వీటిని చేసుకొంటే ఇంటి వాతావరణం శుభ్రపడి అందరి ఆరోగ్యాలు బాగుపడి వాతావరణ కాలుష్యమూ నిర్మూల మవుతుంది. ఇదీ ప్రాచీన కాలంలో మన వాళ్ళు చేసిన యజ్ఞ సూక్ష్మం.❀

## 23. పద్మపురాణం రాసిన రవిసేన ఆచార్య (650)

క్రీ.శ. 678లో పద్మపురాణాన్ని రవిసేనాచార్యుడు రాసాడు. జినసేనుడు తన హరివంశ పురాణంలో రవిసేనుని గురించి వివరించాడు. పద్మపురాణం ప్రాచీన జైన విధానంలో రాయబడిన రామాయణ కథ అని చెప్పాడు. పద్మపురాణంలో జరిగిన సంఘటనలు 16వ జైన తీర్థంకరుడైన సామ్తినాధుని కాలంలో జరిగాయని భావిస్తారు. ఇందులో రామకథకు వాల్మీకి రామకథకు చాలా తేడాలున్నాయి. ఇందులో రామ రావణులు ఇద్దరూ జైనమతాన్ని అనుసరించారని లక్ష్మణుడు శత్రుఘ్నునికి పూర్తిగా తమ్ముడు కాదని దశరధుని నాల్గవ భార్య సుప్రభకు జన్మించాడని రాయబడింది. సీత సాధారణ స్త్రీగానే విదేహ రాణికి జన్మించిందని దశరధుడు రాముడిని అరణ్యవాసానికి పంపగా ఏర్పడిన శోకంతో చనిపోలేదని ప్రపంచంలోని పరిస్థితికి విసిగి వేసారి అరణ్యాలకు చేరి తపస్సు చేసుకున్నాడని చెప్పబడింది. వాలి సుగ్రీవ హనుమంతులు వానర జాతివారు కాదని అరణ్య దేశాల పరిపాలకులని ఉంది. రాముడు వాలిని చంపలేదు. వాలి తమ్ముడు సుగ్రీవుని కోసం రాజ్య త్యాగం చేసి సన్యాసిగా మారాడు. రావణుడు బ్రాహ్మణుడు కాదు, క్షత్రియుడు. రాముని చేతిలో మరణించలేదు. లక్ష్మణుని చేతిలో చనిపోయాడు. లక్ష్మణుడు ప్రయోగించిన శక్తి ఆయుధానికి మూర్ఛపోయి హనుమంతుడు తెచ్చిన సంజీవని వలన కాక వైశాల్య అనే స్త్రీ వలన మూర్ఛ నుండి తేరుకున్నాడు. ఆ తర్వాత ఈమె లక్ష్మణుని భార్య అయ్యింది. ❁

## 24. మనం మరచిపోయిన కవయిత్రులు (659)

**ఋ**గ్వేదములో ఎందరో విదుషీమణులు, రచయిత్రులు ఉన్నట్లు తెలుస్తోంది. అలాగే ఆత్రేయ కుటుంబంలో విశ్వవార, అపాల మొదలయిన సంస్కృత కవయిత్రులు ఉన్నారు. కక్షీవత్ కుటుంబములో ఘోషా అనే కవయిత్రికి గొప్ప పేరు ఉంది. ఆమె కక్షివంతుని కుమార్తె. ఆమె తనను రాజకుమారిగా చెప్పుకొన్నది కనుక తండ్రి రాజు అయి ఉంటాడు. చాలా కాలం వివాహం చేసుకోలేదు. అశ్వినీ దేవతల అనుగ్రహం వలన వరుడు లభించాడు. జగతీ ఛందస్సులో సులభ శైలిలీ చాలా కవితలు రాసింది. జూహూ శాశ్వతి, మాన్ధాత్రి మాధవీ, శశి ప్రభ అనులక్ష్మి రేవ పహోయీ, రోహ మొదలైన వారంతా కవయిత్రులు. దార్శనికులు అనేక మంత్రాలను రాసారు. అశ్వలాయనుడు గార్గి వాచక్నవి బాడవ ప్రాతి, హెయి మొదలయిన వారు ప్రాచీన కవులు, ఋషులు. అనుక్రమణిలో అగస్త్యుని భార్య లోపాముద్ర కవయిత్రిగా పేర్కొనబడింది. రాజశేఖరుడు సీత విజయామ్క లేక విజ్జిక, సుభద్ర, ప్రభుదేవి, వికట నితంబల గురించి పేర్కొన్నాడు. సీత గొప్ప ఊహా కవయిత్రి. సుభద్ర గొప్ప కవితావేశం కలిగినది. మోరిక, మారుత గొప్ప భావుకత కలవారు. విజ్జికను సరస్వతీ స్వరూపంగా భావిస్తారు. కానీ నల్లగా ఉండేది. ఈమె చంద్రాదిత్య భార్య. కొడుకు రెండవ పులకేశి. వీరి కాలం 659.

రాజశేఖర చరిత్రలో కామలీల, సునంద, కనకవల్లి, మధురాంగి, లలితాంగి, విమలాంగి కవయిత్రుల పేర్లు కన్పిస్తాయి. కొన్ని చాటువులలో జఘన చపాల, అవిలంబిత సరస్వతి, ఇందులేఖ, కుంతీదేవి, చండాల విద్య, మాగమ పద్మావతి మదాలస రజక సరస్వతి, లక్ష్మీ, వీర సరస్వతి, సరస్వతి, సీత మొదలయిన మహిళా కవుల గురించి ఉన్నది. వీరందరినీ మనం మరచిపోయాం. అందుకే వీరిని విస్మృత సంస్కృత కవులు అనవచ్చు.❁

## 25. "జయ మంగళ వ్యాఖ్యకర్త" యశోధరుడు (700-800)

**"జ**యమంగళ" అనే వ్యాఖ్యానం రాసినది యశోధరుడు కాదని శంకరుడు లేక శంకరాచార్య అని ఒక కథనం ఉంది. చాణుక్యుని అర్థశాస్త్రంపై, కామనందకి నృత్యశాస్త్రం పైనా, భట్టికావ్యం మీద, ఈశ్వరుని "సాంఖ్యాయన సప్తశతి"పైనా వ్యాఖ్యానాలు రాసింది శంకరుడు. యశోధరుడు లేక ఇంద్రసేనుడు ఒక రాయసకాడు మాత్రమే అంటారు. శంకరుడు ఎవరో తేలలేదు. కాని వ్యాఖ్య మాత్రమ కొక్కోకం కంటే తరువాతి కాలానిది. పదమూడవ శతాబ్దికి ముందు రాసింది మాత్రం కాదు. శంరుడు కామసూత్రాలకు వ్యాఖ్యానం రాశాడు. యశోధరుడు ఏడు ఎనిమిది శతాబ్దాల మధ్యవాడు. ఇతడు ఒక సామంత రాజని, గురువు "ఇంద్ర పదుడు" అనే బిరుదిచ్చాడని ఒక కథ ఉంది. వ్యాఖ్యావతారికలో తానను బాగానే సమర్థించుకొన్నాడు. ❁



## 26. చరక మహర్షి (800)

**మా**నవ ఆరోగ్యం అతను తీసుకొనే ఆహారం మీదనే ఆధార పడుతుందని తెలుసుకొని 'చరక సంహిత' అనే గ్రంథాన్ని రాసినవాడు చరక మహర్షి. శారీరక అవసరాలకు కావలసిన శక్తిని ఆహారం ద్వారానే పొందాలని చెప్పాడు. విజ్ఞతతో ఆహారం తీసుకోవాలి అనుకొనే వారు పన్నెండు రకాల ఆహార వర్గాలను గురించి తెలుసుకోవాలని వాటిని వివరించాడు. గింజలు, పప్పులు మాంసం, ఆకుకూరలు, పండ్లు, పచ్చని కూరగాయలు, మద్యం నీళ్ళు, చెరకు రసంతో తయారైన ఆహారం, వండిన ఆహారం, పాల పదార్థాలు ఇతర తిని బండారాలు గురించేకాక, అనేక సంప్రదాయ వైద్య చికిత్సలను కూడా తన గ్రంథంలో రాశాడు.

చరకుడు ఏ కాలం వాడో స్పష్టంగా తెలియదు. కాని ఆయన రాసిన సంహిత మాత్రం క్రీ.శ.987లో పర్షియన్, అరెబిక్ భాషలలోకి అనువాదమై పోయింది. దానిని 'భేళ' అనే ఆయన రాసినట్లు చెబుతారు. చరక మహర్షి క్రీ.శ.800వాడు అని అందరి నిర్ధారణ. చరకుడు చెప్పిన వైద్య విషయాలకు మూలం ఋగ్వేదంలో అధర్వ వేదంలో ఉచరక సంహిత ఎనిమిది ప్రకరణాలతో నూట ఇరవై అధ్యాయాలతో ఉన్న గ్రంథం. సూత్ర స్థాన, నిదాన స్థాన, విమాన స్థాన, శరీర స్థాన, చికిత్సస్థాన, కల్పస్థాన, సిద్ధి స్థాన అనేవే ఎనిమిది ప్రకరణలు. ప్రతి అధ్యాయంలో విపులంగా ఆరోగ్య రక్షణ, వ్యాధుల చికిత్సలను సూచించాడు. కాలు విరిగితే ఇనుప కాలు అమర్చే విధానం చెప్పాడు. అంధత్వం పక్షవాతం, కుష్టు, మూర్ఛస్, రాచపుండు అనే కేన్సర్ మొదలైన దీర్ఘ వ్యాధులకు సులభ నివారణోపాయాలు వివారించాడు.

'జీవేమ శరదశ్శతం' అన్న వేద వాక్యాన్ని ఉదాహరిస్తూ నిండు నూరేళ్ళు మానవుడు హాయిగా ఆరోగ్యవంతంగా జీవించాలని కాంక్షిస్తూ 'చరక సంహిత'

రాశాడు. ఆయన పూర్వ నామం 'మహర్షి పునర్వసు' కాని ఆయన రచించిన గ్రంథం పేరు చరక శాస్త్రమని కొందరు భావిస్తారు. పునర్వసు మహర్షికి ఒక రోజు ఒక కోరిక కలిగింది. మారువేషంలో నగరంలో సంచరిస్తూ 'కొ అరుగ్' అంటే ఆరోగ్యం లేని వారెవ్వరూ? అని ప్రశ్నించటం ప్రారంభించాడట. అప్పుడు ఒకాయన 'చ్యవన ప్రాస' తిన్నవారెప్పటికీ రోగ గ్రస్తులు కారు అని జవాబు చెప్పాడట. ఇంకోడు 'చంద్ర ప్రభావతి' తింటే రోగాలు రావన్నాడు. వేరొకరు 'వంగ భస్మం' అన్నారు. కొందరు భాస్కర లవణం అని నిర్మొహమాటంగా చెప్పారు. అప్పుడు ఇవన్నీ విన్న పునర్వసుకు ఏడుపొచ్చినంత పని అయింది. తాను ఎంతో కష్టపడి వేదాల నుంచి అనేక విషయాలు సేకరించి వైద్య శాస్త్రం రాస్తే ఎవరూ అర్థం చేసుకోలేకపోయారని బాధపడ్డాడు. ఇంతలో ప్రాచీన విద్యాచార్యుడు 'వాగ్భటుడు' నదీ స్నానం చేసి వస్తున్నాడు. మళ్ళీ పునర్వసు అదే ప్రశ్న వేశాడు. అప్పుడు వాగ్భటుడు 'హిత భుక్తిః మిత భుక్తిః రుత భుక్తిః' అన్నాడు. అప్పుడు పునర్వసు ఆనందంతో తన సంహితను మూడు ముక్కల్లో స్పష్టంగా చెప్పిన వాగ్భాటుడిని ప్రశంసించాడు.

చరకుడు తన వైద్య విధానంలో 'పాదరసం'ను వాడాడు. ఇది మహా గొప్ప విషయమని వైద్య శాస్త్ర వేత్తలు అంగీకరించారు. శరీరంలో వాత, పిత్త, కఫాలు సమ తుల్యంలో లేకపోతే అస్వస్థత చేస్తుందని చెప్పాడు. ధాతు లోపం వల్ల ఏ ఏ వ్యాధులు రావచ్చో వివరించాడు. చరక సంహిత 'మహా వైద్య విజ్ఞాన సర్వస్వం' అంటారు అందరు. దీనిపై విపుల పరిశోధన చేసిన వారు నారదత్త , చక్ర పాణి, శివదాస, వైన దాస, ఈశ్వర సేన మొదలైనవారు. చరక సంహిత ఆధారంగానే యునానీ వైద్యం ప్రారంభమయింది.

జన్యు శాస్త్రంలో కూడా చరకుని ప్రవేశం కనిపిస్తుంది. లింగ నిర్ధారణ విషయమై అనేక దృష్టి కోణాలను ఊహించి చెప్పాడు. శిశువు మూగ, గుడ్డి, చెవిటిగా జన్మిస్తే అది తలి దండ్రుల దోషం కాదని వారి శుక్ల శోణితాలదే దోషమని చెప్పాడు. ఇవి జన్యు శాస్త్రానికి మూలాలు అయ్యాయి. ఇరవై శతాబ్దాల క్రితమే ఈ విషయాలను తెలియజేసిన మేధావి చరకుడు. మానవ శరీరంలో మూడు వందలఅరవై ఎముకలున్నాయని నిర్ధారించి చెప్పాడు. గుండెకు సంబంధించిన వ్యాధులను వాటి చికిత్సా విధానాలను కూడా తన గ్రంథంలో చర్చించాడు. ప్రాచీన వైద్య శేఖరుడు 'ఆత్రేయ మహర్షి' మార్గ దర్శకత్వంలో అగ్ని వేశుని బోధలు,

రచనలను వృద్ధి చేసిన ఫలితంగా తన సంహిత పరిపుష్టి చెందిందని చరకుడు పేర్కొన్నాడు. సుశ్రుతుడు చరకుడు, వాగ్భటుడు అందజేసిన మూలికా విశిష్టత ద్వారా పన్నెండు అత్యంత ప్రధాన దేశాలలో భారత దేశం మొదటి స్థానంలో ఉంది. మన దేశ వ్యాప్తంగా ఉన్న మొక్కలలో నలభై శాతం వరకు ఔషధ ప్రయోగాలకు ఉపయోగ పడతాయని ఆధునిక వైద్య శాస్త్ర వేత్తలు అభిప్రాయ పడ్డారు. ఇతర దేశాలలో ఈ సగటు కేవలం పన్నెండు శాతమే.

చరక సంహితలో 'స్మృతి భ్రంశం, ధృతి భ్రంశం, బుద్ధి భ్రంశం' గూర్చి ప్రస్తావన ఉంది. న్యూరోసిస్, డిప్రెషన్, యాన్జైటీ, స్కిజోఫీనియా, ఎపిలేప్సి, ఉన్మాదంలకు ఏ ఇతర ప్రభావం చూపని గొప్ప వైద్య చికిత్సను సూచించాడు. సర్ప గ్రంధి, బ్రాహ్మీ, జటామూసి, వచ్చా, స్వర్ణం, తగరాలను ఔషధాలుగా వాడే పద్ధతి తెలిపాడు. తలంటి, శిరో వసతి, శిరో తాపం, అంజన కర్మ, సస్య కర్మ మానసిక వ్యాధులకు గొప్ప చికిత్సలని చెప్పాడు.

చరక సంహిత అనంతర కాలంలో 2 ఆయుర్వేద గ్రంథం'గా రూపుదాల్చింది. ఆరోగ్య వంతుడి లక్షణం 'సమ దోషః సమాగ్నిస్చ, సమధాతు మల క్రియః – ప్రసంన్నాత్మే ఇంద్రియ మనః శ్వాసతో ఇత్యభి దీయత్' అంటే వాతం పిత్తం కఫం అనే మూడు దోషాలు, సప్త ధాతువులు, మల విసర్జన మొదలైనవన్నీ సమతుల్యంగా ఉండటంతో బాటు, ఆత్మ, ఇంద్రియాలు మనస్సు మొదలైనవి ప్రసన్న స్తితిలో ఎవరిలో ఉంటాయో వారే ఆరోగ్య వంతులు. చరక సంహితలోని మూడు ముక్కలేమిటో తెలుసుకొందాం.

మొదటిది – హిత భుక్తి –మనం తినే ఆహారం మన శరీరానికి మేలు చేసేదిగా ఉండాలి. తినటానికే జీవించ రాదు. జీవిస్తున్నాం కనుక తినాలి. మనం తినే ఆహరం వల్ల శారీరక మానసిక ఆరోగ్యాలకు ఏది ప్రయోజన కరమో దాన్నే తినాలి.

రెండోది – మిత భుక్తి – శ్రేష్టమైన తాజా ఆహారాన్నే మితంగా తినాలి. అతిగా తింటే తీపి కూడా చెడు అవుతుంది. సమంజసంగా తృప్తిగా తినాలి. హితమైంది మితంగా తినటం శ్రేష్టం.

మూడోది – రుత భుక్తి – జీవితాన్ని సఫలీకృతం చేసే మంచి ఆహారాన్ని తినాలి. న్యాయంగా సంపాదించినవే తినాలి. అప్పుడే శారీరక ఆరోగ్యంతో బాటు మానసిక ఆరోగ్యం కూడా వర్ధిల్లుతుంది.❋

## 27. శివస్వామి (855-884)

**'క**ప్ఫానాభ్యుదయం' అనే ఒకే ఒక కావ్యం రాసిన శివస్వామి కవి. కాశ్మీర్ రాజు అవంతివర్మ ఆస్థానంలో ఉండేవాడు. కాలం క్రీ. శ.855-884. బౌద్ధ ధర్మావలంబి.బౌద్ధం అంటే వీరాభిమానం. పైన పేర్కొనబడిన కావ్యం బుద్ధుని స్తుతితో ఆరంభమవుతుంది. ఇరవై కాండలున్న ఈ కావ్యంలో దక్షిణాపథ రాజు కప్ఫాన చేసిన దండయాత్రల వర్ణనలున్నాయి . శ్రావస్తి రాజు ప్రసేన జిత్తు రాజ్యం పై సాగిన దండ యాత్ర ఇది. ఈ యాత్ర మలయ పర్వతాల ద్వారా జరుగుతుంది. యాత్రమధ్యలో అనేక ఋతువులు గడిచిపోతాయి. సిల్వన్ అందాలు ప్రేమికుల సరసాలు అన్నీ ఇందులో కవి వర్ణించాడు. యుద్ధంలో విజయం సాధించినా, కప్ఫాన వేదాంత ధోరణిలో పడిపోయాడు. ప్రపంచ బంధాల నుండి విముక్తుడై ప్రశాంత పవిత్ర జీవితం గడిపాడు. బుద్ధ భగవానుని శిష్యునిగా మారి నిర్వాణ సుఖం పొందాడు.

శివ స్వామి కావ్యం మాఘుని శిశుపాల వధ కావ్యాన్ని, కిరాతార్జునీయాన్ని పోలి ఉంది. యమకాల గమకాల సొగసు చూపించాడు. బంధ కవిత్వంలోనూ ప్రజ్ఞ చూపాడు. కాని కావ్యం పూర్తిగా లభ్యంగా లేదు.❋

## 28. హృదయ దర్పణం రాసిన - భట్టనాయకుడు (855-884)

**భ**ట్టనాయకుడు భారతంపై 'హృదయ దర్పణం' రాశాడు. అభినవ గుప్తుడు, జయ రథుడు ఈ కవి శ్లోకాలను ఉదాహరించారు. ఇది అలంకార గ్రంథం ఇందులో భట్టు, రసమే మంచి కవిత్వానికి సారం, గుర్తింపు అన్నాడు. ధ్వనికి దీనికి సంబంధం లేదు అన్నాడు. అందుకే అభినవ గుప్తుడు, రుయ్యకుడు దీన్ని వ్యతిరేకించారు. 855-884 కాలపు అవంతి వర్మ రాజు ఆస్థానంలో కాశ్మీర్ రాజు శంకర వర్మ ఆస్థానంలో భట్టు ఉండి ఉంటాడు. 'భామహాలంకారం'పై విస్తృత వ్యాఖ్యానం రచించాడు. న్యాయ శాస్త్రంపై భట్టుకున్న పట్టును అభినవ గుప్తుడు పేర్కొన్నాడు.❋

## 29. అభిదా వృత్తి మాత్రుక రాసిన - ముకుళ(855-894)

**భ**ట్ట కల్లటుని కొడుకు ముకుళ. కాశ్మీర్ రాజు అవంతీ వర్మ ఆస్థానంలో 855-884 కాలంలో ఉన్నాడు. 'అభిదా వ్రుత్తి మాతృక' రాసి అక్షరాల ఉత్పత్తిని గూర్చి వివరించాడు. ఇతని కొడుకు హర్శతుడు 'జయ దేవ ఛందస్సు'పై వ్యాఖ్యానం రాశాడని అభినవ గుప్తుడు నాట్య శాస్త్ర వ్యాఖ్యానంలో తెలియజేశాడు.❀

## 30. జిన సేన కవి (897)



**జి**నసేనకవి వీరాచార్య శిష్యుడు. వీరాచార్య సుభద్రుడు, లోహార్యుల కాలం లో ఉన్న పవిత్ర గ్రంథలకు అధిపతి. శ్వేతాంబర జైన మతానికి ఆచరణాంగాల్లో నిష్ణాతుడు. వీరాచార్యుడు, శిష్యుడు జిన సేన కవి ఇద్దరు కలిసి రాష్ట్ర కూట రాజు అమోఘ వర్మను జైన మతంలోకి మార్చారు. రాజు సర్వ సంగ పరిత్యాగం చేసి రాజ్యాన్ని కుమారుడికి 875లో పట్టాభిషేకం చేశాడు. వీరాచార్యుడు రాజుకు సన్నిహితుడై 'గణిత సార సంగ్రహం'లో ప్రశస్తి చేశాడు.

గుణ సేనుడి శిష్యుడు గుణ భద్రుడు అకాల వర్షకు చెందిన రెండవ కృష్ణరాజుకు ఆచార్యుడు. జిన సేనుడు అమోఘ వర్మ మనవడు మొదటి కృష్ణ రాజు కాలంలో 'పార్శ్వాభ్యుదయం'ను 814లో రాశాడు. ఆది పురాణంలో జినసేనుడు 42 అధ్యాయాలు రాశాడు. చివరి అయిదు అధ్యాయాలను శిష్యుడు గుణ భద్రుడు పూర్తి చేశాడు. ఈ విషయాన్ని ఉత్తర పురాణంలో చెప్పాడు. దీన్ని లోకసేన కవి రాష్ట్ర కూట రాజు రెండవ కృష్ణుడి కాలం అకాల వర్షలో 897 జూన్‌లో రాశాడు. పార్శ్వాభ్యుదయం కాళిదాసమేఘ సందేశానికి అనుకరణ. కాళిదాసు శ్లోకంలోని చివరి పాదాన్ని గ్రహించి మిగిలిన మూడు పాదాలు తాను కూర్చాడు. 23 వ జైన తీర్థంకరుడైన పార్శ్వనాధుని చరిత్రే ఇది. జిన సేనుని కవిత్వం ఉన్నత సంప్రదాయంలో ఉండి విశిష్ట గుణ గరిష్టంగా ఉంటుంది. కాళిదాసు కవిత్వానికి సరి సమానంగా ఉంటుంది. కాని కాళిదాసును మించి మాత్రం కవిత్వం ఉండదు.❀

## 31. యుధిష్టిర విజయం రాసిన వాసుదేవ కవి (900)

**వా**సుదేవకవి 'రవి' కుమారుడు. మహా భట్ట భట్టాత్రి అనే భారత్ గురువుకు శిష్యుడు. తిరువాన్నూర్‌లో విపర సత్తామలో ఉండేవాడు. మలబారు తీరం కథనం ప్రకారం తన గురువు గారి శిష్యులు చదివే పురాణాలను శాస్త్రాలను వినటం అంటే వాసు దేవుడికి ఇష్టంగా ఉండేది. కాని చదువుకోవాలని ఉన్నా శబ్దాలను సరిగ్గా పలికే వాడు కాదట. 'వాసు' అనటానికి బదులు 'వాతు' అని పలికే వాడు. ఒక రోజు తిరువలక్కావు దేవాలయం నుండి వాసుదేవ ఇంటికి తిరిగి వస్తూ ఉంటే విపరీతంగా వర్షం కురిసింది. ఒక బోటు ఎక్కి సుళ్ళు తిరుగుతున్న వరద నీటి ప్రవాహం దాటే ప్రయత్నం చేశాడు. కాని అసాధ్యం అని భావించి మళ్ళీ దేవాయానికే చేరుకొన్నాడు. అక్కడే ఆ రాత్రి గడిపాడు. బయట వర్షం తీవ్రంగా కురుస్తూనే ఉంది. ఒంటిమీద తడిసిన పంచె తప్ప ఏమీలేదు. ఆకలి విపరీతంగా ఉంది. తన ఇలవేలుపైన ఆ దేవిని ప్రార్థించాడు. దయతో చలికాచుకోవటానికి కట్టెల మంట ఏర్పరచింది దేవి. తినటానికి కొన్ని అరటి పళ్ళు కూడా ప్రసాదించింది. ఆ పళ్ళు తినగానే వాసుదేవునికి మహా గొప్ప కవిత్వం ఆశుధారగా వచ్చేసింది. మహాకవి అయిపోయాడు. ఉదయమే వచ్చిన దేవాలయ పని మనిషి అది గమనించి అతనిని అరటి తొక్కలను ఎక్కడ పారేశాడో తెలుసుకొని వెళ్ళి తెచ్చుకొని తినేసింది. ఆశ్చర్యంగా ఆమె నోటి వెంబడి అమోఘమైన కవిత్వం జాలు వారింది. కవయిత్రి అయిపోయింది. ఆ తర్వాత రాజా కులశేఖర, రాజా రాముల ఆస్థానంలో వాసుదేవ కవి తొమ్మిదవ శతాబ్దంలో ఉన్నాడు.

దేవి కృపతో మహాకవిఅయిన వాసుదేవ 'యుదిష్టిర చరితం' అనే ఎనిమిది కాండలలో ఆర్యా వృత్త శ్లోకాలలో కావ్యం రాశాడు. అందులో తన రాజు కులశేఖరుడు అని తెలియజేశాడు. పాండురాజు వేటతో ప్రారంభించి ధర్మరాజు పట్టాభిషేకంతో కావ్యం ముగించాడు. అక్షింబ శిష్యుడైన చొక్కనాధుడు దీనికి వ్యాఖ్యానం రాశాడు. శ్రీరంగానికి దగ్గరలో ఉన్న శాతనూర్‌కు చెందిన సుదర్శన కూడా ఈ కావ్యంపై వ్యాఖ్య రాశాడు.

శౌరికాధోదయ, త్రిపురదహనం కావ్యాలలో రాజు రామ అని పేర్కొన బడింది. మొదటి కావ్యం శ్రీకృష్ణుని జననం నుండి బాణాసుర వధ వరకు ఉన్న శ్రీ కృష్ణ కథ. దీనికి హరివంశం మూలం. నీల కంఠుడుదీనికి వ్యాఖ్య రాశాడు. ఇతడు ముక్తిస్తలానికి చెందిన ఈశానుని కుమారుడు. రెండవ కావ్యం త్రిపురాలను దహించిన శివ గాథ. దీనికి నిత్య ప్రియుడు అని చెప్పుకొన్న కవి వ్యాఖ్యానం రాశాడు. వాసుదేవుడు రాసిన ఈ మూడు కావ్యాలు యమకంలో ఉండి బాగా రాణించాయి. ఇటీవలి పరిశోధనలలో కాళిదాసు రాసినట్లు భావిస్తున్న 'నలోదయ' కావ్యాన్ని కూడా వాసుదేవ రచించి ఉంటాడని భావిస్తున్నారు. ❁

## 32. రామచరిత్ర రాసిన అభినందన (900)

సదానందుని కుమారుడైన అభినందుడు ఉదయసుందరి అనే కావ్యంలో సోద్దాలుడు అనే కవి అభినందన కవిని రాజశేఖరుడిని అబినందించాడు. దీనివలన అభినందన తర్వాతి వాడే రాజశేఖరుడు అని తెలుస్తోంది. పదకొండవ శతాబ్ది పూర్వార్ధంలో సోద్ధాలుడు జీవించి ఉన్నాడని యువరాజహరవర్ష అతనికి ఆశ్రయమిచ్చాడని, మహాగౌరవంగా చూసుకొన్నాడని తెలిసింది. కవి గొప్పతనాన్ని గుర్తించి హరవర్ష అర్థ సింహాసనాన్ని అందించాడనీ కథనం. సోద్ధాలక, అభినందలు రాజా హరవర్షను విక్రమాదిత్య, హాల శ్రీ హర్షలతో పోల్చారు. అభినందన రాసిన రామ చరితలో హర హర్షను యువరాజ దేవునిగా, విక్రమాదిత్యుని కుమారుడిగా, పాలవంశ భీజమైన ధర్మపాలుని సంతతి వానిగా చెప్పాడు.

బెంగాల్ చరిత్రలో పాలవంశ రాజు ధర్మపాలుగు ప్రసిద్ధుడు. అతని ఇద్దరు కొడుకులు త్రిభువన పాల, వేదపాలలు. మాన్ఘీర్ చరిత్రలో త్రిభువన పాలుడు యువరాజుగా పేర్కొనబడింది. కాని తండ్రి తర్వాత దేవపాలుడే రాజ్యానికి వచ్చాడు. తొమ్మిదవ శతాబ్దపు రెండవభాగంలో దేవపాలుడు ఖ్యాతి పొందిన రాజు అయ్యాడు. రాజా దేవపాలుడే యువరాజు హర వర్ష అని రామసామి శిరోమణి పరిశోధనలో తేలింది. ఇతడే యువ రాజ దేవుడు. పాల వంశపు వాడికి హర వర్ష అనే కొత్త పేరు ఎలా వచ్చింది అనే సందేహం ఉంది. దీనికి సమాధానమూ చెప్పారు. ధర్మపాలుగు రాష్ట్ర కూట రాచకన్య కామదేవిను పెళ్ళి చేసుకొన్నాడు. రాష్ట్ర కూట రాజులకు పేరు చివర హర్ష అని టాగ్ తగిలించుకోవటం ఒక ఫాషన్. అందుకే అత్తవారింట్లో ఉన్నప్పుడు దేవపాలుడి పేరు హర వర్షగా

వాళ్ళు పిలుచుకోవటం ప్రారంభించి ఉంటారు. అదే చివరికి స్థిరపడిపోయింది. కాని ఇతని పెద్దన్న త్రిభువన పాలుడు తండ్రి ధర్మపాలుని రాజ దర్బారులో యువరాజుగా చలామణి అయ్యాడు. దీన్నిబట్టి అభినందన కవి తొమ్మిదవ శతాబ్ది పూర్వార్థం వాడు అని తేల్చారు.

అభినందన రాసిన రామచరితను భోజుడు, మమ్మటుడు, మహిమభట్టు పొగిడారు. దీనితో అతని ప్రశస్తి ద్విగుణీకృతమైంది. ఇది రామాయణ కథయే. బరోడా ప్రతిలో కావ్యం చివరి నాలుగు కాండలలో అభినందన, భీమకవుల హస్తం ఉందని అనిపిస్తుందట. ఈ భీమకవి ఎవరో అజ్ఞాత కవి. అభినంద కవి అసంపూర్తిగా వదిలిన కావ్యాన్ని నాలుగు కాండాలను అదనంగా చేర్చాడు అనుకోవాలి. మొత్తం 36 కాండలలో చాలాభాగం అభినంద కవి రాసినవే. కథా భాగంతోపాటు తనకు ఆశ్రయమిచ్చిన రాజుల ప్రశంస చేశాడు. దీనితోబాటు తన రచనా చమత్కృతినీ చెప్పుకొన్నాడు. తీర్థం స్వార్థంగా విషయ వివరణలో స్పష్టత చిక్కని కవిత్వం, కవితా వినోదంతో అభినంద కవి రాసిన రామచరిత కావ్యం అలరారుతుంది. ❁

## 33. ద్విసంధాన (ద్వర్ధి) కావ్య నిర్మాత- ధనుంజయుడు (900-1000)

**వా**సుదేవ, శ్రీదేవిల పుత్రుడైన ధనుంజయుడు జైనకవి. అప్పటికే సాహిత్యంలో ద్వర్ధికావ్యాలు విజృంభించాయి. ఒకే పద్యంలో రెండు వేర్వేరు కదార్థాలు వచ్చే దాన్ని ద్విసంధాన కావ్యం అన్నారు. దండి కవి సంస్కృతంలో దీనికి నాంది పలికితే భోజుడు శృంగార ప్రకాశలో దాన్ని పేర్కొన్నాడు. సుబందు దీన్ని వచనంలో చేశాడు. సుబంధు వాసవ దత్తలో ద్వ్యర్ధికావ్య నిర్మాణాన్ని శిఖరారోహణం చేయించాడు. ధనుంజయుడు అదే బాటలో నడిచి రామాయణ, మహా భారత కథలను ద్విసంధాన కావ్యంగా సుమధుర, సాంద్ర ప్రవాహ కవిత్వంలో రాశాడు. తన శక్తి ఎరిగిన వాడు కనుక ధనుంజయుడు తనను వాల్మీకి వ్యాసులతో పోల్చుకొని వారితర్వాత మూడో వాడిని తానేనని చెప్పుకొన్నాడు. దండిని దృష్టిలో పెట్టుకొనే ఈ మాట అన్నాడు. తన కావ్యం మూడు వజ్రాలలో ఒకటి అన్నాడు. ఆకలంకుని న్యాయ సారం, పూజ్య పాదుని వ్యాకరణం మిగిలిన రెండు వజ్రాలుట. ధనుంజయుడు ఆనందవర్ధన, రాత్నాకరులను బాగా మెచ్చుకొన్నాడు. సోమదేవ, జల్హనులు ధనుంజయ కవిత్వాన్ని మెచ్చారు. ఇతని గురించి వర్ధమానుడూ చెప్పాడు. కనుక ధనుఞ్జయునికాలం తొమ్మిది పది శతాబ్దుల మధ్యగా నిర్ణయించారు. ❁

## 34. ఉత్పల దేవుడు (930)

**అ**భినవ గుప్తుని గురువు లక్ష్మణ గుప్తుని గురువే ఉత్పల దేవుడు. ఉదయకారుని కొడుకు. 930 వాడు. ఇతని గురించి క్షేమేంద్రుడు చెప్పాడు. 'ఈశ్వర ప్రత్యాభిజ్ఞ సూత్రం' రాశాడు. దీనికి అభినవ గుప్తుడు వృత్తి 1015లో రాశాడు. ఉత్పలుని గురువు సోమానందుడు ప్రత్యభిజ్ఞ మార్గ స్థాపకుడు. ఉత్పలుని సంగీత పారమ్యాన్ని అభినవ భారతి ప్రస్తుతించాడు. 'శివ తత్వ నాటకం'లో బసవ రాజు 'ఉత్పలాఘం పరిమళం కృతి శాంజ్ఞ ధరస్యచ' అని అన్నాడు. ❁



## 35. ఆచార్య నాగార్జునుడు (931-)

**ర**సాయన శాస్త్రానికి బీజాలు వేసి, రస వాద సిద్ధాంతానికి మహా ప్రయోగాలు నిర్వహించిన బౌద్ధ ఆచార్యుడు నాగార్జునుడు. క్రీ.శ.931లో గుజరాత్‌లోని సోమనాధ దేవాలయ సమీపంలో దైహాక్ అనే గ్రామంలో జన్మించినట్లు తెలుస్తోంది. బౌద్ధంలో మహా యాన విభాగంలో మాధ్యమిక, యోగాచార అనే రెండు విధానాలలో మాధ్యమిక చింతనను ప్రతిపాదించిన వాడే నాగార్జునాచార్యుడు. ఈయన రచించిన 'మాధ్యమిక కారిక' గ్రంథం బౌద్ధ దర్శనాలలో అగ్రశ్రేణిలో నిలబడింది. దీనితో ఆయన 'ఆర్య నాగార్జునుడు' అనిపించుకొన్నాడు. గుంటూరుజిల్లా మహామండల ప్రాంతంలో శ్రీ పర్వత సానువులలో చాలా కాలం నివశించాడు. ఇక్కడి ఈ పర్వతానికే 'నాగార్జున కొండ' అనే పేరొచ్చింది. ఇక్కడే ఒక విశ్వ విద్యాలయాన్ని స్థాపించి ఎందరికో విద్య నేర్పించాడు. దేశ, విదేశాల నుండి ఎందరో విద్యార్ధులు ఇక్కడికి వచ్చి చదువుకొన్నారు.

కాని నాగార్జునుడు అంటే బంగారాన్ని కృత్రిమంగా తయారు చేసేవాడనే పేరు స్థిరపడిపోయింది. ధాతు విజ్ఞానిగా పాపం గుర్తింపు పొందలేదు. అందుకే ఆధునిక శాస్త్ర వేత్తలకు ఆయన దూరమైపోయాడు. పాదరసం వాడకాన్ని మొదటిసారిగా ప్రయోగించిన వాడు నాగార్జునుడే. దీన్ని శుద్ధి చేసే ప్రక్రియను కూడా ఆయనే ప్రపంచానికి తెలియజేశాడు. పాదరసంతో బంగారం తయారు చేసేవాడని చరిత్ర కారులు చెప్పారు. బంగారు తయారీలో పాద రసాన్ని తప్ప ఏ ఇతర ధాతువును వాడలేదు ఆచార్యుడు. ఆధునికులు బంగారంలో ఎనభై ప్రోటాన్లు, ఎలక్ట్రాన్లు ఉన్నాయని పాదరసంలో డెబ్భై తొమ్మిది ప్రోటాన్లు ఎలక్ట్రాన్లు ఉన్నాయని కనుక్కొన్నారు. మరి ఆనాడే ఈ రహస్యాం నాగార్జునికి ఎలా అవగతమైనదో

ఆశ్చర్యం వేస్తుంది.

ఆచార్య నాగార్జునుడు అనేక వైద్య గ్రంథాలు రాశాడు. రస ప్రక్రియ అంటే ఆల్కెమీ కూడా నేర్చినట్లు అనిపిస్తుంది. ఆయన కాలంలో 'విజ్ఞాన వాదం' ప్రారంభం అయి తర్వాత కూడా వ్యాప్తి చెందింది. అదీ ఆయన ఘనత. ఈ నాగార్జునుడు వేరు, ఏ లోహాన్నైనా బంగారంగా మార్చ గలిగే 'పరసు వేది'ని కనిపెట్టిన సిద్ధ నాగార్జునుడు వేరు అని అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. దీనితో నాగార్జునాచార్యుడు రసాయన శాస్త్రానికి చేసిన అద్వితీయ కృషి మరుగున పడిపోయింది. నాగార్జునుడు వివిధ లోహాలను ప్రకృతి నుంచి సేకరించి వాటిని శుద్ధి చేసే విధానం కని పెట్టాడు. రాత్రి వేళల్లో అడవుల్లో కాంతులు ప్రసరించే అనేక మూలికలను సేకరించి ప్రయోగాలు చేశాడు. వృక్ష సంబంధ పదార్ధాలతోను అనేక ప్రయోగాలు చేసి నమోదు చేశాడు. వీటి నన్నిటిని 'రస రత్నాకరం'లో వివరించాడు.

ఆచార్యుడు రసాయన శాస్త్రంలోనే కాకుండా వైద్య, యోగ శాస్త్రాలలో కూడా సృజనాత్మక కృషి చేశాడు. రస రత్నాకరంతో బాటు 'కక్షపుట తంత్రం', 'ఆరోగ్య మంజరి', 'యోగసారం', 'యోగాస్టకం' మొదలైన రచనలు చేశాడు. తన సిద్ధాంతాలను జన సామాన్యానికి అందించాలని ఎంతో తపన పడ్డాడు. దీనికి ఒక చిట్కా చేశాడు . ఈ అపూర్వ విజ్ఞానం అంతా తనకూ దేవతలకు మధ్య జరిగిన సంభాషణల వల్లనే అబ్బిందని అందరికి చెప్పాడు. ఈవిషయాన్ని రస రత్నాకరంలో చెప్పాడు కూడా.

నాగార్జునుని రస రత్నాకరం ఆధునిక రసాయన శాస్త్రవేత్తలకూ ప్రామాణిక గ్రంథమే అయింది. తన గ్రంథాలలో వాదప్రతి వాదాల రూపంతో ఆకట్టుకొనే విధంగా విజ్ఞానాన్ని అందించాడు. ఈయనకున్న మహిమల్ని జనం విస్తృతంగా ప్రచారం చేశారు. ఈయన ప్రయోగించిన చిట్కా వల్ల ప్రాచీన శాస్త్రవేత్త లెవ్వరికి రాని ప్రచారం ఆచార్యునికి దక్కింది. రస రత్నాకరంలో రసాయన మూల కాల వివరణ బాగా ఉంది. రాసాయనిక యౌగికాల గురించి మొట్టమొదట తెలియజేసిన వాడు నాగార్జునుడే. ఇదే ఆ తర్వాత మెటలర్జీ, ఆల్కెమీగా వృద్ధి చెందాయి.

రాగి, సీసం, టిన్, వెండి బంగారం మొదలైన ముడి లోహాలను ఖనిజాల నుండి ఏ విధానంలో సంగ్రహించాలో వాటిని ఎలా శుద్ధి చేయాలో మొదలైన అమూల్య విషయాలు ఈ గ్రంథంలో రాశాడు. ఆయన మేధస్సును అంచనా వేయటం కష్టం. రస రత్నాకరం ఒక ప్రయోగాత్మక రసాయన శాస్త్రం. ప్రయోగాల వల్లనే వివిధ ధాతువుల నిర్మాణం, మేళ వింపు, ప్రయోజనాలు తెలుసుకోవచ్చని చెప్పాడు. ప్రకృతిలో దాగి ఉన్న ఖనిజాలు, మొక్కలు, మూలికలు, తృణ ధాన్యాలు మొదలైన వాటిని ఆరోగ్య సంరక్షణకై ఔషధాలను తయారు చేసుకోవచ్చునని సూచించాడు. 'సిన బార్ ' (ఇంగిలీకం ) నుండి పాదరసం తయారు చేయచ్చని, 'కాలమైన్' సీసంలాగా కనిపిస్తుందని దీన్ని కూడా తయారు చేయవచ్చునని ఈ గ్రంథంలో రాశాడు. ధాతువుల్లో ఉన్న హాని చేసే పదార్ధాలను తొలగించి వాటిని ప్రయోజనకరమైన వాటిగా మార్చే విదానాలెన్నో చర్చించాడు. ఆరోగ్యం కోసం కొద్ది మోతాదులో పాదరసం, గంధకం ఇంగువ కలిపి తింటే ఆయుస్సు పెరుగుతుందనీ తెలియజేశాడు. దీన్నే ఇప్పుడు 'రస సింధూరం'గా పిలుస్తున్నారు. మనిషిలో ప్రాణ శక్తి, దీర్ఘకాల జబ్బుల వల్ల 'ఓజస్సు' క్షీణిస్తుందని, మళ్ళీ దాన్ని పొందాలంటే రసాయన పదార్ధాలే గతి అని స్పష్టంగా చెప్పాడు. శరీరంలో రసం, రక్తం మాంసం, మేధస్సు, ఆస్థి, మజ్జ, శుక్లం వల్లనే 'ఓజస్సు' ఏర్పడుతుంది. కనుక ఓజస్సు తగ్గితే రసాయనిక చికిత్సే అవసరం అవుతుందని చెప్పాడు. వ్యాధి నిరోధక శక్తి పెరిగి ప్రాణ శక్తి పెరిగి సూక్ష్మ జీవులు నశించితే ఓజస్సు వృద్ధి చెందుతుందన్నాడు. వ్యాధిని వివారించటంతో బాటు నియంత్రించటంలో కూడా శ్రద్ధ చూపించాలన్నాడు ఆచార్యుడు. శుశ్రుతుడు రాసిన 'సుశ్రుత సంహిత' ఆధారంగా 'ఉత్తర తంత్ర' రాశాడు. దీని అసలు ప్రతి ఇతర దేశాల్లో వ్యాపించటంతో దాని వివరణలు మనకేమీ తెలియలేదు. ప్రకృతి సిద్ధమైన రోగ నిరోధక శక్తిని పెంచటానికి ఇందులో చాలా విషయలున్నాయట. పాదరాసాన్ని పద్దెనిమిది సార్లు శుద్ధి చేసి, ఆ ద్రావకంలో వన మూలికల కషాయాన్ని రంగరించి విపరీతంగా చిలికితే అందులోని గంధకం, అభ్రకం కొన్ని క్షారాలు కలిపి మళ్ళీ పది హేడు సార్లు శుద్ధి చేస్తే 'స్వర్ణ లోహం' ఏర్పడుతుంది అని వివరించాడు నాగార్జునుడు.

అయితే ఇందులో ఏవి ఎన్నిపాళ్ళు ఉండాలో స్పష్టంగా లేదట. జింక్‌ను మూడు రెట్ల రాగితో కలిపి అత్యధిక వేడిలో ఉంచితే ఇత్తడి ఏర్పడుతుంది. కాని బంగారం ఎలా? దీన్ని ఒక శ్లోకంలో రస రత్నాకరంలో వర్ణించాడు.
'క్రమేణా క్రుత్వామ్బుధరేణ రంజితః – కరోతి శుల్వం త్రిపుటేన కాంచనం' కాని ఇంత వరకు ఎవరికీ ఇది అంతు బట్టలేదట. ఇలా రసాయనిక శాస్త్రానికి ఆద్యుడయ్యాడు ఆచార్య నాగార్జునుడు.

నాగార్జునుడు ఏర్పరచిన విశ్వ విద్యాలయంలో బౌద్ధ భిక్షువులు, సన్యాసులు అనేక దేశాల నుండి వచ్చి చేరి చదువు కొనేవారు అన్ని శాస్త్రాలను ఇక్కడ విద్యార్థులు నేర్చుకొనే అవకాశం ఉండేది. ఇక్కడే 108 అడుగుల వ్యాసం, 86 అడుగుల ఎత్తు, ఉన్న మహా స్తూపం ఉంది. దీన్ని పద్దెనిమిది అంగుళాల పొడవు, తొమ్మిది అంగుళాల వెడల్పు, నాలుగు అంగుళాల మందంతో చేసిన ప్రత్యేక ఇటుకలతో ఈ స్తూపాన్ని నిర్మించారు. విజయపురి అంతర్జాతీయ బౌద్ధ విహార కేంద్రం అయింది. ఇప్పటి నాగార్జునసాగర్‌కు ఎనిమిది కిలో మీటర్ల దూరంలో 'అనువు' అనే చోట ఇక్ష్వాకుల కట్టడాల్ని పునర్నిర్మించారు.

నాగార్జునుడు సకల శాస్త్ర పారంగతుడని అపర ధన్వంతరి అని శాస్త్ర శాస్త్ర ప్రవీణుడు అని తత్వ వేది, తార్కికుడు, ఖనిజ కళా నిష్ణాతుడు, వేదంవేదంగ విద్యా విశారదుడు, కవి సార్వ భౌముడు, కళోపాసకుడు, మాధ్యమిక వాద మహా ప్రవక్త, మహాయాన మార్తాండుడు, శతాధిక గ్రంథకర్త అని ఎందరో తమ రచనల్లో ఆయన ప్రతిభా విశేషాలను ప్రస్తుతించారు. చిన్ననాటే వేద వేదంగ పారంగతుడై, వివాహ ప్రసక్తి లేకుండా సన్య సించి సర్వ జ్ఞాని అయ్యాడు అని చరిత్ర కారుల అభిభాషణ. భారతీయ రస వాదుల్లో ప్రప్రథముడు. బట్టీ పట్టటం (దిస్టిలేషన్) శుద్ధిచేయటం (సబ్లిమేషన్) భస్మం చేయటం (కాల్సినేషన్) మొదలైన పద్ధతుల్లో లోహాల రంగులు మార్చటం, లోహ మిశ్రమం (అల్లాయ్లు) అగ్ని శిలా (పైరైట్స్లు) నుంచి రాగి తీయటం, మెటాలిక్ ఆక్సైడ్స్, ఆక్సైడ్స్ ఆఫ్ బ్రాస్ మొదలైనవి నాగార్జున మేధో జనితాలే వైద్యంలో 'కజ్జోలి' అన బడే బ్లాక్ సల్ఫైడ్ ఆఫ్ మెర్క్యురిని పరచయం చేసిన వాడు కూడా ఆచార్యుడే. తన శాస్త్రీయ ప్రయోగ వివరాలను శిలలపై

చెక్కించాడు. లోహ సంగ్రహణ శాస్త్రానికి (మెటలర్జీ)కి ఆద్యుడయ్యాడు. ఆచార్య నాగార్జుడిని మొదటి నాగార్జునుడు అంటారు.

ఆధునిక భౌతిక శాస్త్రంలో లేజర్ కిరణాల సహాయంతో అణువు కేంద్రకంలోని ప్రోటాన్లు న్యూట్రాన్ల సంఖ్యను మార్చే అవకాశం కలిగింది. ప్రోటాన్ సంఖ్య మారితే ఒక మూలకం ఇంకో మూలకంగా మారుతుందని రుజువు అయింది. లేజర్‌తో రాగి కేంద్రాణువులో ఒక ప్రోటాన్ చేరిస్తే నికెల్ అయిపోతుంది. అలానే 'వల్కన్' అనే శక్తి వంత మైన లేజర్ నుపయోగించి బంగారాన్ని పాదరసంగా మార్చ గలిగారు ఈ నాటి శాస్త్రవేత్తలు. వీటి కన్నిటికి ఆచార్య నాగార్జునుని మౌలిక భావనలే ఆధారం.

రెండవ నాగార్జునుడే 'సిద్ధ నాగార్జునుడు' క్రీ.శ.600వాడు. రస విద్యలో అఖండుడు. పుణ్య సాధువు అనే ఆయన మేనల్లుడు. జైన తత్వవేత్త. వైద్య ప్రకాండుడు అని పించుకొన్న పూజ్య పాదుల వద్ద ఉద్యోగి. జైనుడుగా పుట్టినా బౌద్ధం స్వీకరించాడు. దేశంలోను నేపాల్, టిబెట్‌లలో పర్యటించి బౌద్ధ ప్రచారం చేశాడు. శ్రీశైలం కొండదకు వచ్చి 'నాగార్జున బోధి సత్వ'గా ప్రసిద్ధుడైనాడు. అనేక రసాయన ప్రయోగాలు చేశాడు. రస వాదవిద్య ద్వారా మోక్షాన్ని పొందాడు. అందుకే సిద్ధ నాగార్జునుడుగా అందరూ ఆరాధించారు. 'రస కాచ పుట', 'కక్షు పుట తంత్ర' మొదలైన గ్రంథాల రచయితగా సుప్రసిద్ధుడయ్యాడీ సిద్ధ నాగార్జునుడు.

మూడవ నాగార్జునుడు- అసలు పేరు 'భదంత నాగార్జున' క్రీ.శ.ఏడవ శతాబ్దివాడు. కేరళకు చెందిన బౌద్ధ సన్యాసిగా చరిత్ర పుటల కెక్కాడు. ఆయుర్వేదంలో ఆనాడు ప్రసిద్ధమైన అనేక గ్రంథాలు చదివి జీర్ణం చేసుకొన్నాడు. 'రస వైశేషిక సూత్ర' అనే గ్రంథం రాశాడు. ఆయుర్వేద వైద్యానికి చెందిన మౌలిక సూత్రాలను ఇందులో చర్చించాడు. ఇది 486 సూత్రాలతో నలుగు అధ్యాయాలుగా ఉంది. స్వతంత్ర విధానంగా అలోచించి రాశాడు. తన శైలిలో 'నాగార్జుని యాన్' అనే ప్రత్యేక వైద్య సంప్రదాయాన్ని నెల కొల్పి అనేక మందికి తర్ఫీదు ఇచ్చాడు. మొత్తం మీద నాగర్జునులు ముగ్గురూ ముగ్గురే. వైద్య రసాయనాలకు ముగ్గులేసి వ్యాప్తి చెందించిన వారే.❁

## 36. కావ్య కౌతుకకర్త– భట్ట తౌతుడు (950)

**భ**ట్ట తౌతుడు రాసిన కావ్య కౌతుకం కనబడటం లేదు. కాని అతను కవి గురించి, కావ్యం గురించి చెప్పిన శ్లోకాలను మాణిక్య చంద్రుడు ఉదాహరించాడు. ప్రజ్ఞా నవ నవోన్మేషశాలినీ ప్రతిభా మత–తదను ప్రాపణా జీవ ద్వర్ణణా నిపుణ. తస్య కర్మ స్తుతం కావ్యం. ఈ గ్రంథం నకలు రాజ చూడామణి దీక్షితుల వద్ద ఉన్నట్లు తెలుస్తోంది. అతడు తౌతుని నిర్వచనాలనే పాటించాడు. కవిని గూర్చి తౌతుడు చెప్పిన భావాలు అమోఘం, ఆదర్శం, అనుసరణీయం.

"నానృషిః రుషి శ్చ కిల దర్శనాత్– విచిత్ర భాషా ధర్మం స్తత్వ్య ప్రఖ్యా చ దర్శనం

స తత్వ దర్శనాదేవ రుషేషుపటితః కవిః దర్శనాద్వర్ణరూయ లోకే కవిశ్రుతిః
"

"తయాహి దర్శనే సంచే నిత్యోభ్యాయాది కవెర్మునేః నోదితా కవితా లోకే యావ జ్ఞాతా ణ కర్మణా" (కావ్యాను శాసనం)

దీనిపై అభినవ గుప్తుడు గొప్ప వ్యాఖ్య రాసి వివరణ అని పేరు పెట్టాడు. తన లోచన వ్యాఖ్యలోనూ దీన్ని ఉటంకించాడు. రస భావంపై లొల్లట, శంవేకలకు ఉన్న అభిప్రాయాలను భట్ట తౌతుడు మెరుగు పరచాడు.❁

## 37. మహా సాధ్యాయపాల - ధనికుడు (974)

**ధ**నికుడు ధనుంజయుని సోదరుడుగా భావిస్తారు. కొందరు ధనిక ధనుఞ్జయులు ఒక్కరే అంటారు. అతని రాత ప్రతులైన 'అవలోక'లో తాను, ముంజ రాజు ఉత్పలుని 'మహాసాధ్యాయ పాల' అనే అధికారినని చెప్పుకొన్నాడు. వసంతా చార్యుని తండ్రి అయి ఉండవచ్చు. యితడు వాక్పతిరాజు (974) కాలం వాడు. కవిత్వం రాశాడు. తన స్వంత కవిత్వాన్ని ధనుంజయుని అలంకార శాస్త్రానికి ఉదాహరణలుగా ఇచ్చాడు.❁

## 38. నాగర సర్వస్వం కర్త- పద్మశ్రీ (1000)

**ప**ద్మశ్రీజ్ఞానుడు అనే పద్మశ్రీ బౌద్ధ సన్యాసి. తన "సారంగధర పద్ధతి"లో కుట్టిన మఠం గురించి చెప్పాడు కనుక కాలం 1000 అని ఊహ. పద్దెనిమిది అధ్యాయాలలో రాసిన "నాగర సర్వస్వం"లో రసవంతమైన ధారాపాతమైన శ్లోకాలలో మనిషి సుఖ సంతోష జీవితాన్ని ఎలా గడపాలో చెప్పాడు. గృహానికి పరిమితమైనా మానవుడు అన్ని ఆనందాలను పొందాలి అన్నాడు. తన గ్రంథంలో ప్రేమ, వలచటం వలపింప జేయటం, గర్భదారణ వీటికి కావాలసిన చిట్కాలు మందులూ రాశాడు. దీనిపై "తను సుఖరాముడు, జ్యోతిర్మల్లుడు వ్యాఖ్యలు రాస్తే, నగరి దాసుడు "నగర సముచ్చయం" రచించాడు.❁

## 39. కాదంబరి కథాసారం రాసిన మరో అభినంద కవి (900)

**ఇ**ప్పటిదాకా తెలుసుకొన్న రామచరిత రాసిన అభినంద కవి కాక, మరో అభినందుడున్నాడు. ఇతనిని గౌడాభినందనుడు అంటారు. వీరి వంశం గౌడ దేశంలో ఉండేది. వీరిలో శక్తి అనే వాడు కాశ్మీర దేశంకు చేరేదాకా ఆ పేరుతోనే పిలువబడ్డారు. శక్తి ఇక్కడికొచ్చి, దర్వాభి సారలో ఒక అమ్మాయిని పెళ్ళి చేసుకొన్నాడు. శక్తి మనవడు శక్తి స్వామి కాశ్మీర్ రాజు లలితాదిత్యముక్త పాద అనే కర్కోటక వంశరాజు ఆస్థాన మంత్రి. ఇతని పరిపాలన కాలం 726. శక్తి స్వామికి అభినంద అయిదవ తరంవాడు. జల్హణుడు తన సూక్తి ముక్తావళిలో ఈ కవిని పేర్కొన్నాడు.❁



# 40. విశిష్టాద్వైత మత స్థాపకులు- భగవద్రామానుజాచార్యులు (క్రీ.శ.1017-1137)

**త**మిళనాడులోని శ్రీ పెరంబదూరులో క్రీ.శ.1017లో ఆలవందార్ కుమారుడి కుమార్తె కొడుకు రామానుజాచార్య. తండ్రి హరితస గోత్రానికి చెందిన ఆశూరి కేశవ భట్టార్. చిన్నప్పటి పేరు లక్ష్మణ. ఇప్పుడు లక్ష్మణముని అంటారు. ఆదిశేషుని అవతారంగా భావిస్తారు. వేద యాదవ ప్రకాశ అనే గురువు వద్ద కావేరిలో విద్యనభ్యసించాడు. గురువుగారి అసూయను భరించలేక బయటకు వచ్చేసాడు. తనను హత్య చేసే ప్రయత్నం నుండి బయటపడి కాంచీపురం చేరాడు. తర్వాత శ్రీరంగానికి ఆహ్వానించబడి ఆలవందార్ స్థానాన్ని పొందాడు. శ్రీరంగానికి ఆలవందార్ అంతిమ దర్శనం చేయడానికి వెళ్ళి అంత్యక్రియల్లో పాల్గొన్నాడు. మధురాంతకంలో పెరియనంబి వద్ద వేదాంతం నేర్చాడు. తర్వాత మహర్షి అయ్యాడు.

వ్యాస సూత్రాలకు, భాష్యానికి, వేదాంతానికి వ్యాఖ్యానాలు రాసాడు. కాశ్మీరు వెళ్ళినప్పుడు ఆయన వ్యాఖ్యానాలను సరస్వతిదేవి మెచ్చినందువలన వాటికి 'శ్రీభాష్యం' అనే పేరు వచ్చింది. 1098లో మెల్కోటేలో విష్ణు విగ్రహాన్ని స్థాపించి దేవాలయాన్ని నిర్మించాడు. తిరుపతి చేరి అక్కడ తగాదాలను పరిష్కరించి అనేక విష్ణాలయాల్లో పూజలు, ఉత్సవాలు నిర్వహించాడు. 128 సంవత్సరాలు సార్ధక జీవితం గడిపి 1137లో పరమపదం పొందాడు. వేదాన్తంపై అనేక గ్రంథాలు రాసాడు. రామానుజుని వైకుంఠ గద్య, రఘువీర గద్య, శరణాగతి గద్య చాలా సుప్రసిద్ధమైనవి. విశిష్టాద్వైత మత సంస్థాపకుడు రామానుజాచార్యుడు. కులమత రహితంగా వేదాలను మంత్రాలను బోధించిన మహాత్ముడు రామానుజాచార్యుడు. రామానుజులపై రామానుజ చరిత్ర, చూలికను రామనుజదాసుడు రాసాడు. యతీంద్ర చంపూను వెంకటా భరనణుడు రామానుజ దివ్య చరిత్ర రామానుజ విజయం మొదలైనవి రచింపబడినాయి. ఆయన ముఖ్య శిష్యుడు ఆంధ్ర పూర్ణుడు లేక వదూహ నంబి యతిరాజ వైభవం రాసాడు. ❀

## 41. పంచస్తని రాసిన కురత్తైవార్ (కూరేశ కవి) (1039)

**రా**మసోమయాజికి సువత్సామ్మ మిశ్ర కంచిలో 10 30లో జన్మించాడు. రామానుజుని శిష్యుడు. సంపన్న కుటుంబంవాడు. ఐశ్వర్యాన్ని త్యజించి శ్రీరంగం చేరి రామానుజాచార్య శిష్యుడయ్యాడు. సన్యాసిగా ఉంటూ భిక్షాటనతో జీవించాడు. ఆయన జ్ఞాపకశక్తి అసాధారణమైంది. ఒకసారి రామానుజుడు బోధాయన వృత్తిని బ్రహ్మ సూత్రాలపై రాసి కాశ్మీరు వెళ్ళాడు. పురకేశ అనబడే కురత్తైవార్ ఏకసందాగ్రాహి కనుక అప్పటికప్పుడు దానిని అప్పగించాడు. ఈ విధంగా రామానుజులకు శ్రీభాష్యం రాయడానికి తోడ్పడ్డాడు. అది ఆయన అపూర్వ రచన. కులోత్తుంగ మహారాజు రామానుజుని ఆహ్వానించి శైవ మతాన్ని స్వీకరించమని కోరితే కూరేశ రామానుజుని యొక్క వైష్ణవ సంప్రదాయం యొక్క విశిష్టతను చాల సూటిగా, ఘాటుగా వివరించాడు. కోపించిన రాజు అతని గుడ్లు పీకేయించమని ఆజ్ఞ జారీ చేసాడు. కూరేశుడు శ్రీరంగంలో భట్టార్ కుటుంబ వ్యవస్థాపకుడు.

కూరేశుడు మధుర కవి. ఇతనిది పవిత్ర జీవితం. ఆయన రాసిన వైకుంఠ స్తవం వైకుంఠంలో విష్ణుమూర్తి వైభవాన్ని వర్ణించాడు. ఆత్మానుస్తవంలో విష్ణుమూర్తి అవతార మహిమలను వర్ణించాడు. సుందర బాహుస్త్వంలో విష్ణుమూర్తి మహిమలను వర్ణించాడు. వరదరాజ స్వంలో కంచి వరదరాజ స్వామిని కీర్తించాడు. లక్ష్మీదేవి వైభవాన్ని శ్రీ స్తవంలో వివరించాడు. ఈ అయిదింటినీ కలిపి పంచస్తవి అంటారు. కూరేశుని జీవింతంపై కూర్మ నారాయణుడు కూరేశ విజయం రాసాడు

శ్రీవత్సాముని కుమారుడు పరాశరభట్టు 1061లో జన్మించి విష్ణు సహస్రనామ భాష్యం, శ్రీరంగ రాజ స్తవం శ్రీ గురురత్న కోశం, క్షామ శోడశి తనిశ్లోకి హస్తశ్లోకి రాసారు. దొడ్డయాచార్యుడు పరాశర విజయంలో యీతని జీవిత చరిత్ర వర్ణించారు.❀

## 42. ప్రబోధ చంద్రోదయకర్త- కృష్ణ మిశ్ర (1072)

**ప**రమహంస కృష్ణ మిశ్రుడు శంకరాద్వైత వేదాంతం వ్యాప్తి చేశాడు. శిష్యులనేకులు. అందులో ఒకడికి వేదాంతం చదవటం బోర్ అనిపించింది. అతని దారి మరల్చటానికి కృష్ణ మిశ్రుడు ప్రబోధ చంద్రోదయం నాటకం రాశాడు. అందులో పరమ సత్యాన్ని ఆవిష్కరించాడు. గుణాలను పాత్రలుగా మలచాడు. వివేచన విముక్తికి దారి చూపుతుంది అని సారాంశంగా చెప్పాడు. వివేకం రాజుగా ఉపనిషత్ దేవిగా భావన చేసి గూఢంగా సత్యజ్ఞానం కలిగించిన నాటకం. మంచి రాజు వివేకుడు దుస్టరాజు మహా మాయ ముఖ్య పాత్రలు. భ్రాంతికి సత్యానికి జరిగే పోరాటమే ఇందులో కథ. చివరికి వివేకం చంద్రోదయం లాగా ప్రకాశించటంతో సమాప్తం.

ఆనాడు వ్యాప్తిలో ఉన్న బుద్ధ, జైన పశుపతి మతాల వలన ధర్మ గ్లాని కలుగుతోందని కృష్ణ మిశ్రుడు భావించి శంకరాద్వైత ప్రచారం చేసి వేద సంస్కృతికి పునర్వైభవం సంతరించాడు. సరిదిద్దాల్సిన ఆనాటి బ్రాహ్మణులు చిలుక పలుకుల్లా వేదాలను వల్లె వేయటంతోనే సరిపుచ్చారు. అందులోని అర్ధ భావాలను తెలుసుకొనే ప్రయత్నం చేయలేదు. తెలియజెప్పే ప్రయత్నం జరగలేదు. పైపెచ్చు వేదోపనిషత్‌లను తమ ఇష్టం వచ్చినట్లు వక్ర భాష్యం చెప్పి దారి తప్పారు. తప్పించారు. ఇవన్నీ గమనించిన కృష్ణ మిశ్రుడు సమాజాన్ని వేదాంత మార్గంలోకి మళ్ళించటానికే ఈ నాటకం రాశాడు.

1092లో దీన్ని రాశాడు. ఆనాటి రాజు గోపాలుడు ఎప్పుడూ యుద్ధాలు అంటూ కాలక్షేపం చేస్తూ ప్రజల గోడు పట్టించుకోలేదు. ఆ రాజ్యంలో మునిగా

ఉన్న కృష్ణ మిశ్రుడు రాజుకు వివేకం కలిగించటానికే యుద్ధాన్ని నేపథ్యంగా తీసుకొని ప్రబోధ చంద్రోదయ నాటకం రాసి కనువిప్పు కలిగించాడు. కృష్ణ మిశ్రుడు తాను గౌడ దేవానికి చెందిన వాడినని చెప్పుకొన్నాడు. కనుక ఈయన బీహార్ ప్రాంతం వాడుగా భావించారు. ఈ నాటకాన్ని రాజు గోపాలుడు అతని మిత్రరాజు కీర్తివర్మతో కర్ణరాజు అనే శత్రువును జయించి రాజధానికి తిరిగి వచ్చి ప్రబోధ చంద్రోదయం నాటకాన్ని ప్రదర్శింపజేసి చూశాడు. వివేకం అనే చంద్రుని యొక్క ఉదయం అని ఈ నాటక శీర్షికకు అర్థం. చక్కని శైలి, సంభాషణలు అంతరంగాల ప్రదర్శనలతో నాటకం రక్తి కట్టింది. వేదాంత ధోరణి నాటకాలకు కృష్ణ మిశ్రుడు తెర తీసాడు. ఆ తర్వాత ఇలాంటివి చాలా వచ్చాయి.❀



## 43. కలికాల సర్వజ్ఞుడు- ఆచార్య హేమ చంద్రసూరి (1088-1173)

జైన సంస్కృత ప్రాకృత కవి, పండితుడు, వ్యాకరణవేత్త, సర్వశాస్త్ర విశారదుడు, ఆలంకారికుడు, గణిత మేధావి, జీవశాస్త్ర విజ్ఞాని మహా కావ్యాలతోబాటు అనేక నిఘంటువుల నిర్మాత అయిన హేమచంద్రకవి 1088లో ధందూకలో జన్మించాడు. చాచిగ శ్రేష్ఠి, పాహిని దంపతుల పుత్రుడు. ఒకరోజు తండ్రి దూరదేశాలకు వెళ్ళినప్పుడు వజ్రశాఖకు చెందిన దేవేంద్ర సూరి అనే ముని వచ్చి అతని తల్లిని అయిదేళ్ళ ఆమె కొడుకును తనకిమ్మని అడిగాడు. ఆమె ఇచ్చేసింది. ఆయన తనతో తీసుకొని వెళ్లి సన్యాసాశ్రమ వాతావరణంలో పెంచాడు. తల్లితో సంబంధంలేని ఆ కుర్రాడికి చాంగ దేవుడు అనే పేరు పెట్టాడు.

### హేమచంద్ర నామం

ఊరినుండి తిరిగి వచ్చిన తండ్రికి కొడుకు విషయం తెలిసి వెదకటం మొదలుపెట్టాడు. అప్పటికే ఆలస్యమైపోయింది. కొడుకు సన్యాసాశ్రమంలో అనేక సిద్ధులు సాధించాడు. ఒకసారి తన మహిమ చూపించటానికి మండే అగ్నిలో తన చెయ్యిపెట్టి కాల్చుకొన్నాడు. అది బంగారం అయిపోయింది. అప్పటి నుంచి అతని పేరు హేమచంద్ర అయింది.

### ఆచార్య హేమచంద్ర సూరి

హేమచంద్రుడు పురాణ తల్లి యాగచ్చకు చెందిన దేవచంద్ర సూరి శిష్యుడై శాస్త్రాలు నేర్చాడు. 1154లో పండితుడై సూరి బిరుదున్ని పొందాడు. గుజరాత్‌లోని అన్హిల్వేద్ పఠాన్ వంశ రాజాస్థానంలో జయసింహ సిద్ధరాజ, ఆ తర్వాత వచ్చిన కుమారపాల ల ఆస్థాన కవిగా ఉన్నాడు. నిజానికి హేమచంద్రుడు రాజదర్బారులో

మంత్రి. అతని జైనమత అభిమానం వలన రాజ్యంలో జైన ధర్మానికి గొప్ప ఆదరణ అభించి, రాజ్యమతం కూడా అయింది. 1400 జైన విహారాలు స్థాపించబడ్డాయి. అహింసను అమలుచేసి జంతువధ మాన్పించి మాంసాహారాన్ని నిషేధించారు. 21 ఏళ్ళ వయసులో హేమచంద్ర సూరి శ్వేతాంబర జైనమతాన్ని రాజస్థాన్‌లోని నాగూర్‌లో స్వీకరించి ఆచార్య హేమచంద్ర సూరి అయ్యాడు.

**సోలాంకీ సిద్ధ రాజు ఆస్థానంలో**

హేమచంద్రుడు జైనమతావలంబి అయినా నూర్వాశ్రమ బ్రాహ్మణ ధర్మాలను వదిలి పెట్టలేదు. జైన మతానికి చెందినవే కాక ఇతర మత గ్రంథాలనూ విపరీతంగా అధ్యయనం చేశాడు. మహా మేథావిగా గుర్తింపు పొందాడు. అతని వివేకం, పాండిత్యం బహు గొప్పవి. సాహిత్యంలో ఆణిముత్యమనిపించాడు. ఎన్నో వైవిధ్య రచనలు ప్రాకృత, సంస్కృత భాషల్లో చేశాడు. వ్యాకరణంలో కొత్త దారి తొక్కాడు. ఆ సమయంలో అన్హిల్వద్ పఠాన్‌ను సోలంకీ వంశ రాజులు గుజరాత్‌ను స్వాధీనం చేసుకొని పాలించారు. చాతుర్మాస్య దీక్షతో నాల్గు నెలలు ఇక్కడే గడిపాడు. అతని రచనలలో ఎక్కువ భాగం ఇక్కడే ఉండి రాశాడు. 1125లో సోలంకి ప్రభువు సిద్ధ రాజ సాంహకు పరిచయమై 1135లో రాజదర్బారులో విశిష్ట వ్యక్తీ అయ్యాడు.

**పాణినికి దీటుగా వ్యాకరణం**

సిద్ధరాజు మాల్వాను జయించాడు. అన్నిటితోపాటు భోజరాజ రచనలను ధారా నగరం నుండి తనతోబాటు తీసుకొని వెళ్ళాడు. ఒకరోజు సంస్కృత వ్యాకరణం అయిన లక్షణ ప్రకాశ అనే, సరస్వతీ కంఠాభరణంను సిద్ధ రాజు చూశాడు. అది ఎంతో ప్రభావం కలిగించి రాజాస్థాన పండితులకు అలాంటిదే సులభ, పటిష్ట వ్యాకరణం తయారుచేయమని కోరాడు. హేమచంద్రుడు రాజును కాశ్మీర దేశంలోని ఎనిమిది గొప్ప వ్యాకరణాలను తెప్పించమన్నాడు. వాటిని చదివి అధ్యయనం చేసి పాణిని రాసిన అస్టాధ్యాయితో సరితూగగల వ్యాకరణాన్ని రాశాడు. దీనికి సిద్ధ హేమ శబ్దానుశాసనం అని రాజు పేరు, తన పేరు కలిసి వచ్చేట్లుగా పేరు పెట్టాడు. రాజు కవిగారి కృషికి ఎంతో సంతోషించి ఆ వ్యాకరణ గ్రంథాన్ని ఏనుగుపై అన్హిల్వద్ పఠాన్ పురవీధుల్లో ఊరేగించాడు. హేమ చంద్రుడు సోలంకి రాజవంశ చరిత్ర ద్వాశ్రయ కావ్యం రాసి అందులో నుంచి తన వ్యాకరణానికి ఉదాహరణలు ఇచ్చాడు.

**కుమారపాలుని ఆస్థానంలో-**

సిద్ధరాజు తన మేనల్లుడు కుమారపాలని చంపే ప్రయత్నం చేస్తే హేమచంద్రుడు

అతన్ని అనేక పుస్తకాల కుప్పలో కనపడకుండా దాచేసి ప్రాణం కాపాడాడని ఒక కథనం ఉంది. కుమారపాలుని వలన తనకు, తన రాజ్యానికి ప్రమాదం సంభవించి, రాజ్యం పతనం చెందుతుందని భావించి ఈ హత్యాప్రయత్నం చేవాడు సిద్ధరాజు. సిద్ధరాజు ఆస్థానంలో నుంచి కుమారపాలుని ఆస్థానానికి చేరాడు హేమచంద్రుడు.

కుమారపాలుని కాలంలో అంటే 1143-1173లో హేమచంద్రుడు కుమారపాలునికి ముఖ్య సలహాదారుడుగా వ్యవహరించాడు. అప్పుడు గుజరాత్ రాజ్యం సాంస్కృతిక కేంద్రంగా వర్ధిల్లింది. జైనమతంలోని అనేకాంత వాదంను బాగా నేర్చినవాడు కనుక హేమచంద్రుడు చాలా విశాల దృక్పథం అలవరుచుకొని, రాజు అభిమానాన్ని పొంది మరీ సన్నిహితుడయ్యాడు. శైవుడైన కుమారపాలుడు పాఠాన్‌లోని సోమనాథ దేవాలయాన్ని పునర్నిర్మించాలని భావించాడు. హేమచంద్రుని ప్రాపకం ప్రాభవం చూసి అసూయ చెందిన కొందరు అతడు సోమనాథ శివునికి నమస్కారం కూడా చేయడని, పొగరుబోతు, గర్విష్టి అని చాడీలు చెప్పారు. సోమనాథ ఆలయ ప్రారంభోత్సవం రోజున రాజు ఆహ్వానంపై హేమచంద్రుడు రాజు వెంట ఆలయానికి వెళ్ళి సోమనాథ లింగానికి సాగిలపడి మ్రొక్కి మనిషి జీవితంలో మనిషిలోని సహజాతాలైన అసూయ, అనుబంధాలను నాశనం చేసే బ్రహ్మ అయిన, విష్ణువైన, జినుడైన వాడికి నమస్కరిస్తున్నాను అని ప్రార్థించాడు.

**కుమారపాలుడు జైనమతంలోకి...**

ఆ తర్వాత కుమారపాలుడు హేమచంద్రునికి మరీ సన్నిహితుడై జైనమతావలంబి అయ్యాడు. 1121లో తరంగలో ప్రారంభమైన జైన దేవాలయ నిర్మాణంలో హేమచంద్రుడు పూర్తి బాధ్యత తీసుకొన్నాడు. హేమచంద్రుని ప్రభావం వలన రాజ్యంలో జైనమత వ్యాప్తి జరిగింది. అహింసకు ప్రజలు అలవాటు పడ్డారు. జంతువధ నిషేదింపబడింది. గుజరాత్‌లో యజ్ఞ యాగాలలో పశువధ జరగకుండా కుమారపాల, హేమచంద్రులు కట్టడి చేశారు. హేమచంద్రుడు చనిపోయి 900 ఏళ్ళు దాటినా ఇప్పటికీ గుజరాత్ అహింసా వ్రతాన్ని అవలంభిస్తోంది.

**హేమచంద్రుని మహా నిర్వాణం**

తన మరణాన్ని ఆరు నెలల ముందే ప్రకటించి, సల్లేఖన అనే మత దీక్ష పూని నిరాహార దీక్షతో ఆచార్య హేమచంద్రసూరి 1173లో అన్హిల్వద్ పఠాన్‌లో మహా నిర్వాణం పొందాడు.

**కలికాల సర్వజ్ఞుడు**

హేమచంద్రుని రచనల మొత్తం 35,000,000 పంక్తులు ఉంటుంది. అందుకే హేమచంద్రుని కలికాల సర్వజ్ఞుడు (omniscient) అన్నారు. మహాత్ముడు అన్నారు. ఇరవై ఎనిమిది కాండల కుమారపాల చరితను హేమచంద్ర సూరి రచించాడు. ఇది అనిహిల్వద్ రాజవంశ చరిత్ర. ముఖ్యంగా కుమారపాల రాజ చరిత్ర. మొదటి ఇరవై కాండలు సంస్కృతంలోను, చివరి ఎనిమిది ప్రాకృత భాషలో రాశాడు. అందుకే దీనికి ద్వాశ్రయ కావ్యం అనే పేరొచ్చింది. చివరి భాగాలు ప్రాకృతంలో రాయటానికి తనకున్న ప్రాకృత భాషాభిమానమే కాకుండా అందులోని వ్యాకరణంలో తనకున్న ప్రతిభను తెలియజెప్పడం. దానితోబాటు ప్రాకృతంలో ఉన్న మహారాష్ట్ర ప్రాకృత, సౌరసేని మాగధి, పైశాచిలేక చూలికా పైశాచి అపభ్రంశ మొదలైన ఆరు రకాల మాండలీకాలను పరిచయం చేయటం. గుజరాతీ మాండలీకాన్ని సుసంపన్నం చేశాడు. ఆప భ్రంశ భాషలకు ఇవొక్కటే చింతామణి లాంటి వ్యాకరణ ఔషధం. ఈ కావ్యాన్ని 1160లో ప్రారంభించి చనిపోయే వరకు రాశాడు. అసంపూర్తి కావ్యాన్ని అభయ తిలక గణి 1255లో పూర్తి చేశాడని అంటారు. కాని తన పాత్ర అతి స్వల్పం అన్నాడు మణి కవి.

త్రిశష్టి శలాక పురష చరిత్ర అనే దీర్ఘ కావ్యంలో హేమచంద్రుడు ఇరవై నలుగురు జైన తీర్థంకరులతో బాటు 63 జైన మహామునుల జీవిత చరిత్ర రాశాడు. వారి పుట్టుక, పునర్జన్మ మొదలైన వివరాలను జైనమత నిర్మాణానికి, వ్యాప్తికి వారి సేవలను వివరించాడు. దీనికి అనుబంధంగా స్థవిర వాలి చరిత్ర లేక పరిశిష్ట పర్వం రాసి జైన సన్యాసుల జీవితాలను వర్ణించాడు. ఇది ఆంగ్లంలో ది లైవ్స్ ఆఫ్ ది జైన్ ఎల్డర్స్‌గా అనువాదం పొందింది. కాశ్మీర అలంకారికుడు మమ్మటుడు రాసిన పద్ధతినే అనుసరించి హేమచంద్రుడు కావ్యాలను ప్రకాశ రాశాడు. ఇందులో అభినవ గుప్త, ఆనంద వర్ధనుల రచనలను పేర్కొన్నాడు. చందాను శాసనం అనే ఛందో గ్రంథాన్ని హేమచంద్రుడు రాశాడు. కావ్యాను శాసనంతోబాటు, దానికి వ్యాఖ్యానం కూడా రాశాడు. అదే అలంకార చూడామణి ఎనిమిది అధ్యాయాల ఈ గ్రంథం సాహిత్య చరిత్రలోనే చాలా విలువైనది, అపూర్వమైనది. భరత లొల్లట దండి.. శంఖ మమ్మట, భట్టనాయక రచనలను ఇందులో సమీక్షించాడు. ఇవికాక మరెన్నిటినో స్పృశించాడు. ఇదొక విస్తృత రచన.

**నిఘంటు రచన- స్తోత్ర రచన**

హేమచంద్రుడు కూర్చిన నిఘంటువులలో దేశినామ మాల, లేక దేశి శబ్ద సంగ్రహం, అభిదాన చింతామణి, అనేకార్ధ కోశం ముఖ్యంగా పేర్కొన దగినవి. నిఘంటు శేషం అనేది జీవశాస్త్ర నిఘంటువు... శ్యాద వాద మంజరి, జినేంద్ర స్తోత్రం మొదలైనవి

వర్ధమాన మహా వీరునిపై స్తోత్రాలు. వీత రాగ స్తోత్రం అనే ఆధ్యాత్మిక స్తోత్రం కూర్చాడు. యోగశాస్త్రంతోబాటు ప్రమాణ మీమాంస గ్రంథమూ రాశాడు. సంస్కృత వ్యాకరణంగా శబ్దాను శాసనం రాశాడు. ఇందులో ఎనిమిదవ అధ్యాయంలో ప్రాకృత వ్యాకరణమూ చేర్చాడు. జైనమత కరదీపికగా యోగశాస్త్రాన్ని, లింగ నిర్ధారణకు లింగాను శాసనాన్ని హేమచంద్రుడు రాశాడు.

## గణిత మేధావి

గణితంలో కూడా హేమచంద్రుడు తన ప్రతిభను చూపాడు. అంతకు పూర్వం గోపాలుడు రాసిన ఆధారంగా హేమచంద్రుడు ఆధునిక కాలంలో పిలవబడిన ఫైబోనాసి సీక్వెన్స్‌ను తయారుచేసి చెప్పాడు. ఫైబోనాసి అనే గణిత శాస్త్రజ్ఞుడు 1202లో చెప్పిన ఈ సూత్రాన్ని యాభై ఏళ్ళకు ముందే అంటే 1150లోనే హేమచంద్రుడు తయారుచేసి చూపించిన మేధావి. దీన్ని $F(n)= F(n-1) +F(n-2)$నిర్వచనం ద్వారా చెప్పాడు ఫైబోనాసి.

సోమ ప్రభాచార్యుడు ప్రాకృత భాషలో కుమారపాల ప్రతిబోధ మహాకావ్యం రాసి కుమారపాల చరిత్రను బోధపరచాడు. సోమప్రభుడు విజయసింహుని శిశ్యుడు. మునిచంద్రునికి అయిదవ తరం వాడు. అతని తండ్రి సిద్ధపాలుని సహచరుడు, కవి హేమచంద్రుని స్నేహితుడు అయిన శ్రీపాలుగు అనిల్వివిద్ రాజాస్థానంలో ఉన్నాడు. ఈ చరిత్రలో కుమారపాలుడు జైనంలోకి పరివర్తన చెందిన విధానం వర్ణించబడింది. హేమచంద్రుని ప్రబోధం వలననే కుమారపాలుడు జైనం స్వీకరించాడని తెలియజేశాడు. అందులో కావ్యం చివర సంస్కృత భాషలో ప్రశస్తి రాశాడు. హేమచంద్రుని ఇతర గ్రంథాలు హేమకుమార చరిత్ర, సోమతినాద చరిత్ర, సాలాంత కావ్యం మొదలైనవి.

మహా మేధావి, సర్వశాస్త్ర పారాంగతుడు, సంస్కృత ప్రాకృత కవి, కలికాల సర్వజ్ఞ బిరుదాంకితుడు జైనాచార్యుడు హేమచంద్ర సూరిని మనవాళ్ళు అంతగా గుర్తించినట్లు కనిపించదు. అందుకే ఈ తరానికి హేమచంద్రుని పరిచయం చేశాను.❁

## 44. కవి చక్రవర్తి - శ్రీపాలుడు (1095-1154)

**గు**జరాత్ పాలకుడు సిద్ధ రాజ జయసింహ చేత కవిరాజు, కవి చక్రవర్తి బిరుదులు పొందిన శ్రీపాల కవి ప్రాగ్వత కుటుంబానికి చెందిన లక్ష్మణుని కుమారుడు. అన్హిల్ విద్‌లో 1095-1154లో జీవించాడు. కవి గుడ్డివాడు అంటే ఆశ్చర్యపోతాం. కవికి ముప్ఫై ఏళ్ళ వయసులో శ్వేతాంబర, దిగంబర జైనుల మధ్య పెద్ద తగాదా వచ్చింది. విస్తృత జైన సమ్మేళనం నిర్వహించారు. కర్నాటక రాజు కుముదచంద్ర దిగంబర జైన పాక్షం వహించాడు. గుజరాత్‌కు చెందిన దేవాచార్యుడు శ్వేతాంబర జైన పక్షం వహించి చర్చలు వాదోపవాదాలు జరిపారు. ఈ చర్చోప చర్చలలో శ్రీపాల కవి ప్రముఖ పాత్ర పోషించాడు. యశశ్చంద్రుడు దీనిని 'ముదిత కుముద చంద్ర' గ్రంథంలో పేర్కొన్నాడు. అతడు 'వై రోచన పరాజయం' కూడా రాశాడు. అతడు రాసిన అనేక ప్రశస్తిలు జైన ప్రాచీన లేఖమాలలో కనిపిస్తాయి.

శ్రీ పాలుని కొడుకు సిద్ధపాలుడు కూడా గొప్పకవే. 1199 వాడు. ఇతని కొడుకు విజయపాలుడు ప్రసిద్ధ కవి అని సోమప్రభ సూరి తెలియజేశాడు. రాజా కుమారపాల ఇతని ముఖ్య స్నేహితుడు. అతని పోషక రాజు సిద్ధ రాజ భీమ సేనుడు చాళుక్య రాజు 1109-1241 కాలం వాడు. రాజుగారి కోరికపై 'ద్రౌపదీ స్వయం వరం' అనే రెండు అంకాల నాటకం రాశాడు. విజయ పాల కవి 1244 వరకు జీవించాడు.❁

# 45. నేపాల్‌లో కర్నాటక వంశస్థాపకుడు, సరస్వతి హృదయ భూషణకర్త- నాన్య దేవుడు (1097-1147)

**రా**జనారాయణ అనే నాన్య దేవుడు తీర్హత్ అనే మిథిల రాజు. 1160లో బెంగాల్ రాజు విజయ సెందు ఇతని రాజ్యంను లోబరుచుకొన్నాడు. కనుక ఇతని కాలం 1097-1147గా భావిస్తారు. నాన్య దేవుడు నేపాల్‌లో "కర్నాటక వంశ" స్థాపకుడు. భవభూతి "మాలతీ మాధవం"పై విమర్శను, "భరతనాట్య శాస్త్రం"పై భాష్యాన్ని రచించాడు. దీనికే "భరత వార్తిక" అనే పేరుంది. "సరస్వతి హృదయ భూషణం లేక సరస్వతి హృదయం అలంకార హారం" అనే పది అధ్యాయాల సంగీత సర్వస్వ గ్రంథం రాశాడు. ఇందులో పదివేల గ్రంథాలను స్పృశించాడు. పూనా భండార్కర్ ఓరియెంటల్ ఇన్‌స్టిట్యూట్ వ్రాతప్రతి లభ్యం. మహర్షులు చేసి యజ్ఞ యాగాలలో వేద పరిభాష ననుసరించి సంగీత వాయిద్యాలు సృజంపంబడి నాయనన్నాడు. ఒక "వేణువు"పై తప్ప అన్ని వాయిద్యాలపైనా సంపూర్ణంగా రాశాడు. కాని అతని పాలిటి రాహువులా రాజాస్థాన విద్వాంసుడు "కుంభకర్ణుడు" అడ్డుపడి గ్రహణ సూర్యుడిని చేసి తినేశాడు. దేవుని రచనలో కొన్ని అధ్యాయాలు సప్త గీతుల మీద, మరికొన్ని దేశి గీతులపైనా రాశాడు. పురాతన తాళ విధానంపైనా రాశాడు. ఇప్పుడిది లేదు. ఇందులో మొదటివాటి నన్నిటినీ భరతుడు రాశాడు. తరువాతివి ప్రబంధాలకు దారి చూపాయి. మాతంగుడు వీటిపై ప్రత్యేక దృష్టి పెట్టాడు. సప్త గీతులపై అభినవ గుప్తుడు, దత్తిలుడు మోజుపడి రాశారు. "ఆతంమ మేధం లేక రాజ సూయం"లో వేద

క్రియలకు వీటికి ఉన్న సంబంధాన్ని వివరించారు. ఈ సప్తస్వరాలను మొట్టమొదట దక్ష ప్రజాపతి దేవతలను ఆహ్వానించటానికి గానం చేశాడు. "ఏక తంత్రి", "పినాకి", "కిన్నరి", "వీణ"లను పరిచయం చేసి వాటితో ఋషుల మంత్రాలకు సప్తస్వరం విన్యాసం చేయించాడు.

నాన్యదేవుడు 140 రాగాల గురించి ప్రస్తావించి వివరించాడు. ఈ విషయాలపై అత్యంత శ్రద్ధ తీసుకొని సాధికారికంగా చెప్పాడు. కశ్యప, మాతంగ, సారంగ దేవులను గురుదేవులుగా భావించాడు. సారంగ దేవుడు రాగాలను 260 దాకా పెంచాడు. అతని కాలానికి పూర్వమే వీటిలో చాలా రాగాలను వదిలేశారు జనం. నందుడు కూడా ఇన్నే రాగాల గురించి రాశాడు. సారంగదేవుడు నందిని అనుసరించకుండా నాన్య దేవుని రాగాలనే అనుసరించాడు. క్లిష్ట విషయాలలో అభినవ గుప్తుని మార్గదర్శిగా చేసుకొన్నాడు. అయితే వీరిద్దరి గురించి ఎక్కడా చెప్పుకోని గడుసు పిండం. సారంగుని రచనను క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే అతను ఎంత గొప్పగా అభినవుని అంతర్యాన్ని పట్టుకోగలిగాడో తెలుస్తుంది. ❁

## 46. కొంకణ రాయబారి మంఖ కవి (1100)

**మం**ఖ కవికి మంఖక, మంఖూక అనే పేర్లు కూడా ఉన్నాయి. కాశ్మీర దేశంలో పుట్టాడు తండ్రి విశ్వావర్తుడు. సోదరుడు అలంకారుడు కూడా కవే కాక కాశ్మీర్ రాజులు సుసాల, జయ సింహ రాజుల ఆస్థానంలో మంత్రి కూడా. రాజా జయసింహ 1127- 1150 కాలంలో కాశ్మీర్‌ను పాలించాడు. మంఖ కవి కొంకణ దేశానికి రాయబారిగా వెళ్ళాడు. మంఖ మరో సోదరుడు శృంగారుడు బృహత్తంత్రాధిపతి పదవిలో ఉన్నాడు. మంఖుని గురువు రుయ్యకుడు. మంఖ కవి శ్రీ కంఠ చరిత్ర కావ్యాన్ని 1140లో రాశాడు. ఇరవై అయిదు కాండల మహా కావ్యం ఇది. ఇందులో శివుడు త్రిపురాసుర సంహార విషయం రాశాడు.

చివరి కాండ చాలా ఆకర్షణీయంగా ఉంది. అందులో అనేక మంది సమకాలీన, పూర్వ కవులను పేర్కొన్నాడు. వాళ్ళ పేర్లు చెప్పటమే కాదు, ఒకొక్క కవి ఏ విషయంలో నిష్ణాతుడో కూడా వివరించటం మంఖకవి ప్రత్యేకత. ఆనందుడు న్యాయ మీమాంసలో, శంభూరిని కొడుకు ఆనందుడు వైద్యంలో, అలక దత్తుని శిష్యుడు సాహిత్య శాస్త్రంలో గర్గుడు, గోవిందుదు జల్హణుడు సాహిత్యంలో జిన్దూకుడు త్రైలోక్యుడు మీమాంసలో, జనక రాజు వేదాలలో, నందనుడు వేదాంతంలో నిష్ణాతులు అని చెప్పాడు. మొదటి కాండలో ఇష్ట దేవస్తుతి. అందరు దేవుళ్ళనూ ప్రార్థించాడు. చాలా భాగం కవితలో రెండు అర్థాలు వచ్చేట్లు నేర్పుగా కూర్చాడు మంఖ కవి. భాష మీద మంచి పట్టు ఉంది. అందుకనేనేమో మనవాళ్ళు ఎవరైనా మారాం చేసి పట్టుబడుతుంటే మంకు పట్టుపట్టాడు అంటారు. అది మంఖ కవి పట్టు ఏమో. చదివే వారికి కష్టంగా ఉంటుంది మంఖ కవిత్వం.

ప్రవాహ వేగం తక్కువ. జనరాజు దీనికి రాసిన వ్యాఖ్యానం వలన ఆ పాషాణ పాక కవిత్వాన్ని కొంతవరకు అర్థం చేసుకోవచ్చు. మంఖ కవి ప్రయోగించిన శబ్దాల అర్థాలను వివరించే నిఘంటువు మంఖ కోశం వచ్చింది. ఇది ఇప్పటికీ కాశ్మీర దేశంలో ఉన్నది. రుయ్యకవి అలంకార శాస్త్రంపై మంఖ కవి అలంకార సర్వస్వం రాశాడు. రుయ్యకుని కారికలకు వ్యాఖ్యానం రాస్తూనే మంఖ కవి అలంకార సూత్రాలు కూడా రాసినట్లు అనిపిస్తుంది. మంఖు కసుత్రోద్ధారణలో సూత్రాలకు మంఖ కవి శిష్యుడు సముద్ర బంధుడు ఉదాహరణలు రాశాడు. ఇతనే అలంకార సర్వస్వానికి వ్యాఖ్య కూడా రాశాడు. అందులో రాజా రవివర్మను కీర్తించాడు. మంఖ కవికాలంలో కాశ్మీర రాజాస్థానంలో నిరంతరం సాహిత్య చర్చలు జరిగేవి. ఎంతో విలువైన సమాచారం అందేది. కాశ్మీర రాజులు ఇతర దేశాల రాజులతో మంచి సంబంధాలు నెలకొల్పారు రాయబారులను పంపేవారు. మంఖ కవిని కాశ్మీర దేశపు రాయబారిగా కొంకణ దేశానికి పంపారని ముందే చెప్పుకొన్నాం. ❋



## 47. వీణ కనిపెట్టిన సంగీత రత్నాకర కర్త– సారంగ దేవుడు (1100)

**కా**శ్మీర్ దేశంలో ఉన్నత కుల సంజాతుడు సారంగదేవుడు. ఇతని తాత భాస్కరుడు దక్కన్‌కు వలస వచ్చాడు. భిల్లమను పూజించి తండ్రి సోద్దాలుడు పేరు పొందాడు. స్వతంత్ర రాజుగా యాదవ కులజుడైన సింగసేన రాజును దౌలతాబాద్ అనే దేవగిరిలో ఆ వంశ రాజ్య స్థాపన చేసి 1132–1169 మధ్య పరిపాలించాడు. ఈ రాజు వద్ద సారంగ దేవుడు ఆడిటర్ జెనరల్‌గా ఉద్యోగించాడు. సంగీతంలోనే కాక వైద్య, వేదాంతాలలోను నిష్ణాతుడు. అతని సాహిత్య ఆరోహణ మహా దొడ్డది. తాను సరస్వతీదేవి అనుగ్రహ పాత్రుడనని చెప్పుకొన్నాడు. తనను తరచుగా "నిశ్శంకుని"గా చెప్పుకొనేవాడు. ఈ పేరుతోనే "వీణ"ను కనిపెట్టాడు. "సంగీత రత్నాకరం" అనే సంగీత శాస్త్ర గ్రంథం రాశాడు. అంతకు పూర్వం వారు సంగీతంపై వెలువరచిన విషయాలన్నిటిని తెలియజేసి తన అభిప్రాయాలని నిస్సంకోచంగా తెలియబర్చి మహా గ్రంథంగా రాశాడు. సంగీతంపై ఇంత విస్తృతమైన తొలి గ్రంథం ఇదే. కాని శతాబ్దాలు గడిచిపోయాక గానంలో, పద్ధతులలో అనేక మార్పులొచ్చాయి. ప్రతి శతాబ్దంలోను రాగం, తాళంలలో మార్పులొచ్చాయి. తన కాలంలో ఉన్న సంగీతాన్ని సారంగ దేవుడు రాసి భద్రపరిచాడు. సంగీతంలోని వచ్చిన మార్పులు గ్రహించి అభివృద్ధి తెలుసుకోవటానికి సారంగుని గ్రంథం విలువైన సమాయారాన్నిచ్చే సంగీత సర్వస్వమే. ❀

## 48. ఉదయ సుందరి కథా రచయిత – సోద్దాల కవి (1100)

**శూ**రుని కుమారుడు, సోల్లాపేయ మనవడు, చంద్రాపతి మునిమనవడు సోద్దాలకవి. కాయస్థ క్షత్రియ కులంలో వల్లభ శాఖకు చెందినవాడు. దీనికి శిలాదిత్యుని సోదరుడు కాలాదిత్యుడు సంస్థాపకుడు. చిన్నప్పుడే తండ్రిని కోల్పోయి మేనమామ గంగాధరుని వద్ద పెరిగాడు. చంద్రాచార్యుని వద్ద కొంత విద్య నేర్చి కొంకణ రాజధాని లోని స్తానా లేక థానాకు చేరాడు. చిత్త రాజు నాగార్జున, ముమ్ముని రాజుల ఆశ్రయం పొందాడు. చిత్త రాజు, సోదరుడు పదకొండవ శతాబ్ది వారు. చాళుక్యలాట రాజు వత్స రాజాస్థానంలోను సోద్దాలుడు ఉండి గౌరవ పురస్కారాలు అందుకొన్నాడు.

సోద్దాలుడు రాసిన 'ఉదయ సుందరి కథ'1026–1080 మధ్య వత్స రాజు పాలనలో కాలంలో రచింపబడింది. ఈ కవి రాసిన కొన్ని శ్లోకాలకు ముచ్చటపడి రాజు గోప్పమంచి కావ్యం రాస్తే విలువైన ముత్యాలహారం బహూకరిస్తానని చెప్పాడు. వెంటనే కవిత్వ రచన ప్రారంభించి 'ఉదయ సుందరి కథ' రాశాడు. తన క్షత్రియ వంశ సంజాతాన్ని ఆకాశానికి ఎత్తుతూ తాను బాణుడు, వాల్మీకి అంతటి వాడిని అని రాసుకొన్నాడు సోద్దాలకుడు. అతని కవిత్వం ఆనాటి ప్రసిద్ధ శృంగార కవుల కవిత్వానికి ఏ మాత్రమూ తీసి పోదు. ఎనిమిది ఉచ్వాసాలలోని ఈ కథ నాగ లోక ప్రభువైన శిఖండ తిల కుమార్తె ఉదయ సుందరికి, ప్రతిష్టాన రాజు మలయ వాహనుడికి జరిగిన వివాహ వృత్తాంతమే. మొదటి ఉచ్చ్వాసంలో తన వంశ చరిత్ర సవివరంగా రాసుకొన్నాడు కవి. తన కవిత్వం గొప్పదనాన్ని వంశ పౌరుషాన్ని, రచనా పాటవాలను ఏకరువు పెట్టాడు. రెండవ ఉచ్చ్వాసం నుండి అసలు కథ మొదలు అవుతుంది.❋

## 49. మూషిక వంశ చరిత్ర రాసిన – అతుల కవి (1100)

**ప**దిహేను కాండాలలో అతులకవి మూషిక వంశరాజ చరిత్రను రాశాడు. అంతకు మించి అతుల గురించి మనకు ఏమీ తెలియ లేదు. దక్షిణ తిరువాన్కూరు పాలకులైన మూషిక వంశ రాజుల సుదీర్ఘ చరిత్ర ఇది. పరశురాముడు రాజ క్షత్రియ రాజ వంశ నిర్మూలన చేస్తుండగా ఒక క్షత్రియ వంశ రాజు చనిపోగా అతని భార్య పారిపోయి ఒక పర్వత గుహలో దాక్కున్నది. ఒక రోజు ఏనుగంత ఉన్న ఎలుక ఆ గుహలో దూరి ఆమెను బలాత్కారం చేయబోతే ఆమె కంటి చూపుకే అది కాలి బూడిద అయ్యింది. ఎలుక ఆత్మ పర్వత రాజు రూపంగా ప్రత్యక్షమైంది. తన రూపం మారిపోవటం గ్రహించిన ఎలుక కౌశిక ముని శాపం వల్ల తనకు ఆ ఎలుక రూపం వచ్చిందని చెప్పాడు. రాణి ఆ గుహలోనే ఉండిపోయి ఒక మగ పిల్లాడిని కన్నది. రాణితో పాటు ఇక్కడే ఉన్న రాజ పురోహితుడు ఆ పిల్లవాడికి విద్య నేర్పాడు. పరశురామ యజ్ఞానికి బలి పశువుగా ఈ బాలుడు వెళ్లి ఆయన్ను మెప్పించి చావు తప్పించుకొని ఆయన అనుగ్రహంతో 'మూషిక రామ ఘట' పేరుతో మూషిక రాజ్యానికి రాజు అయ్యాడు. ఒక కుండ నీటితో పవిత్రీకరింప బడ్డాడు కనుక రామ ఘట (కుండ) అనే పేరొచ్చింది. ఇతను మగధ రాజు మాధవ వర్మనుయుద్ధంలో చంపి కూతురు భద్రసేనను పెళ్ళాడాడు. మగధకు మాధవ వర్మ కుమారుడిని రాజును చేశాడు.

రామ ఘటకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు వటును హైహయ రాజ్యం ఇచ్చి రాజును చేశాడు. చిన్నకొడుకు నందనను చోళ రాజుగా అభిషిక్తుని చేశాడు. అరణ్యాలకు వెళ్లి వాన ప్రస్తాశ్రమంలో చివరి రోజులు గడిపాడు. మన కవిగారు

ఇక్కడి నుండి ఆ తర్వాతా రాజులందర్నీ వరుసగా పేర్కొని చివరిరాజు నీల కంఠవల్లభా అతని కొడుకు దాకా వారి చరిత్ర అంతా పూస గుచ్చి వర్ణించాడు. శ్రీకంఠరాజు ఆస్థానంలో ఉండి ఈ మూషిక వంశ చరిత్ర రాశాడు అతుల కవి. పధ్నాలుగవ కాండంలో రాజా వల్లభ కేరళపై దండయాత్రకు వస్తున్న చోళరాజును నిలువ రించటానికి కేరళ రాజుతో కలిసి చోళరాజుల దండయాత్రను ఎదుర్కొన్నాడు. ఈ చోళరాజు 1014-1046 వాడైన మొదటి రాజేంద్ర చోళుడు అయి ఉండవచ్చు. పన్నెండు, పద్నాలుగు అధ్యాయాల్లో శ్రీ మూలవాసంలో ఉన్న బుద్ధ దేవాలయాన్ని వర్ణించాడు. ఈ ఆలయం సముద్రం చొచ్చుకు రావటం వలన శిథిలమై పతన దశకు చేరుకొన్నదని ఆవేదన వ్యక్తం చేశాడు. 868లో రాజ పోషణంలో ఈ బుద్ధ దేవాలయం పరమ వైభవంగా ఉండేది. కనుక అతుల మూషిక వంశ చరిత్ర పదకొండవ శతాబ్దంలో రాసి ఉంటాడని భావిస్తారు.❋

## 50. రూప దీపిక కర్త - బహురూప మిశ్ర (1100)

**మ**హా మహోపాధ్యాయుడని పించుకొన్న మిశ్రా పన్నెండవ శతాబ్ది మొదటి వాడు. ధనుంజయ, ధనికుల రచనలకు వ్యాఖ్య రాశాడు. వాటిని దశ రూపాలు అన్నాడు. అతని వ్యాఖ్యానం పేరు 'రూప దీపిక'. దీనికి మించిన వ్యాఖ్యానం లేదని అభిజ్ఞులన్నారు.❋

## 51. సిద్ధాంత శిరోమణి కర్త, కాల్క్యులస్‌కు ఆద్యుడు - భాస్కరాచార్య (1114-1185)

**క**ర్ణాటకలోని బీజాపూర్‌లో భాస్కరాచార్య 1114లో జన్మించాడు. మహా గణిత, ఖగోళ శాస్త్రవేత్త. 'సిద్ధాంత శిరోమణి' అనే గొప్ప గ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. ఇందులో నాలుగుభాగాలు లీలావతి, బీజ గణితం, గ్రహగణితం, గోళాధ్యాయం ఉన్నాయి. నాలుగూ వేటికవే ప్రత్యేకమైనవి. ఇందులో గ్రహాలకు సంబంధించిన సకల గణితమూ ఉంది. 'కర్ణ కుతూహల' అనే మరో ఉద్గ్రంథమూ రాశాడు. న్యూటన్, లీబ్నిజ్‌లు కనిపెట్టిన కాల్క్యులస్ కంటే అర్ధ సహస్రాబ్ది (500 ఏళ్ళు) ముందే భాస్కరాచార్య దాని గురించి చెప్పాడు. 'డిఫరెన్షియల్ కాల్క్యులస్' దాని ఉపయోగించే విధానం ఆధారంగా ఖగోళ గణితాన్ని అభివృద్ధి చేశాడు. కాల్క్యులస్ పితలుగా న్యూటన్, లీబ్నిజ్‌లను పేర్కొనటం అత్యంత దారుణం. దీనికి ఆద్యుడు భాస్కరాచార్యయే అని నిర్ద్వంద్వంగా పేర్కొంటారు.

భాస్కరుడు తాను రాసిన వాటిని 'ఆర్యా వృత్త శ్లోకం'లో ఇలా తెలియజేశాడు - 'రస, గుణ, పూర్ణ మహీసమా - సాక నృప సమయే భవత్ మహోత్పత్తిః-రస గుణ వర్షేణ మయా - సిద్ధాంత శిరోమణి రచితాః. దీన్నిబట్టి తాను 1036 అంటే శక వత్సరం 1114లో పుట్టానని, 36 ఏళ్ళ వయసులో సిద్ధాంత కౌముది రాశానని, 69వ ఏట 'కర్ణ కుతూహల'1183లో రచించానని చెప్పాడు. బ్రహ్మ గుప్త, శ్రీధర, మహావీర, పద్మనాభల ప్రభావం భాస్కరునిపై ఉంది. ఉజ్జయినిలో గ్రహవేధశాలకు అధ్యక్షునిగా పని చేశాడు. మహారాష్ట్రలోని సహ్యాద్రి పర్వత ప్రాంతంలో జలగాం జిల్లాలో ఉండేవాడు. తరతరాలుగా

రాజాస్థానంలో గౌరవ స్థానంలో ఉన్న కుటుంబం. తండ్రి మహేశ్వరోపాధ్యాయుడు గణిత ఖగోళలలో నిష్ణాతుడు. కొడుకుకు వీటిని నేర్పి, మనుమడు లోక్ సముద్రకు అందజేస్తే, ఆయన కొడుకు 1202లో భాస్కరాచార్య రచనలను అధ్యయనం చేసే విద్యాలయం పెట్టాడు.

సిద్ధాంత శిరోమణిలోని 'లీలావతి'లో 277 శ్లోకాలున్నాయి. ఇందులో కొలతలు, ప్రస్తారణలు (పెర్ముటేషన్స్), ప్రోగ్రేషనన్స్ మొదలైన గణనం ఉంటుంది. బీజ గణితంలో 213 శ్లోకాలుంటాయి. సున్నా, అనంతం, (ఇన్ ఫినిటి) ధన, రుణ సంఖ్యలు, ఇప్పుడు పెల్లీస్ ఈక్వేషన్‌గా పిలువబడే 'కుట్టక పద్ధతి' ఉన్నాయి. భాస్కరుడు అదే సూత్రాన్ని ఐరోపావాళ్ళు కనిపెట్టి చెప్పిన ఎన్నో వందల ఏళ్ళ క్రితమే సాధించి చెప్పాడు. గ్రహ గణితంలో గ్రహాల వేగాలను కనిపెట్టే సూత్రం 'బిమ్బార్ధస్య కోటీయాగుణ స్త్రిజగాహారః ఫలం దొరియాయో రంతరం' చెప్పాడు. దీని ఫలితాన్ని అంతకుముందే 932లో 'లఘుమానసం'లో ముఞ్జకాచార్య లెక్క గట్టి సరి చూశాడు. ఇవన్నీ 'ట్రిగనామెట్రి'లో 'సైన్'కు సంబంధించిన లెక్కలు. గ్రహం అత్యున్నత స్థితిలో ఉన్నప్పుడు దాని వేగం శూన్యం అని చెప్పాడు. పైథాగరస్ కంటే ఆ సిద్ధాంతాన్ని ముందే చెప్పాడు. వర్గ ఘన ద్విఘాత(క్వార్టేక్) మొదలైన వాటిని చెప్పాడు. సైక్లిక్ విధానం – చక్రవల పద్ధతి చూపాడు, రుణ, కరణీయ (ఇర్రేషనల్) సంఖ్యలను సాధించాడు.

అంక గణితంలో నిర్వచనాలు, అంక గణితపదాలు, ప్రోగ్రెషన్లు మొదలైన వాటిని లీలావతిలో 13 అధ్యాయాలలో వివరంగా చెప్పాడు. బీజగణితంలో 12 అధ్యాయాలున్నాయి. ధన, రుణ సంఖ్యలను, సున్నా, తెలియని నంబర్లను (అన్నోన్) చర్చించాడు. ట్రిగనా మెట్రి, కాల్క్యులస్‌లలో ఏంటో ముందు చూపుతో ఎన్నో విషయాలు భాస్కరుడు చెప్పాకే ఎన్నో వందల ఏళ్ళ తర్వాత పడమటి దేశీయులకు తెలిశాయి. ఖగోళ శాస్త్రంలో సూర్య చంద్ర గ్రహణాలు, గ్రహాల అక్షాంశాలు, సూర్యోదయ సమీకరణాలు, చంద్ర వంకలు, గ్రహాలు, భూమికి ఉన్న సముచ్చయాలు, సూర్య చంద్ర గతులు అన్నీ ఖచ్చితమైన లెక్కలతో చెప్పాడు. 1150లోనే నిరంతరం తిరిగే యంత్రాన్ని తయారు చేసి తన ఇంజినీరింగ్ ప్రతిభనూ కనబరచాడు. ❀

## 52. కర్ణాటక సంగీతం అనే పేరు తెచ్చిన– సోమరాజు దేవుడు సర్వేశ్వరుడు (1116– 1177)

**భూ**లోక మల్లుడు అనబడే సర్వేశ్వరుడు రాజు. 1116– 1127లో పాలన చేవాడు. జీవిత సర్వస్వం పాటకు నాట్యానికి అంకితం చేవాడు. దక్షిన భారత సంగీతానికి "కర్నాటక సంగీతం" అనే పేరు ఆయన పాలించిన కర్ణాట దేశం వలన వచ్చింది. రాజరిక దర్పాన్ని ప్రక్కకు పెట్టి, "కుండలి" అనే నాట్యాన్ని మహారాష్ట్ర నర్తకికి నేర్పిన ఉదారుడు. తర్వాత దానికి "గోండిని" అనే పేరు వచ్చింది. తన ఆస్థానంలో ప్రబంధాలకు ప్రదర్శన కల్గించాడు. తన "మానసోల్లాసం"లో 2500 శ్లోకాలకు సంగీతం సమకూర్చి కొత్త విధానమైన ప్రబంధానికి మార్గదర్శి అయ్యాడు. సారంగుడు శారదా తనయుడు మరొక సోమేశ్వరునిగురించి చెప్పారు. ఈ ఇద్దరూ ఒకటేనని రుజువు లేదు. సోమరాజు దేవుడు "సంగీత రత్నావళి" రాసినట్లు విషయ సూచికలో ఇచ్చాడు. కాని అది సోమేశ్వరరాజు రచన కాదు. బహుశా 1174– 1177 కాలంలో గుజరాత్‌ను పాలించిన చాళుక్య అజయపాలుడు అనే ప్రతీహార రాజు కావచ్చు.❀

## 53. పార్వతీ రుక్మిణీయ కవి- విద్యామాధవుడు (1127)

**శి**వ పార్వతి కల్యాణాన్ని, శ్రీ కృష్ణ రుక్మిణీ కళ్యాణాన్ని కలిపి 'పార్వతీ - రుక్మిణీయం' అనే ద్వ్యర్థి కావ్యంగా రాశాడు. విద్యా మాధవుడు. చాళుక్య రాజు సోమదేవుని ఆస్థాన కవిగా ఈ కవి ఉండేవాడు. 1126-1138 కాలం కళ్యాణ రాజు నాల్గవ సోమేశ్వరుడే ఈ సోమదేవుడు. మన కవిగారు గుణవతి దగ్గర నీలాలయంలో జన్మించాడు. వేదం, శాస్త్రాలన్నీ నేర్చాడు. కిరాతార్జునీయం మొదలైన వాటిపై పై వ్యాఖ్య రాశాడు. కవిరాజు తనతోకలిపి మహా కవులు ముగ్గురే అన్నాడు. మిగిలిన ఇద్దరు బాణుడు, సుబంధు. విద్యా మాధవుడు. ఇంకో అడుగు ముందుకు వెళ్లి బాణ, సుబంధు, కవిరాజుల తర్వాతా నాలుగో వాడిని నేనే అని చెప్పుకొన్నాడు. కవిరాజు కన్నా చిన్నవాడేకాని సమకాలికుడు.

అంతకు ముందే రామాయణ భాగవత కథలను 'యాదవ రాఘవీయం'గా రాశాడు వేంకటాధ్వరి. అతని పదిహేడవ శతాబ్ది రచన 'విశ్వ గుణాదర్శం' విశిష్టమైన రచనగా పేరొందింది. కఠిన పదాలతో యమకాను ప్రాసలతో సాగిన రచన అది. ఐతే కవిరాజు కావ్యానికి ఇది తీసికట్టు. దీనిపైనా వ్యాఖ్యానం వచ్చింది. బహుశా కవి రాసిన వ్యాఖ్యానమే అది అయి ఉండచ్చు.❀

## 54. శతాధికార్థ కావ్యకర్త- సోమప్రభాచార్య (1150)

ఇప్పటివరకు ఏడర్థాల కావ్యం వరకే పరిమితమైన సంస్కృత సాహిత్యంలో శతపత్రం లాగా శతాదికార్థ కావ్యం ప్రభవించింది. కర్త సోమప్రభాచార్య కీర్తి దశ దిశలా దాని పరిమళం వ్యాపించింది. ఒకే శ్లోకానికి వంద అర్థాలు వచ్చేట్లు రాసిన కవిత్వం ఇది. నభూతో అనిపించింది. ఈ కావ్యంతో ఆయనకు శతార్థిక బిరుదు లభించింది. సుమారుగా 1177లో దీనిని రాశాడు. ఉపోద్ఘాతంలో అయిదు శ్లోకాలు రాశాడు. అందులో సూచికలో తాను భావించిన వంద అర్థాలను వివరించాడు. మొదట ఇరవై నలుగురు జైన తీర్థంకరులను, తర్వాత వైదిక దేవతలైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, నారద మొదలైన వారి విషయాలను చివరలో తన సమకాలీన కవులైన వాది, దేవ, సూరి, హేమచంద్రాచార్యలను వారితోబాటు జైనమత పోషక రాజులైన జయ సింహ దేవా, కుమారపాల, అజయ దేవ, మూలరాజ, గుజరాత్‌ను పాలించిన చాళుక్య రాజులను సిద్ధిపాల అనే గౌరవనీయ కవి, పౌరుడిని, ధర్మాచార్యులైన అనిత దేవ, విజయ సింహులను గురించి చెప్పాడు. కావ్యం చివరలో అయిదు శ్లోకాలలో ప్రశస్తి రాసి అందులో తన గురించి శిష్యులు కీర్తించిన విషయాలను చేర్చాడు. సోమ ప్రభాచార్యుడు శృంగార వైరాగ్య తరంగిణి అనే నీతి కావ్యం రాశాడు.

ఇలా అనేకార్థ కావ్యం ఆవిర్భవించింది సోమప్రభాచార్య కవితా ప్రభ వలన. ఒక అజ్ఞాత కవి నల హరిశ్చంద్ర కావ్యం రాశాడు. శ్లోకం మొదటి నుంచి చదివితే నల చరిత్ర, చివరి నుంచి చదివితే హరిశ్చంద్ర చరిత్ర వస్తుంది. దీనికి కామెంటరీ కూడా జోడించాడు. హరిదత్త కవి రాఘవ- నైషధీయం రాశాడు. ఇది రామ, నల కథ. ఈ కవిగార్గ్య గోత్రీకుడు. తండ్రి జయశంకరుడు. దీని వ్యాఖ్యానంలో భట్టోజి దీక్షితులను, భట్టమల్ల, కేశవ, రామకృష్ణ, రభస, యాదవ

మొదలైన నిఘంటుకారులను పేర్కొన్నాడు. ఇది పద్దెనిమిదవ శతాబ్ది తొలి కాలపు రచన.

అనంతసూరి రచన హరిశ్చంద్రోదయం ఇరవవై కాండాల ద్వ్యర్థికావ్యం. ఇందులో ఒక హరిశ్చంద్రుడు పురాణ పురుషుడైతే రెండవ హరిశ్చంద్రుడు కవి గారి పోషక రాజు.

సూర్యకవి లేక సూర్య దాస లేక దైవజ్ఞాన పండితుడు రామ- కృష్ణ విలోమ కావ్యం అనే ముప్ఫై ఎనిమిది కాండాలుగా రాశాడు. మొదటి నుంచి శ్లోకాన్ని చదివితే రామ పరమైన అర్థం, రెండవ చివర నుండి చదివితే కృష్ణ పరమైన అర్థం వస్తుంది. కవి భరద్వాజ గోత్రికుడు తండ్రి జ్ఞానాది రాజు పార్థపురంలో ఉండేవాడు. దేవగిరి రాజు రామ ఆస్థానంలో రామకవి ఉండేవాడు. ఈ కవి ఖగోళ విజ్ఞాని. 1539లో సూర్య ప్రకాశ రాశాడు. లీలావతి గ్రంథంపై 1542లో విమర్శ రాశాడు. అతడు అయిదు కాండాలలో రాసిన నృసింహ చంపువు, బాల బోధిక వ్యాఖ్య, దేవేశ్వరుని కవికల్పకత లభిస్తున్నాయి.

కృష్ణమూర్తి అనే మేధావి, కవి కంకణబంధ రామాయణం అనే ముప్ఫై రెండు అక్షరాల ఏకశ్లోకం రాశాడు. ఇది చేతిగాజులాగా గుండ్రంగా ఉంటుంది కనుక కంకణం అనే పేరొచ్చింది. ఎడమవైపు నుంచి మొదలుపెట్టి చదివినా కుడి నుంచి ఎడమకు చదివినా, అఏక ఏ అక్షరం నుంచి మొదలుపెట్టి చదివినా అరవై రెండు శ్లోకాలు వచ్చేట్లు రాసిన ఏకశ్లోక కావ్యం. కవి తల్లి గౌరీ తండ్రి సర్వజ్ఞుడు. వసిష్టగోత్రం. సర్కారు జిల్లాలవాడై ఉంటాడని, పందొమ్మిదవ శతాబ్ది కవి అని తెలుస్తోంది.

ఇదే రకమైన కంకణ బంధ ఏక శ్లోక కావ్యాన్ని మరింత వృద్ధి చేసి శ్రీ చర్ల భాష్యకార శాస్త్రి రాశారు. ఈయన కృష్ణాజిల్లా కాకరపర్తి గ్రామవాసి. కంకణ బంధ రామాయణంలో వచ్చే ప్రతిశ్లోకానికి వచ్చే అర్థ భావాలను తెలియజేస్తూ, సంయుక్తాక్షరాలను విడదీసి అందులోనుంచి 128 శ్లోకాలను విడమర్చి చూపించాడు.

ఈ విధంగా అనేకార్థ కావ్యాలు వాటిలో చమక్కులు జిమ్మిక్కులు విపరీతంగా పెరిగిపోయి సాహిత్యం ఒక సర్కస్ కింద మారింది. బుద్ధికి పదును పెట్టింది కాని మనసుకు హృదయానికి స్థానం లేకుండా పోయింది. దీనికి తగిన సాహిత్య వైద్యం చేసే కవి ఆవిర్భవించాల్సిన అవసరం కలిగింది. ❀

## 55. వీరశైవాన్ని బ్రోధించిన బసవ నమంత్రి (1105-1167)

**లిం**గాయతులకు వీరశైవ మతాన్ని స్థాపించిన బసవడు కాలచూరి రాజు బిజ్జలుని ప్రధాన మంత్రి. 1156లో రాజయ్యాడు. వీరశైవాన్ని వ్యాప్తి చేసిన ఏకోరాముడు పండితారాధ్యుడు రేవన్న మరుల, విశ్వరాధ్యుడు శివుని పంచముఖాలుగా భావిస్తారు. వీరంతా శివుని అవతారాలే. బసవడు వీరశైవ విశ్వాసాన్ని పునః స్థాపించాడు. చరిత్ర ప్రకారం పై ఐదుగురు బసవని సమకాలాకులే. కొందరు ఆయనకంటే పెద్దవారు, కొందరు చిన్నవారు. బసవ విజయంలో శంకరారాధ్యుడు బసవని జీవితం వివరించాడు. పాల్కురికి సోమన బసవ పురాణంలోనూ బసవన గద్యలోనూ ఆయన గురించి చెప్పాడు. సోమనాధుడు పండితారాధ్యుని జీవితంపై పండితారాధ్య చరిత్ర రాసాడు. సోమనాధుడు భ్రుంగీ రిత గోత్రుడు. గురు లింగని కుమారుడు. ప్రతాప రుద్రుని కాలంలో 1140-1196లో జీవించాడు. సాంఘిక సంస్కరణలను రచనలలో ప్రతిబింబింప జేశాడు. కుల, లింగ వివక్షతలను దూరం చేశాడు. పట్ స్థవ వచనం, కాలజ్ఞాన వచనం, మంత్రం గోప్యం, ఘటచక్ర వచనం, రాజయోగ వచన రచనలు చేసినట్లు తెలుస్తోంది. భక్తిమార్గమే ముక్తికి సోపానం అన్నాడు. బసవ లింగాయతులకు లింగధారణ తప్పనిసరి చేశాడు.❋

## 56. సరస్వతీ పుత్ర- వస్తుపాల రాజ కవి (1180-1242)

**ఆ**చరాజు, కుమారదేవిల కుమారుడే వస్తుపాలుడు. వీరి ప్రసిద్ధ పరాన్ల వంశం వారు. ముత్తాత చందపుడు రాజ ప్రముఖులలో సూర్యుడు అని గుర్తింపు పొందాడు. ఆయనకు నలుగురు కొడుకులు. చండప్రసాద్, సూరా, సోమ, ఆశ్వరాజు. పెద్దవాడు రాజ ముద్రికకు అధికారి. రాజ్యంలో మిగిలిన ముగ్గురూ అత్యున్నంత ప్రభుత్వాధికారులే. భార్య అభూ అనే సైన్యాధికారి కూతురు. అతను ధోకా రాజు వరద వాలకు ముఖ్యమంత్రి. అతని శక్తి సామర్థ్యాలు అపూర్వం. ఆయన సైన్యాధ్యక్షుడిగా ఉండి దక్కన్, లతా గోద్రా రాజుల దండయాత్రలను సమర్థంగా ఎదుర్కొని రాజ్యాన్ని రక్షించాడు. 1221 చిరస్మరణీయ మౌంట్ అబూ యాత్ర చేవాడు. అక్కడ దేవాలయాలకు భూరి దానాలు చేవాడు. అవి శిలాఫలకాలపై కనిపిస్తాయి. అతని కీర్తి దశ దిశలా వ్యాపించింది. 1242లో చనిపోయాడు. సోమేశ్వర కవి తన కీర్తి కౌముదిలో వస్తుపాల గుణగణాలను దాతృత్వాన్ని భక్తిని శీల సంపదను విశేషంగా వర్ణించాడు.

వస్తుపాలుడు స్వయంగా కవి. ఇతర కవుల ప్రతిభను మెచ్చాడు. సోమేశ్వరునిపై అసూయ ఉన్నా హరిహర కవిని ఆదరించాడు. మూడు గొప్ప గ్రంథాలయాలను స్థాపించాడు. విలువైన వ్రాత ప్రతులను సేకరించి వాటిలో భద్రపరచాడు. నరచంద్ర సూరి రాసిన కథారత్న సాగరంను ప్రోత్సహించాడు. నరేంద్ర ప్రభుని అలంకార మహోదధిని కూడా సమాదరించాడు. దీనివలన విలువైన సాహిత్యం వచ్చింది. వస్తుపాలుని జ్ఞానం అసాధారణమైనది. సరస్వతీ పుత్రుడు అనే బిరుదు పొందాడు. కవి కుఞ్జర కవి చక్రవర్తి ఇతర బిరుదులు. కవి జనాశ్రయంలో దర్బారు సరస్వతీ సామ్రాజ్యం అనిపించేది. అందుకే వస్తుపాలుడు లఘు భోజుడు అని కీర్తించారు. అతని ఆస్థానంలో ఉద్దండ కవులు సోమేశ్వర, అరిసింహ, నానక మొదలైన వారుండేవారు.

వస్తుపాలుడు రాసిన నర నారాయణానంద కావ్యం పదహారు కాండలు కలది. నర నారాయణ స్వరూపలైన అర్జున శ్రీకృష్ణుల దివ్య చరిత్ర ఇందులో రాశాడు. గిర్నార్ అడవులలో వారిద్దరి సంచారం, సుభద్రను అర్జునుడు ఎత్తుకు వెళ్ళి వివాహం చేసుకోవటం మొదలైన కథలున్నాయి. ఉత్ప్రేక్షకు వైభవం తెచ్చి ఆ వర్ణనలతో కావ్య పరిపుష్టి కలిగించాడు. శిశుపాల వధను అనుసరించి రాశాడు. కథా కథనంలో అనేక సూక్తులు చెప్పాడు వస్తుపాలుడు. వాటినన్నిటిని సేకరించి ఒక పుస్తకంగా ప్రచురించారు. జల్హణుని సూక్తి ముక్తావళిలో ఇందులోనివి చాలా భాగం చోటుచేసుకొన్నాయి. అతని ఈశ్వర మనోరథ మయస్తోత్రం భక్తికి, ఆధ్యాత్మికతకు విశిష్టమైనదిగా గుర్తింపు పొందింది. ❀

## 57. రాఘవ పాండవీయ ద్వ్యర్థికావ్యకవి - ఇటికాల కృష్ణ పండితుడు (1198)

**11**వ శతాబ్దంలోనే కవిరాజు రాఘవ పాండవీయ ద్వర్థి కావ్యం రాశాడు. ఇప్పుడు కృష్ణ పండితుడు మరొక కావ్యం రాశాడు. దీనికి దేగరమూడి రామసూరి 'కల్పవల్లి' పేరుతొ వ్యాఖ్యానం రాశాడు. ఇటికాల కృష్ణ పండితుడు లక్ష్మి, అనంతుల కుమారుడు. ఇటికాల వారు ఖమ్మం జిల్లావారు. ద్వైతులు. 16వ శతాబ్ది పశ్చిమార్ధంలో ఉన్న పింగళి సూరన ద్వ్యర్థికావ్యాన్ని తెలుగులో రాసిన సంగతి మనకు తెలుసు. ఆనంద తీర్థుని శిష్యుడనని చెప్పుకున్నాడు. కనుక కాలం 1198-1287గా భావించారు. కావ్య ప్రారంభం -

'కల్యాణం మే విధత్తం కమలజ్జనకః సృష్టి సంస్థాన పాతుః-కాంతో
గౌర్యాంగ కన్యాద్రుతర కమల వసతా సుప్రసిద్ధః'

చివరి శ్లోకం - 'శ్రీ ధన్యే రాష్ట్ర మంచ త్సకల భువి తదా వర్ష దబ్దో యయేస్టం -
రో సస్త చైర్జ జుమ్భే క్షతి రరి వితతి ర్నామ శేషా బభూవ
నస్తం రోగాప మృత్యు శ్రుతిమల భత నో జార చోర ప్రవృత్తిః-వృత్త
ర్వర్నా శ్రమాణాం వ్యయజత చరణోరస్తధర్మర్చతుర్భి".

ఈ కావ్యం ఎనిమిది స్కంధాలతో ఉన్నట్లు తెలుస్తోంది.❁



## 58. ద్వైతమత స్థాపకులు మధ్వాచార్య (1198-1278)

**ఆ**నందతీర్థులు అనే మధ్వాచార్య కర్ణాటకలోని ఉడిపి దగ్గర బెల్లె అనే గ్రామంలో 1198లో జన్మించాడు. నవరాత్రి చివరి రోజు నవమి నాడు జన్మించటం వలన అది మాధవ నవమి అయ్యింది. తల్లి వేదవల్లి. అసలు పేరు వాసుదేవుడు. చిన్నప్పటి నుంచే ఆధ్యాత్మిక శక్తి ఏర్పడింది. ఇరవై ఐదేళ్ళకు సర్వశాస్త్ర పారంగతుడయ్యాడు. కనుక పూర్వప్రజ్ఞావంతుడు అని పేరు. కుటుంబాన్ని త్యజించి సన్యాసం స్వీకరించి అచ్యుత ప్రకాశ గురువు వద్ద దీక్ష పొంది ఆనంద వర్తనుడయ్యాడు. ద్వైతమతాన్ని స్థాపించి భారతదేశ మంతటా పర్యటిస్తూ ద్వైత మతాన్ని ప్రచారం చేశాడు. వ్యాస సూత్రాలకు గీతకు ద్వైత భాష్యం రాసాడు. చివరి రోజులు సూరి దంతారంలో నేత్రావతి కుమారా ధారనదుల మధ్య ద్వీపంలో గడిపారు. 79 ఏళ్ల ఆరు నెలల ఇరవై రోజులు జీవించి 1278లో వైకుంఠం చేరారు. ఉడిపిలో శ్రీకృష్ణ దేవాలయం నిర్మించాడు. దాన్ని ఎనిమిదిమంది శిష్యులకు బాధ్యత అప్పగించాడు. నడిచి బదరీ క్షేత్రం చేరి ఎన్నో ఏళ్ళుగా కళలు గన్న బదరీ నారాయణ దర్శనం చేసుకొన్నాడు. అక్కడ నిత్యం గంగాస్నానం చేస్తూ 48 రోజులు మౌనదీక్షలో ఉన్నాడు. అక్కడి నుండి వ్యాస బదరికి వెళ్ళి చిరకాల కోర్కెను తీర్చుకొన్నాడు. రెండవసారి బదరీ వెళ్ళి గంగానది దాటుతుంటే అది ముస్లిం రాజ్యం కనుక దాటరాదని చెప్పి రాజు వద్దకు తీసుకొని వెళ్లారు.

అందరికీ తండ్రి అయిన పరమాత్మ దర్శనానికి వెడుతున్నాను అనగానే ముస్లిం రాజు ఆశ్చర్యపడి ధైర్యానికి మెచ్చుకొని అక్కడే ఉండిపొమ్మని ఎన్నో జాగీర్లు రాసిస్తానని అర్థించాడు. వాటికి ఆశ పడని ఆచార్య బదరి వెళ్ళిపోయాడు. ఉత్తరాది మఠంతోసహా 22 మఠాలను మధ్వాచార్య స్థాపించారు. మొత్తం పదహారు మహా గ్రంథాలు రాశారు.

మధ్వాచార్య 37 గ్రంథాలు రాసారు. ఇందులో వేదాంతపరమైనవే ఎక్కువ. ఆయన రాసిన యమక భారతంలో మహాభారత కథను యమకంలో మహా గమకంగా చెప్పారు. ఆయన రాసిన ముఖ్య స్తోత్రాలు ఆర్యా స్తోత్రం, గురు స్తోత్రం, కృష్ణ స్తుతి, ద్వాదశ సోత్రాలు ముఖ్యమైనవి. భాగవత తాత్పర్య నిర్ణయం మరియు భారత తాత్పర్య నిర్ణయం గ్రంథాలు భాగవత మహాభారతాలపై మహా వ్యాఖ్యానాలు. కృష్ణ కర్ణామృత మహార్ణవం, శంకర విజయం శంకరాచార్య అవతార కథ మధ్వాచార్య రాసారని అంటారు. ❁

## 59. భావ ప్రకాశనకర్త- శారదాతనయుడు (1100-1200)

**కా**శ్యప గోత్రీకుడైన భట్ట గోపాలుని కొడుకే శారదాతనయుడు. మేరుత్తర జన పదంలో మాతార పూజ్య నివాసి. విష్ణువు గురించి ముప్ఫై యజ్ఞాలు చేసి వేద భూషణం అనే వ్యాఖ్యానాన్ని వేదాలపై రచించాడు. ఇతని కొడుకు కృష్ణుడు. తాత శారదా తనయుడు వేదంలోను శాస్త్రాలలోను గొప్ప పండితులు. కాశీలో విశ్వేశ్వర భక్తుడు. శివానుగ్రహంతో జన్మించినవాడే భట్ట గోపాలుడు. గోపాలుడు పద్దెనిమిది విద్యలలో అపార పాండిత్యం ఉన్నవాడు. శారదాదేవిని ప్రసన్నం చేసుకొని కుమారునికి జన్మనిచ్చి శారదా తనయుడు అని నామకరణం చేసుకొన్నాడు కృతజ్ఞతగా. దివాకరుని వద్ద విద్య నేర్చాడు. నాట్యశాల స్థాపించి కళా సేవ చేశాడు. ప్రత్యభిజ్ఞ సిద్ధాంత అవలంబకుడు. దీని మూలం కాశ్మీరం. అభినవ గుప్తుడు వ్యాప్తి చేశాడు. శారదా తనయుడు సంగీత మూలాలను గుర్తించి 36 తత్వాలను ప్రతిభిజ్ఞ సిద్ధాంతానికి అన్వయించాడు. పరమాత్మ, జీవాత్మ ప్రకృతిలపై విపులమైన చర్చ చేవాడు. దీని ఆధారంగా తన నాటకాలలో నాటక రసాన్ని ప్రేక్షకులు అనుభవిన్చేట్లు చూశాడు. ప్రేక్షకానందం జీవుడు ప్రపంచ సుఖాలను అనుభవిస్తూ పొందే ఆనందంగా చెప్పాడు. ప్రతిభిజ్ఞ వేదాంతంలో కూడా రాగం, విద్య కళ ఉన్నాయన్నాడు. భోజుని శృంగార ప్రకాశను అనుసరించాడు. పదమూడవ శతాబ్దపు కవులు ఇతన్ని ఎక్కువగా ఉదహరించారు కనుక కాలం పన్నెండు పదమూడు శతాబ్దాల మధ్య అని తేల్చారు. సంగీతంపై శారదీయం రాశాడు. కావ్య ప్రకాశకు వ్యాఖ్య రాశాడు. అతని భావ ప్రకాశానం ఉద్గ్రంథం. పది అధికారికలపై విస్తృత చర్చ చేశాడు.❁

## 60. "రతి రహస్యం" రాసిన కొక్కోకకవి (1200)

**వా**త్సాయన కామసూత్రాలు తర్వాత వచ్చిన ప్రసిద్ధ కామశాస్త్ర గ్రంథాన్ని కొక్కోక కవి రాశాడు. అందుకే దీనికి "కొక్కోకం" అని పేరు. కొన్ని వ్రాత ప్రతులను బట్టి ఇతడు సింహళ పాటలీయుడని, బారి భద్రుడు అని, సింహళ దేశం వాడని వేరు వేరుగా చెప్పారు. చివరికి సింహళీయుడు అని తేల్చారు. ఇతని ముత్తాత ప్రసిద్ధ పండితుడు "తేజోకుడు". తండ్రి "గద్య విద్యాధర" బిరుదు పొందినవాడు. మల్లినాథుడు కొక్కోక కవిని ముందుగా పేర్కొన్నాడు. ఇతని కాలం పదిహేనవ శతాబ్దం కావచ్చు అంటారు మల్లాది శాస్త్రిగారు.

కొక్కోక శాస్త్రం అవతారికలో కొక్కోక కవి తనను గురించి చెప్పుకొన్నాడు–

"కొక్కోక నామ్నా కృతినా క్రుతోయం శ్రీ వైన్య దత్తస్య కుతూహలేన సకల కలాకలాప నిష్ణాతో వాగ్విలాస జిత బృహస్పతి: కొక్కోనామా కవి: నందికేశ్వర, శ్వేత కేతు పాంచాల దత్తక చారాయణ సువర్ణ నాద ఘోటక ముఖ గోవర్ధ గోణికాపుత్ర కూచిమార వాత్సాయన ప్రభ్రుతిభిః క్రుతేభ్య శాస్త్రేభ్య స్సార మాణాయ రతి రహస్యాఖ్యం గ్రంథ మారభామాన:"

ఇందులో వైన్యదత్తుడు ఎవరో మనకు తెలియదు. పైన పేర్కొన్న వారి గ్రంథాలను కొక్కోక కవి చదివినట్లు అనిపించదు. వారిని స్మరించటం మాత్రమే చేసి ఉంటాడు అన్నారు మల్లాదివారు. కనుక మొత్తం మీద ఈ కవి వాత్సాయన కామసూత్రాలను మాత్రమే ఆధారంగా చేసుకొని తన శాస్త్రాన్ని రచించాడని తెలుస్తోంది.

కొక్కోక శాస్త్రంలో పది పరిచ్ఛేదాలున్నాయి. కంచ నాధుడు "దీపిక" పేరుతో, రామచంద్ర బుధేంద్రుడు "ప్రకాశిక" పేరుతో దీనికి వ్యాఖ్యలు రాశారు. కామసూత్రాలను అనుసరించి రాసినా దానికంటే లోకంలో కొక్కోకం బాగా వ్యాప్తి చెందింది. "దిండుకింద పుస్తకం" అయింది చాలా ఇళ్ళల్లో. కొక్కోకాన్ని కుంభరాణ, నయచంద్రుడు ఉదాహరించారు కనుక పన్నెండవ శతాబ్దంలో రాసి ఉంటాడని కృష్ణ మాచారియార్ "హిస్టరీ ఆఫ్ క్లాసికల్ సాంస్క్రిట్ లిటరేచర్"లో నిర్ణయించాడు. కొక్కోకం అన్ని భాషల్లోకి అనువాదం పొందింది. ముఖ్యంగా ఇంగ్లీష్ అనువాదం "కోక శాస్త్ర"తో అందరికి దగ్గరయ్యింది.❁

## 61. 'వాదిభ సింహ' కవి – (1200)

**ది**గంబర జైన ముని వాదిభ సింహుడు పుష్పసేన ముని శిష్యుడు. అసలు పేరు ఒడియ దేవుడు. సింహం ఏనుగుపై ఎలా లంఘించి పీచం అణస్తుందో తానూ కూడా వాదంలో అలాగే ప్రతివాదిని ఓడిస్తానుకనుక తనకు 'వాదిభ సింహ' బిరుదు వచ్చింది అని చెప్పుకొన్నాడు. ఈ కవికి గురువే సర్వస్వం. తన గురువు మూర్ఖులను కూడా విద్యా వంతుల్ని చేసే శక్తికలవాడని చెప్పాడు. తమిళనాడు ప్రాంతపు కవిగా ఈయనను భావిస్తారు. ఈతని వంశం వారు ఇంకా అక్కడ ఉన్నారట.

పదకొండు లంభాలలో 'గద్య చింతామణి' కావ్యం రాసి అందులో సత్య ధర రాజు అతని కుమారుడు జీవన ధర రాజు క్రమంగా వివేకులై జైనాన్ని ఎలా అనుసరించారో తెలియజేశాడు. దీనికి ఆధారం గుణ భద్రుని 'ఉత్తర పురాణం'. రచన అంతా భట్ట బాణుని కాదంబరిని అనుసరించి రాసినట్లే కనిపిస్తుంది. దుర్గుణం పతనానికి హేతువు అనే నీతి ఇందులో ప్రాధాన్యంగా చెప్పాడు. ఇతని 'క్షత్ర చూడామణి' కావ్యం పదకొండు అధ్యాయాలు కలది. ఇది జీవన ధర రాజు చరిత్ర. ఇది తమిళంలోని 'జీవక చింతామణి'కి పూర్తి సంస్కృతానువాదం అనిపిస్తుంది. భోజ మహారాజు మరణ వార్త విన్న కాళిదాస మహాకవి విలపించినట్లే సత్యన్ధర రాజు దుస్టమంత్రి కాస్టాంగర మాయోపాయానికి బలై మరణించి నప్పుడు ప్రజలు కాళిదాసులాగా విలపించారని రాశాడు. ❋

## 62. దూతాంగద నాటక కర్త – సుభట (1200)

**సో**మదేవుడు, నామి సాదు సుభట కవిని బాగా కీర్తించారు. ఇతని 'దూతాంగద' నాటకాన్ని అనిల్ విద్ రాజు త్రిభువన పాల దేవుని కాలంలో 1242లో గుజరాతులోని సోమనాధ జ్యోతిర్లింగ దేవాలయ పునః ప్రతిష్టా కార్యక్రమంలో ప్రదర్శించారు. ❋

## 63. కావ్య కళానిధి రాసిన - కృష్ణ సూది (1200)

**జ**గన్నాధ పండిత రాయల వంశం వాడిన కృష్ణ సూది శివరాముని కుమారుడు. కంచి దగ్గర సేయ్యార్ నదీ తీరంలో ఉత్తర మల్లూర్ నివాసి. 'కావ్య కళానిధి' రాశాడు. తన ప్రాపు అయిన కొల్లం రాజు రామ వర్మ ను వర్ణిస్తూ ఛందో రీతులను వివరిస్తూ ఉదాహరణలు ఇచ్చాడు.

గోపాలాచార్య కొడుకు సంతలూరి కృష్ణ సూరి 'అలంకార మీమాంస'లో జగన్నాధుని రసగంగాధారంను ఏకి పారేశాడు. కృష్ణ సూది కృష్ణా జిల్లావాడు. 'సాహిత్య కల్ప లతిక' కూడా రాశాడు.

కాకతి ప్రతాప రుద్రుని (1290) ఆస్థానంలో ఉన్న భల్లట కవిని వీర భల్లట అంటారు. నాట్య శాస్త్ర నిష్ణాతుడు. 'నాట్య శేఖరం' రాశాడని అభినవ భూషణ కర్త శ్రుంగార శేఖరుడు తెలియజేశాడు.❁

## 64. సూరి వంశ చరిత్ర రాసిన– ముని రత్నసూరి (12వ శతాబ్దం)

**చం**ద్రా గచ్చకు చెందిన సముద్ర ఘోషుని శిష్యుడు ముని రత్నసూరి. ఇతని శిష్యుడు జయ సింహుడు గురువు గారిపై ప్రశస్తి రాశాడు. 'అమమాస్వామి చరిత్ర'ను చాళుక్య వంశానికి చెందిన వారాహి రాజు శ్రీమాల కుల రాజస్థాన కోశాధికారి. యశోద వాల కుమారుడు జగద్దేవుడు రాయమని కోరితే రాశాడు. అప్పటికే గొప్ప కవి అనిపించుకొన్నాడు. ధారా నగరరాజు నరవర్మ ఆస్థానంలో ముప్పై కాండాలలో 'అమామ స్వామి' జీవిత చరిత్రను మధుర మనోహరంగా రాశాడు. పాట్నాలో ఈ రచన చేశాడు. 1252 శాంతి నాధ ఆలయంలో చదివి వినిపించాడు. ఇందులో పురాణ పాల, యశపాల, మన పాల, మహానాదలను కీర్తించాడు. మరో గ్రంథం 'మునీశ వర చరిత్ర'ను ఇరవై మూడు కాండాలలో రాసి అందులో తన సూరి వంశానికి చెందిన ప్రసిద్ధుల జీవితాలను వర్ణించాడు.❁

## 65. అమరచంద్రుని జంట కవి - అరిసింహుడు (12-13 శతాబ్దం)

**లా**వణ్య సింహుని కొడుకైన అరి సింహుడు వస్తుపాల మంత్రి ఆశ్రితుడు. తక్కారకు అధికారి. అమరచంద్రుడు సహ సాహిత్య జీవి. అమరచంద్రునికి సిద్ధ సరస్వతి మత్రాన్ని ఉపదేశించింది అరి సింహుడే. ఈ జంట కవులు 'కవి కల్పలత' సూత్రాలు కలిసి రాశారు. అరి సింహుడు 'కవితార హాసం' రాశాడు. పదకొండు కాండాల 'సుకృత సంకీర్తన'లో అరి వస్తుపాలుని మహోజ్వల చరిత్ర రాశాడు. మొదటి కాండంలో అనహిల్ల పట్టణం నిర్మించిన వన రాజును, అతని చాపోత్కర వంశ రాజులను వర్ణించాడు. ఇది ఉదయ ప్రభ రాసిన సుకృత కల్లోలిని లాగానే ఉంటుంది. రెండవ కాండలో చాళుక్య రాజ్య మూల పురుషుడు మూల రాజుతో ప్రారంభించి రెండవ భీమ దేవుదు వస్తుపాల, తేజపాలల దాకా రాశాడు. మిగిలిన కాండలలో వస్తుపాలుని యాత్రలు దాన ధర్మాలు వివరించాడు. ప్రతికాండం చివర అమరసింహుడు తాను రాసిన నాలుగు శ్లోకాలను చేర్చాడు. మల్లినాధుదు నిర్మించిన గోడలోని గూడును కూడా వర్ణించాడు. వీటికి ఆధారాలుగా మౌంట్ ఆబూలో శిలాశాసనాలున్నాయి.❀

## 66. కీర్తి కౌముది, కావ్యాదర్శ కర్త - సోమేశ్వర దేవుడు (12-13 శతాబ్దం)

**సో**మశర్మ లేకసోమేశ్వర దేవుడు ఆశుకవి. కుమార, లక్ష్మిల కుమారుడు. అతనిపైన ఎనిమిదవ తరం వాడైన సోలుడు అనిల్ విద్లో చాళుక్య సామ్రాజ్యాన్ని మొదట స్థాపించిన మూల రాజు ఆస్థాన పురోహితుడు. సోలుని తర్వాత ఆకుటుంబం వారందరూ ఆస్థాన పురోహితులే అయ్యారు. సోమేశ్వరుడు వస్తుపాల రాజు స్నేహితుడు. విరాధ పాల, విశాల దేవ రాజుల దర్బారులో సోమేశ్వరుని ప్రశస్తిని రాజశేఖరుడు 'ప్రబంధ కోశం'లో తెలియ జేశాడు. హరిహర, సుభటులు సోమేశ్వరుని స్నేహితులు. వీరిద్దరు సోమకవి కవిత్వాన్ని మెచ్చారు. సోమేశ్వరుడు తన 'కీర్తి కౌముది'లోను, 'సురతోత్సవం'లోను తన పోషకరాజులను కీర్తించాడు. ఇందులోని రెండవ కావ్యంలో పదిహేను కాండాలలో సురత రాజును, అతని చైత్ర వంశాన్ని వర్ణించాడు. ఇందులోని హిమాలయ వర్ణన అసదృశం. 'ఉల్లాఘ రాఘవం'లో శ్రీరామచరిత్రను నాటకీకరించాడు. పార్ధ పరాక్రమ కావ్యానికి యువ రాజు ప్రహ్లాదనుడు కవి అని సురతోత్సవంలో చెప్పాడు. రామ శతకం కూడా రాశాడు సోమ. కావ్యాదర్శ రాశాడు. కావ్య ప్రకాశకు వ్యాఖ్య కూడా రాశాడు సోమేశ్వరుడు. ❁

## 67. కవి రాక్షసుడు (11 -13 శతాబ్దం)

గొప్ప లక్షణ గ్రంధకర్త అని 14వ శతాబ్ది తర్వాతి తెలుగు లాక్షణికులు వ్యాకరణకర్తలు, అలంకార శాస్త్ర రచయితలూ. కవులచేత ప్రశంసింపబడిన కవి రాక్షసుడు మహాకవి బహు గ్రంథ రచయిత. ఇతని రచనలు - కవి రాక్షసీయం, ఆది నారాయణ చరిత్రం అనే తెలుగు రచనలు, కవిరాక్షసీయం అనే ద్వ్యర్థి కావ్యం, సదార్ధ నిర్ణయం అనే నిఘంటువు సంస్కృతంలో రాసినట్లు చెప్పబడ్డాడు. ఆంధ్ర కవులు ఇతనికాలం 11-13 శతాబ్దాల మధ్య అన్నారు. దాక్షారం నివాసి అన్నారు. రాక్షస నిఘంటువులో 67శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. అసలు పేరు కాక బిరుదనామమే కవి రాక్షసుడు. ఈ బిరుదు రావటానికి కారణం కవే చెప్పాడు -

"సాక్షరేషు భవతీహ జగత్యం సర్వ ఏవ హృది మత్సర యుక్తః - సాక్షరం కవి జనేషు తమేనం లోక ఏష "కవి రాక్షస మహా
కవిరాక్షసీయంపై నాలుగు వ్యాఖ్యలున్నాయి. 1) నాగ నారాయణుడి 'సిద్ధార్ధ దీపిక, తెలుగు కవి లోకనాధుడు రాసిన వ్యాఖ్యానం కాక అజ్ఞాత రచయితలవి మరో రెండున్నాయి.

కవి రాక్షసీయం 105 శోకాల గ్రంథం. ప్రతి శ్లోకానికి రెండు అర్ధాలుంటాయి. అందులో మొదటిశ్లోకం-
గుణ దోషౌ బుదో గృహ్ణన్ ఇందు క్ష్వేలా వివేశ్వరః - శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛాతి.❀

## 68. 'సంకేత' వ్యాఖ్యకారుడు- మాణిక్య చంద్ర (1220)

సాగరేంద్రుని శిష్యుడైన మాణిక్య చంద్ర లేక మాణిక్య సూరి రాజాగచ్ఛకు చెందినవాడు. కావ్య ప్రకాశ కు రాసిన వ్యాఖ్య 'సంకేత'లో తన వంశ చర్త్ర చెప్పుకొన్నాడు. పార్శ్వనాథ చరిత్ర, శాంతినాద చరిత్ర కూడా రాశాడు 1220 కాలం వాడు.❀



## 69. సంగీత సమయ సార కర్త – పార్శ్వ దేవుడు (1230)

**గౌ**రీ, ఆదిదేవ దంపతుల కొడుకు పార్శ్వ దేవుడు. శ్రీకంఠ జాతికి చెందినవాడు. గురువు మహా దేవరాయలు. జైనుడు, సంగీతమే మోక్షానికి మార్గం అని దర్శనాలు కాదని నమ్మాడు. 'సంగీత సాకారుడు', 'శృతి జ్ఞాన చక్ర వర్తి', 'అభినవ భరతాచార్యుడు' అని తనను తాను చెప్పుకొన్నాడు. భోజ, సోమేశ్వర, పరమార్దిలను పేర్కొన్నాడు. ఇతని గ్గురించి సింగ భూపాలుడు చెప్పాడు కనుక పదమూడవ శతాబ్దం వాడు. తొమ్మిది అధికరణలున్న 'సంగీత సమయ సారం' రచించాడు. నాదం ధ్వని స్థాయి రాగం, ధోక్కిఓడలైన వాట్ని గురించి చర్చించాడు. తాళ, వాద్య, అభినయ, రాగ, ప్రస్తారలను గురించి వివరించాడు. చివరికి 'అద్వ యోగం'తో సమాప్తి చేశాడు. రాజకవులైన ప్రతాప, దిగంబర, శంకరులను ఉటంకించాడు. 'పంచతాళేశ్వరో యద్వా హృదం గద్య మధాపి వా – ఆలిక్రమీ యమే భోక్తం ప్రతాప పృధివీ భుజం'❋

## 70. వెల్లాల ఉమామహేశ్వరుడు (1235)

**అ**భినవ కాళిదాసు అని పించుకొన్న వెల్లాల ఉమా మహేశ్వరుడు అక్కయ సూరి శిష్యుడు. మహా పండిత కవి. కవికాలం ఇదమిద్ధం గా చెప్పలేం. భాగవత చంపు, అభినవ భారత చంపు, భాగవత పాద షట్పది, కలి విడంబనం ఇతని కృతులు. సంస్కృతం చదివే వారందరికీ భాగవత చంపు అనుభవంలోకి వచ్చేదే. భారత చంపు అంతగా రాణించక పోవటానికి కారణం ప్రత్యర్ధి కవి అనంత భట్టు రాసిన భారత చంపువు. ఈ చంపువు అ చంపువుకు గ్రహణం పట్టించింది. మూడవ కావ్యం శ్రీ శంకరాచార్య స్తుతి. నాలుగవది ఓరియెంటల్ లైబ్రరీకే పరిమితం.

అభినవ కాళిదాసు దక్షిణ దేశ ప్రభువు రాజశేఖరుని ఆస్థాన కవి అన్నాడు కవి కుఙ్జరుడు. కాని ఇది సరిపోవటం లేదు. కవి కుఙ్జరుని అభిప్రాయం ప్రకారం తన గురువు అభినవ కాళిదాసు రాజశేఖర రాజు ఆస్థానంలో పలుకుబడిగల కవి. కొత్తవారినెవ్వరినీ ప్రోత్సహించని వాడు అయిన దుర్జయుని కవితా ప్రతిభతో జయించాడు. దీన్ని బట్టి వెల్లాల కవి 1235 కాలం వాడని నిర్ణయించారు. తల్లి తిరుమలాంబ తత్వ చంద్రిక, విరోధ వరూధిని, ప్రసంగా రత్నాకరం, అద్వైత కామధేను, వేదాంత సిద్ధాంత సారం, శృంగార శేఖర భాణంకూడా రాశాడు. వీటిని బట్టి వెల్లాల కవి అన్ని శాస్త్రాలలో గొప్ప పాండిత్యం ఉన్నవాడని తెలుస్తోంది. అభినవ కాళి దాస బిరుదు సమర్ధనీయం అనిపిస్తుంది. మహోపాధ్యాయ పక్షధార ఎల్లయ్య శిష్యుడు. అక్కయ సూరి రాసిన వ్యాఖ్యానం బట్టి వెల్లాల కవి గొప్పతనం ప్రదర్శితమైంది. మంధన, బెల్లం కొండ రామ రాయ కవుల వ్యాఖ్యానాల వలన

మనకవి ప్రతిభ అర్ధమవుతుంది.

భాగవత చంపు రాయటానికి కారణాలు కవి చెప్పుకొన్నాడు – "అభినవ పద పూర్వ కాళిదాసః ప్రగల్భః –త్రినయన దయితాయాః ప్రేమ దిమ్భర స్తృతీయః– విరచ యతి తయైవ ప్రేరితః ప్రేమ పూర్వ –హరి గుణ పరిణద్ధం చారు చంపూ ప్రబంధం".

అభినవ కాళిదాసు తనపై మహా కవి కాళిదాసు ప్రభావం ఎలా ఉన్నదీ తెలియజేశాడు. తన కావ్యమంతా ధ్వని ప్రధానమైనదని కనుక జాగ్రత్తగా చదివి అర్ధం చేసుకోవాలని చెప్పాడు. ఆరు విలాసాలతో ఉన్న ఈ చంపు శ్రీ కృష్ణుని జీవితం లో ముఖ్య ఘట్టాలను వివరిస్తుంది. చవర్లో రాధను కూడా ప్రవేశ పెట్టాడు. వారిద్దరి శృంగార చేష్టల వర్ణన కూడా ఉంది. అలక చెందిన పెద్దభార్య రుక్మిణీ దేవిని అనునయించటంతో ముగించాడు.

ఇతని శృంగార శేఖర భాణం శృంగార శేఖర, ఉత్పలమాల ప్రేమ వ్యవహారం. కామ కోటి వల్లభ ఉత్సవాలలో దీన్ని ప్రదర్శించేవారు. కవిగోత్రం కాశ్యప అని దీనిలో చెప్పాడు .చివరలో చెప్పిన శ్లోకం చూద్దాం –

"అనితర రసాదీనం భూయాదానంగా పదం –హృదయ మసు క్రుంచ్చున్గార ద్వేతశ్రుష్మలితం

రస ధారా కలాపీడం శ్యామామయం కరుణామయం –శమయుత పునర్జన్మ వలేశం మమాపి పరం మహః❁

## 71. కవి కుంజరుడు (1235)

**అ**భినవ కాళిదాసు వెల్లాల ఉమామహేశ్వరుని శిష్యుడే కవి కుంజరుడు. అంటే కవులలో మద గజం అని అర్ధం. రాజ శేఖర చరిత్ర నీతిబోధక కావ్య నిర్మాత. దీనికే 'సభా రంజన ప్రబంధం' అనే పేరుంది. కమ్మని కథలు చెబుతూ నీతి బోధ చేశాడు. ఇవి రాజశేఖర రాజాస్థాన కధలే. వీటిని రాజు సుబుద్ధికి వివరించాడు. కుంజర కవే అభినవ కాళిదాసు రాజశేఖరుని ఆస్థానకవి అని చెప్పాడు. రాజశేఖరుడు పినాకినీ తీర విద్యానగరాన్ని రాజధానిగా చేసుకొని పాలించాడు .కుంజర కవికావ్యానికినారాయణుడు వ్యాఖ్య రాశాడు .

కావ్యారంభం చేసినాక రాజుకు భాండవ్యుడికి జరిగిన సంభాషణ ఉంటుంది.

రాజు – స్కందే కృషీవల హలం కలయన్ క యాసి ?

భాండవ్య– గచ్చామి తే నికటమేవ విభో

రాజ – కిమర్ధం ?

భాండవ్యఃహా "హంత కర్షణ పరాస్తవ వైరి భూషః

రాజ – గద్యం "నితంత సంతుష్ట స్తస్మే నిజ కర్ణా గతేస్వ కుండలే ప్రయచ్చత్"

ఆశ్వాసాంత గద్యలో "ఇతి శ్రీ కవి కుంజర కృతౌ రాజ శేఖర చరిత్రే సభా రంజన ప్రబందే ప్రధమోల్లాసః"

కవి కుంజర ఇందులో 28 కథలు 1) దుర్జయ 2) సూక్ష్మమతి 3) సారంగా 4) దైవజ్ఞ వల్లభ 5) సోమ 6) కామలీల కవయిత్రి 7) కాశీపతి 8) సానంద 9) రత్నాకర 10) కుటుంబ కవి మొదలైన శీర్షికలు పెట్టి కథలు వివరించాడు. ఈ పేర్లు అన్నీ అసలైన వో కాదో తెలియదు. ఇందులో శ్రింగార శేఖర, మందర,

లలితపాల, శ్రీకామ కమలాకర మొదలైన వారు అభినవ కాళిదాసు నేతృత్వంతో తమకు జరుగుతన్న అన్యాయానికి గాను దుర్జయుని దెబ్బ తీశారు. రాజుకు దుర్జయుని దురాలోచన తెలిసి బహిష్కరించాడు.

కుంజర కవి వెల్లాల కవి శిష్యుడు కనుక, రామచంద్రకవి తరువాతివాడు కనుక కాలం 1235గా చెప్పవచ్చు. కవికి వచ్చిన బిరుదేకాని అసలు పేరు వేరుగా ఉండి ఉంటుంది. రాజ శేఖరుని సమకాలీన రాజులు రాజేంద్ర చోళుడు, పాండ్య రాజు విజయవర్మ, మాల్వలోని ధారానగర రాజు, సింహళ పాలకుడు, కొంకణేంద్రుడు హూణ క్షోణిధరుడు మొదలైన వారున్నారని తెలుస్తోంది. దీనిని బట్టి చూస్తే అభినవ కాళిదాసు భోజరాజాస్థానకవి అనిపిస్తాడు. అక్కడి నుండి రాజశేఖరుని ఆస్థానం చేరి ఉంటాడు. ఇవన్నీ ఊహాగానాలే. చారిత్రిక సత్యాలుకావు. వెల్లాల కవి భోజ రాజ ఆస్థాన కవి అనటం అసంబద్ధమని పిస్తుంది. రాజశేఖరుని దగ్గరకు రాకముందు మరొక దక్షిణ దేశ రాజు 'పుణ్య కోటి' ఆస్థానంలో ఉండేవాడినని 'అభి కవి' స్వయంగా రాసుకొన్నాడు. కనుక కవి కుంజరుని రాజశేఖర చరిత్ర, రామచంద్ర కవి 'ప్రక్రియ కౌముది'కి తరువాతనే రాయబడింది అని అర్ధమౌతోంది.❋

## 72. ప్రత్యక బుద్ధ చరిత్ర రాసిన- లక్ష్మీ తిలక (1255)

**జి**న రత్న శిష్యుడు లక్ష్మీ తిలక 'ప్రత్యక బుద్ధ చరిత్ర'ను పది హేడు కాండాలలో రాశాడు. ఇందులో నలుగురు జైన స్వామిలైన కరకందు, ద్విముఖ, నమి, నగ్గాతిలను వర్ణించాడు. 1255 రచన ఇది.❋

## 73. సరస్వతీ పుత్రుడు బాల చంద్రసూరి (1260)

**చం**ద్రా గచ్ఛకు చెందిన హరి భద్ర సూరి శిష్యుడే బాల చంద్రసూరి. ధోల్కా రాజు విరాధ వాలుని మంత్రి వస్తుపాలుడుని తెగ ప్రశంసించాడు. రాజు మరణం తర్వాత వస్తుపాలుని అభ్యర్ధన మేరకు వసంత విలాసం అనే పద్నాలుగు కాండల కావ్యాన్ని వస్తుపాల మంత్రిత్వ గరిమను గురించి రాశాడు. వస్తుపాలుడు మరణించాడు. పద్దెనిమిది కాండలలో మొదటికాండంలో తన చిన్ననాటి జీవితం రాసుకొన్నాడు. గాయక్వాడు రాజాల అధీనంలో ఉన్న కాడి జిల్లాలో మోదేరక నగరంలో ధర్మవేదుడు అనే ప్రసిద్ధ బ్రాహ్మణుడు ఉండేవాడని, బాధలలో ఆపదలలో ఉన్నవారికి సహాయ సహకారాలు చేసేవాడని దీనితో జైనమతం పట్ల ఆకర్షితుడయాడని రాశాడు. అతని ఇంటికి వచ్చిన అతిధులకు చేతినిండా ధనం ఇచ్చి పంపేవాడు. భార్య పేరు విద్యుత్. కొడుకు ముంజల. ఈ పిల్లాడికి చిన్నప్పటి నుంచే ప్రపంచం మాయ అని తెలుసుకొన్నాడు. హరి భద్ర సూరి గురుత్వంతో విషయ పరిజ్ఞానం పెరిగి జైనంలోకి మారటానికి తలిదండ్రుల అనుమతి కోరాడు. అనుమతి పొంది జైనమందిరంలో గురువు శిక్షణలో అన్నీ నేర్చాడు. బాల చంద్ర అనే ఆశ్రమనామం పెట్టాడు. గురువు చనిపోయిన తర్వాత శిష్యుడినే అధికారి అయేట్లు చేశాడు. పద్మాదిత్యుడి పాదపద్మాలపై చాళుక్య చక్రవర్తి కిరీట మణికాంతులు పడేవని అంతటి మహిమాన్వితుడైన పద్మాదిత్యుడి శిష్యుడనని చెప్పుకొన్నాడు.

వాడిదేవరసూరి లోని గచ్ఛకు చెందిన ఉదయసూరి సరస్వతీ మంత్రాన్ని ఉపదేశించాడని, దాన్ని సాధన చేసేవాడినని ఒకసారి యోగ నిద్రలో సరస్వతీదేవి ప్రత్యక్షమై తన భక్తికీ ఆరాధనకు మెచ్చి కాళిదాసులాగా తన కుమారుడిగా భావిస్తానని చెప్పింది అని రాసుకొన్నాడు. బాలచంద్ర రాసిన కవిత్వానికి వస్తుపాలుడు ఎంతో సంతోషించి వెయ్యి ద్రమ్మల (Drammaas)తో బాలచంద్ర సూరిని ఆచార్యునిగా చేసినట్లు ప్రబంధ చింతామణి తెలియజేస్తోంది. ❁

## 74. తర్క వాగీశ - పంచానన (1273)

1273లో బెంగాల్‌లోని ఇరవై నాలుగు పరగణాలలో జన్మించిన పంచానన కవి గౌతమ గోత్రీకుడైన నందాలత విద్యారదుల కుమారుడు. బెంగాల్ సంస్కృత పండితులలో మహోత్కృష్టుడు అని పేరొందిన వాడు బెనారస్‌లో నివసించాడు. 'పార్థాశ్వ మేధ' కావ్యం రాశాడు. రాణా అమర సింహునిపై 'అమర మంగళ నాటకం' రాశాడు. కన్యా కుబ్జానికి చెందిన అల్లా భట్టు అనే గొప్ప విద్వాంసుడు యీతని పూర్వీకుడు. ఇతనికి 'తర్క వాగీశ' బిరుదం ఉంది.❁

## 75. మల్లికార్జున భట్టు (1280-1330)

**భా**స్కరకవి కొడుకైన మల్లికార్జున భట్టు కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థాన కవిమణులలో ఒకడు. 'నిర్యోష్ట్య రామాయణం' రాశాడని పేరు. సురవరం ప్రతాపరెడ్డి గారు 'అభిషిక్త రాఘవం, సరస్వతి చంద్రికకు కూడా ఈ కవే కర్త అన్నారు. తెలుగులో భాస్కర రామాయణంలో కిష్కింద సుందర కాండలు రాశాడు. ఆశ్వాసాంత గద్యంలో-

'శ్రీ మదస్ట భాషా కవిమిత్ర కుల పవిత్ర భాస్కర సత్కవి పుత్రమల్లికార్జున భట్ట' అని రాశాడు. చాగంటి శేషయ్యగారి కథనం ప్రకారం ఈ భాస్కరుడు హుళక్కి భాస్కరుడు. కనుక మల్లికార్జున కవి కాలం 1280-1330. ఈ కవి ఉదార రాఘవ కర్త సాకవెల్లి మల్లికార్జున భట్టు అని కొందరు పొరబడ్డారు. ఇద్దరూ ఒకరు కాదు వేరు వేరు కవులు. దురదృష్టవశాత్తు ఈ మల్లికార్జున భట్ట సంస్కృత రచనలు లభించలేదు.❁

## 76. మోహ పరాజయ కర్త – యశప్పాల (1286)

**రు**క్మిణి, దండదేవుని కొడుకైన యశప్పాలుడు మోధా వంశం వాడు. అజయ దేవ రాజు ఆస్థాన కవి. 'మోహ పరాజయం' అనే అయిదు అంకాల అర్ధాంతర నాటకం రాశాడు. కుమారపాల రాజును జైన మతంలోకి మార్చాడు. మార్వార్ రాజధాని తారా పద్రలో దీన్ని ప్రదర్శించారు. ముని రత్నుని 'అమామవస్వామిచరిత్ర'ను మొదటి సారిగా పటాన్‌లో శాంతినాధ ఆలయంలో 1306లో విన్న వారిలోయశప్పాలుడూ ఉన్నాడు.❋

## 77. కథా రత్న సాగరం రాసిన – నరచంద్ర సూరి (1288)

**1**288 వాడైన నరచంద్ర సూరి అనేక 'ప్రశస్తులు' రాశాడు. వస్తుపాలపై రాసిన ప్రశస్తి గిర్నార్ శాసనంలో లభిస్తుంది. హరత పురి యాగచ్ఛకు చెందిన మలదారి దేవప్రభ సూరి శిష్యుడు. అనర్ఘ రాఘవంపై వ్యాఖ్యానం రాశాడు. వస్తుపాలుని కోరిక మేరకు 'కథా రత్న సాగరం' రాశాడు. శిష్యుడు నరేంద్రప్రభ 'అలంకార మహోదధి' రచించాడు. దేవ ప్రభ రాసిన 'పాండవ చరిత్ర', ఉదయ ప్రభ రచన 'ధర్మాభ్యుదయం'లను సవరించి మెరుగులు దిద్దాడు.❋

## 78. కాకతి రుద్రమ గురువు నృసింహర్షి (1200-1300)

**కా**కతి గణపతి దేవ, రాణి రుద్రమ దేవి, ప్రతాపరుద్రుల ఆస్థాన గురువు నృసిం హర్షి. అనేక కావ్య శాస్త్ర గ్రంథ రచయిత. ఋగ్వేదానికి భాష్యం రాశాడు. ఈ కవిప్రతిభకు తార్కాణగా చాలా శ్లోకాలున్నాయి. వీటిని పరిశీలిస్తే ఋగ్వేదానికి ఛాయ అనే వ్యాఖ్యానం రాసినట్లు తెలుస్తుంది. కాకతీయ చరితలో ఓరుగల్లు, ఏకశిలా నగరం అనే పేర్లు ఎందుకు వచ్చాయో వివరించాడు. పది రూపకాలు రాసినట్లు ఉంది. విష్ణు అవతారాలలో నరసింహా వతారనికే ప్రాదాన్యమిచ్చాడు కవి. రచనలన్నీ తాటాకులపైనే రాశాడు. అవన్నీ కాలంలో కలిసిపోయాయి. శిలమీద ఎక్కినవే మిగిలాయి. వరంగల్ దగ్గర చిన్న గ్రామం 'ఉర్స్' ఉంది. దాని దగ్గర ఉన్న చిన్న కొండను 'ఉర్సు గుట్ట' అంటారు. దానిమీద కాళిదాసు మేఘ సందేశాన్ని అనుకరిస్తూ నృసింహర్షి రాసిన కవిత్వం చెక్కబడింది. దానిలో 62 శ్లోకాలున్నాయి. అవి మృదుమధురంగా కర్ణ పేయంగా ఉంటాయి. ఇందులో 60 శార్దూల వృత్తాలు. మిగిలిన రెండు స్రగ్ధరా వృత్తాలు. మొదటి నాలుగు శ్లోకాలు ఉపోద్ఘాతంలా ఉంటాయి. తర్వాత అంతా సిద్ధుల ప్రేమ సందేశమే. వారిద్దరి వివాహం, సంభోగ శృంగారం, ఎడబాటు, మళ్ళీ కలవటం వర్ణించబడి ఉంది. మొదటి శ్లోకం-

'కస్మిస్సిద్ధ యువా సమంద యాతయా స్సైస్రోతసే సైకతే-రాగాందో రమ మాణయేవ లిఖితే కారండ వనాంతయా"

సూర్యాస్తమయ, చంద్రోదయా వర్ణన - ''కాలేస్మిన్ పుట పాక తప్త కనకాకారేణలొలాక్రుతిః

సంధ్యా మేఘన వ(ప్రవామ్య నయనం రాగీ సమాసేదివాన్"
నాయిక తొ(ట్రుపాటు కంగారును వర్ణిస్తూ – 'తిష్టత్యుచ్ఛ లతి(ప్రయాతి సంభాషతే తూష్ణీం భావ ముపైతి పశ్యతి దిశః సం మీల యత్యక్షిణీ'
పెళ్లిలో ఇద్దరూ కలుసుకోవవటాన్ని చెబుతూ – 'వేదీ మధ్య నివేషితం హుతవహం కృత్వా విదేస్సాక్షిణం
స్వేదాంభః కణికాభిరం గుళిముఖా ద్వాంతా భి రా(ద్రస్తవః
రతి(క్రీడలో నాయిపొందిన ఆనంద వర్ణన – మ్లానం చాపి వికాసి చాపి వదనం వేణీ చ వదనం వేణీ చ వేష్టశ్లదా
భాలశ్చ(శమ వారి మృష్టతిలకో హాసశ్చసంజాయతే

హనుమ కొండలో 'సిద్దేశ్వర గుట్ట' మీద ఇంకొక కవిత కనిపిస్తుంది. కవిపేరు లేదు. ఇదీ నృసింహ కవిదా కాదా అని తేలలేదు. 37శ్లోకాల అసంపూర్తి కావ్యం ఇది. ఆం(ధ్రదేశం పంట పొలాలు తోటల వర్ణన ఉంది. అను(ప్రాసతో సరళంగా సాగిన కవిత్వం ఇది –

"ఆం(ధ్రస్సంతి గరీయంసః కాన్చనాధ్యాయ శాలయః –తదా హాటక శైలస్య కటకా రత్న శాలినః
కేదారా య(త్ర శాలీనం తరంగిత జలంత రాః–కృష్ణాంగ ఛాయహరితా తదా జలనిదే స్తటాః
కానీనికా కలంకిన్యా కాంతి చం(ద్రికయా స్త్రియః – ఆహార యాంతి య(త్రత్య శ్చం(ద్రికా హారిణః ఖగం"

ఈ శ్లోకాలను 1891లో డా.పి.వి.పర(బ్రహ్మ శా(స్త్రి గారు సేకరించిన శాసన లిపుల నుండి తాను తీసుకొని ఉదాహరించానని డా. బిరుద రాజు రామరాజు గారు తెలియజేశారు.❁

## 79. వాది సింహ బిరుదాంకితుడు– అభయ దేవుడు (1222)

**జై**న సన్యాసి అభయ దేవుడు విజయచంద్రుని శిష్యుడు. దేవ భద్రుని కొడుకు. జిన శేఖర సూరికి నాలుగవ తరం వాడు. అభయ దేవుడు సర్వ శాస్త్రాలను అధ్యయనం చేశాడు. వాదోప వాదాలలో మహా నిష్ణాతుడు. అందుకే 'వాదిసింహ' బిరుదంను కాశీ రాజు నుండి పొందాడు. అభయుని వలననే 'రుద్ర పతిజ గచ్ఛ' మహా ప్రాభవం పొందింది. ఈ కవి రాసిన 'జయంత విజయం', పందొమ్మిది కాండాల కావ్యం. 1222లో దీన్ని రాశాడు. జయంతుని జీవిత చరిత్ర ఇది. ఇందులో సూర్యోదయ సూర్యాస్తామయాలను ఋతువులను, క్రీడలు, జైత్ర యాత్రలు విస్తారంగా వర్ణించాడు.❁

## 80. చంద్ర ప్రభ చరిత్ర కర్త – వీరనంది కవి (13వ శతాబ్దం)

**ఈ** కవి గురించి పెద్దగా వివరాలు తెలియలేదు. కాని ఈ కవి రాసిన 'చంద్ర ప్రభ చరిత్ర' పద్దెనిమిది కాండాలలో రాజు కనక ప్రభను, జైన తీర్ధంకరుడైన చంద్రప్రభను వర్ణించాడు. చివరి కాండలో జైన సిద్ధాంతాలను ఆచరణ విధానాలను చెప్పాడు. చివర్లో ఇంద్రుని అవతారమే జినుడు అని తెలిపాడు. వీరనంది కవి పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధంలో ఉండి ఉంటాడు.❁

## 81. దసశ్రావక చరిత్ర కర్త – పూర్ణ భద్రుడు (13వ శతాబ్దం)

**జి**నపతి శిష్యుడైన పూర్ణ భద్రుడు ప్రహ్లాదన పురం వాడు. రాసిన గ్రంథాలు 'దసశ్రావక చరిత్ర', 'ధన్య శాలి భద్ర చరిత్ర' కృత పుణ్య చరిత్ర, అతి ముక్తా చరిత్ర'.❁

## 82. ముని సువ్రత చరిత్రకారుడు – పద్మ ప్రభ (13వ శతాబ్దం)

**వి**బుధ ప్రభ శిష్యుడైన పద్మ ప్రభుడు 'ముని సువ్రత చరిత్ర ', 'కుంతు నాద చరితా చరిత్ర' రాశాడు. పదమూడవ శతాబ్ది తొలి కాలం వాడు.❁

## 83. వేణీ కృపాల - అమరచంద్ర కవి (13వ శతాబ్దం)

**అ**మరకవి లేక అమరచంద్ర కవి అనిల్ వద్‌లోని వాగట నగరానికి చెందినవాడు. జైన గురు సంప్రదాయానికి చెందినవాడు. జినదత్త సూరి శిష్యుడు. సిద్ధ సరస్వతి మంత్రాన్ని ఉపాసించి, సరస్వతీ దేవి కటాక్షంతో అశేష కవితా సామర్థ్యం పొందాడు. గుజరాత్ రాజు విశాల దేవుడికి ఈ కవి సామర్థ్యం తెలిసి తన రాజధాని ధవలక్కకకు ఆహ్వానించాడు. అక్కడ సోమేశ్వర, నానక మొదలైన పండిత కవుల చేత కవిని పరీక్షింప జేశాడు. అమరుని కవితా ప్రాగాల్భ్యానికి వారందరూ ఆశ్చర్యపోయి గొప్పకవి అని ప్రకటించారు. రాజు ఘన సన్మానం చేశాడు. విరాధ వాల రాజు కొడుకు విశాల దేవుడు 1243-1262 మధ్యలో పాలన చేశాడు. కనుక అమర చంద్రకవి పదమూడవ శతాబ్ది మధ్యలో ఉండి ఉంటాడు. అమర కవి బాలభారతంలో సూర్యోదయ వర్ణన పరమాద్భుతంగా చేశాడు. ఈ వర్ణన వలననే కవికి 'వేణీ కృపాల' బిరుదు లభించింది.

అమర చంద్రుని ఇతర కృతులలో బాల భారతం ప్రసిద్ధి చెందింది. మహాభారత పర్వాలను అనుసరిస్తూ రాశాడు. ఉదాత్త కవిత్వం రాయటం వలన కావ్యాన్ని కాళిదాసు రఘువంశం సరసన చేర్చారు. అలంకార శాస్త్ర గ్రంథం 'కావ్య కల్పలత'ను ఛందస్సుపై 'ఛందో రత్న వల్లి' ముక్తావళి రాశాడు. సాంకేతిక విషయపరంగా 'కలాకలాపం' పద్మానంద కావ్యం', లేక జినేంద్ర చరిత్ర కూడా చేశాడు. ఇందులో జినుని పుట్టుక నుండి నిర్వాణం దాకా వర్ణించాడు. అమర చంద్రుడు తన స్నేహితుడి రచన 'కావ్య కల్పలత'ను పూర్తీ చేసి దానికి వ్యాఖ్యానంగా 'కవి శిక్షా వృత్తి' రచించాడు. ❋

## 84. చారిత్రిక ప్రాధాన్య రచన చేసిన – ఉదయ ప్రభ సూరి

**వ**స్తుపాల, తేజపాలకు గురువు ఆచార్యుడు ఉదయ ప్రభ సూరి. కవి సిద్ధాంతకర్త, ఖగోళ శాస్త్రజ్ఞుడు. అతని 'ఆరంభ సిద్ధి' ఖగోళ విషయంపై రాసిందే. 'ఉపదేశ మాలా కార్మిక' ఉపదేశామాలకు రాసిన వ్యాఖ్యానం. ధర్మాభ్యుదయం లేక 'సంఘాదిపతి చరిత్ర' అనే మహాకావ్యం వస్తుపాల రాజు పశ్చిమ దేశ జైన మందిర సందర్శనంపై రాసింది, నరేంద్ర ప్రభ కూడా దీనిలో భాగస్వామి. అతని 'సుకృత కృతి కల్లోలిని', వస్తుపాల, తేజపాలుల శత్రుష్జయ యాత్రపై రాసినది. దీనికి చాలా చారిత్రిక ప్రాధాన్యం ఉంది కూడా. వస్తుపాల వంశ చరిత్రతో బాటు చాపోత్కల, చాళుక్య రాజుల గురించి వివరాలూ ఉన్నాయి.❁

## 85. చాళుక్య వాంశ చరిత్ర రాసిన – జయ సింహ సూరి (1220)

**బో**చ్‌లో ముని సువ్రతకు ఆచార్యుడైన జయ సింహసూరి వీరసూరి శిష్యుడు. శ్వేతాంబర జైనుడు. ఒకప్పుడు వస్తుపాలుని సోదరుడు తేజపాల ఈ జైన మందిరాన్ని సందర్శించటానికి వచ్చినపుడు ఇరవై అయిదు బంగారు నాణాలు అంబదలో ఉన్న సకుమిక విహారకు దానం చేయమని శ్లోకంలో అడిగాడు. వెంటనే రాజు ఇచ్చేశాడు. వస్తుపాల ప్రశస్తిలో ఈ సోదరుల దాత్రుత్వాన్ని శ్లాఘించాడు. దానానికి క్రుతజ్ఞతగా 'హమ్మీర మద మర్దనం' నాటకాన్ని వస్తుపాల కొడుకు జయంతి సింహుని కోరికపై రాశాడు. కాంబేలో భీమేశ ఉత్సవంనాడు దీన్ని ప్రదర్శించారు. ఇందులో వస్తుపాల, స్నేహితుడు వీర ధవళ కలిసి గుజరాత్‌ను మహమ్మదీయ దండ యాత్రనుంచి రక్షించిన చరిత్ర వర్ణించాడు. ఉపమలతో ఉల్లాసంగా కవిత్వం ఉంటుంది. విరాధ వల్ల కొలువులో వస్తుపాల మంత్రిగా ఉండేవాడు. కనుక ఈ నాటకం 1220–30 మధ్య రచించి ఉండాలి. జయసింహుని 'వస్తుపాల ప్రశస్తి' చాళుక్య వంశ చరిత్ర. మొదటి మూల రాజు నుండి అందరిని చేర్చి రాశాడు.❁

## 86. వాయుస్తుతి రాసిన- త్రివిక్రమ (13వ శతాబ్దం)

**మ**ధ్వాచార్య అనుంగు శిష్యులలో త్రివిక్రముడు ముఖ్యుడు. ఈయన "ఉషాహరణ కావ్యం", "వాయుస్తుతి" రాసాడు. త్రివిక్రముని కొడుకు నారాయణ 'మధవ విజయ కావ్యం' రాసాడు. అలాగే 'అనుభవ విజయం, మణి మంజరి, పారిజాత హరణం' అనే యమకం రాసాడు. 'శివ స్తుతి, విష్ణు స్తుతి నృసింహ స్తోత్రం సంగ్రహ రామాయణ'కర్త కూడా.❁



## 87. కర్ణాటక సింహాసన స్థాపనాచార్య, శంకర విజయకర్త, శ్రీ విద్యారణ్యులు (1304- 1387)

**మా**ధవ అనే పేరుగల విద్యారణ్యులు శ్రింగేరి పీఠాధిపతులు. విజయనగర సామ్రాజ్య సంస్థాపకులుగా కీర్తి గడించారు. హరి హర బుక్క రాయలను ప్రేరేపించి విజయనగర రాజ్య స్థాపన చేసి రాజులను చేశారు. రాజ్యపాలనలో సలహాలిస్తూ రాజ గురువు అనిపించుకొన్నారు. అందుకే వారికి కర్నాటక సింహాసన స్థాపనాచార్య అని పేరు వచ్చింది. ఆయన సాయన శ్రీమతుల కుమారుడు, భారద్వాజ గోత్రికులు. న్యాయ, వేదాన్తాలపై అద్భుత రచనలు చేసి మార్గదర్శకం చేశారు. అనంత మహా విజ్ఞాని. వేదాలపై విద్యారణ్య భాష్యం పరమ ప్రామాణికం. విద్యారణ్య విరచిత దేవ్యపరాధ స్తోత్రం అనన్య సదృశ్యం. అందులో వారి కవితా ప్రభ మహాద్భుతంగా ఆవిష్కరింపబడింది. వారు రాసిన శ్రీ శంకర విజయం అంతకు ముందు వచ్చిన శంకర భాగవత్పాదుల చరిత్రలన్నిటినీ పరాస్తం చేసి అనన్య సదృశంగా పరమోత్కృష్టంగా ఉంది. నేటికీ అందరికీ ప్రమాణ గ్రంథంగా ఉంది. 83 ఏళ్ళ సార్ధక జీవితం గడిపిన విద్యారణ్య స్వామి 1387లో శంకర సాన్నిధ్యం చేరారు.

విద్యారణ్యులు పరాశర మాధవీయం… సర్వ దర్శన సంగ్రహం భారతీయ వేదాంత కరదీపికలు. సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు వీటిని పరామర్శిస్తూ అందులో పదారు రకాలైన సిద్ధాంతాలను క్రమ ఆరోహణ క్రమంలో వివరించారని అవి అద్వైత మత భావ వ్యాప్తికి తోడ్పడ్డాయని తెలియజేశారు. అవే చార్వాక మతం. భౌద్ధమతం, జైమతం, పూర్ణ ప్రజ్ఞ, నకులీశ పాశుపతం, శైవం, ప్రత్యభిజ్ఞ (కాశ్మీరశైవం), రసేశ్వరం, అక్షపాద లేక న్యాయం, జైమినీయం, పాణినీయం, సాంఖ్య, పతంజల యోగం, ఆది శంకరుల వేదాంతం, సర్వ దర్శన సంగ్రహంలో ఈ పదహారు లేవుకాని వాటి మొత్తంలోని డొల్లతనాన్ని బయటపెట్టాడు. లోకాయత లేక భౌతిక వాదం ఇంకెక్కడా లేని సమాచానం సర్వదర్శన సారంలో ఉంది.

విద్యారణ్యుల మరో గ్రంథం పంచ దశి. అద్వైత వేదాంత సారం అంతా ఇందులో నిక్షిప్తం చేశారు. పదిహేను అధ్యాయాల గ్రంథం. వివేక, దీప, ఆనంద అనే మూడు భాగాలుగా ఉంటుంది. మాధవీయ శంకర విజయం అనేది సంక్షిప్త శంకర విజయం. ఇది ఆది శంకరాచార్యులైన శంకర భగవత్పాదుల జీవిత చరిత్ర. మీమాంస సూత్రాలకు భాష్యం కూడా రాశారు. పదహారు ఏళ్ళ శృంగేరి పీఠాధిపత్యం నిర్వహించి విద్యారణ్య స్వామి సిద్ధి చెందారు. ఆయనది ఒక శకం. అద్వైతానికి ఆయన ఎత్తిన పతాక.

విద్యారణ్యుల వారి తమ్ముడు సాయనుడు మొదటి బుక్క. రెండవ హరిహరుల మంత్రి. ఆయన కొడుకులు కంపన సంగీత గాయకుడు. మయనుడు కవి. సింగన వేద పండితుడు. సాయన 1378లో చనిపోయాడు. వేదాలపై భాష్యం రాశాడు. సుభాషిత సుధానిధిలో చక్కని నీతులు చెప్పాడు. పది అధ్యాయాల అలంకార సుధానిధి రాశాడు.

స్వామి మరో తమ్ముడు భోగనాథుడు రెండవ సంగమరాజు సమకాలీనుడు. మహా గొప్ప కవి. రామోల్లాసం, త్రిపుర విజయం, శృంగార మంజరి, ఉదాహరణ మాల, మహా గణపతి స్తోత్రం, గౌరీనాథ స్తోత్రం రాశాడు. ❁

## 88. ప్రబంధ చింతామణి కర్త - మేరుతంగ (1306)

**మే**రుతంగ రాసిన 'ప్రబంధ చింతామణి ' మహా గొప్పచారిత్రిక కావ్యం. 1306లో దీన్ని వాద్వాన్‌లో వైశాఖ శుద్ధ పౌర్ణమినాడు పూర్తి చేశాడు. ఇందులో అయిదు ప్రకాశలున్నాయి. ప్రతి ప్రకాశకు ప్రబందాలుంటాయి. ప్రతి ప్రబంధంలో ఒక కథ ఉంటుంది. అదీ దీని నిర్మాణం. విక్రమశకానికి ఆద్యుడైన విక్రమాదిత్యుని కథతో కావ్యం ఆరంభమవుతుంది. తర్వాత శాతవాహనుని పూర్వజన్మ వృత్తాంతం ఉంది. ఆ తారవాత సుదీర్ఘంగా అన్‌ిల్‌విద్ చాళుక్య రాజుల చరిత్ర భోజరాజు ముంజ రాజులతో వారి సంబంధం ఉంటాయి. పిమ్మట వాఘేల రాజు లావణ్య ప్రసాదు, విరాధ వాల రాజుల గురించి సుదీర్ఘ చరిత్ర రాశాడు కవి. ఇందులో వారిమంత్రులు వస్తుపాల తేజ పాల వృత్తాంతమూ చేర్చాడు. చివరి కాండలో లక్ష్మణ సేన, ఉమాపతి, భర్తృహరి గురించి ఆసక్తికర విషయాలున్నాయి. మేరుతంగ రాసిన 'మహా పురుష చరిత్ర' జైనమునుల చరిత్రయే.❀

## 89. సంగీత సుధాకరం రాసిన హరిపాల రాజు (1312- 1318)

**హ**రిపాలుని తండ్రి కుమారి. తాత సోమనాధుడు. బహుశా ఈయన యాదవ రాజు 1312- 1318 మధ్య దేవగిరి పాలకుడు అయిన రాజా హరిపాలుడు అయి ఉండవచ్చు. చాళుక్య ప్రభువు అన్హిల్విద్ పాలకుడైన హరిపాలుడు కాదు. "విచార చతుర్ముఖుడు" "వినాటంక విశారదుడు" అని తనను గూర్చి చెప్పుకొన్నాడు. వంద దాకా గ్రంథాలు రాసినట్లు చెప్పాడు. తన పాండిత్య గరిమ గురించి చెప్పుకొన్ని శ్లోకం-

"బహుభాషా రచయితా స్పదా రస గుణాంకారిణీ నిస్సూత- వృత్తీ యస్య పరం విహార రాసికా జాత గిరో దేవతా"

ఒకసారి హరిపాల రాజు శ్రీరంగం వెళ్ళి అక్కడి నాటక నృత్య సంగీతకారుల అభ్యర్ధనపై కొన్ని రోజులు ఉండి "సంగీత సుధాకరం" రాశాడు. ఆరు అధ్యాయాలున్న దీనిలో నాట్య తాళ, వాద్య, రస ప్రబంధాలపై చర్చించాడు. దీనికి "గాయక లక్షణం" అనే అనుబంధాన్నీ రాశాడు. సంగీత సుధాకరంలో ఆధునికులైన సారంగదేవ మొదలైనవారి తోటివాడిని అన్నాడు. "అభినయ శాస్త్రం" ఇతని గురించి ఆచూకీ ఉంది- "ఆదా వంతే దోదిగాదా మధ్యే పాఠాక్షరైర్యుతం- మోహ నారే దిసంత్రీ కదియే హరి భూభుజా"❀

## 90. సాకల్య మల్ల కవి (1330)

**మ**ల్లయార్య, కవి మల్ల అని పిలవబడే సాకల్య మల్లకవి మాధవుని కుమారుడు. అద్వైతమతానికి చెందినవాడు. సంగ భూపాలుని ఆస్థానంలో వేదాంతదేశికుని శిష్యుడు నాయనా చార్య చేతిలో ఓడిపోయాడు. సింగభూపాలుడు 1330లో రాచకొండ రాజు వైష్ణ ఆచార్యునిపై భేతాలుడు అనే పిశాచిని బ్రాహ్మణ శిష్యుని వేషంలో పంపాడని ఆయన పల్లకిలో గ్రామాంతరం వెడుతూ శిష్యుడిని పల్లకి మోయమన్నాడని, వాడు పల్లకి కింద పడేసి ఆయన్ని చంపే ప్రయత్నం చేశాడని, ఈ విషయం గ్రహించి వైష్ణవ స్వామి దానికి విరుగుడుగా మంత్రం వేశాడని దానికి లొంగిపోయి అతి భక్తిగా భేతాళ శిష్యుడితో చచ్చినట్లు పల్లకి మోయిచెట్లు చేశాడని ఒక కథ ప్రచారంలో ఉంది. ఈ కవికి శ్రీరాముడు కలలో కనిపించి కావ్యం రాయమని కోరితే ఉదార రాఘవం రాశాడు. ఇది పద్దెనిమిది కాండల కావ్యం. కాని మనకు మిగిలింది ఏడు కాండలే. రామాయణ కథను రఘువంశం ఆధారంగా రాశాడు. సరళమైన కవిత్వం. మాయి సూరి కొడుకు చావుండి దీనికి వ్యాఖ్య రాశాడు కాని అసంపూర్తిగా దొరికినది. రాంపల్లి గోపీ నాథుడు కూడా వ్యాఖ్య రాశాడు.

**సాకల్య మల్లు భట్టు**

మల్లు భట్టు లేక కవి మల్లయ్యచార్య శకవల్లి ఇంటి పేరున్న మధ్వుడు. ప్రతాపరుద్రుని ఆస్థాన కవి. కాకతి రాజ్య పతనం తర్వాత రాచకొండ వెళ్ళాడు. శృంగార భూపాలుని ఆస్థానంలో ఉన్నాడు. గురు పరంపరలో ప్రభావ మల్లు

భట్టు అనే పూర్తి అద్వైత నయనాచార్య చేతిలో వాదంలో ఓడిపోయి వైష్ణవం స్వీకరించి ప్రచారం చేశాడు. దీని వెనుక ఒక కథ ఉంది. సాకల్యుడు తన వైష్ణవ విరోధిపై భేతాలుడిని ప్రయోగించి విరోధి పల్లకిని మోసే బోయీగా ఉండమన్నాడు. పల్లకిలోని స్వామిని మట్టు బెట్టే ప్రయత్నంలో ఉండగా ఆయన గ్రహించి మంత్రం ప్రయోగంతో ఈ భేతాలుడిని దారికి తెచ్చి నిజంగానే తన పల్లకీని మోయించాడు. సాకల్యుడు వైష్ణవుని చేతిలో ఓడిపోయి మతం పుచ్చుకొన్నాడు.

సాకల్య మల్లుడు సంస్కృతంలో నిర్యోష్ఠ్య రామాయణం రాశాడు. కాని 16 శతాబ్ది మధ్యలోనే అది కనుమరుగైంది. 16 శతాబ్దం చివరలో గోల్కొండ రాజు వద్ద ఉన్న మరిగంటి సింగనాచార్య దీని విషయం తెలిపాడు. అప్పకవి కూడా ఈ కవి వ్యాకరణ శాస్త్రం రాశాడని చెప్పాడు. సాకల్యుడు అవ్యయ సంగ్రహ నిఘంటు కూర్చాడు.

ప్రణమ్య శిరసా దేవం భద్రాద్రి నిలయం హరిం- అధవ్యయాని కచితిసంగ్రుహాంతే యధాశ్రుతం

ఆః యాస్మెదే నిషేదార్ధం స్వల్పే చాప్యానృతా ర్దికే- అస్తు సంతాపనే కోపప్యాంగ చ స్యాదీషదర్ధకే

చివరగా- సమస్తః సర్వ తోర్దే శోభనాంత సుధాన్తయోః। ఉపాన్తత పురోర్ధ చ స్యాదార్ధార్ద్య గ్రవాచాయే

ఈ నిఘంటువే కవి చివరి రచన. చతుర్భాషా కవితా పితమహా అనే బిరుదున్నవాడు. ఇతని రచనలలో ఉదార రాఘవం ఒకటే లభించింది. మొదటి చివరి శ్లోకాలను చూద్దాం-

అస్తి ప్రశస్తః పరస్తా దాఘః పుమాన్ కేవలాచిత్స్వరూపః- ఆనంద పూర్ణః సద సత్రపంచ బాహ్యంతర వ్యాప్త భుప్రకారః

సాదిష్ట మాత్ర క్షుభితాత్మ నీనా మాయా గుణోర్దైరమః దాడి తత్త్వైః ప్రారబ్ధ మండంసామాను ప్రవిశ్య ప్రావర్తయామాస భవత్రపంచం

రాముని శివ ధనుర్భంగ వార్తను జనకుడు దశరధునికి తెలియజేసే శ్లోకం-

విశిఖే దనుర్భజి తదార్వ భీత్యా, చలితే రదే రధినితదధ్వని ప్రాస్టేతగుణాసరదీ చ శరమాన విషాతాం శ్యానాత్మ జావితి దదుః శుభ లేఖం

తెలుగు పలుకు బలదులను సంస్కృతీకరించి రాశాడు. భోజ చంపును వాడుకొన్నాడు. ఈ కవి కవిత్వాన్ని అల్లసాని పెద్దన్న కూడా అనుసరించి శ్రావ్యత కల్గించాడు మనుచరిత్రలో. సీత దృష్టిలో లక్ష్మణస్వామి ఎలా ఉన్నాడో చెప్పే శ్లోకం బాగుంటుంది–

గురురేపపితేశ, పుత్రేష స్వజన శాచైష సర్వేష భ్రుత్య ఏష– ఇతి దేవరి లక్ష్మణేను కంపాః విదధే నిస్వసితా విదేహ పుత్రీ ఉదార రాఘవంలో కొన్ని సూక్తులు–

ప్రత్యక్షత స్వర్గ సుఖం విహాయ, పరోక్షతః కిం నరకాద్విభీయం
ముగ్ధే కిమప్యాంబ న వేస్తి దగ్ధే, కుక్షౌ క్షుదాకాం జన మాక్షిణ దదాత్

ఇప్పటివరకు మనకు తెలిసింది ఏమిటంటే అనేకార్ధ కావ్యాలు బాగా విజృంభించి సాహిత్యాన్ని సర్కస్ ఫీట్ల కింద మార్చాయని జైన కవులూ ఈ ప్రభావంలో పడిపోయారని వారూ దాని అంతు చూశారని తర్వాత నెమ్మదిగా ధోరణి మారి వంశ చరిత్రలు బాగా వ్యాప్తిలోకి వచ్చాయని అందులో చాలా భాగం చరిత్ర ఉన్నదని అలంకార గ్రంథాలు నిఘంటువులు కూడా కవులు రాసి సాహిత్యాన్ని సుసంపన్నం చేశారని తెలిసింది. ఈ కవులు ఎక్కువ భాగం గుజరాత్, కాశ్మీర రాజుల ఆస్థాన కవులు. ఎక్కువ మంది సూరి బిరుదున్నవారు. అనేక శాస్త్రాలలో నిష్ణాతులు. జైన మతాచార్యులుగా లబ్ధ ప్రతిష్టులు. రాజులను ఆ మతంలోకి మార్చినవారు. విభవ ప్రాభవాలు అందుకొన్నవారు. వీరి తర్వాత కవులు దక్షిణా పథానికే ఎక్కవగా చెందినవారు వచ్చారు. విజయనగర సామ్రాజ్యం ఏర్పడటంతో వచ్చిన మార్పు ఇది. ఆ సామ్రాజ్య నిర్మాత శ్రీ విద్యారన్యులవారు. వారినే మాధవ విద్యారణ్యులు అంటారు. ఇక నుంచి కథ విజయనగరానికి చేరుతుంది. ❁

## 91. సంగీత శృంగారహారం కర్త- హమ్మీరుడు (1340- 1394)

**మే**వార్ రాజే హమ్మీరుడు కావచ్చు. సంగీత రత్నాకరానికి వ్యాఖ్య రాసిన కుంభకర్ణ రాజుకు పైన అయిదవతరం వాడు. 1394లో హమ్మీరుడు చనిపోయాడు. "సంగీత శృంగార హారం" రాశాడు. ఇందులో పూర్వపు రాజు జైత్ర సింహను పేర్కొన్నాడు. ❁

## 92. "స్వరరాగ సుధారసం" రచించిన అష్టావధాని సోమనార్యుడు (1344)

**"స్వ**ర రాగ సుధారసం" కర్త సోమనార్యుడు. ఏడు అధ్యాయాలలో సంగీత నృత్య విశేషాలను వర్ణించాడు. అందులో సృజనకారుడు రావణుడు అన్నాడు. నారద సిద్ధాంతాన్ని పాటించాడు. భరతమునితో తరచుగా విభేదించాడు. సోమనార్యుడు అంటే తెలుగు కవి, ఉత్తర హరివంశ కర్త నాచన సోముడు కావచ్చు. విజయ నగర రాజు మొదటి బుక్కరాయల కాలం 1344 కాలంవాడు. ❁

## 93. అభిరామ రాఘవ నాటక కర్త అనపోతనాయకుడు (1361–1383)

**రా**చకొండ వెలమ రాజ్య స్థాపకుడు అనపోత నాయకుడు 1361లో జన్మించి 1383లో మరణించాడు. మొదటి సింగమ నాయకుని కొడుకు. కాకతీయ ప్రతాపరుద్రుని వద్ద పనిచేశాడు. సింగన రసార్ణవ సుధాకర కర్త సర్వజ్ఞ సింగ భూపాలుని తండ్రి. అనపోతునికి 'సోమకుల పరశురామ'. 'జల్లిపల్లి రణ క్షోణిభారతీక మల్ల' 'త్రిభువనిరాయక', 'ఖడ్గ నారాయణ' బిరుదులున్నాయి. అనపోతుడు మహాకవి పోషకుడు మాత్రమే కాదు తానూ గొప్ప కవే. 'అభిరామ రాఘవ' నాటక కర్త. ఇందులో కొన్ని శ్లోకాలు మాత్రమే సింగన మొదలైన వారు ఉదాహరించారు. వాటినో సారి చూద్దాం–

"హంత సారస్వతం చక్షుః కవీనాం క్రాంత దర్శినాం– అతిరస్య ప్రవర్తేత నియతార్యషు

విద్వానసౌ కలావానపి రసికౌ బహువిధ ప్రయోగజ్ఞః–ఇతి చ భవంతం విద్గో నిర్యూడం సాదు తత్వయా సర్వం"❁

## 94. త్రిలోచనాదిత్యుడు (1370)

**"నా**ట్య లోచనం" రాసిన త్రిలోచనాదిత్యుడిని వ్యాఖ్యాతలందరూ ఉదాహరించారు. పద్నాలుగవ శతాబ్దివాడు. "లోచనా వ్యాఖ్యాంజనం" కూడా రాశాడు.❁

## 95. ఛాయా నాటకకర్త - వ్యాస రామ దేవుడు (1380)

**రా**మాభ్యుదయం, పాండవాభ్యుదయం, సుభాద్రాపరిణయం అనే మూడు నాటకాలను వ్యాస రామ దేవుడు 1402-15 మధ్య రచించాడు. రాయపూర్ కాలకూరి రాజుల ఆస్థాన కవి. ఈ నాటకాలను ఛాయా నాటకాలు అంటారు. బీజాపూర్ సుల్తాన్ ఆదిల్షా వంశంపై వితలకవి ఛాయా నాటకం రాశాడు. సావిత్రీ చరిత్ర, శంకర లాల కూడా ఛాయా నాటకాలే. 'హరి దూతం' అనే ఛాయా నాటకం శ్రీ కృష్ణ రాయబార కథ.❁

## 96. పృథ్వీ చంద్ర చరిత్రకారుడు - ముని దేవ సూరి, సత్య రాజ (1383)

**పృ**థ్వీ చంద్ర చరిత్ర, శాంతినాద చరిత్రలు రాసిన ముని దేవ సూరి సత్యరాజులు 1383 ప్రాంతం వారు. 1200లో ప్రాకృత భాషలో దేవ చంద్ర, శాంతి శ్రీలు రాసిన వాటినే వీళ్ళు సంస్కృతంలో అదే పేర్లతో రాశారు.❁

## 97. నటాంకుశం కర్త- మహిమ భట్టు (1400)

**మ**హిమ భట్టు 'నటాంకుసం'కర్త. ఇందులో రసానికి, అభినయానికి ఉన్న సంబంధాలను వర్ణించాడు. దీనికి ఆధారం శక్తి భద్రుని 'ఆశ్చర్య చూడామణి' పద్నాలుగవ శతాబ్ది తర్వాత వాడు మాత్రం కాదు. ఇందులో 'ప్రతిజ్ఞా యౌగంద రాయణం' నాటకాన్ని ఉదాహరించాడు.

'రాగ సాగరం' అనే పౌరాణిక శైలో మూడు అధ్యాయాల గ్రంథం నారదునికి దత్తిలకునికి మధ్య జరిగిన సంభాషణలలో రాగాల రకాలు ధర్మాలు మొదలైన వాటి చర్చ ఉంది. సారంగ దేవుని ప్రస్తావన ఉన్నది. ఇది పద్నాలుగవ శతాబ్దం కంటే ముందు రచన మాత్రం కాదు.❁

## 98. కాదంబరి నాటకకర్త – నరసింహ (14వ శతాబ్దం)

ఎనిమిది అంకాల కాదంబరి నాటకాన్ని భట్ట భాణుని కాదంబరి ఆధారంగా రాసినవాడు నరసింహ కవి. 14వ శతాబ్దం మధ్యవాడు. తండ్రి గంగాధరుడు. తాత సిద్ధ నాధుడు. కాకతి ప్రతాప రుద్రుని ఆస్థానకవి అగస్త్యునికి తండ్రి బావ గారు. అన్న విశ్వనాధుడు సౌగంధికాపహరణం రాశాడు. మధురా విజయం రాసిన గంగాదేవికి గురువు. చాలా సంక్లిష్ట రచన అయిన కాదంబరిని నాటకంగా మలచటం ఆషామాషీకాదు. అసాధ్యాన్ని సుసాధ్యం చేశాడు నరసింహ. మంచి ఊహాపోహలతో కమ్మని కవిత్వంతో నాటకాన్ని రక్తి కట్టించాడు. ప్రకృతిని విషాదాన్ని గొప్పగా వర్ణించాడు. కవి గొప్ప మేధావి. అది కవిత్వంలో దర్శనమిస్తుంది.

'సౌహిత్యం విదధాతియస్సుమనసం శాశ్వత్ప్రసన్నైదయ –స్యాంతో యమ సముదాహరాంతి మహతో దేవస్య దేహాంతరం'

సూత్రధారుడు, పారిపార్శ్వకుల మాటలలో కవి గొప్పతనాన్ని చెప్పించాడు.

'రసికః కవిరదద్భుతా పద గుంఫోలలితస్ఫుటీరసః – పరిణద్రుపాదర్శినీ వయం నిపుణాస్తత్కి మతోపినః ప్రియం'

నరసింహుడు కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలమ్ ను ఆదర్శంగా తీసుకొని దీన్ని రచించాడు. రథ, లేడి వర్ణనం అచ్చంగా కాళి దాసువే. దుష్యంతుడు శకుంతలను రహస్యంగా కలుసుకోన్నట్లు మహాశ్వేతను చంద్రా పీడుడు కలుస్తాడు. శాకుంతలంలోని ఆరవ అంకం. ఇందులోని ఆరవ అంకం కూడా ఒకే మాదిరిగా ఉన్నాయి. శాకుంతలంలోని వసంతఋతువు ఆరవ అంకంలో ఉంటె ఇందులో

శరదృతు వర్ణన ఎనిమిదిలో ఉంది. వర్ణనలో పోలికలు బాగా కనిపిస్తాయి. శాకుంతలాన్ని యెంత గాఢంగా అనుసరించాడో ఈ ఉదాహరణ తెలియజేస్తుంది.
కాదంబరి – హా దిక్ హా దిక్ ఇదానీ మేవ తదా కృత ప్రతిజ్ఞా ఏతాద్రుసస్య అననుభూత పూర్వస్య కస్యాపి వికరస్య విషయోస్మి సంవృతా
శాకుంతలం – కిం ను స్వలివం ప్రేక్ష్య తపోవన విరోధినౌ వికారస్య గమనీయాస్మి సంవృతా
శాకుంతలతో పోలికలే కాక శ్రీ హర్షుని రత్నావళి తోనూ భవ భూతి ఉత్తర రామ చరితతోనూ పోలికలున్నాయి. నాలుగవ అంకంలో అంతర్నాటకం ప్రవేశ పెట్టాడు. ఇది భవభూతి అంతర్ నాటకంగా కనిపిస్తుంది. పాత్రలు సూటిగా రంగంపై కనిపించవు. మాజిక్‌తో తెర మూతపడుతుంది. ఈ దృశ్యాలను చూసి ప్రేక్షకులు ఆనందాన్ని విషాదాన్ని అనుభవిస్తారు.❀

## 99. పశుపతి నాగనాథ కవి (14వ శతాబ్ది మధ్య కాలం)

**కౌ**శిక గోత్రీకుడు పశుపతికి కుమారుడే నాగనాధుడు. చమత్కార మంజరి రాసిన విశ్వేశ్వరుని శిష్యుడు. రాచకొండ రాజులు అనపోత, శృంగార భూపాల రాజుల ఆస్థానకవి. సంస్కృత విష్ణు పురాణాన్ని తెలుగు చేశాడు. సంస్కృతంలో మదన విలాస భాణం రాశాడు. ఇందులో కొద్దిభాగమే లభ్యమవటం దురదృష్టం.

'అవ్యాత్రృకృతి మనోజ్ఞం నవ్యం తరుణ సౌరభం శంభో – శృంగార జీవనైషధమంగం కారుణ్య రంగ భూర్యుష్మాన్

'లోలాలాలకాన్చిత సమంచిత ఫాల భాగం ధర్మంబు బిందు పరి మండిత గండ మూలం

వల్గాత్కుచం తను రణత్కల కంఠ మూలం మోదం తనోతు సురతం మదిరేక్షణాయః

ఈ భాణాన్ని సర్వజ్ఞ సింగుని కుమారుడు మేచయ గౌరవార్ధం రాశాడు. అంటే నాగనాధకవి మూడు తరాల రాజుల ప్రాపకంలో ఉన్నాడన్న మాట. రాచర్ల రాజులలోనూ ఈ పేర్లున్న వారున్నారు. సింగని కొడుకు అనపోతునికి సమకాలికుడని తెలిపేఆధారం ఉంది.

'రేచర్ల వంశ రత్నకరేణః॥శ్రీ సింహ భూపాల పూర్వాచల ప్రభాకరేణ కేశమామ్బికా కల్ప ప్రసూన గుచ్ఛేన ః–శ్రీ అన పోత భూపాలేన సతత సన్నిధీకృత కళ్యాణ నారాయణస్య వసంతోత్సవ ః–భరద్వాజాన్వయ పరి పూర్ణ రత్నాకరస్య గురు విశ్వేశ్వర కవి చంద్రస్య ప్రియ శిష్యో నాగనాధః కవిః'

శింగ భూపాలుడు అంటే రసార్నవ సుధాకరం రాసిన కవి రాజు, అనపోతుని కుమారుడు అని చరిత్రకారుల భావన. మనకవి విశ్వేశ్వరుని శిష్యుడన్నది ఖాయమే

మరి ఇక్కడికెలా వచ్చాడు? విశ్వేశ్వరుడు సిన్గభూపాలుని ఆస్థానంలో ఉండి ఉంటాడు. వరంగల్ జిల్లా ఐనవోలులో నాగనాధుడు రాసిన 1369 నాటి శాసనం ఉంది. ఇది మొదటి అనపోతునికాలానికి చెందింది. రాజు దాన వివరం ఉంది. 'ఉర్వీ ముద్వరతే బిభార్తి చ కుతామ్నాయస్థితి వైరిహ – ద్వేదీ విశ్రుత విక్రమో హతా రిపు క్షత్రాన్వయ స్తోతుమాన్

దానం 1369లో అంటే శక వత్సరం 1291లో ఇచ్చినట్లు ఉంది. శాసనం చివర తన గోత్రాదులు చెప్పుకొన్నాడు. కనుక 14వ శతాబ్దానికి చెందిన అనపోతనాయకుని కాలంలోనివాడే. విశ్వేశ్వరుడు అనపోతుని కొడుకు మొదటి రెండవ సింగ భూపాలుని ఆస్థానంలోని వాడు. ఇతడే చివరి కాకతీయ సామ్రాజ్యాధిపతి ప్రతాప రుద్రుని సమకాలికుడు కూడా. రాచకొండను 1384–1399లో ఏలిన రెండవ సింగమ నాయకుని కొలువులోనూ ఉన్నాడు. అంటే విశ్వేశ్వరుని జీవితకాలం చాలా సుదీర్ఘం అని, రాచకొండ వెలమ ప్రభువుల మూడు తరాలలోను ఉన్నాడని ఆచార్య బిరుద రాజు రామరాజు గారు తేల్చి చెప్పారు.❁

## 100. కొర్ర పాడు లక్ష్మణ కవి (14వ శతాబ్దం)

**రా**మానుజ, రమలపుత్రుడు కొర్రపాడు లక్ష్మణ కవి. తాత తెలున్గార్య చేన్జి దైవంవిలాస కృష్ణ కావ్యం రాశాడు. ఇందులోని మూడు స్తబకాలలో మొదటిది పూర్తిగా, మిగిలిన రెండు అసంపూర్తిగా, నాలుగోది చివరలేకుండా అయిదోది అసంపూర్ణంగా ఉన్నాయి. జెంజి కృష్ణ రాజు ఆస్థానకవి కనుక ఆయనపై రాసిన శ్లోకం–

'తత్వ విరాసీ త్తత కౌతుక శ్రీర్విలాస కృష్ణో విహతిం చికేర్షుః–క్రుతాశ్రియం కృష్ణ నృపం విధాతుం ,స్వనామ భాజం ప్రధిత స్వచిహ్నం'

పూర్వీకుల గురించి– 'శ్రీ కోర్పాడు తెలున్గార్ధ తనూభవస్య రామానుజస్య తన యేన సమావరస్య – శ్రీ లక్ష్మణేన కవినా జయతు ప్రణీతః కృష్ణానుజేన నవ కృష్ణ విలాస ఏషః'❁

## 101. హరివంశ కావ్య కర్త– లోలంబ రాజు (14వ శతాబ్దం)

**హ**రిహర రాయల ఆస్థానంలో లోలంబరాజ కవి ఉండేవాడు. సూర్య పండితుని వంశానికి చెందిన దివాకరుని పుత్రుడు. 'హరివంశ' కావ్యం అయిదు కాండలలో రాశాడు. 'సుందర దామోదర' కావ్యంలో శ్రీకృష్ణ చరిత్ర రాసి కంసవధతో పూర్తి చేశాడు. వైద్య శాస్త్రంలోనూ అపార అనుభవమున్నవాడు. ఉపయుక్త వైద్య గ్రంథాలు చక్కని కవిత్వంతో రాశాడు.❁

# 102. దశకుమార కథాసారకర్త – అప్పయామాత్య (15 శతాబ్దికి పూర్వం)

**ద**ండి దశకుమార చరిత్ర కు శ్లోక రూపకావ్యమే అప్పయామాత్యుని 'దశ కుమార కథాసారం'. ఇది మూడు పరిచ్ఛేదాలలో ఉంది. 199 అనుష్టుప్ శ్లోకాలో రాశాడు. ఇందులోని అయిదు భాగాలు మూడు పరిచ్ఛేదాలుగా మలిచాడు. రాజవాహనుని చరిత్రతో పూర్తి అవుతుంది. మొదటి పరిచ్ఛేదంలో మొదటి భాగంలోని పూర్వ పీఠిక ఉంది. రెండవ పరిచ్ఛేదంలో రెండు నాలుగు భాగాల కథ ఉంటుంది. మూడవ దానిలో అయిదవ భాగ కథ ఉంది. కవిత్వం సరళంగా సుందరంగా అందంగా ఉంటుంది. కవి పేరుతప్ప మిగిలిన వివరాలు తెలియ రాలేదు. విజయనగర రాజ మంత్రి అయి ఉండవచ్చునని ఊహిస్తున్నారు. ఆంధ్ర నియోగి బ్రాహ్మణుడు అని పేరును బట్టి ఊహ కావ్యాన్ని 'శ్రీ వాగుమాం పరం శాంత మేక వీరం మహేశ్వరీం–సంపత్సంహిత్య సౌభాగ్య సమ్యక్ సిధ్యర్ధ మర్యయే' అని మొదలు పెట్టాడు. ఆయనే చెప్పినదాన్ని బట్టి కవి సనాతన ఆంధ్ర బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. ఏకవీరా దేవి భక్తి కాకతీయుల కాలంలో ఎక్కువగా ఉండేది. ఆకాల సాహిత్యం,శాసనాలు దీనికి రుజువు. ఖచ్చితంగా మనకవి ఫలానా కాలానికి చెందినవాడు అని చెప్పలేముకాని 15శతాబ్దికి పూర్వం అని చెప్పచ్చు. సాంద్రమైన దశకుమార చరిత్రను అతి సరళ భాషలో రాశాడు అప్పయామాత్య. మధురపదజాలం ముగ్ధ మనోహరంగా ఉంటుంది. కావ్యం చివరలో

రమ్య కాంతేగృహే సార్ధం ప్రియయా రాజవాహనః – విహరన్
వల్లభ్యసుగోస్టచామాభ్య రదనా పూర్వక మేష పృష్టః
చతుర్దశానాం జగతాం ప్రపంచం సంక్షేపతః స్పష్ట ముదాజహార
ఇతి శ్రీ మదప్పయా మాత్య విరచితే దశ కుమార కథా సారే సోమదత్త కధాకథనం నామ తృతీయః పరిచ్ఛేదః ❁

## 103. రతి రత్న ప్రదీపకర్త– ఇమ్మడి ప్రౌఢ దేవరాయలు (1422–48)

**వి**జయనగర సామ్రాజ్య రాజు ప్రౌఢ దేవరాయలు 1422–48 కాలంలో పాలించాడు. శృంగార విలాసుడు. ఏడు అధ్యాయాలలో సులభశైలిలో "రతి రత్న ప్రదీపిక" రాశాడు. ప్రేమికులు వారి వినోదం ఆనందం భోగం అందులో సుఖం గురించి వివరించాడు.

సాసాలి వీర నారాధ్యాయుడు పదిహేనవ శతాబ్ది చివరివాడు. "పంచరత్న" రాశాడు. రెండవ నారపాధ్యాయుడు దీనికి వ్యాఖ్య రాశాడు.❋

## 104. మహా పండిత కవి, వాసుదేవుడు (1423)

**మ**హర్షి, గోపాల పుత్రుడు వాసుదేవుడు. పయ్యూరు భట్ట మన బ్రాహ్మణ మహా విద్వాంసుడు. పదిహేనవ శతాబ్ది చివరి కవులలో సుప్రసిద్ధుడు. మహర్షికి తొమ్మిది మంది కొడుకులు. అందరూ అందరే. శాస్త్రాలలో మహా నిపుణులు. కమార్తె కొడుకు పేరు వాసుదేవుడు. మహా వ్యాకరణవేత్త.

వాసుదేవుడు ఉద్దండుని మిత్రుడు కనుక 1423కు చెందినవాడు. కాలికట్ రాజు మన విక్రమ జమోరి అతనికి ఆస్థానంలో పదవినిచ్చాడు. ఉద్దండుని కోకిల సందేశానికి దీటుగా భ్రమర సందేశం లేక భ్రమర దూతం రాశాడు. తర్వాత రవివర్మ, గోదావర్మల ఆస్థానంలో ఉన్నాడు. పాణిని వ్యాకరణంపై విపులమైన వ్యాఖ్యానంగా ఉదాహరణలతో వాసుదేవ విజయం రచించాడు. పూర్తి చేయలేకపోతే సోదరి కుమారుడు మేనల్లుడైన నారాయణ కవి పూర్తిచేసి ధాతుకావ్యం అని పేరు పెట్టాడు.

ఆరు ఆశ్వాసాల దేవీ చరిత రాశాడు. ఇది వేదారణ్యంలో పూజింపబడే గోపాలీదేవి చరిత్ర. ఈమె కృష్ణుని సోదరి. దేవకీ దేవికి ఎనిమిదవ సంతానం. సత్య తాప కదా కావ్యంలో మూడు ఆశ్వాసాలలో సత్య తాప లేక మహర్షి జీవిత చరిత్రను వర్ణించాడు. తన పూర్వీకుడైన మహర్షి వేదారణ్యంలో నీలా నది ఒడ్డున తపస్సు చేసి మోక్షం పొందిన కథ ఇది. నీల నదినే ఇప్పుడు భారతప్పోల నది అంటారు. శివోదయ కావ్యంలో తన చరిత్ర తన ఎనిమిది మంది సోదరుల చరిత్ర రాసుకొన్నాడు వాసుదేవుడు. యమకంలో రాసిన అచ్యుత లీలలో వేదారణ్యంలో అర్చింపబడే అచ్యుత దేవుని గురించి ఉంది. గజేంద్ర మోక్షం కూడా రాశాడు. పదమూడు కాండల పాండవ చరిత్ర దొరికింది. కాని కవి పేరు మాత్రం లేదు. అందులో వాసుదేవకవి పార్థ కథ అనే యమక కావ్యం రాసినట్లు ఉన్నది. ఇది అర్జునుని కథ. అలాగే అర్జున రావణీయం అనే పదిహేడు కాండల కావ్యంలో రావణ కార్తవీర్యార్జున యుద్ధం వర్ణింపబడింది. ఇది పాణిని అస్టాధ్యాయికి ఉదాహరణ కావ్యం. వాసుదేవుడు వ్యాఖ్యానమూ రాశాడు. దీని వ్రాత ప్రతి మలబారులో దొరికింది. మహర్షి కుటుంబ సభ్యులు ఈ రెండు కావ్యాలనూ పూర్తి చేశారని భావించారు.❀

## 105. చాగంటి మల్లినారాధ్యుడు (1429)

**మ**ల్లారి ఆరాధ్య పేరున్న ఈ కవి చాగంటి శరభానారాధ్య కుమారుడు 'శివలింగ సూర్యోదయం' రాశాడు. ప్రబోధ చంద్రోదయం సంకల్ప సూర్యోదయంలాగానే నడిపించాడు. వీరశైవాన్ని సుప్రతిష్టితం చేశాడు. బసవేశ్వరుని గూర్చి వర్ణన ఉంది. కవి చెప్పిన బసవేశ్వరుడు వీరశైవ ప్రాపకుడు బసవన మంత్రి ఒక్కరుగానే కనిపిస్తారు. పెనుగొండ ఎపిగ్రాఫ్‌లో కందుకూరి బసవరాజు గోదావరిజిల్లా ఏలూరుకు దేశ పాండ్యుడు అని తెలుస్తోంది. 1429 ప్రాంతం వాడు. దేవిడి, ఉర్లాం జమీందార్. ఇదే సద్గురు శివానందమూర్తిగారి వంశం. మొదటి శ్లోకం–

'శ్రీమత్పర్వత పట్టసాగ్రవిలాస త్సౌవర్ణ సౌదాస్థలీ – నానా రత్న విచిత్ర కాంతి రచిత ప్రోత్తస్గురా వేదాన్తరే

బ్రహ్మో పేంద్ర హరాఖ్యాయ పర్వతాతియుక్సిమాఃసనే సుస్తితం – వీరేశం విష దంధ కార మిహిరం పశ్యేయ మంతర్దశా'

చివరి శ్లోకంలో తన పేరు వగైరా చెప్పుకొన్నాడు.

'చాగంట్వన్వయా సింధు శీత కరుణా శ్రీ శరభారాధ్య స – త్పుత్రాయామల సద్గుణా య కలయే మల్లేశ్వరాఖ్యాయ చ

ద్రస్టానాంశివ లింగ దర్శన సముద్ భూత ప్రమోదాత్మనాం–భూయాల్లింగ కటాక్ష వీక్షణావశాత్ గోబ్రాహ్మణేభ్యశ్శుభం'❋



## 106. భక్త మీరాబాయి భర్త, సంగీత మీమాంస కర్త-
## రాజా కుంభకర్ణ (1433-1468)

**కు**ంభ రాణా లేక కుంభ కర్ణ రాజు విజయ గోత్రీకుడైన మోకలుని కుమారుడు. ఈ వంశంవారు గూహిలులు అనే బ్రాహ్మణ రాజులు. మేవార్ లేక మేదపేట రాజులు. ఇతని భార్య అపూర్వ దేవి. కొడుకు రాజమల్లుడు. కర్ణుడు 1433- 1468 కాలంలో చిత్రకూట రాజు. ఈయన భార్యయే ప్రముఖ కృష్ణ భక్తురాలు మీరాబాయి. ఇతడు భవానీదేవికి, ఏక లింగ దేవునికి పరమ భక్తుడు. మాళవ, యాదవ గుజరాతు రాజులపై తన యుద్ధ విజయాలను సారంగధర నగర విధ్వంసాన్ని పాటలుగా పాడుతూ ఉండేవాడు. అందువలన అనేక బిరుదులు పొందాడు. మంచి సంగీత రసికుడు. గొప్ప కళాభిమాని. గీతగోవిందంపై "రసికి ప్రియ" వ్యాఖ్యానం రాశాడు. అందులో తన "సంగీత రాజం" గురించి చెప్పుకొన్నాడు. సంగీత రాజంకే "సంగీత మీమాంస" అనే పేరు కూడా ఉంది. ఇందులో అధ్యాయాలను రత్నకోశాలు అన్నాడు. మొత్తం 16000 శ్లోకాలున్న గ్రంథం. మొదటి అధ్యాయం నాటక కళ గురించి, రెండవది సంగీతం గురించి, మూడవది సంగీత వాద్యాల గురించి నాల్గవది ఆహార్యం నృత్యం హావభావాల గూర్చి అయిదవది నాయక నాయికల గురించి భావాల గురించి వివరించాడు.❁



## 107. 732 ఆంజనేయ విగ్రహాలు' స్థాపించిన వ్యాస రాయలు (1447 -1539)

**వ్యా**స రాయలు మధ్వాచార్య శిష్యులు 1447 -1539 కాలంలో జీవించారు. విజయనగర సామ్రాజ్య ఆస్థాన గురువు సాల్వ నరసింహ అచ్యుత దేవరాయ శ్రీకృష్ణ దేవరయలకు ముఖ్య సలహాదారు. భారతదేశమంతటా పర్యటించి 732 ఆంజనేయ విగ్రహాలను స్థాపించి దేవాలయాలను నిర్మించాడు. న్యాయామృతం, తర్క తాండవం, తాత్పర్య చంద్రిక, మాయావాద ఖండన మండనం ఉపాధి ఖండనమండన మంజరి, తత్వ వివేకమందర మంజరి సత్తార్క విలాసం మొదలైన ఎన్నో గ్రంథాలు వ్యాస రాయ కృతాలు.

'వ్యాస యోగి చరిత' చంపూలో సోమనాధుడు వ్యాసరాయ జీవిత చరితను రాసాడు. శ్రీ విద్యారత్నాకర స్వామి 'వ్యాసవిజయం'లో ఆయన గురించి వివరించారు. సోమనాధుని రచనం భట్టబాణుని కాదంబరిని గుర్తు చేస్తుంది. ఈయన అనంతభట్టు సోదరి కుమారుడు. సోమనాధుడిని వ్యాసరయలకు అచ్యుత దేవరాయల ఆస్థానంలో పరిచయమయ్యాడు. ఇతని తాత భట్ట గాయముక్తి భాస్కరుడు 'కాల మాఘాధ్వరి'గా ప్రసిద్ధుడైన కవి.❁

## 108. మణ విక్రమ మరియు పద్దెనిమిదిన్నర కవులు (1450)

**జా**మోరిన్ మణ విక్రమ రాజు ఆస్థానంలో పదిహేనవ శతాబ్దిలో తమాషాగా పద్దెనిమిదన్నర మంది సంస్కృత కవులు వర్ధిల్లారు. జామోరిన్ రాజు స్వయంగా కవి పండితుడు. సాహితీ పోషకుడు. పయ్యూరు పట్టారి కుటుంబానికి చెందిన ఎనిమిది మంది సోదరులు, ఒక కుమారుడు తిరువాపురం, తిరువేగాపురంకు చెందిన అయిదుగురు బ్రాహ్మణులు వీరిలో ఉన్నారు. ముల్లంపల్లి పట్టేరి, చెన్నాసు నారాయణ నంబూద్రి, కకసేరి నంబూద్రి ఉద్దండ కవి కలిసి 18 మంది కవులు ఉన్నట్టు నంబూద్రి అనే కవి మలయాళం సంస్కృతాలలో కవి కనుక ఈయనను అర సంస్కృత కవిగా పేర్కొన్నారు. కనుక వీరు పద్దెనిమిదిన్నర కవులైనారు.

పయ్యూరు కుటుంబంలో పెద్దవాడు మహర్షి అనే ఆయన మీమాసంలో దిట్ట. అయిదవ సోదరుడు నారాయణ పట్టేరి. మరిద్దరు సోదర్లు శంకర, భువన దాసులు. మహర్షి కొడుకు పరమేశ్వర గురించి ఉద్దండ కవి తన మల్లికా మారుతంలో రాశాడు. కోకిల సందేశంలో మహర్షి కవిని మీమాంస త్రయ కులగురువు అని ప్రశంసించాడు. ఈ సోదరులు మీమాంస శాస్త్రంపై రాసిన గ్రంథాలు మలబారు ప్రాంతంలో ఎక్కడ పడితే అక్కడ లభిస్తాయి. తిరువపారకవి లక్ష్మీ మానవేద చంపు రాశాడు. బ్రహ్మదత్తుని పుత్రుడు నారాయణ సుభద్ర హరణ కావ్యం రచించాడు.

ఈ కుటుంబంలోని వాడే అయిన చేన్నాసు నారాయణ తంత్ర సముచ్చ యం అనే కళా గ్రంథం రాశాడు. ఇతనివి కకసేరి నంబూద్రి వి వ్యంగ్య చాలువులు మలబారు తీరం అంతా ప్రచారంలో ఉన్నాయి. కోపించిన రాజు జమోరిన్ వీళ్ళను దండించాడు. కకసేరి దామోదరుడు ఉద్దండ కవికి ప్రత్యర్థి. ఇందుమతి రాఘవం రాశాడు. మన విక్రమ రాజు స్వయంగా కవి, పండితుడు కనుక అనర్ఘ రాఘవంపై వ్యాఖ్యానం రాశాడు. కనక సభాపతి కొడుకు సాంబశివుడు శ్రీవత్స గోత్రీకుడు. గోపాల సముద్రంలో ఉండేవాడు. శృంగార విలాస భాణం రాశాడు. ఇలా ఈ కవి కుటుంబం అంతులేని సంస్కృత సాహితీ సంపదను వెలువరించింది. ❋

## 109. ఉద్దండకవి (1450)

రంగనాథ, రంగాంబల కుమారుడైన ఉద్దండుడు వాధూలస గోత్రీకుడు. కంచి దగ్గర లాట పుర నివాసి. దక్షిణ భారతంలోని ప్రసిద్ధ శాస్త్రవేత్తల వద్ద శాస్త్రాధ్యయనం చేశాడు. మలబారు రాజ్యంలో తన అదృష్టాన్ని పరీక్షించుకోవటానికి వెళ్ళాడు. అక్కడ వాదంలో అందర్నీ ఓడించి జమోరిన్ రాజు మణ విక్రముని అభిమానం పొంది ఆస్థాన విద్వాంసుడయ్యాడు. ఉద్దండ ప్రతిభ మిగిలిన వారికి తీవ్ర అసూయ కలిగించింది. ఒక పండితుని భార్య అతన్ని ఎలాగోలా భ్రష్టు పట్టిస్తానని శపథం చేసి అనేకమంది సాయంతో ప్రయత్నించింది చేరువైంది. వారి కుమారుడే కాకసారి భట్టాతిరి.

పన్నెండేళ్ళ ఈ బాలుడు ఉద్దండుని వాదంలో ఓడించాడు. మలయాళంలో వసుమతీ విక్రమం సంస్కృతంలో ఇందుమతి రాఘవం నాటకం రాశాడు. ఇతని కోకిల సందేశంలో కాలికట్‌లో ఉన్న ప్రేయసికి పంపిన సందేశం ఉంది. ఇది కాళిదాసు మేఘ సందేశంను పోలి ఉంటుంది. కాలికట్ రాజులు రాజా రవివర్మ, గోదావర్మల ఆస్థాన కవి వాసుదేవ కవి రాసిన దానికి సమాధానంగా భ్రమర సందేశం రాసి పంపించాడు ఆ కవికి. మాలతీ మాధవంలోని కథకు వివరణగా పది అంకాల మల్లికా మారుతం ప్రకరణంగా రాశాడు. ఉద్దండుడు దీన్ని మెరుగు పరచాడని అంటారు. ఉద్దండ కవిత్వం సుందర మధురంగా ఉంటుంది. సామెతలు, జాతీయాలు సమర్థవంతంగా ప్రయోగించాడు.

ఉద్దండకవి స్నేహితుడు శంకర మారార్‌ను గురువాయూర్ కృష్ణ దేవాలయంలో కలుసుకొన్నారు. ఉద్దండుడు మొదలుపెట్టిన కృష్ణ విజయంను శంకర కవి పూర్తి చేశాడు. ఉద్దండుని సమకాలీన కవిసుకుమారుడు లేక ప్రభాకరుడు కృష్ణ విలాస కావ్యం రాశాడు. కావ్యం అంతే సుకుమారంగా ఉంటుంది. ❁

## 110. రెండవ వాసుదేవ కవి (1450)

**రా**మ కథ అనే గద్య కావ్యం రాసిన వాసుదేవ కవి ఉమా నారాయణుల కొడుకు. ఆదిత్య వర్మ రాజు ఆస్థానంలో 1472-1484లో ఉన్నాడు. రాజా రవివర్మ ఆస్థానంలో ఉండి గోవిన్దచరిత్ర, సంక్షేప భారతం, సంక్షేప రామాయణం రాశాడు. ఈ నారాయణుడు మహర్షికి ఎనిమిదవ కుమారుడు అయి ఉంటాడు లేక మహర్షి కుమార్తె కొడుకు అయి ఉండచ్చు.❁

## 111. "సహజ సారస్వత చంద్ర" - హరిహరుడు (1450)

**రా**మ విద్వత్ కొడుకు హరిహరుడు "సహజ సారస్వత చంద్ర" బిరుదాంకితుడు. "రతి రహస్యం లేక శృంగార భేదప దీపిక లేక శృంగార దీపికి" రాశాడు. నాలుగు అధ్యాయాలున్న దీనిలో మంత్రం, యంత్ర మందుల గురించి వివరించాడు. ఇతను తెలుగు కవే. "భాగవతం" రాశాడు. 1450 వాడు.

విద్యాధరుడు హరిహరుని "బింద్వాలంకారం" గ్రంథం గురించి చెప్పాడు. దీనికి రాజు అర్జునుడు అనంత సంపదనిచ్చాడు కవికి. ఈ రాజు మాల్వ రాజు అర్జునవర్మ అయి ఉండవచ్చు. కనుక కాలం పదమూడవ శతాబ్దం అని భావిస్తారు.❁

## 112. కామ సంహితకర్త- అనంతుడు (1457)

**కా**మ సంహితకర్త అనంతుడు తన గ్రంథంలో ప్రేమను గురించి చాలా విషయాలు మనోహరంగా చెప్పాడు. ముందుగా ఋతు వర్ణన చేశాడు. తర్వాత స్త్రీ జాతుల గురించి, ప్రేమలో సోపానాలు వాటిని దాటి అభివృద్ధి సాధించటం గురించి రాశాడు. 1457 కాలం రచన ఇది. "శుభాషిత రత్నావళి"లో ఇందులోని శ్లోకాలు ఉదహరింప బడటం వలన ఇది విషయ సేకరణ గ్రంథం అంటారు.❀

## 113. హరిచరిత కావ్య నిర్మాత చతుర్భుజుడు (1470)

**చ**తుర్భుజుడు 1493లో 13 కాండల హరిచరిత కావ్యాన్ని శ్రీకృష్ణునిపై రాసాడు. బెంగాల్‌లోని గౌడ పట్టణం రామకేలి నివాసి. ఆనాటి రాజులు ఖోజులు, హబ్సీలు. కొడుకు పుట్టగానే తండ్రి నాలుకపై బీజాక్షరాలను బంగారు కలంతో తేనెలో ముంచి రాసాడు. దానితో కవిత్వం అబ్బింది. ఇతని కొడుకు కమలాకరుడు. లోలాంరాజు రాసిన హరివిలాస కావ్యానికి ఘటకర్పరానికి వ్యాఖ్యానాలు రాసాడు.❀



## 114. బ్రహ్మ సూత్రం భాష్యం రాసిన వల్లభాచార్య (1478- 1550)

**ల**క్ష్మీభట్ట కుమారుడైన వల్లభాచార్యుడు గొప్ప శ్రీకృష్ణ మత బోధకుడు. 1478 నుండి 1550 వరకూ జీవించాడు. వ్యాసుని బ్రహ్మ సూత్రాలకు అను భాష్యం రాసాడు. వల్లభ మతం అనయాయూలలో చైతన్యుడు ప్రధానుడు. వీరికి శ్రీకృష్ణుడే సర్వము. వల్లభాచార్య ప్రేమామృతం మధుర మహాత్మ్యం, మధురాష్టకం, యమునాస్తవం రచించాడు. భాగవతంపై అనేక ఉపన్యాసాలు చేసాడు. ఈయన చరిత్రను గోపాలదాసు వల్లభాఖ్యానకం వర్ణించాడు. బాబూ సీతారామ శాస్త్రి వల్లభ దిగ్విజయం రాసాడు. కాశిలోని మనికర్నికా ఘాట్‌లో గంగానదిలో మునిగి జీవితం చాలించాడు. పుష్టిమార్గ ప్రబోధకుడు వల్లభాచార్య పదహారు గ్రంథాలు రాశాడు.

వల్లభుని కుమారుడు గోపీనాధుడు, విఠలుడు తండ్రి లాగా గొప్ప కవి. కృష్ణ ప్రేమామృతం, యమునా సప్తది రాస సర్వస్వంతో బాటు గీత గోవిందంపై వ్యాఖ్య రాసాడు. ❋

## 115. చైతన్యప్రభు అనే గౌరాంగుడు (1486)

**ని**మాయ్ అన్న పేరు ఉన్న గౌరాంగుడు జగన్నాధ, శచీ దంపతులకు బెంగాల్‌లోని నాడియా జిల్లాలో 1486లో జన్మించాడు. ఈ గ్రామం భాగీరధి నదీ తీరంలో ఉంది. చిన్నతనంలోనే తాను గొప్పవాడు అవుతానని తెలుసుకున్నాడు. సనాతన మిశ్ర కుమార్తె విష్ణు ప్రియను వివాహం చేసుకున్నాడు. గౌర వర్ణంలో అందంగా ఉండటం వలన గౌరాంగుడు అనే పేరు వచ్చింది. సర్వసంగ పరిత్యాగం చేసి శ్రీకృష్ణ చైతన్య అనే పేరు పొందాడు. శ్రీకృష్ణుని దివ్యలీలల్ని కీర్తనలుగా రాసి గానం చేసేవాడు. భక్తీ మార్గాన్ని ప్రబోధించాడు. 120 ఏళ్ళు జీవించి 1527లో మరణించాడు. గోపాల చరిత్ర ప్రేమామృతం సంక్షేప భాగవతామ్రుతం, హరినామ కవచం, దాన కేళి చింతామణి రచించాడు. భారతదేశమంతా పర్యటన చేస్తూ శ్రీకృష్ణ భక్తితత్వాన్ని వ్యాప్తి చేసాడు. వేదాంతంలో అచింత్య భేదా భేద సిద్ధాంతం ప్రచానం చేశాడు. శ్రీకృష్ణుని అవతారంగా చైతన్య మహాప్రభువుని భావిస్తారు. ❋

## 116. బంగారు పల్లకి కానుకగా పొందిన సంగీత సూర్యోదయకర్త- భండారు లక్ష్మీ నారాయణ (1500)

**భా**రద్వాజ గోత్రీకుడు రుక్మిణి, విఠలేశ్వర దంపతుల పుత్రుడు భండారు లక్ష్మీ నారాయణ. వాగ్గేయకారుడిగా సుప్రసిద్ధుడు. శ్రీకృష్ణ దేవరాయల (1509–1529) ఆస్థాన సంగీత విద్వాంసుడు. "అభినవభరత చార్య" "తోడరమల్ల, సూక్ష్మ భరచాచార్య" మొదలైన బిరుదులున్నవాడు. రాయలు బంగారు పల్లకిని, గజాలను ముత్యాలను కానుకగా సమర్పించాడు. విష్ణు భట్టాచార్య శిష్యుడు. "సంగీత సూర్యోదయ"కర్త. ఇందులో అయిదు అధ్యాయాలు వృత్త తాళ, స్వరగీతి జతి, ప్రబంధాల గురించి వివరించాడు. ఉపోద్ఘాతంలో విద్యాపుర చక్రవర్తి గురించి విపులంగా తెలిపాడు.

గోవిందుని "రాగ తాళ పారిజాత ప్రకాశిక"లో సంగీత ధ్వనులు, కాలం గూర్చి రాశాడు. సారంగ దేవుని గురించి రాశాడు. కనుక కాలం పదమూడవ శతాబ్ది తరువాత వాడని అనుకోవచ్చు.

విజయనగర రాజు తిరుమల రాయని కాలం వాడైన లక్ష్మీధరుడు. గుంటూరు జిల్లా చెరుకూరువాడు. గీతగోవిందంపై వ్యాఖ్య రాస్తూ రాగ దీపిక, రంగ లక్ష్మీ విలాసం వామదేవీయం, ప్రతాప రాజు సంగీత చూడామణి గురించి పేర్కొన్నాడు. తాను "భరత శాస్త్ర గ్రంథం" రాశాడు.❀

## 117. ఏలేశ్వరపు పెద్దిభట్ట (1500)

**గో**దావరి జిల్లా ఏలేశ్వరం నివాసి వెలనాటి బ్రాహ్మణుడు ఏలేశ్వరపు పెద్ది భట్ట. 'సూక్తి వారిధి' రచయిత. తాను ఏలేశ్వర మహోపాధ్యాయ వంశానికి చెందిన వాడినని వేదశాస్త్రాలలో అఖండ పాండిత్యం ఉన్నవాడినని కవి చెప్పాడు. 1700 కాలపు కవి. కాని ఇంకా పూర్వీకుడే అని అనుమానం. 16వ శతాబ్ది పూర్వార్ధపు కవి సంకుసాల నృసింహ కవి ఈ కవిని ఉదాహరించాడు. కనుక పెద్ది భట్టు కాలం 15వ శతాబ్దం అయి ఉండాలి.

సూక్తి వారిధి 13అధ్యాయాల కావ్యం. కాని అయిదవ అధ్యాయం వైరాగ్య శతకం, ఆరవది– దాన శతకం, 7వది రాజ శతకం, 8వదైన సజ్జన శతకం, 9) దుర్యాన శతకం,13వదైన ధర్మ శతకం మాత్రమే లభ్యం. భర్తృ హరి కవిపై అపార గౌరవం ఉన్నందున నీతి శతకంలో ఆయన స్తుతి చేశాడు.

'ఆశాయా దశా ఏతే దాసః సర్వ లోకస్య –ఆశా దాసీ యేషాం దాసయతే లోకః అవశ్యం యాతార శ్చిరతరముషిత్వాపి విషయా –వియోగే కో భేద సత్యజతిన జానో యత్ స్వయమ్మూన్'

చివరగా – 'ఆసతో తృప్తి మాస్తాయ విద్యా లేశేన కేచన్ – భేకాఃకూప జలేనేవ సోకస్సంతో ష కారిణః

'ఇతి శ్రీమత్ ఏలేశ్వరపుర వర మహోపాధ్యాయ వంశోద్దారకేణ విరచితే – సూక్తి వారిధీ సుభాషిత గ్రంథే త్రయోదశాధ్యాయః'❀

## 118. రాఘవ యాదవీయ కవి– సోమేశ్వరుడు (1500)

**వి**ంజమూరి కుటుంబానికి చెందిన కృష్ణ సూరి కుమారుడే సోమేశ్వరుడు. గౌతమ గోత్రీకుడు. పది హేను కాండాలున్న 'రాఘవ యాదవీయం' రాశాడు. ఇందులో శ్రీ రామ, శ్రీ కృష్ణ చరిత్రలను వర్ణించాడు. ఇది ద్వ్యర్థికావ్యం. కాళిదాస, భారవిల శబ్దాలానే ప్రయోగించి అమరకవి లాగా ఏకాక్షర పదాలనూ వాడాడు. ఇది కావ్యమే కాదు అలంకార గ్రంథం కూడా. విపులమైన వ్యాఖ్యానమూ ఉంది. ఇదే పేరుతో రఘునాదాచార్యుడు, శ్రీనివాసాచార్యుడు, వాసుదేవుడు కూడా రాశారు. రామచంద్రుని 'రసిక రంజనం' అనేది శృంగార, వైరాగ్య అర్ధ భావాలను తెలియజేసే కవితల సంపుటి. 1524లో రాసిన రామ చంద్రుడు లక్ష్మణభట్టు కుమారుడు.❁

## 119. డిండిమ కవి సార్వ భౌముడు – అరుణ గిరి నాధుడు (1422–48)

**మొ**దటి రాజనాధుడు అభిరామాంబికల కుమారుడు అరుణ గిరినాధుడు. సామశాఖకు చెందిన గౌతమ గోత్రీకుడు. మాతామహుడు అభిరాముడు 'శ్రీకంఠ ఆగమ శాస్త్రం'లో మహా పండితుడు. 'డిండిమప్రభు' లేక మొదటి డిండిమగా ప్రసిద్ధుడు. సభాపతి మేనమామ, నృత్తరాజు పితామహుడు. శ్రీకవిగా తాతగారు సురేంద్ర అగ్రహారంలో పేరు పొందాడు ఎనిమిది భాషలలో పండితుడు. యజ్ఞాంబికను వివాహమాడాడు. ఎవరిని ఓడించినా డిండిమ (ఢక్క)ను మోగించి జయభేరిగా సూచించేవాడు. అందుకే రెండవ డిండిమకు కవి సార్వ భౌముడు అనే బిరుదు వచ్చింది. విజయనగర రాజు రెండవ దేవ రాయల కాలంలో 1422–48 కాలంలో ఉండేవాడు. కవిమల్లుని చర్చల్లో ఓడించాడు. 'సోమవల్లి యోగానందం' అనే ప్రబంధాన్ని రాశాడు. హాస్య వ్యంగ్య అవహేళనాత్మక రచన ఇది.

అరుణ గిరినాధుడైన డిండిమ భట్టు కుమారుడే రెండవ రాజ శేఖరుడు. ఇతనికీ డిండిమ కవిసార్వ భౌమ బిరుదు ఉంది. రెండవ డిండిమ భట్టు అంటారు. సాల్వ నరసింహరాయల ఆస్థాన కవి. సాళువాభ్యుదయం రాశాడు. ఇతన్ని గురించి మొదటిభాగంలో తెలుసుకొన్నాం.❁

## 120. పాండవాభ్యుదయ కవి- శివ సూర్య (15వ శతాబ్దం)

**అ**భిరాముని కొడుకు సభాపతికి స్వయంభు అనే కొడుకు, అభిరామ కామాక్షి అనే కూతురు ఉన్నారు. స్వయంభు రెండవ డిండిమ కూతుర్ని పెళ్ళాడాడు. వీరి కుమారుడే శివ సూర్య కవి. వీళ్ళది శ్రీ వత్స గోత్రం. సూర్యకవి ఎనిమిది కాండల 'పాండవాభ్యుదయం' కావ్యం రాశాడు. ఇది మహా భారత కథ. ఇతని కొడుకు భాస్కరుడు హొలఘట్టి రాజు ఆశ్రితుడు. 'వల్లవాభ్యుదయం' అనే అయిదు అంకాల నాటకం రాశాడు. శ్రీరంగం దగ్గర తిరువనక్కాల్‌లో జంబు నాథ ఉత్సవాలలో ఈ నాటకాన్ని ప్రదర్శించారు. అభిరామ కామాక్షికి కృష్ణ, రామ అని ఇద్దరు కొడుకులు. అభిరామ కామాక్షి కూడా గొప్ప కవి. శ్రీరామ కథను 'అభినవ 'రామాభ్యుదయం' కావ్యంగా ఇరవై నాలుగు కాండలలో రాసింది. ❁

## 121. సుభద్ర ధనుంజయ నాటకకర్త - మొదటి రాజనాధుడు (15వ శతాబ్దం)

**కు**మారడిండిమ కాక రెండవ రాజనాదునికి ఒక కూతురు ఉంది. ఈమెను స్వయంభు కుమార్తె కొడుకు మొదటి రాజనాథ్‌కు ఇచ్చి పెళ్లి చేశారు. స్వయంభుకు స్వయంభునాథ, కుమారుడు ఇతడు 'శంకరా నంద చంపు' రాశాడు. ఇది శివార్జునుల యుద్ధ కథ. దీనితో బాటు 'కృష్ణ విలాస' కావ్యమూ రాశాడు. ఇది పధ్నాలు కాండలు. 'సుభద్ర - ధనుంజయ' అనే అయిదంకాల నాటకం రాశాడు. 'రత్నేశ్వర ప్రసాదాన' అనే మరో అయిదు అంకాల నాటకమూ చేశాడు. కాశీలోని రత్నేశ్వరస్వామి అనుగ్రహంతో రత్న చూడ, రత్నావతిల వివాహం జరిగిన విధానం వర్ణించాడు. 'మదన గోపాల విలాసం' అనే భాణమూ రచించాడు. ఇది రాధా కృష్ణుల ప్రేమ శృంగార కథ. 'హరిశ్చంద్ర చంపు'ను సోమవారం నాడు రాశానని చెప్పాడు.

ఈ విధంగా డిండిమ వంశంలోని అనేక మంది కవులు అద్భుత కావ్య సృష్టి చేసి ఇంగువ కట్టిన గుడ్డ సామెతను నిజంగానే రుజువు చేసుకొన్నారు. ❁

## 122. సరసభారతి విజయ కర్త – వాది రాజు (15వ శతాబ్దం)

**క**న్నడ సంకీర్తనలు రాసిన పురందర దాసు వ్యాసరాయల శిష్యుడు. వాదిరాజు కూడా శిష్యుడే. వాది రాజు అచ్యుతదేవరాయల కాలంలో ఆర్థిక సంక్షోభం ఏర్పడినప్పుడు గుప్తనిధిని బయటకు తీసి సాయపడ్డాడు. ఉడిపి కృష్ణదేవాలయాన్ని నిర్మాణానికి సహకరించాడు . దాని బంగారు శిఖరాన్ని ఆవిష్కరిస్తున్న సందర్భంలో విజయనగర సామ్రాజ్యం తళ్ళికోట యుద్ధంలో ఓడిపోయింది. వాదిరాజు గొప్పకవి. 'రుక్మిణీశ విజయం', 'సరసభారతి విలాసం', 'తీర్థ ప్రభంధం', 'ఏకీభావ స్తోత్రం దశావతార స్తుతి' రాసారు. వాదిరాజ వృత్త రత్న సంగ్రహం కావ్యంలో రఘునాధుడు ఈయన గురించి వర్ణించారు.❁

## 123. కవిరాజ రాజు – రెండవ అరుణ గిరి నాధుడు (1505–1530)

**నా**లుగవ డిండిముడు లేకకుమార డిండిమ అయిన రెండవ అరుణ గిరినాధుడు రాజనాధుని కొడుకు. నరేంద్ర అగ్రహారంలో ఉండేవాడు. వీర నరసింహరాయల కృష్ణ దేవరాయల ఆస్థాన కవి. 1505–1530 కాలపు కవి. బహు భాషావేత్తగా సుప్రసిద్ధుడు. డిండిమ కవి సార్వసార్వ భౌమ 'కవిరాజ రాజ' బిరుదాంకితుడు. 'వీరభద్ర విజయం' అనే నాటకం రాశాడు. ఇందులో– వీరభద్ర జనం నుండి దక్ష యజ్ఞయ విధ్వంసం వరకు కథ ఉంది. భూపతి రాయపురంలో రాజనాధ ఉత్సవంలో ఈనాటకాన్ని ప్రదర్శించారు.❁

## 124. కావ్య దాకిని కర్త-గంగానందుడు (1506-)

**బి**కనీర్ మహారాజు కర్ణుని (1506-1527) ఆస్థానకవి- గంగానందుడు. మిథిలలోని తీర్థ భుక్త నివాసం. అతని 'కావ్య దాకిని'లో అయిదు 'దృష్టి'లున్నాయి. కవితా దోషాలను గురించి వివరించే గ్రంథం. దోషంలో ఏ లోపం లేక పోతే గుణంగా భావించవచ్చా? అప్పుడు అది గుణం కాని దోషం కాని కాదా? అన్న దానిపై విపుల చర్చ చేశాడు. తన 'కర్ణ భూషణం' అనే ఆలంకారిక గ్రంథంలో. భగదత్తుని కావ్యం 'భృంగ దూతం'లో 'మందారమంజరి' నాటకంపై రస చర్చ చేశాడు. ❁

## 125. కవిచంద్ర రాయ బిరుదున్న దివాకరుడు (1509)

**వై**దీశ్వర, ముక్తాంబల కుమారుడైన దివాకరుడు భరద్వాజ గోత్రీకుడు. కృష్ణ దేవరాయల ఆస్థానంలో ఉండేవాడు. తాను రుద్రభూపతి నుండి కవి చంద్ర రాయ బిరుదు పొందినట్లు చెప్పుకున్నాడు. ఇతని సోదరుడు మధుసూదనుడు ధూర్త చరిత్ర భాణంతో బాటు పారిజాత హరణం అనే నాటకం, రస మంజటి, దేవీ స్తుతి రాసాడు. నలభై కాండలలో మహాభారత కథను భారతామృతంగా రచించాడు. ❁



## 126. కృష్ణ ప్రేమను రాసిన కవి- కర్ణపూరుడు (1524)

**బె**ంగాల్లో నాడియా జిల్లాలో కాంచనపల్లెలో శివానందసేనుని కుమారునిగా కవి కర్నపూరుడు 1524లో జన్మించాడు. చైతన్యుని బెంగాలీ భక్తులతో పూరీ వరకు యాత్ర చేసి చైతన్యుని జీవితాంతం వరకు వాసుదేవభట్టు అనే లక్షాధికారి ప్రాపకంలో ఉన్నాడు. కుమార హట్ట అనే గురువు వద్ద ఈనాటి కలకత్తాకు ఉత్తరాన ఉన్న హైలసారులో విద్య నేర్చాడు. జీవ గోస్వామి శిష్యుడు కూడా. ఈయన రాసిన గౌరాంగనోద్దేశ దీపికను 1577లో రాసి చైతన్యుడు జీవితాన్ని ఆయన అనుచరుల గత జీవితాలను ముఖ్యంగా చైతన్య తండ్రి జగన్నాధ జీవితాన్ని శ్రీకృష్ణుని తండ్రి నందుని చరిత్రను, దశరధ చరిత్రను రాసాడు. ఆయన శ్రీకృష్ణుని గోపికలలో ఒకడిగానూ రామాయణంలో కపిసేనను ఒకనిగానూ భావిస్తారు. 1543లో రాసిన చైతన్య చంద్రోదయంలో చైతన్య జీవిత సర్వస్వాన్ని వివరించాడు.❀

## 127. ఏకనాధుడు (1528-1609)

**దే**వగిరికి చెందిన జనార్ధన పంత్ కొడుకు ఏకనాధుడు. తీర్ధ యాత్రలు చేస్తూ అద్భుతాలు ప్రదర్శించాడు. మహారాష్ట్ర భక్తకవి శేఖరులలో నామదేవ, తుకారాంల మధ్య ఏకనాధుడిని నిలిపారు. భక్తిమార్గ ప్రబోధకుడు. 1528-1609ల మధ్య జీవించాడు. మరాఠీ గీతాలే కాక 'హస్తామలకం', స్వాత్మ సుఖం' అనే వేదాంత గ్రంథాలు రాశాడు. భగవద్గీత పదకొండవ అధ్యాయానికి విస్తృత వ్యాఖ్యానం రాశాడు.❀



## 128. తంజావూరు మహారాష్ట్ర రాజుల కాలంలో వర్ధిల్లిన గీర్వాణం (1530)

**మ**హారాష్ట్రలో భోసలే వంశ రాజ్య పాలన ప్రారంభించిన శివాజీ జీవితమే ఒక చరిత్ర, స్ఫూర్తిదాయకం. పరమానందకవి రాసిన శివభారతం కావ్యంలో మప్ఫై ఒక్క అధ్యాయాలలో శివాజీ చరిత్ర సర్వం ఉన్నది. ఆయన జైత్రయాత్రలు విజయ పరంపర అన్నీ విశదంగా వర్ణించాడు కవి. శివాజీ పర్ణ పర్వత కోటను ఆక్రమించిన వీరగాథను జయరాయ కవి అయిదు ఉల్లాసాలలో పర్ణాల పర్వత గ్రభాఖ్యానంలో వర్ణించాడు. శివాజీ కుమారుడు రాజరాముని గూర్చి కేశవ పండిట్ జీ కవి రాజ రామ చరిత్ర రాశాడు. ఇది అయిదు కాండల కావ్యం. కర్నాటకలో మహారాష్ట్ర ప్రాభవం విజయ యాత్రలు అన్నీ అభివర్ణితాలు.

తంజావూరు రాజు ఏకోజి లేక వెంకోజి (1675–1680) ఆస్థానంలో మంత్రి బాలకృష్ణ కొడుకు జగన్నాధ కవి రతి మన్మథ నాటకం రాశాడు. మరో మంత్రి ఆనంద యజ్వని కుమారుడు శ్రీశైల కవి విజయ చంపు రాశాడు.

### రాజుల కవితా వైభవం

రాజు ఏకోజి కుమారుడు షాహాజి రాజు చంద్రశేఖర విలాసం అనే నాటకం రచించాడు. కుమార సంభవ చంపు కూడా రాసి శరభోజి యుద్ధ దేవత ఆవిర్భావాన్ని తెలియజేశాడు. శరభోజి నీతి శతక కర్త కూడా. ఏకోజీ మూడవ కొడుకు రాజా తుక్కోజి మనవడు తుల్జాజి రాజు సంగీత సారామృతం రాశాడు.

### తంజావూర్ సరస్వతి మహల్– శరభోజి పుణ్యమే

సర్ఫోజి అనబడే శరభోజి రాజు ఏకోజీ రాజుకు రెండవ కుమారుడు. దక్షిణ భారతదేశంలో సంస్కృత గ్రంథ పరిరక్షణ చేసిన మహోదారుడు. ఎన్నో

అమూల్యమైన సంస్కృత వ్రాతప్రతులను సేకరించి తంజావూర్‌లోని సరస్వతి మహల్‌లో భద్రపరచి గొప్ప సాహిత్య సేవ చేశాడు. ఆ భవనానికి తంజావూర్ మహారాజా సర్ఫొజి సరస్వతి మహల్ గ్రంథాలయం అని నామకరణం చేశాడు. ఎందరో రిసెర్చ్ కోసం ఇక్కడికి వస్తూ దీన్ని సద్వినియోగం చేసుకొంటున్నారు.

శరభోజి రామ కథను పన్నెండు కాండల రాఘవ చరిత కావ్యంగా రాశాడని అంటారు. దీనికే సంగ్రహ రామాయణం అనే పేరు కూడా ఉంది. కాని ఒకానొక రాత ప్రతిలోని రెండవ కాండలో పంచరత్న కవి కృతం అని ఉన్నది. దీన్నిబట్టి అసలు రాసినవాడు పంచరత్న కవి అని. , తన పోషక రాజు పేరు శరభోజిని కావ్య కర్తగా పేర్కొని గౌరవించాడని భావిస్తున్నారు. శరభోజి ఆస్థానంలోనే ఉన్న అనంత నారాయణ అనే కవికి పంచరత్న బిరుదు అఉందని తెలుస్తోంది. ఈ అనంత నారాయణ ఆనంద వల్లి స్తోత్రం రాసిన చిదంబర కవికి తండ్రియే.❁

## 129. సాహిత్య రత్నాకరకర్త– ధర్మ సూది (1530)

**ధ**ర్మ సూది లేక ధర్మ భట్టు కృష్ణాజిల్లాకు చెందినా పెదపులి వ్రు గ్రామస్తుడు. హరితస గోత్రానికి చెందిన వెలనాటి బ్రహ్మణుడు. వీరి పూర్వీకులు వారణాసిలో ఉండటం వలన ఇంటి పేరు వారణాసి అయింది. సన్యాసం స్వీకరించి రామానంద లేక గోవిందానంద సరస్వతి అయ్యాడు. అమిత రామభక్తుడు. రాముడే అన్నిటికీ మూలం అని నమ్మాడు.

సోదరుడు నారాయణ గొప్ప వేద పండితుడు. తాత సాహిత్య విశారదుడు. సూది పదహారవ శతాబ్దివాడు. న్యాయశాస్త్ర నిష్ణాతుడు. కాని ఛందోలంకార వాస్త్రాలపైనా మోజున్నవాడు. సాహిత్య రత్నాకరం రాశాడు. అందులో ఛందస్సుపై చర్చ చేసి ఉదాహరణలుగా రామునిపై శ్లోకాలు ఇచ్చాడు. విద్యానాధ విశ్వేశ్వరులు రాజాశ్రయంలో రాజులపై అలంకార శాస్త్రాలు రాసినందుకు దుయ్యబట్టాడు. శంకర భాష్యంకు, రత్నప్రభకు విపులమైన టీక రాశాడు. కృష్ణస్తుతి కూడా చేశాడు. హంస సందేశం అనే ప్రాకృత కావ్యం రాశాడు. వ్యాయోగం, నరకాసుర వధకు మంచి పేరు. కృష్ణుని బాల్యంపై బాల భాగవతం రచించాడు.❁

## 130. భాగవత చంపు రాసిన – మూడవ రాజనాధుడు (1530–42)

**కు**మార డిండిమ కొడుకే మూడవ రాజనాధుడు. విజయనగర రాజు అచ్యుత దేవరాయల కోరికపై భాగవత చంపు 1530–42లో రాశాడు. శ్రీకృష్ణుని చరిత్ర ఇది. ఈ కవి రాసిన 'అచ్యుత రాయాభ్యుదయం' పన్నెండు కాండల కావ్యం. మొదటి విజయనగర పాలకుల నుంచి మొదలు పెట్టి తుళువ వంశ రాజులను ,వారి చంద్ర వంశాన్ని గురించి రాశాడు .నరస వీరనరసింహ కృష్ణ రాయల వరకు వర్ణించాడు .కృష్ణ దేవరాయల మరణం తర్వాత నరసింహరాయల మూడవ భార్య ఓబులాంబ కొడుకు అచ్యుతరాయలు రాజు అయ్యాడు. ఈ కావ్యంలో ఎక్కువగా అచ్యుత రాయల దక్షిణ దేశ దండయాత్రల గురించే రాశాడు. అతని తీర్ధ యాత్రాక్రమాన్నీ వివరించాడు. బిజాపూర్ సుల్తాన్‌ను ఓడించి ఘన విజయం సాధించటంతో కావ్యం పూర్తి అవుతుంది.

కుమార డిండిను కూతురును మల్లికార్జున లేక స్ఫులింగకు ఇచ్చి పెళ్లి చేశారు. యితడు లక్ష్మణ సావిత్రిల కొడుకు. ఇతని తాత సోమనాధుడు సభాపతి దేశికుని శిష్యుడు. మల్లి 'సత్యభామ పరిణయం' అనే అయిదు అంకాల నాటకం రాశాడు. మూలనాడు ఉత్సవాలలో దీన్ని ప్రదర్శించేవారు.❀

## 131. అక్బరుచే సన్మానితుడైన పద్మసుందరుడు (1541)

**తా**ప గచ్ఛకు చెందిన పద్మమేరుని శిష్యుడు పద్మ సుందరుడు. అక్బర్ ఆస్థానంలో సాహిత్య వివాదాలలో అందరినీ ఓడించి అక్బరు చక్రవర్తిచే సన్మానం పొంది అనేక అగ్రహారాలను దానంగా పొందాడు. రాయమల్లాభ్యుదయం అనే కావ్యాన్ని 1559లో రచించాడు. ఇది 24 మంది జైన తీర్థంకరుల చరిత్ర. అగ్రితాక రోయమల్లుడితో పూర్తవుతుంది. తర్వాత పార్శ్వనాధ కావ్యం కూడా రాసాడు.❀

## 132. చిన బొమ్మ భూపాలుడు (1549)

నలబొమ్మ భూపాలునికొడుకు చిన బొమ్మ భూపాలుడు వెల్లూరు ప్రాంతాన్ని 1549 నుండి 1579 వరకు పాలించాడు. అప్పయ్య దీక్షితులవంటి మహా కవిపండితులను పోషించటమేకాక స్వయాన సంస్కృతాంధ్రాలలో కవి కూడా. ఆరుసర్గలలో 'సంగీత రాఘవం' రాశాడు. ఆరుకాండల రామాయణాన్ని ఇందులో చెప్పాడు. జయదేవుని గీత గోవిందంలాగా ఇదంతా వివిధ రాగ, తాళ గీత మయమే. రాజుసంగీతంలో నిధి. మొదటి శ్లోకం –

"భాగ్యే నైవ భాగీరదాదివ ప్రాచేత సదాగతా –యా కాండే రధి గత్య సప్తభిరీవ సోతోభి రూర్వితలం"

సౌరాష్ట్ర రాగంలో ఆట తాళంలో ఒక గేయం రాశాడు. ఇందులో దేవతలందరూ విష్ణుమూర్తి దగ్గరకు వెళ్లి రావణ బాధలను విన్న వించుకొని రామావతారం దాల్చి రావణ సంహారం చేయమని ప్రార్ధిస్తారు.

"శ్రీ రమణ పురాణ పురుష పరుషేణ దారుణారభస తరేణ శరేణ–
కారుణీక విభో న చిరేణ –ధ్రువపదం
జహి జహి దశవదనం హి స్వామిన్ పశ్య గుణోమహితానస్య రణే విజితాన్ –
వష్యమవస్యా మనం తసమస్తం తష్య న చేద్వితనో షి నిరస్తం"

మొదటికాండలో సీతారాముల వివాహం దాకా కథ నడుస్తుంది. రెండవదానిలో భరతుడు పాదుకల స్వీకారం వరకు మూడులో రామలక్ష్మణులు పంపాసరోవరం చేరటం వరకు నాలుగులో, సుగ్రీవాజ్ఞతో కపి సమూహాలు సీతాన్వేషణకు బయల్దేరటం దక్షిణ దిక్కుకు హనుమదాదులు వెళ్ళటం, అయిదులో హనుమ

లంకలో సీతాదేవిని చూసి రామునికి వచ్చి నివేదించటం ఆరవకాండలో లంకనుండి రాక శ్రీరామ పట్టాభిషేకం కథ చెప్పాడు.

శూర్పణఖ అన్న రావణుడిని సీతను బలాత్కారించమని చెప్పే ఘట్టం–

"నారీ కచిన్నస్య వీరస్య విదు – ద్వోరీ ఘాతుః సృష్టి రాద్యానవద్యా – సా చేన్నీతా సుందరీ నేష త్తస్మాదన్యస్త ద్వదేన ప్రకారః"

సుగ్రీవుడు సీతపై నుండి జారవిడిచిన నగలను రాముడికి చూపిస్తూ చూసి దుఖాన్ని ఆపుకోలేక పోయిన సందర్భంగా గీతం –

"ఇయమపి జనక భువో మణి రశన ఆహోమివ పరిహృత కటి తటకలనా –ధ్రువపదం

సాదు విదే సాదు కృతం వ్యయ యసి హరహర కియా దియమాం – హంసక శంసకదం త్వామితోసి హా విదితం నను మమ హి సఖాసి"

'లంక నుంచి అయోధ్యకు వస్తూ సీతాదేవికి యుద్ధ రంగంలో తన వీరవిక్రమాన్ని ప్రదర్శించిన చోట్లను చూపుతూ వర్ణించిన గీతాలు బాగుంటాయి. ప్రతి కాండం చివరా ఒకే రకమైన – "ఇతి శ్రీ మత్పాద జకుల కళా శోదధీ పూర్ణ సుధా కరస్య నల బొమ్మా భూపాల తనూజస్య చినబొమ్మ భూపాల కస్య కృతౌ సంగీత రాఘవాఖ్యే మహా కావ్యే షష్టః సర్గః "అనే రాశాడు .చివరి రెండు శ్లోకాలలో తాను చొక్కా నాథ భూపాలుని సామంత రాజునని చెప్పుకొన్నాడు –

'ఇతి చొక్కనాథ నరనాథ పరిపాలితో బొమ్మ నరపతి రాకురుదేదంఃరఘురమణ విరహ వచనో పరచనకావన ముప శ్రుణుత పఠత మహామోదం' అని చెప్పాడు చొక్కనాధుడు విజయనగర సామ్రాజ్యంపై తిరుగుబాటు చేసిన మధుర రాజు కావచ్చునని చరిత్రకారుల భావన.❀

## 133. సుదర్శన చరిత్ర రాసిన సకల కీర్తి (1550)

జైన భట్టారకుడు సకల కీర్తి. ఏడు అధికారాలలో ధన్య కుమార చరిత్ర కావ్యం రాసాడు. ధన్య కుమారుడు ఉజ్జయినిలో వైశ్యుడైన ధనపాలుని కొడుకు. గొప్ప జైన మునిగా పేరు పొందాడు. సుదర్శన చరిత్ర శ్రీపాల చరిత్ర, వృషభాను చరిత్ర మహావీర పురాణం ఇతర రచనలు.❋

## 134. సంగీత శాస్త్ర సంక్షేపం రాసిన- గోవిందుడు (1550)

"సంగీత శాస్త్ర సంక్షేపం" రచించిన గోవిందుడు వెంకట మఖి అభిప్రాయాలను తోసిరాజన్నాడు. ఇది స్కంద పురాణంలోనిదని సన్ముఖుడు రాశాడని చెప్పాడు. "ఇతి స్కంద పురాణే సద్గ్రంధ చూదామణౌః శంముఖావిరచితే ప్రధమోధ్యాయః"

గోవిందుడు త్యాగరాజు సిద్ధాంతాలను బలపరచాడు. అచ్యుత రాయల వీణను గురించి చెప్పాడు. అచ్యుత రాయల కాలం 1572-1614.❋

## 135. 'రస ప్రదీప'కర్త - ప్రభాకర కవి (1550)

**మా**ధవ భారతి కుమారుడు, రామేశ్వరుని మనవడు అయిన ప్రభాకరుడు విశ్వామిత్ర గోత్రీకుడు. 'రస ప్రదీపం' అనే అలంకార భాష్యం 1583లో రాశాడు. మూడు అధ్యాయాల ఈ గ్రంథంలో కవిత్వానికి కావలసిన ముఖ్య విషయాలు, రసం ధ్వనిలపై విపులంగా చర్చించాడు. 1629 'దేవీ మహాత్మ్యమ్' రాశాడు. దీనికి 'లఘు సప్త శతి స్తవం' అనే పేరు కూడా ఉంది. 'ఏకావళీ ప్రకాశ'తో బాటు 'కుమార సంభవం, వాసవ దత్త'లపై వ్యాఖ్యానాలు కూడా రచించాడు.

రామేశ్వర భట్టుకు నారాయణ, శ్రీధర, మాధవులు కుమారులు. 1513లో పుట్టిన నారాయణ అక్బర్ చక్రవర్తి ఆర్థిక మంత్రి తోడర్ మల్‌కు అభిమానుడు. యితడు 'వ్రుత్తి రత్నాకరం'కు వ్యాఖ్య రాశాడు. ప్రభాకరుని కొడుకు కృష్ణ 'వాగీశ్వరీ సంస్తవం' రాశాడు.❁

## 136. స్వరమేళ తాళనిధి కర్త- రామామాత్యుడు (1560)

**తి**మ్మామాత్యుని కొడుకు రామామాత్యుడు రాజా తోడర్ మల్ వంశంవాడు. ఇతని "స్వర మేళ తాళనిది" అయిదధ్యాయల గ్రంథం. కర్నాటక రాగాల గురించి వివరమైన వర్ణన చేశాడు. 72 మేళకర్తలలో అవి విస్తరించిన విధానం తెలియజేశాడు. విజయనగర రాజు అళియ రామ రాజు ఆస్థానంలో ఉన్నాడు. రామరాజు తల్లికోట యుద్ధంలో 1565లో చంపబడ్డాడు. రామామాత్యుడు చతురకల్లినాధుని కూతురు కొడుకు.

క్షేమకర్నుడు "రాగ మాల"ను జాతవ భూపాలుని కోరికపై 1570లో సంతరించాడు. జీవరాజు కూడా "రాగమాల" పేరుతో మరో గ్రంథం రాశాడు.❁

## 137. ఉత్తరదేశ సంగీతాన్ని సంస్కరించిన– పాండురంగ విఠలుడు (1560)

**జ**మదగ్ని గోత్రీకుడు, కర్నాటకలో ఖాందేశ్‌లో శాతనూర్వ గ్రామ వాసి. ఫారట వంశ పాలకుడు బుర్హాఖాన్ కోరికపై ఉత్తర హిందూ స్థానం సంగీతాన్ని సంస్కరించి కుదించి "విత్తలయ" రాగమాల, నర్తన నిర్ణయం రాగ మంజరి, సద్రాగ చంద్రోదయం రాశాడు. అక్బర్ ఖాందేశ్‌ను 1599లో స్వాధీన పరచకొన్న తర్వాత ధిల్లీ వెళ్లి అక్బర్ కొలువులో ఉన్నాడు. అక్కడ "రాగ నారాయణ"ను సైనికాధికారి మాధవ సింహుని కోరికపై రచించాడు. విఠలునికి దాక్షిణాత్య ఉత్తరాది సంగీత రీతులపై పరిపూర్ణ జ్ఞానం ఉంది. ఈ విఠలుడే "సంగీత వృత్త రత్నాకరం" రాసి ఉండవచ్చు.❁



## 138. స్తోత్రకావ్య మణిపూస- నారాయణీయం రచించిన భట్టాహిరి లేక భట్ట పాద నారాయణ కవి (1560-1646)

**దే**వికా క్షేత్రమైన చంద్రనక్కావులో నారాయణ కవి జన్మించాడు. ఇది మలబారులో ఉంది. అక్కడ దేవికి నారాయణ మహా భక్తుడు. తండ్రి మాత్రుదత్తుడు గొప్ప విద్వాంసుడు. తల్లి పయ్యూరు పట్టేరి కుటుంబానికి చెందినది. 1560-1646 కాలం వాడు. వయసు చాలా గడిచిపోయే దాకా చదువు అబ్బలేదు. తిక్కనిత్యూర్‌కు చెందిన పిసరోటి కుటుంబానికి చెందిన ఆమెను వివాహం చేసుకొన్న తర్వాత అచ్యుత పిసరోట్టి దగ్గర చదువు నేర్చాడు. కాని పిసరోట్టి వేదాలు బోధించే అర్హత కలవాడు కాదు. కాని నారాయణకు తప్పులతోనే వేదాలు నేర్పి ఫలితంగా వాత రోగానికి గురైనాడు. తాను నేర్చిన తంత్ర విద్యతో గురువు రోగాన్ని తనకు వచ్చేట్లు చేసుకొన్నాడు శిష్యనారాయణ. గురువాయూర్ శ్రీ కృష్ణునిపై నారాయణీయంను లక్షా డెబ్బై ఒక్క వేల రెండు వందల పది రోజుల్లో 1585లో పూర్తి చేశాడు. ఆధ్యాత్మిక గ్రంథాలలో నారాయణీయంకు విశిష్ట స్థానం ఉంది.

జీవిత కాలంలోనే నారాయణ పేరు ప్రఖ్యాతలు దేశమంతా వ్యాపించాయి.

కాశీలోని సిద్ధాంత కౌముది మొదలన వ్యాకరణ గ్రంథాలు రాసిన భట్టోజీ దీక్షితుల చెవిన పడింది. సంబర పడిపోయాడు. దక్షిణ దేశమంతా పర్యటించి నారాయణను చూడటానికి వచ్చాడు. అప్పటికే నారాయణ పరమ పదించాడని తెలిసి విచారించి ఇక మరెవ్వరినీ చూడక్కరలేదని బెనారస్ చేరుకొన్నాడు. రఘునాధ నాయకుని ఆస్థాన కవి పండితులకు భట్టోజీ ప్రతిభ తెలుసు. ముఖ్యంగా మంత్రి, సాహిత్య రత్నాకరం రాసిన యజ్ఞనారాయణ దీక్షితులు భట్టాహరితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడు. కొచ్చిన్ రాజు ఆస్థానంను భట్టాహరి సందర్శించాడు. వీరకేరళ రాజుపై ప్రశంసలు చేశాడు. తన మత్స్యావతార చంపులో రాజా రవివర్మను పొగిడాడు.

స్తోత్ర కావ్యాలలో భట్టాహరి రాసిన నారాయణీయంకు విశిష్టమైన గౌరవం ఉంది. ఇది వెయ్యి శ్లోకాలపైన ఉన్న గ్రంథం. భాగవత హృదయాన్ని ఆవిష్కరించిన కావ్యం. ప్రతి శ్లోకం గురువాయూర్ శ్రీకృష్ణను ఉద్దేశించే చెప్పాడు. కేరళలోని ప్రతి ఆస్తిక మహాశయుడు నారాయణీయంలోని శ్లోకాలలో కొన్నిటినైనా రోజు పఠిస్తారు. అద్వైత సిద్ధాంతాన్ని శంకాచార్య స్వామికి దీటుగా అభివర్ణించాడని భావిస్తారు. ఒకరకంగా విష్ణు సహస్రనామ స్తోత్రానికి మహాభాష్యం అనచ్చు.

నారాయణ కవి బహు ప్రబంధాలు రాశాడు. విచిత్ర చంపువులను సృష్టించాడు. ఆయన రాసిన వాటిలో కొన్ని– రాజ సూయ, దూత వాక్య, పాంచాలీ స్వయంవరం, ద్రౌపదీ నరిణయం, సుభాద్రాహరణం, కిరాత, భారతయ్యుద్ధం, స్వర్గారోహణం, మత్స్యావతారం, శ్యమంతకం మొదలైనవి. సుమధుర కవిత్వంతో మానసికోల్లసం చేశాడు. నారాయణీయకవి నారాయణ భట్టాహిరినారాయణ, నారాయణీయంతో చిరస్మరణీయుడయ్యాడు. ఈయన కుమారుడు కృపాకవి తారాశశాంకం రాశాడు. ❁

## 139. కందర్ప చూడామణి వ్యాఖ్యాత– వీరభద్ర దేవుడు (1577)

**రా**మచంద్రుని కొడుకు వీరభద్ర దేవుడు వాఘేలా వంశ రాజు. ఇది శాలివాహనులకు చెందిన వంశం. ఇతని "కందర్ప చూడామణి" విమర్శనా గ్రంథం. దీన్ని 1577లో రాసినట్లు చెప్పుకొన్నాడు.

భాస్కర నరసింహ శర్మ అనే కాశీ కవి వ్రజాలి అనే ఆయన కోరికపై ఒక కామ గ్రంథం రాసినట్లుంది. శంకరుడు "మనసిజ సూత్రాలు" రాసినట్లు ఉన్నది. జ్యోతిశర్మ ఈశ్వరుడు రాసిన "మన్మధ తంత్రం"ను తాను చూసినట్లు రాశాడు. రంతిదేవుని "యోగాధికారిక"లో కొన్ని ఔషధాల విషయం ఉంది. "మాహేంద్ర ముష్కం శకలందూతేన స సైన్ధవం గావ్య పాయ రస్తు సిద్ధం– తద్రక్ష యిత్వా రతి సంగరేషు జయత్య కస్మా ద్రువతీ మహాస్త్వం"

ఆచార్య సిద్ధ నాగార్జునుడు కూడా "వశీకర తంత్రం" రాశాడు. అలభ్యం. ధృవపాలుడు "నాగార్జున యోగ శతకం" రాశాడు. క్షేమేంద్రుడు. "వాత్సాయన సూత్ర సారం" రాసినట్లు తన "ఔచిత్య విచార చర్య"లో పేర్కొన్నాడు.❁



## 140. తంజావూరు దివాన్- గోవింద దీక్షితులు (1580)

**వ**సిష్ట గోత్రికుడైన గోవింద దీక్షితుల భార్య నాగాంబ యజ్ఞనారాయణ, వెంకట మఖులు కొడుకులు. తిరు నాగేశ్వరం పట్టేశ్వరంలో ఎక్కువగా ఉన్నాడు. తంజావూరు రాజులు చెవ్వప్ప, అచ్యుత, రఘునాధ రాయల ఆస్థానంలో మంత్రి పట్టేశ్వరం. ఇప్పటికీ భార్యా భర్తల చిత్రాల అనంతఃపురంలో చూడొచ్చు. ఇంట్లో దీక్షితులు పరమ సంప్రదాయ బద్ధంగాను రాజాస్థానంలో పరమ పవిత్రంగా న్యాయ ధర్మాల కోసమూ పని చేసేవాడు. రాజకీయ దురంధరుడుగా పేరు. రఘునాధ గోవింద దీక్షితుల ఆత్మీయతపై గొప్ప శ్లోకం ప్రచారంలో ఉంది. చినామాద్యంత నామానౌ మహీ ప్రుద్వీశ తా ఉభౌ
శాస్త్రే శస్త్రే నిపుణా భాహువుషు హవేషు చ

దీక్షతులు అద్వైతాచార్యులుగా ప్రసిద్ధి చెందాడు. స్వయంగా కవి పండితుడు, మహా రచయిత. అప్పయ్య దీక్షితులపై వీరాభిమానం ఉన్నవాడు. ఆయనను కల్పతరువుపై భాష్యం రాయమని కోరాడు. ఆయన పరిపాలనలో ఎన్నో పండపాలు, కావేరి నదిపై అనేక స్నాన ఘట్టాలు నిర్మింపజేశాడు. ఎన్నో అగ్రహారాలను రాజుల చేత దానం ఇప్పించిన దక్షుడు. ధర్మశాస్త్ర పారమెరిగినవాడు. న్యాయబద్ధ పాలనకు అంకితమైనవాడు. వాద ప్రతివాదాలు విని సామరస్యంగా సమస్యను పరిష్కరించటం గోవింద దీక్షితుల ప్రత్యేకత. వేదంలో

చెప్పబడిన సకల క్రతువులు చజ్ఞాలు యాగాలు చేసిన పరమ కర్మిష్టి. జీవితం చివరలో అన్ని రాజ్య కార్యాలను సంపదను అన్నిటిని భగవంతునికి సమర్పించి కర్మఫల త్యాగంతో జన్మను సార్ధకం చేసుకొన్న పుణ్యాత్ముడు. అద్వైత ఫలాన్ని మాత్రమే ఆశించిన మహా నైష్టికుడు. కుంభకోణంలో అమ్మవారు మంగలాంబ సన్నిధిలో తపస్సుతో గడిపి మోక్షాన్ని పొందిన మదహారవ శతాబ్దపు మహనీయుడు గోవిందదీక్షితులు. కుంభకోణం, తిరువది, పట్టేశ్వరంలలో గోవింద దీక్షితులను అక్కడి శివలింగాలతో పూజించి జ్ఞప్తికి తెచ్చుకొని కృతజ్ఞత తెలియజేసుకొంటారు. ఆ శివలింగాలలో గోవింద దీక్షితులను దర్శిస్తారు అంటే పరమాత్మలో ఐక్యమయ్యాడని భావం. ఆయనకూ ఆయన ధర్మపత్నికి అక్కడ విగ్రహాలు నెలకొల్పి గౌరవించారు.

దీక్షితులకు సంగీత జ్ఞానం అపారం. ఆధునిక శాస్త్రీయ సంగీత సిద్ధాంతకర్తలు ముగ్గురిలో ఒకరు దీక్షితులు. మిగిలిన ఇద్దరు రామామాత్యుడు, సోమనాధుడు. కుంభకోణంలోని రామస్వామి దేవాలయం నిర్మించాడు. దివాన్ బహదూర్‌గా ఉన్నప్పుడు. అప్పుడే ఈ రామస్వామి దేవాలయానికి చక్రపాణి దేవాలయానికి మధ్య కారిడార్ కూడా నిర్మింపజేశాడు.

గోవింద దీక్షితుల రచనలలో సాహిత్య సుధ సంస్కృత సాహిత్య చరిత్ర ఎందరో కవుల పరామర్శ, తన గురువులను రఘునాధ రాయల గురించి రాశాడు. కుమారుడు వెంకట మఖి తన చతుర్దండి ప్రకాశికలో తన తండ్రి దీక్షితులు సంగీత సుధానిధి రాశాడని, రామాయణంలో సుందరకాండకు వ్యాఖ్యానం కూడా రచించాడని చెప్పాడు. గోవిందదీక్షితుల ఇద్దరు కొడుకులు యజ్ఞ నారాయణుడు వేంకటేశ్వరుడు లేక వెంకట మఖి, వెంకట మఖి నీలకంఠకు గురువు, సాహిత్య సామ్రాజ్య కావ్య వార్తికాభారణ రచయిత కూడా.

యజ్ఞ నారాయణ దీక్షితులు సర్వతోముఖ ప్రతిభ కలవాడు. కవిత్వంలో దిట్ట. రఘునాధ రాయల ఆస్థాన కవి. రాజే యజ్ఞనారాయణ గురువు కూడా. అతను రాసిన పదమూడు కాండల సాహిత్య రత్నాకరం ఇప్పుడు అభించి అందుబాటులో ఉంది. రఘునాధ విలాసం అనే అయిదు అంకాల నాటకం,

రఘునాథ భూప విజయం అనే తంజావూర్ నాయక రాజుల చరిత్ర కావ్యం. రఘునాథుని సింహళ సమీప ద్వీప విజయం ఇందులో ఉన్నాయి. వెంటేశ్వర రచన చిత్ర బంధ రామాయణంకు వ్యాఖ్యానమూ రాశాడు. ఇలా 198 శివతత్వ రహస్యం కర్త. నీలకంఠ లేక అయ్యదీక్షితులు (1600)

నారాయణ భూమిదేవిలకు కుమారుడు నీలకంఠుడు. అయ్యప్ప దీక్షితులని తమ్ముడు అచ్చుతి కిస్టకు మనవడు. అయ్యదీక్షితులుగా ప్రసిద్ధి. గోవింద దీక్షితుల కుమారుడు వెంకట యఖి వద్ద విద్య నేర్చాడు. కైయాటపై విమర్శ రాశాడు. శ్రీకంఠ వేదాంతంలో లోతులు చూసినవాడు. శివ తత్వం రహస్యం రాశాడు. తన నలుగురు సోదరులూ మహా కవులే. ఇతని నీలకంఠ చంపు పాలసముద్ర మధనం. అందులో హాలాహలం రావటం శివుడు మింగటం కథ దీన్ని 1637లో రాశాడు. శివలీలార్ణవ ఇరవై రెండు కాండలలో శివుని అవతారమైన మధురలో అర్చింప బడే హల్సాశ్వనాధకు సంబంధించిన అరవైనాలుగు లీలలను వర్ణించాడు. గంగావతరణం ఎనిమిది కాండల కావ్యం. దివిజ గంగ భూమిని చేరిన కథ. కలివిదంబన, సభారంజన, అన్యాపదేశ శతకం, శాంతి విలాసం, వైరాగ్య శతకం, ఆనంద సాగరసస్తత్వం మొదలైనవి మిగిలిన వైవిధ్య రచనలు.

అయ్యా దీక్షితుల చిత్రమీమాంస దోషాదికారంలో జగన్నాధ పండితరాయల సిద్ధాంతాలను విమర్శిస్తూ అప్పయ్య దీక్షితుల సిద్ధాంతాలను అన్నిటినీ సమర్థించాడు. ఏడు అంకాల నల చరిత నాటకం రాశాడు. కవిగా గొప్ప పేరు సంపాదించాడు. అతని ఊహలు అద్భుతం ఉత్ప్రేక్షలు నిరుపమానం.

ఇతని మూడవ కుమారుడు గీర్వాణేంద్రుడు. శృంగార కోశ భాణం రాశాడు. అన్యాపదేశ శతకమూ చేశాడు. ఇతని నలుగురు సోదరులూ కవులే. ఇందులో అతిరాత్ర యజ్ఞుడు కుశకుముద్వతీయం అనే నాటకం రాశాడు. అచ్చుదీక్షితులు అతని నలచరిత్ర నాటకంపై వ్యాఖ్యానం రాశాడు.❀

## 141. త్ర్యర్థికావ్య రచనకు నాంది పలికిన 'చిదంబర కవి' (1586)

ఇలా ద్వర్థికావ్యాలు మూడు పూలు ఆరుకాయలులాగా వర్ధిల్లిన కాలం అది. మరో అడుగు ముందుకు వేసి త్ర్యర్థి కావ్య రచన చేశారు కవులు. మూడు రకాలైన కథలను ఒకే కావ్యంలో చెప్పటమే త్ర్యర్థికావ్యం. రాఘవ యాదవ పాండవీయంలో రామాయణ మహా భారత భాగవత కథలను ఒకే చోటమూడు కాండలలో చెప్పాడు చిదంబర కవి'. ఇతడు అనంత నారాయణ వెంకటా లకుమారుడు. కౌశిక గోత్రానికి చెందిన సూర్యనారాయణకు మనవడు. శ్రీనివాసుడు ఇతని తమ్ముడు. శివ సూర్య ఇతని మేనమామ. ఇతని 'భాగవత చంపు' కృష్ణ కథామృతమే. డిండిమకు చెందిన ముల్లనద్రం నివాసి. 1586-1614 ప్రాంతపు విజయనగర రాజైన మొదటి వెంకట ఆస్థానంలో ఉండేవాడు. ఈ గ్రంథంపై వ్యాఖ్యానం ఉన్నది. తండ్రి అనంత నారాయణుడే రాశాడు. కావ్యంలోని మూడు అర్థాలను చక్కగా విడమరచి విపులంగా అర్థ మయెట్లు రాశాడు. ఈ కవి ఇంకాస్తముందుకు వెళ్లి 'పంచ కళ్యాణ చంపువు' రాశాడు. అందులో రామ, కృష్ణ, విష్ణు, శివ, సుబ్రహ్మణ్యేశ్వర కల్యాణాలను ఐదింటిని ఒకేసారి వర్ణించాడు. తానే విపుల వ్యాఖ్యానమూ రాసుకొన్నాడు.

మైసూరు సంస్థానంలో ఉదయేంద్రపురానికి చెందిన అనంతా చార్యుడు 'యాదవ - రాఘవ - పాండవీయం' రాశాడు. రాజాస్థాన కవయిత్రి 'త్రివేణి'కి ఈయన తండ్రి. కృష్ణ, నల, హరిశ్చంద్ర, కథలను చతురర్థ కావ్యం' ఆబోధాకర'గా ఘనశ్యామ కవి రాశాడు. ఇలా అనంతార్థ కావ్య విజృంభణ జరిగింది .సాహిత్యం పరిపుష్టి చెందింది .కాని దాన్ని పగల కొట్టి విడమర్చి చెప్పాల్సిన వింత పరిస్థితి ఏర్పడింది. ❋

## 142. సంగీత దామోదరం రాసిన - శుభంకరుడు (1590)

**"స**ంగీత దామోదరం"కర్త శుభంకరుడు ఏడు అధ్యాయాలలో సంగీత నృత్య రీతులను సంబంధాలను, నాయక నాయికా లక్షణాలను, భావాలను వివరించాడు. పదిహేడవ శతాబ్దికి ముందు రచన. దామోదర రాజుకు అంకితమిచ్చాడు. అందుకే సంగీత దామోదరం అనే పేరు. "నారదీయ శిక్ష"కు శుభంకరుడు వ్యాఖ్యానం కూడా రాశాడు.❋

## 143. ఘటికా శతగ్రంథ ఘటనుడు- చెంగల్వ కాళకవి (1590-1673)

**ద**క్షిణాంధ్ర యుగంలో తంజావూర్ రాజు రఘునాధ రాయలకాలంలోను, విజయ రాఘవ రాయల కాలంలోను చెంగల్వ కాల కవి ఉన్నాడు. రఘునాధుని ఆస్థాన కవి కాలేదు. ఆ గౌరవం విజయ రాఘవుడిచ్చాడు. పాకనాటి ఆరువేల నియోగి. తండ్రి వెంకటయ్య తల్లి కృష్ణాంబ. ఘటికా శత ఘంట గ్రంథ ఘటనుడుగా కీర్తి పొందాడు. ఓష్ట్య, నిరోష్ట్య మొదలైన నియమాలతో కవిత్వం చెప్పేవాడు. పరి హ్రుతేతర యుక్తిభాగనూతన కథా కథకుడు. భారత శాస్త్రీ పారాంగతుడు. విజయ రాఘవుని ఆస్తాన కవియై అతనిపై రాజగోపాల విలాసం రాశాడు. రాజుకు పరమ మిత్రుడు కూడా. రాజుతో రాణులతో విందు లారగించేంత చనువున్నవాడు. చాలా రాశాడంటారు కాని విలాసం ఒక్కటే మిగిలింది. సంస్కృత కవులలో భారవికి ఉన్న స్థానం కాళ కవికి ఉంది.

బొమ్మకంటి ఆప్పయాచార్యుడు పద్నాలుగవ శతాబ్దం చివరలో ఉన్నాడు. రేచర్ల సింగ భూపాలుని ఆస్థాన కవి. అమరసింహుడు రాసిన అమరకోశంకు అమరకోశ వ్యాఖ్య రాశాడు. ఈ వ్యాఖ్య వలన ఇతనికి మారపోత అనే పేరొచ్చింది.❋

## 144. యమక కవి– ఏక దినప్రబంధ రచయిత – వేంకటేశ (1596)

వేంకటేశుడు శ్రీనివాసుని కుమారుడు వేంకటేశుని మనవడు. ఆత్రేయ గోత్రీకుడు. కనెల్ దగ్గర అరశనపల్లిలో 1596లో పుట్టాడు. 'రామ యమకార్నవం', 'రామచంద్రోదయ' కావ్యాలలో యమకంలో రసబంధంగా రామకథను రాశాడు.

సూర్యనారాయణ యజ్ఞేశ్వర జ్ఞానంబల కుమారుడు. ఆలూరి బ్రాహ్మణుడు. ఎన్నో యజ్ఞ యాగాలు చేసిన కుటుంబం. 1601లో లింగాయ ప్రభు దర్బారులో ఒకే రోజులో ఒక ప్రబంధం రాస్తానని శపథం చేసి 'ఏక దిన ప్రబంధం'ను మహా భారత కథగా చెప్పాడు.

భారద్వాజ గోత్రానికి చెందిన మలయా కవి రామనాధ కవిపుత్రుడు. మదురై జిల్లాలో ఉండేవాడు. పద్దెనిమిది కాండల 'మీనాక్షీ పరిణయం' రాశాడు. ఇందులో మీనాక్షి సుందరేశుల వివాహం వర్ణించాడు.

**తంజావూర్ మహారాష్ట్ర రాజుల కాలంలో వర్ధిల్లిన గీర్వాణం (1675)**

మహారాష్ట్రలో భోసలే వంశ రాజ్య పాలన ప్రారంభించిన శివాజీ జీవితమే ఒక చరిత్ర, స్పూర్తిదాయకం. పరామానంద కవి రాసిన 'శివభారతం కావ్యం'లో ముప్పై ఒక్క అధ్యాయాలలో శివాజీ చరిత్ర సర్వం ఉన్నది. ఆయన జైత్రయాత్రలు విజయ పరంపర అన్నీ విశదంగా వర్ణించాడు కవి. శివాజీ 'పర్ణ పర్వత కోట'ను ఆక్రమించిన వీర గాథను జయ రామకవి అయిదు ఉల్లాసాలలో 'పర్ణాల పర్వత గ్రబాఖ్యానం'లో వర్ణించాడు. శివాజీ కుమారుడు 'రాజరాము'ని గూర్చి కేశవ పండిట్ జీ కవి 'రాజ రామ చరిత్ర' రాశాడు. ఇది అయుదు కాండల కావ్యం. కర్నాటకలో మహారాష్ట్ర ప్రాభవం విజయ యాత్రలు అన్నీ అభివర్నితాలు.

**తంజావూర్ రాజు ఏకోజి లేక వెంకోజి (1675–1680)** ఆస్థానంలో మంత్రి బాలకృష్ణ కొడుకు జగన్నాధకవి 'రతి మన్మధ' నాటకం రాశాడు. మరో మంత్రి ఆనంద యజ్వని

కుమారుడు శ్రీశైల కవి 'త్రిపురా విజయ చంపు' రాశాడు.

**రాజుల కవితా వైభవం**

రాజు ఏకోజి కుమారుడు షాహాజి రాజు 'చంద్ర శేఖర విలాసం' అనే నాటకం రచించాడు. 'కుమార సంభవ చంపు' కూడా రాసి శరభోజి 'యుద్ధ దేవత' ఆవిర్భావాన్ని తెలియ జేశాడు. శరభోజి నీతి శతక కర్త కూడా. ఏకోజీ మూడవ కొడుకు రాజా తుక్కోజి మనవడు తుల్జాజి రాజు 'సంగీత సారామృతం' రాశాడు.

**తంజావూర్ సరస్వతి మహల్ – శరభోజి పుణ్యమే**

సర్ఫోజి అనబడే శరభోజి రాజు ఏకోజీ రాజుకు రెండవ కుమారుడు. దక్షిణ భారత దేశంలో సంస్కృత గ్రంథ పరిరక్షణ చేసిన మహోదారుడు. ఎన్నో అమూల్యమైన సంస్కృత వ్రాత ప్రతులను సేకరించి తంజావూర్‌లోని సరస్వతి మహల్‌లో భద్రపరచి గొప్ప సాహిత్య సేద చేశాడు. ఆ భవనానికి 'తంజావూర్ మహా రాజా సర్ఫాజి సరస్వతి మహల్ గ్రంథాలయం' అని నామకరణం చేశారు. ఎందరో రిసెర్చ్ కోసం ఇక్కడికి వస్తూ దీన్ని సద్వినియోగం చేసుకొంటున్నారు.

శరభోజి రామ కధను పన్నెండుకాండల 'రాఘవ చరిత' కావ్యంగా రాశాడని అంటారు. దీనికే 'సంగ్రహ రామాయణం' అనే పేరు కూడా ఉంది. కాని ఒకానొక రాత ప్రతిలోని రెండవ కాండలో 'పంచ రత్న కవి' కృతం అని ఉన్నది. దీన్నిబట్టి అసలు రాసిన వాడు పంచరత్న కవి అని, తన పోషక రాజు పేరు శరభోజిని కావ్యకర్తగా పేర్కొని గౌరవించాడని భావిస్తున్నారు. శరభోజి ఆస్థానంలోనే ఉన్న అనంత నారాయణ అనే కవికి పంచరత్న బిరుదు ఉందని తెలుస్తోంది. ఈ అనంత నారాయణ 'ఆనంద వల్లి స్తోత్రం' రాసిన చిదంబర కవికి తండ్రియే.❋

## 145. సంగీత దర్పణం కర్త– చతుర దామోదరుడు (1600)

**ల**క్ష్మీధరుని కుమారుడు చతుర దామోదరుడు. "సంగీత దర్పణం" సంగీత నృత్యాలపై రాశాడు. సంగీత స్వరాలను చిత్రాలుగా వివరించాడు. దీనికి ఆధారం సోమదేవుని "రాగ విబోధం". జహంగీర్ చక్రవర్తి ఆస్థానంలోని చతుర కల్లినాధుని వంశంవాడు.

హరిభట్టు సంగీత దర్పణం, సంగీత సారోద్ధారం, సంగీత కళానిధి గ్రంథ రచయిత.❋

## 146. చంద్రాభట్ట -ఈశ్వరప్ప (16వ శతాబ్దం)

**శాం**డిల్య గోత్రానికి చెందిన లక్కమాంబా రామేశ్వరుల పుత్రుడు ఈశ్వరప్ప. సదాశివుని శిష్యుడు. 'పార్వతీ పరిణయచంపు' రాశాడు. 16వ శతాబ్దంవాడు. ఈయన వారసుడు సుబ్బన్న ఈ వ్రాత ప్రతిని సిద్ధార్థి నామ సంవత్సర భాద్రపద బహుళ తదియ గురువారం 16-9-1619 కాపీ చేశాడు. కనుక కవి కాలం 16శతాబ్దికి పూర్వం అని భావించవచ్చు.

ఇందులో అవతారికలో 44 శ్లోకాలున్నాయి. 223 శ్లోకాలు గద్యాలు అయిదు 'సన్నాహాలు' ఉన్నాయి. మొదటి అయిదు శ్లోకాలు వివిధ దేవతలపై, తన గురువుపై చెప్పినవి. గురువు కవి రెండవ అన్నగారు కావచ్చు. ఎనిమిది నుండినలభై మూడవ శ్లోకంవరకు కవివంశ వర్ణన ఉంది. మూడవదానిలో అన్నసుబ్రహ్మణ్యం గీర్వాణ ఆంధ్రాలలో గొప్పకవి అని చెప్పాడు. ఈ కావ్య రచనకు హేతువు గురించి చెప్పుకొన్నాడు. "ప్రాచ్యం రోహిత పట్ట కందుక రుచిం జిత్వా నిశానాయకే - జాతే వంచిత హేమ మంజుల రుచో జంబీర రససేచ్ఛయా"

మొదటికాండలో హిమవంతుడికి, మేనకకు మైనాక, పార్వతిల జననం వర్ణించాడు. రెండవ దానిలో నారదుని రాక, సంధ్యా, చీకటి, రాత్రి వర్ణనం నక్షత్ర చంద్ర, సూర్యోదయ వర్ణన, పార్వతి చెలులతో ఆటలు, హిమ వంతుడి రాక ఉన్నాయి. మూడులో భద్ర తీర్థంలో శివుని తపస్సు, పార్వతి శివునికి చేసే సేవలు, ఇంద్రాది దేవతలు వచ్చి తారకాసురుని ఆగడాలు చెప్పి రక్షణ కోరటం, బ్రహ్మ హితవుపై మన్మధుని సాయం కోరటం, మన్మధుడు శివుడు తపస్సు చేసే చోటుకు రావటం ఉన్నాయి. నాలుగులో మన్మధుడు శివునిపై బాణం వేయటం

మసి కావటం, రతీ విలాపం, శివుడి అభయం, నిరాశతో పార్వతి తండ్రి ఇంటికి వెళ్ళటం, పార్వతి తపస్సు, బ్రాహ్మణ బ్రహ్మచారి వేషంలో శివుడు వచ్చి మనసు మార్చుకోమనటం, ఆమెనిరాకరణ, నిజ రూపంలో శివుని ప్రత్యక్షం, శివుడు పార్వతీ కళ్యాణానికి ఒప్పుకోవటం సప్తర్షుల రాయబారం, చివరికి సకల దేవత సమక్షంలో శివపార్వతీ కళ్యాణం వర్ణించబడ్డాయి.

ఈశ్వరప్ప కాళిదాస కుమార సంభవాన్ని అనుసరించాడు. కావ్యం హిమాలయ వర్ణనతో ప్రారంభ మైంది.

"శ్రీ మనస్తి సమస్త పర్వత పతిర్నమ్నాహిమాద్రిర్మహాన్– కస్చిద్రద్ర వ్యపతే ర్దిశ ప్రకట యన్నాత్మీయ విస్తారతాం"

పార్వతీదేవి పాద ముఖ వర్ణన – "రాత్రీ శుధాంశురిపురేత్య విజ్రుమ్భణం మే – హన్తీతి పర్వత సుతాంప్రతి సాదు జప్వా

పధం తదీయ చరణావతారం ప్రపద్య – తత్సంజ్నయా విజయతే కిము నిత్య ఝుమ్భం"

శివుడు బ్రహ్మ చారి వేషం లో వచ్చి పార్వతి తో సంభాషించటం – 'జానామి జానామి తవానుభావం తస్యాన్న విస్తన్విజ్రుతానూ ప్రవేశ్యే"

మాలికా రూప కపాళీ కాళీ ధర, రాశాభ మురూ యదు శ్వాలి కా భీస్టేదః – అంగార గీభవ ద్రుతి కర స్యూలికీ కిం వ్రుతస్సత్వయా భీకరచేస్టయా అని పార్వతిని శివుదివిక్రుతవేశం వివరించి బెదర గొట్టేప్రయట్నం చేశాడు.

వివాహ సమయంలో పెండ్లికోడుకైన శివుడెలా ఉన్నాడు?

"జటా జూటా రాశంభో స్సపాది హరి తోష్మీశ వసనం – సుధాంశు స్త్రత్యః ప్రభావతి మహా భాషిక మపి" – చివరలోశివ పార్వతులశృంగార క్రీడా వర్ణనం చేశాడు

"కళ్యాణ ప్రదాయే స్తాయో స్త్రిజగతా మాస్వాదితా మూల్యత్ – త్రంభూలాది ర్యయోః కృత బహిర్జాత వ్య వా యా స్థయోః

ఆస్వాసాంతగద్యం – ఇతి శ్రీ మదీశ్వర ప్పాభిదాన బుధ విరచిత పార్వతీ పరిణయ నామ ధేయ చంపూ ప్రబంధే పంచామాస్సంనాహః❁

## 147. శేషం కృష్ణ పండితుడు (16-17 శతాబ్దం)

**శే**షం(శేష) వారు గొప్ప విద్వత్ కుటుంబానికి చెందినవారు. గోదావరిజిల్లాకు చెందిన శేషం నరసింహ వారణాసికి 16వ శతాబ్ది మొదట్లో వెళ్లి బెనారస్ దగ్గరున్న తాండవ రాజ్యమేలే గోవింద చంద్రుని ప్రాపు సంపాదించాడు. ఆ కాలం లో మహా వ్యాకరణవేత్తగా ప్రఖ్యాతుడు. అక్కడ వ్యాకరణ విద్యాలయం స్థాపించి నేర్పాడు. ఇందులోచదివిన వారిలో భట్టోజీ నాగోజీలున్నారు. నరసింహుని ఇద్దరు కొడుకులు చింతామణి, కృష్ణలు గొప్ప విద్యావేత్తలు రచయితలూ. కృష్ణ కుమారులు వీరేశ్వరుడు నారాయణుడు. ఇందులో వీరేశ్వరుడు పండిత రాజు భట్టోజి, అన్నం భట్టు లకు గురువు. శేషా లేక శేషం కుటుంబం వారణాసి వాస్తవ్యులైనా ఆంధ్ర దేశీయులే.

శేష కృష్ణ గిరిధారి అనబడే గోవర్ధన ధారి అక్బర్ ఆస్థానంలో ఆర్థికమంత్రి అయిన రాజా తోడర్మల్ కుమారుడు. కనుక కృష్ణ కవి 16వ శతాబ్దం చివరిదాకా 17వ శతాబ్దం ప్రారంభ కాలం దాకా జీవించి ఉండవచ్చు. ఈ కవి కంస వధ, మురవిజయం, ముక్త చరిత్ర సత్యభామా పరిణయం అనే నాటకాలను, పారిజాత హరణం, ఉషాపరిణయం ,సత్యభామా విలాసం, క్రియా గోపన రామాయణం చంపూ కావ్యాలు రాశాడు. ఇవికాక ప్రక్రియా ప్రకాశం అనే వ్యాఖ్యను రామచంద్ర విరచిత ప్రక్రియా కౌముదిపై రాశాడు. స్ఫోటతత్వం, యంగ్లు ఘంటా శిరోమణి అనే వ్యాకరణ గ్రంథాలను, శేష కృష్ణ కారిక రచించాడు కాని లభ్యమైనవి కంసవధ నాటకం, పారిజాతహరణం చంపు మాత్రమే.

కంస వధ 7 అంకాల నాటకం. 1588లో రాశాడు. భాగవత కథ. గురువు

గిరిధారి ప్రోద్బలంతో రాసినట్లు చెప్పాడు–

"తస్యాస్తి తండన కులామల మండస్య శ్రీ తోడర క్షితి పతే స్తనయో న్యాజ్ఞః – ఆనాకలా కుల గృహం స విదగ్ధ గోష్టీమేఖో దితి గురుర్గిరి దారీ నామ్నా"

ఈ నాటకాన్ని కాశీ విశ్వేశ్వర ఉత్సవాలలో ప్రదర్శించేవారు. సూత్రధారుడు కవిని పరిచయం చేస్తాడు. మహా వ్యాకరణవేత్త అయిన కృష్ణకవి వ్యాకరణ జ్ఞానం లేకపోతే యెంత గొప్ప కవినైనా లోకం చులకనగా చూస్తుంది అన్నాడు.

'రసాలంకార రసాసపి వాణీ వ్యాకర ణోజ్ఝితా–రివత్రేవనం రంజయతి సజ్జనాన్'

సాధారణంగా అన్ని శ్రవ్య నాటకాలు లాకుండా ప్రదర్శన యోగ్యంగా ఉంది. మొదటి అంకంలో కంసుడు ఆకాశవాణి చెప్పింది విని కృష్ణుడిని సంహరించే అన్ని విధానాలు అమలు చేయమని ఆజ్ఞాపిస్తాడు. రెండవ అంకంలో కృష్ణలీలలు శకటాసుర, కేశిని పూతన సంహారాలు ఉంటాయి. మూడవ దానిలో కంసుడు బలరామ కృష్ణులను మధురకు ఆహ్వానించి చంపే కుటిల ప్రయత్నం చేయటం ఉంది. నాలుగవ అంకంలో శ్రీకృష్ణ బలరాముల మధురానగర ప్రయాణం, యమునా, గోకుల బృందావన వర్ణన, చెలికత్తె విలాసవతి ద్వారా రాధ కృష్ణుడికి పంపిన సందేశం, రాసక్రీడ ఉంటాయి. అయిదులో బలరామ కృష్ణులు చాకలి నుండి బట్టలు తీసుకోవటం సుదాముని ఆతిథ్యం, కుబ్జకు సుందర రూపమివ్వటం, మధురానగర ప్రవేశం ఉన్నాయి. ఆరులో కువలయాపీడ ఏనుగును చాణూర మర్దన మల్లులను చంపటం, చివరికి కంస వధ ఉన్నాయి. ఏడవ చివరి అంకంలో దేవకీ వసుదేవులను కంసుని చెరనుండి విడిపించటం, ఉగ్రసేనుడిని రాజుగా అభిషిక్తుడిని చేయటంతో నాటకం పూర్తవుతుంది.

శేష కృష్ణ కవితా ప్రతిభ ఆద్యంతం కనిపిస్తుంది. కవికి జ్యోతిశ్శాస్త్రంలో ప్రవేశమున్నట్లు అర్ధమౌతుంది. బలరామ కృష్ణులు మధురకు బయల్దేరే ముహూర్తం దివ్యంగా ఉండేట్లు దైవజ్ఞుని చేత చెప్పించాడు. కాళందీ నది సోయగాన్ని కమనీయంగా వర్ణించాడు –

'పశ్యన్నేతాం చపల శఫరీ లోచనాంపంకజస్య – కోక ద్వంద్వస్తన భారనతాం బాల శైవాల కేశీం.

భ్రుస్గశ్రేణీ మధుర వచనాం రాజ హంస ప్రచారం – వ్యాసక్తో పిక్షణమిహ పునః ప్రేయసీం స్మరితోస్మి'
రాధ విరహ వేదనను పరమాద్భుతంగా విలాసవతి చేత చెప్పించాడు –
'మాలా వ్యాలానుకారా పరిమళ బహుళ స్నిగ్ధ చంపాను శంపా – పంపా కంపానిలోస్యా మలయా జని లయాశీ విషోద్గర ఘోరః
నస్యా దస్యా విభవ్య జ్వరమిహ కత మస్యో త్సకంపాను కంపా –ఝంపా సంపాత జగ్ర త్రుహిన కర హరి ప్రోద్గమో న్నాస భాజః'
'పారిజాత హరణ చంపు'ను తాండవ రాజు సోదరుడు నరోత్తముని ప్రేరణ పై రాశాడు –
'సానందం మకరంద బిందు నికర ప్రస్యంద బందీ భవన్ –మందీ భూతి మిళింద తు0దిల దలన్మందార మందాధరం
భూయః సౌరభ లోభ సంభ్రమ భరాత్ భ్రుంగీ భిరంగీ కృతే – భామాయః కిల పారిజాత కుసుమే జీయాత్రుష్ణం మనః' అలాటి దివ్య పారిజాతాన్ని కోరకుండా ఎవరు ఉండగలరు. నందితిమ్మన తెలుగులో రాసిన 'పారిజాతాపహరణం'ను శేష కవి బాగా అధ్యయనం చేసి రాసినట్లు కనిపిస్తుంది. దీనిపై నంది కవి ప్రభావం అడుగడుగునా ఉంది. గంభీర రచనలో సిద్ధ హస్తుడైన కవి అతి సరళంగా సుందరంగా పారిజాత సుమాలంత కోమలంగా కవిత్వం చెప్పాడు. తిమ్మన పద్యాలను ఒకరకంగా సంస్కృతీకరించాడని చెప్పచ్చు. సత్యభామ కోపాన్ని అనునయించే కృష్ణుడి పాట్లు –
'త్వం చంద్రికా చేత్తదహం చకోరే స్త్వందీపికా చేత్తదహం ప్రకాశః – కాదిమ్బినీ త్వం యది చాతకోహం, మా మన్యదా మానిని మా స్మబుద్ధః'.
మిగతా పారిజాత కావ్యాలలో పుణ్యక కవ్రతాన్ని వివరంగా వివరిస్తే మన శేష కవి ఒకే ఒక శ్లోకం లో చెప్పేశాడు –
'అమర ముని సమాజే తత్ర సాత్రాజితీ సా గురుభి రధ నియుక్తా నారదాయా ర్చ యిత్వా – అదిత విదిత పుణ్యో పుణ్యకే పారిజాతం విదివదఖిల భర్త్రా వాసు దేవేన సార్థం' ప్రతి సర్గ చివర్లో తన పోషకరాజు పేరును ప్రస్తావించాడు శేష కృష్ణ పండితకవి. ❀

## 148. చిదంబర కవి- (16వ శతాబ్దం)

**సూ**ర్యనారాయణ యజ్వ మనవడు, వేంకటాంబ, అనంత రామయ్యలకుమారుడు చిదంబర కవి. 16వ శతాబ్ది గొప్పకవి, సాహిత్య శాస్త్రవేత్త. తండ్రిగోదావరిజిల్లాలో పుట్టినా తమిళనాడుకు వలసవెళ్లి విజయనగర రాజుల ప్రాపకం సంపాదించాడు. శుద్ధ అద్వైతి అయిన చిదంబరం జీవితం చివర్లో తిరుపతి సందర్శించి ఒక్కసారిగా వీర వైష్ణవుడయ్యాడు. వెంకటేశ్వర స్వామిపై 200 పైగా స్తోత్రాలు స్తుతులు రచించాడు. ఉత్తర ఆర్కాట్‌లో ఉండే మాతామహుడు వేదపురీశ్వరుడు 'మార్గ సహాయ చరిత్ర' రాశాడు. చిదంబర తల్లి తమిళ దేశీయురాలు తండ్రి ఆంధ్రావాలా. తమ్ముడు శ్రీనివాసుడు మేనమామ శివసూర్య. చిదంబర కవి తంజావూర్ జిల్లా పలయూర్ నివాసి.

రాఘవ యాదవ పాండవీయం అనే త్ర్యర్థికావ్యం, చిదంబర విలాసం, శ్లేష చింతామణి, శబ్దార్థ చింతామణి, భాగవత చంపు, పంచకల్యాణ చంపు రాశాడు. మొదటిదానికి 'కథాత్రయి' అనే పేరూ ఉంది. మూడాశ్వాసాల కావ్యం. రామాయణ భారత భాగవత కథ. దీనికి అర్థ ప్రదీపిక వ్యాఖ్య ఉంది. కావ్య ప్రారంభ శ్లోకం–

"వాచం వో రచయతు స్సర్వదాంత రంగేగాంగేయ సరస నయోదయం దధానః – సత్యాప్తో బుధ కుల మౌళి బంధు రోజా శ్రీ రామ స్తుత గురుమానసాబ్జ హంసః". మూడవ ఆశ్వాసంలో తన వంశ చరిత్ర చెప్పుకొన్నాడు.

చిదంబర విలాస కావ్యంలో రెండు కాండలున్నాయి అర్థ దీపిక పేర తానే వ్యాఖ్య రాశాడు. చాలా సంక్లిష్ట రచన. మచ్చుకి –

'నాద హ్రదా రామకే జానపద్యాః పారే వాసీ ఫాలయూ రగ్ర హారే – లీలా సేవ్యః శైల కన్యా సహాయః కైలాసేపి వ్యాప కాంక్షాం న దేవః'

50వ శ్లోకంలో తాను తంజావూర్ జిల్లా పాలయూర్ వాసినని చెప్పాడు. శేష చింతామణి 110శ్లోకాల కావ్యం వ్యాఖ్యానం రాసుకొన్నాడు. కవి శ్లేష యమక చక్రవర్తి. – మొదటి శ్లోకం

'సవః శ్రేయో విభుస్తన్యా త్సువయః పున్నావద్భావః – కరీంద్ర వదనో ల్లాసీ కటకీకృత పన్నగః'

శబ్ద రత్న చింతామణి రెండు సర్గలు రామాయణ భాగవత జోడుకథలు. కవి నికశోపల వ్యాఖ్య రాశాడు. పంచకల్యాణ చంపు గద్య, పద్య కావ్యం .రామ, కృష్ణ సుబ్రహ్మణ్య స్వాముల కళ్యాణ గాథ, కవి శిష్యుడు నంజుండ వ్యాఖ్యానం రాశాడు. ❁

## 149. ఓరుగంటి లక్ష్మణ సోమయాజి (16 శతాబ్దం)

**ఓ**రుగంటి శంకర సోమయాజి పుత్రుడు లక్ష్మణ సోమయాజి 12 అధ్యాయాల 'సీతారామ విహార కావ్యం' రాశాడు. ఓరుగంటివారు వరంగల్, కరీంనగర్ విశాఖ గుంటూరు జిల్లాలో ఉన్నారు. ఈ కవి 16వ శతాబ్దంలో వరంగల్ వాసి అయి ఉంటాడు. దీనిపై తత్సత్ వైద్యనాథ రాసిన 'చంద్రిక', అవసస్తి భగీరథ రాసిన 'తత్వ ప్రకాశ' వ్యాఖ్యానాలున్నాయి. వీరిద్దరూ ఆంధ్రేతరులే కావటం విశేషం. మన సోమయాజి కవి మేథా దక్షిణామూర్తి ఉపాసకుడు. స్వామియే స్వయంగా కలలో మంత్రాన్నిచ్చి సాధన చేయమన్నాడు. కనుక తన రచనను ఆస్వామి దక్షిణా మూర్తియే రాశాడని వినయంగా చెప్పాడు.

'స్వప్నే సాక్షాత్రుకౌ యః ప్రధమ ముపా దిశన్ దక్షిణా మూర్తి మంత్రం – పస్చాదాజ్ఞా పయంచ స్వమహిమ కలితం పంజరంయః పఠేతి'

ఇదికాక యింకా 5 రచనలు చేశాడు. 'కై యాటవివరణ' అనే వ్యాకరణ గ్రంథం, గీతారమ, చమత్కార లహరి, గీతామహేశ్వర అనే కవిత్వం, న్యాయ శాస్త్రంపై 'సంగతి లక్షణ' రచించాడు. ఆంధ్రుడు కనుక కవిత్వంలో తెలుగుదనాన్ని చూపాడు. అయోధ్య వర్ణన–

'ఏ మాముపాస్చిత్య వసంతి సర్వే జానా ఇహముత్ర చ పాలనీయాః–ఇతీ బద్ధం పరిఖాచ్ఛలేన పాదే యయా కంకణామివ భా'

అన్నం వార్చి 'వారుపన్నం' వండటం చెప్పాడు.

'చిత్రం యాత్ర ప్రముగ్ధా బహుతర ఖాదిరాన్గారబుద్ధ్యా మణీనాంఃసాఘం నిక్షిప్య చుల్లయాం తదుపరి కలశే చంద్ర కాంతా వనేద్వే

తోయం జలాంతరా లస్తిత శశి కిరణైర్వర్ధమానం హిరాత్రీ - దుగ్ధ్వా పాకర్య మేతత్ కలశ గత జలే తండులాన్ ప్రక్షి పంతి'

కొన్ని చోట్ల శంకరాచార్యుల శివానంద లహరి లాంటి శ్లోకాలున్నాయి-

'ఇమాం సర్వం కలయ మమ సర్వోత్తమ విభో - సదాపూర్వం సుర వినుత చార్వంకి కమలం

స్థిరో భూత్వా తవ పదమ భీత్వా చ విహారే'

కవిపై కాళిదాసప్రభావం బాగా ఉంది, కన్పిస్తుంది. తెలుగులో రామరాజ భూషణుని వసుచరిత్ర ప్రవాహంలోనూ కవి కొంత దూరం కొట్టుకు పోయాడు.

చంద్ర వర్ణన - 'రాజా దోషాకర ఖ్యాతో, దోషాణామాక్రో హిసహః - పద్మినీ చక్ర కాంతీశ్చ,బాధతే స్వోదయే యతః'

సీతాదేవి నాసాభరణాన్ని చంద్రునితో బృహస్పతితో పోల్చటం మహాద్భుతం-

'సుప్రూత్త బాహ్వో ర్వలయా ను రజ్జితా విశాల కేయూర యుగోజ్జ్వల ద్భుజః - నిశీధినీ చారి గురూపమోజ్జ్వల ద్విశా ద్వనా భరణేనభాసురా'❋

## 150. భిక్షాటన కావ్యం రాసిన ఉత్ప్రేక్ష వల్లభుడు (1600)

**అ**సలు పేరు గోకులుడైన ఉత్ప్రేక్ష వల్లభుడు మహా శివభక్తుడవటం చేత 'శివభక్త దాసుని'గా ప్రసిద్ధుడు. 16వ శతాబ్దపు మలబారు కవి. నలభై పద్ధతులలో 'భిక్షాటన కావ్యం' అనే గొప్ప రచన చేసాడు. శివుడు రాజ రాజ చోళ మహారాజు దాన శీలాన్ని భక్తిని ఉదారతను పరీక్షించటానికి ఒక భిక్షకునిగా రావటం ఆ నగర మహిళలను ప్రభావితం చేయటం ఇందులోని కథ. ఇందులోని వర్ణనలు ఆకర్షణతో నిండి సందేశాత్మకంగా ఉన్న కావ్యం. రాజు మదనుడి కోరికపై ఈ కవి 'సుందరీశ శతకం' రాసాడు.❋

## 151. శ్యామ రహస్యం రాసిన ప్రియంవద (1600)

**శి**వరామ కుమార్తె, రఘునాధుని భార్య ప్రియంవద. పశ్చిమ బెంగాల్లో ఫరీద్పూర్ నివాసిని. 1600లో శ్యామ రహస్యం మొదటి కావ్యం రాసింది. ఇది కృష్ణ స్తుతి. వైజయంతి (1660) మూరభట్ట కుమార్తె అయిన వైజయంతి ఫరీద్పూర్ జిల్లాలో జన్మించింది. కోటలిపదపు చెందిన దుర్గాదాసు కుమారుడు కృష్ణనాధుని భార్య. 17వ శతాబ్దపు మధ్య భాగంలో ఉండేది. తండ్రి వద్ద సంస్కృతం నేర్చి మీమాంస శాస్త్రంలో ఉద్దండురాలైంది. ఒకసారి భర్త శిష్యులకు తప్పుగా పాఠం బోధిస్తుంటే సరి చేసింది. అద్భుతమైన కవిత్వం రాసింది. అదంతా భర్త రాసిన ఆనంద లతికా చంపూలో కలసిపోయింది. ఈ రచనలో ఆమె భాగస్వామ్యాన్ని భర్త అంగీకరించాడు. ఒకసారి భర్త ఒక నాయికను వర్ణిస్తూ కవిత్వం ఆగిపోతే వైజంతి అద్భుతంగా దాన్ని పూర్తి చేసింది.

తూర్పు బెంగాలుగకు చెందిన పూర్వపు విశ్వకోశం అనే పత్రికలో సంపాదకుడు జయంతి ప్రతిభను వర్ణించాడు. ఆమె రాసిన గొప్ప కావ్యాన్ని పండిత అమూల్య చరణ్, విద్యా భూషన్‌లు చూసారని తెలియచేసాడు. విద్యా భూషణుడు బెంగాల్ సాహిత్య పరిషత్‌కు ఉపకార్యదర్శి.

మలబారుకు చెందిన మనోరమ, సుభద్ర, రాజశేఖరుని భార్య అవంతీ సుందరి, ఘనశ్యాముని భార్యలు సుందరి, కమల గొప్ప కవయిత్రులుగా గుర్తింపబడ్డారు. గంగాదేవి, మధురవాణి, తిరుమలాంబ గురించి ముందే తెలుసుకున్నాం. ❀

## 152. మధురవాణి (క్రీ.పూ. 1614- 1662)

**త**ంజావూరు రఘునాధనాయక రాజు ఆస్థానంలో మధురవాణి ఉండేది. ఆమె అసలు పేరు తెలియదు. 14 కాండలలో రామాయణం రచించింది. మధురమంజుల కవిత్వం అందులో ఉంటుంది. చివరి కాండలో తాను ఎందుకు రామాయణం రచించవలసి వచ్చిందో రాసింది. ఒకసారి యువరాజు రఘునాధ నాయకుడు సింహాసనం మీద అంతఃపుర మహిళల మధ్య కూర్చుని తాను రాసిన ఆంధ్ర రామాయణాన్ని పాడుతుండగా వింటున్నాడు. ఆయనకు శ్రీరామునిపై ఉన్న అనన్య దైవభక్తిని పొగుడుతున్నాడు. అప్పుడు యువరాజు తనలో తాను విష్ణు కథలు చాలా ఉన్నా రామ కథ అమృత తుల్యమని వేలాదిసార్లు విన్నా ఎప్పటికప్పుడు కొత్తదిగా మానసికాహ్లాదాన్ని కల్గిస్తుందని అన్నాడు. అక్కడున్న వందలాది మహిళలు సంస్కృత, తెలుగు కవిత్వంలో నిష్ణాతులు. ఇందులో ఎవరు రామాయణాన్ని సంస్కృతంలో రాయగలరు అని ప్రశ్నించాడు. ఆ రోజు రాత్రి శ్రీరాముడు కలలో ప్రత్యక్షమై ఆ విషయంపై ఆందోళన చెందవద్దని తాను మధురవాణి అనే బిరుదు ఇచ్చిన కవయిత్రి అతని కోర్కెను తీర్చగలదని ఆమె అందరిలో మహోన్నత శ్రేణికి చెందిన కవయిత్రి అని తెలియచేసాడు. మర్నాడు సభలో మధురవాణి దగ్గర కూర్చోబెట్టుకుని తన కలను వివరించాడు. ఆమెను సంస్కృత రామాయణం రాయమని కోరాడు. అందులో అందమైన అలంకారాలు రస మాధుర్యం, పదాల సృష్టి ఉండాలి అని చెప్పాడు. మీ దయవలన, శ్రీరాముని అనుగ్రహం వలన నేను రామకథను సంస్కృతంలో రాయగలను. మీ కోరిక నెరవేర్చగలను అని చెప్పింది. రామ కథ మొదటి కాండలో తన రాజు గుణశీలలను గొప్పగా వర్ణించింది. మధురవాణి కుమార సంభవం, నైషద కావ్యాలను కూడా సంస్కృతంలో రాసింది. ఆష్టావధానాలలో గొప్ప ప్రతిభ చూపింది.❁

## 153. అమృతోదయ కర్త - గోకుల నాథుడు (1615)

**శృ**ంగార రాజు ఫతే షా ఆస్థానకవి గోకుల నాథుడు. మిధిల రాజు రాఘవ సింహుని సమకాలికుడు. కాలం 1615. జీవాత్మ పరమాత్మను కలిసే తపనను 'అమృతోదయం'లో చూపాడు. అతని 'మదాలస' నాటకం మదాలస చరిత్ర. 'రాస మహార్ణవం' సాహిత్య చరిత్ర. 'శివ స్తోత్రం' కూడా రాశాడు.❁

## 154. నేపాల్ రాకుమార కవి- జగజ్జోతిర్మల్ల (1617- 1633)

**నే**పాల్‌కు చెందిన త్రిభువన్ మల్ల రాజకుమారుడు జగజ్జోతిర్మల భాక్తపురానికి రాజు. గొప్ప సంగీత విద్వాంసుడు, శాస్త్రజ్ఞుడు. ఉత్తర దేశంలో సంగీతంపై సరైన గ్రంథం లేదని అభిలాషుడు రాసిన సంగీత చంద్రను నేపాలీ భాషలో రాసాడు. దీనికి సంగీత భాస్కర అనే వ్యాఖ్యానాన్ని మిథిలకు చెందిన వంగమణి రచించాడు. సంగీత సార సంగ్రహం అనే గ్రంథాన్ని రచించాడు. 1617- 1633 కాలంలో పరిపాలన చేసాడు. పద్మశ్రీ రాసిన నాగ రస సర్వస్వంకు విపుల వ్యాఖ్యానం రాసాడు. నేపాలీ భాషలో 'హర గౌరీ వివాహం' అనే సంగీ రూపకం రచించాడు. ఈ రాజు ఇతర రచనలు సర్వోదయ దీపిక, గీత పంచాసిక, సంగీత భాస్కరం, ముప్ఫై మూడు అంశాలపై శ్లోకాలను సమీకరించి శ్లోక సంగ్రహంగా రూపొందించాడు.

ఇతని కుమారుడు ప్రతాప మల్లుడు కూడా కవి. ఇతని కుమారుడు జగత్ప్రకాశ మల్ల పద్య సముచ్చయం అనే నీతి కావ్యం రాసాడు. ఇతని కుమార్తె, కొడుకు అనంతుని ప్రేరణచే ఘనశ్యాముడు నాట్య శాస్త్రంపై ఉన్న హస్త ముక్తావళికి వ్యాఖ్యానం రాసాడు.❁

## 155. షాహాజీ ఆస్థాన విద్వాంసుడు, సంగీత మకరందం కర్త – వేద (1630)

**చ**తుర దామోదరుని కొడుకు అనంతుడు. ఈతని కొడుకే వేద. శివాజీ తండ్రి షాహాజీ ఆస్థాన విద్వాంసుడు. షాహాజీ కోరికపై "సంగీత మకరందం", "సంగీత పుష్పాంజలి" రచించాడు. మొదటి దానిలో రస దృష్టి, గతి, చారి, హస్త, నృత్య, రసాలపై రాశాడు.❁

## 156. రాజానక రత్న కాంతుడు (1640)

**దౌ**మ్యాయన గోత్రీకుడైన శంకర కాంతుని కొడుకు రత్నకాన్తుడు. కాశ్మీర దేశస్తుడు. అతని శారద కావ్యపు రాత ప్రతులు శ్రీనగర్‌లో భద్రపరచబడినాయి. కవి, సాహిత్య శాస్త్రవేత్త. రత్న శతకం అనబడే చిత్ర భాను శతకంలో సూర్య వర్ణన పరమాద్భుతంగా చేశాడని పేరు వచ్చింది. 1680లో దీన్ని కూర్చాడు. రత్నాకరుని హరవిజయం పైన, వాసుదేవుని యుధిష్టిర విజయం పైన విపుల వ్యాఖ్యానాలు రాశాడు. అలాగే జగద్ధరుని స్తుతి కుసుమాంజలి యశస్కరుని దేవీ స్తోత్రంలపైన కూడా వ్యాఖ్యలు రాశాడు. కావ్య ప్రకాశంపై సార సముచ్ఛయం, మంచి పేరు పొందింది. ఇతని వంశంవారు ఇప్పటికీ శ్రీనగర్‌లో ఉన్నారు. కారి కున కుటుంబంగా వీరికి సంఘంలో గౌరవ స్థానం ఉంది.❁

## 157. అలంకార నికష రాసిన– సుధీంద్ర యోగి (1650)

**అ**లంకార నికష మినీ గ్రంథం రాసిన సుధీంద్ర యోగి తన గురువు, విజయేంద్రయతి శిష్యుడు మధ్వాచార్యుడు అయిన సుధీంద్ర యోగిని స్తుతిస్తూ రాసిన అలంకార గ్రంథం. సుభాద్రా పరిణయ నాటకమూ రాశాడు. ఈయన గురువు సుభద్రా ధనుంజయం రాశాడు. సుధీన్ద్రుడు పదిహేడవ శతాబ్దివాడు. తంజావూర్ పాలకుడు రఘునాధ నాయుకుని చేత సన్మానం పొందాడు.

విశ్వేశ్వరుని చమత్కార చంద్రిక కూడా ఇలాంటిదే. అందులోని ఉదాహరణలు సింగ భూపాలుని (1330)పై ప్రశంసలే. విశ్వేశ్వరుని శిష్యుడు నాగనాధుడు. మదన విలాసం అనే నాటకం రాసి రాచర్ల రాజు సింగభూపాలుని కొడుకు మాచునికి గౌరవంగా అంకితమిచ్చాడు. అనపోత రాజు కాలం 1369లో వేసిన శిలాశాసకర్త ఇతడే. 1425 కవితావ తారిక రాశాడు. పురుషోత్తమ సూది దీనికి నాగ భూపాలునిపై ఉదాహరణలు కూర్చాడు. మాచ రాజు మనవడే నాగ. 1400లో గంగాపుర రాజు.❁

## 158. జానుంపల్లి గోపాలరాయ (1650)

**'అ**ష్ట భాషా బహిరి గోపాలరావు' అని పిలువబడే గోపాలరాయ జానుం పల్లి వీరమ్మ, వెంకటల కుమారుడు. 17వ శతాబ్దం మధ్యభాగంలో జానుంపల్లి వంశరాజులు. వనపర్తి సంస్థాన పాలకులు. 1650 కాలంవాడు. అతని రాజధాని వనపర్తి దగ్గరున్న సూగూరు. రెడ్డి కులస్తులు. కవిపండిత పోషణతో బాటు స్వయంగా రాజు కవి. బహుభాషా వేత్త. ఎనిమిది భాషలు వచ్చు. అందుకే 'అష్ట భాషా బహిరి' అని పిలిపించుకొన్నాడు. బహిరి అనేది వనపర్తి రాజుల వంశ పారంపర్య నామం. 'షడ్ దర్శన వల్లభ' అనే సార్ధక బిరుదూ ఉంది. 'రామ చంద్రోదయం' అనే యమక కావ్యాన్ని, శ్రీరంగ మంజరీ భాణం'ను రాశాడు.

రామ చంద్రోదయం క్లిష్టమైన యమక కావ్యం. 5 ఉచ్వాసాలతో 295 శ్లోకాలతో ఉంది. వ్యాఖ్యానం లేకుండా అంగుళం కూడా కదలలేము. రాజు తానె స్వయంగా 'విజ్ఞానార్ధ దర్పణం' అనే వ్యాఖ్యానం రాశాడు. పూర్తి రామాయణ గాథ. మొదటి అధ్యాయంలో అయోధ్య వర్ణన, రామాదుల పుట్టుక వర్ణించాడు. రెండవ దానిలో వసంత ఋతువు దశరధుని జలక్రీడాదులున్నాయి. మూడులో విశ్వామిత్ర ప్రవేశం, ఆయనతో సోదరులిద్దరు యజ్ఞ రక్షణకు వెళ్ళటం బల అరిబల విద్యలు నేర్పటం. తాటాక సుబాహు వధ మారీచుడిని బాణంతో పార ద్రోలటం, గంగావతరణం, మిధిలా ప్రవేశం ఉన్నాయి. నాలుగులో జనకుని స్వాగతం, సీతారాముల సమాగమం, దశావతార వర్ణన లో పది దశల ప్రేమను వ్యక్తం చేయటం, శివ ధనుర్భంగం ఉంటాయి. చివరి అధ్యాయంలో సీతారామ వివాహవర్ణన చాలా విస్తృతంగా చేశాదు కవి. అయోధ్యకు తిరుగుప్రయాణం

పరశురామ గర్వభంగం ఉన్నాయి. చివరి శ్లోకాలలో రాముడిని అడవికి పంపటం వాలివధ, సుగ్రీవ పట్టాభిషేకం సేతు బంధనం రావణ వధ, శ్రీరామ పట్టాభి షేకంతో పూర్తి.

వ్యాకరణ విద్యార్ధులకు, కొత్తగా కవిత్వం రాసేవారికి ఈ కావ్యం కరదీపిక. ప్రారంభ శ్లోకం–

'శ్రీ వేంకట పురపతిం స్థిర సత్ప్రభావం శ్రీ రామ చంద్ర మనిశం హృది భావ యామి – నశ్యత్య బాహ్యమపి భూరి తమః ప్రజానాం సర్వార్ధ సాధ్విది గమో స్తి చ యత్ప్రసాదాత్ '

కవి తన గురించి తాను ఇలా చెప్పుకొన్నాడు–

'షట్చాస్త్రీ పార దృశ్వా సరస మృదు వచరారాల్లాధ్య నానా కవీంద్ర – స్తుత్యః స్వారేష భాషా కృత బహు మధురోదార చిత్ర ప్రబంధః' అని చెప్పుకొని ఇంత గొప్ప కవిత్వం తనకు శ్రీ రామచంద్రుని కటాక్షం వలననే లభించిందని వినయంగా చెప్పుకొన్నాడు –

'అక్రుతసనామా ధీరం యమక కృతిం కాళిదాస నామా ధీరం – అన్యో నామా ధీరం సుకవిం తత్ప్రధయాయి తుమదునా మధీరం.

శబ్దాలతో చెడుగుడు ఎలాఆడాడో చూద్దాం–

'యతో యతో యతో యతోదయం పికర్తునిధి సః–రమా రమా రమా రమాయత తాత తోధవైజయీ'

రెండర్ధాల శ్లోక వైభవం చూద్దాం–

'మంజులతా గణికానాం జగృహే మధుపేన పుష్పతాగననికానాం–జాతిరుత గణికానాం ననుశ్రుతా నోచితజ్ఞాత గణికానాం' ఈ శ్లేష పగలకొట్టి అర్ధం చేసుకోవటానికి శోష పడాలి.

ప్రేమలో ఉన్న పది అవస్థలను అద్భుతంగా వర్ణించాడు. చివరికి రామ రాజ్యాన్ని వర్ణించాడు –

'రామితా గాదిభి శ్యామితా జనతా శమితాన నాశ మితాన ప్రుషాః–పరమాయురవాప రమామాఖిలః పరమామపి నోపరమార హృది'

## గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2

గోపాల రాయని రెండవ రచన 'శ్రీ రంగ మంజరీ భాణం'ను మృదు మధురంగా రాశాడు. మహబూబ్ నగర్ శ్రీరామాలయ ఉత్సవాలలో దీన్ని ప్రదర్శించేవారు. తన రాజధాని సూగూరును వర్ణించాడు. తన భాణాన్ని "కోప్యేష ప్రచురే గిరం మధురిమా కోప్యార్ధ గంభీరిమా – సర్వం నూతన మేవ సూత్రితమహో యన్నాన్య సాధారణం – భాణో స్మిన్ కవినాసయే సుమహాన్ భాగ్యస్య పాకోహినః"

కాళిదాస కుమార సంభవాన్ని గుర్తుకు తెస్తుంది. శ్రీరంగనాధ దర్శనానికి రధాలలో వచ్చే వివిధ దేశాలనుంచి వచ్చిన మహిళను చక్కగా వర్ణించాడు. ఘూర్జర, నేపాల లాట దేశ స్త్రీలను వర్ణించాడు. చంద్రోదయంతో సమాప్తి చేశాడు. భరత వాక్యమూ పలికాడు. అక్కడక్కడ ప్రాకృతం వాడాడు. చివరి శ్లోకం–

'దేవః పంచ శరః ప్రపశ్యతు వియుగ్దీనాన్ దయాలోకితే – స్స్వాన్కాంతా నను గృహ్నాతాంమృగ ద్రుశ స్సంత్య క్తమా నాస్స్వయం' ❁

## 159. మేఘ విజయ గని (1650)

జైన సన్యాసి అయిన మేఘ విజయ గని క్రిపావిజయుని శిష్యుడు. హీరవిజయకు అయిదవ తరం వాడు. వ్యాకరణ, ఖగోళ, మీమాంస, శాస్త్రాలలో ఉద్దండుడు. వీటిపై విపులంగా గ్రంథాలు రాశాడు. అతడు రాసిన 'సప్త సంధాన కావ్యం'లో తన కవితా ప్రతిభ ఏమిటో నిరూపించుకొన్నాడు. ఈ కావ్యంలో ఒకేసారి ఏడు రకాల కథలను అల్లాడు. మధుర భాషా సంపద దీనిలో కనిపిస్తుంది. 'దేవానందాభ్యుదయం' కావ్యంలో ఏడు కాండాలలో 'విజయ దేవ సూరి' జీవితాన్ని చిత్రించాడు. ఇది 1671లో రాసిన పుస్తకం. 'శాంతి నాద చరిత్ర'లో శాంతినాధుని జీవితాన్ని వర్ణించాడు. ఈ రెండు కావ్యాలలో విజయగని శిశుపాల వధ, నైషధ కావ్యాలలోని పంక్తులను సమస్య కోసం గ్రహించి తన స్వంత కవిత్వంతో వాటి ఉత్కృష్టతను చాటి చెప్పాడు.

మేఘ విజయ గని కవి తన 'సప్త సంధాన మహా కావ్యం'లో ప్రతి శ్లోకం లోను 'వృషభ నాద, శాంతి నాధ, పార్శ్వ నాధ, నేమినాధ, మహావీర, కృష్ణ, బలదేవలను వర్ణించాడు. ఇందులో మొదటి అయిదుగురు ఇరవైనలుగురు జైన తీర్ధంకరులలో ఉన్నారు. తొమ్మిది కాండాలలో వీరిపై అనేక కథలు రాశాడు. అతి సరళంగా సుందరంగా కవిత్వాన్ని అలవోకగా జాలువారించాడు. అతని సంస్కృత పరిజ్ఞానానికి ముగ్ధులయేట్లు చేస్తాడు.

హేమచంద్ర సూరి కూడా 'సప్త సంధాన కావ్యం' రాసినట్లు ఉందికాని కావ్యం అలభ్యం. ఆ లోపాన్ని మేఘ విజయ సూరి పూరించి గొప్ప మేలు చేశాడు. కాళిదాస మహాకవి మేఘ సందేశ కావ్యంలాగా గని 'మేఘ దూత సమస్య లేఖ' రాశాడు. ఇందులో కవి తన ప్రభువు గచ్చ విజయ ప్రభ సూరి'కి రాసిన లేఖ ఉంది. విజయప్రభ సూరి జీవితంపై పదమూడు కాండల 'దిగ్విజయ మహాకావ్యం' రాశాడు విజయ గని. సమకాలీన వేదాంతుల సిద్ధాంతాలను ఖండిస్తూ దృష్టాంతంగా మేఘ విజయ గని రాసిన నాటకమే 'యుక్తి ప్రబోధం'.

## 160. కావ్యేందు ప్రకాశిక కర్త – సామ రాజు దీక్షితులు (1650)

**సా**మ రాజ దీక్షితులు నరహరి బిందు, పురందరుల కుమారుడు. పదిహేడవ శతాబ్ది మధ్యలో ఉన్నాడు. బుందేల్ ఖండ్ రాజు ఆనంద రాయలు యీతని ప్రాపు. పార్వతీ దేవిపై 'త్రిపుర సుందరీ స్తోత్రం' రాశాడు. 'కావ్యేందు ప్రకాశిక' అనే అలంకార గ్రంథమూ రాశాడు. 'ధూర్త నర్తకం' అనే హాస్య నాటకం రచించాడు. అయిదు అంకాల 'శ్రీ దామ చరిత్ర' నాటకం 1681లో రచించాడు. ఇందులో సుదాముడు లేక శ్రీ దాముడు అంటే కుచేలుడే శ్రీ కృష్ణుని ముఖ్య స్నేహితుడు. మొదటి అంకంలో సుదాముని దుర్భర దారిద్ర్య జీవితం కళ్ళకు కట్టించాడు. చదువు, సంస్కారం భక్తీ ఉన్న వారి వద్ద సరస్వతీ ప్రసంనమే ఉంటుంది కాని లక్ష్మి కన్నెత్తి కూడా చూడదు అని చెప్పాడు. కృష్ణుడు సంపదను అన్యాయంగా సంపాదించిన వారినుండి దాన్ని తిరిగి స్వాధీనం చేసుకోమని ఆజ్న ఇస్తాడు. దరిద్రుదు బాధలను భవిస్తూ చివరికి విష్ణు సాయుజ్యం చేరటం కథ. కనుక సుదాముడు తన అర్హతను గౌరవాన్ని పొందే హక్కు ఉంది అని చెప్పకుండా చెప్పిన నాటకం.

ఇతని కొడుకు కామ రాజు 'శృంగార కలిక' రాశాడు. ఇతని మనవదు ముని మనవదు వ్రజర రాజు, జీవ రాజులు రసమంజరి, రస తరంగిణులపై విపుల వ్యాఖ్యానాలు రాశారు.❁

## 161. సామ రాజ దీక్షితులు (1681)

**బిం**దు పురందర కుటుంబానికి చెందిన సామరాజ దీక్షితులు 'శ్రీ దామ చరిత' కావ్యాన్ని 1681లో రాశాడు. త్రిపుర సుందరీ మానస పూజన స్తోత్రం 'అక్షర గుంఫ', ఆర్యా త్రిశతిలతో బాటు అలంకార గ్రంథం 'శృంగారామృత లహరి' రచించాడు.

ఇతని కొడుకు కామరాజు లేక కామ రూప శాస్త్రి 'శృంగార కలిక'ను 'కావ్యేందు ప్రకాశ' అనే అలంకార గ్రంథాన్ని రాశాడు. కామ రాజు కొడుకు వ్రజ రాజు లేక హరదత్తుడు 'రసమంజరి'పై భాష్యాన్ని, 'శృంగార శతకం', 'షడ్రుతువర్ణనం', ఆర్యా త్రిశతి ముక్తకం అనే రసిక రంజన కావ్యం రాశాడు. వ్రజ రాజు కొడుకు జీవరాజు మాధవ సేన మహా రాజు ఆస్థాన కవి. 'గోపాల చంపు', 'రస తరంగిణిపై 'సీతు' అనే వ్యాఖ్యానాన్ని రచించాడు. అంటే సామరాజ వంశం కవితా సంపన్నం అన్నమాట.❀

## 162. గీతా దిగంబర నాటక కర్త – వంశమణి (1655)

**మై**థిలీ బ్రాహ్మణ వంశంలో విల్వపంచ శాఖకు చెందిన వంశమణి రామచంద్రుని కొడుకు. నేపాల్ దేశ వాసి. ఖాట్మండు రాజు ప్రతాప మల్ల దేవుడు చేసిన తులాపురుష దాన సందర్భంగా 'గీతా దిగంబర' నాటకం1655లో రాశాడు. తులాపురుష దానం జరిగే సందర్భంలో ఆహూతులైన రాణుల రాజుల పండితుల సమక్షంలో వారందరికీ వినోదం కలిగించటానికి చేసిన రచన ఇది. తులాపురుష దానం అంటే రాజు తన బరువుతో సమానమైన విలువైన ఆభరణాలు బ్రాహ్మణులకు దానం చేయటమే. ప్రతాపమల్ల రాజు స్వయంగా కవి, కవిపోషకుదు. ఆయన దేవతలమీద రాసిన 'అష్టకాలు' నేపాల్ అంతటా లభిస్తాయి. అంత ప్రాచుర్యం పొందాయన్నమాట. ఇలాంటి పవిత్ర కార్యక్రమంలో సంస్కృత నాటకం ఆడించటం రాజుకు అలవాటు.❀

# 163. రామభద్ర దీక్షితులు (1660)

**చ**తుర్వేదీయ యజ్వన కుటుంబంలో తమిళనాడులోని కుంభకోణం దగ్గర ఖంద్ర మాణిక్యం గ్రామంలో రామభద్ర దీక్షితులు జన్మించాడు. తండ్రి యజ్ఞ రత్న దీక్షితులు వ్యాకరణంలో మహా పండితుడు. సోదరుడు రామచంద్ర ప్రముఖ హాస్య కవి. బాలకృష్ణ, చొక్కనాధల వద్ద వేదాంతాలు చదివాడు. చొక్కనాధ కుమార్తెను పెళ్ళి చేసుకొన్నాడు. నీలకంఠ మహా కవిపై వీరాభిమానం ఉండేది. ఆయన ప్రేరణ వలననే కవిత్వంలో ప్రవేశం కలిగింది. కీర్తి దశ దిశలా వ్యాపించి తంజావూర్ రాజు షాహాజీ (1684-1711) చెవిన పడింది. ఆహ్వానించి కవితా ప్రతిభకు మెచ్చి రాజు షాహాజీ రాజ పురాగ్రహారం కానుకగా అందించాడు. అక్కడే హాయిగా స్థిర నివాసమున్నాడు రామభద్ర. శిష్యుల అభిమానంతో అయ్యా అని అయ్య దీక్షితులు అని గౌరవంగా పిలిచేవారు. శ్రీరామునిపై పరిపూర్ణ భక్తీ ఉండేది. పద్దెనిమిదవ శతాబ్ది తొలి భాగంలో రామభద్ర కాలం చేశాడు.

**దీక్షితీయం**

రామభద్ర దీక్షితులు పతంజలి చరిత్ర రాశాడు. ఆయన ఆదిశేషుని అవతారంగా పేర్కొన్నాడు. ఒక తెర అడ్డంగా ఉంచి దాన్ని తీయవద్దని, చెప్పకుండా బయటికి వెళ్లరాదని కొన్ని నియమాలు పెట్టి మహా భాష్యాన్ని శిష్యులకు బోధిస్తుంటే గురువుగారి నోటినుంచి మాటలు రాకుండానే శిష్యులకు గ్రంథం అర్ధమైపోతోంది. గురువు ఏం చేస్తున్నాడో అనే ఉత్కంఠతో వెయ్యిమంది శిష్యులలో ఒక్కడు తప్ప అందరూ తెర పైకెత్తి చూశారు. గురువు కంటి మంటకి కాలి మసైయారు. ఒక శిష్యుడు చెప్పకుండా బయటికి వెళ్ళాడు కనుక బతికిపోయాడు. క్రమశిక్షణను ఉల్లంఘిస్తే బ్రహ్మరాక్షసి అవ్వమని శపించాడు. చంద్రగుప్త (పతంజలి) అనేవాడు ఆ బ్రహ్మరాక్షసిపై జాలికలిగి అడవిలో చెట్టుపై ఉన్న బ్రహ్మరాక్షసికి తానే శిష్యుడిగా మహా భాష్యం నేరుస్తూ దాన్ని రావి ఆకులపై నిక్షిప్తం చేవాడు. ఒకరోజు దాహంగా ఉందని ఆకుల్ని మూటగట్టి వెడితే మేక వచ్చి కొన్ని ఆకులు నమిలేసింది. మిగిలిన

మహా గ్రంథమే మనకు లభించే పతంజలి మహా భాష్యం మేక నవిలిన భాగాన్ని అజ భక్షిత అంటే మేక మింగిన భాగం అంటారు. ఈ చంద్రగుప్తుడే ఉజ్జయిని వెళ్ళాడు. అక్కడ గ్రంథస్థం చేశాడు. అదే పతంజలి యోగశాస్త్రంగా పలవబడుతోంది. చంద్రగుప్తుడు ముగ్గురు భార్యలను వివాహం చేసుకొన్నాడు. వారికి పుట్టిన వారే వరరుచి, విక్రమార్క, బర్తృహరి. ఆదిశంకర ఆవిర్భావంతో ఆయన జేత్రయాత్రలతో కథ నడిచి చివరి శంకరులు కంచికి చేరే దాకా కథ ఉంటుంది.

రామభద్ర జానకీ పరిణయ అనే నాటకం కూడా రాశాడు. శృంగార తిలక లేక అయ్య భాణం కూడా రాశాడు. వీటిలో మధుర రాజు భుజంగ శేఖరుని సాహసాలు వర్ణించాడు. ఇతని స్నేహితుడు అమ్మనాచార్య అనబడే వరదాచార్య దీనికి వ్యతిరేకంగా వసంత తిలక భాణం లేక అమ్మె భాణం రాశాడు. రామభద్రకవి రామ భాణస్తవం రామ చాప స్తవం, రామాష్ట ప్రాస, ప్రాసస్తవం, విష్ణు గర్భ స్తవం, పర్యాయోక్తి నిష్యందం, తూణీర స్తవం రామ భద్ర శతకం మొదలైనవెన్నో శ్రీరామునిపై రాసి తన అనన్య భక్తిని చాటుకొన్నాడు రామ భద్రకవి.❁

## 164. లక్షిణ (1660)

**ఠా**కూర్ రాణి అనబడే లక్షిణ మిథిలకు చెందిన గొప్ప కవయిత్రి. ఆమె రాసిన శ్లోకం ఒకటి ఉన్నది.

''అక్రాంతా కృశా మధ్వజ స్యై గీతినాన మ్ముర్ఞ తానిర్జలే–
తుర్యధూదాశ్మద్వితీయ మతి మనైకాదశభస్తనీ
తాషష్టీ కటిపంచెంచ నవమంధ్రా స్సప్తమీ దార్పితీ– ప్రాప్నేస్సష్ట మేవదనాం
త్వమధునా సూర్ణే తృతీయోధవ''❁

## 165. చొక్క నాధుడు (1660)

**బ**సవేశ్వరునిపై నాటకం రాసిన నరసంబ తిప్పాధ్వరి కుమారుడు చొక్కనాధుడు ఆంధ్రుడేకాని దక్షిణ భారతానికి వలస వెళ్ళాడు. తంజావూర్ రాజు షాహాజీ మహా రాజు ఆశ్రయంలోను, కేరళకు చెందిన ఇక్కేరి రాజు బసప్ప నాయకుని ఆస్థానంలోను ప్రాభవం పొందాడు. కవి నీల కంఠునికి సన్నిహితుడు. మహాపండితుడు రామ భద్ర దీక్షితునికి గురువు. అతని అన్నలు నలుగురు కుప్పాధ్వరి, తిరుమల, స్వామి యాజీ, సీతారామ, తమ్ముడు యజ్నేశ్వరుడు అందరూ అందరే. తిరువసనల్లూర్ అని పిలువబడిన షాహాజి రాజాపురం పరగాణాలో ఉండేవాడు. చొక్కనాధుడు రస విలాసభాణం, సేవంతికా పరిణయం కాంతిమతి పరిణయం రాశాడు. ఈ చివరి దానికి 'కాంతిమతీ సహరాజీయం' అనే పేరు కూడా ఉంది. మధ్యార్జున స్వామి తిరునాళ్ళలో దీన్ని ప్రదర్శించేవారు. మొదటి శ్లోకం–

'సా నందం మణి మచ్ఛీ స్సీమాని వాసన్ వక్షోజ చేలామ్చులం – వ్యాక్రు ష్వాద సలజ్జ మశు వినతగ్రీవం క్రుతస్వస్తి కం'

పరిషదుడు కవిని గూర్చి నాయకుని గూర్చి తెలియ జేస్తాడు–

'నేతా శాహ మహేంద్రో నాటకమతి చిత్ర సంవిధాన పదం – ఏష సభ రసజ్న కవిరపి చాస్యేష చొక్కా నాద సుధీః

కవి రస విలాస భాణందీనికి ముందే రాశాడని సూత్రధారుడికి పారిషదుడికి మధ్య జరిగే సంభాషణలలో కవి వివరాలన్నీ తెలియ జేస్తాడు. భరత వాక్యంలో–

'సంవర్ధతామజస్రం సరస ముదు గిరాం సత్కవీనాం వచాంసి – క్షోణీపాలః సమస్తాః సుకృత పద ముపాశ్రిత్య తిస్టంతు నిత్యం"

సేవాన్తికా పరిణయం నాటకం సుబ్రహ్మణ్య అనే గ్రామంలో సుబ్రహ్మణ్య స్వామి ఉత్సవాలలో ఆడేవారు. బసవరాజుకు మలబారు రాజు మిత్రవర్మ కూతురు సేవంతికకు జరిగే వివాహ కథ. కొచ్చిన్ రాజు గోదావర్మనుయుద్ధంలో ఓడించి మిత్రవర్మ అతడిని ఉడిపి దగ్గరున్న మూకంబిక మందిరంలో బందీగా ఉంచుతాడు. తర్వాత విడిపించటం, పెళ్లి చేయటం. బసవేశ్వరుడు దయ చూపించి, కొత్త

భవనం అందించాడు.
చొక్కనాధుడు తన స్నేహితుడు నీల కంతను గూర్చి చెప్పిన శ్లోకం -
'తిప్పాధ్వరీంద్ర తనయో నను చొక్క నాద నామా విపస్చిదదయ మద్భుత నాటకేన- సంతోష సద్గుణనిధిం బసవ క్షితీంద్ర లబ్దాదికాం స్వపురం ప్రయాత .ఇందులో చొక్కనాధుని తమ్ముడి గురించి చెప్పలేదు.
కవికి శ్రీరామునిపై ఉన్న భక్తికిని తెలియ జేసే శ్లోకం-
'కృపాకటాక్షేణ కృతః క్రుతార్ధో రామేణదీనేక దయా పరేణ-కశ్చిన్ముముక్షుః సుజనా డింద్రరేణుః నామ్నా జగన్నాధ ఇతి ప్రతీతః'. ప్రతి కాండం చివర కవి వంశాన్ని చెప్పాడు. చివరి శ్లోకం-
'అక్కా జగన్నాధ మసూత్ మాతాపితా చ నారాయణా దేవవిధం - తన్నిర్మితే జ్ఞాన విలాస కావ్యే సర్గే యయావస్టంఉత్తమత్వం'

ఇతని 'రస విలాస భాణం' విలక్షణమైనది. ఇతని గిడుగు సదాశివమఖి "రామవర్మ యశో భూషణం" అనే గ్రంథం రాశాడు. దీన్ని 1758- 1798 కాలంలో తిరువాన్ కురు రాజు రామవర్మ కాలంలో రాశాడు.❁

## 166. మంగు లక్ష్మీ నారాయణ (1660)

'గంగావతార చంపు' రాసిన మంగు లక్ష్మీ నారాయణ 1682-1689 ప్రాంత రాజైన మధుర రంగాధిపునికి అంకితమిచ్చాడు. ఇందులో నాలుగు తరంగాలున్నాయి. మొదటి శ్లోకం-
'అవ్యడా వ్యాజ కారుణ్య భావ్యాయ తనతన్వయం - అధ్యాహతర మాసేవ్యమధ్యా హిత పదం మహః
శంతనుని పొగుడుతూ - 'పితా ప్రతీపోపి గుణే రనూనః స్తుతోపి భీష్మః సుజనాగ్ర గణ్యః-బలాత్మికాపి ప్రమాదా తిమన్యేత్యహో మహాన్ శంతన భాగ్య సారః'❁

## 167. రసకల్ప్రద్రుమకర్త- చతుర్భుజుడు (1668)

**ర**స కల్ప్రద్రుమం రాసిన చతుర్భుజ కవి సహిస్టఖాన్‌ను మెప్పించాడు. ఆశక ఖాన్ కొడుకు. ఇతాముదౌలాకు మనవడు చతుర్భుజుడు అని అంటారు. రసకల్ప ద్రుమంలో వెయ్యి శ్లోకాలు, అరవై అయిదు ప్రస్తావాలున్నాయి. సహిస్టఖాన్ గొప్ప సంస్కృత కవి. 1689లో అతను రాసిన శ్లోకాలున్నాయి.❀

## 168. పంచ సాయక రాసిన- కవిశేఖర జ్యోతిరీశ్వరుడు (1670)

**క**విశేఖర బిరుదు పొందిన జ్యోతిరీశ్వరుడు "పంచ సాయకం" రాశాడు. నాలుగు భాగాలు. స్త్రీజాతులు, ఆనంద ధాతువులు, వశీకరణ మంత్రాలు, వీర్య వృద్ధి సాధకాల గురించి చెప్పాడు.

తంజావూర్ షాప్పజీ రాజు ''శృంగార మంజరి'' రాసి అందులో సాహిత్యంతోబాటు కామశాస్త్రాన్ని దట్టించాడు. మన్మధుడు "స్మరదీపిక" (రతి రత్న ప్రదీపిక" రాశాడు. శ్రీనాధభట్టు కామశృంగార విషయాలపై పదహారు అధ్యాయాల గ్రంథాన్ని తంత్రశాస్త్రం ఆధారంగా రాశాడు. ఇంకొక అజ్ఞాతకర్త "కామతంత్ర"ను పధ్నాలుగు అధ్యాయాలలో రాశాడు.❀

## 169. అంతరిక్ష పరిశోధక రాజా జయసింగ్ (1686)

**రా**జా జయసింగ్ 1686లో జన్మించాడు. అప్పటికే మొగలాయీల పాలన క్షీణ దశలో ఉంది. యవ్వనంలో ఔరంగ జేబ్‌తో సాన్నిహిత్యం సంపాదించాడు. విశాల్ ఘర్ ఆక్రమణకు సాయం చేశాడు. మెచ్చిన 'జేబు', 'సవా' బిరుదు ఇచ్చాడు. 1797లో మహమ్మద్ షా పానిపట్టు యుద్ధంలో ఓడిపోయాడు. అప్పుడే జయ సింగ్‌కు అవకాశం వచ్చింది. ఆధునిక ప్రణాళిక ఆధారంగా రాజస్తాన్‌లో జైపూర్ పట్నాన్ని నిర్మించాడు. అంబర్ కోటలో ముస్లిం యువరాణి జయ సింగ్‌ను చంద్రునికి భూమికి యెంత దూరం ఉందని ఒక రోజు హఠాత్తుగా అడిగింది. అప్పటి నుంచి ఖగోళ పరిశోధకుడయ్యాడు.

యలుగ్ బేగ్, టైరో బ్రాహే, జాన్ సలాం స్టేడ్ మొదలైన నిర్మాణ కర్తలకు దీటుగా ఒక ఖగోళ శాస్త్ర పరిశోధకుడిగా, గణిత శాస్త్ర వేత్తగా, జయసింగ్ పేరు పొందాడు. ఒక డిగ్రీకి 'సైన్' విలువ కనుకొన్నాడు. ఈయన కనిపెట్టిన ఒక వందేళ్ళ తర్వాత యలుగ్ బేగ్ ఆ విలువను సాధించాడు. అలమా జెస్ట్, తాబ్యులే అస్త్రానిక మొదలైన గ్రంథాలను సంస్కృతంలోకి అనువదించాడు. జయ సింగ్ మహా రాజు. 1730లో ఒక బృందాన్ని పంపి లిస్బన్ రాజు దగ్గరున్న ఖగోళ శాస్త్ర వేత్త 'జేవియర్ డే సెల్వా'ను దిల్లీకి పిలిపించాడు. షా రాజు కూడా ప్రోత్సహించాడు. జైపూర్‌లో అబ్సర్వేటరి నిర్మాణానికి అనుమతించాడు. దీనితోబాటు వారణాసిలో గంగా తీరంలో, ఉజ్జయినిలో క్షిప్రా నది ఒడ్డున దిల్లీలో జంతర్ మంతర్ అబ్సర్వేటరిలను స్థాపించాడు.

ఢిల్లీలో జంతర్ మంతర్‌లో యంత్ర, మంత్రం పరికరలున్నాయి. కొందరు

బందిపోట్లు దీన్ని ధ్వంసం చేశారు. ఇక్కడ 'సామ్రాట్ యంత్ర', రాం తంత్ర. జయప్రకాష్ తంత్ర, మిశ్ర యంత్ర అనే నాలుగు ప్రధాన నిర్మాణాల అంతర్యం ఈ నాటికీ నిగూఢ రహస్యం గానే ఉంది.

సామ్రాట్ యంత్ర – ఇది సన్ డయల్. కాలాన్ని చెబుతుంది. జయసింగ్ మేధో నిర్మాణం ఇది. రాం తంత్ర – రెండు గోళాకార నిర్మాణాలు. ప్రతిదాని మధ్య ఒక స్తంభం, గ్రహ మండలంలో వివిధ గ్రహాల సమతల కొణాల అధ్యయనానికి గుర్తులు. గ్రహాల స్థితిగతులను ఖచ్చితంగా కనుక్కో వచ్చు. 1818లో ఖగోళ శాస్త్ర వేత్త 'డార్నే' దీన్ని సందర్శించి 'ఒకే సమయం లో వివిధ ఖగోళ శాస్త్ర అధ్యయనాలు చేసిన పొరబాట్లను నిరోధించటానికి, ఫలితాలను పోలిక చేయ టానికి ఈ నిర్మాణాలు చేబట్టిన జయ సింగ్ ప్రపంచ ఖగోళ శాస్త్రానికి మహోపకారం చేశారు' అని కీర్తించాడు.

జయ ప్రకాష్, రామ యంత్ర రెండు కూడా నక్షత్రాలను, గ్రహాలను నిశితంగా పరిశీలించేటానికి వీలు కలిగింది. గిన్నె ఆకారంలో ఉండే ఈ పరికరాలు ఆకాశంలో ప్రయాణించే ఒక వస్తువు ద్రవ్యాన్ని పూర్తిస్థాయిలో గంట గంటకూ గుర్తింపజేస్తాయి.

మిశ్ర యంత్రం – నాలుగు భాగాలున్న యంత్రం. నియమితమైన చక్రభాగంలో ఉండే ధ్రువ రేఖను సూచిస్తుంది. మధ్యాహ్నం 12 గంటలకు యూరప్ ఖండంలో రెండు, జపాన్ ఫసిఫిక్ మహా సముద్రాలలో ఒక్కొక్కటి వంతున నాలుగు స్థానాలకు సంబంధించి ఈ ధ్రువరేఖ సూచిస్తుంది. రెండవ వైపు సామ్రాట్ యంత్ర భాగం, మూడవది దక్షిణోత్తర భిత్తి యంత్రం ఉంది. ఇది మధ్యాహ్న రేఖ యొక్క ఉన్నతాంశాన్ని అంటేఎత్తును తెలియజేయటానికి తూర్పు గోడమీద ఉంది. నాల్గవది కర్కట రాశి వలయ. పడమటి గోడ మీద ఉంది, కర్కాటక రాశిలోకి సూర్య గ్రహప్రవేశాన్ని తెలుపుతుంది.

మిశ్ర యంత్రకు నైరుతి భాగంలో ఉన్న రెండు స్తంభాలు సంవత్సరంలో అతి పెద్ద అతి చిన్న పగటి సమయాల రోజులను తెలుపుతాయి. డిసెంబర్‌లో వీటిలో ఒక స్తంభం తన నీడను పూర్తిగా రెండవ స్తంభం మీదకు ప్రసరింపజేస్తుంది.

జూన్ నెలలో తన నీడను రెండవ స్తంభం పై అసలు పడ నివ్వదు. రాజా జయసింగ్ నిర్మించిన ఈ 'వేధ శాలలు' అంటే అబ్సర్వేటరీలు చాలాకాలం నిరుపయోగంగా పడి ఉన్నాయి. యలుగ్ బేగ్ అధ్యయనాలకు సమంధించిన 'తారా సరణి' గ్రంథాన్ని సవరించి, ఆధునీకరించటానికే ఎక్కువ సమయం ఖర్చు చేశాడు జయసింగ్. కాని గ్రహ కూటమి సంబంధించిన ప్రాచీన అధ్యయనాలు సరియైనవి కావని గ్రహించాడు. భూ అక్షం పరిభ్రమణపై విస్తృత అధ్యయనం చేశాడు.

ఇంత కష్టపడి ఇంత బుద్ధి పెట్టి నిర్మించిన జంతర్‌మంతర్ ఒక అద్భుతంగా మిగిలి పోయిందే కాని జయ సింగ్ ఆశించిన ఫలితాలను ఇవ్వలేక పోయింది. అసలు సంస్కృతంలో దీని పేరు 'యంతర్ –మంతర్' అపభ్రంశం చెంది 'జంతర్ మంతర్' అయింది. ఇప్పుడు ఈ పేరు గారడీకి, కనికట్టుకు పర్యాయపదమై పోయింది. హత విధీ 15–1–2001న ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ జంతర్ మంతర్‌ను దర్శించాడు .దీని నిర్మాణ వైభవాన్ని, ఆలోచనలను మెచ్చుకొన్నాడు దీనికి పునర్వైభవం సాధించాలని హితవు చెప్పాడు. "Einstein had objected strongly to the un certainty principle in physics .,remarking that God did not play dice with the universe .But the evidence is that god is a quiet a gambler .it was necessary to incorporate the un certainty principle into Einstein;s general theory of relativity' అని ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ సదస్సులో 'బిగ్ బాంగ్' అంశం మీద ప్రత్యేక ప్రసంగం చేస్తూ వ్యాఖ్యానించాడు 'సైన్స్ కింగ్ స్టీఫెన్ హాకింగ్'.

జంతర్ మంతర్ నిర్మాణంలో జయసింగ్‌కు సహకరించిన వాడు మన జగన్నాధ పండిత రాయలూ ఉన్నాడు. ఈయన తూర్పు గోదావరిజిల్లా 'ముంగండ' గ్రామస్తుడు. అలభ్యమైన ప్రాచీన గ్రంథాలను తిరిగి సంస్కృతంలో రాసిన దిట్ట. 'సామ్రాట్ సిద్ధాంత' పేరిట గణిత శాస్త్ర పరిశోధన గ్రంథాన్ని రాశాడు పండితుడు. జగన్నాధుని గంగా లహరి రసగంగాధరం అనే అలంకార శాస్త్రం ఆయన వైదుష్యానికి కర దీపికలు. జయసింగ్ నిర్మించిన అబ్సర్వేటరికి తన వంతు

సహకారం అందించిన శాస్త్ర పండితుడు జగన్నాథ పండితుడు. ప్రాచీన కాలంలో 'వైబ్రేషనల్ ఎనర్జి' అంటే మంత్రశక్తి ఆధునిక కాలంలో 'మెకానికల్ ఎనర్జి'గా మారిందని భావిస్తున్నారు. అయిన్ స్టీన్ చెప్పిన'లా ఆఫ్ కన్జర్వేషన్ ఆఫ్ ఎనర్జి 'మన మహా భారతంలో కనిపిస్తుంది ధృతరాష్ట్రుడికి సంజయుడు కురు క్షేత్ర యుద్ధాన్ని దివ్య దృష్టితో హస్తిన నుంచే చూచి వివరించాడు. ఇవాళ మనం అనేక విషయాలను చానెళ్ళ ద్వారా ఎన్నో వేల మైళ్ళ నుండే చూస్తున్నాం. దీనికి అదే మూలం.

అయిన్ స్టీన్న్ గారి "Formula nothing- but atombombs principle- $E=mc^2$" అనేది మన గాయత్రి మంత్రంలోని భావనకు సరిపోతుంది అంటారు. 'వరేణ్యం' అంటే స్క్వేర్. 'సవితు' అంటే 'వెలాసిటి ఆఫ్ లైట్'. ఈ రెంటిని సమన్వయ పరిస్తే ఆయిన్ స్టీన్ భావన అందుతుంది అంటారు.❋

## 170. వీరభద్ర విజయ కర్త ఏకామ్ర నాధుడు (1600–1700)

**కొ**ండవీడులో జన్మించిన ఏకామ్ర నాధుడు 1600– 1700 కాలపు రాజైన ఇమ్మడి అంకుశ మహారాజు ఆస్థానానికి వచ్చాడు. తాను రాసిన 'జాంబవతీ పరిణయం', 'సత్యా పరిణయం' కావ్యాలలో అంకుశ రాజుల చరిత్రను తెలియ చేసాడు. 'వీరభద్ర విజయం' రాసాడు. ప్రతి కావ్యంలోనూ మొదట తమ రాజుల చరిత్రను సుదీర్ఘంగా వర్ణించాడు. అంకుశ రాజ వంశం రాణ వంశం– శూద్ర వంశం.❋

## 171. రసప్రకాశ కర్త – కృష్ణ శర్మ (1600–1700)

**వా**సుదేవ యోగీశ్వరుని శిష్యుడు కృష్ణ శర్మ 'మందారమానంద చంపు' రాసి అందులో ఛందస్సు అలంకారాలు మొదలైన వాటిని చర్చించాడు. ఇది ఒకరకంగా విజ్ఞాన సర్వస్వం. అప్పయ్య దీక్షితులనుండి నిర్వచనాలను గ్రహించి రాశాడు. కనుక పదిహేడవ శతాబ్ది వాడు. ఇతని 'రస ప్రకాశం' మమ్మటుని 'కావ్య ప్రకాశ'కు వ్యాఖ్యానమే.❋

## 172. ఆర్యకుడనే ఘనశ్యామకవి (1700)

**క**మలా కాశీ మహాదేవుల పుత్రుడు ఘనశ్యామకవిని అర్యకుడు అంటారు. ఇతనిది మౌన భార్గవ కుటుంబం. ఇతని సోదరుడు ఈశుడు చిదంబర గురువు వద్ద దీక్ష పొంది దేవి పట్నంలో ఉండిపోయాడు. తాత చౌండ బాలాజీ. తల్లి తండ్రి తిమ్మాజీ బాలాజీకి శాకమ్బరీ పరమ హంస బిరుదు ఉంది.

శ్యామకవికి ఇతని ఇద్దరు భార్యలు సుందరి, కమల. వీరు గొప్ప విదుషీమణులై విద్ధ భంజికకు వ్యాఖ్యానం రాశారు. దానినే మూడు గంటల్లో రాసేశాడు మన కవి. సాహిత్యంలోనే కాక రాజకీయంలోను నిష్ణాతుడు. తంజావూర్ రాజు తుక్కోజి దగ్గర మంత్రిగా 1728–35 మధ్య కాలంలో ఉన్నాడు.

ఇరవై రెండవ ఏట నవగ్రహ చరిత్రను ప్రాకృతంలోను, ఇరవై ఆరవ ఏట మదన సంజీవన భాణం రాశాడు. ఒక్కరాత్రిలో ఉత్తర రామ చరితంపై శ్రీరామ నవమి వ్యాఖ్య రాశాడు. ప్రచండ రాభ్యుదయం అనే మార్మిక కావ్యం రచించాడు. మొత్తం మీద 64 సంస్కృత రచనలు, 20 ప్రాకృత రచనలు చేవాడు. ఇవికాక ఇతర భాషలలో ఇరవై అయిదు గ్రంథాలు రాశాడు. అతని ప్రముఖ కావ్యాలు భగవత్పాద చరిత్ర, వేంకటేశ చరిత్ర, ప్రసంగా లీలార్నవం, సన్మణి మండనం, అన్యాపదేశ శతకం అయిదు స్థల మహాత్మ్యాలు రాశాడు. అబోదాకరణ అనే త్రర్ధి కావ్యం రాశాడు. ఇందులో నల కృష్ణ హరిశ్చంద్ర కథలున్నాయి. సంస్కృత ప్రాక్రుతాలలో కలిదూషణం రాశాడు.

బాల్యంలోనే పన్నెండవ ఏట భోజ చంపువు యుద్ధకాండ రాశాడు. రాసిన అనేక నాటకాలలో గణేశ చరిత్ర, మదన సంజీవన, కుమార విజయం, అనుభవ చింతామణి ఆనంద సుందరి ప్రముఖమైనవి. రసార్ణవం అనే అలంకార గ్రంథం రాశాడు. శాకుంతల ఉత్తర రామ చరిత్ర ప్రబోధ చంద్రోదయం, చండ కౌశిక, మహా వీర చరిత్ర, కాదంబరి, వాసన దత్త, దశ కుమార చరిత్రలకు గొప్ప వ్యాఖ్యానాలు రచించాడు.

ఇతని కుమారుడు చంద్రశేఖరుడు తండ్రి రాసిన డమరుకంపై వ్యాఖ్య రాశాడు. ఇది చాలా విలక్షణమైనది. పది అలంకారాలలో, పది రకాల విషయాలతో, తీర్చిదిద్దాడు. రెండవ కొడుకు గుడ్డివాడైన గోర్ధనుడు ఘట కర్పకునిపై మహా వ్యాఖ్యానం రాస్తూ తన తండ్రి ఘన శ్యాముని కవితారీతిని శ్లాఘించాడు. ❋

## 173. రసప్రపంచం కర్త- వెంకటశాస్త్రి (1700)

**ఆ**నివిల్ల యజ్ఞనారాయణ కుమారుడే వెంకటశాస్త్రి. పశ్చిమ గోదావరి జిల్లా కాకరపర్తి నివాసి. సకల శాస్త్ర వైదుష్యం ఉండటం చేత విజయనగర, దార్లపూడి మహారాజులచేత సన్మానాలందుకొన్నాడు. మహేశ్వర మహా కావ్యం, సతీస్తోత్రం, భాస్కర ప్రశస్తి, రుక్మిణీ పరిణి కావ్యం రాశాడు. అలంకార సుధా సింధు, రస ప్రపంచం అతని శేముషికి నిదర్శనాలు. నూజివీడు రాజు మేకా వెంకట నరసింహ అప్పారావుపై ఉదాహరణలిస్తూ అప్పారాయ వంశ చంద్రోదయం రాశాడు. దీనికి రాజు మెప్పుగా వల్లూరు మిల్లి అగ్రహారాన్ని 1745లో బహూకరించాడు. అక్కడే సోమయాగం చేసి శ్రౌతసూత్రాలుపై విపుల టీక రాశాడు.

ఈయన కుమారుడు నారాయణ కూడా ఇలాగే సాహిత్య కల్పద్రుమం రాసి నూజివీడు జమీందార్ జగన్నాథ అప్పారావుకు అంకితమిచ్చాడు. ఇతని కొడుకు బాలకవి అనబడే వెంకటశాస్త్రి తన చిత్ర చమత్కార మంజరిని పెద్దాపురం రాజు వత్సవాయి తిమ్మ జగపతికి అంకితమిచ్చాడు. సూర్య స్తవం కూడా రాశాడు.❁

## 174. స్వప్న వాసవ దత్తను మొదట గుర్తించిన- శ్రీ యతి రాజ స్వామి (1700)

**శ్రీ** యాదగిరి యతి రాజ సంపత్కుమార రామానుజ అనే శ్రీ యతిరాజ స్వామి మైసూర్‌లోని మెల్కోటే మఠ పీఠాధిపతి. సన్యాసాశ్రమం స్వీకరించటానికి ముందు మైసూర్ పురావస్తు శాఖలో అధికారి. గొప్ప సాహిత్యవేత్త. భామహునిపై చాలా విశ్లేషణాత్మక వ్యాసాలూ రాశాడు. స్వప్న వాసవదత్త నాటకాన్ని మొదటిసారి కనుగొన్నది ఈయనే. శృంగార ప్రకాశలోని కొన్ని అధ్యాయాలను కనుగొని గొప్ప ఉపోద్ఘాతం రాసి ముద్రించిన ఘనత కూడా యతి రాజ స్వామిదే.❁

## 175. సంగీత నారాయణ కర్త-
## గజపతి వీరశ్రీ నారాయణ దేవరాజు (1700)

**ప**ర్లాకిమిడి రాజు పద్మనాభుని కుమారుడే నారాయణ దేవ. వీరిది ఉత్తుంగ జాతి. 1700 కాలం రాజు. కవిరత్న పురుషోత్తముని వద్ద సంగీత విద్య నేర్చి "సంగీత నారాయణం" రచించాడు. దీనిలో సంగీతం నృత్యం, సంగీత వాద్యాలు, సంగీత కూర్పులపై వివరణ ఉంది. ఉదాహరణలు రాజుపై ప్రశంసలే. ఆయన చెప్పిన సంగీత గ్రంథాలైన సంగీత శిరోమణి, సంగీత సారం, సంగీత రత్నమాల, చిత్ర ప్రకాశ, సంగీత చంద్రిక అరుదైనవి.❁

## 176. శృంగార సారం కర్త- చిత్ర ధరుడు (1700)

**"శృ**ంగార సారం" రాసిన చిత్ర ధరుడు ఏడు "పద్ధతులు"లో లోపలి భావోద్వేగాలను వాటి అభివృద్ధిని, సంపూర్ణ ప్రేమను దానికి సంగీతం నృత్యం తోడుపడే విధానాన్ని గురించి విపులంగా వివరించాడు.❁

## 177. విద్వన్మోద తరంగిణి కర్త - రామదేవుడు (1700)

**వా**మదేవ లేక రామ దేవుడు చిరంజీవి పేరుతొ అనేక రచనలు చేశాడు . తండ్రి రాఘ వేంద్ర భట్టా చార్య పేరు మోసిన శతావధాని. మనవడు కాశీనాధుడు బెంగాల్‌లో హస్త సాముద్రిక శాస్త్రవేత్తలలో గొప్పవాడు. రాధాపుర నివాసి. డక్కా నాయబ్ దివాన్ యశ వంత సింహ ఇతని ఏడుగడ. 'వృత్త రత్నావళి' రాశాడు. ఇందులో ఉదాహరణలను దివాన్‌ను కీర్తిస్తూ రాశాడు. 'శృంగార తాతిని', 'కల్పలత', 'శివ స్తోత్రం', 'మాధవ చంపు' 'కావ్య విలాసం' అనే ఛందో గ్రంథం రాశాడు. అతని 'విద్వన్మోద తరంగిణి' చాలా విశిష్టమైన గ్రంథం. హాస్యం, నాటకీయత కలిపి రాశాడు. అనేక వేదాంత ధోరణులన్నీ ఇందులో చూపించాడు.❁

## 178. అద్భుత దర్పణ రచయిత – మహా దేవుడు (1700)

**మ**ద్రాస్ రాష్ట్రంలో పలమనేరు నివాసి కౌండిన్య గోత్రీకుడు కృష్ణ సూరి కుమారుడు మహా దేవుడు. నీలకంఠుని సహవాసి. పదిహేడవ శతాబ్ది వాడు. 'అద్భుత దర్పణం' అనే కావ్యంలో రామ రావణ యుద్ధ పురోగతిని హనుమ లంక నుండి తిరిగి వచ్చిన దగ్గర నుండి అద్భుతంగా వర్ణించాడు.❋

## 179. ప్రహసన కర్త – బొమ్మకంటి అయ్యలనాధుడు (17వ శతాబ్దం)

**బొ**మ్మకంటి అయ్యలనాధుడు లేక తిరుమలనాధుడు 'కుహనా భైక్షవ ప్రహసనం' రాశాడు. దీనిని రాజశేఖర పట్టణంలో స్వామి గోపికా రమణుని ఉత్సవాలలో ప్రదర్శించేవారు. ముస్లిం నాయకుడు అహ్మద్ ఖాన్ వేశ్య చంద్ర లేఖపై వ్యామోహాన్ని ఎండగట్టే వ్యంగ్యాత్మక రచన. ఇందులో ఒలికే హాస్యాన్ని చవి చూద్దాం.

"వేదనామామృత ప్రదాన సమయే సంప్రాప్తకాంతక్రుతిః-లీలావిక్రమ వల్గితస్తన భరే భాస్వద్విభూషావలిః
సాన్తరస్వవచః ప్రపంచ తురస్నిగ్ధా ల్లసా లొకనైః-పశ్యన్నాస వవంచితా సుర గణోనారాయణః పాతునః

సూత్రధారికి నటికి మధ్య సంభాషణలలో రచయిత గురించి కొంత తెలుస్తుంది. చివరలో షండ భిక్ష సంభాషణ ఉంటుంది.

షండ- భో భో గృహాంతరాలస్తితా చంద్ర లేఖా కుపితోతిగ్రుహాన్నిర్గతో హ్మదుఖానః – తదదా భవద్విర వహితైః స్థాతవ్యం
భిక్షు – వత్స కోయమాను రణానమివాహ్మదుఖాన ఘంటాయః – ఈభాషణంలో ఖాను మోహించింది చంద్ర లేఖ అని తెలుస్తుంది.
తెలుగులో కూచిమంచి జగ్గకవి రాసిన 'చంద్ర లేఖా విలాపం' మన అయ్యలనాధునికి ప్రేరణగా కనిపిస్తుంది. ముస్లిం పాలకులు ఆంధ్రాన్ని పూర్తిగా ఆక్రమించిన తర్వాత రాయ బడిన ప్రహసనం గా దీన్ని భావిస్తారు .కనుక అయ్యలనాధుడు 17వ శతాబ్దికి చెందిన వాడని చెప్ప వచ్చు. బొమ్మకంటి వారు గోదావరీ తీరంలోని తెలగాణ్య బ్రాహ్మణులు. ఇదే ఇంటి పేరుతో ఖమ్మం జిల్లాలో నియోగులు కూడా ఉన్నారు.❋

## 180. ఏకాంకిక కర్త – అయ్యవారు శాస్త్రి (17వ శతాబ్దం)

**17**వ శతాబ్ది మధ్యలో కర్నూలు పాలకుడు ఆనంద రావు దేశాయ్ ఆస్థానంలో అయ్యవారు శాస్త్రి ఉన్నాడు. 'సభారంజనం' అని పిలువ బడే 'హితకారి' అనే ఏకాంకిక నాటకం రాశాడు. దీన్ని 29 తాటాకులపై లిఖించాడు. అందులో మొదటి అయిదు పత్రాలు కనిపించలేదు. కనుక కవి గురించి ఆయన పోషకుల గురించి వివరాలు తెలియటం లేదు. లభించిన ఆధారాలను బట్టి సంస్కృతాంధ్రాలలో దిట్టమైన కవి. కందనోలులేక కర్నూలును పాలించిన మహారాష్ట్ర పాలకుడు నిత్యానందరావు లేక ఆనంద రావు దేశాయ్ ఆస్థానకవి. బహుశా ఆనందరావు మహారాష్ట్ర రాజ ప్రతినిధి కావచ్చు. శివాజీ పాలనలో కర్నూలును పాలించిన మరో ఆనందరావు కూడా ఉన్నాడు. ఆనందరావు శివాజీ మహారాజును కీర్తించినందు వలన ఈయనే అయ్యవారు శాస్త్రిగారి పోషకుడు అని భావించారు. మహబూబ్‌నగర్ జిల్లాలో జటప్రోలు సంస్థానంలో 'అయ్యవారు పల్లె' అగ్రహారం ఉంది. ఇది ఈయనకు ఈనాముగా బహూకరించబడి ఉండచ్చు
.

కవి చెప్పిన దాన్నిబట్టి ఇది ఏ రకమైన ఏకాంకికయో తెలియదు. బీజ, ముఖ సంధులు మొదటి అయిదు పత్రాల అలభ్యతవలన తెలియ రావటం లేదు. అంతా వర్ణన మయం. నాటిక చివరి భాగం కూడా స్పష్టంగా లేదు. రసికావతంస అనే ఇందిరా మందిరరాజు, హితకారి అనే రెండే రెండు ముఖ్య పాత్రలున్నాయి. హితకారి అనేవాడు మంత్రి కొడుకు. దౌవారికుడు హితకారిని రాజు సమక్షంలో ప్రవేశపెట్టి నిష్క్రమిస్తాడు. హితకారి, రసికావతంసుడు కలిసి వన విహారం చేస్తారు. వనపాలుడనే తోటమాలి, రాజానుచరుడు కొంత హాస్య సంభాషణ నడుపుతారు. దీనితో కథ సమాప్తం. రాసికావతంసుడు, హితకారి ఒక రోజు కార్యక్రమగా రాజంతఃపురం నుండి వన సందర్శనం చేయటం, కాసేపు

తోటలో తిరిగి, పిచ్చాపాటీ మాట్లాడుకొని మళ్ళీ తిరిగి రావటం ఇందులో కథ. దారిలో వారికి కనిపించిన సకల సజీవ నిర్జీవ విషయాలను వర్ణించాడు కవి. శాస్త్రి గొప్ప పండితకవి అనిపిస్తాడు. వైశేషిక న్యాయం నుంచి వైద్య శాస్త్రం వరకు ఆయనకు ప్రతి విషయంలోను లోతైన పరిజ్ఞానం ఉందని తెలుస్తుంది. ఇద్దరూ బయల్దేరేముందు వారి వేషధారణ రసికుడు అద్దంలో తన అందాన్ని చూసుకోవటమూ వర్ణించాడు – మనమూ ఒక సారి ఆ అద్దంలోకి తొంగి చూద్దాం – ఆదర్శ న భవతే దర్శనతోస్తః ప్రవేశ యసి సర్వాన్ – యస్య ముఖ శ్రీ ర్లోకే తస్య బేర్ సర్వలోకాఃస్యుః

రాజు తన ముత్యాల కర్ణా భరణాన్ని చూస్తూః ముక్త ఫల ముఖో ల్లాస కరే రాజం అవోగ్రగః

సువృత్త చతురాకారో న కః ప్రభుహితో భవేత్ అంటాడు. తోటకు వెళ్లేముందు హితకారి తమ ఇందిరామందిర పట్టణ వైభవాన్ని వర్ణిస్తాడు

శ్రీ మత్సర్వ పురీ రమా విజయ లక్ష్మీ లక్షణ ప్రభవా–సీమాన్తాయితసూర్య సోమ సరణీ శృంగార రంగన్ముఖా

సత్ప్రాకార నితంబ బింబ రశనా కల్పాయిత స్వర్ధునీ – మేధ్యాసౌ న కదం హిసర్వ విబుధ శ్రీ మందిరేయం పురీ అని దాని శోభను వర్ణిస్తాడు.

వనంలోకి ప్రవేశించాక కనబడిన ప్రతి వృక్షాన్ని వర్ణించాడు కవి. ఈ వర్ణనలలో శాస్త్రీయ కోణమూ ఉంది. అశ్వత్థ నింబ, వట, తింత్రిణి, కపిత్త, బిల్వ, ప్లక్ష, ఉదుంబ చూతమొదలైన వృక్ష వర్ణన ఉంది. తరువాత కనిపించిన సింహ శార్దూల కురంగ వనావర్త, మున్నగు జంతువర్ణన చేశాడు. అప్పటికే మధ్యాహ్నమైంది. అక్కడ భవానీ దేవాలయంలో అమ్మవారికి పూజ చేశారు. అప్పుడు అక్కడి సరోవరంలో విహరించే హంస, కుముద మత్స్య, చాతక చకోర చక్రవాక పక్షుల వర్ణనా పనిలోపనిగా కానిచ్చేశాడు. చకోరపక్షి వర్ణ చూడండి –

"చకోరే తారకోదార యోగో యస్తోనిరంతరం – నహి చే చ్చంద్రికా పానంకదం ఖేచరముద్రయా"

ఇంతలో కొన్ని మాటలు వినిపిస్తే అవి వనపాలురు రాజును చూడాలనే ఉత్సాహపు మాటలంటాడు హితకారి. వాళ్ళు రాజుకు ఫలాలు పుష్పాలు కానుకగా సమర్పిస్తారు. వాళ్ళు తెచ్చిన ఖర్జూర ద్రాక్ష, మాతలుంగ దాడిమి మొదలైన ఫలవర్ణన తర్వాత మల్లికా, గంధఫలి (సంపెంగ ) కేతకీ పుష్ప వర్ణన చేస్తాడు. మిట్టమధ్యాహ్నమైన ఉక్కపోస్తోంది రాజుగారికి విసరటానికి వింజామర వర్ణన చేశాడు కవి. చమట

పట్టింది కనుక స్నానం చేయాలి. ఆ తతంగాన్నీ బాగానే పూర్తి చేశాడు. చండీ ఆలయంలో పూజారి వీరికోసం ఎదురు చూస్తున్నాడు. వెళ్లి పాల్గొన్నారు. భవానీ దేవిని కవి వర్ణించాడు–

"అంబ జగతో వలంబ నమంబాత్వే నైవ విహితామిహ భూయః – అవలంబయ మాం కృపయే త్యుక్తిః పునరుక్తమితిమయానోక్తా" అని వరుసగా అయిదు శ్లోకాల ప్రార్ధన చేశాడు. అమ్మవారి ప్రసాద స్వీకారం తర్వాత భోజనాలకు ఉపక్రమించారు. భోజన సామాగ్రినంతా వర్ణించాడు. తినుబండారాల వర్ణనా నోరూరిస్తుంది. పాటోలఅంటే పొట్లకాయ వర్ణనా ఉంది – "పాటోలాదీర్ఘ క్రున్యాపి లాఘవం కేన సాధితం – పాషాణ వహనాదిభ్యః కిమార్జితాం"
గుమ్మడికాయ అంటే కూష్మాండాన్ని అంతే రుచిగా వర్ణించాడు – "కూష్మాండ సర్వమధురోప్య బలాదుర్భఘసాగ్రు ప్రుత్తోసి – బాల్యే సర్వ పిధ్యం భవదాచారణం కిమేత దుపపన్నం

ఇవన్నీ 24 ఆకులలో ఉన్నాయి చివరి 25వ పత్రం లభ్యం కాలేదు. 26లో తిరుగు ప్రయాణ వర్ణన ఉంది. దారిలో స్త్రీ, అంతఃపుర, సింహాసనం కళ్ళజోడు, కలం, రాసే వస్తువులు, దీపం, కత్తి మొదలైన వర్ణన ఉంటుంది. తర్వాత రాజు కళావతితో కాలక్షేపం చేసే సమయమైనదని హితకారి గుర్తు చేస్తాడు. కళావతి రాణి అని మనకు అప్పుడు తెలుస్తుంది. చివరకు హితకారిరాజును ఆశీర్వదిస్తాడు.

"రాజన్ సామ్రాజ్య లక్ష్మీ విభవావిలాసితః సర్వ దిక్కుమ్బి కుంభ – ప్రోదాన్ముక్తా ఫలశ్రీ సహచర యశసా ఖ్యాత విద్రుద్రజ శ్రీ" దీనికి జవాబుగా రాజు– "జయంతి బహుదా సుధా మధుర బంధుతా బంధుర – ప్రబంధ రచనా చమత్కృతి కృతార్ధ స్వే భవాః
ప్రసూన చయ సౌరభేః ప్రసవి ధేను దుగ్ధ దాన్చితే – ర్వచో భి రభిత స్తుభాం ప్రభావ ఏవ సంభావితం".
రాజును తనకు సెలవిప్పించమని హితకారి కోరటం, ఇతనికోసం ఇంటిదగ్గర భార్య కృపావతి ఎదురు చూస్తూ ఉండటంతో ఏకాంకిక పూర్తి అవుతుంది. బిరుదు రాజు వారు దీన్ని 'వీధి' అనే నాటక భాగంగా పేర్కొన్నారు. నాకేమో ఇది ఒక 'ట్రావేలోగ్' అంటే పిక్నిక్ లాగా ఉందని పించింది. ఏమైనా అయ్యవారు శాస్త్రి తానొక 'గైడ్'గా వ్యవహరించి కథ నడిపించాడు. ఒక కొత్త ప్రయోగం అనిపించాడు. ❋

## 181. ఎలకూచి బాల సరస్వతి (17శతాబ్దం)

కౌండిన్య గోత్రానికి చెందిన ఎలకూచి కృష్ణ దేవుని పుత్రుడు, భైరవార్య మనవడు బాల సరస్వతి కవి. 17వ శతాబ్దం వాడు. తెలుగు సంస్కృతాలలో చాలా రాశాడు. మహోపాధ్యాయ బిరుదున్నవాడు. మహబూబ్‌నగర్ జిల్లా జటప్రోలు సంస్థాన కవి. వ్యాకరణ పండితుడు. రాఘవ యాదవ పాండవీయ త్ర్యర్ధి కావ్యం రాశాడు. భర్తృ హరి సుభాషితాలను తెలుగు చేసి సురభి మల్ల భూపాలుడికి అంకిత మిచ్చాడు. ఈ కవి సంస్కృతంలో 'దశావ తార స్తోత్రం' రాశాడు. చాల క్లిష్టాన్వయంతో ఉంటుంది. ప్రతి శ్లోకాన్ని ఒకే సమాసం తో రాయటం బాల సరస్వతి ప్రత్యేకత.

'సాదీయో ముఖ పూరితో ద్వమి తతాసత్యోద్వ గోదన్వద-ర్ణాధారా ంతరటక్తిమంగల
ప్రోద్దాన నిధ్యానల
బ్ధ్వాదీశ ప్రభుతాస్వ భాగ హరణార్యయాయీ ప్రూజాన్కరీ -ప్రాదాన్యాటి విలోల
లవాద్రు గబట బ్రహ్మన్ స్తుమస్త్వా మనున్'

చివరగా-

'స్వ మహా బహు కృపాణక్రుత్తగల గుంచా మ్లొచ్ఛా వీరచ్ఛితేఃత్ర్యణాపాదిన పంక్తి
నీరమణామధ్యాచ్ఛిద్ కష్యామికో
ద్రమక్లుప్తా సమయే పరాగమతి కక్ష్మాస్తాన గంగానదీ -భ్రమ కృ త్తిక కల్కి మూర్తేక
పరబ్రహ్మన్ స్తుమాస్తస్త్వా మనున్.

తెలుగులో లాగానే యతి ప్రాసలను పాటించాడు. దీనికి సంస్కృతంలో కురవి రామ కవి వ్యాఖ్యానం రాశాడు. ❁

## 182. రత్న ఖేటుడు అనే అభినవ భవ భూతి - శ్రీనివాస దీక్షితులు (17వ శతాబ్దం)

**భా**వస్వామి కొడుకు కృష్ణకవి మనవడు శ్రీనివాస దీక్షితులు భావ స్వామికి ఆరవ తరం వాడు 'భాష్య' రచయిత. విశ్వామిత్ర గోత్రం. ఇతనికి ముగ్గురు కొడుకులు కేశవ అర్ధనారీశ్వర, రాజ చూడామణి. సాయంకాల దిక్చక్రాన్ని అద్భుతంగా వర్ణించినందుకు చోళరాజు 'రత్నఖేట' బిరుదాన్నిచ్చాడు. ఆ పేరే నిలిచిపోయింది. అప్పయ్య, గోవింద దీక్షితులకు సమకాలీనుడు. 'షడ్భాష చతుర', 'అద్వైత విద్యాచార్య', అభినవ భవ భూతి 'దంతిజ్యోతి దివా ప్రదీపు' అనే గోప్ప బిరుదులూ అందుకొన్నాడు. గొప్ప పండిత విజ్ఞాని. వేదాంతంపై విస్తృత రచనలు చేశాడు. పద్దెనిమిది నాటకాలు, అరవై కావ్యాలు రాసినట్లు తెలుస్తోంది. శివలీలలను వర్ణిస్తూ 'సితికంఠవిజయం' రాశాడు. దమయంతీ పరిణయాన్ని 'భైమపరిణయం' అనే నాటకంగాను, రుక్మిణీ కల్యాణాన్ని 'భైష్మిపరిణయం' చంపువును రాశాడు. అతని 'సాహిత్య సంజీవిని', 'భావోద్బేధీ', 'రసార్నవ', 'అలంకార కౌస్తుభ', 'కావ్య దర్పణ', 'కావ్య సార సంగ్రహ', 'సాహిత్య సూక్ష్మ సరణి' అలంకార గ్రంథాలు. జింజి రాజు సూరప్ప కోరితే 'భావనా పురుషోత్తమ' అనే దృష్టాంత నాటకం రాశాడు. ❁

## 183. నైషధ పారిజాత కర్త - కృష్ణాధ్వరి (17వ శతాబ్దం)

**ర**ఘునాథ రాయలు రాజ్యంలో కృష్ణాధ్వరి లేక కృష్ణ దీక్షిత, లేక అయ్యదీక్షితులు ఉండేవాడు. ఈ కవి 'నైషధ పారిజాతం' అనే ద్వ్యర్ధి కావ్యం రాశాడు. ఇందులో నల చరిత్ర పారిజాతాపహరణం కథలను జోడించాడు. అలాగే 'రఘునాధ భూపతీయం' అలంకార గ్రంథంలో తన ప్రభువు రఘునాధ రాయలను శ్లాఘించాడు.

ఇతని కుమారుడే మృత్యుంజయుడు. గురువు రాజ చూడామణి దీక్షితుడు. ఇతని 'ప్రద్యుమ్నోత్తర చరిత్ర' అనే పదకొండు కాండల కావ్యంలో వజ్రపురి రాక్షసుని కుమార్తెకు ప్రద్యుమ్నునికి జరిగిన వివాహాన్ని గురించి రాశాడు. మృత్యుంజయుని కొడుకు అనంత నారాయణుడు జయ దేవుని గీత గోవిందంలాంటి 'గీతా శంకరం' అనే సంగీత రూపకం రాశాడు. ❁

## 184. కావ్య దర్పణ రచయిత - రాజ చూడామణి (1636)

**ర**త్న ఖేట శ్రీనివాస, కామాక్షిల పుత్రుడు రాజ చూడామణి. తంజావూర్ పాలకుడు రఘునాధరాయల ఆస్థాన కవి. 'రఘునాధ భూప విజయం' రాశాడు. కవిత్వంలో తండ్రికి తగ్గ కొడుకు. మీమాంసలో గొప్పవాడు. అనేక కావ్యాలు, నాటకాలు, అలంకార గ్రంథాలు రచించాడు. 1636లో జైమిని సూత్రాలకు 'తంత్ర శిక్షా మణి వ్యాఖ్య రాశాడు. 'రుక్మిణీకలాపం' అనే పదికాండల కావ్యం రుక్మిణీదేవి చరిత్ర. 'శంకరాభ్యుదయం' రాశాడు. కాని ఆరు అధ్యాయాలే దొరికాయి. 'భారత చంపు, 'కంస వధ ', 'వృత్త రత్నావళి ', 'సాహిత్య సామ్రాజ్య', 'చిత్ర మంజరి' కూడా అతని రచనలే. ఇందులో వృత్త రత్నావళి శంకరాచార్యుల 'తారావళి'కి అనుసరణ. యమక కావ్యంగా 'రత్న ఖేట విజయం' రాశాడు. ఇది తండ్రి కవితా ప్రతిభకు నీరాజనమేకాక త్ర్యర్థి కావ్యం. ఇందులో శ్రీ రామ శ్రీ కృష్ణ, పాండవ కథలున్నాయి. ప్రత్యక్షర శ్లేష వైభవంతో 'మంజు భాషిణి' అనే గద్యరచనా చేశాడు. భోజుని రామాయణ చంపు దీనికి ఆధారం. రామాయణ యుద్ధ కాండ కథ.

'శృంగార సారస్వత' అనే భాణం కూడా రాజ చూడామణి రాశాడు. ఆనంద రాఘవ అనే అయిదు అంకాల నాటకమూ రాశాడు. సీతారామ కల్యాణం నుంచి పట్టాభిషేకం దాకా కథ ఉంది. 'కమ లిని కల హంస' అనే నాలుగు అంకాల నాటకం 'కమలాకరుని కూతురు కమలినికి, కలహంసకు జరిగిన వివాహమే కథ. ఈ నాటకాలు రఘునాధుని ఆస్థానంలోను చిదంబరంలోను ప్రదర్శింపబడేవి. తన కావ్య దర్పణంలో అలంకార చూడామణి విషయం ప్రస్తావించాడు. ❀

## 185. శివ తత్వ రహస్యం కర్త– నీల కంఠ లేక అయ్యదీక్షితులు (1637)

**నా**రాయణ భూమిదేవిల కుమారుడు నీల కంఠుడు. అప్పయ్యదీక్షితుని తమ్ముడు అచ్చుతి కిస్టకు మనవడు. అయ్యదీక్షితులుగా ప్రసిద్ధి గోవింద దీక్షితుల కుమారుడు వెంకట మఖి వద్ద విద్య నేర్చాడు. 'కైయాట'పై విమర్శ రాశాడు. శ్రీకంఠ వేదాంతంలో లోతులు చూసినవాడు. 'శివ తత్వ రహస్యం' రాశాడు. తాని నలుగురు సోదరులూ మహా కవులే. ఇతని 'నీల కంఠ చంపు' పాలసముద్ర మధనం, అందులో హాలాహలం రావటం శివుడు మింగటం కథ. దీన్ని 1637లో రాశాడు. 'శివలీలార్నవ' ఇరవై రెండు కాండలలో శివుని అవతారమైన మధురలో అర్చింపబడే హల్సాశ్వనాధకు సంబంధిన ఆరవైనాలుగు లీలలను వర్ణించాడు. 'గంగావతరణం' ఎనిమిది కాండల కావ్యం. దివిజ గంగ భూమిని చేరిన కథ. 'కలివిదంబన', 'సభారంజన', 'అన్యాపదేశ శతకం', 'శాంతివిలాసం', వైరాగ్య శతకం', 'ఆనంద సాగరసస్తత్వం' మొదలైనవి మిగిలిన వైవిధ్య రచనలు.

అయ్య దీక్షితుల 'చిత్రమీమాంస దోషాధికారం'లో జగన్నాధ పండితరాయల సిద్ధాంతాలను విమర్శిస్తూ అప్పయ్య దీక్షితుల సిద్ధాంతాలను అన్నిటినీ సమర్ధించాడు. 'ఏడు అంకాల'నల చరితాంతకం" నాటకం రాశాడు. కవిగా గొప్ప పేరు సంపాదించాడు. అతని ఊహలు అద్భుతం ఉత్ప్రేక్షలు నిరుపమానం.

ఇతని మూడవ కుమారుడు గీర్వాణేంద్రుడు, 'శృంగార కోశ భాణం' రాశాడు. అన్యాపదేశ శతకమూ చేశాడు. ఇతని నలుగురు సోదరులూ కవులే. ఇందులో అతిరాత్ర యజ్నుడు 'కుశకుముద్వతీయం' అనే నాటకం రాశాడు. అచ్చ దీక్షితులు అతని నల చరిత్ర నాటకంపై వ్యాఖ్యానం రాశాడు.❁

## 186. చిత్ర రత్నాకర హాస్య కవి - చక్రకవి (17వ శతాబ్దం)

**లో**కనాధ అంబల కుమారుడే చక్రకవి. పతంజలి రామచంద్రుల సోదరుడు. పాండ్య, చేర రాజులు తనని ఆదరించారు. నీలకంఠ దీక్షితులు మెచ్చినకవి. పదిహేడవవ శతాబ్దంవాడు. 'ఆశువుగా ధారాళంగా రుక్మిణి జానకి గౌరీ, ద్రౌపదిల కళ్యాణాలను వర్ణించాడు. ఎనిమిది కాండల 'జానకీ పరిణయం' ఇందులో భాగమే. మిగిలినవి పద్య గద్యాత్మకం 'చిత్ర రత్నాకరం' హాస్య పూరిత రచన. శ్లోకంలో మొదటి భాగం ప్రశ్న రెండవ భాగంలో సమాధానం రాశాడు.❋

## 187. రామభద్రుని శిష్యకవులు (17వ శతాబ్దం)

**రా**మభద్రుని శిష్యులలో వేంకటేశ్వరుడు పతంజలి చరిత్రకు భాష్యం రాస్తే, మరో శిష్యుడు భూమినాధ అనే నల్ల దీక్షితులు షాహాజీ జీవితంపై 'ధర్మ విజయ చంపు' రాశాడు. షాహాజీని కవి 'అభినవ భోజుడు' అన్నాడు. వెంకటాద్రి మంగంబల కొడుకైన వెంకటకృష్ణ ఏడు కాండల 'నటేశ విజయం' కావ్యం రాశాడు. ఇతనిది వాదూలస గోత్రం. చిదంబరంలో శివుడు కాళిని తరిమేసి ఆనంద తాండవం చేసిన కథా వస్తువు. శివాజీ రాజ్య పరగణాలలో చిదంబరం దగ్గర ఒక దాని ఏలిక అయిన గోపాలుడు ఈ కవిని ఆదరించాడు. భోజుడు లక్ష్మణుడు రాసిన ఉత్తర చంపూ రామాయణానికి కొనసాగింపుగా 'రామ చంద్రోదయం' రాసి రామాయణ కథ అంతా చెప్పాడు. 'కుశలవ విజయ నాటకం' కూడా రాశాడు.❋

## 188. శతకాలు రాసిన - శ్రీధర వేంకటేశ కవి (17వ శతాబ్దం)

**శ్రీ**ధర వేంకటేశ అనే మరో కవి 'అయ్యవాల్'గా ప్రసిద్ధుడు. ఈయన పవిత్రతకు సదాచారానికి పేరెన్నిక గన్నవాడు. మత సంబంధమై అనేక రచనలు చేశాడు. వాటితో బాటు 'దయాశతకం' మాతృ భూత శతకం, 'తారావళి శతకం', 'ఆర్తిహరస్తోత్రం' కూడా రచించాడు. ఇతని 'సహేంద్ర విలాసం' ఎనిమిది కాండల కావ్యం. ఇందులో తంజావూర్ ప్రభువు షాహాజీ జైత్రయాత్రలు దక్షిణ భారతంలో ఆయనచేసిన హైందవ ప్రచారం ఉన్నాయి.❋

## 189. కవి తార్కిక సార్వభౌమ – అప్పా దీక్షితులు లేక అప్పాశాస్త్రి లేక పెరియ అప్పశాస్త్రి (17వ శతాబ్దం)

**చి**దంబర దీక్షితుని (అన్నన్ శాస్త్రి) కుమారుడు. విశ్వనాధుని సోదరుడు భారద్వాజ గోత్రీకుడు. తంజావూర్ దగ్గర కిలయూర్ నివాసి. వేంకటపతి రాజాస్థానంలో కంపదేవుడిని వాదంలో ఓడించాడు. రాజు మెచ్చి బంగారు పల్లకిని ఎరాకరన్ అనే అగ్రహారాన్ని కానుకగా ఇచ్చాడు. కృష్ణానందుని శిష్యుడైన ఇతను గురువును ఛందశ్శాస్త్ర, భాషా శాస్త్రాలలో ప్రతిభతో మెప్పించి 'కవి తార్కిక సార్వభౌమ' బిరుదు పొందాడు. శాహాజీకి అమిత ఇష్టుడు. ఇతని 'శృంగార మంజరీ శాహజీయం నాటకం' షాహాజీ రాజు జీవిత చరిత్ర. తిరువయ్యార్‌లో దీనిని చైత్రమాస ఉత్సవాలలో ప్రదర్శించారు. 'మదన భూషణ భాణం', 'గౌరీ మయూర చంపు' ఇతర రచనలు.

అద్భుత దర్పణం అనే పది అంకాల నాటకంలో కృష్ణసూరి కొడుకు మహాదేవుడు రామాయణ కథలో అద్భుత రసాన్ని బాగా పండించాడని తెలిపాడు.

షాహాజీ శరభోజీల ఆస్థానంలో ఎందరో ప్రసిద్ధ కవులున్నారు. సుమతీంద్ర భిక్షు షాహాజీ ఆస్థాన కవి. యితడు వెంకట నారాయణ సుదీన్ద్రుల శిష్యుడు 'సుమతీంద్ర జయ ఘోషణం'ను రాజుపై రచించాడు. త్రివిక్రమకవి 'ఉషా హరణం'పై వ్యాఖ్య రాశాడు. 'షాహ విలాసం' అనే సంగీత రూపకం 'అభినవ కాదంబరి' కూడా రాశాడు. ముద్రారాక్షస నాటకంపై గొప్ప వ్యాఖ్యానాన్ని దుండిరాజ వ్యాస యజ్వ రాశాడు. ఇతడు కవి లక్ష్మణుని కుమారుడు. దీన్ని శరభోజి ప్రేరణతో రాశాడు. జగన్నాధ కవి 'జనన విలాసం' అనే ఎనిమిది కాండల కావ్యాన్ని భద్రపరచాడు. జగన్నాధ కవి నారాయణ, అక్కా దేవిల కుమారుడు. ఇతడే 'శరభ రాజ విలాసం' కర్త కూడా.❁

## 190. కోసల భోసలీయం కర్త – శేషాచలపతికవి (17వ శతాబ్దం)

**త**న ఆరుకాడల 'కోసల భోసలీయం' కావ్యంలో శేషా చలపతి కవి షాహాజీ రాజు చరిత్రను రామ కథతో జోడించి ద్వ్యర్థికావ్యంగా చెప్పాడు. నైద్రువ కాశ్యప గోత్రానికి చెందిన వేంకటేశ కవి 'భోసల వంశావళి' చంపు కావ్యంలో శరభోజి రాజు పూర్వీకుల చరిత్ర వర్ణించాడు. శరభోజి పాలనపై మరింత వెలుగులు కుమ్మరించాడు. 1722లో కావాల కుటుంబానికి చెందిన శ్రీనివాసుని కొడుకు జగన్నాథకవి 'శరభ రాజ విలాసం', 'అనంగ విజయ భాణం', 'శృంగార తరంగిణి' రచించాడు. ❁

## 191. త్రయంబక కుటుంబ కవులు (17వ శతాబ్దం)

**ఏ**కోజిమహా రాజ కుటుంబం దక్షిణ భారత దేశంలో నాయక రాజులు ప్రారంభించిన సంస్కృత భాషా వ్యాప్తికి అవిరళ కృషి చేశారు. రాజులు మంత్రులు కూడా కవులే కావటం అదృష్టం. మంత్రులు త్రయంబక బ్రాహ్మణ కుటుంబం నుంచి వచ్చిన వారే కావటమూ కలిసొచ్చింది. గంగాధరకవి 'భోసల వాంశావలి'లో భోసల రాజుల చరిత్ర వర్ణించాడు. రెండవ త్ర్యంబకుడు 'ధర్మ కూట' అనే వ్యాఖ్యానాన్ని రామాయణంపై రాశాడు. భగవంతకవి 'ముకుంద వల్లీశ' కావ్యం పదికాండల్లో శ్రీ కృష్ణునిపై రాశాడు. ఇతడే 'రాఘవాభ్యుదయం' నాటకం కూడా రాశాడు. భగవంత కవి గంగాధరాధ్వరి కొడుకు, త్ర్యంబకునిడికి చివరి తమ్ముడు. ఉత్తర రామాయణం ఆధారంగా 'ఉత్తర చంపు' రాశాడు. ఆనంద లేక ఆనంద రాయ మఖి 'విద్యా పరిణయం', 'జీవానందం' అనే రెండు నాటకాలను ప్రబోధ చంద్రోదయం లాగా నర్మగర్భంగా రాశాడు. మొదటి దానిలో జీవాత్మ వివాహం ఉంది. విద్య అంటే ఆధ్యాత్మిక విద్యగా భావించి రాశాడు. నృసింహ కుమారుడు ఆనందకవి 'త్రిపురా విజయ చంపు' రచించాడు. ఈ విధంగా త్ర్యంబకుని కుటుంబంవారు అందరూ గొప్ప కవులై గీర్వాణ రచన చేశారు. ❁

## 192. కృష్ణ గీతి రాసిన - రాజా మనవేద (17వ శతాబ్దం)

**కా**లికట్ రాజు జమోరిన్ మన వేద లేక ఎరాల్పట్టి రాజా నారాయణ కవిపై గొప్ప అభిమానం కలవాడు. కవి రచనలన్నీ చదివి అర్థం చేసుకున్నాడు. 17 వ శతాబ్ది వాడు. మానవేద రాజు "కృష్ణ గీతి" లేదా "కృష్ణ శతకం" రాసాడు. దీనితో పాటు "మన వేద చంపూ భారతం" కూడా రచించాడు. చంపూ రామాయణంపై వ్యాఖ్యానమూ రచించాడు. మనవేద రాజుకు, చంద్రలేఖకూ జరిగిన వివాహాన్ని రుద్ర దాస కవి తన "సత్తాక చంద్రలేఖ" లేక "మనవేద చరిత"లో వర్ణించాడు.❋

## 193. వైజయంతి (17వ శతాబ్దం)

**మూ**రభట్ట కుమార్తె అయిన వైజయంతి ఫరీద్పూర్ జిల్లాలో ధనూకాలో జన్మించింది. కోటలిపదపు చెందిన దుర్గా దాసు కుమారుడు కృష్ణనాధుని భార్య. 17వ శతాబ్దపు మధ్య భాగంలో ఉండేది. తండ్రి వద్ద సంస్కృతం నేర్చి మీమాంస శాస్త్రంలో ఉద్దండురాలైంది. ఒకసారి భర్త శిష్యులకు తప్పుగా పాఠం బోధిస్తుంటే సరి చేసింది. అద్భుతమైన కవిత్వం రాసింది. అదంతా "భర్త రాసిన ఆనంద లతికా చంపూలో" కలసిపోయింది. ఈ రచనలో ఆమె భాగస్వామ్యాన్ని భర్త అంగీకరించాడు. ఒకసారి భర్త ఒక నాయికను వర్ణిస్తూ కవిత్వం ఆగిపోతే వైజయంతి అద్భుతంగా దాన్ని పూర్తి చేసింది.

తూర్పు బెంగాలుకు చెందిన పూర్వపు విశ్వకోశం అనే పత్రికలో సంపాదకుడు జయంతి ప్రతిభను వర్ణించాడు. ఆమె రాసిన గొప్ప కావ్యాన్ని పండిత అమూల్య చరణ్, విద్యా భూషణ్ లు చూశారని తెలియచేసాడు. విద్యా భూషణుడు బెంగాల్ సాహిత్య పరిషత్‌కు ఉపకార్యదర్శి.

మలబారుకు చెందిన మనోరమ, సుభద్ర, రాజశేఖరుని భార్య అవంతీ సుందరి, ఘనశ్యాముని భార్యలు సుందరి, కమల గొప్ప కవయిత్రులుగా గుర్తింపబడ్డారు. గంగా దేవి, మధురవాణి, తిరుమలాంబ గురించి ముందే తెలుసుకొన్నాం.❋

# 194. భూవరాహ విజయం రాసిన శ్రీనివాస కవి (17వ శతాబ్దం)

**కౌ**ండిన్య గోత్రీకుడు శ్రీ ముస్నం గ్రామ కాపురస్తుడు వీరవల్లి కుటుంబానికి చెందినవాడు 17వ శతాబ్దికి చెందిన వాడు. వరద అని పిలవబడే శ్రీనివాస కవి 8 కాండలలో 'భూవరాహ విజయం' కావ్యం రాసాడు. వరాహ అవతారం దాల్చిన విష్ణువు శ్రీ ముస్నంలో దండకుని తండ్రిని సంహరించి భూవరాహ రూప విష్ణువు లక్ష్మిని వివాహమాడటం కథ. చాలా రచనలు చేసినట్లు ఉన్నప్పటికీ అంబుజవల్లి దండకం, శ్రీ వరాహ చూర్ణిక, ధ్యాన చూర్ణిక శ్రీ రంగ దండకం వచనాలలో రాసాడు. అంబుజవల్లీ పరిణయం, వరాహ విజయం వరాహ చంపు , వకుళ మాలినీ గీతా పరిణయం, సీతా దివ్య చరిత్ర మొదలైన కావ్యాలు రాసాడు. మాఘ కావ్యాల మీద రఘువంశ నైషధ అమరుకాల మీద మంచి వ్యాఖ్యానాలు రచించాడు.

ఇతని కుమారుడు వరద దేశికుడు కూడా గొప్ప కవి. 'లక్ష్మీ నారాయణ చరిత్ర, రఘువర విజయం, రామాయణ సంగ్రహం, అంబుజవల్లీ శతకం, శ్రీ వరాహ శతకంతో పాటు, 'గద్య రామాయణము' రచించాడు. ఇతని కొడుకు, మనమడు గొప్ప కవులే.❁

## 195. మాడభూషి నరసింహాచార్యులు (17, 18వ శతాబ్దం)

శ్రీవైష్ణవులైన మాభూషి నరసింహాచార్యులు పండిత వంశంలో జన్మించారు. వీరి మూలపురుషుడు వెంకటాచార్యులు ఎనిమిది భాషలలో పండితుడు. పురాణ శాస్త్రాలలో అపార ప్రజ్ఞ కలవాడు. ప్రతి వాద భయంకర బిరుదున్నవాడు. మహారాజులు ఈయన పాద పూజ చేసేవారు. చాలా గ్రంథాలు సంస్కృతంలో రాశాడని చెబుతున్నా ఏవీ లభ్యం కాలేదు. ఆయన జీవించిన 17, 18 శతాబ్దాల కాలం ఒక అద్భుత అధ్యాయమే. వీరికి తొమ్మిది మంది కుమారులు. అందులో శ్రీనివాసాచార్యులు మహా పండిట్. అతని కొడకుకు వేంకటాచార్య పేరు పెట్టారు. ఈయనకు అయిదుగురు కొడుకులు. అందులో వేదాంత దేవికులు కుశాగ్రబుద్ధి. ఈయనా అష్ట భాషా పాండిత్యమున్నవాడే. న్యాయ ధర్మ వేద వేదాంత పురాణాలలో సిద్ధహస్తుడు. విద్వద్గజం బిరుదు రాజాస్థానంలోను, పండిత కవి అని యువరాజు సభలో, సదరమీను అని ఆంగ్లేయ కోర్టులలో పేరు పొందాడు. సర్వ స్వతంత్రుడు. ఇంగ్లీష్ కూడా నేర్చాడు. బ్రాహ్మణ సభ బృహస్పతి అని కీర్తించింది. ఈ వేదాంత దేశికాచార్యుల కొడుకే నరసింహాచార్యులు. నరసింహి దేశికులు అని గౌరవంగా పిలువబడేవాడు. తండ్రికి తగ్గ కొడుకే కాదు మించిన వాడు కూడా.

నరసింహాచార్యులు 1799లో పుట్టాడు. తండ్రి, గురువుల వద్ద సర్వ విద్యలు నేర్చాడు. వైనతేయుని అనుగ్రహంతో సంగీతా సాహిత్యాలలో ఎదురులేని వాడనిపించాడు. (వేదాత్మా విహగేశ్వరో) వసు చరిత్ర పద్యాలను వీణపై అతి శ్రావ్యంగా ఆలపించే నేర్పు ఆయనది. ఆ పద్యాలపైనే పండిత గోస్టులు, పరీక్షలు జరిగేవి. వసు చరిత్రకు అంత క్రేజ్‌ను తేచ్చాడనే.. ఆయన సమకాలీకుడు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి (1790–1870) వసుచరిత్ర పద్యాలకు రాగాలు కట్టి విపులమైన వ్యాఖ్య రాశాడు.

వివాదరహితుడైన ఈయన నూజివీడు ప్రభువు శోభనాద్రి అప్పారావు ఆస్థానంలో ఉన్నాడు. శోభనాద్రి కంటే ఆచార్యులు చిన్నవాడే అయినా రాజు మహా భక్తిశ్రద్ధలను కనబరచేవాడు. కవులను కళాకారులను ఆదరించాడు. సంగీత సాహిత్యాలను ప్రోత్సహించాడు. నరసింహాచార్యుల చేత పల్లవీ వల్లవోల్లాసం కావ్యం తెలుగులో రాయించాడు. దీన్ని ఆగిరిపల్లి శోభనాద్రి నరసింహ స్వామికి అంకితమిప్పించాడు. నరసింహాచార్యుల గురించి ఇంతకంటే వివరాలు లేవు.❀

## 196. అన్నయార్య (1704–1778)

ఒకప్పుడు హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్న సూరాపురం జమీందారిని బేదార్లు అనే తెలుగు నాయకులు పాలించారు. 1752–1773 కాలంలో పాలించిన పామినాయకుడు ముగ్గురు వైష్ణవ మతాచార్య సోదరులను అక్కడికి ఆహ్వానించాడు. వారి ప్రభావం వలన జమీందారు వైష్ణవ మతం స్వీకరించాడు. వీరు అనంతపురం జిల్లాలోని లోని జమ్మల మడుగు తాలూకా బుక్క పట్టణానికి చెందిన వారు. శ్రీనివాసాచార్య వెంకాంబ కుమారులు. వారే వెంకటార్య, అన్నయాచార్య లేక అన్నయ దీక్షితులు, చిన్నయాచార్య లేక శ్రీనివాస దేశికులు. వీరిని బుక్కపట్టణం కుటుంబం వారు అంటారు. వీరంతా మహా విద్వాంసులు మహా కవి పండితులు. సోదరత్రయం దాదాపు వంద సంస్కృత గ్రంథాలు రచించారు. కాని చాలా భాగం అచ్చుకు నోచుకోలేదు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వీరి చరిత్ర త్రవ్వి తీసి వెలుగు లోకి తెచ్చారు. అయితే అన్నయార్య విషయంలో రెడ్డిగారు పొరబడ్డారు. వీరి వారసులు ఇప్పటికీ కర్నాటక, ఆంధ్రాలో మహబూబ్ నగర్ జిల్లా అమర చింత వనపర్తిలలో ఉన్నారు. పామినాయకుడు భార్గవ పురాణం రాశాడు. వైష్ణవంలోకి రాకముందు ఆయన పేరు రాఘవ భూపాలుడు. వెంకటార్య రాజ గురువు. అన్నయార్య, శ్రీనివాసులు కూడా పామినాయక, ఆతనికుమారుడు వెంకట నాయక పోషణలో ఉన్నారు.

అన్నయార్య వాజపేయం పౌండరీకం, గారుడ చాయణం ఆప్తోర్యామ చేసి దీక్షితుడయ్యాడు. అన్నయార్య 'తత్వ గుణాదర్శం' అనే చంపూకావ్యం సంస్కృతంలో రాశాడు. ఇది వెంకట నాయక పాలనలో రాసినట్లు కనిపిస్తుంది. తన వంశ

చరిత్రను ముందే రాశాడు. ఇది వేంకటాధ్వరి రాసిన 'విశ్వ గుణాదర్శం'ను పోలి ఉంటుంది. జయ, విజయ అనే పాత్రల ద్వారా వైష్ణవ, శైవ మతాల విషయ చర్చ చేయించాడు.

'ఆచార్య వింశతి' అనే స్తోత్రాన్ని వేదాంత దేశికులపై రాశాడు. ఇరవై శ్లోకాల కావ్యం. చివర్లో తన గురించి చెప్పుకున్నాడు. 'దేశిక యశో భూషణం' అనే మరో కృతి చేశాడు. 'రసోదార భాణం' రాశాడు. ఇది శృంగార తిలక వసంత మంజరిల ప్రేమకథ 246 శ్లోకాలున్నాయి. కొంత గద్యమూ ఉంది. కవిత్వాన్ని గుప్పించేశాడు. ఉపోద్ఘాతంలో తన గురించి తన సమకాలికుల గూర్చి రాశాడు. నాందిలోనే కవిగారి కవితా శక్తి ద్యోతకమవుతుంది. దీన్ని వెంకటాచలంలోని శ్రీనివాస ఉత్సవాలలో ప్రదర్శించేవారు. చివర ఇచ్చిన వివరాలను బట్టి తల్లి లక్ష్మాంబ అని తెలుస్తుంది. గురువు ఆచార్య దీక్షితులు. 72 శ్లోకాలతో 'అభినవ కర్ణామృతం' రాశాడు. విశిష్టాద్వైత గ్రంథాలు కూడా అన్నయార్య రచించాడు. అవే 'ఆనంద తార తమ్యఖండనం, వ్యావహారికత్వ ఖండన సారం'.

ఆయన రచనా వైదుష్యానికో మచ్చు తునక "ఇచ్చుండాయార్ధ విదుషా కమలా నివాస – తాతార్య గర్భ జనుషా సుగుణైక ధామ్ని–ఆచార్య దీక్షిత కటాక్ష ద్రుతాతి భూమ్నా–ప్రీత్యైహరేర్వ్వరచితో మధురః ప్రబంధాః"❁

## 197. ప్రపంచ దర్పణకర్త- వెంకట కవిసార్వభౌముడు (1710)

**జో**గి భుక్త, పార్వతీల కుమారుడు 18వ శతాబ్దిలో గోదావరి జిల్లాలో ఉండేవాడు. తాను సైన్స్‌తో సహా అన్ని శాస్త్రాలలో ప్రవీణుడనిచెప్పుకున్నాడు. ప్రపంచ దర్పణ రాయటానికి సిద్ధం చేసుకున్నాడు. అది బృహత్ విజ్ఞాన సర్వస్వం. ధర్మకాండ, అర్థకాండ, కామకాండ అనే మూడు భాగాలలో ఉన్నది. ఇందులో మంత్ర శాస్త్రం, కవిత్వం, అలంకార శాస్త్రం మొదలయినవన్నీ ఉన్నాయి. అనేక కావ్యాల నుండి ఉదాహరణలు ఇచ్చాడు.❁

## 198. సాహిత్య కౌముది రాసిన - బలదేవ విద్యాభూషణుడు (1720)

**దా**మోదర దాసు శిష్యుడు. చైతన్యుని అనుయాయి బలదేవుడు బెంగాల్ దేశస్తుడు. జైపూర్ రాజు జయ సింహుని కాలంలో ఉన్నాడు. అంటే పద్దెనిమిదవ శతాబ్దం వాడు. ఇతని సాహిత్య కౌముది భరతుని సూత్రాలపై వ్యాఖ్యానంతోబాటు స్వీయాభిప్రాయ వివరం కూడా. ఈ సూత్రాలనే కారికలు అని మమ్మటుని కావ్య ప్రకాశలో పొందుపరచబడినాయి. వివరణలు చూస్తే మమ్మటుడే కారికల కర్త అనిపిస్తుంది. విద్యా భూషణుడు గొప్ప సాహిత్య శాస్త్రజ్ఞుడు. చైతన్యుని శిష్యుడు. కృష్ణావతారం అని భావించి ఆయన గీతాలకు వ్యాఖ్య రాశాడు.❁

## 199. అలంకార కౌస్తుభకర్త- విశ్వేశ్వరుడు (1720)

**ల**క్ష్మీధరుని కొడుకు విశ్వేశ్వరుడు పాండే వంశానికి చెందినవాడు. ఆల్మోడా నివాసి. అతనికి తొమ్మిదవ తరం వారు ఇంకా అక్కడే ఉంటున్నారు. 18వ శతాబ్ది ప్రారంభం ఇతని కాలం. సాహిత్య మేధావిగా ప్రసిద్ధి చెందాడు. ఇంతటి మేధావులు బహు తక్కువ కాలమే జీవిస్తారని మనకు తెలుసు. అలాగే విశ్వేశ్వరుడు 34వ ఏటనే శివ సాన్నిధ్యానికి చేరుకొన్నాడు. ఛందస్సు, అలంకార శాస్త్రాలలో అనేక గ్రంథాలు రాశాడు. అందులో ముఖ్యమైనవి అలంకార కౌస్తుభం, అలంకార కర్ణాభరణం, అలంకార కుల ప్రదీపం, అలంకార ముక్తావళి, కావ్యలీల, కావ్య రత్నం, రస చంద్రిక, భాను దత్తుని రసమంజరిపై గొప్ప వ్యాఖ్యానం రాశాడు. అలంకార కౌస్తుభంలో తాను రుక్మిణీ పరిణయం అనే సంస్కృత నాటకం, శ్రింగార మంజరి అనే ప్రాకృత నాటకం రాసినట్లు చెప్పుకొన్నాడు.❁

## 200. మిశ్రమ భాణం రాసిన – కాశీపతి(1720)

**కౌ**ండిన్య గోత్రీకుడు ఉమాపతి పుత్రుడు కాశీపతి. 1734లో మైసూరు రాజు సైన్యాధ్యక్షుడైన ఆంధ్రుడైన కవే నాగ రాజు పోషణలో ఉండేవాడు. 1) తన పోషకుడు నంజరాజు రాసిన 'సంగీత గంగాధరం'కు శ్రావణ నందిని అనే విలువైన వ్యాఖ్యానాన్ని రాశాడు. 2) ముకున్దనందన భాణం రాశాడు. రెండింటిలోను గణపతిని ఒకే విధంగా స్తుతించాడు–

"వందే వందారు మందార మిందు చూడస్య నందనం – అమందానంద సందోహ బంధురం సింధు రాననం"

వ్యాఖ్యానంలో కొన్ని చారిత్రిక విశేషాలు తెలియజేశాడు. రెండవది అయిన భాణం భద్రగిరి చూడేశ్వర ఉత్సవాలలో ప్రదర్శించేవారు. ఈ ముకుంద నందం విషయంలో, వివరణలో వినూత్నమైనదిగా కనిపిస్తుంది. ఇది మిశ్రభాణం. ఆ రోజుల్లో వినూత్నమైనది అరుదైనది కూడా. సంస్కృత ప్రాకృతాలను కలిపి రాశాడు. రాజు భుజంగ శేఖరుడి క్రీడలు శ్రీ కృష్ణ గోపికా క్రీడల్లాగా ఉంటాయి. తర్కంలో దిట్ట ఐన కవి కవిత్వంలో అదే పదును చూపాడు. సూత్రధారుడు కవి ప్రతిభను చక్కగా వివరించాడు –

'తర్క కర్కశ వక్ర వాక్య గహనే యా నిష్టురా భారతీ – సా కావ్యే మ్రుదులోక్తి సార సురభౌ స్యాదేవ మే కోమలా'

కవి ఊహకూ సరళ కవిత్వానికి మరో ఉదాహరణ–

"భూయో నిపీయ లావణ్యాంబుధి మప్రభాతం – పుంజీభవన్నుదయతే త పంచ్ఛలేన ఔర్వీ గ్నిరంభార పయోనిధి మత్స్య పాతుం – నీలో దుబుద్ధద కడంబమితి ప్రతీమః

"

కాశీపతి కవిత్వంలో కాళిదాస, జయ దేవ, లీలాశుకుల కవిత్వం మిశ్రితమై కనిపిస్తుంది–

'తప్తాంబురుహం తదూరు యుగళం తాద్రుక్ నితంబ స్థలం – తన్మధ్యం స గభీర నాభి వలయస్తా వాను రోజ క్రమః

తదంకం తదపాంగ ముగ్ధ వలనం తే నీల నీలాలాలకాః–సా తన్వీతి తదంక కేషు హృదయం దావన్న విశ్రామ్యతి'

ఇది ముకుందుడైన శ్రీకృష్ణుని గురించి రాసినదే అయినా, కాదంబినీ అంటే మబ్బు కుమార్తె సౌదామిని అంటే మెరుపు, కళానిధి కళత్ర చంద్రికా మొదలైన పేర్లు కూడా వస్తాయి కనుక ఇది పూర్తిగా భాణ లక్షణాలను కలిగి లేదు. కొన్ని సామెతలనూ పనిలో పనిగా కవి చెప్పాడు. ఆ నాటి కాలంలో శృంగార వీరవిహారం గురించి వర్ణించాడు. తనకు ఇష్టమైనవి, అయిస్టమైనవీ చెప్పాడు. గూర్జరులను, గూర్జర స్త్రీలను విమర్శించాడు. ఇలా యే భాణంలోనూ లేదు.

ఆంధ్రదేశంలో ఈ బాణం విస్తృత ప్రచారం లో ఉండేది. దీని చాలామంది కవులు అనుకరించారు, అనుసరించారు. కొందరు అందులోని వాక్యాలను ప్రేరణగా తీసుకొన్నారు. అందులో ముఖ్యమైనది – 'మద్యం విష్ణు పదం కుచౌ శివపదం వక్త్రం విధాతుః పదం' వంటివి. చిలకపాటి రామానుజశర్మ దీన్ని పూర్తిగా అనువదించాడు. మరో సూక్తి 'చౌర్యేనైవ కృతం హికుక్షి భరణం జన్మ ప్రభూ'ను అవధానకవులు తిరుపతి కవులు తమ 'పాణిగ్రహీత'లో అనువాదం చేసి రాశారు. కనుక ఎందరికో ప్రేరణ నిచ్చి కొత్తమార్గం తొక్కించింది కాశీపతి రాసిన 'ముకున్దానంద భాణం'.❋

## 201. భారత భౌగోళిక చరిత్ర రాసిన రామకవి (1730)

**18**వ శతాబ్దానికి చెందిన శిఖర బాదామి రాజు ఆస్థానంలో రామకవి ఉండేవాడు. పాండవ దిగ్విజయం రాసాడు. ఇందులో పాండవులు భారతదేవాన్ని జయించటం ఉంది. ఇది మహాభారతం కంటే ఉద్గ్రంథం. భారతదేశంలోని ప్రదేశాలన్నింటినీ వర్ణించాడు. పౌరాణిక గాథలను జోడించి కథ చెప్పాడు. ఆనాటి సంఘ ఆచారాలు, పద్ధతులు, మతాలు, చట్టాలు, సంస్థలు మొదలైన వాటినన్నింటినీ వర్ణించాడు. మహమ్మదీయ దండయాత్ర ముందు, తర్వాత కథ నడుస్తుంది. విక్రమాదిత్య, శాలివాహన, భర్తృహరి, శంకారాచార్య, ప్రభాకర భట్టు, జూమాన్ , నంది కాంభోజరాజు, జయచంద్రుడు, ఒరిస్సా రాజు ప్రతాప రుద్రుడు, శూరభట్టు మొదలగు వారి చరిత్రలన్నింటినీ ఇందులో రాసాడు. దీనికి ఆధారం భవిష్య, స్కంధ పురాణాలు, రుద్ర విజయం, విశ్వ గుణాదర్శంగా తెలియచేసాడు. ❁

## 202. వైణిక శిక్షామణి- వెంకట వైద్యనాథ దీక్షితులు (1735- 1817)

**తి**రువాడ మరుదూర్ నివాసి వెంకట వైద్యనాథ దీఓఇతులు వెంకటమఖికి మనవడు. సంగీతాన్నిఆయన నుండి వారసత్వంగా పొందినవాడు. వీణపై గొప్ప అధారిటీ ఉన్నవాడు. వెంకటమఖి రచన "చతుర్దండి ప్రకాశ"ను ఆవిష్కరించాడు. ఇతని శిష్యుడు రామస్వామి దీక్షితులు. గురువు వద్ద సంగీత విద్య నేర్చి గురువును "వైణిక శిక్షామణి"ని చేశాడు. వేంకటేశ్వరుని కొడుకైన రామస్వామి మధ్యారణ్యం అని పిలువబడే తిరువాద మరుదూర్‌లోని గోవిందపురానికి చెందినవాడు. తంజావూర్‌లో వీరభద్రయ్య అనే గురువును చేరి ఆ కాలంలో సంగీత సంగీత విద్యలో సాటిలేనివాడని పించుకొన్నాడు. కాలం 1735-128-1817. "తాళమాలిక" రచించాడు.

రామస్వామి చిన్న కొడుకు బాలస్వామి లేక బాలకృష్ణ దీక్షితులు 1780లో జన్మించి బాల మేధావిగా ప్రసిద్ధి చెందాడు. మద్రాస్‌లోని మానాలి చినయ మొదలియార్ ఆశ్రయం వలన అనేక సంగీత వాద్యాలను అవలీలగా వాయించే అపూర్వ నైపుణ్యాన్ని సాధించాడు. పాశ్చాత్య సంగీతాన్నీ అభ్యసించాడు. సహజమైన ఏ శబ్దాన్ని అయినా వీణపై పలికించే అద్భుత ప్రతిభ ఉండేది. మనకాలంలో ప్రముఖ వైణిక విద్వాంసుడు "చిట్టిబాబు"లాగా...

ఎట్టియపురం పాలకులు సంగీతానికి ఒక శతాబ్ద కాలం అధిక ప్రాధాన్యం ఇచ్చారు. ఆ కాలంలో జగదీశ్వర వెంకటేశ్వర ఎట్టప్ప (1816), అతని వారసలు జగదీశ్వర రామ కుమార ఎట్టప్ప, జగదీశ్వర రామ వెంకటేశ్వర్లు సంగీతంలో అనన్య ప్రతిభా పాటవాలు చూపించి ప్రకాశించారు. వెంకటేశ్వర్లు ఆస్థాన కవి కూడా అయ్యాడు. ఇతని గురించి "కవులలో యువరాజు, యువరాజులలో కవి, ఎన్నో కీర్తనలు, చూర్ణికలు దేవీ దేవతలపై రచించాడు. అతనిని "కార్తీకేయ అవతారంగా భావిస్తారు" అని చెప్పబడింది. సంగీతంలో అతని మిత్రులు మీనాక్షి సుందరయ్య, సుబ్బ కుట్టిఅయ్యర్, వెంగు భాగవతార్ మధుర రామయ్యర్లు.❋

## 203. రస చంద్రిక రచయిత– విశ్వేశ్వరుడు (1750)

**ర**స చంద్రిక రాసిన విశ్వేశ్వరుడు నాయక నాయిక భేదాలను తెలిపాడు. "విటవృత్తి"లో వేశ్యలు వారి ప్రేమికుల మధ్య సంబంధాలను తెలియజేశాడు. దీనికి కర్త "సౌమ దత్తుడు" అయి ఉండాలి. మాధవుడు "జగ వృత్తి"లో నాట్య గత్తెల కపట నాటకాలు, ధూర్త విటుల సల్లాపాల గూర్చి వివరించాడు. "దూర్తానందం"లో విటుల విచ్చలవిడి తనం వర్ణింపబడింది.

వైద్యనాధుని "రసిక రంజనం" అతని తండ్రి కామరాజ దీక్షితుని "రసిక బోధిని" కాళిదాసుని "శృంగార తిలకం"లలో ప్రేమ, శృంగారం, జారత్వం పొంగి ప్రవహించాయి.

కౌతక దేవుని "అనంగ దీపిక", వచన కావ్యం, రతిసారం, రతి చంద్రిక, శృంగార కౌతూహలం "త్రుతీయ పురుషార్ధకా సరణి" ప్రణయ చింత" మొదలైనవన్నీ శృంగార కామకేళా విలాసాలపై వచ్చినవే. దీనికితోడు "బంధోదయం" అనే తాటాకాలపై చిత్రించిన బంధాలలోని భంగిమలు వాటికింద శ్లోకాలు ఉన్న బొమ్మల పుస్తకం సంచలనంగా నిలిచింది. రెండు భాగాలలో ఉన్న "శృంగార కందుకం" "జార పంచాశతి" శ్రీకృష్ణ, గోపికల మధ్య శృంగారాన్ని రంగరించి రాసింది.

"వేశ్యా గణక కల్పద్రుమం" రాజుల ఆస్థాన నర్తకిలపై రాసినది. "రఘుపతి రహస్య దీపిక" సంభోగ శృంగారం దగ్గర ఆగింది.❋

## 204. అవసరాల పద్మరాజు (1750)

గోల్కొండ నియోగి అవసార పద్మ రాజు, పిఠాపురం రాజు నీలాద్రి రావు మంత్రి. అయిదు కాండలలో భాగవత చంపు రాశాడు. కవికి అంభోజ, వర్నాధిక కాంభోజ అనే పేర్లూ ఉన్నాయి. ప్రారంభ శ్లోకం–

'శ్రియః కటాక్షః స తనోతు నః శివం విదిత్సునా యస్యద్వశం నవోత్పలం –వితన్యతే స్మిన్ విధినా దివా నిశం నిమేలినోన్మీ లన సంత తౌఘం'

పద్మరాజు శైలికి గద్య ఉదాహరణ –యాఃసలీలమ పుర స్కృత జీమూతా సౌదామిన్య ఇవ కామిన్యః కమనీయ తర కబరీ భరాఃపరి వవ్రు రనంతః పురగత మనవరతమఖిల భువనాధార నిజోదరం శ్రీ రోరాది ప్రణయినం ధనమేనం – ఇలా సాగుతుంది. ఆ కాలపు అలవాటు ప్రకారం శృంగారాన్ని బాగా దట్టించాడు. బాలకృష్ణుని వర్ణన – 'త్వం దృష్టా హి పరున్మాయా రరస మొరస్కొ ధృవం కందుక – ద్వంద్వం మే గలితం చిరాయ నిహితం గూఢం త్వయా కంచుకే'

గోపికా వస్త్రాపహరణం చేస్తున్న కన్నయ్య –

'నాభి దఘ్న మభావన్నత యామునం సలిలామంతరీయ తాం – ఉత్తరీయ మనురూప ముల్లస త్కేశం సంహితర భూద్విసరితా'

అసలైన రాసక్రీడా వర్ణన–

'అవిరలోభయ పార్శ్వ లసత్తరూప యుభయ పార్శ్వ గత స్వతం నూక్రుతే–మధు జిదంతర రాజత మండలే ,స్వయ మసౌ పరిదావివ చంద్రమాః

చివరి శ్లోకం – చిరమాదిగతాముద్ధిం లుమ్పంపలాశ తతోర్ఘశం – సపది రచయన్నామోదాంచన్ద్రీ రయం సుమనా శ్చయం

దీనిపై దేవులపల్లి రామసూరి రాసిన సుధి చంద్రిక, రాఘవాచార్య రచించిన కవి రంజని వ్యాఖ్యానాలున్నాయి. కాని అచ్చు కాలేదు. ❁



## 205. సంగీత సద్గురు త్యాగరాజ స్వామి (1759- 1846)

**త్యా**గరాజ స్వామి కుటుంబానిది కర్నూలు జిల్లా కాకర్ల గ్రామం. కాని కుటుంబం తమిళనాడుకు వలస వెళ్ళింది. తమిళనాడులోని తిరువారూర్ 1759లో జన్మించి, కుటుంబం సంస్కృత విద్యాకేంద్రమైన తిరువయ్యూరుకు మారటంతో అక్కడే ఉన్నారు. తండ్రి రామబ్రహ్మం. తల్లి సీతమ్మ. కాకర్ల ఇంటి పేరు. ములికి నాడు వైదీకి బ్రాహ్మణులు. భారద్వాజ గోత్రం. చిన్నప్పుడే తలిదండ్రులను కోల్పోయాడు. అన్న జపేశం అన్నిరకాలా హింసించాడు. సొంఠి వెంకట రమణయ్యగారి వాద్య సంగీతం అభ్యసించాడు. శ్రీ రామభక్తుడైన త్యాగయ్య రామ పంచాయతనాన్ని అను నిత్యం పూజించేవాడు. అన్న దాన్ని కావేరి నదిలో విసిరేశాడు. రామానుగ్రహం వలన అవి లభించాయి. తెలుగులో ఆయన రాసిన వాటికి కృతులు అని పేరు. అందులో పంచరత్న కీర్తనలు చాలా ప్రసిద్ధమయ్యాయి. ముఖ్యంగా "ఎందరో మహానుభావులు" జగత్ ప్రసిద్ధమైన కీర్తన.

త్యాగయ్య సంగీత సాధనకు మెచ్చి నారదుడు "సంగీత స్వరార్ణవం" అందజేశాడు. దాన్ని సాధన చేశాడు త్యాగయ్య. తంజావూర్ రాజు ఆశ పెట్టిన ధనానికి పదవికి ఆశ పడలేదు. అప్పుడే "నిధి చాల సుఖమా రాముని సన్నిధి

చాల సుఖమా" అనే కీర్తన రాశాడు. తీర్థ యాత్రలు చేసి క్షేత్ర స్వాములపై గొప్ప కీర్తనలు రాశాడు. త్రిమూర్తులలోను రాముడినే దర్శించిన మహా రామభక్తుడు త్యాగరాజు. అనేక వందల కీర్తనలు రాసిన త్యాగరాజ స్వామి 1846 పుష్య బహుళ పంచమి నాడు సమాధి చెందాడు. ఆ రోజుననే తిరువయ్యూర్‌లో త్యాగరాజ ఆరాధనోత్సవం ఘనంగా జరుగుతుంది. బెజవాడ నాగ రత్నమ్మ అనే సంగీత విదుషీమణి అక్కడే స్వామివారికి ఆలయం కట్టించి పుణ్యం కట్టుకొన్నది. నాదానికి ప్రతి రూపం త్యాగరాజు. రాముడే ఆయనకు రక్ష. త్యాగ బ్రహ్మ అని పిలిచేవాడు. సంగీత త్రిమూర్తులు త్యాగరాజు శ్యామశాస్త్రి, దీక్షితులు ముగ్గురూ వాగ్గేయ కారులే. మహితాత్ములే.

ఒకరోజు రాముడు ఒక మహా రాష్ట్ర భక్తుడికి కలలో కనిపించి మహా భక్తుడైన త్యాగయ్యను దర్శించమని చెప్పాడట. అతడు వచ్చి ఈ మహా భక్తిస్వామిని దర్శించి పులకించి అక్కడే ఉండిపోయి శిష్యుడైనాడట. ఆ సమయంలో ఆయన తోడిరాగంలో "దశరథ నినునమ్మి నాను" కృతి పాడాడు. ఉత్తరాది సంగీతాన్ని కూడా త్యాగయ్య బాగా అర్థం చేసుకొన్నారని సంతోషించాడట. అందుకే త్యాగయ్య "మరుగేలరా"లోను "మనము లేదా" కృతిలోనూ వాటిని వాడాడు. అతి నెమ్మదిగా మొదలయ్యే "నమ్మిన వారిని" కృతి నుండి అతి వేగంగా సాగే "శోభిల్లు సప్తస్వర" వరకు వైవిధ్యంతో రాశాడు త్యాగయ్య. గాయకుడికి సర్వాధికారాలతో సంగీత నైపుణ్యాన్ని ప్రదర్శించే గొప్ప వీలు త్యాగయ్య కలుగజేశాడు. త్యాగయ్య ముద్ర "త్యాగ రాజ వినుత".

త్యాగరాజు మొదట్లో రాసినవన్నీ "నాట రాగం"లో సంస్కృతంలో రాశాడు. "నాదం తనుమనిశం శంకరం" (చిత్త రంజని రాగం), "శంభోమహాదేవ శంకర గిరిజా రమణ" (పంతువరాళి రాగం), సుందర సాహసకాంకం గిరిజాసుత (బంగాళ) జానకి రమణ (సుధా సీమంతిని) శ్రీ రఘువర సుజన (భైరవి) శ్రీనాథనాథ (కానడ) ఈశా పాహిమాం(కల్యాణి) "జగదానందకారక" (నాట) శ్రీ రఘువర (కాంభోజి) సామజ వరగమనా (హిందోళ) ఏహి త్రిజగదీశ (సారంగ) శివే పాహిమాం (కల్యాణి) మొదలైన 21 కృతులు సంస్కృతంలో కృతులు రాశాడు.❁



## 206. శ్యామ శాస్త్రి (1762- 1827)

**త్యా**గరాజు సమకాలికులలో దీక్షితులతోబాటు ఉన్నవాడు శ్యామ శాస్త్రి. సంగీత త్రయంలో ఒకడు. ఎక్కువ కీర్తనలు తెలుగులోనే రాశాడు. కానీ సావేరి రాగంలో సంస్కృతంలో రాసిన "శంకరి" కీర్తన తలమానికం. తిరువారూర్‌లోనే కర్నాటక సంగీత త్రయం జన్మించారు. ఇందులో త్యాగరాజు పెద్దవాడు. ఎక్కువ కాలం జీవించాడు. రెండు శ్యామ శాస్త్రి, మూడవ చివరివాడు దీక్షితులు జీవిత కాలం తక్కువే. దీక్షితులే ఎక్కువ కాలం తిరువాయూర్‌లో ఉన్నాడు. త్యాగరాజు తిరువయ్యూర్ చేరాడు. ఇది పంచనదీ క్షేత్రం. శ్యామ శాస్త్రి తంజావూర్ చేరుకొన్నాడు. ఈ సంగీత త్రయం కావేరీ నదీ తీరాన్ని పవిత్ర కర్నాటక సంగీత సారంతో మరింత పవిత్రం చేశారు.

శ్యామ శాస్త్రి 1762- 1827 కాలం వాడు. విశ్వనాథ అయ్యర్ వెంగ లక్ష్మి దంపతులకు 12-04-1762లో జన్మించాడు. ఔత్తరవాదామ అనే తమిళ బ్రాహ్మణుడు. తండ్రి విశ్వనాధుడు, ఆ పై తరాల వారు "బంగారు కామాక్షిదేవి" అర్చకులు. శ్యామ శాస్త్రి అసలు పేరు వెంకట సుబ్రహ్మణ్యం. శ్యామ శాస్త్రి శిష్యగణం తక్కువే. మిగిలిన ఇద్దరు వాగ్గేయకారులకంటే తక్కువ కృతులే రాశాడు. కాని అవి ప్రసిద్ధి చెందాయి. ఆయన కృతులలో ముద్ర "శ్యామ కృష్ణ", "రత్న త్రయం" అనే మూడు స్వరజతులను కూర్చాడు. అవి భైరవి యదుకుల కాంభోజి తోడి రాగాలలో ఉన్నాయి. అవే "కామాక్షి అనుదినము", "కామాక్షి పదయుగమే", "రావే హిమగిరి కుమారి" మొదటి రెండు మిశ్ర చాపు తాళంలో, మూడవది ఆదితాళంలో ఉంటాయి. సంక్లిష్ట తాళ రచన శ్యామశాస్త్రి ప్రత్యేకత. అందుకే ఆయనను "తాళ ప్రస్తార శ్యామశాస్త్రి" అంటారు. అరుదైన రాగాలలో కాక, అందుబాటులో ఉన్న రాగాలలో కృతులు చేయటం ఆయన కిష్టం. ఈయన కుమారుడు సుబ్బరాయశాస్త్రి తండ్రితోబాటు మిగిలిన ఇద్దరు వాగ్గేయకారుల వద్దా సంగీతం నేర్చాడు. ఈయన ముద్ర "కుమార". శ్యామశాస్త్రి పెంపుడు మనవడు. అన్నస్వామి శాస్త్రి కూడా సంగీతజ్ఞుడే. శ్యామశాస్త్రి సంస్కృత కృతులు- సావేరి రాగంలో "శంకర శంకర చారుముఖీ", పున్నాగ వరాళిలో "కనక శైల విహారిణీ". ❁

## 207. శత జిత్ కవి (1770)

వెంకట పండితుని కొడుకు, వీరరాఘవుని మనవడు శత జిత్ కవి. భరద్వాజ గోత్రం గూటాలకు చెందిన సామసాఖ వాడు. గోదావరి జిల్లా పట్టి సీమలో ఉన్నాడు. 'శృంగార సంజీవన భాణం' రాశాడు. దీనిని ఏలూరు సంతాన గోపాల స్వామి చైత్రోత్సవాలలో ప్రదర్శించేవారు. నూజివీడు ప్రభువు మేకా వెంకట నృసింహ అప్పారావు ఆస్థాన కవి. దీన్ని 24-7-1797న రాశాడు. కనుక కాలం 1770 అవచ్చు. ప్రారంభ శ్లోకం-

'యద్వక్ష రసజ్ఞదారాణాం యన్నాభిః సూతికాగృహం - పుత్రజ్ఞయా భవాత్కి0జిత్తేజోస్తు చ సతాం ముదే'

ఉపోద్ఘాతంలో పూర్వీకుల చరిత్ర చెప్పుకొన్నాడు. కవిపూర్వీకులు తమిళులని, గోదావరిజిల్లాకు వలస వెళ్ళారని గూటాలలోగూటం లాగా పాతుకు పోయారని, తండ్రి తమిళుడు, తల్లి ఆంధ్ర అని, తెలుగు సంస్కృతాలలో పాండిత్యం ఉన్నదని, కనుక తనకు తమిళం రాలేదని చెప్పాడు. కవి వారసులు ఇప్పటికీ గూటాలలో ఉన్నారు. ❁



## 208. నవావరణ కీర్తనలు రాసిన- ముత్తు స్వామి దీక్షితులు (1775- 1835)

**రా**మస్వామి పెద్దకొడుకు ముత్తు స్వామి దీక్షితులు 1775లో తమిళనాడు తిరువాలూర్‌లో జన్మించాడు. చిదంబర యోగితో ఉత్తర భారత పర్యటన చేసి తిరిగి స్వస్థలంలో నివాసమున్నాడు. చిదంబర యోగి సమాధి కాశీలో హనుమాన్ ఘాట్‌లో చక్రలింగేశ్వర దేవాలయం సమీపంలో ఉన్నది. చివరి కాలంలో ఎట్టియ పురం రాజుల ఆస్థానంలో ఉన్నాడు. ఎక్కడికి ఏ దేవతను సందర్శించటానికి దీక్షితులు వెళ్ళారు. అక్కడ సంస్కృతంలో ఒకపాట రాసి, ఆ దేవతకు గీత హారంగా సమర్పించేశాడు. తిరుత్తని శ్రీ సుబ్రహ్మణ్య స్వామిని దర్శించి దీర్ఘ సమాధిలో ఉండిపోయాడు. "కార్తికేయ మురుగ"స్వామి అనుగ్రహించి నోటిలో కలకండ పెట్టాడు. అప్పుడే ఆశువుగా "శ్రీనాదాధి గురుగుహో" అనే కృతి మా యామాళవ రాగంలో ఆశువుగా వెలువడింది. పంచభూతాలపై "పంచలింగ కీర్తన" రాశాడు. కంచి జంబుకేశ్వర కాళహస్తి చిదంబరం అరుణాచలేశ్వరులపై రాసిన కీర్తనలు బహుళ ప్రచారం పొందాయి. అందులో కొన్ని అనర్ఘ రత్నాలు- 'భైరవ రాగంలో' చింతయా మాకంద కందం యమునా కల్యాణిలో "జంబూ పతే", సారంగ రాగంలో "అరుణాచల పతే", ఉసేవి రాగంలో "శ్రీ కాళ హస్తీశం", కేదరలో "ఆనంద నటేశం", ముత్తుస్వామి దీక్షితుల కృతిలో ముద్ర "గురు గుహ".

నవగ్రహాలపై రాహువు కేతువు మీద తప్పించి మిగిలిన వారిపైనా, "నవావరణ కీర్తనలు" పేరుతో మాయవరం అమ్మవారిపైనా, తిరువారూర్‌లో సకల

దేవతల మీద కీర్తనలు గుప్పించాడు. అక్కడి గ్యాగరాజ శివునిపై "బేగడ రాగంలో" త్యాగరాజ నమోస్తుతే చాలా ప్రత్యేకత పొందింది. తిరువారూర్‌లోని "కమలాంబ" దేవిపై దీక్షితులకు ప్రత్యేక అభిమానం. ఆమెపై నవావరణ కీర్తనలు రాసి అమ్మవారి అనుగ్రహం పొందాడు. అమెపై పదకొండు సార్లు కీర్తనలు పాడాడు. నీలోత్పలాంబిక, వినాయకులపై అద్భుత కీర్తనలు రాశాడు. అందులో 'అక్కడిఈశాన్యంలో ఉండే గణపతిపై శ్రీరాగంలో రాసిన కీర్తన "వాతాపి గణపతిం భజే" ప్రపంచమంతా ప్రసిద్ధి చెందింది. అలాగే గౌళ రాగంలో "శ్రీ మహా గణపతిం భజే", శ్రీరాగంలోనే "శ్రీ మూలాధార చక్ర వినాయక" అనే కీర్తనా రచించాడు. ఇది త్యాగరాజు ఆలయంలో ముందుభాగంలో ఉన్న వినాయకునిపై రాసినది. తిరువారూర్, అచలేశ్వర, ఆనందేశ్వర, సిద్ధేశ్వర దేవులపై రాసిన కీర్తనలు రస గుళికలే. సావేరి రాగంలో "శ్రీ రాజ గోపాల", బాల గోపాల" కీర్తనలు ప్రముఖమైనవి.

కీర్తనలలో తన వ్యక్తిత్వాన్ని చక్కగా ప్రదర్శింప జేశాడు దీక్షితులు. అద్వైత సిద్ధాంతాన్ని నమ్మి ఆచరణలో జీవితాన్ని ధన్యం చేసుకొన్నాడు. వేదోపనిషత్ సారాన్ని కీర్తనలలో నింపాడు. సంగీతంతో సాహిత్యం జమిలిగా ప్రవహించటం దీక్షితుల ప్రత్యేకత. మంత్రాలతో దైవాన్ని పూజించలేని వారికి ఈ కీర్తనలు ముక్తి మార్గాన్ని ప్రసాదించేట్లు చేసిన సంగీత వాగ్గేయకారుడు దీక్షితులు. కర్నాటక సంగీతత్రయంలో ఒకడై భాసించాడు. ఆయన నవగ్రహ కీర్తనలు మాస్టర్ పీస్ అనిపిస్తాయి. ఇందులో భక్తీ, ఆరాధనా కనిపిస్తాయి. విభక్తి కీర్తనలు ఆయన ప్రత్యేకం.

తంజావూర్‌లో నాట్య ప్రసిద్ధులైన "శివనాధం, పొన్నయ్య, చిన్నయ్య, వడివేలు అనే నలుగురు దీక్షితుల వద్దకు వచ్చి సంగీతం నేర్పమని కోరారు. వారికి తన గురువు వెంకట వైద్యనాథ దీక్షిత్ నేర్పిన డెబ్భై రెండు మేళకర్తల సాంప్రదాయాన్ని సవివరంగా నేర్పాడు. నేర్చుకొని సంతోషించిన ఆ శిష్యులు గురువుకు కృతజ్ఞతగా "నవ రత్న మాల" రాసి అంకితమిచ్చారు. ఈ నలుగురు శిష్యులను 'తంజావూర్ సంగీత చతుష్టయం' అంటారు. వీరు భరత నాట్యానికి

గొప్ప సంగీతం అందించారు. వీరిలో పొన్నయ్య, చిన్నయ్యలు తిరువాన్కూర్ మహారాజు స్వాతి తిరుణాల్ ఆస్థాన సంగీత విద్వాంసులయ్యారు. పొన్నయ్య అన్నామలై యూనివర్సిటి సంగీత కాలేజి ప్రిన్సిపల్ కూడా అయ్యాడు.

పాశ్చాత్య సంగీతాన్ని సెయింట్ ఫోర్ట్ జార్జి కోటలో విని నలభై గీతాలను ఆ జానపద బాణీలలో కూర్చాడు. శంకరాభరణం వంటి రాగాలలో వీటిని మిశ్రితం చేశాడు. దీనినే ఇప్పుడు "నొట్టుస్వర సాహిత్యం" అన్నారు. ఇందులో సెల్టిక్, బారోకీ శైలులు "సఖీ సమిత గణపతిం" కృతిలో, "వరశివబాలం"లో కనిపిస్తాయి. వీటిని కడప జిల్లా కలెక్టర్, ఆంధ్ర భాషా సేవకుడు సి.పి.బ్రౌన్ కోరికపై చేశాడని అంటారు. కాని ఈ ఇద్దరూ ఎప్పుడూ కలుసుకోలేదు కనుక అసంబద్ధం అన్నారు. బ్రౌన్ మద్రాస్‌కు 1817లో వచ్చి తెలుగును 1820లో నేర్చుకొన్నాడు. ఆ ఏడాదే కడప కలెక్టర్‌గా వెళ్ళాడు.

దీక్షితుల మరణం అకస్మాత్తుగా జరిగింది. ఎట్టుపాలెంలో 1835లో దీపావళి రోజు శిష్యులు ఆయన గమక క్రియను పూర్వ కల్యాణి రాగంలో "మీనాక్షి మే ముదం" కీర్తనలో గానం చేస్తుండగా వింటూ తన్మయం చెంది మరోసారి పాడమని అడిగాడు. వారు అనుపల్లవి "మీన లోచన పాశ మోచన" శివే ను ఆలాపిస్తున్నారు. అమ్మవారు స్వయంగా తనను విముక్తుడిని చేస్తోందని భావించాడు. ఆ కీర్తన వింటూనే కళ్ళు మూసుకొని తుది శ్వాస వదిలి అమ్మ సాన్నిధ్యం 1835లో చేరుకొన్నాడు. ఆయన సమాధి ప్రసిద్ధ తమిళ దేశ భక్తకవి సుబ్రహ్మణ్య భారతి సమాధి ప్రక్కన కాలిపట్టి తూట్టికోరిన్ మధ్య ఉన్న ఎట్టుపాలెంలో ఉన్నది. ❁

## 209. మార్గదర్శి- శేష అయ్యంగార్ (1780)

**ద**క్షిణ భారత సంగీతానికి గొప్పదారి, వెలుగు చూపించిన శేష అయ్యంగార్‌ను "మార్గదర్శి" అన్నారు. అయోధ్య వాసి. తరువాత శ్రీరంగం వచ్చి స్థిరపడ్డాడు. శ్రీరంగనాధుని సేవలో తరించాడు. ఆయన సంతకం లేక ముద్ర "కోసలాపురి". ఈయన సంస్కృత కృతులను రంగనాధస్వామి విని మెచ్చాడని కథనం. 1830-1900 కాలంలో ఉన్న శివరామ యతి ఆధ్యాత్మిక కీర్తనలు రాసి "నిజభజన సుఖ పద్ధతి" అని పేరు పెట్టాడు.

స్వర్ణ స్వర పేరున్న మహా వైద్య నాధ శివ దక్షిణ భారత సంగీత విద్వాంసులలో "టాప్" మేళ రాగమాలిక రాశాడు. ❁

## 210. మహా రాజ మూడవ కృష్ణ రాజ ఒడియార్ (1785)

**1**785లో జన్మించిన కృష్ణ రాజ ఒడియార్ మైసూరు రాజు విద్వత్ కవి, కవి జనాభిరాముడు. ఈ రాజు రాసిన 'దేవతా ధ్యాన మాలిక' అనేక దేవీ దేవతా స్తోత్రకదంబం. చిత్రాలతో సహా ఉన్నాయి. 'సూర్య చంద్రాది వంశావతరణం' 1857లో రాయబడిన రామాయణ మహా భారతంకు చెందినవి, యదురాజ, కృష్ణరాజ పరాక్రమాలకు సమంధించిన వంద కథలు. 'కృష్ణ కథా పుష్ప మంజరి' చాముండీ మంగళ మాలిక, మృత్యుంజయ స్తోత్రం, రామాయణ కథా పుష్పమంజరి కూడా రాజావారి రచనలే. మైసూరులో ముద్రింపబడినాయి. ❁

## 211. కవిరత్న రాగమాలిక కర్త- పురుషోత్తముడు (1790)

**క**విరత్న పురుషోత్తముడు గంజాం జిల్లా పర్లాకిమిడిలో సుమారు 1790లో ఉన్నాడు. రామ చంద్రోదయం రామాభ్యుదయం, బాలరామాయణ ప్రబంధాలతోబాటు "కళాంకూరని బంధం లేక రాగమాలిక"ను రచించాడు. ఇతని కొడుకు నారాయణ మిశ్ర కవిరత్న "సంగీత సారాని"తో బాటు "బలభద్ర విజయం, శంకర విహారం, ఉషాభిలాష, కృష్ణ విలాసం గుండీచ విజయం నవ నాగ లలిత అనే ప్రబంధాలు రాశాడు.

ప్రబంధాలను నారాయణ మిశ్ర, సూత్రా అనే రకాలుగా విభజించాడు. మొదటిదానిలో అంక పాటలున్నాయి. వీటిని వివిధ రాగాలలో కూర్చాడు. ❁

## 212. మరిగంటి అప్పల దేశికులు (1790)

శ్రీ వైష్ణవ కుటుంబానికి చెందిన మరిగంటి వారు నల్గొండజిల్లా నివాసులు. తర్వాత రాష్ట్రమంతా వ్యాపించారు. తెలుగు సంస్కృతాలలో బహు గ్రంధాలు రచించారు. కుతుబ్ షాహి, విజయనగర పాలకుల పోషణలో ఉన్నా ఈ కవులు ఒక్క రచనను కూడా ఆ రెండు రాజ వంశీయులకు అంకితం చేయక పోవటం మహా విశేషం. తమ ఇష్ట దేవతలకు మాత్రమే అంకితమిచ్చారు. అనుముల నివాసి అయిన మరి గంటి నరసింహాచార్య (1700) తెలుగులో చాలానూ సంస్కృతంలో 'శతవైరి వైభవాదివకరం' ఛందో గ్రంథాన్ని రాశాడు. ఈయన మనవడు, వేంకటాచార్య కుమారుడు అప్పలదేశికుడు నరసింహపురంలో నివసించాడు. లక్ష్మీ నృసింహస్వామికి పరమ భక్తుడు.

అప్పల దేశికులు సంస్కృత లఘుకావ్యాలు చాలా రాశాడు. అందులో ముఖ్యమైనవి 1) శ్రీరామ పాద స్తుతి 2) శ్రీ గోదా స్తవం 3) శ్రీ అర్వపల్లి లక్ష్మీనరసింహ స్తోత్రం 4) నరసింహాస్తోత్తరం 6) స్థంభగిరి లక్ష్మీ నరసింహ స్తోత్రం.

శ్రీరామ పాద స్తుతి 28 శ్లోకాల లఘు కావ్యం. ఒకటి రెండు శ్లోకాలు మచ్చుకి–

చిత్రం యాత్ర శిలాతలే సుఘటితం రామేణ పాద ద్వయం – సాక్షాల్లక్ష్మణవారుణాస్త్రవిభావజ్జాతం చ శీతం పయః

సీతాయాః కరుణా కటాక్ష విభవత్సంపాదితాస్సంపదో–మిత్రే రత్న వృతౌ నృసింహ నగరే జీవేయ మాయుశ్శతం

అర్వేపల్లి లక్ష్మీ నృసింహస్తోత్రంలో స్వామి ఉగ్ర, శాంత స్వరూపాలను వర్ణిస్తూ చెప్పిన శ్లోకాలు కమనీయం

"తుండ త్వండ త్తరంగ రావసిత భర పరిష్వంగ నిస్తండలింగ – ద్రుండం గంధానుగా త్రుగ్లం గగనగ గాంధర్వ గర్వ మహోర్మిం

దీప్యత్ స్వేతాత పత్రం మణిమకుటలసన్మస్తకం యుక్త పార్శ్వం – లక్ష్మీ క్షమాజ ముఖాబ్జాస కరుణా చరణం పూర్ణిమాచంద్ర వక్త్రం – సర్వోత్తంసంసమస్తాభరణవిలసితం కోటి సూర్య ప్రకాశం

నేత్రానంద ప్రదం తం మహా హ్రిది కలయే అర్వపల్లీ నృసింహం".

నరసింహ స్తోత్రం 27శ్లోకాల నక్షత్ర మాలిక .బీజాక్షర నిక్షిప్తం.

"శ్రీ వత్సాంకం త్రినేత్రం శశి సమ ధవళం చక్ర హస్తం సురేశం – వేదాంగో వేదనాదః ❁

## 213. కాదంబరిలాటి జయంతిక కర్త– జగ్గూ ఆల్వార్ అయ్యంగార్ (1800)

**ఈ**యననే కవివర జగ్గు శ్రీ వకుళ భూషణ అంటారు. మైసూర్‌లోని మెల్కోటేకు చెందిన బాల ధన్వి కుటుంబానికి చెందినవాడు. తండ్రి తిరుమార రాయ. జగ్గు గొప్ప కవిగా పేరు పొందాడు. కాదంబరి లాంటి జయంతిక కావ్యాన్ని నవరసభరితంగా ఇరవైవ ఏటనే రాసిన పరిణత బుద్ధి ఆయనది. శ్యమంతక, అద్భుతాంశుక నాటకాలను రచించాడు. ఇందులో రెండవది వేణీ సంహారానికి ఉపోద్ఘాతమే. "కరణారస సత్సరంగిణి, హయగ్రీవ స్తోత్రం కూడా రాశాడు.

ఇతని సోదరుడు సింగార అయ్యర్ శ్రీ కృష్ణ రాజ చంపు, యదుశైల చంపు, చిత్రకథా రహస్యం అనే యమకం రాశాడు. బాబాయి వేంకటాచార్య గ్రాస్దీ వర చరిత్ర, రామానుజ మతభాష విలాసం, కావేరి మహిమాదర్శం లేక శ్రీకృష్ణ రాజ సేతు బంధనం, (కనన్నంబాడి డాం పై) యాదవగిరి మహాత్మ్య సంగ్రాహం, వ్యాఘ్ర తాక భూ వివర వారుణం, (హల్కేరి సౌరంగం పసులపై) కాకన్యోక్తిమాల చంపకాన్యోక్తిమాల, కస్తూరికాన్యోక్తి మాలతోబాటు అనేక సోత్రాలు రాశాడు. వచన రచనగా దివ్య సూరి వైభవం రచించాడు. ఇతని తాత సంపత్కుమార స్తోత్రం కళ్యాణ పంచిక, వృత్తి ముక్త సారావళి రాసిన ఘనుడు. కనుక వీరి వంశంలో గీర్వాణం బహు కావ్య మాలలతో శోభించింది. ❁

## 214. భావ శతకకర్త– నాగరాజకవి (1800)

**కా**ర్పాటి గోత్రానికి చెందిన జల్లపుని కుమారుడు నాగరాజు. విద్యాధరుడు తాత. భావ శతకంలో తాను రాజునని తాక వంశమణి దీపాన్నని చెప్పుకొన్నాడు. వీరి వంశపు రాజులు చిన్న చిన్న రాజ్యాధిపతులు ఢిల్లీకి ఉత్తరాన యమునా నది ఒడ్డున కాష్టదేశ పాలకులయి ఉండవచ్చు. ఇతని భావ శతకంలో నూటొక్క శ్లోకాలున్నాయి. కొన్ని ప్రాకృతికంలోనూ రాశాడు. ఇందులో అనేక భావాలను వెదజల్లాడు. కవికర్ణ పూరుని చమత్కార చంద్రిక, నర్సోత్తమ దాస విశ్వేశ్వర, రచనలు త్రివిక్రముని వ్యాజోక్తి శతకం అన్నీ ఒకటిగానే కనిపిస్తాయి. ❁

## 215. రాణి మహాగ్నిచిత్ నరసింహ కవి (1800)

**ల**క్ష్మీదేవి, అనంతరామ శాస్త్రిల పుత్రుడైన ఈ నరసింహ కవి గత శతాబ్దపు గణిత శాస్త్ర మేధావి. 1860లో గోదావరి జిల్లా ఏనుగు మహల్‌లో జన్మించాడు. విజయనగర ప్రభువు ఆనంద గజపతి ఆస్థానంలోను, కశింకోట రాజు మారెళ్ళ వెంకటాచలం సంస్థానంలోనూ ఉన్నాడు. తర్వాత సన్యాసం స్వీకరించాడు. మహాగ్ని చిత్, సర్వ ప్రస్ట, ఆప్తోర్యామ మొదలైన యజ్ఞ యాగాలు చేశాడు. ఆగమ, మంత్రం శాస్త్రాలలో అఖండుడు. మహా శ్రీ విద్యోపాసకుడు ఆయన పూర్వీకులూ గట్టి ఉపాసకులూ కవులే. తన వంశ చరిత్రను ఇలా తెలియ జేశాడు–

'పరివ శక్తిర్మహతీ హ రాణి, సా సుప్రసన్నా హరి తన్వి యోస్మిన్ – రాజ్ఞీతితస్మాత్ ప్రదితోన్వ యోహం నృసింహ నామా కవి రతన రాజే ఇదంతా 'చిత్సూర్య లోకం'లో రాశాడు. కాల మానోపత్తి, తిధి మంజరిలలో కవి తన సర్వ ప్రతిభా ప్రదర్శన చేశాడు. చిత్సూర్య లోక అనే అన్యార్ధ నాటకాన్ని అయిదు అంకాలలో కశింకోట రాజు కోరికపై రచించాడు. ఈయనకే తన సిద్ధాంత కౌస్తుభం అంకితమిచ్చాడు. చిత్సూర్య లోక నాటకం సూర్య చంద్రుల మధ్య సంఘర్షణ. చివరికి సూర్యునిదే విజయం. దీనికి కారణం చంద్రుని భార్య నిశి. సూర్యుని భార్యదివాదేవికి ఈమెకూ స్పర్ధ వాళ్ళ జరిగిన కథ. నిషి తన భర్త చంద్రుడిని సూర్యుని అవమానించమని ప్రోద్బలం చేస్తుంది. నిశి చెలికత్తె భారతి దీన్ని అమలు చేస్తుంది. నాందీ ప్రస్తావన శ్లోకం–

'అజ్ఞా రోప్య నిజేతర క్రియమపి జ్యోతిః పరం నిష్క్రియం –వేద్యం జ్ఞాని బిరేవ సాక్షిణామిండా దారం విభుం ప్రేరకం 'సూర్యుని చెంత ఉండే పింగళ అనే విదూషకుడు, సూర్యునితోబాటు నడవ లేక కుంటివాడినయ్యానని బొంకే సన్నివేశంలో శ్లోకం–

'భగ్నేరుసుర తీస్తే గ్రహ పరి బృదయస్పందన రాకేకచాక్రః –భగ్నాన్యన్యాని చక్రణ్యనవధిక గతేస్తేశ్చపక్షిత్వ మపే'

నాలుగవ అంకంలో చంద్ర, సూర్య బలగాల మధ్య యుద్ధ వర్ణన చేశాడు. చంద్ర, బృహస్పతి భార్య తారల పుత్రుడైన బుధుడు తండ్రి వైపున కాక సూర్యునికి బాసటగా నిలిచి యుద్ధం చేస్తాడు. తండ్రీ కొడుకుల మధ్య ఉన్న సుదీర్ఘ వైరాన్ని రెండు

పిశాచాల ద్వారా వర్ణించాడు–

యదా రణిభవో వహిఃవిరుధ్యా రణిం భువి –బుధస్చంద్ర భవస్త ద్వాదర్తితే చంద్ర భంజేన'.

చంద్రుని బంటు రాహువు సూర్యునిపై చేరి గ్రహణం పట్టిస్తాడు.  నిత్యకర్మలకు, దాన తర్పణాలకు ఈ సందర్భం గా స్వార్ధ పరులైన పురోహితులు రాబడి కోసం నీచంగా తమలో తాము కలహించుకొంటారు –

'సంకల్పఃప్రధమం మయేవ కదితః స్నానస్య మంత్రాస్తదా – త్వం మధ్యే ప్రసభం ప్రవిశ్య కద యస్త ప్రజ్నరే నిస్త్రప'.  గ్రహణ స్నానాలు చేయటానికి వచ్చిన స్త్రీలను కొందరు ఆకతాయిలు అల్లరి చేస్తారు.  దీనిపై యువతులు అభ్యంతరం చెప్పి ఒకరితో ఒకరు ఇలా మాట్లాడుకొంటారు –

'గచ్చన్న చుమ్బత్ కరి చర్మాంకుచయోః కరిద గ్రహీతు  –దస్త వాను కరి చద ఘరె  నిశా ప్రాయా దివం యతః

రవి బుధులకు రక్షణగా  పృథ్వి వస్తుంది – ఆమె వర్ణన–

'ధాత్రీ మిక్షు ధనుః ప్రసూన విశిఖం శాలేశ్చసన్మంజరీ – కీరం హస్త చతుష్ట యేనదధతీంమాణిక్య భూషోజ్జ్వలం

నానా వర్ణ విచిత్ర దివ్య వసనం శ్యామా మురోజోన్నతం – తన్వంగీ వికచోత్పలే క్షణ యుగం దిస్త్యాస్త్ప్రహం దుష్టవాన్

భూదేవత బుధుడికి విశ్వం ,మాయా, చిత్ మొదలైనవాటిని వివరించి చెబుతుంది .కధకూ దీనికి సంబంధం ఏమీ ఉండదు –ఒక శ్లోకం – 'భ్రాంతి స్తవే యమభవన్నను వత్స పశ్య –సా తే పయాతు బృహదంతర దర్శనేన

అధ్యాస మధ్య గత వనసి లోక దృష్ట్యా – నైజేక్షణేన యది పశ్యసి నేక్షతే సౌ

భరత వాక్యంగా చెప్పిన శ్లోకం –

'అవతు భగవతీ వర శ్యామ లాంగీ ధరిత్రీ –భవతు శుభ మపారం బ్రాహ్మణానాంబుధానాం

నయతు నృపతి లోకః సత్పధం మానవౌఘాన్ –జయతు విమల కీర్తి ర్భూషిత ర్వేంక టాద్రిః❁

## 216. యదుగిరి భూషణ చంపు కవి- అప్పలాచార్య (18వ శతాబ్దం)

శ్రీశైల కుటుంబానికి చెందిన లక్ష్మీ, రాఘవాచార్యుల కుమారుడే అప్పలాచార్య. తిరుపతి నివాసి. 'యదుగిరి భూషణ చంపు' రాశాడు. యదుగిరి అనే మెల్కోటే అనే వైష్ణవ ముఖ్యక్షేత్ర పవిత్రతను ఇందులో వర్ణించాడు. గీర్వాణాంధ్రాలలో గొప్పకవి. వీర రాఘవ శిష్యుడు. కవికాలం తెలియదు. కావ్య ప్రారంభ శ్లోకం -

"శ్రీమానబ్జాభవాదిమస్తక తటన్యస్తప్రశ స్త ప్రభా - వాస్తుస్నిగ్ధా చిరత్న రత్న మకుటా సంగో లసత్రున్నగః"

గురువు వీరరాఘవుని పై చెప్పిన శ్లోకం చూద్దాం -

"శ్రీ భాష్యామృత పూరితం గురుతరం శ్రీ వైష్ణవైశ్చాతకైః-నిత్యం సేవితమాత్మ సస్యాని కరనాత్యంతతాపోద్రుతాం - దిన్వంతమ్రసవత్తయా హృది భజే శ్రీ రాఘవ స్వామినం"

చివరి శ్లోకం - "సాదురన్న హృదయంగమోజ్జ్వలం భాను కూటనిభనాయకో జ్జ్వలం
మాననీయ గుణ బంధ పోషణం రాజతే యదుగిరీశ భూషణం".

ఆశ్వాశాంత గద్యలో - ఇతి శ్రీ త్సేందవ కన్దరదేవా లబ్ధ సంస్కృతాంధ్ర భాషా చతుర్విధ కవితా ధురంధరస్య, శ్రీ వేంకటాద్రి నివాస చరణ కమల కిమ్కరస్య, శ్రీ మద్వీర రాఘవ గురు చరణనీరజ భ్రున్గస్య శ్రీ శైలాన్వాయ దుగ్ధ సింధు జస్య, శ్రీ రాఘవార్య తనూజస్య, శ్రీ లక్ష్మీ గర్భ శుక్తి కా మణోరప్పలాచార్యస్య, కృతిషు యదుగిరి భూషణాఖ్యం చంపూ కావ్యం సమాప్తం.❁

## 217. తడకమళ్ళ కృష్ణ మార్య (18వ శతాబ్దం)

**1**8వ శతాబ్దానికి చెందిన తడక మళ్ళకృష్ణ మార్య కవి 'తారావళి' అనే లఘుకావ్యం రాశాడు. 27శ్లోకాలలో ఉన్న శ్రీరామ స్తుతి ఇది. 1879లో రాసిన 'ద్రుగ్గణితం'లో కవి వివరాలున్నాయి. రంగరాయ, కనకాంబలు పెంపుడు తలిదండ్రులు. అసలు తలిదండ్రులు కుట్టిమాంబ, రంగరాయలు. సోదరుడు వెంకన్న పండితుడు. చిత్తూర్‌జిల్లా కార్వేటి నగరం పాలకుడు. బొమ్మ రాజు ఆస్థాన మంత్రి. కవి తెలుగు సంస్కృత ఆంగ్ల మళయాళ భాషలలో మహా పండితుడు. నుంగం బాకం కేలండర్ తయారు చేయటానికి ప్రోత్సహించాడు. ఇప్పుడు కవి గారి రెండు శ్లోకాలు చూద్దాం –

'శ్రీవాస వత్స చిహ్నాంచిత వక్షస్థల ధారా సుతా జానే – త్వమహి దయా దృష్ట్యా మందాక్రాంతం రక్షమాం దయాశరధే'

రత్న కిరీట ధరా చ్యుత రామానంత ముకుంద దయాశరధే – కిమసౌ శనిరివ కిం కురుతే మాం పరిపాలయ దాశరధే'

శ్రీరాముని దయా, కృపా వుంటే శని కూడా ఏమీ చేయలేదు అనే నిశ్చల మనస్సును ఆవిష్కరించాడు. ❁

## 218. లీలార్ణవ రచయిత– కలువే నంజరాజు (18వ శతాబ్దం)

**క**లువే వీర్రాజు అనే చంద్ర వంశ క్షత్రియుని కుమారుడు నంజరాజు. భారద్వాజస గోత్రం. తండ్రి సైన్యాధ్యక్షుడై తర్వాత 18వ శతాబ్దంలో మైసూరురాజు అయ్యాడు. తండ్రిలాగానే కొడుకు నంజరాజు తెలుగు కన్నడ సంస్కృతాలలో కవి. ఎందరో కవిపండితులకు ఆశ్రయమిచ్చి 'నవ భోజ రాజు' అని పించుకొన్నాడు. ఇతని ఆస్థానకవి నవ కాళిదాసు 'నంజరాజ యశో భూషణం' కావ్యం రాసి అంకితమిచ్చాడు. నంజరాజకవి 'హాలస్య మహాత్మ్యం', 'కాశీ మహిమార్థ దర్పణం' అనే రెండు తెలుగు కావ్యాలు రాశాడు.

సంస్కృతంలో నంజరాజు 'శివపాద కమల రేణు సహస్రం' అనే వెయ్యి శ్లోకాల కావ్యాన్ని శివునిపై రచించాడు. దీనినే శివ లీలార్ణవం అంటారు. ఇది వేదాంత దేశికుల పాదుకా సహస్రంకు అనుకరణ. ఇది 25 పద్ధతులుగా విభజింపబడింది. ప్రతిదానికీ ప్రస్తావన, ప్రభావ, భావన, రూప, ప్రసాదాన, శృంగార, కుసుమ, ప్రణామ, స్తుతి, సంచార, నియమ, స్వాతంత్ర్య, తాండవ, రత్న, అర్చన, నక్షత్ర, విడంబన, భక్తి, శాస్త్ర, యోగ, విశ్రాణన, దయా, లక్ష్మి, శైశవ, చిత్ర అని పేర్లు పెట్టాడు. మొదటి శ్లోకం–

'ఈశం శైల సుతా నిభాస్య రారజో చండీశ్వరం నందినం –నత్వా భ్రుంగి రిటింత్రిషష్టమహితాశ్చభక్త్యున్నతాం క్తం'

చివరి శ్లోకం–

'భద్రాకారం వహతు సదా నః స్వాన్తోమూర్తిం శివ పాద రేణోభవ్యే–భవ్యేదాసేమయి

కరుణా ర్ద్రే భంగే స్తాపం శమయ సుధా దృష్టీనాం'

ఆశ్వాశాంత గద్యలో – 'ఇతి శ్రీ చంద్ర కుల జలధి కౌస్తుభ శ్రీ కలువే శ్రీ వీర రాజ గర్భ పయః పారావార తనూభవాభి నవ భోజ రాజ బిరుదాంకిత నంజ రాజ విరచితే శివ లీలార్ణవ నామ్నిశివ పాద కమల రేణుకా సహస్రే చిత్ర పద్ధతిః సమాప్తా'. నంజ రాజు రాసిన రెండవ గ్రంథం 'గీతాగంగాధరం' ఇదీ శివ స్తుతియే. గీత గోవింద పద్ధతిలో ఉంటుంది. నాలుగు కాండల కావ్యం. దీనికి అదే ఆస్థాన పండితుడైన కాశీ పండితుడు రాసిన శ్రవణానందిని అనే వ్యాఖ్యానం ఉంది. మొదటి శ్లోకం–

'శ్రీ శైలజా చరణా పరసక్తి చిత్తః శ్రీ కంఠ పాద సరసీ రుహ చంచరీకః –శ్రీ వీర రాజ నృప శేఖర సత్కుమారఃశ్రీ నంజరాజ సుకవిఃకురుతేప్రబంధం'. తరువాత శ్లోకాలలో వంశ చరిత్ర చెప్పుకొన్నాడు. చివరగా –

"వీర నృపాల నందన నంజమహీపతివిరచిత గీతం – ధీరజనాయ తనోతు శుభాని సదా శివ వర్ణన పూతం' అని పూర్తి చేశాడు.❋

## 219. మోక్ష గుండం నారాయణ (18వ శతాబ్ది మధ్యకాలం)

**మై**సూర్ రాష్ట్రంలో మోక్ష గుండం ఇంటిపేరున్న బ్రాహ్మణ కవి నారాయణ. తండ్రి వెంకటార్య 18శతాబ్దంలో జీవించాడు. నారాయణ కవి హరిశ్చంద్ర చంపు రాశాడు. ఇది పద్య, గద్యాత్మకం. సూర్య వంశజుడైన సత్య హరిశ్చంద్రుని కథ. మూడు విలాసాల తర్వాత కథ తెలియదు. శ్రీ కృష్ణ ప్రార్ధనతో ప్రారంభించాడుకవి.

"వందే తం దేవకీ పుత్రం మందేతర గుణార్నవం- వందారు ముని బృందార వృందా వన పరాయణం"

తన కుటుంబాన్ని సవివరంగా తెలియజేశాడు. సమకాలీన రాజునూ పేర్కొన్నాడు. ఆయన రాసిన దానిప్రకారం గౌతమ గోత్రానికి చెందిన మోక్ష గుండం సర్వ సూరి. ఆయనకు కామయ కొడుకు. ఈయన భార్య లలితాంబ. వీరి కొడుకు హొన్నయ్య, కోడలు వెంగమాంబ. వీరి పుత్రుడు వెంకట రాయ. ఈయన మొదటి భార్య కృష్ణమాంబ రెండవ భార్య సీతమ్మ. మొదటి భార్య కుమారుడే మన కవి నారాయణ. రెండవ భార్య కుమారుడి పేరు కూడా నారాయణ. మోక్షగుండం వారికి రత్నగిరి వీర రాజుపోషకుడు. ఈ వంశం మూల పురుషుడు 1700-1759 కాలపు చిక్కదేవరాయ రాజు వద్ద సైన్యాధ్యక్షుడు. మంత్రి అయిన కలువే వీరారాజు. కనుక మనకవి 18వ శతాబ్ది మధ్యవాడు. పింగల నామ సంవత్సర విజయ దశమినాడు ఈ కావ్యం రాసినట్లు తెలుస్తోంది.

"యస్మిన్ కృష్ణ కృపా ఝురీ భర పరీత పాంచ సౌదా పగాః
రింగత్తురంగశీకర కణాఃకల్ప ప్రసూనాయతే
తన్నారాయణ ధీమత స్సురుచిరో కావ్యామృతే చాదిమః-చంపూ నామని సంవిదాంకృత సముల్లాసో విలాసోగమత్"❁

## 220. మరో పద్మనాభుడు (18శతాబ్దం)

**కా**లం వగైరాలేవీ తలియని ఈ పద్మనాభుడు వేంకటాంబ, లక్ష్మణ దంపతుల కొడుకు. 'లీలా దర్పణ భాణం' రాశాడు. ఇది శృంగారం రంగరించిన నాటకం. నాయకుడు లీలా శేఖరుడు, నాయిక లీలావతి. ఈమె తొలినాట్యాన్ని తిలకించిన హీరో ప్రేమలో పడిపోయాడు. దీనికి 'మదన లీలా దర్పణ భాణం' అనే పేరూ ఉంది. అసంపూర్తి రచన. కాశీకి వెళ్లి కవి దీన్ని రాసి ఉండాలి, లేక ఊహించి రాసైన ఉండవచ్చు. ప్రారంభం అలా అలా సాగిపోతుంది –

'లీలాలాలస మానసాభి రభి రభితో గోపీభి రంతః పురే – వ్యాలిప్తో మృదు చందనేన దిశతు శ్రేయస్సమే శ్రీ పతిః

నాంది తర్వాత శ్లోకం – 'చలత్తిమిర చుమ్బితాంబురుహ విరీ బిమ్బోల్లాస – చ్ఛకారే మద కాలికొచ్చలితచక్రనృత్త క్రమైః'

ప్రస్తావనలో పది శ్లోకాలు వంశ వర్ణన ఉంది. వంశ క్రమం – గణపతి –పద్మనాభ –లక్ష్మణ భార్య, వెంకమాంబ – సుబ్రహ్మణ్య– పద్మనాభ కవి. సూత్రధారుడు కవిని వంశాన్ని పరిచయం చేస్తాడు.

"శ్రీమాన్ శ్రీమదుమార్ద దేహ కరుణా పూర్ణాజ్వలప్రేక్షణ – ప్రాప్త శ్రీ కవితామృతాబ్ధిలహరీ సంతోషిత శ్రేకవిః

శేషా శేష వచో విశేష విలస త్సౌర సౌభాగ్య భీ–ద్వాక్ప్ శ్రీ రథ పద్మనాభ సుకృతీ శ్రీ పద్మ నాభోపమః

ఘన చిద్భోదాయతి" మనకవి గురువు అని తెలుస్తోంది. ఈయనే కొల్లూరి రాజశేఖరుని గురువు బోధానంద ఘనేంద్ర గురు అయి ఉండవచ్చు. కనుక కవి 18 శతాబ్దివాడు. ❁

## 221. పుణ్యకోటి (18శతాబ్ది)

**బో**ధానంద ఘనేంద్ర యోగి శిష్యుడైన పుణ్యకోటి 11 సర్గల 'కృష్ణ విలాసం' అనే కావ్యం రాశాడు. ఇది భాగవత దశమ స్కంద కథ. దీనిపై అజ్ఞాతకవి రాసిన వ్యాఖ్యానం ఉంది. కవి జీవిత చరిత్ర ఎక్కడా లేదు. కావ్యాన్ని ఇలా ప్రారంభించాడు.

'మార్గెంత ర్నాలి నొల్ల సన్నిజ ముఖం సప్రేమ హాసం ప్రియా - పశ్యన్తిం నయనాన్జలాంజ లకచాం యాంతీంశనై రుక్మిణీం

గురువును గురించి - 'వాచం యస్య నిశమ్య శేష ఫణి రాట్ పాతాలమాప ప్రియా-మౌనం గౌతమ జైమినీ కిల రాతౌ భట్ట స్సుదా ర్మాగతః - వ్యాసాధ్యః కమలాసనస్య భవనం యాతాః సమే సద్గురుః-బోధానంద ఘనేంద్ర యోగ యతి రాట్ జాజాయతాంమానసే'

బోధానందుడు కొట్లూరి రాజశేఖర కవికి కూడా గురువే కనుక మనకవి 18వ శతాబ్దివాడు.❀

## 222. నవీన పతంజలి శ్రీధర పేరు సూరి (18 శతాబ్దం)

**షా**హాజి మహారాజు ప్రాపకంలో ఉన్న కౌశిక గోత్రీకుడు శ్రీధర వేంకటేశ వేంకటాంబల పుత్రుడే శ్రీధరుడు. రాజు చేత షాజీ రాజ పురాగ్రహారాన్ని పొందాడు. 18వ శతాబ్ది ప్రారంభం వాడు. వ్యాకరణంలో అఖండ ప్రజ్ఞావంతుడై నందున 'నవీన పతంజలి' బిరుదు నందుకొన్నాడు. వ్యాకరణ, నాటక, కావ్య, రచయిత. సూరి 'వసుమంగల నాటకం' అయిదు అన్కాలలో రాశాడు. గిరికా వసురాజుల ప్రేమ కథ. మధుర మీనాక్షి ఉత్సవాలలో ప్రదర్శించేవారు. రామ రాజ భూషణుని వసు చరిత్ర ఆధారం. ఈ నాటకానికి వ్యాఖ్యానం కూడా ఉంది. రచయిత పేరు తెలియదు. ప్రారంభ శ్లోకం–

'అస్టాభిఃస్వకలాభి రేవ రమణీ రూపాభి రాపాదితా –ముధద్ర తృఘటీ వినిస్సృత మణీదారాభి షేక శ్రియం

కొటీరోపరిమాణ్య ప్రణయినీ రాగ ప్రణాలీమివ – స్తేమా కశ్చిదుదేతుమంగళ పరీఖండాను షంగా యనః'

తర్వాత శ్లోకాలలో కవి వంశ ప్రస్తావన, రచనల వివరం ఉన్నాయి. సంస్కృతంలోః పేరు సూరి శ్రీ రామచంద్ర విజయం, భరతాభ్యుదయం, చకోర సందేశం, వెంకటభాణం కూడా రాశాడు. ఇందులో చకోర సందేశమొక్కటే దొరికింది. ఇదీ అసంపూర్ణమే. మేఘ సందేశానికి నకలు. మందా క్రాంత వృత్త విన్యాసం. కైలాసానికి మీనాక్షీ సుందరేశ దర్శనానికి వచ్చి దంపతులు వ్యాఘ్రపాదుని శాపానికి గురై చకోరంతో అచ్చోద సరస్సు నుండి సందేశం పంపిస్తాడు. ఇందులో ప్రేయసి ప్రియుల పేర్లు లేవు. మొదటి శ్లోకం–

'కర్తుం సేవా ముపగత వతా సుందరేశోప కంఠం–ప్రత్యుత్థాన ప్రణతి విదురో వ్యాఘ్ర పాదేన శాపః
కామీ కరిచత్ పశు పతి పాదాంభోజ విన్యాస ధన్యే – కైలాసాద్రిస్థితి మతనుత ప్రేయసీ విప్రర యుక్తః
మొదటి సగం చివర – 'ఇతి శ్రీ ధర వంశ శిఖావతంస,వైదుష్య సింహాసనాధీశ్వర పద వాక్య ప్రమాణ కూలంకష సాహిత్య మర్యాదాదురంధర నవీన పతంజలి బిరుద సంభావిత శ్రీ పేరు సూరి విరచితే చకోర సందేశ మహా కావ్యే పూర్వస్సందేశాస్సమాప్తః'
చకోరం కైలాస గిరి నుండి పాండ్య దేశంలోని హాలస్య నగరికి ప్రయాణం చేసింది. మధ్యలో ఉన్న నదులు నగరాలను వర్ణించాడు. గోదావరి నది బ్రాహ్మణాగ్రహార వర్ణన –
'మజ్జత్కాంతా జన కుచ తటీ హార దీప్తి ప్రరోహే–గచ్ఛాచ్ఛానామల దుప యసామపత ంత్యః ప్రవాహైః
గోదావర్యాస్తట భువి తతః ప్రేక్ష్య విప్రాగ్రహరాన్ –ప్రాయస్తాంస్తాం ద్విజ వర హృది స్నేహ ముచ్చే ర్భాజేధాః'
అంతర్వేది నృసింహ, శ్రీశైల క్షేత్రాలను చూపించాడు .వియోగ బాధను వెళ్ళ గక్కించాడు.
'సా చన్ద్రస్య చపల నాయనా కంబు కంఠీ సుకేశీ – ముగ్ధా లాపా మధుర హసితా మంద యానన
స్సాజాత్యేన త్వితర వనితా రత్వేకషస్త త్రప్రయోగః' ❁

## 223. రామ కవి (18వ శతాబ్దం)

**ఆ**త్రేయ గోత్రీకుడు రామకవి 'సిద్ధాంత సంగ్రహం' రాశాడు. శివుడిని బ్రహ్మంగా భావించి రాసిన కావ్యం. నూజివీడు ప్రభువు శోభనాద్రి అప్పారావు ఆస్థాన కవి. దీనికి బహుశా కవే వ్యాఖ్యానమూ రాశాడు. ప్రారంభ శ్లోకం–

'విద్యాత్కల్ప తరో విష్ణు సమారాధన తత్పరాత్ – దీనావన సమాసక్తా చ్ఛ్రుతాశానాత్
నూజివీటి పురాధీశాచ్చోభనా ద్రప్పారాయతః – అనాయాసేన సంలబ్ధ జీవన స్థిరసన్మతిః'

శివుని గురించి వర్ణన–

'త్వమారాధ్యాశ్శంభో సహృదయ హృదయాకాశావివరే – తతో బ్రహ్మాదీనాం యదసి పరమం కారణామితి
శ్రుతిః స్తోతి త్వాతో సుమతి మఘమమ్యాహి కృపయా –న చేదేవం చాహం నరక భవనః స్యాం హర విభో'

సోపద్రుష్టః పరబ్రహ్మ గురుం సిద్ధాంత సంగ్రహం – యువాద్ధ ఊర్జే రాకాయాం రామస్వామ్య లిఖత్ స్మరన్'❁

## 224. చంపక రామచంద్ర (18వ శతాబ్దం)

వైకుంఠ పతికోడుకే రామచంద్ర 'సర్వమాన్య చంపు' రాశాడు. చందాసాహేబ్‌కు ఫతే సింగ్‌కు మధ్య ఉన్న వైరాన్ని గూర్చి రాసిన చారిత్రిక గాథ. 18 శతాబ్దిలో జరిగిన కర్నాటక యుద్ధాలు వర్ణించాడు. 18వ శతాబ్దంలో ఆర్కాట్ నవాబు చందా సాహెబ్. మధుర నాయక రాజ్యం కూలిపోవటానికి కారకుడు. తర్వాత కర్నాటక నవాబు అయ్యాడు. ఆతను చేసిన హింసా దుష్కృత్యాలన్నీ వివరంగా రాశాడు కవి. 10వేల సైన్యంతో నాజర్ జంగ్ సాహెబ్‌పై దండయాత్ర చేస్తుంటే మహారాష్ట్ర మిలిటరీ ఆఫీసర్ మురారి సహాయం చేశాడు . తర్వాత ఈ మురారి గవర్నర్ అయి శాంతి స్థాపన చేశాడు. మురారి ప్రోద్బలంతో కవి ఈ రచన చేశాడు. మధుర సైన్యాధికారి ఫతే సింగ్ చందా సాహెబ్‌ను 1752 జూన్‌లో చంపేసి హీరో అయ్యాడు.

అనేక మంది ఆంధ్రులలాగానే కవి కూడా మధుర నాయకుల పాలనలో తమిళనాడులోని కురుకనగరంలో ఉన్నాడు. సంస్కృతాంధ్రాలలో ద్విభాష కవిని అని చెప్పుకొన్నాడు. ఇతని కవిత్వం మధురా విజయం రాసిన గంగాదేవి కవిత్వంలాగా ఉంటుంది. కర్నాటక రక్షకులైన ఫతెసింగ్ , మురారిలా వర్ణన శ్లోకం–

'తదను విహిత ఫత్తేసింగు ధర్మోపదేశ స్సమను రచిత విద్వజ్జజ్జాలాచి తర ప్రమోదః – సన్యవతిపాండంచక్షోనణీ చక్రం మురారి ప్రభు ర్యామితి వార్తా దిక్షు ప్రవృత్తా'.

చివరి శ్లోకం –

'దిస్త్యా మహా రాష్ట్ర భటైర్విశస్తా స్సాధ్యప్రశస్తా యవనాస్సమస్తాః–డిస్త్యామురారి ప్రభురేషజాతః పాండ్య క్షమా మండల మండనశ్రీ

దత్తే కవిభ్యో దయమాన చేతా – మురారి నేతా ముహురీ ప్సితార్థాన్ – వయం ప్రయామ స్త్రిశిరః పురీం తాం ప్రకాశ యామః పటు వాఖిలాసాన్'❁

## 225. పిల్లల మర్రి వేంకటపతి సూరి (18వ శతాబ్దం)

**'రా**జేశ్వరవిలాస మహాకావ్యం' రాసిన పిల్లల మర్రి వేంకటపతి సూరి నాగ లింగ సోమయాజి కుమారుడు. కౌశిక గోత్రం. దీనిని భాగాపురం అంటే హైదరాబాద్ వాసులు బ్రాహ్మణ దంపతులైన గౌతమ గోత్రీకులు లక్ష్మీనారాయణ నాగమాంబల కుమార్తే. మహా రాజ్ఞి రాజేశ్వర భూపతికి అంకితమిచ్చినది. మహా కావ్యమనే పేరే కాని ఇది అలంకార శాస్త్రం. అందులో 12 పత్రాలేఆచార్య బిరుద రాజు వారికి లభించాయి. అవి కూడా వరుసలో లేవు. దొరికిన దానిలో వంశ ప్రకరణం అలంకార ప్రకరణం న్యాయ ప్రకరణం ఉన్నాయి. మొదటి అధ్యాయంలో మొదటి అంకం అన్నాడు- ఇది నాటకానికి వర్తించేది. కథ విషయానికి వస్తే-

సాకేత రాజసోదరులు నిజాముల్- ముల్క్ చేత ఓడింప బడ్డారు. రాజ సోదరుల పౌరుష పరాక్రమాలను బాగా వర్ణించాడు కవి.

'సూరాస్సాహసికా స్త్రయసమానాధిక ప్రావీణ్య వంతో ధను - ర్విద్యాయాం రాజ వాజీ రాజిస్త సంపత్తి ప్రశేనాశాతాః

సాకేత నగరే వినోదాన కదాలాపోర్నిశా యాపనం - కుర్వంతః పరిపాలయంతి విషయన్యధ్యాదితేయద్రుమాః'

తరువాత యువరాజు రాజేశ్వరుని అతని భార్యను వర్ణించాడు. అలంకార ప్రకరణంలో ఉపమాలంకారంతో ప్రారంభించాడు. సంబంధాతిశయోక్తి వర్ణన చేశాడు. చివరిది న్యాయ ప్రకరణం.

హైదరాబాద్ భాగ్యనగరంగా లేక భాగ నగరంగా ఉన్నప్పటి రచన ఇది. ఈ వంశపు మొదటి రాజు నిజాముల్ ముల్క్.❋

## 226. చెరుకూరి వెంకట రెడ్డి శాస్త్రి (18వ శతాబ్దం)

రెడ్డి శాస్త్రిగా పేరున్న చెరుకూరి వెంకట రెడ్డి శాస్త్రి వేంకటకవి వెంకాంబల పుత్రుడు. నడిమింటి సంగమేశ్వర శాస్త్రి గారి శిష్యుడు ,అల్లుడు. గురువుగారితో మంత్రం శాస్త్ర వ్యాకరణాలలో సమాన పాండిత్యం ఉన్నవాడు. శాస్త్రిగారమ్మాయి విశాలమ్మను వివాహమాడి అల్లుడయ్యాడు రెడ్డి శాస్త్రి. ఇక్కడ రెడ్డి అనేది గౌరవ వాచకం.

రెడ్డి శాస్త్రి సంస్కృతంలో 'గీతా గిరీశం'ను గీత గోవిందం మాదిరి రాశాడు. ఉమామహేశ్వరుల ప్రణయ లీలా వృత్తాంతమే ఇది. దీన్నీ శిష్యుడు జయంతి కామేశం ముద్రించాడు. కొన్ని శ్లోకాలు–

'ఇక్షు గ్రామ కులాగ్రయ వెంకట కవేః పుత్రః పవిత్రః కృతీ – వెంకమామ్బోదర శుక్తి మౌక్తిక మణిరశ్రీ వెంకటార్యస్సుధీః

చక్రే గీత గిరీశ కావ్య మధునా యో గీత గోవింద కృత్ – ప్రాగాస్సీజ్జయదేవ ఇత్యాభిదాయా లీలాం శివస్యోజ్వలాం.

చివరి శ్లోకం–

'మణి కాచవత్రుసిద్ధో జయ దేవ గ్రంధ మత్కృత గ్రంధో – మద్గ్రందోదార్య స్సయాదాధునికై రర్ధ గౌరవా భావాత్'

ఇదికాక 'శైవ శతకం, నవగ్రహాస్టకం'లతోబాటు కొన్ని చాటువులు కూడా రాశాడు. రుచికి కొన్నిచాటువులు,

'మానస గోపాలేశం భజనా క్ర్యశ్రయోపి గోపాలేశం – యస్మిన్ గోపాలేశం ప్రాపర్ని గణ శి స్ర్సాయో పిగోపాలేశం'

రవయోరి శైల పవయే తమోపహ చ్ఛవయేరూపాయ కవయే నమోస్తుతే – న వయేత్ సర్వ శివాయేన సంయుత ధ్రువయోడితాత్మ భవ యేశ శోభయా'

పంచ దశి స్తోత్రం లో రెడ్డి శాస్త్రి మామగారి శ్లోకానికి పూరణ చేశాడు. సరదాగా మామా అల్లుళ్ళ సవాల్ చూద్దాం–

మామ సర్వమంగళశాస్త్రి – 'సవిదా ద్దితయ సమత్వం రంభాయుగలస్య సంభావత్యేవ

- ఊర్ధ్వా ముదన్విత మూలం తద్యుగలం చేహ్వా రీనాం'
దీనికి అల్లుడు రెడ్డి శాస్త్రి గారి పూరణ. అంబ తవోరుద్వి తయం రంభాయుగమేవ జఘన పులినో ర్థం-వేణీ యమునా వేగా దధరీకృత మపి చ సంహ తచ్చదనం'.
తులసిగురించి చెప్పిన శ్లోకం-
'తులసి చత్వరే భాతి కలశీకృత తమంటపే - కు లసీమంతి నీదత్త జలశీకర వర్ధితా'
సమకాలీన కవి గొర్తి సాంబమూర్తి పార్థివలింగంతో శివార్చన చేసినప్పుడు మామా అల్లుళ్ళు కలిసి చెప్పిన శ్లోకం-
'శ్రీ గొర్తి సాంబ మూర్తేః కోర్తిః కార్తిక యుదు స్ఫురన్మూర్తిః - నర్తి తమార్తిక మూర్తే సార్తహరాల్లబ్ధ కామ సంపూర్తేః'.❋

## 227. మహిష శతకం రాసిన - వంచేశ్వర కవి (18వ శతాబ్దం)

**గో**వింద దీక్షితుని వారసుడు వంచేశ్వరుడు భోసల కుటుంబానికి చెందినవాడు. తుక్కోజి మహారాజుకు 1728-1735 మంత్రిగా ఉండేవాడు. ఇతను రాసిన 'మహిష శతకం' హాస్య ప్రాదాన్యమైనది. రాజును పొగుడుతూ తిడుతూ దున్నపోతుగా అభివర్ణిస్తూ నిందా స్తుతిగా దీన్ని రాశాడు. శరభోజి కాలంలో సదాజీ కవి 'సాహిత్య మంజూష'ను 1825లో రాసి శివాజీ వంశ ఔన్నత్యాన్ని కీర్తించాడు. 1833-1855 కాలపు శివాజీ రాజు కాలంలో ఈశ్వరుని కొడుకు వీర రాఘవకవి 'వల్లీ పరిణయ' నాటకం రచించాడు.❋

## 228. విష్ణు విలాసం రాసిన రామపాణి నందుడు (18వ శతాబ్దం)

**రా**మకవిని కుంజున్ని నంబియార్ అంటారు. కొచ్చిన్ రాష్ట్రంలో కున్నాకులం లో వారియర్ కులంలో జన్మించాడు. నారాయణ భట్టుకు శిష్యుడు. 18 వ శతాబ్ది మధ్య భాగం వాడు. మలబార్ ప్రాంతంలో సంస్కృత ప్రాకృతాలలో గొప్ప కవి. కొంతకాలం జమోరిన్ సంస్థానంలో ఉన్నాడు. అక్కడి దేవాలయాలలో మృదంగం వాయించేవాడు. ఎనిమిది కాండలలో "విష్ణు విలాస కావ్యం" రాసి ఆయన తొమ్మిది అవతారాలనూ వర్ణించాడు. శ్రీకంఠ కుటుంబానికి చెందిన రాజా రామవర్మ ఆదేశంపై "ముకున్దస్తవం" రాసాడు. సెంద మంగలంలో ఉంటుండగా పూర్వ, ఉత్తర భాగాలుగా 20 కాండలలో రామాయణం మొత్తాన్ని "రాఘవీయం"గా రచించాడు. ఈ కవి "లలిత రాఘవీయం" మరియు "పాదుకా పట్టాభిషేకం" నాటకాలు రాసాడు. "చండిక" అనే దాన్ని "వీధి"గా రచించి తిరువనంతపురంలో ప్రదర్శించారు. రాజా వంశీ మార్తాండ కాలంలో మదనకేతు చరిత్ర ప్రహసనం రాసాడు. అనేక శాస్త్ర రచనలతో పాటు ప్రాకృతంలో "ఉషానిరుద్ధ", "కంస వధ" రాసాడు. సుకుమారుని "కృష్ణ విలాసం", "కృష్ణ లీలా సుఖం", "గోవిన్దాభిషేకం"ల పైనా నారాయణ కవి రాసిన ధాతు కావ్యాలపై గొప్ప వ్యాఖ్యానాలు రాసాడు.

క్రంగనూరు యువరాజు రామవర్మ 1800 కాలం వాడు. 12 కాండలలో "రామ చరిత"నూ, "రసానంద భాణం" రచించాడు. ❀

## 229. తిమ్మకవి (18వ శతాబ్దం)

**కూ**చిమంచి వంశానికి చెందిన తిమ్మకవి కౌండిన్య గోత్రీకుడు ఆంధ్రప్రదేశ్‌లో పిఠాపురం దగ్గర చంద్రం పాలెం నివాసి. కుక్కుటేశ్వర స్వామి అనుగ్రహంతో గొప్ప కవిత్వం, సకల శాస్త్ర పరిచయం అబ్బింది. అతని 'సుజన మనమనస్కుముద చంద్రిక' ముత్తాత తిమ్మకవి రాసిన' రసిక జన మనోభిరామం'కు సంస్కృతీకరణం. ఇందులో కథను ఇంద్రుడు కేరళకు చెందిన మహా భాగుడికి చెబుతాడు. కరాళ వక్త్రుడు అనే కేరళ రాజు వేటకు వెళ్ళినప్పుడు ఒక అమ్మాయిని చూసి మనసు పారేసుకొని వెంటపడి ప్రేమించి పెళ్లి చేసుకొంటాడు. ఆమె పెంపుడు చిలుకను వెంబడిస్తూ ఒక శివాలయంలోకి ప్రవేశిస్తాడు. అక్కడ కిందపడి శివనామం జపిస్తూ మరణించి కైలాసంచేరుకొంటాడు.❋

## 230. అభినవ కాదంబరి కర్త- అహోబిల నృసింహ కవి (1795- 18వ శతాబ్దం)

**రా**మ కృష్ణాధ్వరి కుమారుడు, నారాయణ సూరి మనవడు అయిన నృసింహకవి తెలుగు వేగినాటి కాశ్యప గోత్రీకుడు. కవి వంశమే వీరిది. మైసూరు రాజుల ప్రాపకం లోని కవులే వీరు. 1795 వాడైన మూడవ కృష్ణ రాజ ఒడియార్ రాజు కాలంలో నారాయణ పండితునితో స్పర్ధ వచ్చి కాదంబరితో సరిసమానమైన కావ్యం రాస్తానని ప్రతిజ్ఞా చేసి 'అభినవ కాదంబరి' రాసి అందరినీ ఆశ్చర్యపరచాడు. దీనికే 'త్రిమూర్తి కల్యాణం' అనే పేరు కూడా ఉంది. ఇది రెండు భాగాలు. కృష్ణ రాజు వంశ చరిత్ర, సాహసాలు వగైరాలుంటాయి. అభినవ కాదంబరి అనే మాటకు కావ్యంలో అర్థమే కనిపించదు. బాణకవిని మించిపోదామనే అత్యాశ కనిపిస్తుంది.❋

## 231. పింగళి ముత్తాజి మంత్రి (18-19 శతాబ్దం)

**భా**రద్వాజ గోత్రీకుడు భానూజీ మంత్రి తిమ్మాంబికల పుత్రుడే ముత్తాజి మంత్రి. 'సాంబోదయం' అనే రెండు ఆశ్వాసాల కావ్యం రాశాడు. కృష్ణ పండితుడు 'కృష్ణ కుతూహలం' వ్యాఖ్య రాశాడు దీనికి. కొన్ని శ్లోకాలు -

'శ్రీ కాంతా చపలా నగేంద్ర తనయా చండీ కునామ్నీ మహీ - జల్పాకి చతురాననస్య వనితా భాగీరధీ భంగ భాక్'

సోయం మజ్జనకో నమజ్జన దయాశాలీ దిశాలీవలత్ - తేజో భాను భుజోత్తమో విజయతాం శశ్వంతరాం శ్రేయం'.

ముత్తాజీ కవి పండిత ప్రకాండుడు మాత్రమే కాదు, ఎందరో విద్వాంసులను ఆదరించి సన్మానించినవాడు. వ్యాఖ్యాత కృష్ణ సూది దక్షిణామూర్తి భక్తుడు. విశ్వేశ్వర పండితుడినీ పేర్కొన్నాడు. సాయమాంబ విషయమొచ్చింది ఆవిడ ఏ ప్రాంతాన్ని పాలించిందో తెలియదు. జాంబవతి, శ్రీకృష్ణుల పుత్రుడు సాంబుని కథ ఇది. కృష్ణ జాంబవతుల వివాహం తర్వాత చాలా భాగం రచన లోపించింది. ద్వారక వర్ణనతో కావ్యప్రారంభం జరిగింది.

'ఆస్తి ప్రశస్త తర వస్తుభిరుల్లసంతీపూద్వారకా జగతి మందిరా మందిరాయాః తర్కో మమ స్ఫూరతినూనా మనూన లక్ష్మ్యా యస్సాస్సురేంద్ర నగరీ న గరీయ సీతి'

శ్రీకృష్ణుని బల శౌర్య పరాక్రమ వర్ణన - 'కీర్తి ప్రతాపో కిల దంప తీవ త్రైలోక్య సౌదే లతతస్మ తరస్య - శంఖే శార్ఙ్న ద్రుమణీతనూజౌ తయోరిమౌ పాండుర చండ రూపౌ'

జాంబవతి ముందు నారదుడు కృష్ణుని స్తోత్రం చేస్తాడు ఇది లీలాశుకుని కృష్ణ కర్ణామృత శ్లోకాలు లాగా మధురంగా ఉంటాయి.

'మందాకినీ కనదావలీషు మందార భూమీరుహ పల్లవేషు - తత్పద పీఠీ సుషమా సమృద్ధం ,విలోక యామో వయ మాదరేణ'

జాంబవతి ప్రణయాన్ని ముగ్ధ మనోహరంగా వర్ణించాడు.

'చిత్రే చిత్రే రచిత ముచితం రూపదేయం మురారే – ర్దర్శీ ర్దర్శీ నిమిషా రహితైరీక్షితైరీక్ష ణీయం'
స్ఫీతం జాతం విపుల పులక వ్రాత మస్యాఃప్రకామం – మారోదారప్రహరణాదియా నిర్మితం వర్మ శంఖోః'
ఒకే సర్గలో వివిధ ఛందస్సులను పాతకవులకు భిన్నంగా ఉపయోగించాడు.❁

## 232. నిశ్శంక మృత్యుంజయ భూపాలుడు (18-19 శతాబ్దం)

**పె**ద్దన్న నిశ్శంక భూపాలుని కుమారుడు, వెంకట నిశ్శంక భూపాలుని మనవడు, విశాఖ జిల్లా సంగమ వలస జమీందారు మృత్యుంజయ భూపాలుడు. కవి పండిత విద్వాంసులకు అండా దండాగా ఉన్నాడు. స్వయంగా కవి. నీతి శాస్త్ర సారం అనే 35 శ్లోకాల గ్రంథం రాశాడు. దీనికి అదే ఆస్థానపు కవి ఆకెళ్ళ వెంకట శాస్త్రి తెలుగు వ్యాఖ్యానం రాశాడు. మొదటి శ్లోకం–
'శ్రీ కైలాస పయోరాశీ యయోస్సుప్రు టతరాలయో – భక్త్యాహం ప్రత్యహం నౌమి పార్వతీ పరమేశ్వరౌ'
ఇందులో చాలా నీతులు బోధించాడు. మచ్చుకి కొన్ని–
'పురోగతస్య లోకస్య ప్రియం సత్యం వరం వదేత్ – నైచే త్తూష్ణీం వర్తితవ్యం సభాయాం సతతం సతా'
సుసుతః క కుల దీపాంశ్చసుయోషా గృహ దీపికా – వనానాం చందనో దీపౌ రాజా దీపౌ పురస్య చ'
మృత్యుంజయుడు కాళిదాస రచనలపై వ్యాఖ్యానాలు కూడా రాశాడు. శాకుంతలంపై 'పూర్ణ చంద్రిక', విక్రమోర్వశీయంపై 'రత్న దీపిక' మాలవికపై 'విబుధ రంజని' వ్యాఖ్యానాలు రచించాడు. ఏడవ ఎడ్వర్డ్ రాజు రాయల్ ఏషియాటిక్ సొసైటీకి ప్రెసిడెంట్‌గా ఉన్నప్పుడు మృత్యుంజయ భూపాలుని సంస్కృత సాహితీ సేవను గుర్తించి మెచ్చి అందులో మెంబర్‌గా ఎంపిక చేసి గౌరవించాడు.❁

## 233. నేపాల్ రాజ గురువు ఆస్థానకవి నడిమింటి భగవత్పతంజలి శాస్త్రి (1800–1872)

శ్రీకాకుళంజిల్లా నాగూరు గ్రామవాసి నడిమింటి సర్వ మంగళ శాస్త్రి గారి కుమారుడే పతంజలి శాస్త్రి. 1800–1872 కాలంలోని వాడు. తండ్రి వలే యోగ, మంత్రం శాస్త్రాలలో నిష్ణాతుడు. కాశీలో ఉండగా నేపాల్ రాజుకు గురువై, రాజు కోరికపై నేపాల్ వెళ్లి రాజాస్థానంలో 1830–40 మధ్య ఉన్నాడు. తండ్రి మరణంతో స్వదేశానికి స్వగ్రామంకి తిరిగి వచ్చాడు. నేపాల్‌లో ఉండగానే 'గాయత్రి మహిమ' 'పరమ పురుషాధ్యయనం' సంస్కృతంలో రాశాడు. దీనిలోంచి శ్లోకాలు–

'చిదాత్మా చిన్మాయాం ప్రకృతి మభి సృజ్జో ధ్రువవతాం–నివేశ్యస్యాం శ్వాసం పునరపి యదా పూర్వక భవత్

తత స్రస్టా జీవ ప్రకర ఇతి తస్యా నుజనితౌ –తమోంఘ్రై తత్పాద్య స్తపదఘు స తేన ప్రభుదితః

పతంజలి శాస్త్రి నేపాల్‌లో ఒక సంస్కృత పాఠశాల స్థాపించాడు. భారత్‌కు తిరిగి వచ్చాక సంస్కృత సేవ చేయ లేకపోయాడు. కారణం విజయ నగర సంస్థాన లిటిగేషన్లను తీర్చటానికే సమయమంతా సరిపోయేది. లభించిన ఆధారాలనుబట్టి యోగ శాస్త్రంలో పతంజలి అంతటి ప్రతిభ ఉన్న భగవత్పతంజలి శాస్త్రి యోగాభ్యాసంతో తన శరీరాన్ని మహా వృక్షమంత ఎత్తుకు లేపేవాడు. చనిపోయే దాకా నేపాల్ రాజుల గౌరవ సత్కార కానుకలను అందుకొంటూనే ఉండేవాడు. కురుపాం జమీందారు అగ్రహారాలు దానం చేశాడు.❋



## 234. పరవస్తు చిన్నయ సూరి (1806-1862)

పరవస్తు వెంకట రంగయ్య, శ్రీనివాసాంబలకు చిన్నయ సూరి తమిళనాడు చెంగల్‌పట్టు జిల్లా శ్రీ పెరంబదూర్‌లో 1806లో జన్మించాడు. సంస్కృతానికి పాణిని ఎంతటి ఘనుడో తెలుగు వ్యాకరణానికి చిన్నయ సూరి అంతటి ఘనుడు. ఆయన రాసిన బాల వ్యాకరణం ఒక కరదీపిక. తెలుగు వ్యాకరణ వేత్తమాత్రమే కాదు సూరి అమోఘ వచన రచనా దురంధరుడు కూడా. ఆలంకారిక గ్రాంధిక శైలికి మార్గదర్శి చిన్నయ సూరి. ఈ రెండు రంగాలలో ఆయన అద్వితీయుడనిపించాడు. తెలుగులో మొట్టమొదటి నిఘంటు నిర్మాణానికి శ్రీకారం చుట్టినవాడు సూరి తండ్రి మద్రాస్‌లో ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగి. సూరి మద్రాస్‌లో తెలుగు తమిళం, సంస్కృతం ప్రాకృత భాషలను తండ్రివద్ద నేర్చి తర్క, అలంకార శాస్త్రాలను కంచి రామానుజాచార్య వద్ద అభ్యసించాడు. 1845-1848 కాలంలో పచ్చయప్ప కాలేజిలో తెలుగు శాఖాధికారిగా పని చేశాడు. తర్వాత ప్రెసిడెన్సి కాలేజిలో సేవలందించాడు. సర్ సి. పి. బ్రౌన్ మొదలైన వారు సూరికి ముఖ్య స్నేహితులు. 56 సంవత్సరాలు మాత్రమే జీవించి చిన్నయ సూరి 1862లో మరణించాడు.

చిన్నయ సూరి తెలుగు వ్యాకరణం బాల వ్యాకరం పాణిని సంస్కృత

వ్యాకరణం అష్టాధ్యాయికి సమానం. సూరిగారి తెలుగు నీతి చంద్రిక సంస్కృతంలో బాణుని కాదంబరికి సరిసాటి. తెలుగువారి కోసం సంస్కృతంలో సూరి 1) సూత్రాంధ్ర వ్యాకరణం, 2) ఆంధ్ర శబ్దాను శాసనం రెండు వ్యాకరణాలు రాశాడు. రాసిన తెలుగు సంస్కృత రచనలలో సంస్కృత శ్లోకాలనూ చిన్నయ రాశాడు. ప్రముఖ దాత వితరణ శీలి పచ్చయప్పపై 'పచ్చయప్ప యశో మండనం'ను సంస్కృతంలో 1845లో రాశాడు. అందులోని కొన్ని రసగుళికలు –

'ఏకం కలాం భువనజాతి హితం ధన్యా స్సర్వజ్ఞతాం వద కదం లభతే గిరీశః బహ్వీ కళా భువన జాత హితా దదానస్సర్వజ్ఞ ఏష ఖలు పచ్చప మాన వేంద్రః గుణస్య బాధికాం వృద్ధం కృతవాన్ పాణినిః పురా ః–అబాధిత గుణం వృద్ధి మకరోత్పచ్చప ప్రభుః

పశ్యాయా మహానయందు సరితః పురాదిశాశ్చాదయం స్తత్ర స్మద్విజవాజి దేనుత రవో మగ్నాః పునర్నేక్షితాః

ఏవం చార జనం బ్రువాణామమరస్వామీ హసన్వక్తి భో – మా భేషీ ర్ననుభ ద్రుంగవానయ మతిఃపచ్చపాకీర్తి ర్మహః'❁

## 235. శ్రీశైల దీక్షితులు అనే తిరుమలాచార్య (1809- 1877)

**భా**స్కరాచార్య, తిరు వెంగదాంబల కుమారుడే తిరుమలాచార్య. తమిళనాడులోని చెంగల్పట్టు జిల్లా చిన్నంపట్టులో 1809 మేలో జన్మించాడు. శ్రీ వైష్ణవ సంప్రదాయంలో సప్తగోత్ర శాఖకు చెందినవాడు. వీరి పూర్వీకులు తంజావూరు జిల్లా తిరుకండియార్‌కు చెందినవారుగా గుర్తింపబడ్డారు. నెలల పిల్లాడుగా ఉండగానే తండ్రి చనిపోతే మాతామహుడు స్వంత కొడుకులా పెంచాడు. ట్రిప్లికేన్‌లో చదివి సాహిత్యం, వేదాంతాలలో నిష్ణాతుడయ్యాడు.

రామానుజుల శ్రీభాష్యంపై తిరుమలాచార్య విశ్లేషణం అనితర సాధ్యంగా ఉండేది. అందుకనే ఆయనను శ్రీ భాష్యం తిరుమలాచార్య అని గౌరవంగా పేర్కొనేవారు. ఇరవై నాలుగవ ఏట ఒక్కగానొక్క కొడుకు భాష్యకాచార్య పుట్టాడు. మద్రాస్‌లోని కోలా సోదరులైన కృష్ణనాయుడు, విజయ రంగం నాయుడులకు చదువు చెప్పాడు. వారితోబాటు బెంగుళూర్‌లో స్థిరపడ్డాడు. అక్కడే కన్నడ పత్రిక కర్నాటకా ప్రకాశికను మైసూరు మహారాజు కృష్ణరాజ ఒడియార్ ఆధ్వర్యంలో నిర్వహించాడు. 23-02-18877న మరణించాడు.

తిరుమలాచార్య గొప్ప సంగీత విద్వాంసుడు. అమర శతకానికి స్వరాలు సమకూర్చాడు. బాణుని కాదంబరిపై వీరాభిమానం ఉండటం వలన కాందబరీ తిరుమలాచార్య అనే గౌరవ బిరుదు వచ్చింది. కవిత్వంలోనూ దిట్ట. హనుమన్న క్షత్రమాల, వీరాంజనేయ శతకం, గోపాలార్య మున్నగు సంస్కృత రచనలు చేశాడు. భారతి విలాసం అనే వచన రచనను షేక్స్పియర్ కామెడీ ఆఫ్ ఎర్రర్స్ ఆధారంగా రాశాడు. కూర్గు జిల్లాలో ఉన్న తలకావేరి యాత్రను కావేరి గద్యగా రాశాడు. ఆయన రచనలలో మాణిక్యం శ్రీ కృష్ణాభ్యుదయం అనే వచన కావ్యం. అందులోని వచనం పలు భంగులలో కదను తొక్కుతుంది. ఆయన కృష్ణ భక్తికి చిరస్థాయిగా నిలిచింది. కథా, కథనం అనితర సాధ్యమనిపిస్తాయి. దానికి మించిన సంస్కృత వచన రచన లేదేమో ననిపిస్తుంది. కృష్ణభక్తికి పరాకాష్టగా నిలిచిన సద్గ్రంథం ఇది. దీనికి సాటి లేదు అంటారు.❀



## 236. శ్రీ స్వాతి తిరుణాల్ రామవర్మ కులశేఖర్ (1813- 1846)

**తి**రువాన్కూర్ మహారాజు స్వాతి రామవర్మ కులశేఖరుడు 1813- 1846 కాలపు రాజు. అసలు పేరు "శ్రీ పద్మనాభ దాసశ్రీ స్వాతి తిరుణాల్ రామవర్మ కులశేఖర పెరుమాళ్". తల్లి కడుపులో ఉండగానే రాజ్యానికి రాజుగా ప్రకటించారు. అందుకని ఆయన్ను "ఆగర్భ శ్రీమంతుడు" అన్నారు. 16-04-1813న జన్మించాడు. 1829లో పదహారవ ఏట మేజర్ అయి మహారాజుగా అభిషిక్తుడయ్యాడు. ఈయన పుట్టినప్పుడు ఇరయమాన్ తంబి అనే ప్రముఖ కవి "ఒమాన్దిన్కాల్ కిదావో" అనే జోలపాట మలయాళంలో రాసి పాడాడు. తండ్రి రాజ రాజవర్మ గొప్ప సంగీత, సంస్కృత విద్వాంసుడు. తల్లి గౌరీ లక్ష్మిబాయి. ఆరవ ఏట మళయళ సంస్కృతాలను, ఏడవ ఏట ఇంగ్లీష్‌ను నేర్వటం ప్రారంభించాడు. ఇంగ్లీష్, పర్షియన్, తమిళ, తెలుగు, కన్నడం, మరాఠి, హిందీ భాషలపై గొప్ప పట్టు సాధించాడు.

ప్రజలకు ఉపయోగపడే చట్టాలను శాసనాలను చేసి అమలు పరచాడు. ప్రభుత్వ విషయాలన్నీ తెలుసుకొని జనరంజకంగా పాలించాడు. కేరళలో ఆంగ్ల విద్య ప్రవేశపెట్టాడు. మొట్టమొదటి ప్రభుత్వ ప్రెస్‌ను నెలకొల్పాడు. ఖగోళ పరిశోధనలకు అబ్సర్వేటరి ఏర్పాటు చేసాడు. ప్రాచీన గ్రంథాల వ్రాతప్రతులను సేకరించి గ్రంథాలయంలో భద్రపరచాడు. అనితర సాధ్యమైన సంగీత విద్య నేర్చాడు. అందుకే "మోనార్క్ మ్యుజీషియన్" అని పేరు పొందాడు.

"యయాతి చరిత్ర" అనే ప్రబంధాన్ని, పదమూడు సంగీత వివరణలు కల "కుచేలోప్యాఖ్యానాన్ని" రాశాడు. త్యాగరాజులాగా సంగీత కీర్తనలనే కృతులు

రాశాడు. అవన్నీ అనంత పద్మనాభ స్వామికే అంకితం. తన కాలపు పతన సంగీత విద్వాంసులను గురించి వాపోయాడు–

"అక్రం తా కలినేవ హంతా జగతీ పాపీయశా గాయకః– వ్యాహేనక్షితిపాలసంపద ఖిలాక్రాంతా సమంతా దపి

నృత్య త్పంకజ సంభవ ప్రణయినీ లీలా రావీందోదరా మందశ్యంది మరందసుందర గిరాం కుత్రా వికాసోస్తు నః"

స్వాతి తిరుణాల్ సంస్కృత కృతులు– 'మాయా మాళవ గౌడ రాగంలో "దేవ దేవకలయామి తే", సారంగ రాగంలో "జయజయ పద్మనాభ మురారే", వాగధీశ్వరి రాగంలో "కమల నయన జగదీశ్వర" హంసధ్వని రాగంలో "పాహి శ్రీపతే", పంతు వరాళిలో "సారసాక్ష పరిపాలయ మామయి" చాలా ప్రసిద్ధమైనవి.

స్వాతి తిరుణాల్ తన ప్రభుత్వాన్ని తిరువనంతపురంలో ఉన్న పద్మనాభస్వామిరి దారపోసి తాను "పద్మనాభుని సేవకుడి"గా ఉండిపోయి ఆయన తరపున పాలించి "పద్మనాభ దాసు" అయ్యాడు. జనరల్ కల్లెన్‌ను తంజావూర్ రెసిడెంట్‌గా నియమించాడు. వాడు క్రమంగా బలిసి రాజ్య వ్యవహారాలన్నిటిలోను జోక్యం కలిగించుకొనేవాడు. స్వాతి తిరుణాల్ దీన్ని భరించలేక పోయాడు. చివరికి ఒంటరిగా మౌనంగా ఉండిపోయి శారీరక మానసికంగా బలహీనుడై 33 ఏళ్ళకే 27-12-1846న స్వర్గస్థుడయ్యాడు మహారాజ కవి స్వాతి తిరుణాల్.

త్రివేంద్రంలో ప్రతి ఏడాది జనవరి 6 నుండి 12 వరకు వారం రోజులు ''స్వాతి సంగీతోత్సవం'' నిర్వహించి ఆ సంగీ మహారాజుకు ఘనంగా నివాళులర్పిస్తారు. స్వాతి తిరుణాల్ వారసుడిగా ఇప్పుడు రాజా రామవర్మ ఉన్నాడు. ఈయనా అసాధారణ సంగీత పాండిత్యం ఉన్నవాడే. ఈయన ఆధ్వర్యంలోనే స్వాతి ఉత్సవాలు జరుగుతున్నాయి. త్యాగరాజ స్వామిని కలుసుకోవాలని కలలుగన్న స్వాతి తిరుణాల్‌కు ఆ అవకాశం రానేలేదు. ''ఇద్దరం పైనే కలుసుకొందాం" అని త్యాగయ్యగారి జవాబుతో స్వాతితో కూడా కలిపితే కర్నాటక సంగీతంలో "సంగీత చతుష్టయం" అవుతారు. ఎందరో మహానుభావులు అందరికి వందనాలు. ❁

## 237. మతుకుమల్లి నరసింహ విద్వన్మణి (1817-1873)

**కృ**ష్ణాజిల్లా వల్లూరు సంస్థాన కవిగా ఉన్న మతుకుమల్లి నరసింహ కవి గుంటూరు జిల్లా తెనాలి వాడు. తండ్రి, తాత కనకాద్రి శాస్త్రి నరసింహ శాస్త్రులు మహా పండితులు. తల్లి జానకమ్మ తెలుగు కవయిత్రి. కవి నృసింహ స్వామికి మహా భక్తుడు. సంస్కృతంధ్రాలలో చాలా రాశాడు. అందులో తెలుగులో ఇందుమతీ పరిణయం లేక అజ చరితం, చెన్నపురి విలాసం, జలక్రీడలు రచించాడు. సంస్కృతంలో 'పుండ్ర నిర్ణయ చంద్రిక, పుండ్ర సూర్యోదయ కాల మహా దుర్దినం, లక్ష్మీ నరసింహస్తుతి స్తోత్రం రాశాడు. ఇందులో సోత్రం 300 శ్లోకాలు, 6 అద్యాయాలతో ఉన్నది. వీటికి స్తంభోద్భవోధ్యాయం, గండ భేరుం డాధ్యాయం, నృసింహో ధ్యాయం, సౌంద ర్యాధ్యాయం, దశావతారాధ్యాయం, మాతృకాధ్యాయం అని పేర్లు పెట్టాడు. ఉగ్ర నరసిమ వృత్తాంతమే అయినా శ్లోకాలు చాల సరళం గా ఉండటం ప్రత్యేకత. మచ్చుకి ఒకటి రెండు-

"చంద్ర రేఖా చమత్కార రాచంవదాంగి నఖాన్చలః - సుపర్వమకుటోగ్ధర్ష స్పురన్నఖ మణిధృణిః'

శణార వింద స్ఫర్గులు శోభమాన పదాంబుజః - శృతి సీమంత సీమాగ్ర సింధూర చరణా ధ్రుతిః'

కమలా కటి సంవాస కమనీయాంక పాలికః-నిలింపాద్రినితంబ తట సున్దరః"❁

## 238. త్రివేణి (1817- 1883)

**ఉ**దేంద్రపురంకు చెందిన అనంతరాయల కుమార్తె త్రివేణి. ఆమె తండ్రి యాదవ రాఘవ పాండవీయం త్ర్యర్థి కావ్యం రాయగానే ఈమె జన్మించినందున త్రివేణి అని పేరు పెట్టారు. 1817- 1883 నాటి కవయిత్రి. శ్రీపెరంబదూరుకు చెందిన ప్రతివాది భయంకర వేంకటాచార్య ఈమె భర్త. పెళ్ళి కాకముందే కవిత్వం రాసేది. పెళ్ళి అయిన తర్వాత భర్త వద్ద వేదాంతం నేర్చినది. ఒక కొడుకు పుట్టి చనిపోయాడు. భర్త చనిపోయాడు. ఆనాటి కలెక్టర్ ఒక విగ్రహం దొరికితే ఆమెకు అందజేస్తే దేవాలయం నిర్మించింది. హరాతి పంచకం రాసింది. తిరువాన్కూర్ రాజదర్బారుకు వెళ్ళి గౌరవం పొందింది. మైసూరు దివాన్ రంగాచార్య ఆమె భక్తుడు. ఏ సమస్యనిచ్చినా ఆశువుగా కవిత్వం చెప్పగలిగేది. ఆనాటి స్త్రీలలో సంస్కృత సాహిత్యానికి విశేష సేవ చేసిన మహిళ త్రివేణి. లక్ష్మీ సహస్రం, రంగనాధ సహస్రం మొదలయిన ఆధ్యాత్మిక గ్రంథాలు రాసింది. శుక సందేశం, భ్రుంగ సందేశం రాసింది. రంగాభ్యుదయం, సంపత్కుమార విజయం కావ్య రచనలు చేసింది. రంగరాట్ సముదయం, తత్వముద్ర భోదోదయ నాటకాలు రాసింది. చివరి రెండూ వ్యంగ్య రచనలు.❁

## 239. కమలా విజయ నాటకకర్త- వేంకటాచార్య (1820)

**బెం**గుళూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ అయిన వేంకటాచార్య అనేక గ్రంథ రచయిత. టెన్నిసన్ రెండు అంకాలలో రాసిన టీ కప్ నాటిక ఆధారంగా కమలావిజయం నాటకం రాశాడు. ప్రాకృతం వాడలేదు. చెడుపై మంచి విజయం సాధిస్తుంది అని సారాంశం. నవగీతా కుసుమాంజలి కావ్యంలో ఉన్నది ఒకడే దైవం. ఆయననే అనేక రూపాలలో ఆరాధిస్తున్నారు అని చెప్పాడు. పురాణ కథలను ఆధారంగా దీన్ని వివరించాడు. ఇందులో తొమ్మిది భాగాలు, నూట ఎనిమిది శ్లోకాలు ఉన్నాయి. రామాయణ సారాన్ని రామగీతలో, భాగవత కథను కృష్ణగీతలో, విష్ణు వివరాలను దశావతారలో, గణపతి సృష్టికి మూలం అని ఆయన వైభవం వర్ణనాతీతం అని గణేశ గీతలో, అసలైన దివ్య జ్ఞానం కుదురైన బుద్ధి వలన సాధ్యం అని సద్గురు గీతలో, త్రిమూర్తులకు భేదమే లేదని శివగీతలో చెప్పాడు కవి. ఇతని వాణీ గీత లక్ష్మీ గీత, గౌరీగీత స్త్రీ శక్తికి ఉన్న విలువను తెలియజేస్తాయి.❁

## 240. శతకంఠరామాయణ కవి- పరశు రామ రాపంతుల అనంత రామ పండితుడు (1820)

**సీ**తారామాంజనేయ సంవాదం రాసిన పరశురామ పంతుల లింగమూర్తికి ఐదవ తరం వాడైన అనంత పండిత రాయలు 19 శతాబ్ది వాడు. వరంగల్ దగ్గర అంబాలా గ్రామ నివాసి. వెంకాంబికా, రామ కృష్ణ సోమయాజుల పుత్రుడు. భారద్వాజ గోత్రం. అనంత మంజరి టీకా- రాశాడు. 'సీతా విజయ చంపు' రాశాడు. దురదృష్ట వశాత్తు మూడవ స్తబకంలో ఆగిపోయింది. ఇందులో సీతాదేవి శత కంఠ రావణ వధ చేసిన కథ ఉంది. రావణుడికి వంద తలకాయలున్నట్లు రాయటం వలన దీనికి 'శత కంఠ రామాయణం' అని కూడా అంటారు. దీనికి మూలం వసిష్ట రామాయణం. మొదట్లో లక్ష్మీనారాయణ, సరస్వతి ఆంజనేయ విఘ్నేశ్వర దేవతలను ఇదే వరుసలో స్తుతించాడు కవి. తర్వాత తన వంశ చరిత్ర చెప్పుకున్నాడు. పిమ్మట వ్యాస వాల్మీక కాళిదాస కవులను స్తుతించి కథలోకి ప్రవేశించాడు. శివుడు పార్వతికి చెప్పిన కథను వ్యాసమహర్షి నైమిశారణ్య ఋషులకు తెలియజేశాడు. కొన్ని వచనాలతో సహా మొదటి స్తబకంలో 94 శ్లోకాలున్నాయి. మొదటి ఇరవై శ్లోకాలలో పూర్వ రామాయణ కథను చెప్పాడు. రావణుడికి బంధువైన శత కంఠుడు రావణ సంహార వార్త విని మూడులోకాలపై దాడి చేసి చీకటిలో ముంచేస్తాడు. శ్రీమహా విష్ణువు సలహాపై ఇంద్రాది దేవతలు ఈ విషయాన్ని అయోధ్య రామునికి నివేదిస్తారు. శ్రీరాముడు వారికి అభయ మివ్వటం తో మొదటి స్తబకం పూర్తి అవుతుంది. ఇందులో శ్రీరాముని ధైర్య పరాక్రమాల వర్ణన శ్లోకం చూద్దాం-

"ధైర్యే నమ్నీ కృతో మేరుర్గజ్న్యవాన్ తుహినా చలః - మంద రాద్రి రపి భ్రాంతం కదం స్యుర్యేన తేసమాః"

రెండవ స్తబకంలో 68 శ్లోకాలున్నాయి. ఆరు ఋతువుల వర్ణన ఇందులో విస్తారంగా చేశాడు. సీతారాముల క్రీడలున్నాయి. పుష్పవనాలు జలధారలను వర్ణించాడు. ముక్త పద గ్రస్తంలో వసంతు ఋతు వర్ణన బాగుంటుంది.

"శ్రీమత్పల్లవ తల్లజ సముల్ల సత్ప్రసూన సాయక సముత్స ముచిత, వాసంతికాలతో దవిసితమహామండప పటలీవిభాసమానం, విభాస మాన స్వద్రుమన్మనోహర మరంద బిందు సముయదాస్వాదానంద తుందిల సమున్మత్త శీలాముఖం, శీలా ముఖ" - ఇలా సాగిపోతుంది. వర్షతువులో ఆరుద్ర పురుగు వర్ణన కవితాబద్ధం చేశాడు కవి.

"తదేంద్ర గోషాః కాశ్యప్యాం కురు విందఇవా బభుః-మహేంద్రాయ బలిం దాతుం విన్యస్తా వర్ష హేతవే"

మూడవ స్తబకంలో 67 మాత్రమే ఉన్నాయి. ఇవన్నీ సీతారామ కామక్రీడా వర్ణనలే. సభ్యతా సరిహద్దు దాటి కూడా వర్ణించిన శ్లోకాలున్నాయి. ఉదయ సూర్య వర్ణన ముచ్చటగా ఉంది-

"చకాశ కౌముదీ కామం కౌముదం తన్వతీద్విజాన్ - ప్రాచీ దిక్కామినీ కాంత నాసా ముక్తా రుచిర్యదా"

అనంత రామ పండితకవి ఛందో వైవిధ్యం బాగా చూపాడు. ఇదే తర్వాత తెలుగు కవులకు మార్గదర్శనమైంది. చంపు బదులు చంబు అని వాడిన మొదటికవి ఈయనే. ❁



## 241. వేద వ్యాప్తి, ఆర్య సమాజ స్థాపనా చేసిన స్వామి దయానంద సరస్వతి (1824-1883)

12-2-1824న గుజరాత్‌లో కదియవాడ్ జిల్లా తంకారాలో బ్రాహ్మణ కుటుంబంలో మహర్షి దయానంద సరస్వతి జన్మించాడు. మూలానక్షత్రంలో పుట్టటం వలన 'మూల శంకర్' అని పేరు పెట్టారు. ఆయన జన్మ దినోత్సవాన్ని ఫాల్గుణ కృష్ణ దశమినాడు, ఫిబ్రవరి 24 మంగళవారం నిర్వహిస్తారు. తండ్రి కర్షం జీ లాల్జి తివారి, తల్లి యశోదా బాయి. ఎనిమిదేళ్ళకే ఉపనయనం చేశారు. ఒక శివరాత్రి నాడు ఉపవాసం ఉండి, జాగరణ చేస్తుంటే శివునికి పెట్టిన నైవేద్యాన్ని ఎలుక తినటం చూశాడు. ఎలుకనే నివారించలేని దేవుడు ప్రపంచాన్నేం పాలిస్తాడు అనే అనుమానమొచ్చింది.

వేదశాస్త్రాలన్నీ నేర్పించారు. చిన్న చెల్లెలు, బాబాయి కలరాతో చనిపోవటం చూసి అసలు చావు, పుట్టుకలపై ఆలోచన పెరిగి తలిదండ్రులను ప్రశ్నించేవాడు. పెళ్లి చేయాలని ప్రయత్నం చేస్తే, తెలియకుండా 1846లో ఇంటి నుండి పారి పోయాడు. 25ఏళ్ళు దేశమంతా తిరుగుతూ సన్యాసిగా గడిపాడు. అరణ్యాలలో హిమాలయాలలో ఒంటరిగా ఉండి ఆత్మ సాక్షాత్కారం కోసం తీవ్ర తపస్సు చేశాడు. పుణ్యక్షేత్ర సందర్శనం చేస్తూ యోగాభ్యాసం చేశాడు. సనాతన ధర్మాన్ని ఆచరణలో కలుషితం చేస్తున్నారని గ్రహించి దాని శుద్ధి చేయాలని సంకల్పించాడు. 'విరజానంద

దండీశ్వర'కు శిష్యుడై ఎన్నో నేర్చి వేదోద్ధరణకు పూనుకొన్నాడు. వేదాలలో ఉన్న సకల మానవ సోదరత్వ భావనా వ్యాప్తికి నడుం బిగించాడు. ఆర్య సమాజ స్థాపన చేసి దశ సూత్రాలను ప్రవచించాడు. తనకున్న వేద, సంస్కృత పరిజ్ఞానంతో ఎందరినో వాదంలో ఓడించి జయించి తన విశ్వాసాన్ని నిలబెట్టాడు. పురోహితుల బండారాలు బయట పెట్టాడు. వేదం చెప్పింది ఒకటి వీళ్ళు చేస్తున్నదొకటి అని మండిపడ్డాడు. దేశ సంచారం చేస్తూ ఆర్య సమాజ భావ జాల వ్యాప్తి చేశాడు.

భారత దేశానికి 'స్వరాజ్యం' రావాలి అని మొట్ట మొదట చెప్పింది', భారత్ భారత దేశానిదే' అని ఖచ్చితంగా చెప్పిందీ దయానందుడే. స్త్రీకి సమాన హక్కు, విద్యా ఉండాలి అని చెప్పిన మొదటివాడూ దయానందుడే. క్రిస్టియన్, ఇస్లాం బౌద్ధ జైన మతాలన్నీ కాచి వడపోశాడు విగ్రహారాధనను నిరసించాడు. 'సత్యార్ధ ప్రకాశిక' అనే ఉద్గ్రంథం రాశాడు. తన సంస్కరణ భావాలను చదువుకొన్న వారికే కాక ప్రపంచంలోని సకల మానవాళికీ అందేట్లు చేశాడు. అన్యమతస్తులను హిందువులుగా మార్చే కార్య క్రమం చేబట్టాడు. వేదంలోని సకల మానవ సౌభ్రాతృత్వాన్ని చాటి చెప్పి దానికోసమే తీవ్ర కృషి చేశాడు. 14ఏళ్ళ వయసులోనే మత గ్రంథాలు చదివి వాటిని జనాలకు బోధించేవాడు. 22-10-1869న వారణాసిలో జరిపిన గొప్ప చర్చ ఆయనకు పెద్ద పేరు తెచ్చింది. 27మంది విద్యావేత్తలు, 12మంది నిష్ణాతులతో జరిపిన బహిరంగ చర్చ అది యాభై వేల మంది ప్రజలు పాల్గొన్నారు. 'వేదాలు విగ్రహారాధనను అంగీకరిస్తున్నాయా?' అనే విషయంపై జరిగిన చర్చ అది యజ్ఞ యాగాదులలో జంతుబలి పనికిరాదని, తీర్ధ యాత్రలు దేవుళ్ళకు నైవేద్యాలు, రథోత్సవాలు బాల్య వివాహాలు మాంస భక్షణ ఆర్య సమాజంలో నిషిద్ధం. స్త్రీ విద్య, సమానావకాశాలు వేదాలలో ఉన్నాయని రుజువు చేశాడు. కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని వ్యాప్తి చేశాడు. బ్రహ్మ చర్యం అనుసరించాల్సిన ఆవశ్యకతను తెలియ జేశాడు. పరమాత్మకు తప్ప వేరెవరికీ మొక్క రాదన్నాడు, 'స్వదేశీ' అనే మంత్రమూ ఆయనదే. గాంధీజీ కన్నా ఎన్నో ఏళ్ళకు ముందే దళితులను 'హరిజనులు' అనే గౌరవ పదంతో సంబోధించి, మొదట ప్రయోగించినవాడు మహర్షియే. మూఢాచారాలను

విసర్జించాలన్నాడు. ఆయనను చంపాలని చాలాసార్లు ప్రయత్నాలు జరిగాయి. గొప్ప 'హఠ యోగి' కనుక అన్నిటినీ తప్పించుకొన్నాడు.

1883లో జోధపూర్ మహారాజు ఆహ్వానించగా దయా నందుడు వెళ్ళాడు. రాజు ఆయన శిష్యుడని తరించాలని భావించాడు. అక్కడ రాజు ఒక నర్తకితో శృంగార క్రియలో ఉండటం మహర్షి చూసి నిర్భయంగా అడిగి మానసిక పరి వర్తనకోసం ధర్మాచరణ చేయమని హితవు చెప్పాడు. కాని నర్తకి స్వామిపై పగ బట్టింది. స్వామి వంటవాడిని లోబరచుకొని ఆయన త్రాగే పాలలో గాజుముక్కల పొడి కలిపించి తాగించింది. త్రాగగానే గ్రహించాడు అప్పటికే అవి నరాలను కండరాలనూ కోసేస్తున్నాయి. విషయం తెలిసిన రాజు పరుగెత్తుకొచ్చి వైద్యుల చేత చికిత్స చేయించే లోపే పరిస్థితి విషమించింది నొప్పి భరించ శక్యం కావటం లేదు. ఇది చూసిన వంటవాడు స్వామి కాళ్ళపై పడి తన తప్పును ఒప్పుకొన్నాడు. స్వామి వాడిపై జాలి చూపించి రాజ భటులకు చిక్కకుండా పారిపోయి ప్రాణం రక్షించుకోమని తనదగ్గరున్న డబ్బు మూటనిచ్చి పంపి వేసి తన 'దయానంద' గుణాన్ని సార్ధకం చేసుకొన్నాడు మహర్షి. వైద్యుల సలహాపై రాజు మహర్షిని మౌంట్ ఆబూకు చేర్చారు. అక్కడినుండి మెరుగైన చికిత్స కోసం అజ్మీర్ పంపారు. కాని ఆరోగ్యంలో మార్పు రాలేదు. 30-10-1883 ఉదయం ఆరుగంటలకు మహర్షి దయానంద సరస్వతి వేద మంత్రాలు పఠిస్తూ తుది శ్వాస పీల్చాడు.

భారత స్వాతంత్రోద్యమ బీజాలు వేసిన తొలి దేశభక్తుడు దయానంద సరస్వతి. ఆయన ప్రభావం సుభాస్ చంద్ర బోస్, మహాదేవ గోవింద రానడే, మేడం కామాలపై అధికంగా ఉంది. షహీద్ భగత్సింగ్పై మహర్షి ప్రభావం అత్యధికం. ఈయన దయానంద్ వేదిక్ స్కూల్లో చదివాడు. సర్వేపల్లి రాధాకృష్ణన్ స్వామిని గురించి 'నవ భారతం' లో శిఖరాయమాన వ్యక్తిత్వమున్న యోగీశ్వరుదు దయానందుడు. రాజకీయ మత సాంస్కృతిక బానిసత్వాలను చేదించటానికి ఆయన నిర్విరామ కృషి చేశాడు. హిందూ మతాన్ని వేద ధర్మ ఆధారంపై నిలబెట్టటానికి జీవితాన్ని త్యాగం చేశాడు. భారత దేశం తెచ్చిన సాంఘిక సంస్కరణలు ఆయన ప్రవచించినవే' అని ఘన నివాళి అర్పించాడు.

**దయానందుని సాహితీ వైభవం**

మహర్షి దయానందుడు వేదాంగాలపై 16 గ్రంథాలు, పాణిని అస్టాధ్యాయిపై అసంపూర్ణ వ్యాఖ్యానం, నీతి, ధర్మ బోధకాలైన చిరు పుస్తకాలు వేద విధులు, అద్వైత, ఇస్లాం క్రిస్టియన్ మతాలపై ఖండనాలు మొదలైన 60 గ్రంథాలు రాశాడు. అందులో 'సత్యార్ధ ప్రకాశం', సంస్కార విధి, ఋగ్వేద భాష్య భూమిక, యజుర్వేద భాష్యం చాలా ప్రసిద్ధమైనవి. స్వామి అజ్మీర్‌లో 'పరోపకారిణి సభ' స్థాపించి వేదాలపై గ్రంథాలు రాసి ప్రచురించి వేద ధర్మ వ్యాప్తి చేశాడు.

అయన రాసిన వాటిలో కొన్ని పేర్లు – సంధ్య, భాగవత ఖండనం, అద్వైత ఖండనం, పంచ మహా యజ్న విధి, సత్యార్ధ ప్రకాష్, అష్టాధ్యాయి భాష్యం, ఋగ్వేద యజుర్వేద భాష్యాలు. స్వామి ప్రసిద్ధ మంత్రం– 'ఓంవిశ్వాని దేవసవితర్ దురితాని పరసుర్ యద్ భద్రం తన్నా ఆశువ'❁

## 242. భువన ప్రదీపిక కర్త– రామకృష్ణ శాస్త్రి (1825)

**మై**సూరుకు చెందిన మూడవ కృష్ణరాయ ఒడయార్ రాజు ఆస్థానంలో హసన్‌లో ఉంటూ రామకృష్ణ శాస్త్రి కవి భువన ప్రదీపిక రాశాడు. ఇది ఒక విజ్ఞాన సర్వస్వం. ఇందులో సృష్టి ఆవిర్భావం, మన్వాదుల చరిత్ర, భౌగోళిక శాస్త్రం, ఖగోళ శాస్త్రం, దక్షిణ భారత చరిత్ర, ఓడవార్ రాజవంశ చరిత్ర, పురాణాలు చాతుర్వర్ణాల వారి ధర్మాలు, యోగ, వేదాంతం అన్ని రాశి పోశాడు. ఈ వంశంలో ధర్మ రధుని కుమారుడు చాముండ రాయలు శ్రావణ బెల్గోలాలో గోమరేశ్వరుని స్థాపించాడు. వినయాదిత్య భల్లలుడు యాదవ పురి నిర్మించాడు.❁

## 243. లక్కా వఝుల వెంకట కృష్ణ శాస్త్రి (1827 లేక 1887)

**సు**బ్బమ్మ ,సుబ్బయ్య సిద్ధాంతిల పుత్రుడు వెంకట కృష్ణశాస్త్రి. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కురుమద్దాలిలో 25-5-1887 లేక 16-5-1827 జన్మించాడు. పామర్రులో స్థిరపడ్డాడు. సాహిత్యంతోబాటు న్యాయం వేదాంతం జ్యోతిషాలను మథించాడు. ఈ శతాబ్ది చివరి కవులందరూ ఈయన శిష్యులే. ఆంధ్రా, బరోడా రాజాస్థానాల సత్కార గౌరవాలు అందుకొన్న ఘనుడు. సంస్కృతంలో 'స్తోత్ర కదంబం', శ్రీరామ స్తవమాల, కథామంజరి, వైఖానస మీమాంస, ప్రశ్న కల్పతరువు రాశాడు. హైమవతీ పరిణయం కూడా రాశాడని అంటారు.❀

## 244. రసప్రపంచకర్త- వెంకటశాస్త్రి (1830)

**ప**శ్చిమ గోదావరి జిల్లా కాకరపర్తికి చెందిన ఆన్విల్ల యజ్ఞ నారాయణ కుమారుడు వెంకట శాస్త్రి సర్వశాస్త్ర పారంగతుడు. పెద్దాపురం, దార్లపూడి మహారాజుల చేత గొప్ప సన్మానాలు పొందాడు. మహేశ్వర మహాకావ్యం, సతీ శతకం, భాస్కర ప్రశస్తి కావ్యాలు, అలంకార సుధా సింధు, రస ప్రపంచం అనే అలంకార గ్రంథాలు రాసాడు. నూజివీడు జమీందారులు మేకా వెంకట నరసింగ అప్పారావుపై అప్పారాయ యశశ్చంద్రోదయ కావ్యాలు రాసాడు. మెచ్చిన రాజు వల్లూరుమల్లి అగ్రహారాన్ని ప్రదానం చేసాడు. అక్కడ సోమయాగం చేసాడు. శ్రౌత సూత్రాలపై భాష్యమ్ రాసాడు. కుమారుడు నారాయణ కవి సాహిత్య కల్ప ద్రుమమం రాసి నూజివీడు జమిందారు జగన్నాథ అప్పారావుకు అంకితమిచ్చాడు. నారాయణ కవి కొడుకు వెంకట కవి బాల కాళిదాసుగా ప్రసిద్ధుడు. ఇతడు చిత్ర చమత్కార మంజరి రాసి పెద్దాపురానికి చెందిన వత్సవాయి తిమ్మ జగపతి మహారాజుకు అంకితమిచ్చాడు. చిత్ర కవిత్వముగా సూర్య శతకం రాసాడు.❀

## 245. గాంగేయ కవి (1830)

1830 కాలం వాడైన గాంగేయ కవి శౌనకస గోత్రీకుడు చెరుకూరి. సీతా రామేశ్వరుల కుమారుడు. నూజివీడు జమీందార్ శోభనాద్రి అప్పారావు పోషణలో ఉన్నాడు. 'సాత్రాజతీ పరిణయ చంపు' రాశాడు. శ్రీకృష్ణ, సత్రాజిత్ కుమార్తె సత్యభామల వివాహ విషయమైన కథ. ఇందులో నాలుగు స్తబకాలున్నాయి. శ్రీ కృష్ణుడు కవికి కలలో కన్పించి ఈ కావ్యం రాయమని ఆదేశించాడు. కావ్యం లోని మొదటి ప్రార్ధనా శ్లోకం– 'ప్రాత్యూహ వ్యూహ మోహాంధ తమస్తస్తేమ భాస్కరం – జగదాలంబ హేరంబచరణా మ్బుజ మాశ్రయే'

ద్వారకానగర వర్ణన శ్లోకం చూద్దాం –

'ఆస్తి స్వస్తారుణీ కరాంబుజ గలన్మందార బృందాంతర – స్యంద చ్చాంద్ర మరందబిందు సుభగా స్వర్గ ర్వని ర్వాపిక'

పాకారి ప్రముఖాఖిలామర వర వ్యూహో త్తమంగ గోల్లాస – చ్చూడా రత్న శలాకికా చ్ఛ్రితా శిలా పూద్రికా ద్వారాకా'

చివరి శ్లోకం –

'ఏవం నవ ప్రియా సమాగమ లజ్జితాం తాం – పూర్ణేందు బింబ రుచిరం ముఖ మున్నమస్య

శౌరిస్తు ధామ ధరయా చ గిరానునీయ –శయ్యాం నినాయ శనకై ర్జనద పుత్రీం'

ఆశ్వాసాంత గద్యం –

'ఇతి శ్రీ కృష్ణ దాస గాంగేయ కృతౌ సాత్రాజితీ పరిణయే చతుర్ద స్తబకః శ్రీ శౌన కాన్వాయ సుధా నిధి పూర్ణ సోమ రామేశ్వర రవ్య ధరణీ సుర సూరినుః– గాంగేయ సూరి కరోత్స రసౌ క్తియుక్తం సాత్రాజితీ పరిణయా ఖ్యమముం ప్రబంధం'❁

## 246. కస్తూరి శివ శంకర శాస్త్రి (1833-1917)

**అ**మలాపురం తాలూకా కూచి మంచి వారి అగ్రహారంలో 1833లో జన్మించాడు. ఎనభై మూడవ ఏట 1917లో మరణించాడు. వాదూలస గోత్రానికి చెందిన నియోగి బ్రాహ్మణుడు. ఇతని వంశం వారు స్థానిక రాజుల నవాబుల ఆస్థాన మంత్రులు. వేదంతో బాటు రాజకీయ వ్యవహారాలలోనూ చురుకుగా ఉండేవారు. వీరికి 'దేశ పాండ్య' అనే గౌరవ స్థానం ఉండేది. ఈ గౌరవం మనకవి చిన్నతనంలో తండ్రి వరకు ఉండేది. వీరేశలింగం గారు ఇతని తండ్రికి పెద్దన్నగారు. ఆయన వరకు రాజ భృతి వచ్చేది. శాస్త్రి రాజమండ్రి ఆర్ట్స్ కాలేజిలో కళావిభాగంలో పాతికేళ్ళు పని చేశాడు. శివానంద లహరి 'స్తోత్రకదంబం, ద్వాదశ మంజరి, సముద్రాస్టకం, శూలపాణి శతకం నృసింహ స్తోత్రం మొదలైనవి రాశాడు.❁

## 247. కాశీలో సంస్కృత శతావధానం చేసిన- మానవల్లి గంగాధరశాస్త్రి (1834- 1914)

**నృ**సింహశాస్త్రి కుమారుడైన గంగాధరశాస్త్రి తెలుగు బ్రాహ్మణుడు. బెంగుళూరు దగ్గర వాసర గట్టలో 1834లో జన్మించాడు. తండ్రి కాశీలో స్థిరపడి కావ్యాత్మ సంశోధన రాశాడు. గంగాధరుడు రాజారామశాస్త్రి, బాలశాస్త్రి వంటి గొప్ప పండితుల వద్ద విద్య నేర్చాడు. వారి జీవితాలపై చక్కని వ్యాసాలూ రాశాడు. 1879లో కాశీలోనే సంసృతాచార్యుడయ్యాడు. వేలాది విద్వజ్జన సమక్షంలో సంస్కృత శతావధాన చేసి అందరి మెప్పు పొందాడు. పృచ్ఛక ప్రశ్నలకు అలవోకగా సమాధానాలు చెప్పి ఆశ్చర్య పరచాడు శాస్త్రి. వ్యాకరణంపై అనేక వ్యాసాలూ, రస గంగాధరంపై మంచి వ్యాఖ్య రాసిన మహా పండితుడు మానవల్లి. 1887లో విక్టోరియా రాణి రజతోత్సవ, ఎడ్వర్డ్ పట్టాభిషేకోత్సవ సంరంభంలో మహా మహోపాధ్యాయ బిరుదునందుకొన్నాడు. 1914లో మరణించాడు.❁



## 248. ఖగోళ శాస్త్రవేత్త  పటాని సమంత్ (1835-1904)

**సౌ**ర కుటుంబాన్ని పోలిన లక్షలాది గ్రహ నక్షత్ర సముదాయాలకు ఆలవాల మైన పాల పుంత ఉందని, దానిని పోలిన, అంతకంటే పెద్ద వైన అనేక ఖగోళ కుటుంబాలున్నాయని ఖగోళ శాస్త్రవేత్తలు అనేవారు.  పరిశోధన చేసి చెప్పక ముందే భారతీయులు, చైనావారు, ఈజిప్షియన్లు గ్రీకులు చెప్పారన్న సంగతి అందరికి తెలిసిన విషయమే.  ఖగోళ విజ్ఞానం అభివృద్ధిలోకి రాకముందే, ఏ యూనివర్సిటి విద్య లేకుండా, టెలిస్కోపులు కూడా లేని కాలంలో చేతి పరికరాల సాయంతో పరిశీలన చేసి గణన చేసి ఖచ్చితమైన విలువలను రాబట్టిన 'పటాని సామంత్' అనే ఖగోళ శాస్త్రవేత్తను అందరం మర్చిపోయాం.  ఆయన పరిశోధనా ఫలితాలు ఈనాటి వారిని అత్యాశ్చర్యంలో ముంచెత్తాయి ఈ మహానుభావుని పూర్తి పేరు 'మహా మహోపాధ్యాయ చంద్ర శేఖర సింగ్ హరి చందన మహా పాత్ర సమంత్'.  1835 డిసెంబర్ పద మూడున ఒరిస్సాలో 'ఖండాపర' ప్రాంతంలో జన్మించాడు.

చిన్ననాటి నుంచే విశ్వం, ఖగోళం, రాశులు మొదలైన వాటిపై ఆసక్తి ఉండేది.  వీటిపై సంస్కృత గ్రంథాలు విస్తృతంగా చదివాడు.  ప్రాచీన విజ్ఞానాన్ని ఔపోసన పట్టాడు.  ప్రయోగశీలిగా పరివర్తన చెందాడు.  సామాన్య కళ్ళ తో చూడలేని 'ధనూరాశి'ని ఆరు శతాబ్దాల కిందటే భారతీయులు కనిపెట్టారు.  మిగిలిన రాశులను ఏ శాస్త్రీయ పరిజ్ఞానంతో గుర్తించారో ఈ రోజుకీ ఎవరికీ అంటూ

బట్టటం లేదు. సూర్యుడు సప్తాశ్వ రథా రూఢుడు అని మన వాళ్ళు వేలాది ఏళ్ళ క్రితమే గుర్తించి ఆయన లో ఏడు రంగులున్నాయని చెప్పగలిగారు.

ప్రపంచ ప్రఖ్యాత ఖగోళ శాస్త్ర వేత్త 'నేకల్సన్ మెర్లే'కి కొన్ని వందల సంవత్సరాలకు పూర్వమే శ్రీనాధ మహాకవి 'కాశీ ఖండం'లో కాంతి వేగాన్ని ఎలా చెప్పగలిగాడో ఎవరికీ తెలియలేదు. అప్పటికి ఉన్న శాస్త్రీయ జ్ఞానాన్నే కవి చెప్పి ఉంటాడు. అలాగే 'సమంత్' గారి పరిశీలనలకు గణనలకు మూలాధార మేమిటో తెలుసుకోలేక పోతున్నారు. ఖగోళ విజ్ఞానాన్ని భూకేంద్ర సిద్ధాంతం, సూర్య కేంద్ర సిద్ధాంతాల ద్వారా తెలుసుకొనే వీలుంది. ఖగోళంలో జరిగే అపురూప సంఘటనలను ఆధారంగా చేసుకొని గణించే అవకాశం ఉంది. ఫలితాలను సమీక్షించుకోవచ్చు కూడా. సంప్రదాయ పండితుడైన సమంత్ 1874లో జరుగబోయే 'శుక్ర గ్రహ సంక్రమణం' అంటే శుక్ర గ్రహ ప్రయాణ మార్గం (ట్రాన్సిట్ ఆఫ్ వీనస్) గురించి చాలాకాలం ముందే ప్రకటించాడు.

సమంత్ పరిశీలనకు జ్ఞానానికి కోపర్నికస్ తెచ్చిన ఖగోళ విప్లవం గురించి పరిచయం తెలియనే తెలియదు. అయినా 1874 డిసెంబర్ తొమ్మిదిన సంభవించిన శుక్ర గ్రహ సంక్రమణం ఆయన చెప్పిన తేదీననే ఖచ్చితంగా జరిగింది. ఇది మన భారతీయ ఆధునిక ఖగోళ శాస్త్ర చరిత్రలో ఒక అద్భుత పరిశోధనా మిగిలిపోయింది. సువర్ణాధ్యాయమై వెలిగిపోతోంది. ఈ సంఘటన వ్యవధి సమయం ఆధారంగా భూమి – సూర్యుడి మధ్య దూరాన్ని గణన చేయటం ఏంతో ఆసక్తికర విషయం. ఆనాటి బ్రిటిష్ పాలకులు కూడా ఈ పరిశోధనా ఫలితాన్ని ఆశ్చర్యంతో గమనించారు. ప్రభుత్వ ఆధ్వర్యంలో 'అబ్సర్వేటరి సెంటర్లు' ప్రారంభమైనాయి. అంటే ఇది సమంత్ కృషి ఫలితమే అని గుర్తించుకోవాలి. పటాని సమంత గణించి, నిర్ధారించిన ఖగోళ సంఘటన మళ్ళీ 2004 జూన్ ఎనిమిదిన జరిగింది. ఈ రెండు సంఘటన పరిశీలనలు లెక్కలు పాశ్చాత్య శాస్త్రవేత్తల కృషికి ఏ మాత్రం తీసి పోవేమీ కాదు. ఇలా తనకున్న స్వంత చిన్న పరికరాలతో అమూల్య ఫలితాలను తెలియజేశాడు. తన కృషిని అంతటిని 'సిద్ధాంత దర్పణ' సంస్కృతంలో పొందు పరచాడు. ఇది ఒరియా లిపిలో తాళ పత్రాల

మీద రాయగా కలకత్తా యూనివర్సిటీ వారు 1899 లో ప్రచురించారు. ఇందులో మొత్తం 2,500 శ్లోకాలున్నాయి.

ఈ సిద్ధాన్త గ్రంథంలో అనేక అద్భుత అంశాలున్నాయి. సూర్య, శుక్ర గ్రహాల బింబాల నిష్పత్తి 1:32 అని లెక్క చెప్పాడు ఇది 31 నిమిషాల, 31 సెకనులుగా లెక్కించి చెప్పటం మరింత గొప్ప విషయం. ఈ పుస్తకంలో కొన్ని ముఖ్య భాగాలను అరుణ కుమార్ ఉపాధ్యాయ ఇంగ్లీష్‌లోకి అనువదించారు. శుక్ర గ్రహణ సంక్రమణం సమంత్ ఇంత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగాడో ఎవరికీ అంతుబట్టటం లేదు. భారతీయ పురాణాలలో, సంస్కృత గ్రంధాలలో మంత్రాలు శ్లోకాలరూపాలలో అనేక శాస్త్రీయ విషయాలు నిక్షిప్తమై ఉన్నాయి. ధ్రువుడి తపస్సుకు మెచ్చి విష్ణువు మెచ్చి ధ్రువ నక్షత్రం ఏర్పరచి 'నువ్వు ఆకాశంలో అత్యున్నత స్థానాన్ని పొందిన నీ చుట్టూ సప్తర్షులు 2,600 ఏళ్ళ కోసారి ప్రదక్షిణాలు చేస్తారు' అని భాగవతంలో ఉంది. ఈ విషయాన్ని క్రీ.పూ. 'హిపార్చస్' అనే శాస్త్రజ్ఞుడు కనుగొన్నాడు. దీనిని ఎన్నో వేల ఏళ్ళ క్రితమే మన భాగవత కర్త వ్యాసుడు చెప్పటం అత్యాశ్చర్యం కరం. మన సమంత డాక్టరేట్లు సైన్సు పట్టాలు లేకుండానే ఖగోళ అద్భుత రహస్యాలను కనుగొన్నాడు. 1904లో 69వ ఏట మరణించాడు. కేంద్ర ప్రభుత్వం 11-6-2001న సమంత్ పోస్టల్ స్టాంప్‌ను విడుదల చేసి గౌరవించింది. 'హాట్స్ ఆఫ్ టు సమంత్'. ❁

## 249. మాడభూషి వెంకటాచార్యులు (1835-1897)

**మా**డభూషి నరసింహాచార్యులు కొడుకు వెంకటాచార్యులు (1835-1970) గండర గండ కవి మహా పండితుడు. మేధావి. ఏక సంధాగ్రామి. అసాధారణ ప్రతిభా సమన్వితుడు. తర్క వ్యాకరణ జ్యోతిష్యాలలో ఆయనది అపారమైన ప్రజ్ఞ. సంస్కృత, ప్రాకృత, వికృత, శౌరసేని, మాగధీ, పైశాచీ మొదలైన భాషా వ్యాకరణాలను ఆపోసన పట్టినవాడు. సంస్కృతాంధ్రాలలో మహా ప్రబంధ రచన చేశాడు. సంగీత సాహిత్య పారంగతుడు. అష్టముఖాష్ట భాషా వ్యస్తాక్షరీ విద్యా వదాన్యుడు ఆవన్నీ ఏకకాలంలో ప్రదర్శించి ఆశ్చర్యపరచేవాడు. ఆంధ్ర గీర్వాణ ప్రబంధాలను, అనులోమంగా, విలోమంగా అప్పగించే మహాశారణా రాక్షసుడు. అరడుగుల అందగాడు. కమ్మని స్వరం, గంధర్వ గానం. తన అవధాన విద్యలో ఆంధ్రదేవాన్ని ఒక ఊపు ఊపాడు 1875 ప్రాంతంలో. 1872 ఫిబ్రవరి 21న నూజివీడు ప్రభువు నారయ్యప్పారావు ఆగిరిపల్లి ఒక విద్వాన్మహా సభ జరిపి దానిలో వెంకటాచార్యుల చేత శతావధానం, ఆశు కవితావధానం చేయించాడు. దీనితో ఆచార్యులగారి పేరు దేశమంతా మారుమోగింది. సంస్కృతంలో ఇరవై ఏడు వృత్తాలు తెలుగులో ఇరవై, రెండు భాషలో నాలుగు కీర్తనలు మొత్తం యాభై పూర్తి చేశారు. సభలో ఉన్న పిఠాపురం రాజా రావు వెంకట మహీపతి గంగాధర రామారావు ముచ్చటపడి మీ ద్విసంధాగ్రామిత్వం పరీక్షిస్తాను అన్నాడు ఒక పండితుడు చెప్పిన సీస పద్యాన్ని ఆచార్యులుగారు పౌరాణిక ధోరణిలో చదివి అనులోమ, ప్రతిలోమంగా కూడా చెప్పారు. సభంతా నివ్వెరపోయి చూసింది. అయినా రామారావు బహద్దర్

గారికి ఆనలేదు. ఆ సీసపద్య భావాన్ని ఒక వృత్తంలో సంస్కృతంలో చెప్పమని అడిగారు. ఆచార్యులవారు అతి సునాయాసంగా ఆశువుగా చెప్పారు. మళ్ళీ అభూతోపమాలంకారంతో ఒక తెలుగు వృత్తం చెప్పమన్నారు. తడుముకోకుండా చెప్పారు ఆచార్య శ్రీ. కాలం గురించి ఎవరికీ స్పృహ లేదు. అన్నం, నీళ్ళు మర్చిపోయారు అందరూ. అవధాన విందే ఆరగిస్తున్నారు. ఆచార్యులుగారు చెప్పిన శ్లోకాలలోకాని పద్యాలలో కాని ఒక్క దోషమూ లేకపోవటం చూసి అంతా అవాక్కయ్యారు. అదీ వెంకటాచార్యులవారి మనీష. అప్పటికే అర్ధరాత్రి దాటింది.

మర్నాడు సభలో ఆచార్యులవారు అష్టభాషా వ్యస్తాక్షరి అనే అవధాన ప్రక్రియను ప్రదర్శించారు. అందులో ఇంగ్లీష్, హిందీ, తమిళం భాషల్లోనే ప్రశ్నలు ఇచ్చారు. దీనినీ అద్భుతంగా రక్తి కట్టించారు. నివ్వెరపడ్డ గంగాధర రామారావు ఆచార్యులవారు పండిత రాయలకు అపర అవతారంగా కనిపిస్తున్నారు. ఇకనుండి వీరిని పండితరాయ వెంకటాచార్యులు అని గౌరవంగా పిలవండి అని మితువు చెప్పారు. పండితరాయలు వాక్పతి అనే పేర ఈ భూప్రపంచంలో నాకు తప్ప ఎవరికీ లేదు అని గర్జించినవాడు. నూజివీడు జమీన్ దావాలో ఇరుకున్నది. అప్పుడు ఆచార్యుల వారు వంద పేజీల వాఙ్మూలాన్ని తారీఖులుతో సహా చెప్పారు న్యాయస్థానంలో. ఆశ్చర్యపోయిన జడ్జికి అనులోమ నిలోమాలలోనూ దాన్ని వినిపించి మైండ్ బ్లాక్ అయేట్లు చేసిన ధారణా రాక్షసుడు. క్రాస్ ఎక్సామినేషన్‌లోను మళ్ళీ అవే ప్రశ్నలు వేస్తుంటే వాటినీ తేదిలతో సహా చెప్పేశారు. వీరి సాక్ష్యం వల్లనే రాజావారు కేసు గెలిచారు.

వనప్పాకం అనంతాచార్యులు అనే పండిత మిత్రునితో ఉన్నప్పుడు ఒక అరవ పండితుడు వచ్చాడు. తన గొప్పలు చెప్పుకొంటూ తెగ కోతలు కోస్తున్నాడు. అక్కడి పండితులెవరూ ఆయనకు ఆనలేదు. ఆచార్యుల గారక్కడే ఉన్నారు. అరవాయన పది శ్లోకాలు చెప్పగానే ఈయన ఇవి నేను చిన్నప్పుడే చదివాను అన్నారు. ఇవి పూర్వకవి ఎవరో రాసినవి అని ఆక్షేపించారు. ఇది ధర్మమా అని ప్రశ్నించారు. మండిపోయిన అరవాయన ఏదీ చెప్పు అన్నాడు. పొల్లు పోకుండా ఆచార్యులవారు చెప్పి దిమ్మ తిరిగేట్టు చేశారు.

ఆంధ్రదేశంలో శతావదాన్ని ప్రచారంలోకి తెచ్చింది మాడభూషి వెంకటాచార్యుల వారే. ఆ తర్వాతే తిరుపతి కవులు. గంటకు వందల కొద్దీ పద్యాలు ఆశువుగా చెప్పి రికార్డు సృష్టించారు. వేలకొద్దీ పద్యాలు ధారణ చేయగల సత్తా వారిది. వీరి ఆశీస్సులతో బుక్కపట్టణం రాఘవాచార్యులు, దేవులపల్లి సోదర కవులు అవధానాలు ప్రారంభించారు. తిరుపతి కవులు వ్యాప్తి తెచ్చారు. ఆచార్యులవారు అవధానాలే కాక, గ్రంథ రచనా చేశారు. భారతాభ్యుదయం, వామన నాటకం, మదన మోహన చరిత్ర వచన కావ్యం, రామావధూటి తారావళి, హంస సందేశం, పుష్ప బాణ విలాసం అనే ఆశువుగా చెప్పిన ఆంధ్రీకరణం, ఆనంద గజపతీంద్ర శతకం, బృహద్వైద్య రత్నాకరం, ప్రభా నాటకం అనే అశ్వ ఘోషుని చరిత్ర రచించారు. ఇంతటి హ్యూమన్ కంప్యూటర్‌కు సంతానం లేకపోవటం విచారకరం. వారసత్వం కోసం వేదాంతం నరసింహాచార్యులను దత్తత తీసుకొన్నారు. వెంకటాచార్యులవారు తన కొడుకు నరసింహాచార్యులు 1972లో చేసిన అద్భుత శతావధాన్ని కళ్ళారా చూడలేక పోయారు. కారణం 1858కే కాలధర్మం చెందారు.

ఈ రచనకు ఆధారం– శ్రీ మాడభూషి నరసింహాచార్యులు రాసిన పల్లవీ పల్లవోల్లాసం అనే జాంబవతి చరిత్రకు వేములపాడు వాస్తవ్యులు శ్రీ ఉన్నం జ్యోతివాసు గారు రాసిన ముందుమాట పైడి ముడుపు. ❁



## 250. వర్షోత్సవ కీర్తనలు రాసిన శ్రీ కొలచిన యజ్ఞ నారాయణ సోమయాజి (1835- 1899)

1835లో గుంటూరు జిల్లాలో జన్మించిన శ్రీ కొలచిన యజ్ఞ నారాయణ సోమయాజుగారి జీవిత చరిత్ర పెద్దగా తెలియలేదు. భార్య శ్రీమతి జగదీశ్వరమ్మగారు. వారు నిత్యదేవీ ప్రసన్ను అని, పాదుకాంత శ్రీ విద్యా దీక్షాపరులని, సన్యాసాశ్రమం స్వీకరించి కళ్యానందస్వామిగా ఆశ్రమ నామధేయం పొందారని వారి దౌహిత్రుడు కొలచిన అద్వైత పరబ్రహ్మ శాస్త్రిగారు తెలియజేశారు. దీక్షితులుగారు శ్రీ విశ్వనాథ మానస పూజా స్తవం, వర్షోత్సవ ఏకాన్తోత్సవ, చూర్ణోత్సవ కీర్తనలు రాశారని, వాటిని తాను పునర్ముద్రించానని చెప్పారు. ఇవి సుమారు వందేళ్ళనాటి రచనలు. అందులో దీక్షితులుగారు చేసిన విజ్ఞప్తిని సంక్షిప్తంగా తెలియజేస్తున్నాను. అప్పయ్య హవిర్యాజి, మహాలక్ష్మమ్మ దంపతులకు గుంటూరులో రామచంద్ర పురాగ్రహారంలో జన్మించాను. కామకాయనస గోత్రీకులం. నేను రాసిన శ్రీ కాశీ విశ్వనాథ మానస పూజాస్తవం, శ్రీ కాశీ విశ్వనాథ వర్షోత్సవ కీర్తనలు, ఏకోన్తోత్సవ కీర్తనలను వ్యాకరణ కేసరి బ్రహ్మశ్రీ ఉపద్రష్ట లక్ష్మీ నారాయణ శాస్త్రిగారు పరిష్కరించారు. రాజమండ్రిలోని శ్రీ వీరేశలింగం గారి వివేకవర్ధినీ ముద్రణశాలలో, ఆ పట్టణ శివ భక్తాగ్రగన్యుడు బ్రాహ్మణ పూజా దురంధరుడు, వాసవాంబా వర ప్రసాదుడు పైదికుల గోత్రానికి చెందిన నడుపల్లి సత్య లింగం శ్రేష్టి గారి రెండవ కుమారుడు సూర్య నారాయణ శ్రేష్టి, ఆర్య వంశ కుల గోత్రం వాడు అయిన మల్లయ్య శ్రేష్టి కుమారుడు బాపిరాజు ధనసాయం చేసి ముద్రించారు. అది 11-08-1889 విరోధి నామ శ్రావణ శుక్ల పౌర్ణమి ఆదివారం.

ఈ కీర్తనలను కొన్నింటిని గుంటూరు రామచంద్ర పురాగ్రహారంలో గంగా భ్రమరాంబా సమేత శ్రీ మల్లేశ్వర స్వామి పైనా, మరికొన్ని ఎడ్లపాడు దగ్గరున్న విశ్వనాథ ఖండ్రికలోని గంగా అన్నపూర్ణ సమేత శ్రీ విశ్వనాధుని నేరా, ఇంకొన్ని వినుకొండ

తాలుకా చేజెర్ల గ్రామంలో పార్వతీ సమేత శ్రీ కపోతేశ్వర స్వామి పైనా వ్రాయబడినాయి. దీక్షితులుగారు ఇవికాక అనేక స్తోత్రాలు అష్టకాలు, కీర్తనలు వందకు పైగానే రాశారు. వీటిని అన్నిటిని ముద్రించే శక్తి లేక దౌహిత్రుడు దీన్ని మాత్రమే అచ్చువేసి ఆస్తిక జనులకు అందించారు. రామ చంద్రాపురాగ్రహార శివాలయంలో ప్రతి ఏడాది జరిగే కళ్యాణోత్సవంలో ఈ కీర్తనలను ఇప్పటికి గానం చేస్తూ దీక్షితులగారిని స్మరిస్తూనే ఉంటారు. ఈ మలి ముద్రణకు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి మహోదయులు తొలి పలుకులు రాశారు.

శ్రీ శాస్త్రిగారు మా తండ్రిగారు వెంకటప్పయ్య శాస్త్రిగారు తమ రచనలలో కొలచిన యజ్ఞ నారాయణ దీక్షితుల వారిని గురువుగా చెప్పుకొన్నారు. ఆశ్రమ స్వీకారం తర్వాత కళ్యానానంద స్వామి అయ్యారు. మా తండ్రిగారి శ్రీరామ కథామృతం మొదలైన వాటిలో ఆశ్వాసాంత పద్యాలలో యజ్ఞ నారాయణాఖ్య అని కళ్యాణానంద నాదా మృదయ గురు కరుణా అని కీర్తించారు. మా తండ్రిగారితో చిన్న బుట్టెడు తుమ్మిపూలు పూజకు కోయించి, పేకాడే తనను దేవీ కృపకు పాత్రుడిని చేశారని మా నాన్న గారెప్పుడూ కృతజ్ఞతతో చెప్పుకొనేవారు. తన గురువులలో దీక్షితులగారు అగ్రగణ్యులు అని భావించేవారు.

గురువుగారికి మా తండ్రిగారు ఎప్పుడూ తర్పణం వదిలేవారు. వారి తదనంతరం నన్ను కూడా వదలమని ఆదేశిస్తే అలానే వదులుతున్నాను. దీక్షితుల గారి కృతులలో భక్తి పరాకాష్టగా ఉంది. అద్వైతం గారు మళ్ళీ దీన్ని ముద్రించటం ఋణం తీర్చుకోవటమే అని 03-06-1974లో రాశారు.

**దీక్షితులగారి గీర్వాణ కవితా దీక్షితీయం**

**మానస పూజ**

శ్రీ విశ్వనాథ గిరి మూర్ధ్ని నివేశ సంస్థ- విశ్వేశ్ర విధి ముఖార్చిత పాద పద్మం

శ్రీ మద్విశాల నయనా, వినయాంత రంగం- ధ్యాయామి సంతత మహం శశి ఖండ మౌళిం శ్రీ కాశీ విశ్వనాథ స్వామినేనమః- ధ్యాయామి .. నాలుగవ శ్లోకంలో-

కనక రంజిత శుమ్భ స్తంభ గుమ్భత్సు ముక్తా- ఫలమణి, నికురుమ్బై ర్నిమ్మితే భాసమానే

దివిజ ముని కదంబై స్సేవితే మంట పేస్మిన్- శశిధర హర దాస్యే రత్న సింహాసనం తే నవ రత్న ఖచిత దివ్య సింహాసనం సమర్పయామి, తొమ్మిదవ శ్లోకంలో-

నమకస్చామకస్చైవ సూక్తైశ్చ వివిధై స్తదా- అరుణై రౌపనిష ద్రై, రానంద

లహరీస్తవై

శ్రీ రుద్రజాపైరామ్నాయై ర్మహిమ్నాది మహా స్తవై అభిషేకం కరిష్యామి- స్వీకరిష్వ మమ ప్రభో- పూర్ణాభిషేకం సమర్పయామి.. ఇలా ఇరవై నాలుగు స్తోత్రాలతో నైవేద్యం ధూపం దీపం తాంబూలం, నీరాజనం, మంత్రపుష్పం ప్రదక్షిణ మొదలైనవన్నిటితో పూజా విధానం అంతా చెప్పారు. చివరికి ఫల శృతి కూడా చెప్పారు. అప్పుడు తననుగురించి

ఇతి శ్రీ చిదానంద నాద చరణార బిందు సందోహ మరందాస్వాదనిష్టా

గరిష్టశ్రీమత్కాళ్యాణానంద నాద భూసుర విరచితం శ్రీ మత్కాశీ విశ్వనాథ మానస పూజా స్తవం సంపూర్ణం అన్నారు.

శివుడిని పెళ్ళి కొడుకును చేసేప్పుడు తెలుగులో నగ రెల్ల పందిళ్ళు వైచిరి- వాటికి సొగసైన చాందీలు గట్టిరి- భగవంతుడైన శివుని శుభ ల్నమునకు 18 చరణాల పాట రాశారు. నలుగు పాటను పదమూడు చరణాలలో రాశారు.

మంగళా పరదా సర్వా మంగళా హిత శర్వా- అన్గాజా మదగర్వా- హరనుతా సుపర్వా అని మొదలెట్టి చేజేర్ల పుర వాసా- రాజ రాజేశ్వరా- రాజశేఖర శైలా రాజరాజాహితా అని ముగించారు.

మంగళహారతి- విశ్వనాథాయ సకల- విశ్వ సంరక్షణాయ- శాశ్వ తైశ్వర్య దాయ కాయ మంగళం అని ప్రారంభించి సోమ శేఖరాయ త్రిపుర సుందరీ మనోహరాయ- కామితార్ధ దాయకాయ ధీమ మంగళం అని అంటూ యజ్న నారాయనాస్వ విజ్ఞానదాయ కాయ- యసుజ్ఞాన కోశ శుభద మంగళం అని ముగించారు.

వసంతోత్సవం రాశారు- సువ్వి శ్రీ విశ్వనాథ సువ్వి శ్రీ మల్లినాథ- సువ్వి శ్రీ రామనాథ సువ్విలాలీ అని ప్రారంభించి 24 చరణాలు రాశారు.

శ్రీ యజ్ఞనారాయణ దీక్షితుల వారి గురువులైన శ్రీ తుంగతుర్తి బుచ్చిలింగశివ యోగి రాసిన కొట్నాలపాట చూర్నోత్సవ కీర్తన వగైరాలను కూడా ఈ పుస్తకంలో ప్రచురించారు. ❁



## 251. సంస్కరణలతో పాటు సంస్కృతాన్ని నిలబెట్టిన – భండార్కర్ (1837–1925)

**6**-7-1837లో మహారాష్ట్రలోని సింధు దుర్గ జిల్లా మాల్వన్ లో జన్మించాడు. రత్న గిరిలో చదివి, బొంబాయి ఎల్ఫిన్ స్టన్ కాలేజిలో చేరాడు. మహాదేవ గోవింద రానడేతో కలిసి బొంబాయి యూనివర్సిటి నుండి మొట్టమొదటిసారి గ్రాడ్యుయేట్ అయ్యాడు. మరుసటి ఏడాది మాస్టర్ డిగ్రీ పొందాడు. 1885లో గోటింజెన్ నుండి పి.హెచ్ డి.పొందాడు. ఎల్ఫిన్ స్టీన్, దక్కన్ కాలేజీలలో లెక్చరర్‌గా పని చేశాడు. రచనలో రిసెర్చ్‌లలో జీవితాంతం గడిపాడు. బాంబే యూనివర్సిటి వైస్ చాన్స్‌లర్‌గా 1884లో రిటైర్ అయ్యాడు. 1874లో లండన్లో, 1886లో, వియన్నాలలో జరిగిన అంతర్జాతీయ ఓరియెంటల్ భాషా సదస్సులో పాల్గొన్నాడు. శాతవాహన, డెక్కన్ చరిత్రలకు ప్రాణం పోశాడు. భండార్కర్ గొప్ప సంస్కరణాభిలాషి. వితంతు వివాహాన్ని సమర్ధించాడు. కుల వ్యవస్థను బాల్య వివాహాలను నిరసించాడు.

1903లో కౌన్సిల్ ఆఫ్ ఇండియాకు నాన్ అఫీషియల్ మెంబర్‌గా ఎన్నికయ్యాడు. గోపాలకృష్ణ గోఖలేగారు ఇందులో మరొక మెంబర్. .1911లో ప్రభుత్వం 'నైట్ హూడ్'ను (సి.ఐ.ఇ) ప్రదానం చేసి గౌరవించింది. సమకాలీన సమాజంలోని కుళ్ళును ఏరిపారేయటానికి 'పరమ హంస సభ'ను ఏర్పాటు చేసి

ప్రక్షాళనం చేశాడు. 1864లో కేశవ చంద్రసేన్ పర్యటనతో ప్రభావితమై ఆత్మారాం పాండురంగ ఇంట్లో సభ్యులు సమావేశమై కులవ్యవస్థను నిరసించి, విధవా వివాహాలను సమర్ధించి బాల్య వివాహాలను ఈసడించి స్త్రీ విద్యనూ సమర్ధించారు. 31-3-1867న ఈ సంస్కరణల అమలుకోసం ప్రార్ధనా సమావేశం జరిపారు. ఇదే తర్వాత 'ప్రార్ధనా సమాజ్' అయింది. కేశవ చంద్రుని మరో పర్యటన, ప్రతాప చంద్ర మజుందార్, నవీన్ చంద్రరాయిల ప్రేరణతో పంజాబ్ బ్రహ్మ సమాజం ఏర్పడింది. పూనాలోని భండార్కర్ రిసెర్చ్ ఇన్ స్టిట్యూట్ ఆయన పేరు మీదనే ఏర్పడింది.

భండార్కర్ సంస్కృత భాషాభ్యాసం కోసం పుస్తకాలు రాశాడు. మొదటి పుస్తకంలో విద్యార్ధులను దృష్టిలో పెట్టుకొని వ్యాకరణం సంస్కృత వాక్యాలను ఇంగ్లీష్‌లోకి అనువదించటం ఉంటాయి. సులభంగా అర్ధమయ్యే విధానంలో రాశాడు. రెండవ పుస్తకమూ పరమ ప్రయోజనకరమైనదే. ఒకరకంగా అది ఉపాధ్యాయులకూ విద్యార్ధులకూ కూడా కర దీపిక. తెలుగులో ఎం. ఏ చదివేవారికి సంస్కృతంలో ఒక పేపర్ ఉంటుంది. దీనికోసం అందరూ భండార్కర్ శరణం గచ్ఛామి అనాల్సిందే. సంస్కృత వ్యాకరణం కూడా రాశాడు భండార్కర్. భండార్కర్ పుస్తకాలన్నీ పరమ ప్రయోజనకరమైనవి. సంస్కృత భాషకు భండార్కర్ చేసిన కృషి చిరస్మరణీయం.

భండార్కర్ రిసెర్చ్ ఇన్ స్టిట్యూట్లో దక్షిణ ఆసియాలో ఉన్న అరుదైన సంస్కృత వ్రాత ప్రతులన్నీ ఉంటాయి. లక్షా ఇరవై ఐదువేల పుస్తకాలు, 29, 510 వ్రాతప్రతులు ఉన్నాయి. మూడు నేలలకొకసారి జర్నల్‌ను ప్రచురిస్తారు. ఇందులో భద్రపరచిన ఋగ్వేదం వ్రాత ప్రతి 'యునెస్కో వారి మెమరీ ఆఫ్ ది వరల్డ్ రిజిస్టర్'లో చోటు చేసుకొన్నది. 24-8-1925న భండార్కర్ మహాశయుడు 88వ ఏట మరణించాడు. ❁

## 252. హోస దుర్గం కృష్ణమాచార్య (1839-1916)

శ్రీ కృష్ణ బ్రహ్మ తంత్ర పరకాల స్వామి అని పేరొందిన హోసదుర్గం కృష్ణమాచార్య తాతాచార్య, క్రిష్ణాంబ లకుమారుడు. 1839లో అమిదేల్లిగ్రామంలో జన్మించారు. కర్నూలు జిల్లా పేపలిలో అయోధ్య కొండమాచార్య వద్ద వ్యాకరణ విద్యతోబాటు శాస్త్రాలన్నీ నేర్చారు. యవ్వనంలో వనపర్తి, గద్వాల, ఆత్మకూరు, జటప్రోలు సంస్థానాలలో విద్య ప్రదర్శించి ఆస్థానకవి యై సన్మానాలు అందుకొన్నారు. ధర్మాధికారి పదవీని పొందారు. 'విద్వత్ కవి సార్వ భౌమ', కవిగండ భేరుండ' బిరుదులందుకున్నారు. సంస్కృతాంధ్రాలలో వందకు పైగా గ్రంథాలు రాశారు. 40వ ఏట సన్యాస దీక్ష పొంది పరకాల మఠంలో రంగనాధస్వామి సేవలో గడిపారు. అప్పటినుండి 'శ్రీ కృష్ణ బ్రహ్మ తంత్ర పరకాల స్వామి'గా ఆశ్రమ నామం పొంది 35 ఏళ్ళు గడిపారు.

ఆచార్యులవారి సంస్కృత రచనలు – శ్రీ పరకాల గురు విజయ చంపు, ఉత్తర పరకాల గురు విజయం, రామేశ్వర విజయం, రఘునాధ విజయం.

తన పూర్వీకుల గురించి వివరించారు, శ్రీనివాస బ్రహ్మ తంత్ర పరకాల స్వామి గురించి తెలిపారు, మొదటి విలాసంలో. 16 ఏళ్ళకే సంస్కృతంలో అపారజ్ఞానం సంపాదించారని మైసూర్ మహారాజుకృష్ణ రాజు ఆహ్వానంపై ధార్వాడ, కొల్హాపూర్, సాంగ్లి, సతారా, పూనా క్షేత్ర సందర్శనం చేశారని, చర్చలలో పాల్గొని వైష్ణవ మత ప్రభావాన్ని వ్యాప్తి చేశారని రాశారు. రెండవ విలాసంలో పూనాలో శ్రీనివాసకు, మొహర పండితునికి మధ్య జరిగిన 34 రోజుల చర్చను వర్ణించారు. ఇందులో శ్రీనివాసులదే విజయం. సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణన బాగా

చేశారు. చంద్రోదయ వర్ణన రామణీయకంగా ఉంటుంది. వెన్నెలలో శృంగార క్రీడలను వర్ణించారు-

'కస్తూరి ఘనసార చందన రస స్యాలిసబాహాంతరం - గాఢాలింగ కపోల చుంబన కుచ మర్దాది లీలా రతోః
కాంతాః కేళి సుఖం భజన్య నృపదం తా వృక్ష చాతూక్తి భిః-దీరే కామి జనే నురక్త హృదయే సేవ వ్యరంసీన్నిశా'.

మూడవ విలాసంలో నాశిక్‌లో తురుష్క యతితో వాదంలో గెలవటం, గోదావరి రామాయణ వర్ణన, శ్రీనివాస యతి మైసూర్ తిరిగి రావటం ఉన్నాయి. నాలుగవ విలాసంలో శ్రీనివాస దేశికుల తిరుగుప్రయాణంలో హోసదుర్గం నారాయణ గిరి సందర్శనం దేవతామూర్తులకు సేవలు అర్చనలు, శ్రీరంగ నాద స్వామి వర్ణన. వీటిలో కవిత్వ ప్రతిభను గుప్పించేశారు కృష్ణ బ్రహ్మ. అయిదవ విలాసంలో ఉషోదయం, మైసూర్ రాకు కృష్ణ రాజుకు ప్రభాత స్తుతి మేల్కొలుపులు, శ్రీనివాస దేశికులను రాజు అంతః పురానికి ఆహ్వానించి, సభలో గౌరవించటం పండిత గోష్టి, రాజును వైష్ణవ భక్తునిగా మార్చటం చివరికి తన నిజనివాసం' అంబ విలాసానికి తిరిగి రావటం ఉన్నాయి.

కృష్ణ బ్రహ్మ రాసిన ఆధ్యాత్మిక రచనలలో 'కళ్యాణ గీత మంజరి' సుప్రసిద్ధమైనది. బహువిధ శైలీ విన్యాసం ఇందులో చూపాడు కవి. తెలుగు జానపద గీతం 'సువ్వి' ఆధారంగా సంస్కృతంలో పాటలు రాశారు. శ్రీనివాస, రంగ విజయ, నృసింహ కార్తికోత్సవ విలాస చంపూలను ,కేశవోత్సవ మాలిక, శ్రీ కృష్ణ సహస్రం, రసాస్వాదిని, విక్రాన్త రాఘవ వ్యాయోగం, సుభద్రాపరిణయం, ప్రపన్నామృత స్తోత్రం, శ్రీరామ సుప్రభాతం, పంచాయుధ స్తుతి, సాంబు రహస్యం శ్రీ దశావతార స్తుతి, అనుగ్రహ పరిపాటి వంటివి 90కి పైగా రాశారు.

ఇందులో 'పరకాల గురు విజయం' అయిదు విలాసాల చంపూ కావ్యం. తన ఇంటిపేరు హొస దుర్గను 'నూతన దుర్గ', 'ప్రత్యగ్ర దుర్గ'గా కవి సంస్కృతీ కరించాడు. ❀

## 253. శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి (1839-1922)

**వి**జయనగరంలో పుట్టిన శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి మహారాజ కాలేజిలో సంస్కృత టీచర్‌గా పని చేశారు. శ్రీ రామ విజయం సంస్కృత నాటకం రాశారు. శ్రీ కొల్లూరి కామ శాస్త్రి (1840-1907) విజయనగర సంస్థానంలో ఉండి నరసింహ - కరుణా స్తవం రాశారు. శ్రీ మండా కామేశ్వర కవి (1840 -19 04) 'దేవి లీలా తరంగిణి' చేశారు. శ్రీ వీటూరి వెంకట రామ శాస్త్రి (1807) యలమంచిలి వారు. 'హరి స్తోత్రం' రాశారు.❁



## 254. రావు భాస్కరరాయ (1840–)

**ప**శ్చిమ గోదావరి జిల్లా పాందుర గ్రామానికి చెందినవాడు పిఠాపురం వెలమ దొరల బంధువు, రావు వెంకమ్మ, రామరాయల సుపుత్రుడే భాస్కరరాయ. 1840లో జన్మించి 20వ శతాబ్ద ప్రారంభం లో మరణించాడు. తత్వ వ్యాకరణ, పురాణ, స్మృతి నీటి శాస్త్రాలలో అపార పాండిత్యం ఉన్నవాడు. విశిష్టాద్వైతి అయినప్పటికీ అద్వైతాన్ని అవపోసన పట్టాడు. 40వ ఏట 'అద్వైత సారం' సంస్కృతంలో రాశాడు. ఆంధ్ర గీర్వాణాలలో చాలా రాశాడని చెబుతున్నా సంస్కృతంలో లభించినవి రెండే రెండు. అవి రామ ధాటి శ్లోకం, కుమార శతకం, రామదాటి 21 శ్లోకాల రచన. ఇందులో రావు వంశం గొప్పతనాన్ని వర్ణించాడు. దీనిని పిఠాపురం రాజు రాజా వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్‌కు అంకితమిచ్చాడు. ఇందులో మొదటి శ్లోకం–

'కళ్యాణదం భవతు వస్తు కిమష్య జసం స్త్రీ పుంసా రూప మతిలోక మనంత్య మాఘం

రాజ్య శ్రియః కృతి పతే సస వాసు రూప మేవం సంబోధయన్నవనవాభ్యుదయాయ రాజః'

వెలమ వంశా రంభాన్ని వివరిస్తూ శ్లోకం చెప్పాడు. సూర్యారావు బహద్దూర్ దాన వితరణపై–

'వనీపకానామ వనీపకానాం విపర్యయస్స్యా ద్విహి తోషి వృత్తా - అస్మిన్ భువం బిభ్రతి సూర్య రాయే ,దానేన శౌర్యేనజగత్ప్రసిద్ధే'

చివరి శ్లోకంలో రామదాటిని 21 శ్లోకాలలో రాశానని, ఇది పరశురాముడు క్షత్రియులపై చేసిన 21 దండయాత్రలను సూచిస్తుందని తెలిపాడు.

'శ్లోకా స్త్రీసూర్య రాయస్యాభ్యుదయ ప్రతిపాదకాః-ద్విషన్మనోభిదో రామ, దాటీ వచ్చైకా విమ్మతిః'

కుమార శతకం వంద శ్లోకాలతో ఉంది. ప్రతిశ్లోకంలో కుమా శబ్దం వచ్చేట్లు రాసి కుమార రాజాకు అంకితమిచ్చాడు.

'మాతా మంగామ్బికా యస్య పితా రామ మహేశ్వరః -కుమారాత్కుమారోయం ద్రాజ్య యత్వరి మండలం ''

చాలా లోతైన భావం తో ఉత్కృష్ట రచన చేసిన పద్యాలు ఎక్కువగా ఉన్నాయి .కొన్ని-

"సాన్త్వం మాన్యే, ధనం దీనే, శటేభేద మరౌ దమం - కుమార! పాతయ ధియా విమృశ్య గురు లాఘవం'

న నీచ మాధికం కుర్యాన్నాధికం నీచ మప్యతః - యదార్ధం స్తాపయేద్రాజా, కుమార! స్వార్ధ తత్పరః'.

దీన్ని 1890లో రాసి 1897లో కుమార మహీపతికి అంకితమిచ్చాడు.❋

## 255. చెన్న మాధవుని వెంకట రామ రాజు (1840-1910)

**య**ల్లమ రాజు అని పిలువబడే వెంకట రామరాజు భరద్వాజ గోత్రానికి చెందిన పెరుమాళ్ళురాజు కొడుకు. 1840లో వరంగల్ జిల్లా బచ్చన్నపేటలో పుట్టి 1910లో మరణించాడు. కృష్ణభక్తుడు కనుక ఆ ఊరిలో గొప్ప కృష్ణాలయం నిర్మించాడు. ఆలయంలోని పల్లకీ వంటివి నిజాం రాజు కానుకగా అందించాడు. రాజు మంచి గుర్రపు రౌతు. కత్తి, బల్లెం ఉపయోగించటంలో గొప్ప లాఘవం ఉన్నవాడు. సైన్యాధికారి నుంచి కత్తి లాక్కొని చేతిలోని బల్లెం ఆధారంగా పోల్ వాల్ట్‌లాగా కోట లోకి దూకాడని కథలు గాథలు చెప్పుకొంటారు. 'సూర్య నారాయనియము అంటే చంపు' రాశాడు. తెలుగులో కేశవ శతకం చేశాడు. కొన్ని మచ్చుకి-

'శ్రీరామః ప్రదిశోచ్చమం స భవతాం హంస స్తుతో ద్వాధ్వాశః - సత్యానంద కరస్ఫుర గవరడో గోరాజ సంసేవితః

కృష్ణోననంత మనోజ్ఞా భోగ రుచిరా సాద్ధర్మ భ్రుద్విగ్రహః - భానీరేజ పదస్తితౌ బుధ గురు స్సంస్తుత్య దామాధవః'

దేవతా స్తుతి-

'విద్యాప్రదం సురజ్జేస్త పూజితాంఘ్రి పయోరుహం - ప్రత్యూహద్వాంత సప్తశ్వాం నమామి హయ కంధరం'

కథా ప్రారంభ శ్లోకం - 'పరేరయోధ్యా మధురాచ మానవే రస్తి ప్రపూర్నా వాసు సన్చయయాఐర్యతా - సుహస్తి జాతేతిపురీ మహోజ్జ్వలా భాసాల దుర్గేశ్చ విరాజితా భువీ'❁



## 256 –ఉభయ కవి మిత్రులు, సంస్కృత సాహిత్య రత్న – శ్రీ కోరిడే రాజన్న శాస్త్రి (1933 –2013)

**శ్రీ** కొరిడే రాజన్న శాస్త్రి తెలంగాణా కరీంనగర్ జిల్లా ధర్మపురిలో 1933 లో భారద్వాజ గోత్రీకులు కొరిడే కృష్ణయ్య, గంగాయమ్మ దంపతులకు జన్మించారు. సంప్రదాయబద్ధంగా విద్య నేర్చి బాల్యంలోనే రామాయణ భాగవత భారతాదులను చదివి ఆకళించుకొన్నారు. సాంబశివశాస్త్రి, పాలెపు వెంకటరాయశాస్త్రి వంటి ఉద్దండుల వద్ద సంస్కృత వ్యాకరణ అలంకార, తర్క వేదాన్తాలను అధ్యయనం చేశారు. కవిత్వం శాస్త్ర విచారాలలో స్వయంకృషితో పట్టు సాధించి, కవిత్వ, రచనల ద్వారా వాసికెక్కారు .1956 లో 23 వ ఏట పూరీ గోవర్ధన పీతాదిపతులచే 'సాహిత్య రత్న' బిరుదం పొంది, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సంస్కృత సాహిత్య విద్యా ప్రవీణ పరీక్షలో 1961 లో ఉత్తీర్ణులై కరీంనగర్ జిల్లాలో సుల్తానాబాద్, రాయకల్లు, చొప్పదండి ధర్మపురిలలో సంస్కృత ,తెలుగు పండితులుగా పని చేశారు. శ్రీ తాడూరి శివరామయ్య శ్రీమతి లక్ష్మీ నర్సింల కుమార్తె శ్రీమతి సులోచనా దేవిని ఆమెకు 5 లేక 6 ఏళ్ళ వయసున్నప్పుడే వివాహమాడారు.

సంస్కృత సాహిత్య పరిశోధనకై కేంద్ర ప్రభుత్వమిచ్చిన ఉపకార వేతనం తో ఉస్మానియా యూనివర్సిటి సంస్కృత అకాడెమిలో వారణాసి ధర్మ సూరి రచించిన 'సాహిత్య రత్నాకరం'పై గొప్ప పరిశోధన చేశారు. ప్రైవేటుగా చదివి ఎం ఓ ఎల్, తెలుగు ఎం.ఎ లను ఉస్మానియా నుంచి అందుకొన్నారు .సికందరాబాద్ సర్దార్ పటేల్ కాలేజి లో 1972 నుంచి ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తూ, యు జి సి ఫెలోషిప్ తో 'ధ్వని–మనుచరిత్రము' విషయంపై పరిశోధన చేసి పి. హెచ్‌డి పొంది, 1981 నుండి ఉస్మానియా యూనివర్సిటి స్నాతకోత్తర కేంద్రంలో ఆంధ్రోపన్యాసకులుగా చేరి 1993లో

రిటైరయ్యారు.

శాస్త్రి గారి సంస్కృత రచనలుసంస్కృత భారతి, ఆరాధన, భారతి వివేచన పత్రికలలో, వారణాసి విశ్వవిద్యాలయ సాహితీ సుషమా, సాగర్ విశ్వవిద్యాలయ సాగరిక, భారతీయ విద్యాభవన్ వారి సంవిత్, స్వాధ్యాయ మండలి వారి 'అమృతలత', వారణాసి ధర్మ మండలి 'సూర్యోదయ', మద్రాస్ రామకృష్ణ ప్రభలలో ప్రచురితాలై భారతదేశ ప్రముఖ సంస్కృత పండితులుగా గుర్తింపు పొందారు. వీరి సంస్కృత రచనలో ముఖ్యమైనదవి 1) వారణాసి ధర్మ సూరి రాసిన సాహిత్యరత్నాకరానికి ఉన్న నౌక, మందారం అనే రెండు వ్యాఖ్యానాలను మదించి లఘువ్యాఖ్యను మూడు భాగాలుగా సంతరించగా ఉస్మానియా సంస్కృత అకాడెమి 1972 ,74 ,81 లలో ప్రచురించగా యావద్భారత పండిత ప్రకాండ శ్రేణిలో ఒకరైనారు. 2) సుమనోంజలిఅనే సంస్కృత కవితా సంకలనం టిప్పణి సహితంగా 1973లో ప్రచురించారు. 3) భూ సంస్కరణలపై 'వసుమతీ సుధాకరం' నాటకం రాస్తే ఆకాశవాణి ద్వారా ప్రసారితమైంది. 4) ధర్మపురి శ్రీ లక్ష్మీనరసింహ స్వామి సుప్రభాతం, 5) సంస్కృత పథ ప్రదర్శిని, 6) స్వీయ సంస్కృత కవితా ఖండికల సంకలనం 'కవితా విపంచీ' 7) షోడశీ, 8) శ్రీ ఏ సి పి శాస్త్రి గారు రచించిన 'నల చరిత్ర' తెలుగు నాటకాన్ని రాజన్న శాస్త్రి గారు సంస్కృతంలోకి అనువదించగా 'సురభారతి' ప్రచురించింది. ఇది ఇంటర్‌కు పాఠ్యగ్రంథంగా ఉన్నది. 2001లో ఢిల్లీ సంస్కృత అకాడెమి ప్రచురించిన 'విశంతి శతాబ్దీయ సంస్కృత కావ్యామృతం'లో శాస్త్రి గారి కవితా ఖండికలను చేర్చి గౌరవించింది.

తెలుగులో వైశాలి నాటకం, వీరభద్ర సుప్రభాతం, ఏకవీర కుమారీయం, శ్రీ రుద్రస్తోత్రం, శంభు శతకం, సరస్వతీ వైభవం, సుమగీతాలు, మొదలైనవి రచించారు. శాస్త్రిగారి ఆధ్యాత్మిక సాహిత్య వ్యాస సమాహారాన్ని 'మంజూష'గా ప్రచురించారు. శాస్త్రి గారి విద్వత్తుకు తగిన పురస్కారాలు అందుకొన్నారు. శ్రీ శృంగేరి పీఠాధిపతులు శాస్త్రి గారిని ఆస్థాన పండిత గౌరవం కల్పించారు. సారస్వత జ్యోతి ఉత్తమ ఉపాధ్యాయ బిరుదాన్ని, సర్వార్థ సంక్షేమ సమితి శాస్త్ర పండిత పురస్కారం ఇచ్చి సత్కరించింది. దివాకర్ల పురస్కారం, హిందూపుర స్వర్ణ భారతీ పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ సంస్కృత పండిత పురస్కారం, కందుకూరి శివానంద మూర్తిగారి అమృతోత్సవ పండిత పురస్కారం అందుకొన్నారు.

శ్రీ కొరిడే రాజన్న శాస్త్రి గారు 11-3-20 13 మాఘ బహుళ అమావాస్య

నాడు 80వ ఏట 'రాజశేఖర సాయుజ్యాన్ని' పొందారు.

**గీర్వాణ వైదుష్యం**

గణేశుని స్తుతిస్తూ రాజకీయ గణ నాయకులనూ అన్యాపదేశంగా ఎత్తి పొడిచిన కవిత
'అది తిష్ట న్నుచ్చ పదం –రూపకళా ఖర్వా గర్వ యుక్తశ్చ
పరి భూయ త్వం ద్విజపతి –రాప్తశ్చాదర్శనీయతాం సద్యః'
ఉన్నత పదంలో ఉంటూ రూపకళా గర్వంతో చంద్రుడు వినాయకుడిని చూసి నవ్వి అవమానం చేసి ప్రజాదరణ కోల్పోయాడు అని భావం.

'గోదావరీ నది వర్ణన –గోదావరీ విమల వీఛి మృదంగ వాద్యే – సంవాద్యమాన ఇహ గంధ వహేన హృద్యం
బాలాపికా లపతి రమ్య రవేణ గీతం – లక్ష్మీ నృసింహ భగవంస్తవ సుప్రభాతం'
నిర్మల గోదావరీ తరంగాల మృదంగ ధ్వని ని వాయువు హృద్యంగా అందిస్తుంటే పిల్లకోయిలలు రమ్యం గా గానం చేస్తున్నాయి మేలుకో లక్ష్మీ నృసింహా .

ఏది రాసినా సంప్రదాయం చరిత్ర అంతర్లీనంగా, కవితాత్మకంగా రాశారు శాస్త్రి గారు. అందుకే వారి వైదుష్యాన్ని అంతటి గొప్ప పండితకవి శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి గారు బహు గొప్పగా రమ్యంగా వర్ణించారు రాజన్న శాస్త్రి గారిని –
'వైదుష్యం, లేఖకత్వం, సుగమ ఫణితిభిః సంస్కృతాధ్యాపకత్వం –విద్వద్గోష్టీషు చర్చానికషణ చణతా శాస్త్ర వాదే పటుత్వం
శక్తి ర్గీర్వాణవాణ్యాం విబుధ జన సదోభాషణే నర్గళాచ–విద్వద్రాజన్న శాస్త్రిన్! భవతి విజయతే భారతీ సుప్రసాదాత్'
ఆధారం– శ్రీ కొరిడే రాజన్న శాస్త్రి గారి కుమారులు, ధర్మపురి శ్రీ లక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల సంస్కృతోపన్యాసకులు– శ్రీ కొరిడే విశ్వనాధ శర్మ గారు24–10–16న పంపిన 'మంజూష' పుస్తకంలో ఆచార్య బిరుదరాజు రామరాజు గారి వ్యాసం 'పస్పశము' శ్రీ విశ్వనాధ శర్మగారి 'మా నాన్న గారు' వ్యాసం.❁

## 257. శ్రీ ముదుంబై నరసింహాచార్య స్వామి (1841-1927)

శ్రీకాకుళంలో పుట్టిన నరసింహాచార్యులు ఆనంద గజపతి మహారాజ కాలేజిలో సంస్కృత ఉపాధ్యాయులు. స్వంత ప్రింటింగ్ ప్రెస్ ఏర్పరచుకొని తన గ్రంథాలను అచ్చు వేసుకొన్నారు. దాదాపు ఆయన రచనలు 200 ఉన్నాయి. ఇప్పుడు లభ్యమయ్యేవి 53 మాత్రమే. సంస్కృత రచనలు - బ్రహ్మ సూత్రభాష్యం, బ్రహ్మ సూత్ర రోమాంతం, ప్రపత్తి చింత, ఉజ్జ్వలానంద చంపు, వాసవ పరాశరీయ నాటకం, కావ్య సూత్ర వృత్తి.❁



## 258. ఆంధ్ర జాన్సన్- కొక్కొండ వెంకటరత్నం పంతులు (1842- 1916)

1842- 1916 కాలపువాడైన కొక్కొండ వెంకట రత్నం పంతులు అఖండ ప్రజ్ఞావంతుడైన ఆంధ్రదేశపు పండితుడు. మహా మహోపాధ్యాయ బిరుదాంకితుడు. మద్రాస్ ప్రేసిడెన్సీ కాలేజీలో రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీలో తెలుగు పండిట్‌గా పనిచేసాడు. మహా సంస్కృత విద్వాంసుడు, కవి. సంస్కృతంలో బిల్వనాధ శతకం, తను మధ్య ఆర్యా శతకం, తను మధ్య గీతా శతకంతోబాటు వరదరాజ స్తుతి, తారావళి స్తుతి, బ్రహ్మ విద్యా స్తుతి, కాళహస్తీశ్వర స్తుతి మొదలైన 50 స్థవాలు రాసారు. ఆంధ్ర భాషా సంజీవని అనే పత్రిక నడిపారు. ఆయన

రాసిన గీత మహంత కావ్యం జయదేవుని గీత గోవిందానికి అనుసరణ. ఫిలాసఫీలో కూడా ఆయన దిట్ట. వేదాంతంలో అక్షర సాంఖ్య పద్ధతిని కనుగొన్నాడు. మార్గ దాయని అనే గ్రంథంలో ఈ సిద్ధాంతాలను వర్ణించాడు. ఆయనకు తమిళ, కన్నడ భాషలలో గొప్ప ప్రావీణ్యం ఉంది. తెలుగులో బిల్వేశ్వరీయం మొదలయిన 25 గ్రంథాలను రాశాడు. సమకాలీనులలో మహోన్నత శిఖరం కొక్కొండ. మద్రాస్ లాయర్ విద్యా వినోద పానపాకం ఆనందాచారి ఈయన శ్రేయోభిలాషి. ఈయనకు ఆంధ్ర జాన్సన్ బిరుదు ఇచ్చారు. పంతులు గారిని సాహిత్య నిరంశకుడు అంటారు. ❀

## 259. సూర్యగ్రహణంపై 'చిత్సూర్య లోకం' రాసిన - ముడుంబై వెంకట రామ నరసింహ ఆచార్య (1842-1928)

1842-1928లో ఉన్న ముడుంబై నరసింహాచార్య వీర రాఘవ రంగాంబల కుమారుడు. శ్రీ వత్స గోత్రం. ఈ వంశంలో ఒకాయన సంగీత సాహిత్యాలలో మహా విద్వాంసుడు. అందుకని వీరికి 'సంగీతముడుంబై' అనే పేరు ఏర్పడింది. వీరి మూల పురుషుడు ముడుమ్బై ఆచన్. ఈయన రామానుజుల వారి శ్రీ వైష్ణవ సంప్రదాయంలో 72వ ఆచార్యుడు. మన నరసింహాచార్యను విజయనగరం రాజు విజయరామ గజపతి ఆహ్వానించి సత్కరించాడు. సాహిత్య విభాగాలన్నిటిలో 114 రచనలు చేశాడు. 'గజేంద్ర వ్యాయోగం, రాజహంసీయ నాటకం, వాసవీ పాశ న్యప్రకరణం మొదలైన నాటకాలు, సూర్య గ్రహణంపై 'చిత్సూర్య లోకం' రాశాడు. కావ్యాలలో 'రామ చంద్ర కథామృతం, భాగవతం ముఖ్యమైనవి. 'ఖాలావ హేళన', 'నీతి రహశ్యం' లఘుకావ్యాలు. 'ఉజ్వలానంద చంపు' వచన రచన. 'కావ్యాలంకార సంగ్రహం' అనే అలంకార గ్రంథమూ రచించాడు. ❀

## 260. ఆసూరి అనంతా చార్య (1843)

ఇరవయ్యవ శతాబ్ది చివరికవి, మహోన్నత పండితుడు ఆసూరి అనంతాచార్య. తెలంగాణా వాడు. జమీందారులతో ఎన్నో సన్మానాలు అందుకొన్నవాడు. నాల్గొండ జిల్లా బేతవోలు, కృష్ణాజిల్లా మునగాల జమీందార్లు చేసిన సత్కారం చిరస్మరణీయం. 'చంపూ రాఘవం' 1863లో రచించాడు. ఇది 1929లో ప్రచురితమైంది. ఇది భోజుని చంపువును మించి ఉందని శిష్యుడు ఆసూరి వెంకట నృసింహాచార్య అన్నాడు. దీన్ని తెలుగు అక్షరాలలో ప్రింట్ చేశారు. కనుక మిగిలిన వారికి దీని సౌరభం తెలియటం కష్టమైంది. భోజుడిని అనుకరించటం లక్ష్యంకాదుకాని శ్రీ వైష్ణవ ప్రచారానికే ప్రాధాన్యమిచ్చాడు. గురువు నృసింహ సూరిని స్తుతిస్తూ కావ్యం మొదలు పెట్టాడు. 60 విశిష్టాద్వైత మతాలను వివరించాడు. విశిష్టాద్వైతంలో పరమశివుడు శ్రీమహా విష్ణువుకు పరమ భక్తుడు.

రావణుడు అష్ట దిక్పాలకులను బంధించి అష్టకష్టాలు పెట్టే వర్ణన చూడండి – "సోయం బిడౌజసం నిస్తేజసం తనూన పాతం, సమవర్తినం శ్రమ వర్తినం, నైఋతం భీరు రుతం, ప్రచేతసం విచేతసం, జగత్ప్రాణం గలత్ప్రాణం, ధననాథం ధన బాదం, గార కంఠం కరు కుంఠం, ప్రభాకరం అభాకరం, తారాపతిం కరాస్తితం చ సతతం సంతనోతీతి"

లక్ష్మణుడి శేషత్వం శ్రీ మత్వాలను రామునితో అడవికి వెళ్ళేటప్పుడు తెలియ జేశాడు. లంకలోని సీత తన ఇల్లాలు కావాలని రావణుడి కోరిక తెలిపే శ్లోకం – "పశ్య దోషా చరేశం మాం, భవత్వంసహా ధర్మిణా–నైచే త్వమాహవ మేవాంతే, వసన్నద్య నిపీడయే". ఈ కావ్యం 70 సార్లు ముద్రణ పొందింది. కిష్కింద కాండలోని వసంత ఋతువు వర్ణనలో లో ఆసూరికవి దీప్తి ఆ సూర్యుని లా భాసిస్తుంది. భోజ పోలికలేమీ లేకుండా సృజన పరాకాష్ఠగా ఉంటుంది. రెండు శ్లోకాలు మచ్చుకి–

"చకోరా జ్యోత్స్నా యాం త్రుప్యం చాతకా ఇవ వర్శతః – వవర్ధురప్యకూపారా స్తభ కామ్క ఇవ వైణవః

స్ఫుటంతీన్దీవరాస్తోమా ద్రుశో నృణాం నిమీలితాః-చరన్తి రాక్షసాస్సర్వే నశ్యంతి చ తమోగుణాః". రామ రావణ యుద్ధంలో కవి శృంగార, ఉత్సాహ, కరుణ, ఆశ్చర్య, అతిహాస, భయానక భీభత్స రౌద్ర, శాంత అనే తొమ్మిది రసాలను వర్ణించాడు.

సీతా రాముల జన రంజక పాలనతో చంపూ రాఘవం పూర్తవుతుంది. తారక సంకుల మాస మహీయం తారక మేవ భవాబ్ధి గతానాం - కొరకితా ఋతుకాల మనాప్త ,సార మితి కిల సస్య జలాప్తా. చివరగా ఫల స్తుతి చెప్పాడు యోవా ఇమాం రామ కదా సుదామా దధాతిభూమౌ స సుపర్వరాజః - యధేహ సౌభాగ్య కళాది పూర్ణః స్తతః పదం శాశ్వతముల్లభేత ❁

## 261. వీణాగాన కళానిధి- దూర్వాసుల సూర్యనారాయణ శాస్త్రి (1843- 1896)

1843- 1896 కాలానికి చెందినవాడైన దూర్వాసుల సూర్యనారాయణ శాస్త్రి వీణా గాన కళానిధి బిరుదాంకితుడు. విజయ నగర మహారాజు ఆనంద గజపతిరాజు ఆస్థానంలో ప్రధాన విద్వాంసుడు. సంస్కృతంలో తెలుగులో అనేక కృతులు రచించాడు. కాంభోజి రాగంలో సరమానంద సముద్ర వీచికయం అనే కృతిని పేరెన్నిక ఉన్నది.

కల్యాణ రాగంలో రాసిన దేవి దేహి సతతం కీర్తనకు మంచి ప్రాచుర్యం ఉంది. ప్రఖ్యాత వైణిక విద్వాంసుడు వీణ వెంకట రమణ దాసు ఈయన శిష్యుడు. శాస్త్రిగారు దాస మహానుభావుని తండ్రి పెద గురువాచార్యుల శిష్యుడు.❁

## 262. శీఘ్ర కవి- శంకర్ లాల్ మహేశ్వరశాస్త్రి (1844- 1916)

**మ**హామహోపాధ్యాయ శంకర్‌లాల్ మహేశ్వరశాస్త్రి ప్రాశ్నోర నగరంకు చెందినవాడు. 1844- 1916 కాలంవాడు. జాం నగరంలో ఉండేవాడు. పదిహేనవ ఏట నుండే కవిత్వం అల్లాడు. జాం నగర్ మహారాజు ఇతని కవితా ప్రతిభకు మెచ్చి శీఘ్రకవి బిరుదు ప్రదానం చేసి సత్కరించాడు. కదియవాడలోని మొర్బి రావోజీ రాజా పాఠశాలలో పని చేశాడు. సావిత్రీ చరిత్ర, చంద్రప్రభ చరిత్ర, ధ్రువభ్యుదయ శతకం, గోపాల చింతామణి, అనసూయాభ్యుదయం మొదలైన రచనలూ చేశాడు.❁

## 263. కేరళ కాళిదాసు- కేరళ వర్మ (1847-1910)

**వా**లియకోవిల్ పామ్బిరావ్ అని పిలవబడే కేళర వర్మ తిరువాస్కూర్ మహారాణి లక్ష్మీబాయి సహవాసి. ఆధునిక కవులలో గొప్ప పేరు ప్రఖ్యాతులు ఉన్నవాడు. 1847-1910 కాలంలో ఉన్నాడు. కేరళ కాళిదాసుగా బిరుదు పొందాడు. సంస్కృతంలో విశాఖ రాజ మహా కావ్యం, కంస వధ చంపూ, శృంగార మంజరీ, గురువాయూర్ పురేశ స్తోత్రం, వాఘ్ర లయశ శతకం, సోనాద్రిశతకం, క్షమాపణ శతకం మొదలైనవి రాశాడు.❁

## 264. విద్యా మార్తాండ - శివకుమారశాస్త్రి (1848-1919)

**1**848-1919 కాలానికి చెందిన శివకుమార శాస్త్రి రామ సేవక మిశ్ర, మిత్రాంగి దంపతులకు కాశిలో ఉండిలో జన్మించాడు. ద్వార వంగ ముఖ్యుడైన లక్ష్మీశ వర దేవ ఈతని ప్రాపు. యవ్వనంలో తలిదండ్రులను కోల్పోతే పినతండ్రి నాగేశ్వరభట్టు కాశీలో పెంచాడు. 'లక్ష్మీశ్వర దేవప్రతాపం' అనే కావ్యం రాసి, అందులో లక్ష్మీశ్వరుని దగ్గర నుండి మహేశ తక్కూర్ వరకు వంశ చరిత్ర వర్ణించాడు. 'యతీన్ద్రజీవన చరిత్ర' కావ్యంలో భాస్కరానంద యోగి జీవిత చరిత్ర చెప్పాడు. విద్యామార్తాండ, పండిత రాజ మొదలైన బిరుదులు పొందిన శివకుమార శాస్త్రి 1919లో మరణించాడు.❁

## 265. కావ్య తత్వ వల్లి రాసిన మహేశ చంద్ర తారా చూడామణి (1850)

**ప**శ్చిమ బెంగాల్లో దీనజాపురం జిల్లాలో రాజారామపురంలో మహేష్ చంద్ర తారా చూడామణి జన్మించాడు. ఆధునిక కవులలో, అలంకారికులలో సుప్రసిద్ధుడు. చిన్న చిన్న కావ్యాలు రాసాడు. కావ్య పేటికలో అనేక విషయాలపై వ్యాసాలూ రాసాడు. దినాజపురం రాజవంశం అనే 17 కాండల కావ్యాన్ని రచించాడు. దర్భంగా మహారాజు స్మృతి కావ్యంగా 24 కాండలలో భూదేవ చరిత్ర రాసాడు. కావ్య తత్వావళి అనే కావ్య విమర్శన గ్రంథాన్ని రచించాడు.❁

## 266. పాళీ భాషలో గ్రంథాలు రాసిన ఆధునిక కవి- విదుశేఖర (1850)

**బె**ంగాల్‌లోని శాంతినికేతన్‌కు చెందిన విధుశేఖర భట్టాచార్య బెంగాలీ సంస్కృత భాషలో గొప్ప పండితుడు. పాళీ భాషలో కూడా గొప్ప గ్రంథాలు రాసాడు. సంస్కృతంలో యవ్వన విలాసం, ఉమా పరిణయం, హరిశ్చంద్ర చరిత్ర, చిత్త విలాసంలతో పాటు చంద్రప్రభ అనే శృంగార కావ్యం కూడా రాసాడు. బనారస్‌లో మిత్ర గోష్టి అనే సంస్కృత పత్రికను నిర్వహిస్తుంచాడు.❁

## 267. అష్టావధానం అనంతాచార్య (1850)

**ఆ**శువుగా కవిత్వం చెప్పగల నేర్పున్న అష్టావధానం అనంతాచార్య గూడార్థంలోను సమస్యలను ప్రశ్నలు వేస్తే సంగీత రాగాలనాధారంగా ఆశువుగా సంస్కృతంలో పూరించేవాడు. ఒక ఉదాహరణ- “చికురాళీ తు వరాళీ వదనం తవభాతి శంకరాభరణం”

బెజవాడ దగ్గరున్న ఉల్లిపాలెం జమీందార్ ఆస్థాన కవులు కాండూరి రామానుజాచార్య, నరసింహాచార్యలు సంస్కృతంలో కీర్తనలు రాశారు. “సంగీత యయాటం”, “అభినవ గోపాల పులిందుని చరిత్ర”లను కీర్తనలలో చొప్పించి సంగీత రూపకాలు రాశారు.❁

## 268. వైణిక శిఖామణి- వెంకట వైద్యనాథ దీక్షితులు (1850)

**తి**రువాడ మరుదూర్‌లో నివసించిన దీక్షితులు వెంకట మఖి మనవడు. తాతగారి నుండి సంగీత జ్ఞానాన్ని వారసత్వంగా పొందాడు. గొప్ప వైణిక విద్వాంసుడు. వెంకటమఖి రాసిన చతుర్దండి ప్రకాశికను విపులీకరిచాడు. వైణిక శిఖామణి బిరుదాంకితుడు. ఎతియాపురం రాజులు సంగీతాన్ని బాగా ప్రోత్సహించారు.❁

## 269. ఉపమాక వెంకటేశ్వర (1850)

1850కి చెందిన ఉపమాక వెంకటేశ్వర కవి విశ్వనాధ, కామాంబల కుమారుడు. నిట్టల ఇంటి పేరు. విజయనగరం జిల్లా వాడు. కవిత్వంలో అఖండుడు. ఆశ్చర్య పరచే కవితా ప్రాభవం ఉన్నవాడని గుర్తింపబడ్డాడు. 'రామాయణ సంగ్రహం' కావ్యం 29 సర్గలలో 1866లో రాశాడు. ఒకేపంక్తిలో అక్షరాల మార్పు వలన నాలుగు ర రకాల అర్ధాలు వచ్చే గర్భ కవిత్వం రాశాడు. అందుకని ఈ రామాయణానికి 'చతుశ్చిత్ర గర్భ రామాయణం' అనే పేరొచ్చింది.

బాలకాండలోనే తన వంశ చరిత్రను రెండవ పాదం మొదటి అక్షరాలలో చెప్పాడు. -

"అదస్య కాండస్యాద్యపాద ద్వితీయ పాదాదిమ వర్ణ మారభ్యా న్త్యపాద ద్వితీయ పాదాది వర్ణ పర్యంతం తైర్వర్ణైరూదితాచిత్రణి" అని క్లూ ఇచ్చాడు.

శ్రీ నిట్టలోపమాశర్మణా విశ్వనాధ తయేన కమామ్బాలతా ప్రసవేన జయద్వాయ జాత సూరవిశ్వనాధ రామ భద్ర రామాది పుత్రా వతాచ రామ పాద కమల యుగ సచ్చా రాలోమానసేన విబుధా చరణకన్జసేవినా భవ తమో రుణోయంశ్రీ రామాయణ సంగ్రహే నామభూతకాల (చరి)తే బభూవ"

దీనిలో కవిచేప్పినదాన్ని బట్టి ఆయనకిద్దరు భార్యలని కుమారులపేర్లుసూర, విశ్వనాధ, రామ భద్ర, రామ అని తెలుస్తోంది.

ఉపమా కవి ఈ కావ్యంలో కవిత్వంతో ఎన్నో ఫీట్లు చేశాడు. ఇందులో నాలుగు లఘు కావ్యాలు ఉన్నాయి. అవి1) గౌరీ వివాహం. ఇది శివ పార్వతి కల్యాణం. అయోధ్య కాండ నుంచి యుద్ధ కాండవరకు శ్లోకాలలోని మొదటి అక్షరాలలో ఈ

కథ వస్తుంది. 2) శ్రీ రంగాది క్షేత్రం మాహాత్మ్యం – అయోధ్య నుండి, యుద్ధకాండం వరకు ప్రతి శ్లోకంలోని రెండవ పాదంలో 63 శ్లోకాలలో శ్రీరంగం పురుషోత్తమం, రామేశ్వరం, అవి ముక్తం, సింహా చలం, కంచి, సాకేతం, ద్వారక, మధుర, శేషాచలం, ప్రయాగ, గౌతమి భద్రాచల క్షేత్రాల చరిత్రను నిక్షిప్తం చేశాడు. 3) భగవదవతార చరిత్రం – ఇది విష్ణు అవతార చరిత్ర. ఇది శ్లోకంలోని మూడవ మూడవ పాదాలను కలిపితే వస్తుంది. ఇది వచనం. 4) ద్రౌపదీ కల్యాణం – అయోధ్య నుండి యుద్ధ కాండవరకు ఉన్న శ్లోకాలలో నాలుగవ పాదాలన్నీ కలిస్తే ఈ కావ్య రూపం దర్శనమౌతుంది.

ఈ మహాకావ్యంలో చివరి గొప్ప ప్రదర్శన మరీ ఆశ్చర్య పరుస్తుంది – బాల కాండ లోని ప్రతి శ్లోకం మొదటి అక్షరాల సముదాయం శ్రీ రామ కవచంగా రూపు దాలుస్తుంది. దీన్నిదర్శిద్దాం –

“రామ సదా పాహి శిరో మామక మగజే – శమానస నందకర ఫాల తలం త్వం మమ చ

క్షేత్ర యుగళ మాగమాంతర శ్రిత పద నయన యుగం – సీతాప్రియ మదీయం చ నాసికాం వాలిహర”

చివర్లో కవి –

“సీతా కర సారస యుగ పాతాతి విశద మణివిరాజిత మౌళిం–సీతా యుత మరుణామణి ప్రోతసనగం భజే శుభే రామం” శ్లోకం చెప్పి ముగించాడు.❁

## 270. ఆశే చనక రామాయణకర్త- సుబ్రహ్మణ్య సూరి (1850- 1913)

**శ**ంకరనారాయణ కుమారుడైన సుబ్రహ్మణ్య సూరి 1850లో పుదుక్కోట దగ్గర కదయక్కుడిలో జన్మించాడు. ప్రసిద్ధ చొక్కనాద దీక్షితులకు ఏడవ తరం వాడు. పుదుక్కోట రాజా కాలేజీలో సంస్కృత ప్రొఫెసర్ చేశాడు. 1913లో చనిపోయాడు. సకల కళా వల్లభుడు. ఏడు అంకాల వల్లీ బాహులేయం నాటకాన్ని రాశాడు. ఇది వల్లీ కుమారస్వాముల వివాహ కథ. మన్మథ మంథనం అనే భాణాన్ని, శంతను చరిత్ర వచనాన్ని రచించాడు. బుద్ధి సందేశం, పద్య పంచరత్నం, హర తీర్దేశ్వర స్తుతి, శుక సూక్తి సుధా రసాయనం కూడా రాశాడు. రామాయణ కథలను సంగీతానికి అనుగుణంగా మలచాడు. అవే రామావతారం, విశ్వామిత్ర యాగం, సీతా కల్యాణం, రుక్మిణీ కల్యాణం, విభూతి మహాత్మ్యం మొదలైనవి. డోలాగీతాలు హల్లీశ మంజరిలు వివిధ దేవతలపై రాసిన పాటలు. అతని మాణిక్య భాసమాన రచన ఆశేచనక రామాయణం, నూట తొంభై తొమ్మిది ఆర్యా వృత్తాలలో రాశాడు. ప్రతి శ్లోకంలో మొదటి మూడు పాదాలలో కథ ఉంటే, నాల్గవ పాదంలో నీతి ఉండటం దీని ప్రత్యేకత. ప్రతి శ్లోకం మధురమే, సూక్తి సుదారసమే. వాల్మీకి రామాయణ కథకు కొత్త సొగసులు కూర్చాడు కవి. ❋

## 271. మహా మహోపాధ్యాయ మానవల్లి గంగాధర శాస్త్రి (1854-1914)

19వ శతాబ్దంలో మహా పండితకవి అనిపించుకొన్న మానవల్లి గంగాధర శాస్త్రి నరసింహ శాస్త్రి కుమారుడు. కర్ణాటకలోని బెంగుళూరు దగ్గర యాసరగుట్టలో 1854లో జన్మించాడు. తండ్రితో బాటు కాశీకి కుటుంబం వలస వెళ్ళి 'కావ్యాత్మ సంధానం' రాశాడు. తండ్రి దగ్గర, రాజా రామశాస్త్రి, బాలశాస్త్రిల వద్ద విద్య నేర్చాడు. 1879లో కాశీ కాలేజిలో 25ఏళ్ళకే సంస్కృత ఆచార్యుడయ్యాడు. 1887లో విక్టోరియా రాణీ జూబిలీ మహోత్సవాలలో మహా మహోపాధ్యాయ బిరుదు పొంది సన్మానం అందుకొన్నాడు. 1914లో మరణించాడు. గంగాధరుని ఏడుగురు శిష్యులూ మహా మహోపాధ్యాయ బిరుదాంకితులవటం ఆ గురువు విద్యా పాటవానికి మహా గొప్ప ఉదాహరణ.

గంగాధర శాస్త్రి – 'వాక్య పదీయం, 'వైయాకరణ సిద్ధాంత కౌముది', ప్రౌఢ మనోరమ, శబ్ద రత్న, శాస్త్ర సిద్ధాంత లేశ సంగ్రహం, తత్వ బిందు, న్యాయ మంజరి, గౌతమ న్యాయ సూత్రాలు, జైమిని మీమాంస సూత్రాలు, కుమారిల భట్టు 'తంత్ర వార్తిక', లౌకిక న్యాయ సంగ్రహం, జగన్నాధుని రసగంగాధారం వంటి ఉద్గ్రంథాలకు సంపాదకత్వ బాధ్యత తీసుకొన్నాడు.

స్వయంగా 'అలి విలాసి సంలాప' గంగాధర శతకం, తన గురువులైన రాజారామ శాస్త్రి, బాలశాస్త్రిల జీవిత చరిత్రలు రాశాడు. ఇన్నిటిలో లభ్యమైనది ఒక్క 'అలి విలాసి సంలాపం' మాత్రమే. ఈ ఖండ కావ్యంలో 9 శతకాలున్నాయి. వెయ్యి

శ్లోకాల సమాహారం. దీన్ని 1908లో రాసినట్లు చెప్పాడు. అనేక విభిన్న విషయాలను వీటిలో చెప్పాడు. తన ఉద్దేశ్యమేమిటో ఉపోద్ఘాతంలో చెప్పాడు. మొదటి శతకం శివుని గూర్చి చెప్పినది. – 'విద్యా విద్యాత్ ఏవ యత్ర సతతం వేద్యో యో రాగిణాం–యమ వైద్యం మనసా ప్రపద్య విషత్యయా లేష్వభీకా ఋధాః ' మంచి ఆలోచన రేకెత్తించే సుందర శ్లోకాలురాశాడు .–'సఫల్లవా న్తాంతవనోప యుక్తా మనర పుష్పా వసరాభి సారం –శ్రితాం సుసంపన్నరవంశకుంతే రిచరాత్త తారుణ్య ఫలామిమాందికం'

గంగాధర కవి రాసిన 'హంసాస్టకం'కు సోదరుడు రామశాస్త్రి తైలాంగ్ వ్యాఖ్య రాశాడు. ఇందులో శివునిపై ఉన్న మంచి శ్లోకం ఒకటి–

'యః షండ వక్త్ర గజాననా ద్భుతా విష్కారణావ్యంజితాఃఅచిన్త్యో త్పాదన వైభవాం గిరి సుతాం మాయాంనిజంకే దధత్'

ఈ అష్టకంలో రెండు అర్థాలు వచ్చేటట్లు రాశాడు. హంస అంటే మానస సరోవర హంస అని ఒక అర్థం, హంస అంటే ఆత్మ అని మరో అర్థం. రెండినీ సమన్వయము చేస్తూ ప్రతిభావంతంగా రూపొందించాడు. ఇందులోని రెండు శ్లోకాలు చూద్దాం–

'బ్రహ్మాహం సత్స్వ రూపం చితి సుఖ మవిదన్ మాయయా క్షిప్య మాణా–తత్సంప కాన్రిపత్త్యై శరణ ముప గతః సద్గురూం జ్ఞాత వత్వం' అని మొదలుపెట్టి –

'శ్రావం శ్రావం తదుక్తిస్చిర తర మననా పాస్తదుస్తర్క జాలః – సాక్షాత్కారైక శోషా ద్విగలితనిఖిలోపప్లవో హంస ఏవ'

ఆసుకవిగా ప్రఖ్యాతుడైన గంగాధర శాస్త్రి ఉత్తర భారతంలో ఎన్నోసంస్కృత శతావధానాలు నిర్విఘ్నంగా నిర్వహించి కీర్తి గడించాడు.❀

## 272. వింజమూరి వీర రాఘవా చార్య (1855-1920)

**కౌ**శిక గోత్రానికి చెందిన వైష్ణవుడు వీర రాఘవాచార్య. పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా దొంతవరం గ్రామస్తుడు. బెజవాడలో ఉంటూ సంస్కృత పండితుడుగా ఉద్యోగించాడు. బహుముఖీన ప్రతిభా సంపన్నుడు. సంస్కృతంలో 'రామానుజ స్తోత్రత్రయి', 'మానససందేశం', హనుమత్ సందేశం, పానక నరసింహ స్తోత్రం, రఘువీరగద్య వ్యాఖ్య చతుశ్లోకీ వ్యాఖ్య' రాశాడు.❁

## 273. గోవర్ధనం వెంకట నరసింహాచార్య (1856-1935)

**శ్రీ**వత్స గోత్రానికి చెందిన గోవర్ధనం వెంకట నరసింహాచార్య నల్గొండ జిల్లా మిర్యాల గూడ తాలూకా విభురం పేట నివాసి. కాలం 1856-1935. తల్లి రామానుజమ్మ తండ్రి రామానుజాచారి. తెలుగు సంస్కృత పర్షియన్ భాషా ప్రవీణుడు. సంస్కృతంలో మట్టపల్లి లక్ష్మీనరసింహ స్తోత్ర నవ రత్న మాలిక, తెలుగులో పంచముఖ హనుమస్తోత్రం రాశాడు. నవరత్నమాలిక, 9శార్దూల శ్లోకాలు కలది.

'శ్రీ లక్ష్మీ భూమి నీలా ముఖాయువతి ముఖామ్భోజ దీప్తార్క బింబం - సాధ్యః ఖద్యోతమాలా నిభ మండి భ్రుద్వేమ దీప్యా త్కిరీటిం'❁

## 274. సంస్కృత కళాశాల స్థాపకుడు నీలకంఠ శర్మ (1858)

**పు**న్నసేరి నంబి నారాయణశర్మ కుమారుడైన నీలకంఠవర్మ 1858లో జన్మించాడు. కేరళలోని సంస్కృత విద్వాంసులలో, సంస్కృత గ్రంథకర్తలలో ప్రముఖమైనవాడు. పట్టంబిలలో సంస్కృత కళాశాల స్థాపించాడు. సంస్కృత పత్రిక విజ్ఞాన చింతామణిని నిర్వహించాడు. ఖగోళశాస్త్రంపై అనేక విలువైన గ్రంథాలు రాసాడు. పట్టాభిషేక ప్రబంధం, శైలాబ్ది శతకం, ఆర్యా శతకం మొదలైన గొప్ప రచనలు సంస్కృతంలో చేసాడు.❁

## 275. 'ఢిల్లీ సామ్రాజ్యం' నాటక కర్త- లక్ష్మణ సూరి (1859-1919)

**త**మిళనాడు రామ్నాడు జిల్లలో శ్రీవిల్లి పుత్తూరు దగ్గర పూనల్వేలిలో ఉన్న ముత్తు సుబ్బ అయ్యర్ కుమారుడు లక్ష్మణ సూరి. కాలం 1859-1919. అన్ని శాస్త్రాలలో మహాపండితుడైనందున 'మహా మహోపాధ్యాయ' బిరుదు పొందాడు. మద్రాస్ పచ్చయప్ప కళాశాలలో సంస్కృతాతాచార్యునిగా పని చేసాడు. ఆయన రాసిన 'కృష్ణలీలామృతం' బృహద్గ్రంథం. లఘు కావ్యాలుగా 'విప్ర సందేశం, మానస సందేశం, వేంకటేశ స్తవం' ముఖ్యమైనవి. 'ఢిల్లీ సామ్రాజ్యం' అనే నాటకం రాసాడు. ఈ నాటకంలో ఐదవ జార్జి చక్రవర్తి ఢిల్లీలో రాజదర్బార్ నిర్వహించిన కథ ఉన్నది. రామాయణం ఆధారంగా 'పౌలస్త్య వధ' రాసాడు. 'అనర్ఘ రాఘవం, ఉత్తర రామ చరిత్ర మహావీర చరిత్ర, వేణీ సంహారం, బాల రామాయణం రాత్నావళి'లపై ఈయన రాసిన వ్యాఖ్యానాలు బహు ప్రశస్తమైనవి. 'మదన పారిజాత మంజరి'లో శేష భాగాలను పూరించాడు. సరళమైన సంస్కృత రచనలను రాయటం ఆయన ప్రతేకత. భీష్మ పితామహుని జీవితంపై 'భీష్మ విజయం' రాసి భీష్ముని నృత్యాన్ని శతధా, సహస్రధా శ్లాఘించాడు. ఈయన రాసిన 'రామాయణ సంగ్రహం' చాలా ప్రచారం పొందినవి.❁



## 276. భాస నాటకాలను వెలికితీసిన గణపతిశాస్త్రి (1860)

**రా**మసుబ్బ అయ్యర్ కుమారుడైన గణపతిశాస్త్రి కేరళలోని తిన్నేవెల్లి తరువలిలో 1860లో జన్మించాడు. సంస్కృతంలో మహా నిష్ణాతుడై 17వ ఏటనే మాధవీ వసంతం నాటకం రాసాడు. తిరువనంతపురంలోని సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గానూ, సంస్కంత ప్రచురణలకు క్యురేటర్‌గానూ, త్రివాన్కూర్ మహారాజ సంస్థానంలోనూ పనిచేసాడు. మహామహోపాధ్యాయ బిరుదాంకితుడు. కాలగర్భంలో కలసిపోయిన భాస నాటకాలను వెలికితీసి ప్రచురించిన మహానుభావుడు గణపతి శాస్త్రి. దీనికి ప్రపంచ ప్రఖ్యాత కీర్తిని పొందాడు. సంస్కృత సాహిత్యంలో లోతైన అధ్యయనం, పరిశోధన శాస్త్రి చేసాడు. మహా గ్రంథాలు ఎన్నో రాసాడు. భాస నాటకాలను సంకలనం చేసి విపులమైప వ్యాఖ్యానాలు రాసి ప్రచురించాడు.

గణపతి శాస్త్రి శ్రీమూల చరిత్ర అనే చారిత్రక గ్రంథాన్ని తిరువాన్కూర్ మహారాజుల వంశ చరిత్రగా రాసాడు. భారత వర్ణన అనే గ్రంథంలో భారతదేశాన్ని వర్ణించాడు. తులా పురుష దండ కావ్యంలో తులాభార ఉత్సవాన్ని గురించి వర్ణించాడు. పార్వతీదేవిపై అపర్ణాస్తవం, విక్టోరియా మహారాణిపై చక్రవర్తిని గుణమణిమాల రచించాడు. తిరువాన్కూర్ మహారాజు రాజా విశాఖ రామునిపై అర్థ చిత్రమణిమాల అనే సాహిత్య శాస్త్రాన్ని రచించాడు. ఆయన రచనలలో అతి ప్రశస్తి పొందింది సేతు యాత్రాను వర్ణనం. దీనిలో సరళ సుందరమైన సంస్కృత రచనం అందరినీ ఆకర్షిస్తుంది. ఇది రామేశ్వర యాత్రకు సంబంధించిన యాత్రా సాహిత్యం. హిందూ దేవతల పవిత్రత, గొప్పతనమంతా వర్ణించాడు.❁



## 277. అయిల్లం తిరుణాల్ రామ వర్మ (1860-1880)

**రా**మవర్మ తిరువనంతపురం మహారాజు. 1860-1880లో పాలించాడు. 'వృత్త రత్నాకరం' గ్రంథాన్ని రచించాడు. దీనితో బాటు 'శ్రీ కృష్ణ విలాస కావ్యం', 'జలన్ధరాసుర వధ' అనే కథాకళీకి వ్యాఖ్యలు రాశాడు.❋

## 278. అభినవ శంకరాచార్య- మార్తాండ మాణిక్ ప్రభు మహారాజ్ (1860- 1936)

**1**860- 1936 కాలపు మాణిక్ ప్రభు మహారాజ్ నిజాం రాష్ట్రంలో మాణిర్ నగరంలో సకల మత సంప్రదాయాన్ని స్థాపించాడు. సంగీతంలో సహా అనేక శాస్త్రాలలో ప్రావీణ్యం ఉండేది. పలు భాషలలో పాటలు రాశాడు. సంస్కృతంలో రాసిన జ్ఞాన మార్తాండ గీతం మణిపూస. అభినవ శంకరాచార్య బిరుదాంకితుడు.❋

## 279. తర్క చూడామణి- ఆనంద చరణ్ (1862)

**కా**ళీ కింకర ఠాకూర్ కుమారుడైన ఆనంద్ చరణ్ బెంగాల్‌కు చెందిన రాదియా శ్రేణి బ్రాహ్మణుడు. బెంగాల్ లోని నౌ ఖాళీ జిల్లా సోమ్పార గ్రామంలో 1862లో జన్మించాడు. ఆ కుటుంబంలో తాంత్రిక స్వామి 'సర్వానంద సర్వ విద్య' గొప్ప పేరున్నవాడు. కలకత్తా, బెనారస్‌లలో విద్య నేర్చి తర్క చూడామణి మహా మహోపాధ్యాయ బిరుదులు పొందాడు. నౌ ఖాళీలోని సంస్కృత కళాశాలలో మీమాంస, సాంఖ్య శాస్త్రాలలో ఆచార్యునిగా పని చేసి యోగ శాస్త్రాచార్యులుగా బెనారస్ విశ్వ విద్యాలయంలో ఉన్నాడు. 'సుప్రభాత', 'బెనారస్' పత్రికలకు సంపాదకునిగా పని చేసినాడు. యవ్వనంలోనే రచనలను చేయటం ప్రారంభించాడు. వివిధ శాస్త్రాలపై బహు గ్రంథ రచయిత. 'రామాభ్యుదయం', 'మహాప్రస్థానం', "సుమనోంజలి", "కావ్య చంద్రిక" వంటి అలంకార గ్రంథాలను రచియించాడు. ఇంతటి ప్రతిభావంతుడు అలనాడు అరుదు. పదవీ విరమణ తర్వాత సరస్వతీ సేవలో జీవితం ధన్యం చేసుకున్నాడు.❀

## 280. కనక లత కావ్య నిర్మాత - కళ్యాణ రామ శాస్త్రి (1862)

**శు**భ లక్ష్మి, పార్దియూర్ కృష్ణశాస్త్రిల కుమారుడు కళ్యాణ రామశాస్త్రి. తంజావూర్ రాజాస్థానంలో తండ్రి తాత పెద్ద ఉద్యోగాలో ఉండేవారు. మద్రాస్ రిజిస్ట్రేషన్ ఆఫీస్‌లో ఆఫీసర్‌గా పని చేసి రిటైరై తంజావూర్‌లో ఉన్నాడు. సుసంపన్నమైన పాండిత్యం సంస్కృత భాషలో ఉన్నవాడు. 'కనక లత' అనే శృంగార కావ్యాన్ని రాశాడు. దీనికి మాతృక షేక్స్ పియర్ రచన లూక్రేసి.

ఈతని తండ్రి కృష్ణశాస్త్రి 18421911 కాలం వాడు. తంజావూర్ జిల్లా కాడంబాడిలో జన్మించాడు. సేన్గాలి పురంలో విద్యానాథ దీక్షితుల వద్ద విద్య నేర్చాడు. రామాయణాది పురాణాలను విశ్లేషించి ఉపన్యాసాలివ్వటంలో మహా నేర్పున్నవాడు. ఆయన రాసిన 'రస నిష్యందిని' రామాయణంలోని కొన్ని కాండలకు బ్రహ్మాండమైన భాష్యం. 'కౌముది సోమం'లో ప్రేమపై నాటకం. ఇందులోనూ రామాయణంను అంతర్గతంగా ఆవిష్కరించాడు. 'మీనాక్షి శతకం', 'మాలినీ శతకం', 'హనుమత్ శతకం', 'లక్ష్మీ నృసింహ శతకం' చాలా పేరు పొందాయి. భక్తికి పరాకాష్టగా నిలిచాయి. 'కలి విలాస మదిరాపానం' వ్యంగ్యాత్మక రచన.❀



## 281. మహేశ చంద్ర న్యాయరత్న భట్టాచార్య

**22**-2-1836న కులీన బ్రాహ్మణ కుటుంబంలో మహేశ చంద్ర భట్టాచార్య బెంగాల్‌లో జన్మించాడు. నారిత్‌కు చెందిన ఈ కుటుంబం తరతరాలుగా సంస్కృత భాషా పాండిత్యంలో పండిపోయింది. ఆ కుటుంబం వారందరూ దాదాపు సంస్కృత మహా విద్వాంసులే. తండ్రి హరినారాయణ తర్క సిద్ధాంతంలో అద్వితీయుడు. ఒక బాబాయి గురుప్రసాద్ తర్క పంచానన బిరుదు పొందితే, మరో బాబాయి ఠాకూర్ దాస్ చౌరామణి విశిష్ట పండితునిగా గుర్తింపు పొందాడు. పెద్దన్న పండిట్ మాధవ చంద్ర 'సార్వ భౌమ' బిరుదు నందుకుని మహిషాదల్ రాజ్య సభా పండితుడైనాడు.

హుగ్లీలోని జహానాబాద్‌కు చెందిన పండిత రామ చదర తర్క భాగిస్ కుమార్తె మందాకినీని వివాహమాడి మనోరమ, మన్మధ నాద విద్యార్ధ భట్టాచార్య, మునీంద్రనాథ్ భట్టాచార్య, మహిమనాధ భట్టాచార్యలకు తండ్రి అయ్యాడు. పెద్దకొడుకు మద్రాస్ రాష్ట్ర మొదటి ఇండియన్ అకౌంటంట్ జనరల్.

మహేశ భట్టాచార్య 70వ ఏట 12-4-1906న మరణించాడు.

1876లో ప్రసన్న కుమార్ సర్వాధికారి స్థానంలో సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ అయ్యాడు. ప్రిసిపాల్‌గా19 ఏళ్ళ పాలనలో సంస్కృతంలో ప్రతిభ గల విద్యార్ధులకు అర్హతలను బట్టి గౌరవ స్థానాలను కల్పించాడు. స్వగ్రామం నారిత్‌లో

ఆంగ్లో – సాంస్క్రిట్ సెకండరీ స్కూల్ ఏర్పాటు చేశాడు. కావ్య ప్రకాశ, మీమాంస దర్శన, కృష్ణ యజుర్వేదాలను విలువైన పీఠికలు రాసి సంపాదకత్వం వహించి ప్రచురించాడు. దయానంద సరస్వతి వేద భాష్యంపైనా, తులసీ ధర మీమాంసపైనా, మృచ్ఛకటిక కర్త పైనా, లుప్త సంవత్సరంపైనా అనేక పత్రాలు రాశాడు. దయానంద భాష్యంపై భట్టాచార్య చూపించిన అభ్యంతరాలకు దయానంద స్కూల్ సంస్కృత విద్వాంసుడు తెలియబరచిన వివరాలను ఒక పుస్తకంగా ప్రచురించాడు. సంస్కృత విద్యావ్యాప్తికి భట్టాచార్య కృషి ప్రశంసనీయం .సంస్కృత విద్యాలయాలకు కావలసిన నిధి సేకరణ కూడాచేసి వాటి నిర్వహణకు తోడ్పడ్డాడు.

నారిత్ గ్రామంలోను, పరిసరాలలోనూ మంచి రోడ్ల నిర్మాణం చేబట్టాడు. స్వంతజిల్లా హౌరాలోని ట్రాం రోడ్ల విషయంలోనూ శ్రద్ధ చూపాడు. 16-2-1887న విక్టోరియారాణి పట్టాభిషేక రజతోత్సవనాడు 'మహా మహోపాధ్యాయ' బిరుదాన్నిచ్చి గౌరవించారు. 'మోస్ట్ ఎమినేంట్ ఆర్డర్ ఆఫ్ ఇండియన్ ఎంపైర్' భట్టో పాధ్యాయ గుర్తింపు పొందాడు. భారతీయ సంస్కృత విద్వాంసులు 'న్యాయ రత్న' బిరుదంతో సత్కరించారు. హంగేరిలోని బుడాపెస్ట్‌లో ఉన్న 'హంగేరియన్ అకాడెమి ఆఫ్ సైన్సెస్' ఫారిన్ మెంబర్‌గా ఎన్నుకోబడ్డాడు. కలకత్తా విశ్వవిద్యాలయం, బెంగాల్‌లోని టెక్స్ట్ బుక్ కమిటీ, బీహార్ సాంస్క్రిట్ సమాజ్, బొంబాయిలోని ఆంద్రో పలాజికల్ సొసైటీలలో గౌరవ సభ్య స్థానం పొందాడు. హిందూ హాస్టల్ కమిటీ జాయింట్ సెక్రెటరిగా, బెతూన్ కాలేజి మెంబర్ గా, హౌరా ఇంజినీరింగ్ కాలేజికి విజిటర్‌గా ఉన్నాడు. బెంగాల్ ప్రెసిడెన్సిలో అంటే బెంగాల్ బీహార్ ఒరిస్సా ప్రాంతాల సంస్కృతానికి న్యాయరత్న స్థాయిలో ఇంఛార్జిగా సేవలు అందించాడు. ఉత్తర కలకత్తాలోని శ్యాం బజార్‌కు 'భట్టా చార్య బజార్' అని గౌరవ నామంపెట్టి గౌరవించారు. వందలాది ఆయన వద్ద విద్య నేర్చి సంస్కృత మహా విద్వాంసులయ్యారు.

## 282. దుర్గేశ నందిని సంస్కృత నవల రాసిన– శ్రీశైల తాతాచార్య లేక తిరుమల తాతాచార్య (1862–1925)

వెంకట వరదుని పుత్రుడైన తాతాచార్య 1862లో కంచిలో జన్మించి అరవై మూడేళ్ళు జీవించి 1925లో చనిపోయాడు. ఆయన అసాధారణ ప్రజ్ఞావంతుడు. యుగలాన్గుహ్యా, వేదాంత దేశిక చరిత్ర అనే నాటకాలతోబాటు దుర్గేశ నందిని, క్షత్రియ రమణి అనే నవలలను సంస్కృతంలో బెంగాలీ నవలల అనువాదంగా రాశాడు. ❁



## 283. గీర్వాణ శఠగోప సహస్ర కవి మేడేపల్లి వెంకట రమణాచార్య (1862 -1943)

**వి**జయనగరం జిల్లా అనకాపల్లిలో రమణాచార్య 1862లో జన్మించారు. విజయనగరంలో స్థిరపడ్డారు. అలక నారాయణ గజపతిరాజు దర్బార్ కవి. మహారాజ కాలేజి సంస్కృత లెక్చరర్. ఆంధ్ర గీర్వాణాలలో గొప్పకవి. గీర్వాణంలో 'శఠ గోప సహస్రం', ఆర్య భాష చరిత్రం రాశారు. తమిళ 'తిరువైమోడి'ని సంస్కృతీకరించారు. షేక్స్ పియర్ నాటకాలను 'షేక్స్ పియర్ నాటక కథామంజరిగా' సంస్కృతంలో రాశారు. 'సంస్కృత కవుల చరిత్ర'ను దేవ భాషలో రచించారు. ❁



## 284. విమర్శనా వాఙ్మయ విరాణ్మూర్తి బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు (1863- 1940)

ఎవరి పేరు చెబితే విధ్వాంసులు చేతులు జోడిస్తారో, ఎవరు అజ్ఞాన తిమిరాలను చీల్చి జ్ఞానజ్యోతులు వెలిగించారో, ఎవరు వందలాది శిష్యగణానికి ఆరాధనీయులో, ఎవరు నడిచే విద్యా సరస్వతిగా భాసిల్లారో, ఎవరు విమర్శనా వాఙ్మయ జలధిని మదించి అనర్ఘ రత్నాలనీ వెలికి తీశారో, ఎవరు సర్వ శాస్త్ర పారంగతులో, ఎవరు సమాజ దేవ పూజ చేశారో, ఎవరు మూఢాచారాలను ఖండించి ప్రగతిమార్గ ప్రవర్తకులయ్యారో, ఎవరు సంస్కరణలను చెప్పటమేకాక పాటించి ఆదర్శంగా నిలిచారో వారే బ్రహ్మశ్రీ కాశీ భట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు.

**శాస్త్రిగారి కుటుంబం**

బ్రహ్మయ్య శాస్త్రిగారు తూర్పు గోదావరి జిల్లా పలివెల గ్రామంలో మాతామహులైన మైలవరపు గారింట క్రీ.శ.2-4-1863న జన్మించారు. అది రుధిరోద్గారి సంవత్సర చైత్ర శుద్ధ త్రయోదశి గురువారం శాస్త్రిగారి పూర్వీకులు రాజోలు దగ్గర కడలి గ్రామంలో ఉండేవారు. తెలంగాణ్యులు గౌతమస గోత్రులు అపస్థంబ సూత్రులు. ముత్తాత గారు కడలి గ్రామం వదిలి కాకినాడలో జగన్నాధ పురానికి చేరుకొని స్వగృహమేర్పరచుకొని నివాసమున్నారు. తండ్రిగారు బ్రహ్మావధానిగారు వేద శాస్త్రాలలో నిష్ణాతులు. తల్లి గారు సుబ్బమ్మగారు . బ్రహ్మయ్య శాస్త్రిగారి తమ్ములు

కూడా తక్కువ వాడేమీకాదు. తమ్ముడు సుబ్బయ్య శాస్త్రి "శ్రీరామ విజయ గ్రంథకర్త". బ్రహ్మయ్యశాస్త్రి గారి పెద్ద కుమారుడు పేరు కూడా బ్రహ్మయ్య శాస్త్రియే. ఈయన "శ్రీరామ శతకం" రాసి తండ్రిగారికి అంకితమిచ్చాడు. శాస్త్రిగారి రెండవ కుమారుడు నరసింహమూర్తి సుబ్బయ్యశాస్త్రి గారికి దత్త పుత్రుడయ్యాడు. ప్రసిద్ధ సారస్వత సేవకుడు, దేశభక్తుడు కోటమర్తి చిన రఘుపతిరావు గారు బ్రహ్మయ్య శాస్త్రిగారి అల్లుడే. శాస్త్రిగారు మొదటి భార్య సుబ్బమ్మగారు మరణించిన తర్వాత వెదురుపాక నివాసి దంతుర్తి బ్రహ్మయ్య శాస్త్రులు గారి పెద్ద కూతురు సూరమ్మగారిని శాస్త్రిగారు ద్వితీయం చేసుకొన్నారు.

**విద్యాభ్యాసం- సకల కళా ప్రపూర్ణులు**

బ్రహ్మయ్య శాస్త్రిగారు కాకినాడు పిఠాపురం రాజావారి కళాశాలలో ఆంగ్ల విద్య నేర్చి, మెట్రిక్ పాసైనారు. ఎస్.ఏ. పరీక్షకు చదువుతుండగా కుటుంబ పరిస్థితుల వలన చదువు సాగక మానేశారు. కలేజీలో చదివేటప్పుడే శాస్త్రిగారు ఆంధ్ర ప్రబంధ సాహిత్యాన్ని అవలోకనం చేశారు. ఇంగ్లీష్ నేర్వకముందే సంస్కృత పంచకావ్యాలు చదివేశారు. కాలేజీ వదిలేసిన తర్వాత "సిద్ధాంత కౌముది"ని ఆపోసన పట్టారు. దానిపై వ్యాఖ్యానాలను చదవకపోయినా అందులోని పాఠాన్ని ఆస్వాదించారు. సంస్కృత ఆంధ్ర ఆగ్ల భాషల త్రివేణీ సంగమ స్నానం చేసి "సాదృశ భాషా శాస్త్రం" (ఫైలాలజీ)లో కృషి కూడా చేశారు. త్రిభాషా పాండిత్యం అబ్బటం వలన ప్రతి విషయాన్ని తులనాత్మకంగా పరిశీలించేవారు. దేశంలోని సాంఘిక విషయాలనూ అవగాహన పరచుకొన్నారు. హిందూ మతంపై వీరాభిమానమేర్పడింది. హిందూమతం లాంటి మతం, హిందూ సంఘం లాంటి సంఘంప్రపంచంలో ఇంకెక్కడా లేవు అనే దృడమైన అభిప్రాయమేర్పడింది. హిందూ మతం యొక్క బాహ్య స్వరూపం తెలుసుకొంటే చాలదని భావించి అందులోని మత విజ్ఞానంపై దృష్టి సారించారు. వివిధ శాఖలలో ఉన్న అతి సూక్ష్మ విషయాలను కూడా ఆకళింపు చేసుకొన్నారు. ప్రాయాశ్చిత పశు నిర్ణయం, పురాణాలలో ఉన్న గ్రహణాల విషయం అధ్యయనం చేశారు. వీటిపై అనేక వ్యాసాలూ రాశారు.

అవి చదివితే శాస్త్రిగారికి ఉన్న శ్రౌత పాండిత్యం జ్యోతిష అవగాహన మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. గానకళలో, నాట్యకళలో ప్రావీణ్యం సాధించారు. ఎప్పుడూ ఏదో ఒక కొత్త విద్య నేర్వటం దాని లోతుపాతుల్ని తరచటం శాస్త్రిగారి హాబి అందుబాటులో ఉన్న గ్రంథాలయాలకు వెళ్లి తనకు కావలసిన విషయాలను చదువుకొంటూ లోకాన్నే మర్చిపోయేవారు. ఇతర గ్రంథాలను అనేకం చదవటం వలన ఆయనకు 60వ ఏట నేత్ర దృష్టి క్షీణించింది. మద్రాస్ వెళ్లి నేత్ర వైద్యులు డాక్టర్ కోమన్ నాయర్‌కు చూపించగా వారు మరల దృష్టిని ప్రసాదించారు. రెట్టించిన ఉత్సాహంతో మళ్ళీ గ్రంథ పఠనం కొనసాగించారు. విద్య నేర్పటంకంటే విద్యార్థిగా ఉండటమే శాస్త్రిగారికి మహా ఇష్టం.

## నిత్య కర్మ వీరులు

బ్రహ్మయ్య శాస్త్రిగారి జీవిత నిఘంటువులో విశ్రాంతి అనే మాటకు చోటే లేదు. అనునిత్య కర్మవీరులు శాస్త్రిగారు. ప్రజా విషయాలపై అత్యంత శ్రద్ధ చూపటం మొదటి నుండి అలవాటు. కాకినాడ ట్రెజరీ డిప్యూటీ కచేరిలో గుమాస్తాగా శాస్త్రిగారు ఉద్యోగించారు. అక్కడ పని చేస్తున్నా వీరి ఇతర పనులకు ఏ ఆటంకమూ ఉండేది కాదు. కాలేజీ చదువు మానేసి ఇందులో కొలువులో చేరి నిరాఘంటంగా తమకు 56వ ఏడు వచ్చేదాకా పని చేశారు. తరువాత దీనికి గాను నెలకు ఇరవై రూపాయలు పెన్షన్ పొందేవారు. విధి నిర్వహణలో ఏమరుపాటు లేకుండా పై అధికారుల మెప్పును పొందేవారు. ఆఫీసులో బండచాకిరి చేసి ఇంటికి వచ్చినా శాస్త్రిగారు విశ్రాంతి తీసుకొనే వారు కాదు. ఎక్కడో ఒక చోట ఉపన్యాసం ఉండేది. వ్యాసాలూ రాసేవారు. అంతేకాక ప్రజాహిత సంస్థలను ఏర్పాటు చేసి వాటిద్వారా ప్రజా సేవ చేసేవారు. అందుకే వారికి విశ్రాంతి అనేది గగన కుసుమమే అయింది.

## నాటక సమాజ స్థాపన

శాస్త్రిగారు విద్యార్థిగా ఉండగా మహారాష్ట్ర నుండి ధార్వాడ నాటక

సమాజాలు వచ్చి ప్రదర్శనలు ఇచ్చేవి. వారి రంగాలంకరణ ప్రక్రియా వైవిధ్యం ఆంధ్రులను ముగ్ధులను చేసేవి. ఆ కొత్త పద్ధతులు ఆంధ్రదేశంలో కూడా అభివృద్ధి చెందాలని శాస్త్రిగారు భావించారు. "ఆంధ్ర బృందానంద సంధాయి" అనే పేరుతో ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజం వీరేశలింగం గారు రాసిన శాకుంతలం నాటకాన్ని బ్రహ్మయ్య శాస్త్రిగారు రాసిన "త్రిపురాసుర విజయ వ్యాయోగం" నాటకాన్ని ఆడేవారు. ప్రసిద్ధ కవులు రాసిన నాటకాలనూ ప్రదర్శించి ప్రజారంజనం చేసేవారు. తర్వాత ఈ సమాజం మరో సమాజంలో కలిసిపోయింది.

## భక్త సమాజ స్థాపన

విద్యార్థి దశనుండి హిందూ మతానికి నవ నాగరికత వలన వస్తున్న ముప్పును బ్రహ్మయ్య శాస్త్రిగారు గ్రహించారు. దానిని నివారించటానికి ప్రజలలో భగవద్ భక్తీ పెంచటానికి అనువుగా 1880లో "భక్త సమాజం" అనే సమాజాన్ని స్థాపించారు. శాస్త్రిగారి నిర్మల నిశ్చయ భక్తీ వలన సమాజం దిన దిన ప్రవర్ధమానమైంది. సమాజం తరపున అనేక గ్రామాలలో పర్యటించి భక్తిపై స్ఫూర్తిపూర్వక ప్రసంగాలు చేసేవారు. కొంతకాలం తర్వాత ఈ సమాజం "హిందూమత బాల సమాజం"లో కలిసిపోయింది.

ఆధారం- మా తండ్రిగారు కీ.శే. గబ్బిట మృత్యుంజయ శాస్త్రిగారు భద్రంగా తమ గ్రంథాలయంలో 20-4-1940 అని తమ సంతకం కింద తేది వేసి సంతరించి దాచుకొన్న "విమర్శకాగ్రేసర కశీ భట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారి జీవిత చరిత్రము" అనే గ్రంథం సుమారుగా 75 ఏళ్ళ క్రిందటి పుస్తకం అన్నమాట. అనుకోకుండా నా కంట బడితే సార్ధకం చేసుకొంటున్నాను. కవర్‌పేజి చినిగిపోయింది. కనుక గ్రంథకర్త ఎవరో నాకు తెలియలేదు. ఇది 40 పేజీలున్న చిన్ని పొత్తం. రచయితకు కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను.

## గ్రంథాలయ స్థాపన

1883లో బ్రహ్మయ్య శాస్త్రిగారు "ఆర్యమత బోధిని" అనే సభను ఇరవై

సంవత్సరాల వయసులోనే స్థాపించి కాకినాడలో ప్రసిద్ధ వ్యక్తులైనారు. కృత్తివెంటి పేర్రాజు, నాళం పద్మనాభం మొదలైన పెద్దలు శాస్త్రిగారి మతాభిమానానికి కార్యదీక్షకు మెచ్చి చేయూత నిచ్చారు. ఈ సభకు అనుబంధంగా "వివేకానంత పుస్తక భాండాగారం" అనే గ్రంథాలయాన్నీ స్థాపించారు. మొదట్లో జగన్నాథపురంలో ఉన్న ఈ లైబ్రరీ తర్వాత పెద్ద వీధిలో ఉన్న "పురం వారి సత్రం"లోకి మార్చారు. కుర్చీలు, బల్లలు సేకరించి ఉపయోగించారు. సుమారు 15 వార్తాపత్రికలను తెప్పించేవారు. ఇక్కడే శాస్త్రిగరు హిందూమతంపై గొప్ప ఉపన్యాసాలిచ్చేవారు. ప్రసిద్ధులను కూడా ఆహ్వానించి ఉపన్యాసాలిప్పించేవారు. హరికథా కాలక్షేపాలు ఏర్పాటు చేశారు. ఆర్యమత బోధిని సభ ద్వారా శాస్త్రిగారు చేసిన హిందూమత సేవ అపారమై నిలిచింది.

**వీధి ప్రచారం**

క్రైస్తవ మత ప్రచారకులు బ్రహ్మ సమాజికులు ఆనాడు వీధుల్లో బృందాలుగా వచ్చి మత బోధ చేయటమే కాక హిందూమతాన్ని తీవ్రంగా దూషించేవారు. సనాతన ధర్మంపై వ్యతిరేక ప్రచారం ఎక్కువ చేసేవారు. వారి ప్రచారంలో పస లేదని రుజువు చేయాలని శాస్త్రిగారు భావించి తాను కూడా వీధుల్లోకి వచ్చి ప్రచారం చేసి నిర్వీర్యులను చేయాలని నిశ్చయించుకొన్నారు. 1884లో ఈ వీధి ప్రచారం మొదలు పెట్టి శాస్త్రిగారు ఎన్నో వీధి ప్రచార సభలు నిర్వహించి కరపత్రాలను అచ్చు వేసి పంచిపెట్టారు. ప్రజలలో భక్తిని ప్రభోదించటానికి భక్తి గీతాలను పాడుకొంటూ వీధుల వెంట తిరిగేవారు. దీనికోసం ఒక సమాజాన్ని 1885లో స్థాపించారు. అవసరమైన పాటలను, కీర్తనలను శాస్త్రిగారే రచించి పాడటం, నేర్పించి సామాజాన్ని వీధి ప్రచారానికి పంపేవారు. దీనివలన గొప్ప ప్రచారం జరిగి క్రైస్తవ బ్రహ్మ సమాజాలు బయటికి రావటానికి భయపడ్డారు.

**మహా పురుషుల జయంతి వర్ధంతులు**

భారతదేశంలో జన్మించి తమ అమూల్య జీవితాలను ఆదర్శవంతంగా

తీర్చిదిద్దుకొన్న మహా పురుషులైన శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ శంకరాచార్య, శ్రీరామానుజాదుల జయంతి, వర్ధంతి ఉత్సవాలు నిర్వహించి వారి జీవితాలలోని ప్రధాన ఘట్టాలను వివరిస్తూ ప్రేరణ కలిగించేవారు. శాస్త్రిగారు ఆనాడెప్పుడో మొదలుపెట్టిన శంకర జయంతి కాకినాడలో ఈనాటికీ నిర్వహిస్తూనే ఉన్నారు. తర్వాత ఈ కార్యక్రమాన్ని మునిసిపాలిటీ ఉద్యోగులు నిర్వహించారు.

**మాసపత్రిక నిర్వహణ**

శాస్త్రిగారు హిందూమత విజ్ఞానాన్ని జన సమాన్యానికి అందించాలన్న తలంపుతో "ఆర్యమత బోధిని" అనే మాస పత్రికను స్థాపించి నిర్వహించారు. దీన్ని 1905 జనవరి ఒకటవ తేది ప్రారంభించారు. అప్పటికే శాస్త్రిగారు హిందూమత సంబంధమైనవి, సాహిత్య పరమైనవి అయిన వ్యాసాలూ వందల కొద్దీ రాసి ఉన్నారు. అవి వివిధ పత్రికలలో ప్రచురితాలు కూడా. కనుక శాస్త్రిగారి పేరు ఆంధ్రదేశంలో తెలియని వారు ఆ రోజుల్లో ఎవరూ ఉండేవారు కాదు. అంతగా పాప్యులర్ అయ్యారు శాస్త్రిగారు. "ఆర్యమత బోధినికి' దేశమంతటా విశేషంగా పాఠకులుండేవారు. శాస్త్రిగారి ప్రభావం వలన క్రమంగా బ్రహ్మ సామాజికుల ప్రభావం బాగా తగ్గిపోయింది అని వీరేశలింగం పంతులుగారే అంగీకరించారు. శాస్త్రిగారి ప్రభావం అంత గొప్పది. వీరేశలింగం గారి మాటల్లోనే "వెయ్యిగా వెయ్యగా వెర్రివాడే గెలిచినట్లు శాస్త్రిగారి రాతలు, చేతలు జనులను భ్రమల్లో ముంచాయని గ్రహించి నేను తలపెట్టిన మహా కార్యానికి విఘాతం కలుగుతుందని భావించి "సత్య వాదిని" అనే పత్రిక ప్రారంభించాను" అని వీరేశలింగం గారే రాసుకొన్నారు. ఆనాడు సంఘ సంస్కార పత్రికలన్నీ శాస్త్రిగారి మీద కత్తి కట్టాయి. అయినా జంకూ గొంకూ లేని శాస్త్రిగారు సరైన సంతృప్తికరమైన సమాధానాలు చెప్పి వారి నోరు మూయించగలిగారు. అదే వారి ఘన విజయం. పరుషంగా వారు మాట్లాడినా శాస్త్రిగారు మృదువుగా యుక్తి యుక్తంగా సమాధానాలిచ్చేవారు. కలహానికి కందుకూరి ఎప్పుడూ కాలురువ్వేవారు. చివరికి లింగంగారే పశ్చాత్తాపం ప్రకటించాల్సి వచ్చింది. సత్యమేవ జయతే అని శాస్త్రిగారు

రుజువు చేశారు.

**సద్యోవిమర్శ- కందుకూరి బ్రహ్మయ్యశాస్త్రి వివాదం**

ఎవరైనా ఎక్కడైనా హిందూ మతంపై వ్యతిరేకంగా ఉపన్యాసం ఇచ్చినట్లు తెలిసిన వెంటనే శాస్త్రిగారు సమాధానమిచ్చేవారు. అన్యమతస్తులు ప్రహసనాలు రాస్తే వ్యాసంతోనూ జవాబు చెప్పటం శాస్త్రిగారి ప్రత్యేకత. సంస్కరణ పిపాసి వీరేశలింగంగారు ఎప్పుడూ శాస్త్రిగారికి ప్రధాన వ్యతిరేక పక్షమే. లింగం గారు విమర్శించారన్న మాత్రాన హిందూమతంలో ఏ స్వల్ప మార్పులు జరగటానికైనా శాస్త్రిగారు ఒప్పుకొనేవారు కాదు. అంతటి నియమపరులు. కందుకూరి వారు కాలాన్ని బట్టి యుక్తిని బట్టి మతంలో మార్పులు రావాలని కోరేవారు. కాని ఆయనే ఆ నియమాన్ని పాటించలేదు అనే విమర్శ ఉండేది. ఆత్మకు పుట్టుక ఉందికాని చావు లేదనేవారు లింగంగారు. కాని లోకంలో పుట్టుట గిట్టుట కోసమే అనే మాట మర్చిపోయారని నింద మోశారు. శంకరాద్వైతం యుక్తి యుక్తమే అయినా ఒప్పుకోనన్నారు వీరేశలింగం. డార్విన్ పరిణామ వాదం శాస్త్రీయమే అయినా తాను అంగీకరించనన్నారు కందుకూరి. సృష్టివాదం అంటే క్రియేషన్ థీరీ అశాస్త్రీయం అయినా అంగీక రిస్తున్నానన్నారు వీరేశలింగం. పులి, పాము, ఉప్పెన, భూకంపం, మహామారి మొదలైన విపత్తులను దేవుడే సృష్టించి ప్రజలకు భయం కలిగేట్లు చేసి తనను సేవించేట్లు దేవుడు చేసినవే నంటారు కందుకూరి. ఇది మూఢ విశ్వాసం కాదా అని ఆనాడు శాస్త్రిగారు లాంటి సనాతనులు లింగం గారిని అవహేళన చేశారు. ఇలా వీరేశలింగంగారు చాలా విషయాలలో పరస్పర విరుద్ధంగా ప్రవర్తించారనే అభిప్రాయం చాలామందిలో ఉండేది. అందుకే బ్రహ్మయ్య శాస్త్రి గారు వీరేశలింగంగారి అన్ని వాదాలను సమూలంగా చేదించాల్సి వచ్చింది. ఇవన్నీ గమనిస్తే శాస్త్రిగారు మహా వక్త, మహా రచయిత, మహా విమర్శకులే కాక మహా నిర్మాణ కౌశలం కలిగినవారు అని స్పష్టమౌతుంది. హిందూ మతాభిమానం, ప్రచార ఉత్సాహం తాటాకు మంటలాగా కాసేపు ఉండి ఆరిపోయేవికావు అయనలో. అవి నిత్య జ్వాలలై.

యాభై ఏళ్ళు వీటికోసమే పోరాడిన మహితాన్వితులు.

## స్పర్ధయా వర్ధతే విద్యా

శాస్త్రిగారిని ఇంత పని చేయించింది ప్రతిపక్షాల వారే. వారి ప్రేరేపణే. ఒకసారి ఢిల్లీ దర్బారు సందర్భంగా ఒక సభలో బ్రహ్మ సమాజ ప్రవక్తలు బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ప్రసంగిస్తూ బ్రిటిష్‌వారు మనదేశానికి వచ్చిన తర్వాతనే శూద్రులు బాగు పడ్డారని అంతకు ముందు బ్రాహ్మణ సమాజం చేత అణగద్రొక్క బడినారని చెప్పారు. దీనికి శాస్త్రిగారు బదులిస్తూ "బ్రాహ్మలు శూద్రులకు అన్యాయం చేసిరా?" అనే చిన్న పుస్తకం రాసి ప్రచురించారు. ఇందులో శ్రుతి స్మృతుల నుండి, మహాభారత నుండి శుక్రనీతి మొదలైన మహా గ్రంథాలనుండి అనేక ప్రమాణ వాక్యాలు ఉదాహరణగా ఇచ్చి శూద్రులు ఎప్పుడు కూడా నీచంగా చూడబడలేదని సప్రమాణంగా రుజువు చేశారు. ఇంకోసారి శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి "శంబుక వధ" నాటకం రాసి బ్రాహ్మణులను అనవసరంగా నిందించటం గమనించిన శాస్త్రిగారు "శంభుక వధా విమర్శన గ్రంథం" రాసి తమ పాండిత్యాన్ని, ప్రతిభను వాద పటిమను, లోకజ్ఞానాన్ని, యుక్తిని నిరూపించుకొన్నారు. మరోసారి కాకినాడలో బ్రహ్మ సమాజంవారు శివలింగం అశ్లీలాన్ని బోధిస్తోందని ఒక పెద్ద సభలో అన్నారు. వెంటనే స్పందించిన బ్రహ్మయ్య శాస్త్రిగారు సమాధానంగా "శివలింగం యోగి రూపంలో భావింపబడిన శివుని శిరస్సు" అనే సిద్ధాంతాన్ని చెప్పి దానికి ప్రమాణాలను పేర్కొని అనేక శాస్త్రాలను పరిశోధించి సిద్ధాంతాన్ని నిగ్గు తేల్చి వ్యాస పరంపరను పత్రికలలో ప్రచురించారు.

వీరేశలింగం గారు వితంతువుల కేశ ఖండనం, పరలోకంలో దంపతులు కలుస్తారు అనే హిందూమతంలో ఉన్న నమ్మకాన్ని పరిహసిస్తూ "నారద సందర్శనం" అనే ప్రహసనం రాశారు. దీనికి దీటుగా సమాధానం రాస్తూ శాస్త్రిగారు "పర్వత సందర్శనం" అనే ప్రహసనాన్ని రాసి వదిలారు. మరోసారి బ్రహ్మ సమాజీకులు తమ మందిరంలో విగ్రహారాధన తుచ్ఛం, నీచం, హేయం అని నిందించారు. దీనికి శాస్త్రిగారు "ఇలాంటివి ఏదో ప్రైవేటు మందిరంలో కూర్చుని చెబితే తేలేవి

కావు, ప్రజా సమక్షంలో వాదోపవాదాలు చేసి నిగ్గు తేల్చేవి. అప్పుడే అసలు సత్యం ఏమిటో సామాన్య ప్రజలు గ్రహిస్తారు. మేము బహిరంగ సభ ఏర్పాటు చేస్తాం, దానికి మీరు రండి , మీ వాదాలు వినిపించండి, మా వాదాలు మేమూ వినిపిస్తాం" అని జవాబిచ్చి నిజంగానే బహిరంగ సభ ఏర్పాటుచేసి అందులో తన వాదంగా శాస్త్రిగారు విగ్రహారాధనను సమర్థిస్తూ చేసిన ఉపన్యాసం మహా విశిష్టంగా ఉంది. చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడదగినది అయింది. అదీ శాస్త్రిగారి వదనా సామరధ్యం. వాక్ పటిమ. సర్వ గ్రంథ పరిశీలనం.

**శాస్త్రిగారు పరిష్కరించిన సమస్యలు**

బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ అమూల్యమైన ఉపన్యాసాలలో ఎన్నో విషయాలను చర్చించి విషయ వివరణ చేశారు. ఎన్నో సమస్యలకు తగిన సమాధానాలు పరిష్కరించి చెప్పారు. వారు పరిష్కరించిన వాటిలో కొన్ని సమస్యలు 1) శ్రీకృష్ణుడు జారుడా? 2) గణపతి 3) జీవన్మత మేదీ? 4) హిందూమతం ఆవశ్యకత 5) త్రిమతములు మొదలైనవి ఉన్నాయి. ఇవన్నీ ప్రతి హిందువు చదివి అర్థం చేసుకొని అనుసరించాల్సినవే. అలాగే రజస్వలానంతర వివాహం వితంతు వివాహంలను యుక్తి యుక్తంగా ఖండించి శాస్త్రాదారాలు చూపి నిరూపించారు. దీనిలో వారిని మించిన వారెవ్వరూ లేరని చెప్పటం అతిశయోక్తి కాదు.

**హిందూ విజ్ఞానం**

బ్రహ్మయ్యశాస్త్రిగారు హిందూ విజ్ఞానం పైన అనేక అమూల్య వ్యాసాలూ రాశారు. ఆధునికులు చెప్పే ప్రకృతి శాస్త్రము మన ప్రాచీనులు చెప్పిన ప్రాచీన గ్రంథాలనుండి గ్రహించి వ్రాయబడినదే అని ఘంటాపథంగా రాసి నిరూపించారు. హిందూ విజ్ఞానంపై శాస్త్రిగారు "జగము సృజింప బడినదా? భూమి తిరుగుచున్దా? భూమి వర్తులత్వం యెంత? భూమి తిరుగుటకు ఆధారమేమి? భూమి యొక్క యాకర్షణ శక్తి, రాశి చక్రము, పంచభూతములు గ్రహణ కదా చర్చ

రామాయణమందలి వానరులెవరు? మొదలైన వ్యాసాలూ విజ్ఞాన సోపానాలే. శాస్త్రిగారి అసమాన ప్రాక్ ప్రచీతీ విజ్ఞాన సమ్మేళనానికి గొప్ప ఉదాహరణలే.

**శాస్త్రిగారు అఖండ పరిశోధనా చాతుర్యం– లింగం గారి రాజశేఖర చరిత్రముపై ఖండనం** బ్రహ్మయ్యశాస్త్రి గారి పరిశోధనా చాతుర్యం అఖండమైనది. శాస్త్రిగారి మొదటి విమర్శ వీరేశలింగం గారి "రాజశేఖర చరిత్రము"పై రాశారు. ఎంత లోతుగా చర్చించి రాశారో తెలుసుకొంటే అమితాశ్చర్యమేస్తుంది. అందులో రెండు ఉదాహరణలు మాత్రమే చూద్దాం. లింగం గారు రాజశేఖరుని ఇంటిని చాలా విపులంగా వర్ణించారు. అలా వర్ణించినట్లు ఇల్లు కట్టటం అసాధ్యం అని శాస్త్రిగారు యుక్తి యుక్తంగా నిరూపించారు. రాజశేఖరం మంచి ముహూర్తంలో బయల్దేరినా దొంగల బారిని పడ్డారని కందుకూరి రాశారు. శాస్త్రిగారు రాజశేఖరుడు ప్రయాణానికి బయల్దేరిన ముహూర్తాన్ని జ్యోతిశ్శాస్త్ర బలంతో పరిశీలించారు. ఆ ముహూర్తం "చోర పంచకం"లో పడిందని శాస్త్రిగారు తేల్చి చెప్పారు. కనుక దొంగల బాధ ఈ ముహూర్తానికి తప్పదు అన్నారు. జ్యోతిశ్శాస్త్రం ఎంత శాస్త్ర సమ్మతమో వీరేశలింగం గారే ఋజువు చేసి చెప్పారని దానికి ఈ ఉదాహరణమే చాలునని అన్నారు. ఈ విమర్శను "వివేక చంద్రికా విమర్శనం" పేర 1896లో ప్రచురించారు. రాజశేఖర చరిత్రము మిక్కిలి రసహీనమైన కావ్యాభాసము. దీనిని వచనకావ్య రచనకు ఉదాహరణ గ్రంథంగా పేర్కొనటం కావ్య కళకు హాని కనుక కావ్య కళా దృష్టితో చూసి సారస్వతాభివృద్ధి కోసం దీనిపై ఖండనం రాయాల్సి వచ్చింది" అని శాస్త్రిగారి అభిప్రాయం. అంతేకాదు, ఈ పుస్తకంలో సంఘం పరమ మూర్ఖమైనదిగా, వంచన మాత్రమే ప్రాధాన గుణం కలదిగా పంతులుగారు ఇతరుల మెప్పుకోసం రాశారని ఎండగట్టారు. స్వదేశస్తుడే స్వసంంఘాన్ని ఇంత నీచమైనదానిగా వర్ణించటం దారుణం అన్నారు. మనజాతిని హీనమైన దానిగా చూడటానికి ఎప్పుడూ ప్రయత్నించే క్రైస్తవ మిషనరీలు దీనిని ఇంగ్లీషులోకి ఇంగ్లాండ్‌లో అనువాదం చేయించుకొన్నారు. దీనిపై పాశ్చాత్య పండితులు "Written by a native gentleman of refinement and education, the book is fine, and invaluable as an important study of native character as seen by native eyes "He tilts the astounding guillibility

and the un fathomable deceit of native character" అని రాశారు. దీన్ని చదివిన ప్రతి పాశ్చాత్య పండితుడు ఇండియా వచ్చి ఎంతహీనంగా మనల్ని చూస్తారో అని బాధపడ్డారు శాస్త్రిగారు. దేశాభిమానులైన శాస్త్రిగారు అందుకే ఖండనం రాయవలసి వచ్చింది. ఉత్తమ ఆశయం లేకుండా శాస్త్రిగారు ఏ గ్రంథం పైనా ఖండనం రాయనే లేదు. శాస్త్రిగారు ఏది రాసినా యుక్తి యుక్తంగా, సమగ్రంగా సరసంగానే ఉంటుంది. దీన్నిబట్టి ఉత్తమ కావ్యం ఎలా ఉండాలో శాస్త్రిగారు నిరూపించారు. పంతులుగారి కలం ప్రతి వారిమీద విమర్శతో విరుచుకు పడుతున్న కాలంలోనే శాస్త్రిగారు ఖండనం రాశారు. అంతటి ధీశాలి శాస్త్రిగారు. శాస్త్రిగారి ఖండనానికి వీరేశలింగం గారు కాని ఆయన శిష్యులు కాని ప్రతి విమర్శ రాయకపోవటం ఆశ్చర్యమే. అంటే శాస్త్రిగారి వాదం ఎంత సమర్ధనీయమో అర్థమవుతోంది.

ఆ తర్వాత కొన్నాళ్ళకు శ్రీ రాయసం వెంకట శివుడు గారు వీరేశలింగం గారికి “మీ రాజశేఖర చరిత్రములో రాజశేఖరుని గృహవర్ణణ తప్పుగా ఉందని ఒకాయన రాశాడు దానికి మీ సమాధానం ఏమిటి?” అని ఉత్తరం రాశారని దానికి కందుకూరి వారు తమ ఇంటినే రాజశేఖరుని ఇల్లుగా వర్ణించామని నవ్వుతూ సమాధానం చెప్పారని వెంకట శివుడు ప్రకటించారట. కాని ఇదీ తప్పేనంటున్నారు. వీరేశలింగం గారింటికి రాజశేఖరం గారింటికి చాలా భేదం ఉందని రాజశేఖరం గారి ఇంటిపై మేడ లేదని వీరేశలింగం గారింటిపై మేడ ఉందని తేల్చారు. కనుక శాస్త్రిగారు రాసిందే యదార్థం అని తేల్చారు పండితులు.

వెంకట శివుడు గారు శాస్త్రిగారి విమర్శకు ప్రతివిమర్శ ఏదో రకంగా రాసినా అందులో శాస్త్రిగారి పేరు పేర్కొనలేదు. ప్రతి విమర్శకు పేరు కూడా పెట్టలేదు. తాను శాస్త్రిగారి పేరు ఎత్తితే ఆయన ఖ్యాతి పెరుగుతుంది కనుక దానిజోలికి పోలేదని శివుడు గారు దాటేశారు. శాస్త్రిగారికి పేరు రాకుండా చేయటానికి సంస్కరణ వాదులం అని చెప్పుకొనే వారు విశ్వ ప్రయత్నం చేసినా శాస్త్రిగారి ప్రతిభా సూర్య ప్రతాపాన్ని వారి అరచేతితో ఆపలేకపోయారు. ఇది శాస్త్రిగారి గొప్ప నైతిక విజయం.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు చిత్రాడ సభలో సారస్వత పరిశోధన గూర్చి ముచ్చటిస్తూ శాస్త్రిగారు సారస్వత విషయంలో విశేషంగా కృషి చేస్తున్నారని ప్రస్తుతించారు. శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావు పంతులుగారు "న్యూ ఇండియా" అనే పేపరులో శాస్త్రిగారి సాహిత్య సేవను గూర్చి రాసి మెచ్చుకొన్నారు. కొవ్వూరులో శాస్త్రిగారికి ఘన సన్మానం జరిగింది. శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు పాల్గొని తమకు శాస్త్రిగారికి కొన్ని అభిప్రాయ భేదాలున్నా, శాస్త్రిగారి దేశ సేవ నిరుపమానమ నాదని, అందుకే ఈ సన్మాన సభలో ఆనందంగా పాల్గొన్నానని చెప్పారు. శాస్త్రిగారికి చేసే సన్మానం ఆంధ్ర దేశానికి చేస్తున్న సన్మానం అన్నారు చిలుకూరి వారు. సంస్కారవాదులు కూడా నెమ్మది నెమ్మదిగా శాస్త్రిగారినే సమర్థిస్తూ వచ్చారు.

## విమర్శన సాహిత్యం

కందుకూరి వారు "మంత్రి భాస్కరుని"పై రాశారు. దీన్ని ఖండిస్తూ బ్రహ్మయ్యశాస్త్రిగారు "భాస్కరోదంతం" అనే గ్రంథాన్ని రాసి ప్రచురించారు. దీన్ని చూసిన వీరేశలింగంగారు తాను రాసిన "కవుల చరిత్ర"లో దొర్లిన తప్పులను దిద్దుకొన్నారు. కాని శాస్త్రిగారికి కృతజ్ఞత చెప్పటానికి అభిజాత్యం అడ్డం వచ్చి ఉంటుంది. 1911లో "నన్నయ్య భట్టారక చరిత్రము" రాసి ప్రచురించారు. ఇందులో శాస్త్రిగారు చెప్పిన విషయాలే నేటికీ పరమ ప్రామాణీయకంగా ఉన్నాయని అంటారు. "మనుచరిత్ర", "వసుచరిత్ర"లపై అనేక విశేషాలతో వ్యాసాలూ రాశారు. మనుచరిత్ర కంటే వసుచరిత్ర ప్రశస్తమైనదని శాస్త్రిగారి అభిప్రాయం. మరో గొప్ప రచన "కురపాండవ దాయభాగ నిర్ణయము". ఇందులో కౌరవ రాజ్యం ధ్రుతరాష్ట్రుడిదే కాని పాండురాజుది కాదు అని నిష్కర్షగా తేల్చారు శాస్త్రిగారు. ఈ వాదంలో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు మొదలైన ఉద్దండులు శాస్త్రిగారికి వ్యతిరేక పక్షంగా మోహరించారు. పాండవులు న్యాయస్తులని కౌరవులు అన్యాయం చేస్తున్నారని హిందువులలో గొప్ప నమ్మకం ఉంది. ఈ అభిప్రాయాన్ని శాస్త్రిగారు అనేక సభల్లో ఉపన్యాసాలలో నొక్కి చెప్పేవారు. పూర్వపు వారి అభిప్రాయాలన్నీ సరైనవి కావు. అన్నిటినీ గుడ్డిగా నమ్మరాదు అని శాస్త్రిగారు భావం. "ఆంధ్ర

కవితాగురు కవిత్వాది ప్రశంశ" అప్పకవి "పోతనామాత్యులు", ఉత్తర రామ చరిత్ర యందలి రస విచారము" మొదలైన సారస్వత విమర్శలను ఎన్నిటినో శాస్త్రిగారు రాశారు. మహామహోపాధ్యాయ బిరుదు పొందిన శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రి గారు సంస్కృత భాష ఒకప్పుడు లోక వ్యవహారంలో ఉన్న సామాన్య భాషగా ఉండేదని ఒక వ్యాసం రాశారు. బ్రహ్మయ్యశాస్త్రి గారు అతి నైపుణ్యంతో సంస్కృతం ఎప్పుడూ లోక వ్యవహార భాషగా లేదని, అదెప్పుడు పండితుల భాషగా మాత్రమే ఉండేదని అందుకే దానికి "గీర్వాణ భాష", "విబుధ భాష" మొదలైన పేర్లు వచ్చాయనిసప్రమాణంగా రుజువు చేశారు. శాస్త్రిగారి లోతైన ఆ పరిశీలనకు అందరూ ముక్కున వేలేసుకొని ఆశ్చర్యపోయారు.

**భాషాశాస్త్ర రచనా పాటవం**

బ్రహ్మయ్యశాస్త్రి గారు భాషాశాస్త్ర విషయానికి సంబంధించిన రచనలు చాలా చేశారు. "కాగడా" అనే చిన్న పుస్తకంలో కాగడా శబ్దచరిత్రను అంతా సేకరించి వివరించారు. "అరవములోని వింత అక్కరము తెలుగునా గలదా?" అనే శీర్షికతో శాస్త్రిగారు రాసిన వ్యాసపరంపర అతి ఉత్కృష్టమైనవిగా పరిగణిస్తారు. "దాస శబ్దార్థ చంద్రిక" మొదలైన వ్యాసాలూ శాస్త్రిగారి భాషా స్వరూప ఆలోచనలకు ప్రమాణాలు. శాస్త్రిగారికి భాషలో నాగరికులం అనుకొనేవారు తెచ్చే వ్యావహారిక మార్పులు నచ్చేవి కావు. అవి భాషాభివృద్ధికి హానికరాలు అని భావించి దానిని రుజువు చేయటానికి చాలా గ్రంథాలు రాశారు. చాలాచోట్ల మహోపన్యాసాలిచ్చారు. ఆనాటి వ్యావహారిక భాషావాదులు శాస్త్రిగారి వాదాన్ని కాదనలేక గమనిస్తూ ఉండేవారు శ్రద్ధతో. అప్పుడప్పుడు శాస్త్రిగారు తమ వాదపు తీవ్రతను తగ్గించుకొని సవరించుకోవటమూ జరిగింది.

**విమర్శక విరించి**

ఆంధ్రభాషలో శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు రాసినంత విమర్శనా వాఙ్మయం మరొకరు రాయలేదనటం నిర్వివాదాంశమే. తెలుగులో విమర్శకు

బీజం నాటింది బ్రహ్మయ్యశాస్త్రిగారే అని చాలామంది అభిప్రాయం. కాదన్న వారూ కొందరు ఉన్నారు. దీనిపై వాదం జోలికి పోకుండా విమర్శ ప్రారంభించిన తొలి రచయతలలో శాస్త్రిగారున్నారు అంటే ఎవరికీ ఇబ్బంది ఉండదు. శాస్త్రిగారి విమర్శ అన్నిటికంటే అగ్రేసరం అని బహుజనాభిప్రాయం. అందుకే శాస్త్రిగారికి "విమర్శకాగ్రేసర" బిరుదు లభించింది. ఇది బ్రహ్మయ్యశాస్త్రి గారికి పర్యాయ పదం అయిపోయింది. దేశంలో సమగ్ర విమర్శకు ఆద్యులు వాస్త్రిగారు. ప్రతివాదులు లేవనెత్తిన ఒకొక్క అంశాన్ని తీసుకొని దాన్ని రాచి రంపానబెట్టి నిగ్గు తేల్చటం శాస్త్రిగారి అసమాన ప్రజ్ఞ. ఒకే అంశాన్ని స్థాపించటానికి అనేక ఉదాహరణలు ఇవ్వటం, యుక్తిగా వాదించి గెలవటం బహు నేర్పు. ప్రతివాది "ఓడిపోయాను మహాప్రభో! నన్ను క్షమించి వదిలేయండి బాబో!" అని కాళ్ళా వేళ్ళా పడి బతిమాలినా అదేపనిగా వాడిని "బాది పారేయటం" శాస్త్రిగారి విమర్శలో పెద్దలోపం అని అంటారు. అనవసరంగా తన విమర్శనా కౌశలాన్ని ప్రదర్శించే వారుకాదు. సానుభూతితోనే ఉండేవారని శాస్త్రిగారి రచనలు చదివిన వారికి తెలుస్తుంది. "వినాశకర విమర్శకుడు" అని కూడా శాస్త్రిగారికి బిరుదు తగిలించారు కొందరు. ఇది సత్యదూరం. శాస్త్రిగారి విమర్శలో వినాశనంతోబాటు నిర్మాణం కూడా ఉందని, విమర్శక అంశం యొక్క సత్య స్వరూపాన్ని పాఠకులకు తెలియజేయటమే పరమావధిగా ఎంచుకొన్నారని, మత, సాహిత్య విషయాలలో అంతవరకూ ఎవరూ చెప్పని అనేక కొత్త విషయాలను శాస్త్రిగారు తెలియజేశారని, విమర్శించటమే పనిగా ఎన్నడూ ఉండలేదని బహుశాస్త్ర పారంగతులైన నిష్పాక్షిక పండితులు శాస్త్రిగారి నైపుణ్యానికి జోహారులర్పించారు. ప్రతివాదులను ఒక నెపంగా పెట్టుకొని లోకానికి తెలియని అమూల్య విషయాలను వేదశాస్త్ర పురాణ ఇతిహాసాల నుండి వెలికితీసి అందజేసిన మహా విద్వాంసులు శాస్త్రిగారు. ఆ అంశాలను ఆంధ్రలోకం కళ్ళకు అద్దుకొని మనసుకు హత్తుకొన్నది. మన మతతత్వంలోని ఉత్క్రుష్టతను తెలుసుకొని ముచ్చటపడింది. అన్యమతాల వాదాలను తిరస్కరించే నేర్పు సామాన్య జనులకు కల్గించారు శాస్త్రిగారు.

**సారస్వత శాఖ స్వతంత్ర గ్రంథాలు**

సాహిత్య శాఖలన్నిటిలోను బ్రహ్మయ్య శాస్త్రిగారు స్వతంత్ర గ్రంథాలు రాశారు. "మంగతాయి", "సైంధవ వధ", "ఉత్తర సరస్వతీ నారద విలాసము", వీర రాఘవము" అనే నాటకాలు రాశారు. "వెదురుపాక జనార్ధన శతకం", "ప్రశ్నోత్తర పద్యాలు", "చిత్ర పద్యావళి", "కోకిల గీతము", "భారతీస్తుతి గీతములు", "గడ్డి పరక", "అభినవ కవితా ప్రశంస", "ఆంధ్ర కవితా వాఙ్మయ ఆస్థానం" అనే ఖండ కావ్యాలు రాశారు. "రావణ చరిత్ర" అనే చక్కని చిక్కని వచనకావ్యాన్ని రాశారు. అనేక రామాయణాల నుండి విషయ సేకరణ చేసి రాసిన గ్రంథం ఇది. కాకినాడలో "రావణ వర్థంతి"ని నిర్వహించారు. అందుకోసమే ఈ రావణ చరిత్ర రాశారు. ఇది అచ్చుకాకుండా చేయటానికి శాస్త్రిగారి ప్రతికక్షులు విశ్వ ప్రయత్నం చేశారు. అయినా శాస్త్రిగారు దీన్ని ముద్రించి తన మనో నిబ్బరాన్ని లోకానికి మరోసారీ ఋజువుచేసి చూపించారు. "సుభద్రా విజయము" అనే ద్వ్యర్థి కావ్యం రాసి తన భాషా నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

అనేక గద్య కావ్యాలు రాశారు. "మనుష్యావయన సంఘ సంస్కార సభ", మనము మోములకు (ముఖాలకు) వెల్ల వేసుకొందుముగాక, "అప్పుడు- ఇప్పుడు, రూపాయ దండకం", "ముద్దులు- ముచ్చటలు" మరికొన్ని హాస్య గ్రంథాలు రాశారు. విగ్రహారాధన గురించి "సీతా లక్ష్మణ సంవాదం "శారదా శాసనంపై "రామకృష్ణ సంవాదము", గ్రాంధిక వ్యావహారిక భాషా విదాదంపై "గో మహిష సంవాదము", "తారక తారావళి", "నిర్గద్య నిరోస్త్య నిష్కంత్య జీర్ణ చేల చరిత్ర", "విచార లహరి", నావిబుధ లోక సందర్శనము" మొదలైన పద్యకావ్యాలు రచించారు. సీతాకల్యాణం అనే హరికథ రాశారు. దీపావళీ వర్ణనము, మద్యపాన నిషేదము, త్రొక్కుడు బండి, సీమమాలికులు మొదలైన శాస్త్రిగారి అనేక రచనలలో కొన్ని మాత్రమే. "విక్టోరియా విలాసం" అనే ద్విపద కావ్యంమృదు మధురంగా రాశారు. ఇందులో స్త్రీ విద్యకున్న ప్రాధాన్యతను వివరించారు. స్త్రీ విద్య అవసరం అని చెప్పే సంస్కార పంతులు శాస్త్రిగారు మహిళల కోసం చాలా తేలిక భాషలో అనేక వ్యాసాలూ రాశారు. ఈ వ్యాసాలు ఆనాడు ప్రసిద్ధమైన పత్రిక "హిందూ

సుందరి"లో ధారావాహికంగా ప్రచురింప బడేవి.

**పత్రికలలో చచ్చి బతికిన శాస్త్రిజీ**

శాస్త్రిగారు రాసిన "నా విబుధ లోక సందర్శనము పద్యకావ్యం "ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక"లో ప్రచురితమైనది. ఈ కావ్యం రాయటానికి కారణం కూడా తమాషాగా ఉంది. "బహ్మయ్యశాస్త్రి గారు మరణించారు" అనే వార్త ఒకటి పొరబాటున పత్రికలో వచ్చింది. 1930 సెప్టెంబర్‌లో రాజమండ్రికి చెందిన కాశీభట్ట లింగమూర్తి శాస్త్రిగారు అనే ఆయన చనిపోతే హిందూ పత్రిక విలేఖరి దాన్ని బ్రహ్మయ్యశాస్త్రిగారికి లంకెపెట్టి బ్రహ్మయ్యశాస్త్రిగారు పరలోక గతులయ్యారని వార్త పంపాడు. దీన్ని చూసి ఆంధ్రపత్రిక కూడా వంత పాడింది. ఇంకాస్త ముందుకు వెళ్ళిన ఆంధ్రపత్రిక బ్రహ్మయ్యశాస్త్రిగారి మరణానికి సంతాపం ప్రకటించి ఆయన సాహిత్య సేవను బహువిధాల సంపాదకీయంలో ప్రస్తుతించింది. ఈ వార్త చదివిన ఆంధ్రదేశంలోని సాహిత్యాభిమానులు హిందూ మతాభిమానులు విచారం వెలిబుచ్చుతూ వారి కుటుంబానికి సానుభూతి తెలుపుతూ సభలు జరుపుతూ లేఖలు కూడా రాసేశారు. వీటిని పట్టించుకోకుండా శాస్త్రిగారు తమ సాహితీ కృషిని కొనసాగిస్తూనే ఉన్నారు. పత్రికలకు వ్యాసాలూ రాస్తూనే ఉన్నారు. అవి అచ్చు అవుతూనే ఉన్నాయి. శాస్త్రిగారు అఖండ జన సోదరుల సౌహార్ధం చేత, భగవత్కృప చేత తాను ఆరోగ్యంగా జీవిస్తూనే ఉన్నానని ఆంధ్రపత్రికా సంపాదకునికి లేఖ రాశారు. అప్పుడు నాలుక కరచుకొన్న ఆ పత్రిక అసత్య వార్తను నమ్మి తాము శాస్త్రిగారి విషయంలో పొరబాటు చేశామని దీనికి చాల చింతిస్తున్నామని శాస్త్రిగారు సంపూర్ణారోగ్యంతో ఉన్నందుకు అభినందనలూ తెలిపి బహిరంగ క్షమాపణ కోరింది. ఇదంతా చూడటానికి, వినటానికి తమాషాగా చిత్రంగా ఉందనిపించింది శాస్త్రిగారికి. ఒక కావ్యం రాయటానికి కావాలసిన దినుసు, సరుకు దొరికింది. వెంటనే "నావిబుధ లోక సందర్శనము" అనే చమత్కార వచన కావ్యం రాసి లోకం మీద వదిలారు.

**శాస్త్రిగారి చారిత్రిక రచన**

బ్రహ్మయ్యశాస్త్రి గారు చారిత్రిక గ్రంథ రచనా చేశారు. తుని సంస్థానం వారు శాస్త్రిగారిని రెండేళ్ళు సెలవు పెట్టించి శాస్త్రిగారి కుటుంబ బాధ్యతలను తామే తీసుకొని శాస్త్రిగారి చేత తమ "పెద్దాపురం సంస్థాన చరిత్ర" రాయించి వెయ్యిన్నూట పదహారు రూపాయలు బహుమానంగా సమర్పించారు. ఇందులో శాస్త్రిగారి లోతైన చారిత్రిక లవగాహన, పరిశీలనా దృష్టి వ్యక్తమవుతుంది. అలాగే "మాధవ విద్యారణ్యులవారు", "శిష్టు కృష్ణమూర్తి కవి", "చేమకూర వెంకట కవి", "కృష్ణ దేవరాయలు", "సంకుసాల నృసింహ కవి", "నారాయణ భట్టు", "సారంగ తమ్మ కవి", "భీమ కవి", "పిల్లల మర్రి పిన వీరభద్రుడు", "నాచన సోముడు" మొదలైన ఘన చారిత్రలు రాసిన మహా పరిశోధక సార్వభౌములు శాస్త్రిగారు.

**శాస్త్రిగారి లలిత కళా విహారం**

శాస్త్రిగారు గొప్ప లలిత కళోపాసకులు. లలితకళలపైన కూడా గ్రంథాలు రాశారు. "వేశ్యా నృత్తగానములు" గురించి 72 పేజీల గ్రంథాన్ని రాశారు. "కవిత్వము, చిత్రలేఖనం" అనే వ్యాసంలో ఈ రెండిటికి ఉన్న పరస్పర సంబంధాన్ని బాగా చిత్రించారు. శాస్త్రిగారికి చిత్ర రచనలోనూ మహా ప్రావీణ్యం ఉంది. తమ వ్యాసాలలో రాసిన భావాల ననుసరించి మోడల్ చిత్రాలను గీసి చూపించారు.

**సండే స్టాండర్డ్‌లో శాస్త్రిగారిపై కితాబు వ్యాసం**

శాస్త్రిగారి మత సంబంధ రచనలను గురించి ముందే ముచ్చటించుకొన్నాం. ఉద్యోగం చేసిన కాలంలో శాస్త్రిగారిని గూర్చి పాశ్చాత్యులచే నడపబడుతున్న "రవి పత్రిక" ఇలా రాసింది– "బ్రహ్మయ్య శాస్త్రిగారు రవి పత్రికకు లేఖకులుగా పని చేశారు. ఎన్నో మంచి విషయాలను చక్కని శైలిలో వ్రాసేవారు. శాస్త్రిగారు కలెక్టర్ ఆఫీస్‌లో అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌లో లేఖకునిగా ఉన్నారు. ఇప్పుడు శాస్త్రిగారిని కొవ్వూరు తాలుకాకు బదిలీ చేవారని విని చాలా విచారిస్తున్నాం.

వీరి మత భావాలతో మేము ఏకీభవించక పోయినప్పటికీ, విద్యార్థుల హృదయాలలో దేవుడున్నాడని, సన్మార్గంలో నడవటం పరమ ధర్మమని శాస్త్రిగారు ఎప్పుడూ బోధిస్తారని మాకు తెలిసి మిక్కిలి సంతోషించాం. ఉపన్యాసంలో వీరు చెప్పే విషయాలు మృదు మధురంగా, ఆహ్లాదకరంగా ఉంటాయని విద్యార్థుల వలన, ఉపాధ్యాయుల వలన మేము విని తెలుసుకొన్నాం. శాస్త్రిగారికి విశ్రాంతి దొరికినప్పుడల్లా తెలుగుభాష విషయంలోనే కృషి చేస్తారని, ఇలాంటి ఉత్తముల సాంగత్యం కాకినాడ పట్టణానికి ఇక నుండి లభ్యం కాని, వీరి నాయకత్వం విద్యార్థులకు ఇక దొరకటం దుర్లభమైపోతోందని బాధ పడుతున్నాం. శాస్త్రిగారిని బదిలీకాకుండా ఇక్కడే ఉంచే కార్యక్రమాన్ని భాషాభిమానులందరూ కలిసి ఆలోచించి ఫలితం సాధించాలి" అని రాసింది. ఈ వ్యాసం గొప్ప ప్రభావం కలిగించి శాస్త్రిగారి ట్రాన్స్‌ఫర్ ఆగిపోయేట్లు చేసింది.

### గ్రంథరూపంలోకి రాని శాస్త్రిగారి విపుల సారస్వత రచనలు

శాస్త్రిగారు రాసిన అనంత సాహిత్యంలో చాలా భాగం గ్రంథ రూపాలను సంతరించుకోలేక పోయింది. గుడ్డిలో మెల్లగా శ్రీ నందిరాజు చలపతిరావు పంతులుగారు మతపర వ్యాసాలను సేకరించి "ఉపన్యాస పయోనిధి" పేరుతో అయిదు సంపుటాలుగా ముద్రించి మహోపకారం చేశారు. ఇంకా వారి రచనలు గ్రంథరూపాలలోకి వస్తే ఇరవై గ్రంథాలు అవుతాయి. శాస్త్రిగారు రాసిన పత్రికా వ్యాసాలు ఒకొక్కటి ఒకొక్క చిన్న పుస్తకంగా ముద్రింపబడ్డాయి. ఇదివరకే ముద్రింపబడిన శాస్త్రిగారి గ్రంథాలు ఇప్పుడు అలభ్యాలు. ఉదారులు, వదాన్యులు పూనుకొని శాస్త్రిగారి అమూల్య సారస్వతాన్ని అందరికి అందుబాటులోకి తెచ్చే ప్రయత్నం చేయాలి.

### ఉపన్యాస కేసరి

శాస్త్రిగారి రచనలు ప్రచురించని పత్రిక ఆనాడు లేనేలేదు. అలాగే వారి ఉపన్యాసం వినని పట్టణం లేనేలేదు. శాస్త్రిగారు అమోఘమైన మహా వక్తలు.

గంగా ప్రవాహంగా వారి ఉపన్యాస ధోరణి సాగుతుంది. ఎక్కడా తొణకటం, బెణకటం ఉండదు. సభలో వ్యతిరేకులు ఎన్ని అడ్డంకులు కల్పిస్తున్నా అల్లరి చేస్తున్నా తమ ప్రసంగాన్ని కొనసాగించి విజయ దుందుభి మ్రోగించేవారు. మాధుర్యమైన పద ప్రయోగం శాస్త్రిగారి ప్రత్యేకత. రచనలో గ్రాంధికమే వాడారు. వందలాది సభలలో ప్రసంగించారు. ఎన్నో సభలకు అధ్యక్షత వహించారు. ఆంధ్రదేశంలో బరంపురంలో "ఆంధ్ర సారస్వత సభ", గుంటూరులో నిర్వహించిన "నిఖిలాంధ్ర దేశ వర్ణాశ్రమ ధర్మ మహాసభ"లలో శాస్త్రిగారే అధ్యక్షత వహించారు. ఇలాంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి.

**ఆ బాల వృద్ధులకు ఆరాధనీయులు**

బాలురనుండి వృద్ధుల వరకు, పామరుల నుండి పండితుల వరకు శాస్త్రిగారంటే అపార గౌరవం. వారికీ అందరి యెడల అపూర్వ అభిమానం. వారి వదనంలో శాంతం ఎప్పుడూ తొణికిసలాడుతూ ఉండేది. మాటలలో మర్యాద స్పష్టంగా కనిపించేది. టీ. కాఫీ, ముక్కుపొడుం చుట్ట మొదలైన అలవాట్లు శాస్త్రిగారికి లేనే లేవు. న్యాయం అని భావిస్తే ఎవరెదురొచ్చినా ధైర్యంగా ముందుకు వెళ్ళేవారు. హిందూమత భావ వ్యాప్తికి అంకితమై శాస్త్రిగారు పని చేశారు. దీనికోసం ప్రొమోషన్ వచ్చే పరీక్షలు రాయకుండా వదిలేశారు. శ్రద్ధపట్టి రాస్తే శాస్త్రిగారు తాసిల్దారు అయ్యేవారు. సంవత్సరానికి ఉద్యోగ వేతనం కాని, భూములపై వచ్చే ఆదాయం కాని సుమారు 300 రూపాయలు మాత్రమే వచ్చేవి. ఇలాంటి పరిస్థితిలో కూడా స్వంత ఖర్చుతోనే పుస్తకాలు, కరపత్రాలు ముద్రిస్తూ, ఉపన్యాసాల కోసం దేశాటనం చేసేవారు. దీనిని బట్టి శాస్త్రిగారి త్యాగనిరతి ఎంత ఉత్కృష్టమైనదో తెలుస్తుంది.

**బిరుదులూ సత్కారాలు**

శాస్త్రిగారికి ఏలూరు, సామర్లకోట, నెల్లూరు, కడప, కూరాడ, కిర్లంపూడి పట్టణాలలో ఘన సన్మానాలు నిర్వహించి సత్కరించారు. విజయనగరంలోని

"ఆంధ్ర సారస్వత సభ" శాస్త్రిగారికి "విమర్శకాగ్రేసర" బిరుదునిచ్చి సన్మానించారు. ఏలూరు "విద్వద్వర విద్వాద్రుభు" సంస్థ "మహోపాధ్యాయ" బిరుదునిచ్చి ఘనంగా సత్కరించింది. నెల్లూరు "విద్వజ్జన మహాసభ" "ఉపన్యాసక పంచానన" బిరుదుతో గౌరవ సత్కారాలు అందజేసింది. కొవ్వూరు "ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠం" "ఆర్య మతోద్ధారక" బిరుదం ఇచ్చి సత్కారం చేసింది.

**ఒక్కసారి శాస్త్రిగారి వ్యాస పరంపరను దర్శిద్దాం-**

1. సంఘ సంస్కార విషయంపై రాసినవి 24- ఇందులో సస్కరణలు- సంస్కర్తలు, వెంకటరత్నం నాయుడుగారి వివాహ బంధం, దమయంతి ద్వితీయ స్వయంవరం స్త్రీ పునర్వివాహానికి అనుకూలమేనా? కాకారాతి- ప్రత్యుత్తరం, అలీక దేశాభిమానం, కృష్ణా పత్రిక- వింత మూర్ఖత మొదలైనవి.

2. ఆధ్యాత్మిక వ్యాసాలూ 17- వీటిలో- బ్రహ్మజ్ఞానం, వేదాంత పునరుజ్జీవం, జపాను దేశము- వేదాంతము, ఏకేశ్వర వాదము, బాలుర వేదాంతము మొదలైనవి.

3. మత ధర్మ విషయ వ్యాసాలూ 43- ఇందులో- ఆర్య మతము, జన్నిదము గూర్చి, యజ్ఞోపవీత రహస్యము, శ్రీకృష్ణమూర్తి, దీపావళి, పునర్జన్మము- వీరేశలింగంగారు, ఇండియా దేశపు స్త్రీలు- వివాహ ధర్మమూ, హిందూమత మననేమి మొదలైనవి.

4. సాహిత్య వ్యాసాలూ 620 వీటిలో- కుదావరజ్ఞానము- కలికాల నీతి బోధకుడు- పురాతనాంధ్ర పత్రికలూ, పాత్రౌచిత్య విచారము, రామ మోహనరాయులు విగ్రహారాధకులు కారా? నన్నయ్య క్షత్రియుడా? త్రిలింగము నుండి తెలుగు పుట్టినా తెలుగు నుండి త్రిలింగము పుట్టినదా? మానపల్లి వారి మోసపు రాతలు, గ్రామ్యం గ్రాన్థిక భాసగా ఉండదగునా? భాషా సాంకర్యం, ఆంధ్రదేశ పత్రికలూ మొదలైనవి.

5. కవిత్వ విషయ వ్యాసాలు 16- ఇందులో - ఛందో విశేషాలు, కలికాల కవిత, చిత్ర కవిత్వం, బంద కవిత్వం, భారతీ స్తవ గీతాలు, గడ్డిపరక మొదలైనవి.

6 ప్రకృతి శాస్త్ర వ్యాసాలూ 110. వీటిలో జ్యోతిశ్శాస్త్రము గూర్చి,

పంచభూతములు, ప్రమాణ విచారము, భూమి యొక్క ఆకర్షణ శక్తి, భూమి తిరుగుచున్నదా సూర్యుడు తిరుగు చున్నాడా? పండిత శివనాధ శాస్త్రిగారు భ్రమర కీటక న్యాయము, జగము సృజింప బడినదా? మొదలైనవి.

కొమ్ములు తిరిగిన పండితులనే ఆశ్చర్య చకితులను చూసిన శాస్త్రిగారు

భాషా సాదృశ్య శాస్త్రంలో, సంస్కృతాంధ్ర వ్యాకరణాలలో, తత్వశాస్త్రంలో, దేశచరిత్రలలో, శ్రౌతంలో ఉద్దండులై కొమ్ములు తిరిగిన మొనగాళ్ళు అనిపించుకొన్న పండితులకే ఆశ్చర్యం కలిగించే అనేక అమూల్య విషయాలు తవ్వి తీసి బహిర్గతం చేశారు శాస్త్రిగారు. వారి దిషణ అంతటిది. మౌలిక గ్రంథాలనేకం శాస్త్రిగారు రాశారు.

77 ఏళ్ళ సార్ధక జీవితాన్ని గడిపిన విమర్శకాగ్రేసర శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు 1940లో పరమపదించి ఆంధ్ర సాహితీలోకంలో శూన్యం మిగిల్చారు. శాస్త్రిగారు జీవితకాలం అంతా కాకినాడ జగన్నాధపురంలోనే గడపటం మరో గొప్ప విషయం.

ఇంతటి మహనీయుని గురించి నేను చదివినది, తెలుసుకొన్నది మీకు అందజేసి ధన్యుడయ్యాననే సంతృప్తి నాకు కలిగింది. ఇంకా ఏమైనా విశేషాలు దొరుకుతాయేమో నని తెలుగు విజ్ఞాన సర్వస్వంలోకి తొంగిచూశాను. అందులో శాస్త్రిగారిపై వ్యాసం రాసినవారు శ్రీ జటావల్లభుల పురుషోత్తం గారని తెలుసుకొన్నాను. నేను ఇప్పటిదాకా రాసిన విషయాలే ఇందులోనూ సంక్షిప్తంగా ఉన్నాయి. అదే ధోరణిలో కూడా ఉన్నాయి. కనుక మా నాన్నగారు సంతరించి పెట్టుకొన్న 75 ఏళ్ళనాటి చిన్న గ్రంథం "విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి జీవిత చరిత్రము" రచయిత శ్రీ జటావల్లభుల పురుషోత్తం గారే అనే నిర్ణయానికి వచ్చాను. ❁




## 285. హరికథా పితామహ శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు (1864 -1945)

**అ**మృతవాక్కుల రచయితా బహుభాషా పండితుడు కవి శ్రీ నారాయణ దాసు హరికథకు ఆద్యుడు. అచ్చ తెలుగుకవి. సంస్కృతాంధ్రాలలో వందకు పైగా గ్రంథ రచన చేశారు. సంస్కృత రచనలు – 'హరికథా మృతం' అనే మూడు హరికథల సంపుటి, తారకం అనే వ్యంగ్య కావ్యం, రామచంద్ర శతకం కాశీ శతకం రాశారు. ఉమర్ ఖయ్యాం రుబాయత్‌లను సంస్కృతీకరించారు. విజయనగర సంగీత కళాశాలకు మొదటి ప్రిన్సిపాల్ (1919) దాసు గారే.❋

## 286. వేములకొండ వెంకట నారాయణ (1866)

**భా**రద్వాజ గోత్రీకుడు. వేములకొండ కోనయామాత్య కుమారుడు వెంకట నారాయణ 1866లో విశాఖ లో జన్మించాడు. పూనాలో సంస్కృతం ఇంగ్లీష్ చదివాడు. మధురంగా సంస్కృత కవిత్వం చెప్పటం అలవాటై చాలా రాశాడు. 21ఏళ్ళ వయసులో 'పద్మినీ చంద్ర సంవాదం'ను 263 శ్లోకాలో రచించిన ప్రతిభ ఉన్నవాడు. 12 ఏళ్ళ తర్వాత ఇంగ్లీష్ వివరణతో ప్రచురితమైంది. పద్మానికి చంద్రునికి జరిగే సంభాషణ ఇది. ఒక ప్రశాంత వెన్నెల రాత్రిలో పద్మం ముకుళితమై విచారంగా ఉండటం చంద్రుడు చూసి, ఆమె బాధను పోగొట్టటానికి మాటలతో రంగంలో దిగాడు. చంద్ర ప్రవర్తన నచ్చని పద్మం ఏవగించు కొంటుంది. ఆమె మనసును గెలువలేకపోయిన చంద్రుడు, హంసలా మారు వేషంలోవచ్చి బలవంతంగా ఎత్తుకు పోతుంటే రక్షించమని పద్మ బాంధవుడు సూర్యుని ఎలుగెత్తి పిలుస్తుంది. సూర్యుడు లక్ష్మీదేవి ప్రత్యక్షమై చంద్రుని శిక్షిస్తారు. మొత్తం మీద చక్కని నీతిబోధక కథనం. సంభాషణలు రసవత్తరంగా చేశాడు కవి. మొదటి శ్లోకం-

'గీర్గాన వీణా కవితా రుతేషు, మయూర హంసేషు పితమహాక్కే - సితారవిన్దేషు చ పుస్తకేషు, విరాజమానేభ్య మయి ప్రసీద'

అగ్ర కులాల హీన ప్రవృత్తిని చెబుతూ-

'యధాపి కేచిత్ త్రభు తాధనాంద ఉపానసత్తాః పరదారాసక్తాః-కేచిచ్చ వ్దుగ్గురు దండినస్య మిధ్యాప్రభావా న్దధియో వినీతాః'

చంద్రుడు స్వంత డబ్బా కొట్టుకోవటం-

'జ్యోత్స్నా ప్రవాహేన జగత్కరోమి పీయూష ధారా భిరివా భి షిక్తం - ఉల్లాస యన్మన్మధ చేస్టితాని, సంభోగ సౌఖ్యానుభవాయ యూనాన్'
కైలాస శుభ్రా శామతలయమానాః భాస్మత్య శైవావయ యామనానః - తపోధనానం హృదయాయ మానాః వారాంగనా రమ్య హసా యమానాః
'అంతఃపుర స్త్రీల వలననేచంద్రునికి వైభవం దక్కింది అని పద్మిని దెప్పి పొడిచింది -

'విభ్రాజితాన్తః పురకామినీనాంరత్న ప్రభా భాసుర చంద్ర హారః - భూత్వా చరన్ పీన కుచాగ్ర భాగే తత్కంఠమాలింగ్యతదిపి శోభనం'. హంస రూపంలో చంద్రమాన్ పద్మినిని ఎత్తుకుపోయే సందర్భం.
రవి-సా స్యాన్నభో జలనిదౌ ప్రతి బిమ్బితాభూః-
లక్ష్మీ-కిం వా జయధ్వ జపటీసమరాన్గల నౌకా
రవి-హంసీ బిసం స కమలం కిముతోన్న యం తీ
సర-మత్పుత్రికాం హారతి జాన్తిక ఇందు చోరః'❁

## 287. వేదాంతాచార్యులు – ప్రమథ నాథ తర్క భూషణుడు (1866)

**మ**హామహోపాధ్యాయులైన ప్రమథ నాథుడు తారాచంద్ర రామ రంగినీ దేవిల పుత్రుడు. బెంగాల్ లోని భాట్పారాలో 1866లో పాశ్చాత్య వైదిక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. వశిష్ట గోత్రీకులు. న్యాయ రత్న రాఖాలదాసు, శిలాచంద్ర, సార్వభౌమ, కైలాస చంద్ర శర్మ వంటి ఉద్దండ పండితుల వద్ద శాస్త్రాలు నేర్చాడు. కలకత్తా సంస్కృత కళాశాలలో వేదాంతాచార్యునిగా పని చేసాడు. తర్వాత బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ప్రాక్ విద్య విభాగంలో పని చేసాడు. వివిధ శాస్త్రాలపై గొప్ప రచనలు చేసాడు. "కోకిల దూత", "రస రసోదయం", "విజయ ప్రకాశం" కావ్యాలు రచించాడు. ఇతని తండ్రి తారాచంద్రుడు కాశీ రాజ్య ఆస్థాన పండితుడు. "కానన శతకం", "రామ జన్మభూమి' రాశాడు.❁



## 288. ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (1866–1960)

**ఆం**ధ్రప్రదేశ్ ప్రధమ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి. రామాయణ భారత భాగవతాలతో బాటు వందకు పైగా ఉద్గ్రంధాలు రాశారు. సంస్కృతంలో తన జీవిత చరిత్ర 'శ్రీ కృష్ణ స్వీయ చరితం' రాసుకొన్నారు.❁

## 289. గానామృత తరంగిణి రచించిన శ్రీ కల్కి సింహా (1867-1935)

**శ్రీ** కల్కీ లేక నరసింహ అయ్యంగార్ అని పిలవబడే ఈయన ప్రతివాది భయంకర తొందనూర్ సిన్గాలాచార్య కుమారుడు. శ్రీ వత్స గోత్రీకుడు. 1867లో మెల్‌కోటేలో జన్మించాడు. బెంగుళూరు సెంట్రల్ కాలేజీలో సంస్కృత ఆచార్యుడుగా పని చేసాడు. అంతర్వాణి వల్ల ప్రభావితుడై ధ్యానంలో దివ్యానుభూతిని పొందాడు. గీర్వాణ సాహిత్యానికి అంకితమైనాడు. అన్ని శాస్త్రాలలో నిష్ణాతుడు. చాలా గ్రంథాలు రాసినా అచ్చు కావాలసి ఉన్నాయి. శాస్త్రీయ సంగీతంపై జ్ఞానామృత తరంగిణి గ్రంథం రచించాడు. ఆయన శిష్యులు గురువు గారిని కల్కి అవతారంగా భావిస్తారు. 1935లో చనిపోయాడు.❁

## 290. కీర్తనాచార్య- సి.ఆర్ శ్రీనివాసాచార్య (1867- 1936)

**1**867- 1936 కాలంవాడైన శ్రీనావాసాచార్య తంజావూర్ జిల్లాలో పుట్టి సంగీత విమర్శలలో గొప్ప పాండిత్యాన్ని సంపాదించాడు. జీవిత చివరికాలంలో దక్షిణ దేశ సంగీతాన్ని సంగీత ఎకాడమీల ద్వారా సెమినార్‌ల ద్వారా సంస్కరించే ప్రయత్నం చేశాడు. సంగీతంలోని సాంకేతిక అంశాలలో వచ్చిన విభేదాలను పరిష్కరించటానికి ఎంతో శ్రమ పడ్డాడు. రాగాలను గాయకులు ఎవరిష్టం వచ్చినట్లు పాడుతుంటే క్రమపద్ధతిలో పాడే ఏర్పాటు చేవాడు. త్యాగరాజస్వామి కృతులపై సాధికారిత ఉన్నవాడు. అందుకే ఆయన్ను “అభినవ త్యాగ బ్రహ్మం” అంటారు. ఆధునిక కాలంలో సంగీత విమర్శకు మార్గదర్శి ఆయన. భారతీయ, పాశ్చాత్య సంగీతాలను బేరీజు వేస్తూ “మనది స్వర సంగీతం వాళ్ళది వాద్య ఘోష” అన్నాడు. “డెబ్భై రెండు మేళకర్తలలో మూడింటిని మాత్రమే వారు ఉపయోగిస్తున్నారు” అన్నాడు.❁

## 291. కృష్ణమాచార్య (1869-1924)

**ప**రవస్తు రంగాచార్య కుమారుడైన కృష్ణమాచార్య 1869లో జన్మించి 1924లో మరణించాడు. మద్రాస్‌లో సంస్కృత విద్యకు సూపరింటెండెంట్‌గా ఉండేవాడు. కాళిదాసు రచనలపై గొప్ప వ్యాస పరంపర రాశాడు. 'సహృదయ' అనే సంస్కృత పత్రిక నిర్వహించాడు. 'పతివ్రత', పాణిగ్రహణం, వరరుచి' అనే వచన గ్రంథాలు రాశాడు. సాంఘిక నీతి నియమాలను ప్రతిబింబించే 'సుశీల' నవల రాశాడు.❀

## 292. సాహిత్య సమ్రాట్- రాజా విక్రమదేవ వర్మ (1869- 1951)

**1**869లో జూన్ ఇరవై ఉనిమిదిన విక్రమదేవ వర్మ శ్రీ కృష్ణచంద్రదేవ మహారాజు, రేఖాదేవి దంపతులకు జన్మించాడు. 1931లో గద్దెనెక్కి పాలన సాగించాడు. సాహిత్యంలో డి.లిట్. పొందాడు. సాహిత్య సమ్రాట్, కళాప్రపూర్ణ బిరుదాంకితుడు. జైపూర్ సంస్థానాదీశుడు. సాహిత్య పోషకుడు. ప్రతి ఏటా ఒక లక్ష రూపాయలను ఆంధ్ర విశ్వ విద్యాలయ అభివృద్ధికి అందజేసేవాడు. అనేక సంస్థలకు ఉదారంగా విరాళాలు అందించి పోషించి అభివృద్ధికి తోడ్పడేవాడు. విక్రమదేవ వర్మ సంస్కృతంలో ఉద్దండుడు. తెలుగు, ఒరియా, ఇంగ్లీష్‌లలో నిష్ణాతుడు. సంస్కృత కవి కూడా. గొప్ప ఖగోళ శాస్త్రవేత్త. "అభినవ భోజుడు" అనే బిరుదున్నవాడు. ఆస్థానంలో మహా గొప్ప కవి పండితులను పోషించాడు. సంస్కృతంలో అనేక స్తుతులను రాశాడు. అలాగే గీతాలూ అల్లాడు.

జైపూర్‌లో విక్రమం ఆర్ట్ అండ్ క్రాఫ్ట్ స్కూల్ నిర్మించాడు. ఆంధ్ర విశ్వ విద్యాలయానికి "ప్రో ఛాన్సెలర్"గా ఉండేవాడు. ఎనభై రెండవ ఏట 14-04-1951న జైపూర్‌లో మరణించాడు.❀



## 293. విశేషణాల అర్ధ సంగ్రహకర్త- సార్వభౌమ (1870)

సార్వభౌమ కవి అర్ధ సంగ్రహం అనే రచన సంక్షిప్త రామాయణమే అయినా విశేషణాలతో అలంకారాలతో వింత సొగసులు దిద్దాడు. మహా భారత కథానకం వచన రచన. విరించి నాథ చరిత్ర, డిండిమ వంశానికి చెందిన విరించి నాధుడు. విరించి పురంలోని దైవం గూర్చి చరిత్ర. ఈ కథా సంగ్రహాన్నే సార్వభౌమ కవి విరించినాద చరిత్రగా రాశాడు. రవివర్మ స్తుతి అనేది కేరళలోని మలబార్ రాజు రవివర్మపై రాసిన వచన స్తుతి. దమయంతి పరిణయం కూడా రాశాడు.

సంయోగిత స్వయంవరం ఆరు అధ్యాయాలుగా రచించాడు. వైద్య అనే పేరున్న పరశురాముడు రాష్ట్రకూట రాజు జయచంద్రుని కుమార్తె సంయోగిత వివాహ కథ. పరిహాచార అనే చిన్న హాస్య వచన రచనా చేశాడు. వరద కాంత విద్యారత్న కవి గద్యాదర్శం రచించాడు. బిజాపూర్ సుల్తానుల చరిత్రను విజయపుర కథగా, వేల్లపురీశ గద్యలో వెల్లూరు రాజు కేశవరాజు చరిత్రను రాశాడు. మహేశ ఠాకూర్ సర్వదేశ వృత్తాంత సంగ్రహంలో అక్బర్ చక్రవర్తి పరిపాలన వర్ణించాడు. ❁

## 294. శతావధాని, అవధాన విధానకర్త– వేమూరి శ్రీ రామశాస్త్రి (1870)

**వే**మూరి శ్రీరామశాస్త్రి నెల్లూరు జిల్లా కందుకూరు తాలుకా జువ్విగుంట అగ్రహారంలో 1870లో పుట్టాడు. వెలనాటి వైదిక కుటుంబం హరితస గోత్రం. వేదం, జ్యోతిషాలను పితృపాదుల వద్దనే నేర్చాడు. తర్వాత సాహిత్య వ్యాకరణాలు అభ్యసించాడు. చిన్ననాటి నుంచే కవిత్వం అబ్బి శతావధానంపై మోజు ఏర్పడి కన్యాకుమారి నుండి కాశ్మీర్ దాకా 24వ ఏట నుండి అనేక ముఖ్య పట్టణాలలో తన శతావధాన విద్యా ప్రదర్శన చేసి గౌరవింప బడ్డాడు. పూనాలో చేసిన అవధానానికి డా. భండార్కర్ అబ్బుర పడ్డాడు. అసాధారణ ధారణా సామర్థ్యం ఉన్నవాడు. బరోడాలో మహారాజు సమక్షంలో శతావధానం చేసి గయక్వాడ్ చేత విశేష సన్మానం అందుకొన్నాడు. 1903లో కాశ్మీర్ వెళ్ళి గ్రైవేయక బంధం అనే కావ్యాన్ని సంస్కృతంలో రచించాడు. 1911లో ఢిల్లీలో తాను రాసిన ఢిల్లీ ప్రభ లేక దర్బార్ ఖానేద రచనకు ఢిల్లీ దర్బార్‌లో బహు ప్రశంసలు సన్మానాలు పొందాడు. సంస్కృత సాహిత్యపు లోతులు తరచినవాడు కనుక 14 భాషలలో అనర్గళంగా మాట్లాడగలిగే నేర్పు అలవడింది. ఆనాడు ఇంతటి బహుభాషా పాండిత్యం ఉన్నవారు లేరు. తెలుగు సంస్కృంత హిందీ భాషలలో రచనలు చేవాడు. సంస్కృతంలో అవధాన విధానం గురు కల్పం, నూతనోదయనం రచించాడు. బెజవాడలో స్థిరపడ్డాడు.❀

## 295. కవిరత్నం- జ్ఞాన సుందరి (1870-1910)

**కు**ంభకోణానికి చెందిన జ్ఞాన సుందరి నాట్యకళాకారిణి అక్కడే పెరిగి 1910లో చనిపోయింది. శ్రీవత్స గోత్రానికి చెందిన కుప్పస్వామి శాస్త్రి అనే బహు గ్రంథకర్త శిష్యురాలు. తాను అనేక కావ్యాలు రచించినట్టు చెప్పినా ఆరు స్థభాకాలలో రాసిన హాలాస్య చంపూ మాత్రమే లభ్యమైంది. దక్షిణ జిల్లాలలో ఆమె చేసిన ఉపన్యాసాలు, నాట్యాలు, సంగీత కచేరీల గురించి చాలామంది ఇప్పటికీ చెప్పుకుంటారు. బార్ ఎట్ లా చేసిన మదురైకి చెందిన ఆర్. ఫిషర్ ఆమె పోషకుడు. మైసూర్ సంస్థానానికి వెళ్ళి రాజును మెప్పించి కవిరత్న బిరుదు పొందింది. మధుర మీనాక్షి సుందరేశ్వరుల కల్యాణాన్ని మృదుమధురంగా వర్ణించింది. ❀



## 296. తిరుపతి కవులు (1870-1950)

**ది**వాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి కవి ద్వయాన్ని తిరుపతి కవులు అంటారు. ఆశు కవిత్వంతో అవధాన విద్యనూ ప్రదర్శించి ఆంధ్రదేశం అంతటా బహు సన్మానాలు అందుకొన్నారు. వీరి సంస్కృత రచన 'కలి సహస్రం'.

దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (1853) తమ్మన శాస్త్రి (1862) సోదరులు గొప్ప శతావధానులు. పిఠాపురం రాజాస్థాన కవులు. సుబ్బరాయ శాస్త్రి సంస్కృతంలో 'రావు వంశ ముక్తావళి' రాశాడు. ❀

## 297. అద్వైత సభాధ్యక్షుడు- గణపతి శాస్త్రి (1871-1913)

**సు**బ్రమణ్య సీతాలక్ష్మిల కుమారుడు ఎన్ గణపతి శాస్త్రి. తంజావూరు జిల్లాలోని పైనగనాడు గ్రామ నివాసి. మౌద్గల్య గోత్రం. 1871-1913లో జీవించాడు. కుంభకోణంలోని అద్వైత సభకు అధ్యక్షుడు. ఇది ఇప్పుడు శంకర మఠం ఆధ్వర్యంలో నడుస్తున్నది. మహా మహోపాధ్యాయ బిరుదాంకితుడు. ఈయన శిష్యులు కూడా గొప్ప ప్రసిద్ధి చెందినవారు. అందులో సంస్కృత సాహిత్యానికి అపార సేవ చేసిన కదలన్ గూడి నటేశ శాస్త్రి ఉన్నారు. అనేక విషయాలపై చాలా గ్రంథాలు రాశాడు. ఈయన రాసిన కటాక్ష శతకం, తాట తాటక పరిణయం, ధ్రువ చరిత్ర, రసిక భూషణం, గురు రాజ సప్తతి ప్రసిద్ధాలు. వివిధ దేవతలపై అనేక స్తోత్రాలు రచించాడు. వృత్త మణిమాల అనే ఛందస్ శాస్త్రాన్ని రచించాడు.❁

## 298. సంస్కృత భాషా సేవలో పునీతుడైన గోరంట్ల వెంకన్న (1871-1947)

ప్రకాశం జిల్లా ఒంగోలు ప్రాంతంలో సంస్కృత భాషను బ్రతికించి సేవలందించిన మహనీయుడు శ్రీ గోరంట్ల వెంకన్న. జీవితం అంతా గీర్వాణ సేవకు, విద్యా సాంస్కృతిక సేవలో గడిపిన వదాన్యుడు. ప్రకాశం జిల్లా తిమ్మ సముద్రంలో 1871లో వెంకన్న జన్మించాడు భాగ్య నంతుడు. వీరన్న పున్నమ్మల కుమారుడు. సంస్కృత విద్యాలయాలలకు సంస్కృత కవిపండితులకు విద్యాలయాల స్థాపనకు చేతికి ఎముక లేకుండా దానం చేసిన అభినవ కర్ణుడు. ఒంగోలులో హైస్కూలు, ఓరియెంటల్ స్కూలు, తిమ్మ సముద్రం లో సంస్కృత కళాశాల స్థాపించిన వదాన్యుడు విద్యాభిమాని. విద్యార్థులందరికీ ఉచిత భోజన వసతులు కలిపించిన మహనీయుడు. వేటపాలెంలో 'సరస్వతి నికేతన్' అనే గొప్ప గ్రంథాలయాన్ని నిర్మించాడు. దీనికి ఉన్న పేరు దేనికీ రాలేదు. సంస్కృత విద్యా వ్యాప్తికి ఆయుర్వేద వ్యాప్తికి 300 ఎకరాల స్థలాన్ని ట్రస్ట్‌కు రాసిచ్చిన మహాదాత. టంగుటూరి ప్రకాశం పంతులుగారి ముఖ్య అనుయాయి. గాంధీగారికి వెంకన్న దాతృత్వం తెలిసి తిమ్మ సముద్రం వచ్చి చూసి అభినందించాడు. తుఫానులో సర్వస్వం కోల్పోయిన వారందరికీ గృహాలు కట్టించి ఇచ్చాడు. హరిజనులకు నివేశన స్థలాలను అందజేశాడు. యావదాస్తినీ ప్రజాసేవకు సంస్కృతభాషా వ్యాప్తికి రాసిచ్చి సన్యాసం స్వీకరించి, అతి పవిత్ర జీవితాన్ని గడిపి మహాదాత గోరంట్ల వెంకన్నగారు. 1947లో డెబ్భై ఆరవ ఏట పరమ పదించారు.❋



## 299. దక్షిణామూర్తి పరపహంస స్వామి (మంగయ్య)- (1872-1954)

**బాల్యం**

**వి**జయనగరం దగ్గర మెట్టలో న్యావాది సూర్యనారాయణ శాస్త్రి, రత్నాలమ్మ దంపతులకు 9-10-1872 మంగయ్యగారు జన్మించారు. అయిదవ ఏట ఒక సిద్ధుడు కనిపించి ఏమి కావాలని ఆయన కోరితే దక్షిణామూర్తి మంత్రం కావాలని మంగయ్య కోరితే బలవంతంగా సిద్ధుడు హయగ్రీవ మంత్రం ఇచ్చి వెళ్ళిపోయాడు. దాన్ని అనుస్టించటం వల్ల మంగయ్యకు వాక్సుద్ధి కలిగింది. ఊరవతల గుట్టలపై ఏకాంతంగా ఎప్పుడూ కూర్చునేవాడు ఒకరోజున ఎవరిదో బంగారు నగ పోతే మంగయ్యను అడిగితే నగ ఇక్కడికే వస్తుందని చెప్పాడు. ఇంతలో ఒక కాకి ఆ నగను ముక్కుతో కరచుకొని తీసుకొచ్చి ఆయన ఉన్న చెట్టుపై చేరి కిందికి జార విడిచింది. ఈ విషయం తెలుసుకొన్న ఊరి జనం మంగయ్య కారణ జన్ముడు, మహాత్ముడు అని భావించారు.

**ఉపనయనం- విద్య**

మంగయ్యకు ఎనిమిదవ ఏట ఉపనయనం చేశారు. పినతండ్రి వెంకన్న పంతులు వద్ద సంస్కృతం, తెలుగు, ఆంగ్లం నేర్చుకొన్నాడు. ఒకసారి

ఇంటికి వెడితే ఒక గుళిక వచ్చి ఆయన మీద పడింది. అందులో ఉన్న పదార్థాన్ని ఒళ్ళంతా రాసుకొన్నాడు. ఆ కాయను బొడ్డులో దాచుకొన్నాడు. దాన్ని గురించి ఆశువుగా రెండు శ్లోకాలు చెప్పాడు. విజయనగరం వెళ్ళి హైస్కూల్‌లో చేరి సెకండరీ విద్య పూర్తిచేసి, ఇంటికి వచ్చి తండ్రి దగ్గర శైవ మంత్రాలను ఉపదేశం పొందాడు.

## పెళ్ళి- రాజయోగ, హఠయోగ విద్య

పదహారవ ఏట మంగయ్యకు పెళ్ళి అయింది. రైల్వేలో పనిచేసే ఒకాయన రాజయోగం క్షుణ్ణంగా నేర్పాడు. యోగ ప్రభావాన్ని చూపించమని స్నేహితులు బలవంతం చేశారు. అదే సమయంలో ఒక బండి వస్తుంటే దమ్ముంటే దాన్ని వెనక్కి మరల్చమని సవాలు చేశారు. మంగయ్య యోగశక్తితో ఆ బండిని అనేకసార్లు ముందు, వెనకలకు నడిపించి ఆశ్చర్యపరచాడు. కొంతకాలం తర్వాత బాలానంద పరమహంస అనే సిద్ధేశ్వర బ్రహ్మచారి అనే ఉత్తర దేశీయుని వద్ద రాజ, హఠయోగ రహస్యాలు ఆకళింపు చేసుకొన్నాడు.

## గణితం నుంచి వేదాంతంలోకి

మద్రాస్ వెళ్ళి క్రిస్టియన్ కాలేజీలో చేరి గణితంలో బి.ఏ. చదివాడు. ఒకసారి కాలేజీలో జరిగిన డిబేటింగ్ పోటీలో గణిత ఉపన్యాసకుడు సైకాలజీలో ఆంగ్లేయులే ప్రపంచంలో నంబర్‌వన్ అని వాదిస్తే, కోపంతో లెక్కల సబ్జెక్ట్‌ను వదిలేసి వేదాంత శాస్త్రాన్ని ఎంచుకొని చదివాడు. బాబాయి వెంకు పంతులు రాసిన సంస్కృత కావ్యంలోని ఇరావతీ ఘట్టాన్ని పేరులో ఉన్న పరమార్థాన్ని సమర్థించి సంస్కృత అధ్యాపకులైన వేదం వెంకట రాయ శాస్త్రి గారి అభిమానం పొందాడు. ముఖ్య శిష్యుడయ్యాడు. గురు శిష్యులిద్దరూ తరచుగా కావ్య గోష్టితో కాలక్షేపం చేసేవారు. ఒకసారి ప్రయోగం కోసం ఈ గురుశిష్యులు గంజాయి దమ్ము కొట్టారు. గురువు శాస్త్రిగారు దిమ్మ తిరిగి పడిపోయారు. శిష్యుడు నిమ్మకాయ నీళ్ళు తాగించి పైత్యం వదిలించాడు. ఇద్దరూ ఒకసారి శకుంతల

నాటకం చూడటనికి వెళ్ళి అందులో దుష్యంతుడు శకుంతలకు చేసిన అన్యాయాన్ని సహించలేక పూర్తిగా చూడకుండా లేచొచ్చారు. బి.ఏ పూర్తి అయ్యేసరికి మంగయ్యలోని తర్కశక్తి పట్టపగ్గాలు లేకుండా శిఖరారోహణం చేసింది.

**లౌకిక ఉద్యోగాలు- అలౌకిక సాధన**

నాడీ శుద్ధి, కుంభక ప్రాణాయామం సాధిస్తూ మంగయ్య ఒంటిపూట మాత్రమే భోజనం చేస్తుంటే క్షయ రోగం పట్టుకుంది. తండ్రి మహావిద్య దీక్షపూని కొడుకు రోగం తగ్గించాడు. మంగయ్యకు తండ్రి మేథా దక్షిణామూర్తి మంత్రోపదేశం చేశాడు. మంగయ్య పర్లాకిమిడిలో పోలీస్ హెడ్ క్లర్క్‌గా కొద్దికాలం పనిచేశాడు. ఉద్యోగం వదిలేసి కురుపాం రాజు వీరభద్రరాజుకు కార్యదర్శిగా పనిచేశాడు. ఒక సిద్ధుడు మంగయ్యకు శ్రీ స్వప్నాంజనేయ, శ్రీవీర దక్షిణామూర్తి మంత్రాలను నేర్పి, మంగయ్య పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలియజేశాడు.

**స్కూల్ మేష్టారు మంగయ్య**

భార్య పిల్లల్ని మామగారింట్లో వదిలేసి మంగయ్య మద్రాస్ వెళ్ళి ఎల్.టి.ట్రెయినింగ్ (ఉపాధ్యాయ శిక్షణ)లో చేరాడు. మంగయ్య రాసిన ఇంగ్లీష్ రచనలు చూసి అతని ప్రతిభకు సంమోహితుడై ఈరాక్ ద్రు అనే ఆంగ్ల దొర గుండెలు బాదుకొన్నాడు. తర్వాత నిజాం రాష్ట్ర విద్యాశాఖలో ఉపాధ్యాయుడిగా చేరి పనిచేశాడు. ప్రభుత్వం మంగయ్య ప్రతిభను గుర్తించి బి.ఎడ్.జిల్లా కేంద్ర ఉన్నత విద్యాలయానికి హెడ్‌మాస్టర్‌గా నియమించింది.

**శ్రీకృష్ణ సాక్షాత్కారం- మహిమా ప్రదర్శన**

మంగయ్య నిజామాబాద్‌లో ఉన్నప్పుడు గొల్లాపిన్ని మల్లిఖార్జునశాస్త్రి గారు వచ్చి ఈయన వద్ద సమాధిభేదాలు నేర్చుకొన్నారు. మంగయ్య ఋగ్వేద, యజుర్వేదాలను గురుముఖతా అభ్యసించారు. రామస్వామి అయ్యర్ వాసుదేవ తత్త్వం ఉపదేశించారు. దీనివలన మంగయ్యగారికి శ్రీకృష్ణ సాక్షాత్కారం కలిగింది.

హైదరాబాద్ గౌలిగూడాలో కాపురమున్నారు. ఇద్దరు స్నేహితులకు వేర్వేరు చోట్ల ఒకేసారి కనిపించి ఆశ్చర్యపరచారు. హరిహత్ దంపతులు శివజపం చేస్తుంటే అనుకోకుండా ప్రత్యక్షమై మంగయ్యగారు రుద్రాభిషేకం చేసి మైమరపించారు. శిష్యుడు ఒకడికి మంగయ్యగారు అగ్ని జ్వాలల మధ్య కనిపించారు. భయపడి వాడు పారిపోతుంటే మళ్ళీ యధాస్థితికి వచ్చారు. పశు సంవర్ధక శాఖలో పనిచేసే హనుమంతరావుకు ఒక శివలింగం ఇచ్చి ఆ తర్వాత వరుసగా పదకొండు లింగాలి ఇచ్చారు. గృహస్తాశ్రమ జీవనం గడుపుతున్నా మంగయ్యగారు శ్రీరామ శ్రీకృష్ణులులాగా బ్రహ్మచారులే. విదేశీ డాక్టర్లు ఈ విషయంపై పరిశోధన చేసి నిర్ధారించారు.

**వశ్య వాక్కు మంగయ్య**

మంగయ్యగారు పెద్ద కుమారుడి వివాహముహూర్తాన్ని తానే నిర్ణయించి శ్రీకాకుళం జిల్లా రామతీర్థం దేవాలయంలో పెండ్లి చేయాలని నిశ్చయించారు. కాని అక్కడ పంచాంగకర్తలు, పండితులు ఈ ముహూర్తానికి కేతు, కుజ వేధలు ఉన్నాయని, ఆ పెళ్ళి జరగదని చెప్పారు. ఖచ్చితంగా పెళ్ళి జరుగుతుందని మంగయ్యగారు వాదించారు. పెళ్ళికొడుకుని రామాలయానికి తీసుకొని వెళ్ళారు. పీటలమీద వధూవరులను కూర్చోబెట్టారు. ముహూర్తం కోసం పండితులు జుట్టుపీక్కుంటూ గడియారాలను తదేకంగా చూస్తూ ఉండిపోయారు. ఒకళ్ళ టైం నాలుగు అని, ఒకళ్ళ గడియారం ఏడు అని, మరొకరిది ఆగిపోయిందనీ చెప్పారు. మంగయ్యగారు ఇదేరా బాబూ కుజ వేధ అంటే అని చెప్పి అక్షింతలు తాను తీసుకొని, అందరికీ ఇప్పించి అందరిచేత అక్షింతలు వేయించి తాను పెట్టిన శుభలగ్నానికే కుమారుని వివాహం జరిపించారు. ఇప్పుడు మీ గడియారాలు చూసుకోండి అన్నారు మంగయ్య. అందరి గడియారాలు మంగయ్యగారు పెట్టిన ముహూర్త సమయాన్నే చూపించాయి. అందరూ ముక్కుమీద వేలేసుకొన్నారు. దట్ ఈజ్ మంగయ్య వశ్య వాక్కు మంగయ్య అయ్యారు. మంగయ్యగారి మహాశక్తికి ఆ అఘటన ఘటనా సామార్థ్యానికి నివ్వెరపోయారందరూ.

**మరిన్ని మంగయ్యగారి మహిమలు**

దేవీదాసు అనే వాడికి ఏ.బి.సి.డి.లు కూడా రావు. వాడితో కొన్ని గంటలసేపు ఇంగ్లీష్‌లో గంభీరమైన ఉపన్యాసం ఇప్పించారు మంగయ్యగారు. తనకు షోడశీ మంత్రాన్ని దేవుజీ మహారాజు గారే వచ్చి ఇస్తారని మంగయ్యగారు ముందే చెప్పారు. అందరూ గణం జయ మహారాజుతో ఇప్పించే ఏర్పాట్లు చేవారు. సమయానికి గణం జయుడు రాలేదు. దేవుజీయే వచ్చి మంత్రం దీక్ష నిచ్చారు. మంగయ్యగారి సంకల్పబలం అంత అమోఘమైనది.

**మంగయ్యగారి విద్యా వైదుష్యం- గీర్వాణ రచన**

మంగయ్యగారి విద్యా వైదుష్యం నిరుపమానమైనది. ఆంగ్లంలో అయిదు పద్యకావ్యాలు రాశారు. పదహారు ఆధ్యాత్మిక గ్రంథాలు రచించారు. సంస్కృతంలో కామ ప్రబంధం, దక్షిణ గీత సౌభాగ్య రత్నాకరం, అద్వైత పారిజాతం, వ్యావహారిక దర్పణం వంటి అలౌకిక గ్రంథాలనెన్నిటినో రాశారు. సంస్కృతంలో స్తుతి స్తోత్ర రచనా చేశారు. ధర్మాష్టకం వంటి అష్టకాలూ రాశారు.

**కాలచక్ర గమనాన్ని ప్రత్యక్షంగా దర్శింపజేసిన మహాత్ముడు మంగయ్యగారు**

ఒక శిష్యుడు కాలచక్ర గమనాన్ని ప్రత్యక్షంగా చూడాలని ఉందని మంగయ్యగారిని వేడుకొంటే అతనికి కాలచక్ర గమనాన్ని ప్రత్యక్షంగా చూపించారు. గంలకు వెయ్యిసార్లు వైఖరీ వాక్కుతో జరిపించే మంత్రాన్ని మంగయ్యగారు పశ్యన్తీ వాక్కుతో, మనోవేగంతో ఒకే నిమిషంలో చేసేవారు. ఒకసారి హైదరాబాద్‌లో తన మేడ మెట్లు దిగి కిందికి వస్తుంటే ఒక కుక్క వచ్చింది. దానికి ఆసనం వేయించి కూర్చోబెట్టి, అది తన భాషలో తన జన్మ వృత్తాంతాన్ని చెబుతుంటే వెంకయ్యగారు వైఖరీ వాక్కులో అనువాదం చేసి జగన్నాయకులు అనే ఆయనతో రాయించారు. అంటే మంగయ్యగారికి సమస్త జీవరాశుల జన్మ వృత్తాంతాలు పూర్తిగా తెలుసు అని అర్థమౌతుంది మనకు.

**మంగయ్యగారి ప్రముఖ శిష్యులు** మంగయ్య గారికి జాతి మత భేదాలు లేకుండా

ఎందరో శిష్యులైనారు. వారిలో జర్మన్ విద్వాంసుడు స్వరఖకజ, నిజాం కాలేజీ ప్రిన్సిపాల్ బర్నెట్, విద్యా మంత్రి నవాబ్ ఆజం యార్ జంగ్, ఇంజనీరింగ్ మంత్రి మొహిదీ నవాబ్ జంగ్, గణితాచార్యుడు సయ్యద్ సిరజుల్ హసన్ మొదలైన ప్రముఖులెందరో ఉన్నారు.

**మంగయ్య గారి స్పెషాలిటీ**

మంగయ్య గారికి ఒక విచిత్రమైన అలవాటు ఒకటి ఉండేది. ఎప్పుడూ చేతిలో అక్షింతలు ఉంచుకొని, తన నెత్తిన తానే వేసుకొంటూ ఉండేవారు. నడుస్తున్న, కూర్చున్నా తమలో తాము మాట్లాడుకొంటూ ఉండేవారు. ఇవి సరమహంస లక్షణాలు. మంగయ్యగారు రాసిన ఒక ఇంగ్లీష్ పుస్తకానికి పీఠిక రాసిన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంవారు ఈ గ్రంథంలోని అభిప్రాయాలను గ్రహించటానికి 300 ఏళ్ళు పడుతుంది అని రాశారు. అంత క్లిష్టమైన లోతైన రచన అన్నమాట.

**మంగయ్యే దక్షిణామూర్తి పరమహంస స్వామి**

బాల బ్రహ్మచారి అని పేరు పొందిన చిన్మయానంద స్వామి మంగయ్య గారికి సన్యాస దీఃనిచ్చి దక్షిణామూర్తి పరమహంస స్వామి అని ఆశ్రమనామాన్ని ఇచ్చారు. స్వామి ధవళేశ్వరంలో ఆశ్రమం ఏర్పాటు చేసుకొన్నారు. ఎందుకోగాని అక్కడ మంచి ఫలితం రాలేదు. విశాఖపట్నం వెళ్ళి లలితాశ్రమం ఏర్పాటు చేసుకొని శ్రీ లలితాదేవిని ప్రతిష్టించారు. ఆ ప్రాంత లలితానగర్‌గా పేరు పొందింది.

**పరమహంస సిద్ధి**

దక్షిణామూర్తి పరమహంస స్వామి 1954లో 92వ ఏట సిద్ధి పొందారు. స్వామి ముఖ్య శిష్యులు వాల్వేకర్ ఆశ్రమాధికారి అయి అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేసి 1995లో సిద్ధి పొందారు. వీరిని గురువుగారు ప్రక్కనే సమాధి చేశారు. ఇప్పుడు ఈ లితాశ్రమాన్ని కుర్తాళం పీఠాధిపతి శ్రీ శివ చిదానంద భారతీ స్వామి (ప్రసాద రాయ కులపతి) 28-6- 1998లో దత్తత తీసుకొని శ్రీ రామానంద భారతీ స్వామి వారికి ఆశ్రమ బాధ్యతలు అప్పగించారు.❀

## 300. లావణ్య మావి నవలా రచయిత అప్పాశాస్త్రి (1873-1913)

**ప**ండిత వంశంలో కొల్హాపూర్‌లో రసవాదునికి కుమారుడుగా అప్పా శాస్త్రి పుట్టాడు. చిన్నప్పుడు విద్యలన్నీ ఔపోసన పట్టాడు. సంస్కృతిక చంద్రిక అనే పత్రికకు వ్యాసాలూ రాసేవాడు. తర్వాత సంపాదకుడయ్యాడు. సాధారణ అంశాలపై సంస్కృత వాదిని అనే శీర్షిక నిర్వహించి సంస్కృత భాష ఔన్నత్యాన్ని చాటి చెప్పాడు. విద్యా వాచస్పతి, విద్యాలంకార బిరుదులు పొందాడు. నలభై ఏళ్ళకే 1913లో తనువు చాలించాడు. కొన్ని నాటకాలపై విమర్శలు రాశాడు. ఆయన సంస్కృతంలో రాసిన లావణ్య మావి అనే నవలకు బంకించంద్ర చటర్జీ బెంగాలీలో అదే పేరుతో అనువదించాడు.❁

## 301. పండిత రాజ- కృష్ణమాచార్య (1874)

**సు**మారు 1874లో జన్మించిన కృష్ణమాచార్య శ్రీ వత్స గోత్రుడైన వేంకటేశుని కుమారుడు. చిన్నప్పుడే శాస్త్రాలన్నీ అధ్యయనం చేశాడు. వ్యాకరణం అభిమాన విషయం. సంస్కృత, తమిళ, మళయాళ భాషలలో అనర్గళంగా ప్రసంగించే నేర్పున్నవాడు. కొచ్చిన్‌లో మహారాజ పతాకాన్ని, పండిత రాజ బిరుదాన్ని అందుకొన్నాడు. తనకు సంస్కృతవచనంలో ఉన్న ప్రావీణ్యాన్ని క్లిష్టమైన చారిత్రిక అంశాలను సులభంగా చెప్పే విధానం కోసం ఉపయోగించాడు. సునిశిత మేధాశక్తి ఉన్నవాడు. నిత్య పరిశీలనాశీలి. పార్వతీ పరిణయం, ప్రియ దర్శిక, వామనుడి కావ్యాలంకార సూత్ర వృత్తి, వాసవ దత్త, మేఘ సందేశ రచనల కర్తృత్వం ఎవరిదో నిగ్గు తేల్చి చెప్పాడు. సంక్షిప్త కాదంబరి, హర చరిత్ర, వేమ భూపాల చరిత్రలను యువతకు అందుబాటులో తెచ్చాడు. వ్యాకరణ తర్క శాస్త్రాలపై పలు రచనలు చేవాడు. మహాకవి సుభాషిత, సుభాషిత శతకం, భర్తృహరి సుభాషిత శతకసంగ్రహం, ఆయన కృషియే ప్రస్తుతాంకూర విమర్శ, త్రిలుప్త కౌతుక, వృత్తి వార్తికలపై గొప్ప విమర్శలు రాశాడు. వాసవ దత్తపై రాసిన వ్యాఖ్య బహుధా ప్రశంసనీయంగా ఉన్నది. సుబంధు కవి మనసులోని అంతర్యాన్ని అద్భుతంగా ఆవిష్కరించాడు. సాహిత్య రత్న మంజూష ఎన్నో విషయాలపై సేకరింపబడిన అసామాన్య శ్లోక సముచ్చయం.❁

## 302. అనంతా చార్య (1874)

**రా**మానుజా చార్య అనుయాయులైన 'ముదుంబై నంబి' వంశంలో చివరివాడు అనంతాచార్య. 1874లో కంచిలోని ప్రతివాది భయంకర కుటుంబంలో జన్మించాడు. అన్ని శాస్త్రాలు నేర్చాడు ఆయన శిష్యులంతా దేశమంతా ఉన్నారు. వైష్ణవ మత వ్యాప్తి కోసం విస్తృతంగా పర్యటించాడు. దీనికోసం అనేక శాస్త్ర గ్రంథాలు రాసి ప్రచురించాడు. న్యాయ వేదాంత జర్నల్స్‌కు 'మంజుభాషిణి' అనే సాహిత్య పత్రికకు ఎడిటర్‌గా ఉన్నాడు. ఆయన రాసిన 'వాల్మీకి భావ దీపిక' రామాయణంలోని వేదాంత సారాన్నిసంపూర్ణంగా ఆవిష్కరించే గ్రంథం. జగన్నాథ ప్రసాద్ హిందీలో రాసిన నవలను సంస్కృతంలో 'సంసార చక్ర'గా రాశాడు.❋

## 303. వెన్నెలకంటి హనుమాయమ్మ (1875-1937)

**వె**న్నెలకంటి హనుమాయమ్మ వెలగపూడి వారి ఆడబడుచు. నెల్లూరులోని వెన్నెలకంటి నటేశన్‌ను వివాహమాడింది. కొద్దికాలానికే భర్త మరణించాడు. ఆమెకూడా 1937లో 62 ఏళ్ళకే చనిపోయింది. తన గురువు బ్రహ్మానంద సరస్వతిపై 'పాదుకా పూజనం' అనే 32 శ్లోకాల అష్టోత్తరనామావళి రాసింది. కొన్ని శ్లోకాలు-

'నిర్బీజాది సమాధి సంస్థితపాదం నీవార శూకోపమం - నిష్పాపం నిగమాంత వేద్య నిలయం నిర్లేపకం నిర్గుణం

నిర్ద్వంద్వం నిరుపద్రవాత్మక పదంనిర్వాణ దీపం నిజం - బ్రహ్మానంద సరస్వతీ గురు పదం మోక్షప్రదాం భజే'

రెండవ రచన- 'శ్రీ దత్త పూజా గీత కదంబం'లో దత్తాత్రేయ స్వామి పూజా విధానాన్నిపాటలతో శ్లోకాలతో వివరించింది. వివిధ రాగాలతో తాళాలతో అందులో 42 గేయాలున్నాయి. మధ్యమావతి రాగం జంప తాళంలో రచన-

'లాలీతి జగురమర లాలనాస్త్వాం దత్తా-నారదస్త్వేకదాశ్రీ బ్రహ్మ సదసి - లోహ చణాంకాభ్యాష పాక పరిశీలా - అత్రిజాయపతి వ్రతేతి ప్రససం'

1926లో 'శ్రీ శంకర భగవత్పాదాచార్య పూజా విధి' రచించింది. ఇందులో షోడషోపచార పూజా విధానం ఉన్నది. చివరికి శంకరాచార్యపై అస్టోత్తరం రాసింది. ధ్యాన శ్లోకం-

'భాష్యం వామకరే నిధాయ పరతిస్చిన్ముద్రయా బోధితం- ప్రాక్కుండీవరదండ శిష్య సహితం పద్మాసనస్తం ప్రభుం - ఫాలే భస్మధరం సుధాకర నిభం రుద్రాక్ష హారాన్ గలే-శ్రీమచ్చంకర పూజ్య పాదమనిశం ధ్యాయామ్యహం సద్గురుం'

ఇవి కాక అనేక దేవీ దేవతలపై స్తోత్రాలు రాసింది. 'మహా గ్రహ గాయత్రి'పై పుష్పమాలికా బంధం' రాసింది.

హంసస్తాం సత్య సందామ గజగ నిగమ దారతాస్వరస్తాం- గాయత్రీం యజ్ఞయజ్ఞాం సురనర వరదాం పంకజం కంబు కంఠీం

సావిత్రీం విశ్వ విద్యాం శ్రుతిమతి గతిదాం దేవా సౌవర్ణ వర్ణాంః-వందేహం దేవ దేవీం విమల మణి మయీాం కుంద సౌందర్య దంతం 'హనుమాయమ్మ బంధ కవిత్వంలోనూ నిష్ణాతురాలని ఈ శ్లోకం తెలియజేస్తోంది.❁

## 304. భారతదేశ గ్రంథాలయ ఉద్యమ పితామహుడు రాజా క్షితేంద్ర దేవ్ (1876)

బెంగాల్‌కు చెందిన బాన్స్ బెరియా రాజు రాయ్ మహాశయుడైన రాజా క్షితేంద్ర దేవుడు 1876లో జన్మించాడు. రాజా పురేంద్ర దేవ్‌కు పెద్ద కొడుకు. తల్లి సకలాదేవి. కాశ్యపస గోత్రం. బెంగాల్ ఉన్నత వర్గాలలో పేరు పొందినవాడు క్షితేంద్ర దేవ్. ఈ రాజులు సమాజ సేవలో ధన్యమైనారు. ఈ వంశంలో మొదటి వాడైన దేవాదిత్య హూలినిసం సిద్ధాంతంలో ప్రసిద్ధుడైన బల్లల దేవుని సమకాలికుడు. 1680లో పాతూలీ నుండి బన్స్ బెరియాకు రామేశ్వర్ దేవ్ రాజ పీఠాన్ని మార్చాడు. ఇతని ఆస్థానంలో గొప్ప విద్వాంసులు ఉండేవారు. సంస్కృతంలో నిష్ణాతులైన వారిని ఉపాధ్యాయులుగా నియమించి టోల్స్ అనబడే సంస్కృత కళాశాలను ఏర్పరచారు. బెంగాల్ ఉన్నత విద్యవంతుడు అయిన జగన్నాధ పంచావన్ మొదలైన వారు ఇతని మొదటి శిష్యులు. క్రిస్తేంద్ర తండ్రి అయిన పూర్ణేంద్రుడు అనేక సంస్కృత కళాశాలలను ఏర్పరచి ఆనాటి ప్రసిద్ధ ఆస్థాన కవులచేత కాళి అర్చన విధి అనీ కాళీదేవి పూజా విధానాన్ని రూపొందించాడు. సురేంద్ర మోహన దేవశర్మ, ధర్మాదిత్య, ధర్మాచార్యాలు ఈ రాజవంశ చరిత్రపై రాశారు. మొఘులాయి రాజులు కూడా వీరిని మెచ్చుకున్నారు.

క్షితేంద్ర దేవుడు రాజు మాత్రమే కాక గొప్ప కవి కూడా. లఘు కావ్యాలు చాలా రాశాడు. ఇతను అనేక గ్రంథాలయాలు స్థాపించటం చేత భారతదేశ గ్రంథాలయోద్యమ పితామహుడు అని బిరుదు పొందాడు. బెంగాలీ భాషలో మొదటి పత్రిక పూర్ణిమను నిర్వహించాడు. ఇతడు కాళీమాతకు మహా భక్తుడు. కలకత్తాలోని కాళీ ఘాట్లో అమ్మవారి ఆలయం దగ్గర నివసించేవాడు. బెంగాల్‌లో ప్రసిద్ధ శిల్పకళకు ప్రసిద్ధి చెందిన హంసేశ్వరీ దేవాలయాన్ని రాణీ శంకరీ 1814లో నిర్మించింది. ❀

## 305. సిద్ధాంత వాగీశ- హరిదాసు (1876)

**వి**ద్యాముఖి, గంగాధర విద్యాలంకారుల కుమారుడు హరిదాసు. 1876 జననం. పశ్చిమ బెంగాల్‌లోని ఫరీద్‌పూర్ జిల్లా కొత్వాలి పారాలోని ఉనాశియా నివాసి. కాశ్యప గోత్రం. ఈ గ్రామంలో ఒకప్పుడు బ్రాహ్మణులు లక్ష శివలింగాలను అర్చించారని చారిత్రిక కథనం. అందుకే దీనికి రెండవ కాశి అనే పేరొచ్చింది. గంగాధరుని తండ్రి కాశీచంద్ర వాచస్పతి యాదవానంద నయాచారంలో తొమ్మిదవ పీఠాధిపతి. వీరి పూర్వీకులలో ముఖ్యుడు మధుసూధన సరస్వతి అనే మహా విద్వాంసుడున్నాడు.

హరనాధుడు చిన్నప్పటి నుంచి చాలా నిష్టగా జీవించాడు. పదమూడవ ఏటనే సంస్కంత సాహిత్యంలో అమోఘ పండితుడని పించుకొన్నాడు. పద్నాలుగవ ఏట కంసవధ అనే నాటకాన్ని, కంసవధ చంపును రాశాడు. పదహారవ ఏట శంకర సంభవం అనే అయిదు కాండల కావ్యం రాసేశాడు. వయసు పద్ధెనిమిదిలో జానకీ విక్రమం, ఇరవై ఏట వియోగ వైభవం కావ్యం సంతరించాడు.

హరిదాసు జీవానంద విద్యాసాగరుని శిష్యుడు. విరాజ సరోజిని, వంగీయ ప్రతాపం కావ్య రచన చేశాడు. రుక్మిణీ హరణంతో బాటు శృంగార కావ్యంగా సరళ రాశాడు. నాకీపూర్ జమీందార్ గారి టోల్ కాలేజీలో సంస్కృత పొఫ్రెసర్‌గా ఉన్నాడు. మహాభారతాన్ని బెంగాలీ భాషలోకి అనువదించే కార్యక్రమంలో ఎడిటర్‌గా పని చేశాడు. ఇందులో ఈయన కృషి చిరస్మరణీయం అని బెంగాలీ ప్రజల ప్రగాఢ విశ్వాసం. ఆదిపర్వం వనపర్వంలో కొంతభాగం ముద్రింపబడ్డాయి. ఇతనికి ఉన్న సిద్ధాంత వాగీశ బిరుదు సర్వదా సమర్ధనీయం.❁



## 306. శతాధిక గ్రంథకర్త, హయగ్రీవోపాసకులు బెల్లంకొండ రామరాయ కవి (1876-1914)

వైష్ణవ సంప్రదాయంలో జన్మించి అద్వైతాన్ని ఆలింగనం చేసుకొని దాని లోతులను తరచిన మహా కవి, విమర్శకులు శ్రీ బెల్లంకొండ రామ రాయ కవి. గుంటూరు జిల్లా నరసరావుపేట దగ్గర పమిడిపాడులో నియోగికులంలో సంపన్న గృహస్తు ఇంట రామరాయ కవి 1876లో జన్మించారు. భారద్వాజ గోత్రీకులు. ఆశ్వలాయ సూత్రులు, రుక్ శాఖకు చెందినవారు. చిన్నతనంలోనే పితృ వియోగం కలిగింది.

### స్వయంకృషితో విద్య- పిన్న వయసులోనే రచనా వ్యాసంగం

స్కూలులో చేరి మొదట కొంతకాలం ఇంగ్లీష్ విద్య నేర్చుకొన్నారు. అది మానేసి సంస్కృతం అభ్యసించారు. హయగ్రీవ ఉపాసకులై విశిష్టాద్వైత మతానికి మారారు. చిన్నతనం నుండి సంస్కృతంలో కవిత్వం రాయటం అలవడింది. సంస్కృత పాండిత్యమూ అప్పటికి గొప్పదేమీకాదు. కాళిదాసు రాసిన రఘువంశం, కుమార సంభవంలలో రెండేసి సర్గలు మాత్రమే నేర్చుకొన్నారు. మేఘ దూతం చదవటం మొదలుపెట్టి పూర్తిగా చదవకుండా అంతా విన్నారు. సంస్కంత జ్ఞానం బాగా ఏర్పడింది. తర్వాత అన్నిటిని స్వయంగా అభ్యసించారు. 14వ యేట రుక్మిణీ పరిణయం, రమా పరిణయం అనే చంపూ కావ్యాలు రాశారు. నెల్లూరుకు చెందిన సింగరాజు వెంకట రమణమ్మగారి రెండవ కుమార్తె ఆది లక్ష్మమ్మ గారిని

రామ రాయకవి వివాహం చేసుకొన్నారు.

**అంతర్ముఖత్వం- హయగ్రీవ ఉపాసన**

కంఠంలోతు నీటిలో నిలబడి హయగ్రీవ మంత్రిన్ని అనుష్టానం చేసేవారు. చింతతోటలోకి చేరి అరుగుమీద కూర్చుని ఉపాసన చేసేవారు. ఇంటిలో హయగ్రీవార్చన నిత్యకృత్యంగా చేసేవారు. చదువుమీద శ్రద్ధ ఉన్న విద్యార్థులకు తన ఇంట్లోనే ఆహార వసతులను కలిపించి సాహిత్యలంకార శాస్త్రాలను బోధించేవారు. పురిఘళ్ళ రామశాస్త్రి సుబ్రహ్మణ్య శాస్త్రి సోదరుల వద్ద తర్కాన్ని వ్యాకరణాన్ని నేర్చారు. వ్యాఖ్యా వ్యాకరణాలను స్వయంగా నేర్చారు.

**ద్వైతి శంకరాద్వైతిగా మారటం-**

సిద్ధాంత కౌముదిపై శరద్రాత్రి అనే వ్యాఖ్యానం రాశారు. అనునిత్యం వేదాంత గ్రంథ పఠనం చేసి అద్వైత వేదాంతాన్ని మొత్తంగా స్వయంగా ఆకళించుకొని నిష్ణాతులయ్యారు. అప్పటిదాకా ఉన్న విశిష్టాద్వైత మతాభిమానం తొలగించుకొని పూర్తిగా అఐద్వత అయ్యారు రామరాయకవి. వంశపారం పర్యంగా వచ్చిన ద్వైతాన్ని విసర్జించి ఆ గురువులకు దూరమైపోయి అద్వైతానికి అంకితమయ్యారు. శంకర వేదాంత గ్రంథాలను బోధించారు. జీవితకాలంలో రామరాయకవి 143 గ్రంథాలు రచించిన బహుగ్రంథకర్త. తానే స్వయంగా కొన్ని గ్రంథాలను ముద్రించారు. ఇంత చిన్న వయసులో ఇన్ని ఉద్గ్రంథాలు రాసిన వారువ్వరూ లేరు. వీరికి వీరే సాటిగా నిలిచారు.

**రామరాయ కవితా యశోభూషణం**

రామరాయ కవి రాసిన వాటిలో సోత్రగ్రంథాలు, శతకాలు అనేకం ఉన్నాయి. అందులో అష్టకాలు, స్తోత్రాలు కలిసి 68 ఉన్నాయి. వీటన్నిటిలో శాంకరాద్వైతాన్నే ప్రతిపాదించారు. కవిగారు ఇందులో హకారాది హయగ్రీవ సహస్ర నామావళి చాలా ప్రాచుర్యం పొందింది. శంకర భగవత్పాదులు రాసిన

గీతాభాష్యంకు వ్యాఖ్య రాశారు. శంకర భాష్య టీకాగా గీతా భాష్యార్థ ప్రకాశిక, దశోపనిషత్తులకు వేదాంత ముక్తావళి, అద్వైతంపై శంకరా శంకర భాష్య విమర్శ స్వామి మధుసూదన సరస్వతి రాసిన గ్రంథానికి సిద్ధాంత సింధువు వ్యాఖ్య. అద్వైత తత్వాన్ని ప్రతిపాదిస్తూ వేదాంత కౌస్తుభము రాశారు. అద్వైతాన్య మత ఖండనం, కౌముదికి వ్యాఖ్యగా శరద్రాత్రి, చంపూ భాగవత వ్యాఖ్య మురారి రాసిన అనర్ఘ రాఘవ నాటకానికి వ్యాఖ్య, సముద్ర మధన చంపూ కావ్యం శ్రీకృష్ణ లీలా తరంగిణి కావ్యం రాశారు. రామరాయ కవి గ్రంథ రచనను ఒక మహా తపస్సుగా చేశారు. అద్భుత ధారా శుద్ధ శబ్ద శుద్ధి రామరాయ కవిగారి ప్రత్యేకత.

అంతర్ముఖుడైన సమావిస్టుడైన యోగిగా రామరాయ కవిని లోకం గుర్తించి కీర్తించింది. హయగ్రీవ ఉపాసకులకు అసాధ్యమేదీ లేదని నిరూపించిన సిద్ధయోగిపుగంవులు శ్రీ బెల్లంకొండ రామరాయకవి. కేవలం 39 సంవత్సరాలు మాత్రమే జీవించి శతాధిక గ్రంథ రచన చేసి 1914లో ముక్తిని పొందారు.❀

## 307. చంద్రమౌళి నవలా రచయిత- రాజమ్మ (1877)

1877 రాజమ్మ కవయిత్రి బెంగుళూరులో జన్మించింది. మైసూర్‌ను పాలించిన టిప్పుసుల్తాన్ ఆస్థాన మంత్రి ప్రధాని గోపాలయ్య వంశానికి చెందినది. గంగాధరయ్య రామలక్ష్మి జననీ జనకులు. మైసూర్ న్యాయవాది సాంబశివ అయ్యర్‌ను పెళ్ళాడింది. మద్రాస్ విల్లింగ్టన్ కాలేజీలో సంస్కృత పండితురాలు. సాంఘిక దురన్యాయాలపై చంద్రమౌళి నవల రాసింది.❀



## 308. భారతీయ ఇతివృత్తం రాసిన రామావతార శర్మ (1878- 1929)

దేవనారాణ పాండ్య, గోవిందదేవిల కుమారుడు రామావతార శర్మ. ఉత్తరప్రదేశ్‌లోని చాప్రాలో 1878లో జన్మించి 51 ఏళ్ళకే 1929లో చనిపోయారు. పదిహేనేళ్ళ వయస్సులోనే కావ్య తీర్థ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. అప్పుడే ధీర నైషధం రాశాడు. భారద్వాజస గోత్రం. బెనారస్‌లో చదివి సాహిత్యాచార్య పూర్తి చేశాడు. అక్కడి హిందూ కాలేజీలో ప్రొఫెసర్ అయ్యాడు. తర్వాత పాట్నా కాలేజీలో ప్రొఫెసర్‌గా పని చేసాడు. సంస్కృత సాహిత్యంలో అపార అనుభవమున్నవాడు. సాహిత్య, చారిత్రకాంశీలపై అనేక అపురూప గ్రంథాలను రచించాడు. దర్శనాలపై మహా భాష్యాలు రాసాడు. మారుతీ దండకం, ముద్గర గీత, హర్ష నైషధం అనే నాటకాలు రాసాడు. ఆయన రాసిన భారతీయ ఇతివృత్తం అనుస్టుప్ ఛందస్సులో రాసిన భారతదేశ చరిత్ర. ఇదివరకెవ్వరూ రాయనిది. ఇది కాశ్మీర్ రాజతరంగిణిని గుర్తు చేస్తుంది. ప్రపంచ చరిత్రలో ఇది చాల చిన్నదైనప్పటికీ ప్రఖ్యాతమైనది. ఆయన ఇది ప్రచురించి ఉంటే మహా భారతమంత గొప్ప గ్రంథం అయ్యి ఉండేది. విశ్వకోశం అనే బృహత్తర నిఘంటువును శర్మ నిర్మించారు. భారత తొలి రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ రామావతార శర్మ శిష్యుడు. శర్మ మరణం తర్వాత రాజేంద్రప్రసాద్ చొరవ తీసుకొని గురువు గారి గ్రంథాలను ముద్రించే ఏర్పాటు చేశారు.

ఒకసారి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ బెనారస్ విశ్వ విద్యాలయానికి వస్తే అధ్యాపకులందరూ డ్రెస్ నిబంధనలను పాటించాలని మాలవ్యా హెచ్చరించాడు.

శర్మగారు మామూలు పంచ లాల్చీతో వరండాలో నిలబడ్డాడు. మాలవ్యా చూసి తిట్టాడు. మర్నాడు వస్తే సంజాయిషీ కోరాడు. తన డ్రెస్ అక్కడ పడేసి మీరు జీతం ఇచ్చేది నా బోధనకు కాని డ్రెస్‌కు కాదు అని చెప్పి వెళ్ళిపోయాడు. తప్పు తెలుసుకొన్న మాలవ్యా సారీ చెప్పాడు శర్మకు.

శర్మ సంస్కృత, పాళీ భాషలలో గ్రంథాలు రచించాడు. ఎనిమిది ఉద్గ్రంథాలు సంస్కృత పాళీ భాషలలోను అయిదు గ్రంథాలు ఇంగ్లీషులోను, ఏడు గ్రంథాలు హిందీలో రాసిన మహా రచయిత, కవి రామావతార్ శర్మ.

## 309. గద్య భారత చరిత్రకర్త విదు శేఖర భట్టాచార్య (1879)

త్రైలోక్య నాధుని కుమారుడైన విదు శేఖరుడు బెంగాల్‌లో మాల్దా జిల్లాలో హరిశ్చంద్రపురంలో 1879లో జన్మించాడు. శాంతినికేతన్‌లో కొంతకాలం చదివి కలకత్తా వర్సిటీలో సంస్కృతాచార్యులుగా పని చేసేవాడు. అతని విద్వత్తుకు అనేక గౌరవాలు, బిరుదులూ పొందాడు. ఆయన రాసిన మిలింద ప్రశ్న కావ్యాన్ని ఆయన నోట వింటుంటే లోకాన్ని మరచిపోతాము. మాతృ ఘోషి అనే జర్నల్‌ను నడిపాడు. సంక్షిప్త చంద్రిక పత్రికలో అనేక పద్యాలు. పాటలు రాశాడు. వివిధ పత్రికలలో సంస్కృత రచనలపై వచనాలు చేశాడు. నాగిలా, బద్ధ విహంగ, క్షత్ర కథ- (బుద్ధ కథలు), భారత చరిత్ర అనే గ్రంథాలు రాశాడు. కాళీదేవిని స్తుతిస్తూ దుర్గా సప్త శతి రాసాడు.

## 310. కావ్య వ్యాకరణ తీర్థ– హరిచరణ భట్టాచార్య (1879)

**హ**రిచరణ భట్టాచార్య 1879లో తూర్పు బెంగాల్లోని విక్రంపూర్ జిల్లా కనుర్గావ్‌లో 1879లో బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. కలకత్తా మెట్రోపాలిటన్ కాలేజీలో సంస్కృత ఆచార్యుడు. కపాల కుండల సంస్కృత నవలను బంకించంద్రుని బెంగాలీ నవల ఆధారంగా రాశాడు. కర్ణధార, రూప సునిర్ఝర కావ్య రచన చేశాడు. జూన్ ఫిట్టరాల్డ్ ఇంగ్లీష్‌లో రాసిన ఉమర్ ఖయ్యాంను 75 సంస్కృత శార్దూల శ్లోకాలలో రచించి మంచి కీర్తి పొందాడు. మెట్రోపాలిటన్ కళాశాలను ఈశ్వర చంద్ర విద్యా సాగరుడు స్థాపించాడు. కావ్య వ్యాకరణ తీర్థ, విద్యారత్న బిరుదులూ భట్టాచార్య ప్రతిభకు అలంకారాలు.❁

## 311. వడ్లమాని లక్ష్మీ నరసింహ శాస్త్రి (1880)

**వ**డ్లమాని సూరాంబ, కృష్ణల కుమారుడే లక్ష్మీ నరసింహ శాస్త్రి. గోదావరిజిల్లా చోడవరంలో ప్రభుత్వ ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడు .దేవిడి సంస్థానంలో కందుకూరి బాల సూర్యారావు బహద్దర్ ఆస్థాన కవి. స్నేహితుడు బంధువు సోమనాథ శాస్త్రి ప్రేరణ చేత 'చెన్నపురి రాజధాని ధూమ శకట తీర్థ యాత్ర చరిత్రం' అనే యాత్రా సాహిత్యాన్ని సంస్కృతంలో రాశాడు. మద్రాస్ ప్రెసిడెన్సిలో కవి చేసిన రైలు యాత్రా విశేషాలన్నీ గుది గుచ్చాడు. ఇందులో 280 శ్లోకాలున్నాయి. అందులో 17 తన ఇష్టదేవత శ్యామలాంబ మీద, గురువులపైనా రాశాడు. మిగతాదంతా రైలుయాత్రా సాహిత్యమే. తన గురువులైన కిలాంబి రామానుజాచార్య, పరవస్తు రామానుజ స్వామి, గుడిమెల్ల వరదా చార్య, మహా మహోపాధ్యాయ తాతాసుబ్బరాయ శాస్త్రి వాదూల వెంకటరామ, భావనారాయణ, కోపెల్ల విశ్వనాధ, పేరి లక్ష్మీనారాయణ, నగుదూరు వెంకట శాస్త్రి, గంటి సూర్య నారాయణ శాస్త్రి, పేరివెంకట శాస్త్రి, అప్ప జోగన్న శాస్త్రి, ఆకొండి వెంకట రత్న శాస్త్రి గుమ్ములూరి సత్యనారాయణ గార్లను స్తుతించాడు. కవిని ఈ కావ్యం రాయమని సోమనాధుడు కోరాడని చెబుతూ–

'సుప్రాచ్యా విద్వద్గురూదోసి జాతు దేవాది సంస్థాన సు పండితోస్మి – ప్రతస్తివాన్
తద్విభునా కదాచిత్ సమస్త తీర్థాటనమాప్యకార్షాః
త్వత్తీర్థ యాత్రా చరితం సమస్తం గీర్వాణ భాషా మవలంబ్య సాదు – నానావిధై
వృత్తవరేస్సుబద్ధం సమస్త సంస్థాన చరిత్ర యుక్తం
భూగోళ శాస్త్రాన్విత దేశ వృత్తం వ్రుత్తాంతం పూర్వ కవీశ్వరాణాం – సర్వం స్వభావోక్తి

యుక్తం సురమ్యం గ్రంధం కురుష్వేతి చ మామవాదీత్'

ఈ రైలు యాత్రను తన రాజు బాలసూర్యారావు బహద్దర్ తో కలిసి మద్రాస్ ప్రెసిడెన్సి మైసూర్ రాజ్యం నిజాం రాజ్యం సందర్శించారు. యాత్ర 1924లో దేవిడిలో ఎడ్లబండ్ల మీద ప్రారంభమై ఉర్లాం స్టేషన్‌కు చేరి, అక్కడినుండి ఈ విధంగా సాగింది.

'కల్లోల్లోలసితం సుసంక్రమ యుతాంతాం వంశ ధారానదీం – తీర్త్వా వాయు జవేన ధూమ శకటోగత్వా సుందరం తతః

తచ్చీకాకుల మార్గ ధూమ శకటాస్థానం తృతీత్య ధ్వనన్ – ప్రావి క్ష ద్బలరామ లాంగల కృతాంనాగావళీ సంన్నిధిం'

దారిలో పొందూరు, విజయనగరం, రాజమండ్రి, నెల్లూరు, బెంగుళూరు శ్రీరంగపట్నం, మైసూర్, మదురై, కంచి, వరంగల్‌లను చూస్తూ ప్రయాణం సాగింది. వరంగల్ శిధిలావస్తను కవి కళ్ళకు కట్టించాడు.

'అహో దుర్గామిదంసుజీర్ణ మభవత్ శ్రీ వీర రుద్ర ప్రభో – ప్రాసాదాస్సకలా నిపత్య వసుధా భాగే నిమగ్న భ్రుశం

ద్రష్టవ్యాని చ తోరణాని సుశిలా బద్వాన్య ఖండాన్యహో – దుర్గేస్మిన్ కిల భాంతి పశ్యయత నిరాలంబాని సప్రేక్షకాః'

అని మహోన్నత కాకతీయ వైభవం పతనమైనందుకు కలత చెందాడు. రైలు యాత్రా బృందం మళ్ళీ దేవిడీ చేరింది. చివరగా–

'కృష్ణారయో జనకః సహోదర వరో రామాహ్వాయాశ్వా బ్ధికః –సూరామ్బా జననీ ప్రసిద్వాలసితా శ్రీ శ్యామలామ్బా స్వసా

శ్రీమద్వేంకటనారసింహ మహిళా భార్యా కవేర్యస్య తత్ – శ్రీ లక్ష్మి నరసింహ శాస్త్రి రచితా సంపూర్ణ మగాత్ర్కుతిః

ఈ కావ్యం సంస్కృత చరిత్రలో ఏకైక సమకాలీన యాత్రా సాహిత్యంగా నిలిచి పోయింది. ❁

## 312. విశ్వదాత కర్త-శ్రీ వాసా సూర్యనారాయణ శాస్త్రి (1882)

1882లో శ్రీకాకుళం జిల్లా నరసన్నపేలో జన్మించిన శ్రీ వాసా సూర్యనారాయణ శాస్త్రి పర్లాకిమిడి సంస్థాన ఆస్థాన పండితులు. కవి శిరోమణి. వీరి సంస్కృత రచనలు దేశ భక్తీ ప్రబోధకాలు. తిలక్‌పై 'లోకమాన్య చరితం' కావ్యం రాశారు. ఇందులో తిలక్ గారు శివాజీ చరిత్రతో స్ఫూర్తి పొందినట్లు రాశారు. స్వాతంత్ర్య సమరస్ఫూర్తి నింపే కావ్యం ఇది. ఒక శ్లోకం– కారాగార ప్రవాసాది దండోవాప్రాణ విప్లవః – భవతీశ్వర సంకల్పాన్నా స్థానః పంచ భౌతికే– యశశ్శరీర మాచంద్ర తారకం జీయాదకల్మషం–వయమేవాను భోక్ష్యామః స్వరాజ్య ఫల మూర్జితం – అధవా నస్సంతతతిర్వా ఫలభాగ్ వృద్ధి మేష్యతి– షట్త్ర్యయం షట్కోటి సమ్యాక్తైహ్ భారతీయ సహొదరైః

శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు గారి చరిత్రను 'విశ్వదాతా' కావ్యంగా గీర్వాణంలో రాశారు. ❀

## 313. భామినీ విలాస కర్త – గురూపాసనా భట్టాచార్య (1882)

1882 లో రాకాలీ దాస భట్టాచార్య, క్రుష్ణసఖీ దేవి దంపతులకు జన్మించాడు. మౌద్గల్య గోత్రానికి చెందిన బెంగాలీ భాహ్మణుడు. కాశీ రామ వాచస్పతికి వారసుడు. స్మ్రుతులపై సాధికారత కలవాడు. విద్యకు కేంద్రమైన భాత్ పారా చదివి కలకత్తా విశ్వవిద్యాలయంలో, బెనారస్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకునిగా చేసి 1921 నుండి ఢక్క యౌనివర్సిటీలో సంస్కృత ఆచార్యునిగా పని చేసాడు. బహు గ్రంథకర్త. "శ్రీ రాస మహా కావ్యం", "మధురం", "వరూధినీ చంపు" రాసాడు. ఆరు అంకాల "నా భాగ చరిత్ర" నాటకం, ఏడు అంకాల 'మదాలస కువలయాస్వ' నాటకం, ఆరు అంకాల "భామినీ విలాసం" నాటకం రచించాడు. వీటిల్లోని కవిత్వం పరమోన్నతంగా, ప్రాశస్త్యంగా ఉంటుంది. ❀

## 314. రాజ గోపాల చక్రవర్తి (1882)

**త**ండ్రి గీతాచార్యుడు మైసూర్ సంస్కృత కళాశాలలో మీమాంస ప్రొఫెసర్. చక్రవర్తి 1882లో జన్మించాడు. వంశానుగతంగా కవిత్వం, పాండిత్యం అబ్బి అనేక రాజాస్థానాలు సందర్శించి బిరుదులూ సన్మానాలు అందుకొన్నాడు. 1922లో బెంగుళూరు సెంట్రల్ కాలేజి సంస్కృత విభాగ అధిపతి అయ్యాడు. 'శైవలిని", 'కుముదిని' అనే శృంగార కావ్యాలను రాసి మంచి పేరు సంపాదించుకొన్నాడు. 'విలాసకుమారి, 'సంగర' వచన రచనలూ చేశాడు. డెల్ఫీలోని ఆరకిల్ ఆధారంగా 'త్రిపోద్' కావ్యం రాశాడు. 'పద్య హర్ష చరిత్ర', 'గంగా తరంగం', 'మధుకర దూత', 'వియోగి విలాపం' రాశాడు. భారత దేశ యాత్రా సాహిత్యంగా 'తీర్థాటనం' కావ్యాన్ని నాలుగు అధ్యాయాలలో రచించాడు. అతని 'కవి కావ్య విచారం సాహిత్య చరిత్రతో బాటు, విమర్శన చరిత్ర కూడా ఉన్న సృజనాత్మక గ్రంథం. అత్యాధునిక చారిత్రిక విషయాలనూ పొందుపరచాడు. 1934లో మరణించాడు.❋

## 315. శ్రీ గొర్తి సూర్యనారాయణ శాస్త్రి (1882 -1945)

**శ్రీ**కాకుళంలో జన్మించిన శాస్త్రి గారు మహారాజా కాలేజి ఉపాధ్యాయులుగా పని చేశారు. 'గజపతి స్తవ రాజం, వీశమయూధ విజయ భాణం' సంస్కృతంలో రాశారు.❋

## 316. శ్రీ వాసా సూర్యనారాయణ శాస్త్రి (1882-1961)

**చీ**పురుపల్లిలో పుట్టిన వాసావారు సంస్కృత గ్రంథాలు చాలా రాశారు. అందులో 'కపాలేశ్వర విభూతి', శ్రీనివాస విభూతి, ముకుందమాల, లోకమాన్య బాల గంగాధర తిలక్ చరిత్ర' రాశారు.❀



## 317. మందారవతి రాసిన - కపిస్థలం కృష్ణమాచార్య (1883-1933)

**తి**రుపతికి చెందిన కౌశిక గోత్రీకుడు రంగాచార్య కుమారుడు కృష్ణమాచార్య. 1883లో జన్మించాడు. చిన్ననాటి నుంచే కవిత్వం అల్లేవాడు. ఈయన చినతాత దేశికాచార్య వేదాంత, భాషా శాస్త్రాలలో ఉద్దండ పండితుడు. సంస్కృతంలో వివిధ విషయాలపై వ్యాసాలూ చాలా రాశాడు. 'విలాప తరంగిణి' భాణ రసార్నవ తరంగిణి కావ్యకర్త కూడా. 'మందారవతి' అనేది శృంగార రచన. ఇందు సభ్య శృంగారం విరగ బూసింది. మహాకావ్య లక్షణాలను ఆధునిక భావాలతో రంగరించి రాసిన కావ్యం ఇది. 1933లో మరణించాడు.

ఈయన తండ్రి రంగాచార్య గొప్ప పండితుడు. 'అలంకార సార సంగ్రహం' రాశాడు. సుభాషిత శతకం, 'శృంగార నాయికా తిలకం' 'పాదుకా సహస్రారావతార కథా సంగ్రహం' కూడా రాశాడు. గోదాదేవిపై 'చూర్నిక' రచించాడు. 'రహస్యత్రయ సారా రత్నావళి, సన్మతి కల్ప లతలు వేదాంత ధోరణిలో రాశాడు.❀

## 318. లిపి శాస్త్రజ్ఞుడు విజయ రాఘవాచార్య (1884)

**కౌ**ండిన్య గోత్రానికి చెందిన వరదరాయ కుమారుడు విజయ రాఘవాచార్య తమిళనాడులోని కంచి దగ్గర మయూర్ గ్రామంలో 1884లో జన్మించాడు. కంచిలో చదివి అలంకార, సాహిత్య శాస్త్రాలలో ఉన్నత శ్రేణి విద్వాంసుడయ్యాడు. లిపి శాస్త్రి (ఎపిగ్రఫి)లో ప్రత్యేక శిక్షణ పొంది తిరుపతి వెంకటేశ్వర దేవస్థానంలో ఎపిగ్రఫిస్ట్‌ల పనిచేసాడు. అనేక సంస్కృత గ్రంథాలు రాసాడు. అందులో చిత్రకూటం అనే నాటకం శ్రీనివాస బాలాజీపై వైభవ విలాసం వేదాంత దేవికులపై ఘంటావతారం గురుపరంపర ప్రభావం నీతి నవరత్నమాల, అభినవ హితోపదేశం, కవనేందు మండలి, వాసంతవ సార, దాన ప్రశంశ దివ్యక్షేత్ర యాత్రా మహాత్మ్యం, ఆత్మ సమర్పణం, నవగ్రహ స్తోత్రం, దశావతార స్తవం, లక్ష్మీ స్తుతి మొదలైనవి చాలా ప్రసిద్ధమైనవి. ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, జయలక్ష్మి, గృహలక్ష్మి అనే పంచ లక్ష్మీదేవిలపై ఒకొక్కరిపై రెండు వందల శ్లోకాల వంతున ఐదు రాసాడు. వీటికే పంచలక్ష్మీ విలాసం అని పేరు. సురభి సందేశంలో ఆధునిక మహా నగరాల వర్ణన చేసాడు. గాంధీ మహాత్మ్యం తిలక వైదుష్యం, నెహ్రు విజయం మొదలయినవి ఆధునిక భారత నాయకులపై రాసిన గొప్ప గ్రంథాలు. అలాగే బాలగంగాధర తిలక్, మోతిలాల్ నెహ్రులపై కూడా రాసాడు.❋

## 319. శ్రీ కోవి కందాలై రంగాచార్య (1885 -1967)

**వ**రంగల్‌లో ఉండి వందలాది విద్యార్థులకు వసతి భోజనం కల్పించి, సంస్కృతం బోధించిన రంగాచార్య సంస్కృతంలో మహా పండితులు. గీర్వాణంలో 'వేదాంత శాస్త్ర హృదయం, వేదాంత పంచ వింశతి, గీతార్ధ సంగ్రహం' రాశారు. గీతార్ధ సార సంగ్రహాన్ని స్రగ్ధరా వృత్తాలో రచించారు.❁

## 320. జంబూద్వీప చిత్రపటం తయారు చేసిన - మూలశంకర మాణిక్ లాల్ యాజ్ఞిక్- (1886)

**3**1-01-1886న జన్మించిన మూల శంకర మాణిక్ లాల్ యాజ్ఞిక్ గుజరాతీ వాద నగరంలోని నాదియాడ్ గ్రామ బ్రాహ్మణుడు. ఈకుటుంబంలో లబ్ధ ప్రతిష్టులైన కవులెందరో జన్మించారు. వీరిలో కొందరు గుజరాతు, కదియవ వాడ సంస్థానాలలో దివాన్ గిరీ చేశారు. యాజ్ఞిక్ బరోడా కాలేజీలో చదివి గ్రాడ్యుయేట్ అయ్యాడు. ఇండియన్ స్పెసీ బాంక్‌లో కొంతకాలం పనిచేసి బరోడాలోని రాజకీయ సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ అయ్యాడు. 1916 శివగంగ పీఠాధిపతి శ్రీ సచ్చిదానంద స్వామి ఇతనికి దీక్ష నిచ్చారు. సంస్కృత నాటకాలు గేయాలు రాసి సంగీతం కూర్చాడు. విజయ లహరి అనే చిన్న కావ్యం రాశాడు. సూర్య, చంద్ర రాజుల వంశంలోని రాజుల పాలనా కాలాలను నిర్దుష్టంగా గుణించి చెప్పాడు. జంబూద్వీపం మాప్ తయారు చేశాడు. విష్ణు పురాణాన్ని చక్కని సరళ సంస్కృత వచనంలో రాశాడు. ఛత్రపతి సామ్రాజ్యం అనే పది అంకాల నాటకం రాసి శివాజీ పరిపాలనపై వెలుగులు ప్రసరింప జేశాడు. తొమ్మిది అంకాలలో ప్రతాప విజయం నాటకం రాసి మేవార్ రాజు మహారాణా ప్రతాప్ సింగ్ వీర విక్రమ గంభీరధీరోదాత్త చరిత్రను వివరించాడు. పృధ్వీరాజ్ చౌహాన్- రాణి సంయుక్త వివాహాన్ని సంయోగిత స్వయంవరంగా రాశాడు. కావ్య నాటక గేయ పదాలలో మృదు మధుర మంజులనాదం చేస్తుంది యాజ్ఞిక్ కవిత్వం.❁



## 321. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి (1888)

వెంకమాంబ, శ్రీ రామావదానులకు చిన కడియంలో 20-2-1888న జన్మించారు. శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి వద్ద వ్యాకరణం నేర్చారు. స్వయంకృషితో ఉభయ భాషా ప్రవీణులైనారు. అమలాపురం హైస్కూల్‌లో నాలుగేళ్ళు మేస్టేరీ చేసి, ఆంధ్ర సాహిత్య పరిషత్ సంస్కృత సాహిత్య వ్యవహర్తగా ఒక ఏడాది పనిచేసి అనంతపురం కాలేజి లెక్చరర్‌గా మూడేళ్ళు సేవ చేశారు. వెంకటగిరి రాజావారి ఆస్థాన కవి పదవి అలంకరించారు. సంస్కృత వాఙ్మయ చరిత్ర రెండుభాగాలుగా రాశారు. ఆంధ్ర భాషాను శాసనం, దశ రూపకాలు, ప్రేమ తత్త్వం, ఉత్తర రామ చరిత్ర బీష్మ ప్రతిజ్ఞ నాటకం ఆంధ్ర భవిష్య పర్వం, విక్రమోర్వశీయం మొదలైన 17 గ్రంథాలు రాశారు.

సంస్కృతంలో 'బ్రహ్మ సూత్రార్ధ దీపిక, రక్షోనంతర వివాహం, సంస్కృతభాషా గ్రంథాలు రచించారు. శాస్త్రి గారు 'ఉపాధ్యాయ పండిత పరిషత్'ను స్థాపించారు. ఈ నాటికీ దిగ్విజయంగా కొనసాగుతోంది. సంస్కృతంలో రాసిన 'సూర్యాష్టకం' ప్రసిద్ధి చెందింది. 'సంస్కృత సాహిత్య చరితం' రాశారు. సూర్యాష్టకంలో సూర్యునికున్న వైదిక పర్యాయ పద విచారణ చేశారు. ఆరామ, భ్రాజ, పటర , పతంగ, స్వర్ణర జ్యోతిష్మాన్, విభాస, కాశ్యప మొదలైన పదాలకు చక్కని వివరణ నిచ్చారు. "తన్మే రుమార్గాని హతిక రథ రా తలస్య - సందీపన ప్రవణాది దీధితి దివ్య మోమూర్తిః-అఖ్యోయ సంస్థితి మగోచర కాలకర్మ విజ్ఞా పాకం - పటర మూర్ధదుహం నమామి". ❀

## 322. శ్రీ శ్రీధర పరశురామ శాస్త్రి (1888-1965)

**క**ర్నూలు జిల్లా కరివెన ఆగ్రహారానికి చెందిన శాస్త్రి గారు విశ్వపతి సుబ్బమాంబల కుమారుడు. తండ్రిగారు మొదటి గురువై కావ్య, వ్యాకరణ శాస్త్రాలు నేర్పారు. సర్వజ్ఞ స్వాత్మానంద సంయమీంద్రుల శిష్యులై, మరింత విజ్ఞానం కోసం పశ్చిమ గోదావరి జిల్లా పుల్లేటికుర్రు చేరి చదివి, బెంగాల్‌లో హరనాధ తారక సిద్ధాంత శిరోమణి భట్టాచార్యులవద్ద న్యాయశాస్త్రం నేర్చారు. తిరిగి వచ్చి ఆత్మకూరు హైస్కూల్‌లో తెలుగు పండిట్‌గా పని చేశారు.

శాస్త్రిగారి గీర్వాణ కృతులు -1-సింధు కౌస్తుభం - కలియుగంలో వాజపేయ యాగము ఎలాచేయాలో వివరించారు. 2-ఇందిరా నందనం - నాట్య, అలంకార శాస్త్ర విషయాల వివరణ చేశారు. 3-భట్ట తాత్పర్య భూషణం - శక్తివాదంపై చర్చ చేశారు. అలంకార వక్రోక్తి మున్నగువానిపై రాశారు. ఈయన తమ్ముడు చంద్ర శేఖరుడు 'శ్రీరామ మందహాసం' అనే సంస్కృత మహాకావ్యం రాశారు. ❁



## 323. శ్రీ దుర్భాక రాజశేఖర శతావధాని (1888-1950)

**క**డపజిల్లా జమ్మలమడుగు నివాసి శ్రీ దుర్భాక వారు. శ్రీ గడియారం వెంకట శేష శాస్త్రి గారితో కలిసి జంట అవధానాలను 'రాజశేఖర-వెంకట కవులు' పేరుతో చేశారు. శాతావధానమూ నిర్వహించింది ఈ జంట. రాజశేఖరం గారు 'రాణా ప్రతాప సింహ చరితము' కావ్యం రాసి 'వీర ప్రబంధ పరమేశ్వర' 'చారిత్రిక కవితాచార్య' బిరుదులూ పొందారు. సంస్కృతంలో ఒకే ఒక్కటి 'కామేశ్వరీ స్తోత్రమాల' రాశారు. 'ఉత్తర రఘు వంశం' కూడా రాశారు కాని పూర్తి చేయలేదు. ❁



## 324. శ్రీ రంగనాథ ప్రబంధకర్త – ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య (1889–1928)

**దు**గ్గిరాల గోపాలకృష్ణయ్య 2–6– 1889లో కోదండ రామస్వామి సీతమ్మ దంపతులకు జన్మించాడు. పుట్టిన మూడవరోజు తల్లిని, మూడవ ఏట తండ్రిని కోల్పోయిన దురదృష్టవంతుడు. పినతండ్రి నాయనమ్మల దగ్గర కూచిపూడి, గుంటూరులలో చదివాడు. హైస్కూల్ చదువులోనే 'జాతీయ నాట్య మండలి' స్థాపించి సంగీత నాటక కార్యక్రమాలు చేసేవాడు. చదువుపై శ్రద్ధ తగ్గి మెట్రిక్ తప్పి బాపట్లలో చేరి పాసైనాడు. రాజకీయ దురంధరుడు రామభక్తుడు, సాహసి నిక్కచ్చి మనిషి. హరితస గోత్రం. 1906 వరకు గుంటూరులో చదివాడు. కాలేజి విద్యార్థిగా ఉండగానే బాలగంగాధర తిలక్ అరవిందుల ప్రభావానికి లోనయ్యాడు. నడింపల్లి నరసింహారావు అనే స్నేహితుని సాయంతో ఇంగ్లాండ్ వెళ్లి ఎడిన్‌బర్గ్‌లో 1911–16 వరకు అయిదేళ్ళు చదివి ఎం. ఏ డిగ్రీ పొందాడు. అక్కడ ఉండగానే ప్రముఖ శిల్పి వేదాంతి చిత్రకారుడు ఆనంద కుమార స్వామితో పరిచయమైంది. ఆయన శిష్యరికంలో తనను తనూ తీర్చి దిద్దుకొన్నాడు గోపాలకృష్ణయ్య. నందికేశ్వరుడు రాసిన 'అభినయ దర్పణం'ను ఆనందకుమార స్వామితో కలిసి 'ది మిర్రర్ ఆఫ్ గెస్చర్' పేరుతో ఇంగ్లీష్‌లోకి అనువదించాడు. ఇది కేంబ్రిడ్జి – హార్వర్డ్ యూని వర్సిటీ ప్రచురితం. ఇండియా తిరిగి వచ్చి రాజమండ్రి ట్రెయింగ్ కాలేజిలో 1917 నుండి ఒక ఏడాది లెక్చరర్‌గా పని చేశాడు. తర్వాత 1918–

19 కాలంలో బందరు జాతీయ కళాశాలలో విద్య నేర్పాడు. ఎక్కువ కాలం ఇక్కడ ఉండకుండా చీరాల పేరాల దగ్గర 'ఆంధ్ర విద్యా పీఠ గోష్టి' అనే విద్యా సంస్థను స్థాపించాడు. గాంధీ మహాత్ముని పిలుపు నందుకొని స్వాతంత్ర్య ఉద్యమంలో చేరాడు. ప్రజలకు నచ్చ చెప్పి సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగస్వాములను చేశాడు. భారత జాతీయోద్యమ నాయకులలో ముఖ్యుడైనాడు. ఉద్యమాలలో అరెస్ట్ అయి ఏడాదిపాటు జైలు శిక్ష అనుభవించాడు. 'శ్రీ రామదండు'అనే 'ఆధ్యాత్మిక జాతీయ స్వచ్ఛంద దళాన్ని' తయారు చేశాడు. ఆనాటి కాంగ్రెస్ సభలకు వీరే రక్షక భటులు. జైలు నుండి విడుదలకాగానే సాంఘిక సంస్కరణలకు శ్రీకారం చుట్టాడు. గోపాల కృష్ణయ్య మహావక్త. ఆంగ్లాంధ్రాలలో అనర్గళంగా మాట్లాడే నేర్పున్నవాడు. నాగస్వరానికి పాములు పరవశమైనట్లు గోపాలకృష్ణయ్య గారి ఉపన్యాసానికి జనం ముగ్ధులయ్యేవారు. వేలాది జనం పాల్గొన్న సభలలో ఆయన కంచు కంఠంతో జనాలను ఉత్తేజ పరచేవాడు, కర్తవ్య బోధ చేసేవాడు. జానపద కళా రూపాల ఉద్ధరణకు గ్రంథాలయోద్యమానికి విశేష కృషి చేశాడు. ఆయన ప్రోత్సహించిన జానపద కళారీతులు - తోలుబొమ్మలాటలు, జముకుల కథ, బుర్ర కథ, వీధినాటకాలు సాము గరిడీలు, గొల్లకలాపం బుట్టబొమ్మలు, కీలుగుర్రాలు, నాటకాలు, గోసంగి గురవయ్యలు, సరదాకథ, కిన్నెర కథ, కొమ్ము బూర జోడు మద్దెల, పల్లె సుద్దులు, తూర్పు భాగోతం, చుట్టుకాముడు, పిచ్చుక కుంటల కథ, సాధనా శూరులు, పల్నాటి వీరులు మొదలైనవెన్నో.

ఆంగ్ల ప్రభుత్వం చీరలా పేరాల మునిసిపాలిటీలను విలీనం చేసినపుడు వ్యతిరేకించి పెద్ద ఉద్యమం నడిపాడు. ప్రజలను ఖాళీ చేయించి ప్రభుత్వా దృష్టికి తెచ్చాడు. ఆయన చేసిన చీరాల పేరాల పోరాటం చిరస్మరణీయం.

గోపాలకృష్ణయ్య సర్వోత్కృష్ట కవి, దేశభక్తుడు, సంస్కర్త విమర్శకుడు. గీర్వాణ ఆంధ్రాలలో గోపాలకృష్ణయ్య రాసిన కవిత్వం ఆయన పాండిత్యానికి మచ్చుతునకలు. సమకాలీనులలో 'మహా జీనియస్ 'అన్నాడు ఆయన్ను కట్టమంచి రామ చంద్రారెడ్డి. 1921లో గుంటూరు సభలో గోపాలకృష్ణయ్యకు 'ఆంధ్రరత్న' బిరుదునిచ్చి సత్కరించారు. దురదృష్టవశాత్తు 40 ఏళ్ళ వయసులోనే 10-6-1928న

మరణించాడు.

శ్రీరంగంలోని రంగనాధస్వామిపై 'శ్రీ రంగనాధ ప్రబంధం' సంస్కృతంలో రచించాడు గోపాలకృష్ణయ్య. మహా కవుల శైలికి ఏ మాత్రం తగ్గకుండా అర్ధ గాంభీర్యంతో కవితా పాటవంతో వెలసిన కావ్యం ఇది. అందులోని కొన్ని శ్లోకాలు–

'కదా వా కావేరీ విమల సలిల ప్రాంగణాం ట–చ్చుమ్భాద్గ తమిళ హృదయ ధ్వాంత దలనం

తనో త్యా తిధ్యం మే నిజ సదసి బందా చ్యుతి యుతో – ముహూర్తైత్యా క్రోశన్నిమిష న్నివనేష్యామి దివసన్.

'శ్రీ రంగేశ కృపాలో తమిళ జన సభాధ్యక్ష దీక్షాంత రంగం – స్వరాజ్యానంద నిద్రా పరవశా ద్రుతముత్తిష్ట భో రంగ నాయక

త్రేతాయాం రామ చంద్ర కృతి ద్రుత భవతా ప్రీణితై వాంధ్ర భూమి – స్త్వాన్ద్రోహం కర్త మానాం తవ భవన కధాం వక్తు మత్రాగతోసమి'

ఇదికాక సంస్కృతంలో చాటువులు చాలా రాశాడు. గీర్వణంలో ఆంగ్ల పదాలను చేర్చి జైలు నుంచి తిరిగి రాగానే మద్రాస్ లో బహిరంగ సభలలో మాట్లాడాడు – మచ్చుకి ఒకటి–

'న యాచే" రిఫారం" నవా" స్టీలు ఫ్రేముం" న "కౌన్సిల్ "న తు "ప్రీవీ కౌన్సిల్" పదం వా–స్వరాజ్యార్తి హంతాంగ్లరాజ్యే నియంతా, ఫరంగీ "ఫిరంగీ "ద్రుదన్గంగే కరోతు ' ఇది జగన్నాధ పండితరాయల 'నయాచే రాజాలిం న వా వాజి రాజిం' కవిత్వానికి అనుకరణ. ❁

## 325. శ్రీ పరవస్తు వెంకట రామానుజ స్వామి (1889)

**స్వా**మీజీ విశాఖలోపుట్టి సంస్కృత, ప్రాకృత ఇంగ్లీష్‌లలో మహా పండితుడైనారు. 1951లో 'ధర్మ సంగ్రహం' సంస్కృత రచన చేశారు.

శ్రీ పరవస్తు గోవిందస్వామి (1894) మహారాజా కాలేజిలో పని చేసి ఆనంద వర్ధని పత్రిక నడిపి, సోడ్డాలకుని ఉదయ సుందరి కథను తెలుగు చేశారు. శ్రీమతి బుర్రా కమలాదేవి (1908–1976) తెలుగు ఇంగ్లీష్ సంస్కృతాలలో చాలా రాశారు. ఆమె 'సుమలత'కు మంచి పేరొచ్చింది. ❁

## 326. సంతాన గోపాల శతకకర్త– లక్ష్మి రజని (1890)

**మ**లబారులోని కదాతనాడు రాకుమారి లక్ష్మీ రజని 1890 కాలం నాటిది. ఆమె రాసిన సంతాన గోపాల కావ్యం 3 కాండలలో ఒక బ్రాహ్మణుడు తన 10 మంది సంతానాన్ని వరుసగా కోల్పోవటం, అర్జునుడు చివరివాడిని బతికిస్తానని శపథం చేసి నెరవేర్చుకున్న కథ ఉన్నది. దీనికి మెచ్చిన శ్రీకృష్ణుడు వైకుంఠంలో ఉన్న మిగిలిన పిల్లల్ని కూడా తీసుకువచ్చి అప్పగిస్తాడు. చివరి కాండలో యమకాన్ని బాగా దట్టించింది. ❁

## 327. సంస్కృత సర్వస్వం రాసిన మధురానాధుడు (1890)

**మం**జునాధుడు అని పిలువబడిన మధురానాధుడు ద్వారా కంఠకుమారుడు జైపూర్ రాజాస్థాన పండిట్ సుందరలాలా పెంచుకొన్నాడు. గౌతమ గోత్రం. 1890లో పుట్టాడు. ఇతని పూర్వీకుడు బావి దీక్షితులు తెలుగు బ్రాహ్మణుడే. కాశీలో నివాసం ఉన్నాడు. మరో ఆయన మణుల దీక్షితులు ప్రయాగలో స్థిరపడ్డాడు. ఈ కుటుంబాన్ని దేవర్ష వాతంకగా పిలుస్తారు. వీరికి ఒక శిష్యుడు దేవర్షి అనే గ్రామాన్ని కానుకగా బహూకరించటం చేత ఈ పేరు వచ్చింది. మధురానాధ పాండిత్యానికి రాజులు మెచ్చి బహుమతులిచ్చి సత్కరించారు. జయపూర్ రాజ్య పండితుని చేశారు. ఈశ్వర విలాసం, పద్య ముక్తావళి త్రిపుర సుందరీ స్తవ రాజం అలంకార కళానిధి ఇతని రచనలు. జైపూర్ సంస్థాన సంస్కృత విద్యకు సూపరింటెండెంట్‌గా ఉన్నాడు. మంజు కవితా నికుంజం అనే సంకలనం తెచ్చాడు. సాహిత్య వల్లభ, సంస్కృత గాథా సప్తశతి, సంస్కృత సర్వస్వం, కావ్యాలంకార రహస్యం అతని ప్రతిభకు గీటురాళ్ళు.❁



## 328. శ్రీ మాడభూషి అనంత శయనం అయ్యంగార్ (1819-1978)

**స**ంస్కృత మహా విద్వాంసుడు. మత గ్రంథాలు సంస్కృతంలో రాశారు. లోకసభ మాజీ స్పీకర్.

శ్రీ తిరుచానూర్ కృష్ణ కవి మంగాపుర నివాసి. సత్యభామా పరిణయం, అనే అయిదు అంకాల నాటకం రాశాడు. సర్వశ్రీ ఎస్ వి ఎస్ కృష్ణమాచార్యులు 'మృత సంజీవనం భాణం', జయలక్ష్మి వృక్ష శాస్త్రంపై రచన చేశారు.❁

## 329. ఉపాఖ్యాన రత్నమాలకర్త అనంగారాచార్య (1891)

**అ**న్న రంగాచార్య అనే ప్రతివాద భాయంకరాచార్య కుటుంబంలో తమిళనాడుకు చెందిన కంచిలో అనంగారాచార్య 1891లో జన్మించాడు. రామానుజుడు స్థాపించిన 74 మతాధికారులలో ఉడుమ్బై నమ్బికి చెందిన వారసుల కుటుంబం ఇది. విశిష్టాద్వైత మతస్తులు. వీరి వంశపు అనంతాచార్యుడు పుష్కర దేవాలయ పూజా విధానాన్ని సమూలంగా మార్చాడు. దీనినే ఇప్పుడు అందరూ ఆచరిస్తున్నారు. అనంగారాచార్య కంచిలోని వేద వేదాంత వైజయంతీ కళాశాల ప్రిన్సిపల్‌గా పని చేసాడు. మత గ్రంథాలపై ఆయన రాసిన గ్రంథాలు, ఉపన్యాసాలు బహుళ ప్రచారం పొందాయి. అనేక శాస్త్రాలపై చాలా గ్రంథాలు రాసాడు. ఈయన గ్రంథాలలో ముఖ్యమైనవి ఉపన్యాస రత్నమాల, ఉపాఖ్యాన రత్నమాల, రామాయణ దండకం, యదునందన చరితామృతం గొప్ప వచన రచనలు. కోకిల సందేశ కావ్య ప్రసిద్ధి చెందినది. తమిళ దివ్య ప్రబంధాలపై సాధికారత కలవాడు.❁



## 330. ప్రాచ్య కళాశాల స్థాపించిన శ్రీ ఎస్.టి.జి.వరదాచార్యులు (1892-1982)

**జననం- విద్య**

**శ్రీ** మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యుల వారు అంటే ఎవరికీ తెలియదుకాని, ఎస్.టి.జి.వరదాచార్యులు అంటే యిట్టే అందరికి తెలిసిపోతుంది. ఆ పేరుతో అంత ప్రాచుర్యం పొందారు. కృష్ణాజిల్లా బందరు దగ్గరున్న చిట్టి గూడూరులో విద్యా వైదుష్యాలకు నెలవైన సంపన్న వైష్ణవ కుటుంబంలో వరదాచార్యుల వారు 4-8- 1892న జన్మించారు. మచిలీపట్నం హిందూ హై స్కూల్‌లోను, అక్కడి నోబుల్ కళాశాలలో ఆ తర్వాత మద్రాస్ ప్రెసిడెన్సీ కాలేజీలోను విద్యనభ్యసించి సంస్కృతంలో ఎం.ఏ.ఆనర్స్ డిగ్రీ పొందారు.

**గీర్వాణ సేవ**

డిగ్రీ పొందిన తర్వాత విజయనగరం మహారాజా వారి సంస్కృత కళాశాలలో కొంతకాలం ప్రధానాధ్యాపకులుగా పనిచేశారు. తర్వాత ప్రాచ్య పాఠశాలల (ఓరియెంటల్ స్కూల్స్) పాలనా వ్యవహారాలను పర్యవేక్షించే అధికారిగా వ్యవహరించారు.

**స్వంతగ్రామంలో ప్రాచ్య కళాశాల స్థాపన**

ఆ తర్వాత స్వగ్రామం చిట్టి గూడూరు చేరి తమ తండ్రిగారి పేరిట ప్రాచ్య కళాశాలను ప్రారంభించారు. నిర్వాహక సమితికి అధ్యక్షులుగా ఉన్నారు. ఉవ్వెత్తున ఎగసిన భారత జాతీయోద్యమ కాలంలో జాతీయ విద్యను బోధించాలనే సంకల్పంతో జాతీయ విద్యా పరిషత్తును ఏర్పరిచి కార్యదర్శిగా ఉండి జాతీయ కళాశాలను మచిలీపట్నంలో ఏర్పాటు చేశారు. దీన్ని తీర్చిదిద్దటంలో ఆచార్యులవారు తీసుకొన్న శ్రద్ధ, చొరవమాటలతో వర్ణించలేనంత గొప్పది.

**భద్రాచల రామాలయ జీర్ణోద్ధరణ**

వరదాచార్యులవారు ఆగమ శాస్త్రంలోను నిష్ణాతులు. భద్రాచలంలోని శ్రీ సీతారామస్వామి ఆలయ జీర్ణోద్ధారణ కమిటీ ఉపాధ్యక్షులై అహరహం శ్రమించి నిర్మించారు.

**ఆచార్యుల వారి గీర్వాణ రచన**

వరదాచార్యులవారు తెలుగు శతకాలను ఏడింటిని సంస్కృతంలోకి అనువదించారు. వీటిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ముద్రించి వెలువరించింది. "భాషా శాస్త్ర సంగ్రహం" అనే తులనాత్మక భాషా శాస్త్ర గ్రంథాన్ని ఆచార్యులవారు సంస్కృతంలో రచించి అనన్య కీర్తి సాధించారు. అది పరమ ప్రామాణిక గ్రంథంగా పేరు పొందింది.

**గౌరవ పురస్కారాలు**

రాష్ట్ర రాష్ట్రేతర విశ్వ విద్యాలయాలలో "పాఠ్యగ్రంథ నిర్ణయ పరిషత్తు"లో సభ్యులుగా అక్ష్యక్షులుగా వరదాచార్యులవారు పని చేశారు. వీరి సమర్థతకు తగిన పదవి. ఇది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి వరదాచార్యుల వారికి 1969 విశిష్ట సభ్యత్వం అందజేసి గౌరవించింది. ఆంధ్ర విశ్వ విద్యాలయం కళా ప్రపూర్ణ బిరుదునిచ్చి సత్కరించింది. 90 ఏళ్ళు సార్థక జీవనం గడిపిన విద్యావరదులైన శ్రీ వరదాచార్యులవారు 20-11-1982న శ్రీ వైకుంఠం చేరుకొన్నారు.❀

## 331. ఆశుకవి కేసరి – శ్రీ పిసుపాటి చిదంబర శాస్త్రి (1892–1951)

**బ**హు గ్రంథకర్త, అవధాని, బహు ప్రక్రియా పారంగతులు శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రి. 1892లో నెల్లూరు జిల్లా కరవదిలో సీతారామయ్య, కనక రత్నమ్మగార్లకు జన్మించారు. తెలుగులో 25, సంస్కృతం లో 15 గ్రంథాలు రాశారు. 'ఆశుకవి శేఖర, విద్యా భూషణ', కావ్య కళానిధి బిరుదులు పొందారు. వేదాంత, మంత్రం శాస్త్రాలలో ప్రవీణులు. స్వయం కృషితో ధర్మ శాస్త్రం నేర్చారు. సంస్కృతాంధ్రాలలో విరివిగా అష్టావధాన,శతావధానాలు చేశారు. మైసూరు మహా రాజాస్థానంలో 1920 నుండి 'ఆస్థాన మహా విద్వత్కవి'గా ఉన్నారు. తిరువాన్కూర్ మహారాజాస్థానంలో 'నరసింహ కంకణ' సత్కారం అందుకున్నారు. గజారాన్య క్షేత్రం అనే తలకాడులో 'ఆశుకవి శేఖర', దర్భంగా మహారాజాస్థానంలో 'కావ్యకలానిది' బిరుదులూ సత్కారాలు పొందారు. చాలా సంస్థానాలు వీరికి వార్షికాలు పంపేవి. 1942లో వెంకటగిరి రాజాస్థానంలో 'ఆస్థాన కవి' గౌరవం పొంది 54 వేల శ్లోకాలుగల 'పద్మ పురాణాన్ని' ఆంధ్రీకరించారు. 11–2–1951న పరమపదించారు.

### శాస్త్రిగారి గీర్వాణ కవిత్వం

పంచాయతన పంచ శతి, శ్రీ కృష్ణ రాజాభ్యుదయం, అవధాన దర్శనం, రాజ ధర్మం, అష్టక కదంబం, శివ సూత్ర సంగ్రహం, పరాభావ బోధిని, దేశ

యాత్రాచరిత్ర మహాశూర పురాభ్యుదయం, కాముకీ విరాగ సంభాషణ శతకం వగైరా పదిహేను గ్రంధాలను సంస్కృతం లో చిదంబర శాస్త్రి రచించారు.

**శాస్త్రి గారి కాముకీ విరాగుల సంభాషణలో మచ్చుకి ఒకటి–**

కాముకి–తన్వాస్తు శారద కళానిధి పూర్ణ బింబం– న్యాక్కారి హాస వదనం సరాగం–
యోవానపశ్యతి తదేక మతిః పురస్తాత్– దిక్ తస్య జీవితమజాగళస్తనాభం
విరాగి–ఫాలేన భస్మితమనోభావ మక్షియస్య– సుప్తే కళానిధి కలాకమనా విభాతి–
తం యోన పశ్యతి తదేక మనాస్సమాదే – నిక్ తస్య జీవిత మజాగళాస్తనాభం

నిజాం సంస్థానంలో 'మాన పూజాపహారం' అనే సమస్యను శాస్త్రిగారు "సోయం రాజా భువి విజయతా సుస్తిరం రాఘవేంద్రః – క్రీడాకాలే పటుతర బలే దాన ధర్మ ప్రసంగే– సంపల్లక్ష్మ్యాం హరిహర పదాంభోరుహ ద్వంద్వ భాగే"– కీర్తి శ్యామా కుచయుగ తదేమాన పూజాప హారంగా పూరించి మెప్పు పొందారు. ❁

## 332. నాదెళ్ళ మేధా దక్షిణమూర్తి శాస్త్రి (1894-1938)

**నా**దెళ్ళ పురుషోత్తమ కవి ముక్తికాంతామణి దంపతుల కుమారుడు మేధా దక్షిణామూర్తి శాస్త్రి. హరితస గోత్రం. 26-1-1894లో మచిలీపట్నంలో జన్మించాడు. 27-11-1938న మరణించాడు. గీర్వాణ, ఆంధ్ర హిందీ పర్షియన్ భాషలలో గొప్ప పండితుడు, కవి, రచయిత. ఖగోళం ధర్మశాస్త్రాలపై గ్రంథాలు రాశాడు. తెలుగులో 30, సంస్కృతంలో 3 రాశాడు. సంస్కృతంలో 'ఆత్రేయశ్రోత్రా నందం, అస్టకమాల, నానా దేవతా స్తోత్రం రాశాడు. మొదటి దానిలో 108 శ్లోకాలున్నాయి. ఛందో వైవిధ్యం పాటించాడు. దత్తాత్రేయ అవతార గొప్పతనాన్ని ఇందులో వర్ణించాడు. ముందుగా తండ్రి పురుషోత్తమ శాస్త్రికి పద్య నివాళి సమర్పించాడ.

'శ్రీ దక్షిణాస్య విమలా0ఘ్రిద్రసరోజ భ్రున్గః శ్రీమద్గురు ర్జయతు తత్పురుషోత్తమాఖ్యః యధ్యాన మాత్ర రసనాత్తకవిత్వ శక్తిః సత్కావ్య జాల రచనాల్లభతే సుకీర్తిం'

తన వంశ చరిత్రను చెప్పుకొన్నాడు. కవి తన తల్లిగారిపై తెలుగులో ముక్తి కాంతా శతకం చెప్పాడు. ఇందులో 19 సంస్కృత శ్లోకాలున్నాయి.

'గోమాననీయ పద సోమా ర్కవహ్నినయనోమా సతీపతి మజం - వాగార్థ భాగ మణిదామాభి రామనిజ భామా మణీయుత తనుం.

చివరి శ్లోకం- 'స్తవ్య సౌశీల్య సౌభాగ్య సద్రూపిణీం నిత్య ప్రుల్లగ్న భర్త్రింఘ్రి పంకేరుహం - భవ్యా విద్యా వతీం దీమతీం శ్రీమతీ మాశ్రయే మాతరం ముక్తి కాంతామణీం'

మాత్రు దేవత ముక్తికాంతను సంస్మరించటం మేదా దక్షిణామూర్తిగారికి ముక్తికాంతా దర్శనానికి సోపానమై ఉంటుంది.❁



## 333. విశ్వవిద్యాలయంలో 'గీర్వాణ పాదు'ను పెంచి పోషించి కాయించిన కులపతి కున్హన్ రాజా(1895-1963)

**చి**త్తేంజూర్ కున్హన్ రాజా మద్రాస్ లోని అడయార్ లైబ్రరీ క్యూరేటర్ గా చాలా ఏళ్ళు పని చేశాడు. అడయార్ ఫిలసాఫికల్ సొసైటీలో 1920లో చేరి అక్కడే ఉంటూ సంస్కృత భాషా సేవ చేశాడు. లైబ్రరీ అభివృద్ధి, గ్రంథ ప్రచురణయే ధ్యేయంగా పని చేశాడు. ప్రొఫెసర్ రాజా గొప్ప గ్రంథకర్త. సంస్కృతభాషా వ్యాప్తికి భారతీయ సంస్కృతీ వ్యాప్తికి విశేష కృషి చేశాడు. ఎప్పటికైనా సంస్కృతభాష మాత్రమే భారతీయ ఐక్యతను సాధించగలదని, ప్రపంచానికి పరమోత్తమమైన విలువలను బోధించేదని గాఢంగా నమ్మాడు. ఆయన కల ఇంకా సాకారం కాలేదు. ఇండియా రానురాను విభజనకు గురి అయిందే తప్ప ఐక్యత సాధించలేకపోయింది. సాంస్కృతిక విలువలు పతనమై పోయాయి. ఇండాలజీపై కున్హన్ రాజా వెలువరించిన పత్రాలసంపుటికి గౌరవప్రదంగా అడయార్ లైబ్రరి 'భారతీయ బ్రహ్మ విద్య' అనే ఉద్గ్రంధాన్ని ఆయన శతజయంతి నాడు అంకితమిచ్చి1996లో ప్రచురించి గౌరవించింది.

శంకరాచార్య రాసిన బ్రహ్మ సూత్ర భాష్య చతుస్సూత్రికి వాచస్పతి భామతి రాసిన దానిని ఫిలాసఫీ రీడర్ శ్రీ ఎస్ ఎస్ సూర్యనారాయణ శాస్త్రి మద్రాస్ యూనివర్సిటి సంస్కృతాచార్యులు శ్రీ కున్హన్ రాజ కలిసి ఆంగ్లం లోకి అనువదించారు .దీనికి ముందుమాట శ్రీ సర్వేపల్లి రాధా కృష్ణ రాశారు. "some

fundamental problems in Indian philosophy", some aspects of education in ancient India, "sankhya karikas of krishna, "asya vamsya mantram" survey of Sanskrit Literature" మొదలైన ఆంగ్ల గ్రంధాలు రాశాడు .భారత ప్రశస్తి, చంద్ర వాక్యాస్ ఆఫ్ వరరుచి కూడా ఆయనవే.

**ఆంధ్ర విశ్వవిద్యాలయంలో గీర్వాణ సేవ**

1954లో విశాఖపట్నం ఆంధ్ర విశ్వ విద్యాలయంలో సంస్కృత శాఖ డాక్టర్ సి కున్హన్ రాజా ఆచార్యులుగా ప్రారంభమైంది. కాని నాలుగేళ్ల తరువాతనే సంస్కృతంలో ఎం.ఏ, పి.హెచ్ డిల కు విద్యార్ధులను చేర్చుకోవటం ప్రారంభమైంది. లబ్ధ ప్రతిష్టులైన సంస్కృత పండితు లెందరో డిపార్ట్మెంట్‌లో చేరి సేవలందించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సంస్కృత ప్రొఫెసర్‌గా పని చేసినప్పుడు 'కాళిదాస' గ్రంథాన్ని 'ది వేదాస్'ను రచించి ప్రచురించాడు. సంస్కృత శాఖలో దర్శనాలపై పరిశోధన, సంస్కృతంలో స్త్రీల సాంఘిక అధ్యయనం, తులనాత్మక సాహిత్య విమర్శలకు ప్రాధాన్యమిచ్చారు. ఐ ఏ ఎస్ ఆఫీసర్లు కూడా సంస్కృతంలో అత్యుత్సాహం చూపి చేరి మాస్టర్స్ డిగ్రీ పొంది డిపార్ట్ మెంట్‌కు గర్వకారణంగా నిలిచారు. అందులో చదివి ఉత్తీర్ణులైన వారు వివిధరంగాలలో ఉన్నత పదవులలో రాణించారు. ఇందులోని ఫాకల్టి సభ్యులు జర్మని, ఆస్ట్రేలియా, కెనడా, తాయ్ లాండ్ వంటి ఇతర దేశాలు సందర్శించి అంతర్జాతీయ సదస్సులలో పాల్గొన్నారు. సంస్కృత డిపార్ట్మెంట్ వారిని యు జి సి ,ఎపి పిఎస్ సి, యుపి ఎస్ సి వారు తరచుగా సంప్రదిస్తూ సలహాలను తీసుకొనేవారు. ఫాకల్టివారు జాతీయ, అంతర్జాతీయ జర్నల్స్‌ను ప్రచురించేవారు. సంస్కృత శాఖాభివృద్ధికి కున్హన్ రాజా సేవలు నిరుపమానమైనవి.

అస్య వామస్య సూక్త అనేది ఋగ్వేదంలో మొదటి మండలంలోని 164 వ సూక్తం. దీనికి సాయనుడు, స్వామి ఆత్మానంద వ్యాఖ్యానం రాశారు. దీన్ని ఇంగ్లీష్‌లోకి విశాఖలోని ఆంధ్ర విశ్వవిద్యాలయ సంస్కృత ప్రొఫెసర్ మరియు హెడ్ ఆఫ్ ది డిపార్ట్మెంట్ కున్హన్ రాజా అనువదించాడు. ఇందులో ఎన్నో

ప్రతీకలున్నాయి. వాటి వివరణ అంతా ఉంది. కాలచక్రగమనం గ్రహాలూ నక్షత్రాలు వాటి సంబంధం సప్తాశ్వాలు వాటి అర్ధం సూర్యుడు రశ్మి అన్నిటి వివరాలున్న సూక్తం ఇది. సూర్యుడే పరబ్రహ్మ అనేది ముఖ్య సిద్ధాంతం. 'God has no place in my philosophy' అని కున్హన్ రాజా 'కరెంట్ ట్రెండ్స్ ఇన్ ఇండియన్ ఫిలాసఫీ'లో అంటాడు.

1868లో మద్రాస్ ప్రెసిడెన్సి కాలేజిలో సంస్కృత శాఖ ప్రారంభమైంది. 1872లో గుస్టేవ్ ఆపర్ట్ మొదటి సంస్కృత ప్రొఫెసర్. 1927లో డాక్టర్ కున్హన్ రాజా సంస్కృత ఆచార్యుడయ్యాడు. ఆయనవద్ద ఇద్దరు స్కాలర్స్ పని చేసేవారు. డిపార్ట్మెంట్లో న్యు కేటలాగ్ కేటలాగం (N.C.C) విభాగం ప్రారంభమై రాఘవన్ ఆధ్వర్యంలో పనిచేసింది. ఆయన నుండి రాజా బాధ్యతలు స్వీకరించాడు. డిపార్ట్మెంట్ను బోధనలోను, రిసెర్చ్లోను అగ్రగామిగా నిలబెట్టాడు. ఆరు మహా గ్రంథాలను ప్రచురించే ఏర్పాటు చేశాడు. 1980లో రాజా పదవీ విరమణ చేశాడు. యెన్ సి సి సేవలు నిరుపమానం. వ్రాత ప్రతులను సేకరించి భద్రపరచారు. మైసూర్ యూనివర్సిటి మొదలైన వాటికి విజిటింగ్ ప్రొఫెసర్గా రాజా వెళ్లి ఉపన్యాసాలిచ్చేవాడు.

మేకింగ్ ఆఫ్ వెస్ట్రన్ ఇండాలజీ 'హిస్టరీ ఆఫ్ సాంస్క్రిట్ పొయేటిక్స్', ఇంపార్టన్స్ ఆఫ్ సాంస్క్రిట్,' 'సర్వే ఆఫ్ సాంస్క్రిట్ లిటరేచర్' కూడా రాశాడు. సంస్కృత ప్రాముఖ్యంపైన 'సంస్కృతంలో సంస్కృతస్య మహాత్మ్యం' రాస్తూ "భాషాసు ముఖ్య మధురా ప్రాచీనా విశ్వతో ముఖీ – భాతి సంస్కృత భాషేయం సర్వదా సర్వదాసతీ" అన్నాడు మొదటి శ్లోకంలో. "ఉన్నతేన స్తితిమతాహిమవద్భూతా యధా–త్వన్గత్తరంగతా పుణ్య సరితా గంగయా యదా" అన్నాడు. చివరి శ్లోకం – "అన్యోన్య భాషా న్వబోధ భీతేః–సంస్కృతిర్మాసు వ్యవహార వత్సు–దిగ్భ్యః సమేతేషు నరేషు తోషు – సౌవర్ణ వర్ణా స్వజనై రధి ని"

ఇంత గీర్వాణ సేవ చేసిన చిత్తేన్జూర్ కున్హన్ రాజా 1895లో జన్మించి 1963లో మరణించాడన్న ఒక్క విషయం తప్ప ఆయన జీవిత చరిత్రను ఎవరూ పొందు పరచకపోవటం దురదృష్టం. బౌద్ధం పై 'ధమ్మపదం' ఆంగ్లంలో రాశాడు.

శ్రీ మైనేని గోపాలకృష్ణగారు మెయిల్ రాస్తూ కున్హన్ రాజా తను “1955–58లో విశాఖ పట్నం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉండగా సంస్కృత విభాగానికి హెడ్‌గా, హాస్టల్ వార్డెన్‌గా ఉన్నారని, సంస్కృతంలో పేరుమోసిన పండితుడని, హిందూ–బుద్ధిష్ట్ స్క్రిప్చర్స్‌లో ఆరితేరిన వాఙ్మయ సంపన్నుడు అని తాను ‘గీర్వాణ కవుల కవితా గీర్వాణం’ చదువుతున్నప్పుడల్లా గుర్తుకు వస్తున్నాడని, ఆయనపై ఒక ప్రొఫైల్ రాస్తే సంతోషిస్తానని” అన్నారు. ‘వివరాలు రాయండి వ్యాస రూపంలో పెడతాను. రాయవలసిన ముఖ్యుడే ఆయన’ అన్నాను. “అలాగే ప్రయత్నిస్తా” అన్నారు. అప్పటిదాకా ఆగటం ఎందుకని రాసే సీరియల్ కు కామా పెట్టి కున్హన్ రాజాపై నాకు దొరికిన సమాచారం అంతా సేకరించి రాసేదాకా మనసు నిలవలేదు. ఇది సంగ్రమూ కాదు సంపూర్ణమూ కాదు. ఇప్పటిదాకా రాయకపోయినా దానికి ప్రాయశ్చిత్తంగా రాసింది మాత్రమే. ఇంకా ఏవైనా ఆయన గురించి తెలిస్తే తర్వాత కలుపుతాను.❁




## 334. విశ్వం పట్టని కవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు (1895-1976)

**జీవితం**

విశ్వనాథ శోభనాద్రి, పార్వతి దంపతులకు విశ్వనాథ సత్యనారాయణ 10-9-1895 కృష్ణా జిల్లా నందమూరు గ్రామం లో జన్మించారు .చిన్ననాటి నుండే కవిత్వం చెప్పటం అలవాటై చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారి శిష్యరికం లో రాటు దేలారు .బెజవాడ ఎస్.ఆర్ ఆర్. కాలేజిలో తెలుగు లెక్చరర్గా ఉద్యోగం ప్రారంభించి హెడ్ ఆఫ్ ది డిపార్ట్ మెంట్గా రిటైర్ అయి ,కరీంనగర్ కాలేజిలో ప్రిన్సిపాల్ గా చేరి రెండేళ్ళు పని చేశారు .

కొడాలి ఆంజనేయులుగారితో కలిసి అష్టావధానం చేశారు .తెలుగు సాహిత్యంలో దాదాపు అన్ని ప్రక్రియలలోనూ రచనలు చేసినవాడు విశ్వనాథ. "నవ్య సంప్రదాయ ఉద్యమం"కు ఆద్యుడైనిలిచాడు. కవితా చతుర్ముఖుడు. జాతీయాభిమానం,ధర్మ వీరం, శాంత కరుణం, భక్తి భావం ఇవే చతుర్ముఖాలు. ఆంధ్ర ప్రశస్తి తెలుగు ఋతువులు ఆంధ్ర పౌరుషం కోకిలమ్మ పెళ్లిలలో ఆంద్ర జాతీయాభిమానం, ఝాన్సి రాణి శివార్పణం మున్నగు వానిలో జాతీయాభిమానం, కుమారాభ్యుదయం, ప్రద్యుమ్నోదయం, రురు చరిత్రలలో ధర్మ వీరం, శాంతం అంతర్వాహినులై ప్రవహించాయి. కిన్నెర సానిపాటలు, వరలక్ష్మీ త్రిశతి లలో కరుణ పొంగి ప్రవహించింది. మాస్వామి, విశ్వనాథ మధ్యాక్కరలు, భ్రమర గీతం గోపికాగీతాలు, శ్రీ కృష్ణ సంగీతంలలో భక్తి పారవశ్యం ఉన్నాయి.

మొదట్లో భావకవిగా గిరికుమారుని ప్రేమగీతాలు, శశిదూతం శృంగార వీధి రాసి ఉన్నత స్థానం పొందారు. వందలాది ఖండకావ్యాలు, విమర్శనా వ్యాసాలూ రాశారు. అల్లసాని వారి అల్లిక జిగిబిగి, నన్నయ గారి ప్రసన్న కవితా కథా కలితార్థ

యుక్తి ఒకదు నాచన సోమన, చాల ప్రసిద్ధి చెందాయి. పురాణ వైర గ్రంథమాలగా అనేక నవలలు రాశారు . విశ్వనాథ "మాగ్నం ఓపస్ కావ్యం" శ్రీమద్రామాయణ కల్ప వృక్షం. తన సకలోహ సారంగా రాశారు. ఇది విశ్వనాథ జీవుని వేదన తండ్రిగారి కోరిక. రాయటానికి 35ఏళ్ళు పట్టింది. మిగిలినవన్నీ రోజుల్లో డిక్టేట్ చేసి రాయించినవే అందుకే ఆయనను "గ్రేట్ డిక్టేటర్" అన్నారు సరదాగా.. కల్ప వృక్షానికి 1971లో జ్ఞాన పీఠ పురస్కారం అందుకొన్న తోలి తెలుగు కవి అయ్యారు. వీరి నవలేతిహాసం అంటే క్లాసిక్ నవల "వేయి పడగలు" దీనికి ఆంధ్ర విశ్వ విద్యాలయం నగదు బహుమతి పొందారు. ప్రకృతి సమతుల్యతను ప్రతిపాదించిన నవల ఇది. మూడు తరాల ఆంధ్ర జాతి పరిణామాన్ని చూపించింది. భారతీయతపై పాశ్చాత్య ప్రభావం తిరస్కరించబడింది. 'ఏక వీర' నవల మనస్తత్వ పరిశీలనకు నిలువెత్తు అద్దం..

కవిసామ్రాట్, కళాప్రపూర్ణ మొదలైన బిరుదులూ అనేక సాహిత్య సంస్థలచేత పురస్కారాలు పొందారు. భారత ప్రభుత్వం "పద్మ భూషణ్ "పురస్కారమందించి గౌరవించింది. ఉజ్జయిని వారి కాళిదాస సమ్మాన్ అందుకొన్నారు. 1966-76 కాలంలో ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవులుగా ఉన్నారు. కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడెమి సభ్యులైనారు. గుడివాడలో గజారోహణం అందుకున్న కవిసామ్రాట్ విశ్వనాథ. 81ఏళ్ళు సార్ధక జీవితం గడిపి 18-10-1976 న కవిసామ్రాట్ విశ్వనాథ సత్య నారాయణ కవితా విశ్వనాథుడై విశ్వేశ్వరునిలో ఐక్యమయ్యారు.

## విశ్వనాథ గీర్వాణ కవితా గీర్వాణం

విశ్వనాథ దాదాపు 146 గ్రంథాలను తెలుగు సంస్కృత భాషలలో రాశారు. అందులో సంస్కృతంలో మూడు నాటకాలు 'అమృత శర్మిష్టం" "గుప్త పాశుపతం" 'అశని నిరాసనం' రాశారు. సంస్కృత కావ్యాలు శివ పంచశతి, దేవ త్రిశతి, గురుప్రసాదం, శారదా చంద్ర మౌళి సుప్రభాతం రచించారు.

## అమృత శర్మిష్టం

"యయా తేరివ శర్మిస్టా భర్తుర్బహు హమతాభవ" అనేకాళిదాసు సూక్తిని ఆధారం చేసుకొని దానికి వ్యాఖ్యానంగా శర్మిష్టను నాయికను చేసి తొమ్మిది అంకాల మహానాటకాన్ని సంస్కృతంలో రచించారు . దీన్ని "అమృత శర్మిష్టం" అన్నారు. శర్మిష్ట శాపకారణం గా భూమిమీదకు వచ్చిన అప్సరస. భరతముని శిష్యురాలై ఆయన నాట్యశాస్త్ర ఆవిర్భవానికి కారకురాలైంది. ఇందులో విశ్వనాథ "రసయానం" అనే దాన్ని ప్రతిపాదించారు.

"క్రతు ధ్వంసీ సంధ్యా ప్రణయ భర సంస్పంది చరణ %--%స్ఫురన్నాట్యక్రీడా ప్రధమ రస నిష్యందన గురుః
తపస్చాంత ర్వృత్తిః సరస మృదుభావైః పరిణతాం-సమాన స్కందా రోపణకృతి కృపః పాతు గిరిశః" అనే నాందీ శ్లోకం తో ప్రారంభమైంది. కర్మ జ్ఞాన ధ్యానమార్గాలతో బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన రసానుభూతి కూడా సమాన ప్రతిపత్తి కలిగి మోక్షాన్ని అమృతత్వాన్ని ఇస్తుంది అని భావం. కాళిదాసుని శాకుంతల నాటకంలో లాగానే సన్నివేశాలు, ప్రతిపాదనలు, శ్లోక రచనా ఉన్నాయని శ్లాఘించారు శ్యామలానంద. "సప్రభాతరలంజ్యోతి రుదేతివసుధా తలాత్" అన్న కాళిదాసు శ్లోకంతో సమానంగా విశ్వనాధ "భో అమృత లో భాత్ పశ్యన్తి దివి మానవాస్సర్వే" శ్లోకం రాశారు. కావ్యాన్ని ఏదో కాలక్షేపం కోసం చదవరాదు. అది "రసయానం" మోక్షదాయకం అవుతుంది అని చెప్పారు విశ్వనాధ. ఈ నాటకానికి భరతవాక్యంగా విశ్వనాధ"
"వాచో మహా కవీనాం జయంతు నితరాం భవంతు ఫలితార్థాః-వాగర్థ మనో హృదత్ ,వివర్ధతాం రస మయంచ మహః" చెప్పారు .

## గుప్త పాశుపతం

పరమ శివుడిని మెప్పించి అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సంపాదించినా, లోక క్షేమం కోరి దాన్ని కురుక్షేత్ర యుద్ధంలో ఎప్పుడూ ప్రయోగించలేదు. అది గుప్తంగానే ఉంది. యుద్ధం జరిగేటప్పుడు పశుపతి నాధుడైన శివుడు అదృశ్య రూపంలో యుద్ధాన్ని గమనిస్తూనే ఉన్నాడు. అంటే శివ కేశవులు అద్వైతంగా సృష్టి స్థితి లయలను పర్యవేక్షిస్తూనే ఉంటారు. లోక నాశనకరమైన ఆటం, హైడ్రోజెన్ బాంబు లాంటి ఆ అస్త్రాన్ని ప్రయోగించని నరోత్తముడు నరుడైన అర్జునుడు. కనుక అర్జునుని మనవడైన పరీక్షిత్తుకు ప్రాణాన్ని రాజ్యాన్ని, ఇద్దరూ కలిసి ఇచ్చారు. ఆధునికకాలంలో వార్ వెపన్స్ మానవాళికి యెంత ప్రమాదకరమో ఆలోచించుకోవాలని విశ్వనాధ చెప్పిన హితవు ఇది. పది అంకాల మహా నాటకం గుప్త పాశుపతం. వీరరస నాటకంగా కనిపిస్తూనే శాంతరసాన్ని ధ్వనిగా చెప్పింది. వేణీ సంహార నాటక శైలిలో ఇందులో బాలాకీ, కౌబేరి, ఘటకుడు అనే విచిత్ర పాత్రల్ని విశ్వనాధ సృష్టించారు.

నాటక పీఠికలోనే విశ్వనాధ "అత్ర చ బహుదా వీరః శాంతే పర్య వశ్యతి. శబ్ద ప్రయోగ లాలిత్యాది విషయేషు గుప్త పాశుపతం ప్రౌఢ మార్గమనుసరతి. ఏతత్ సర్వం కిమపి మహాధ్వని సర్వస్వం. అన్యదప్య స్థితి కించిత్ సర్వం దైవ నిర్మితం. దైవ చలితం. దైవ ప్రవర్తితం, మహా ప్రళయ సంబంధి కర్మకాత్ మహేశ్వరః" అని తెలియ జేశారు. నరుడైన అర్జునుడు నరజాతికి ప్రతినిది. .బాలాకి చేత "అర్జున! బ్రహ్మ

నిస్సస్త్వం. జగన్నిర్మాణవేత్తత్వం" అనిపిస్తారు. ఇదే ఈనాటక ఉద్దేశ్యం. మానవాళి సుభిక్షంగా ఉండాలన్నది విశ్వనాధ యోచన. భరత వాక్యంలో శివ కేశవులనిద్దరిని కవి విశ్వనాధ-
"శాస్త్రే త్వత్ కృపయా యదోః కులపతే జ్ఞాత్వాపి నజ్ఞాయతే- గంగా జూట జుటీక మృత్యు ముపరి స్తిత్వా భవిష్యామి కిం
దృష్ట్వా ద్యాపి బిభేమి లోకమిహ త్వత్పాదాబ్జ యోర్భంభరీ- భూతం నిత్య పరి భ్రమం తమను మాం ప్రేమ్ణా కురూమాపతే" అని ప్రార్ధించి లోకంలో పీడనం లేకుండా జనం సుఖ శాంతులతో వర్ధిల్ల జేయమని భావం. అంతటి మానవీయ కోణంలో రాసిన నాటకం ఇది.

**అశని నిరాసనం**

అశని అంటే పిడుగు. నిరాసనం అంటే మరల్చటం. పిడుగును మరల్చటం అనే ఈ "వ్యాయోగం" అని పిలువబడే సంస్కృత రూపకం ఏకాంకిక. తెలుగు వారి వైదిక సంస్కృతీ పరిరక్షణ దీక్షకు నిలువుటద్దంగా విశ్వనాద చేసిన అపూర్వ సృష్టి. ఉరుములు ఉరిమినప్పుడు "అర్జున ఫల్గుణ పార్ద" అనే మంత్రాన్ని, అందులో అర్జునుడికి ఉన్న పదిపేర్లు మనం చదువుతాం. అలా చదివితే పిడుగు మనమీద పడదనే విశ్వాసం. ఇది ఒట్టి విశ్వాసం కాదు. తైత్తిరీయ ఆరణ్యకంలో ఉన్న "విద్యుద్వధ" ఘట్టాన్ని మేళవించి వైదిక వాజ్మయం ద్వారా వేద వ్యాస మహర్షి అందించిన విజ్ఞాన శాస్త్రం అని దాన్ని మానవ జాతి వదులుకోవద్దనీ విశ్వనాధ హిత సందేశం. కొంచెం ఫ్లాష్ బాక్ కు వెడదాం.

ఏక చక్ర పురం లో బ్రాహ్మణ వేషంలో అర్జునుడు భిక్షాటన చేస్తున్నప్పుడు పిడుగుపాటుపై ఉన్న భయాన్ని వ్యాసుల వారికి చెప్పుకున్నాడు. అక్కడ వ్యాసాశ్రమంలో పిడుగు ఎలా ఏర్పడుతుంది అనేదాన్ని రసాయనికశాలలో అంటే లాబరేటరిలో ప్రత్యక్షంగా చూసి మహర్షి ద్వారా తెలుసుకొంటాడు. ఒకసారి తనపై పడబోతున్న పిడుగును ఉత్తరీయం చెంగున బంధిస్తాడు. అది విడుదల చేయమని ప్రార్ధిస్తుంది. ఇక మీదట తన పేర్లు చదివే వారిపై పడరాదు అని పిడుగు వద్ద హామీ తీసుకొని అర్జునుడు దాన్ని వదిలేస్తాడు. భయంకరమైన పిడుగుపాటు మరణం నుంచి మానవ జాతిని రక్షించటానికి అర్జునుడు చేసిన ప్రయత్నం, ఆధునిక విజ్ఞాన ప్రయోజనాలకు మార్గ దర్శకమౌతుంది. పాశ్చాత్య విద్యలు ఎన్ని నేర్చినా భారతీయతను మరచిపోవద్దని హెచ్చరిస్తూ సందేశం ఇచ్చే రూపకం ఇది .

యూయం పశ్చిమ బుద్ధయస్తదను మా భూయస్త భో భో నరాః- మావిద్విష్యాచ సేతు సీత నగ యోర్మధ్యే త్రవైయాసకీం

జానీయాత పరాశరాత్మజ మిమాం ధాత్రీం సమద్ధర్తుమే - వోద్భూతం పరమేశ్వరం రుషి గణైః సంప్రార్ధ మానం హరిం

వ్యాసర్షి మానవాళికి చేసిన మహోపకారాన్ని-

"బహుయుగ పరిదీప్తా సాదు సంగృహ్యా విద్యా - క్రుతవతి పది ఏనాకారీ విస్పష్ట రేఖా

నిఖిల జగదనంత ప్రాప్త పుణ్యైక మూర్తిః- జయతి స శుక తాతః స్ఫీత వేదార్ధ భూతః" శ్లోకంతో కీర్తిస్తారు.

ఇలా మూడు రూపకాలలో విశ్వనాధ సంస్కృత సాహిత్యంలోనూ తనకొక ప్రత్యేక స్థానాన్ని పొందారు. విశ్వనాధ రచించిన సంస్కృత కావ్యాలు- శివ పంచశతీ, దేవవగైరా త్రిశతి, గురు ప్రసాదం, శారదా చంద్రమౌళి సుప్రభాతం స్తుతి కావ్యాలు. భక్తికి జ్ఞానానికి నిలయాలు. జీవ దేవ సంబంధాల .

మొత్తంమీద 30కావ్యాలు, 20నాటకాలు, 60నవలలు,10 విమర్శన గ్రంధాలు, 35చిన్న కథలు, 3 నాటికలు, 70 సాహిత్య వ్యాసాలూ, 10 ఇంగ్లీష్ వ్యాసాలూ, 10 సంస్కృత రచనలు, 3 అనువాదాలు. 100 ఉపోద్ఘాతాలు లేక పీఠికలు, మరెన్నో రేడియో భాషణలు చేసిన "సాహితీ కల్ప వృక్షం" విశ్వనాధ. "తను కావించిన సృష్టి తక్కొరుల కాదు" అన్న తిక్కన్నకు దీటైనవాడు. ఆయన రచనలో "ఏదీ ఎంగిలి కూడు కాదు"అని చెప్పుకొన్న సత్తా ఉన్నవాడు. అంటే ఒకదానిలో ఉన్న విషయం మరో దానిలో ఉండదు అన్నమాట.

అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ మస్మాద్రు శుం-డలఘు స్వాదు రసావ తార ధిషణాహంకార సంభార దో-హల బ్రాహ్మీమయ మూర్తి శిష్యుడైనాడన్నట్టి దావ్యోమ పే-శలచాంద్రీ మృదు కీర్తి చెల్లపిళ వంశ స్వామికున్నట్లుగన్ అని తనలాంటి శిష్యుడు ఉన్నాడన్న కీర్తి గురువు చెళ్ళపిళ్ళ వారికే దక్కిందని గర్వంగా చెప్పుకొన్నవాడు. దీనినే "దిషణాహంకారం" అన్నారు. "నా మార్గాముకాదు, నా తాత ముత్తాతల మార్గమూ "కాదు ఇతనిదిఒక కొత్త మార్గం అని గురు ప్రశంస పొందినవాడు. అవిచ్ఛిన్న సంప్రదాయ వాది- "continuation with the past" తో యుగకర్త అయినవాడు విశ్వనాధ. "ఏ బాటలో నడిచినా సమ్రాట్టు. ఆత్మీయం, ఆత్మాశ్రయం, ఆత్మనాయకం"గా వర్ధిల్లాడు. ఈ శతాబ్ది చైతన్యమంతా అగస్త్యునిలా ఆపోసనపట్టి భారతీయ దార్శనిక మూలాలతో విలువ కట్టిన ప్రజ్ఞామూర్తి. అయన పలుకే ఒక ప్రమాణం. ఆయన జీవుని వేదనే కల్ప వృక్ష రామాయణం. షేక్స్పియర్ లాగా నాలుగు విషాదాంత నాటకాలు రాసి మెప్పించిన వాడు విషాదాంత నాటక శిల్ప చతురాననుడు విశ్వనాధ. ఆయన విమర్శలు ప్రతీకాత్మక విమర్శకు ప్రామాణిక సూక్తాలు. ఆయన ఒక సమగ్ర వ్యక్తి.

కళాప్రపూర్ణుడు.

రసం వేయి రెట్లు గొప్పది అని ధంకా బజాయించి చెప్పినవాడు. ఆయన వ్యక్తికాదు. సంప్రదాయ యుగ ప్రవక్త. “నన్నయ తిక్కన నన్నావేశించిరి” అని, ఆగకుండా వారి మార్గాన్ని మెరుగులు దిద్దుతాను అని చెప్పుకున్న ధీశాలి, ప్రయోగ శీలి. శృంగార రస ద్రష్ట, స్రష్ట కవిసార్వ భౌముడు శ్రీనాధుడు అయితే కరుణరస ద్రష్ట, స్రష్ట కవిసామ్రాట్ విశ్వనాధ. 'శిల్పం కాని సాహిత్యం కాని విజాతీయామై ఉండరాదు. జాతీయమై ఉండాలి. వ్రాసిన వానికి ముక్తి చదివిన వానికి రక్తి ముక్తి. యెంత సముద్రం మీద ఎగిరినా పక్షి రాత్రి గూడుకు చేరుకుంటుంది. ఇది జాతీయత. ఇది సంప్రదాయం అన్నవాడు. నేను పోతే నాతో పోయేవాళ్ళు నన్నయ, తిక్కన, ఎర్రన, నాచన, సోమన, శ్రీనాధుడు, పోతన,పెద్దన, తెనాలి రామలింగడు మొదలైన వారు అని ఎలుగెత్తి చాటి చెప్పి సంప్రదాయ పరిరక్షణకు దీక్ష పూనాడు. “ఆయన చేబట్టని, చేబట్టిన దాన్ని స్వర్ణమయం చేయని సాహిత్య ప్రక్రియ లేనేలేదు”అని ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యంగారు మహోదాత్తంగా విశ్వనాధ ఆత్మను ఆవిష్కరించారు. ఇంగ్లీష్ నవలలెన్నో చదివాడు ఇంగ్లీష్ సినిమాలేన్నిటినో చూసి జీర్ణించుకొన్నాడు. ఎక్కడ ఏ కొత్తదనం వున్నా దాన్ని భారతీయత తో దాని శైలిలో రంగరించి తీర్చిదిద్దటం విశ్వనాధ ప్రత్యేకత. నిన్నటి నన్నయ భట్టు నేటి కవి సమ్రాట్టు విశ్వనాధ అని ఆయన తెలుగు వారి గోల్డు నిబ్బు – మాట్లాడే వెన్నెముక పాటపాడే సుషుమ్న అంటూ ప్రశంసించాడు శ్రీ శ్రీ

శ్రీ విశ్వనాధ కవిపండిత సార్వ భౌమ – సుజ్ఞాన పీఠం, సదామృత కావ్య శిల్పాత్

ఐదిష్యదాంధ్ర సుర భారత భానుఃదీప్తి – విశ్వాద్వాధ్యవాఙ్మయ నభస్య ప్రభాం గణేషు

రసమయ శుభ విశ్వ శ్రేయ కావ్యానేకాన్ – సరళ తరల సత్ప్రౌఢిప్రసాను సాధాత్

సకల సుగుణ సంపూర్ణాను మోదప్రభావాత్ – దశ దిశు సుధా దావల్య కాంతే రతన్వన్ (సుధీంద్ర ప్రహ్లాద )

ప్రతిభయే రూపం ధరిస్తే విశ్వ నాధుడే – హిమ గిరి శిఖరం చలించి వస్తే విశ్వనాధుడే

వర్షామేఘం కవనం రాస్తే విశ్వ నాధుడే – వాణి ఆంధ్రుడై వసుధ జనిస్తే విశ్వనాధుడే. ❁



## 335. బాలా త్రిపురసుందరీ మంత్ర మహాయోగి- శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి (1896-1990)

**"నా** కోసం మీరు కంచికి ఇంతదూరం రావలసిన పని లేదు. చందోలులో లలితా త్రిపుర సుందరీ ఉపాసకులు తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారున్నారు కదా! ప్రతి గురువారం వారిని దర్శించండి" అని కంచి కామకోటి పీఠ పరమాచార్యులు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర యతీంద్రుల వారు చెప్పారు అంటే శాస్త్రి గారి యోగసిద్ధి మహిమ ఎంతటిదో మనకు అర్థమవుతుంది.

గుంటూరు జిల్లా చందవోలులో తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి, హనుమమ్మ దంపతులకు శాస్త్రి గారు 1896 ఆగస్ట్ ఇరవై అయిదున జన్మించారు. నిష్టా గరిష్ట కుటుంబం వారిది. చందవోలు శాస్త్రిగారిని అందరు పిలుస్తారు. తాడికొండ వాసి కేదార లింగం గారు "బాలా త్రిపుర సుందరి మంత్రాన్ని" వీరికి ఇచ్చారు. పదహారో సంవత్సరం దాకా ఆ మంత్రోపాసన చేసినందు వల్ల అమ్మవారు వీరికి పలిస్తే పలికేది. దెందుకూరి పానకాల శాస్త్రి వద్ద తర్కం, పొదిలి సీతారామ శాస్త్రి వద్ద మంత్రం నేర్చారు. యవ్వనంలోనే సన్యసించాలనే కోరిక కలిగింది. శ్యామలాంబ అనే యోగిని వీరి తండ్రి గారితో శాస్త్రిగారు సూర్య మండలాంతర్వర్తి అయిన మహాసిద్ధుడు ఈ రూపంలో జన్మించాడని చెప్పింది. శాస్త్రిగారికి చిన్నతనంలో పినతల్లి చూపించిన ఒక దృశ్యం గోచరించింది. అందులో తాను ఒక సిద్ధుడు. శ్రీ చక్రేశ్వరి అయిన కామేశ్వరి దూరంగా ఉన్న యువతుల్ని తీసుకురమ్మన్నది. ఒకరిని మోసుకొని ఇద్దర్నీ తీసుకొచ్చాడు. అమ్మవారు చిరునవ్వుతో అతని మనసు కొంచెం చలించింది అని భూలోకంలో జన్మించమని

తాను మోసుకొచ్చిన అమ్మాయే భార్య అవుతుందని అన్నది. 19వ ఏట అద్దేపల్లి మంగమ్మ, పాపయ్య శాస్త్రుల కూతురు పార్వతితో వివాహమైంది. పిన్ని చూపించింది కూడా ఈమెనే. ఆమె పేరును శ్రీదేవిగా శాస్త్రిగారు మార్చారు.

**పాండిత్య ప్రకర్ష**

శాస్త్రిగారు తండ్రి గారి వేద పాఠశాల నిర్వహణలో తోడు పడుతూ ఉన్నారు. ఆయన పద్ధతి నచ్చిన చాలామంది అమెరికాకు రమ్మన్నారు. వారికి ఇష్టం లేదు. పినపాటి వీరభద్రయ్యతో నేత్రావధానం, ఏలేశ్వరపు పురుషోత్తమ్మ శాస్త్రితో కవిత్వ సాధన చేశారు. అప్పటికే అనేక సభలవారు శాస్త్రిగారికి 400కు పైగా సర్టిఫికేట్స్ ఇచ్చారు. వ్యాకరణ గురువుగారు ముదిగొండ నాగలింగ శాస్త్రి గారితో అనేక అవధానాలు చేసి, ఆ డబ్బు అంతా గురువుగారికే సమర్పించారు. పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖర భారతీ స్వామి సన్నిధిలో జరిగిన అష్టావధానానికి వారు మెచ్చి ఉభయ శ్లేష లక్ష్యంగా ఒక శ్లోకం చెప్పమంటే ఆశువుగా అద్భుతంగా చెప్పి ఒప్పించారు.

**అమ్మవారి సాక్షాత్కారం**

దేశ సంచారం చేస్తూ ఒకసారి ఇంటికి వస్తే ఇల్లు “అయ్యవారి నట్టిల్లు”లా ఉంది. ఇంటి వద్దే ఉండి తండ్రికి తోడ్పడ్డారు. తిండికి గడవని పరిస్థితి. మూడు రోజులు అంతా ఉపవాసమే. మూడవ రోజు రాత్రి 27 సార్లు లలితా సహస్ర నామ పూజ చేసి నైవేద్యం పెట్టిన జలాన్నే త్రాగి అంగోస్త్రం నేల మీద పరచి నిద్రపోయారు. 10 ఏళ్ళ బాలిక కలలో కన్పించి “ఒరే! ముష్టి పెడతాను కొంగుపట్టు” అన్నది. దోసెడు బియ్యం కొంగులో పోసి “బండి వస్తుంది. అందులో కావాలసిని సామగ్రి అంతా వస్తుంది” అన్నది. తెల్లారే సరికి ఖాజీ పాలెం సీతారామరాజు గారి బండి వచ్చింది. అక్కడ రాజు గారు కోరిన మీదట పురాణం చెప్పి రాత్రి ఇంటికి వచ్చేసరికి తలుపు దగ్గర రాజు గారు పోయించిన పుట్టెడు ధాన్యపు రాశి కన్పించింది. అప్పటి నుంచి శాస్త్రి గారింట లక్ష్మీదేవి నిత్య

సాక్షాత్కారమే.

అనేక గ్రామాలలో భాగవతం, హరి వంశం, పురాణం చెబుతూ రాత్రికి ఇంటికి చేరేవారు. పరమ నిష్ఠా గరిష్టంగా జీవించేవారు. ప్రాణాయామం, తపస్సు కొనసాగించారు. ఇంట్లో వేరుసెనగ నూనె, వేరుసెనగ వాడలేదు. దొండకాయ, టమేటా, బంగాళా దుంప, ముల్లంగి కాబేజీ నిషిద్ధం. కాశీకి తప్ప ఎప్పుడు రైలు ప్రయాణం చేయలేదు. శాస్త్రి గారికి మగ సంతానం లేదు. కూతురు లక్ష్మిని చెరువు సత్యనారాయణ శాస్త్రి కిచ్చి వివాహం చేశారు. ఆయనే శాస్త్రిగారి జీవిత చరిత్ర రాశారు.

**అష్ట సిద్ధులు కైవశం**

శాస్త్రిగారిని చందవోలు శాస్త్రిగారు అని ఆ ప్రాంతంవారంతా గౌరవంగా సంబోధిస్తారు. శాస్త్రిగారికి అష్ట సిద్ధులు వశమైనాయి. వాటిని స్వంతానికి ఎప్పుడు వాడుకోలేదు. తాడికొండ వేదపాఠశాలలో దయ్యాలు తిరిగి ఇబ్బంది పెడుతుంటే శాస్త్రిగారు మంత్రం పఠించి పారద్రోలారు. ఒకసారి "వశ్యంకర ఔషధి"ని సేకరించాలని చంద్రగ్రహణం రోజున కొండ ఎక్కి, దాన్ని గుర్తుపట్టి తీసుకొందామని దగ్గరకు వెళ్ళే ఒక బాలుడు అడ్డుకొన్నాడు. బలవంతాన లాక్కోపోతే "నీకు ఈ మొక్కతో పని లేదు. నీ ముఖం చూస్తేనే అందరు వశులౌతారు" అన్నాడు. ఇంతలో గ్రహణం వదిలింది. బాలుడు మాయమయ్యాడు. తనకు దాన్ని పొందే యోగం లేదని భావించారు. అది దత్తాత్రేయ స్వామి అధిపతిగా ఉన్న ఔషధి. పూర్వజన్మ సఖుడైన ఒక యోగి కన్పించి సుఖ దుఃఖాలను సమానంగా భావించాలని చెప్పి మళ్ళీ 50 ఏళ్ళకు కనిపిస్తానని చెప్పి వెళ్ళాడు. సరిగ్గా యాభై ఏళ్ళ తరువాత శాస్త్రిగారు అమరావతి వెళ్ళి అమరేశ్వరస్వామిని దర్శించి తమ గదిలో ప్రాణాయామం చేస్తూ చాలా పైకి లేచి తల క్రిందులుగా పడిపోతుంటే తల నేలకు తగిలే సమయాన ఆ యోగి వచ్చి చేయి అడ్డంపెట్టి కాపాడాడు. శాస్త్రిగారు నమస్కరించగానే యోగి అదృశ్యుడైనాడు.

తండ్రిగారు మొదలుపెట్టిన "శ్రీరామ కథామృతం"ను వారి మరణా

నంతరం శాస్త్రి గారు పూర్తి చేస్తున్నారు. అయోధ్యా కాండంలో గాయత్రి మంత్రం లోని "భకార" వర్ణంతో పద్యం రావటం లేదు. అమ్మను ఉపాసించి నిద్రపోయారు. కలలో ఒక బీబీ జగన్మోహిని నిద్రిస్తుండగా 30 ఏళ్ళ గడ్డం వాడొకడు ఆమె చొక్కా పైకెత్తి పాలు తాగుతున్నాడు. శాస్త్రిగారు ఆ దృశ్యం చూస్తుంటే "ఎందుకు నిలబడ్డావు?" అని అడిగింది. "నాకూ పాలు ఇస్తావా?" అని అడిగారు. మెలకువ వచ్చి "భర్మ మయ రమ్య హర్మ్యము" అనే భ వర్ణంతో పద్యం తేలిగ్గా వచ్చింది. శాస్త్రిగారు మహా ఆగమ పండితులు. ఇంటి ఆవరణలో దత్తాత్రేయ, సుబ్రహ్మణ్య, సీతారామ లక్ష్మణ, హనుమాన్ దేవాలయ నిర్మాణం చేవారు. తనకు వ్యాకరణం నేర్పిన గురువుగారిని నిత్యం పూజా సమయంలో స్మరించేవారు.

ఒకసారి పుస్తక ముద్రణ కోసం చందాలకు తిరుగుతూ ఉంటే సత్తెనపల్లిలో ఒక బ్రాహ్మణుల ఇంట్లోకి ఇరవైయేళ్ళ యువతి కనిపించి, నమస్కరించి లోపలికి వెళ్ళింది. ఆమె గ్రహ పీడితులు. అందర్ని కొడుతూ, తిడుతూ ఉండేది. అలాంటిది శాస్త్రి గారిని చూడగానే అత్యంత వినయాన్ని ప్రదర్శించటం ఇంట్లో వారందరికి ఆశ్చర్యం కలిగింది. ఆమెను గ్రహప్రేరణ చేసి "ఏం చేస్తే నువ్వు పోతావు?" అని అడిగారు. "సహస్ర గాయత్రీ జప ఫలం ధారపోస్తే పోతాను" అంది. శాస్త్రిగారు సహస్ర గాయత్రి జపం చేసి ధార పోశారు. ఇంటి ముందున్న వేపచెట్టు కొమ్మ విరిగి పడింది. దెయ్యం వదిలింది. వేరొకసారి నాగుల చవితి రోజు కాలవలో స్నానం చేసి వస్తుంటే నాగలి చాలులో పడుకొన్న నాగుపాము తోకపై ఆయన కాలు పడింది. అది బుసలు కొడుతూ పైకి లేచి కాటువేయ బూనితే "గారుడ మంత్రం" జపించారు. సర్పం తల నేలకు వాల్చింది. "స్వామీ! నీ జోలికి నేను రాలేదు. నా జోలికి నువ్వు రావద్దు. పొరపాటున నా కాలు తగిలింది. వెళ్ళిపొండి" అనగానే పాము వెళ్ళిపోయింది. ఆ రోజంతా గారుడ మంత్రం పఠిస్తూనే ఉన్నారు.

**చందవోలు శాస్త్రి గారి రచనలు**

చందవోలు శాస్త్రిగారు గొప్ప కవి. సంస్కృతంలో తెలుగులో రచనలు చేశారు. అందులో సంస్కృత రచన మత్స్యప్నః అనేది చాలా ప్రసిద్ధమైనది.

ఇదికాక హేమ దుర్గాంబికా శతకం, పాండు రంగేశ్వర ప్రశస్తి, బాల త్రిపుర సుందరీ సమేత రాజ రాజ నరేంద్ర స్తవం, శాంకరీ స్తవం, ప్రభు ప్రపత్తి, సహస్ర లింగేశ్వర స్తుతి, దత్తాత్రేయాస్టక గర్భితాత్మ సుప్రభాతం, ప్రారబ్ధ ప్రాబల్యం, దత్త భగవంతం, శ్రీరామ కథామృత శేష పురాణం, శివలీల, తుకారామదాసు చరితం, వాసుదేవ సారదీయం మొదలైనవి రచించారు. లౌకిక వ్యవహారంగా "నాయోగము" పాడిన పాట, నా యాత్ర (కాశీ), నాకు తోచిన మాట, ఇంకొకమాట (వ్యాసావళి). మత్స్వప్నంలోని శాస్త్రి గారి కవితా వైదుష్యాన్ని దర్శిద్దాం.

శ్రీమాతా శ్రీ మహా రాజ్ఞీ- స్వధ్యాసీనా దేహలీ మధ్య మార్యా దృష్టా ప్రదుస్టతః- శిల్పా నల్పాకల్ప భాసమానా

తాత్పర్యం- మంగళకరమైన తల్లి బాలా త్రిపుర సుందరీ దేవి, సహస్రనామాలకు అధిదేవత. లక్ష్మీ వైభవం ఇచ్చేది, శ్రీ విద్యా స్వరూపిణి, దేవతలందరికీ అధినేత్రి అయిన ముత్తైదువ మా ఇంటి గడప మధ్యభాగంలో కూర్చుని కల్పలతలతో సృష్టింపబడిన అంతులేని శిల్ప ప్రావీణ్యం గల సర్వాభరణాలతో ప్రకాశించే నా తల్లి నా అదృష్టవశాన స్వప్నంలో సాక్షాత్కరించింది.

అప్పుడు శాస్త్రిగారు అమ్మవారిని అమ్మా! మమ్మల్ని అందరిని కన్న తర్వాత శంకరుని వివాహం ఆడావా లేక ముందేనా? అని ప్రశ్నించారు. అమ్మ నవ్వి భండాసుర వధను తాను ఎలా చేసిందో వివరించింది ఆ కథను. అంతటినీ శాస్త్రిగారు ఇందులో రాశారు. మళ్ళీ సందేహం రావటం బాలాదేవికి నివేదించటం ఆమె కథా రూపంలో తెలియజేయటం ఇందులో విశేషం. త్రిమూర్తిలకు భేదం లేదని చెప్పారు.

ఈశో విష్ణుః శ్రీ రుమా వాణ్యు మాజోక్ష పీశ శ్శక్ర ఈశా వాచీద్యా- స్త్రీ సర్వోమా పూరుషస్సర్వ ఈశః- ఇత్యూచే కోపి శ్రుతే ర్మౌళిభాగ

**భావం-** విష్ణువే ఈశ్వరుడు, లక్ష్మి పార్వతి, వాణిపార్వతి, బ్రహ్మ ఈశ్వరుడు, ఇంద్రుడు ఈశ్వరుడు, శచీదేవి పార్వతి ఇలా స్త్రీలు అందరూ పార్వతీ స్వరూపులే, పురుషులంతా ఈశ్వర రూపులే అని ఉమామహేశ్వర ఉపనిషత్ బోధించింది అని చెప్పారు. చివరికి తనకు విద్యలో రచనలో సహాయం చేసిన శ్రీ మద్దులపల్లి

మాణిక్య శాస్త్రి శ్రీ నాగలింగశాస్త్రి వంటి మహనీయులను స్మరించి చివరి శ్లోకంగా తద్వద్యో యో మేలమేకం దదౌతు- చిత్తేనాహం గౌరవేణార్చయామి- దైవభ్యో మిత్రేభ్య ఉచ్చైర్గురుభ్యః- పాండి త్యాన్నత్యర్ధి వద్భ్యో నమాం స్యోం అని చెప్పారు. అర్థం- ఏ ఏ మహాత్ములు నాకు ఒక్క అక్షరమైనా ఇచ్చారో వారందర్నీ గౌరవ ప్రపత్తులతో అర్చిస్తున్నాను. దేవతలకు మిత్రులకు, సహచరులకు, పెద్దలైన గురువులకు, సర్వ సమత్వాన్ని ప్రవచించే ప్రబుద్ధులకందరికి నమస్కారాలు. ఇంతకంటే చేయాల్సింది, చెప్పాల్సింది ఏమీ లేదు అని అంతటి కర్మిష్ఠి బ్రహ్మిష్ఠి వశ్యవాక్కు, నిత్య బాలా త్రిపుర సుందరీ దర్శన పులకాంకితులు, శ్రీ విద్యోపాసకులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారు అత్యంత వినయంగా చెప్పుకొన్నారు. ఇది అందరికీ ఆదర్శం. శ్రీ విద్యోపాసకులు కనుకనే ఈ గ్రంథాన్ని రాయగలిగారు. చిన్నదే అయినా ఈ శ్లోక గ్రంథం అందరికి పఠనీయం. ఈ గ్రంథాన్ని శాస్త్రిగారి దౌహిత్రులు ఉభయభారతి బిరుదు పొందిన సంపూర్ణ సంస్కృత శతావాధానం నిర్వహించిన సంస్కృతంలో కవితా మయూఖా వంటి బహుగ్రంథకర్త శ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రి గారు ముద్రించి లోకానికి అందజేశారు. చందవోలు శాస్త్రిగారి తండ్రిగారు శ్రీ వెంకటప్పయ్య శాస్త్రిగారు కూడా విద్వత్ కవులే. సంస్కృతంలో శ్రీ శైల తీర్థ సారోఖ్యోయం వంటి గ్రంథ రచయిత.

శాస్త్రిగారు 90 ఏళ్ళ జీవిత కాలంలో 80 ఏళ్ళు "బాలా మంత్రానుష్టానం" చేసిన మహనీయులు. ఒకసారి కాశీలో గంగా స్నానం చేస్తుంటే గంగాదేవి గలగలా లాడే బంగారు గాజులున్న చెయ్యి చూపించి "నాకేమి కానుక తెచ్చావు?" అని అడిగింది. శాస్త్రిగారికి ఏమీ పాలు పోక తన వ్రేలికున్న బంగారు దర్భ ఉంగరం తీసి ఆమె చేతిలో పెట్టారు. బసకు తిరిగి వచ్చి దేవతార్చన పెట్టి తెరిస్తే గంగకు అర్పించిన ఉంగరం అందులోనే ఉంది. తానేమైనా పొరపడి దర్భ ఉంగరం ఇవ్వలేదా అని సందేహించి ధ్యాన నిమగ్నమయ్యారు. గంగమ్మ కనిపించి "కానుక ఇమ్మంటే దర్భ ఉండరం ఇచ్చావేరా?" అన్నది. "అది నీకు పితృ తర్పణం చెయ్యటానికి ఉపయోగపడుతుంది కాని నాకు ఆభరణం ఎలా అవుతుంది?" అని గద్దించింది. "అమ్మా నేనేమి నీ కోసం తేలేదు. ఆ సమయానికి అది స్ఫురించి

ఇచ్చానంతే" అన్నారు. మళ్ళీ గంగమ్మ "నీ భార్య దగ్గర నా కోసం తెచ్చిన నగ ఉంది. అది తెచ్చివ్వు" అన్నది గంగ. శాస్త్రిగారు భార్యను అడిగి నగను తీసుకొనిపోయి "గంగార్పణం" చేశారు.

ఆయన తన కార్యక్రమాలన్ని ముగించుకొని వాకిలి అరుగు మీద కూర్చుంటే వందలాది మంది వచ్చి తమకు ముహూర్తం పెట్టమనో, పేరు పెట్టమనో అడిగేవారు. కాసేపు కళ్ళు మూసుకొని ముహూర్త నిర్ణయం చేసేవారు. అంతే. ఆ కార్యక్రమం శుభప్రదంగా జరిగిపోయేది. దానికి తిరుగులేదు. అదీ వారి మంత్ర సిద్ధి.

దాదాపు ముప్పై ఏళ్ళ క్రితం కాంచీ పరమాచార్యులు ఉయ్యూరు కే'సి'పి వారి ఆహ్వానం, గురజాడలోని చల్లా శర్మగారు ఏర్పాటు చేసిన కార్యక్రమంలో వారం రోజులున్నారు. అప్పుడు రాఘవ శాస్త్రిగారు ఇక్కడే ఉన్నారు అన్ని రోజులు. అప్పుడు వారిని చూశాను. జగద్గురువులను వీరినీ ఒకేసారి చూసే భాగ్యం కలిగింది. అప్పుడే "నడయాడే దైవం" అని పరమాచార్య మీద పుస్తకం ఆవిష్కరణ జరిగినట్లు జ్ఞాపకం. 10-12-1990 ప్రమోదూత మార్గశిర బహుళ నవమినాడు శాస్త్రిగారు బాలా త్రిపుర సుందరి అమ్మవారి ఒడిలోకి శాశ్వతంగా చేరిపోయారు. వారి పార్థివ దేహానికి అగ్ని సంస్కారం చేస్తున్నప్పుడు అమ్మవారి ఆకారంగా చితి మంటలు ఆకాశానికి లేవటం ఎందరో చూసి పరమాద్భుతంగా వర్ణించారు. వార్తా పత్రికలలో వేశారు. శాస్త్రిగారు కారణ జన్ములు. వారి పేరు వింటే చాలు, సకల శుభాలు కలుగుతాయి. ❁

## 336. హైకోర్ట్ అడ్వోకేట్- మకలింగ శాస్త్రి (1897)

**మ**ద్రాస్ హైకోర్ట్‌లో అడ్వొకేట్ అయిన మక లింగ శాస్త్రి యజ్న స్వామి కుమారుడు. రాజు శాస్త్రి అని పిలువబడే త్యాగరాజు ఈతని ముత్తాత. అప్పయ్య దీక్షితులకు పన్నెండవ తరంవాడు. 1897లో పుట్టుక. చిన్నప్పటి నుండి గీర్వాణం వంటబట్టి కవితలో గీర్వాణం చూపాడు. వనలత, నదీపూరం, వ్యాజోక్తి రత్నావళి, అర్థాన్తరన్యాస పంచాశత్, భారతి విషాదం, భ్రమర సందేశం, దుర్జన హృదయం మొదలైన లఘు కావ్యాలు రాశాడు. కలి ప్రభావం అనే కథా సంపుటి వెలువరించాడు. భాస నాటకాలను భాస కథాసారంగా వచనంలో రాశాడు. ఉద్గాత్రిదశానన ప్రతి రాజ సూయం అనే నాటకాలు రచించాడు. దేశంలోని విశ్వ విద్యాలయాలు ఈయన ప్రతిభా విశేషాలకు ముచ్చటపడి ఆహ్వానించి సన్మానించాయి. ❁

## 337. డా.ఈశ్వర వరాహ నరసింహం (1898 -1979)

**వి**శాఖ జిల్లా ఉప్మాకలో పుట్టి, మెడికల్ ఆఫీసర్‌గా సేవచేసి, దశోపనిషత్తులను తెలుగు చేశారు. పతంజలి యోగ సూత్రాలను, సంఖ్య కారికలను ప్రచురించారు. తెలుగువారు సంస్కృతం నేర్చుకోవటానికి 'సంస్కృత పాఠమాల' రాశారు. ❁

## 338. ఇతర మలబారు కవులు (1900)

**మ**న విక్రమ ఎత్తాన్ తాంబిరాన్ అనే జమోరిన్ రాజు 1920లో చనిపోయాడు. ఆశుకవిగా సుప్రసిద్ధుడు. వందలకొద్దీ చిన్న కవితలు రాసాడు.

రాజరాజవర్మ తిరువాన్కూర్ సంస్కృత అధ్యయన కేంద్రానికి పర్యవేక్షకుడిగా ఉండేవాడు. స్వయంగా పాణినిపై బృహత్ వ్యాఖ్యానాన్ని రాసాడు. దీంతోపాటు ఆంగ్ల సామ్రాజ్య మహాకావ్యం, విటా విభావరి కావ్యాలు రాసాడు. 1863– 1918 కాలానికి చెందినవాడు.

తొల నంబూద్రి కవి తొల కావ్యాన్ని చందనపల్లికి చెందిన ఎడయాత్ రామ చరిత కావ్యాన్ని కుంజు కొతాన్ తంబిరాన్ యాదవ విజయాన్ని, ఎదవతి కోడమనకు చెందిన నంబూద్రి పాద్ రుక్మిణీ స్వయంవర ప్రబంధం, కున్హుకుత్తాన్ తంబిరాన్ కిరాత వ్యాయోగం, బభ్రువాహన చంపూ, కుచున్ని తాంబిరాన్ గోశ్రీ చరిత్ర, బాణాయుధ చంపూ. విప్రసందేశంతోపాటు అనంగ విజయం, విరాట జయ విజయం అనే రెండు భాణాలను రచించారు. రామ వారియర్ కవి ఆర్యా సప్త శతి రాస్తే ఉన్ని నంబూద్రి మహిష మంగళ నంబూద్రి భానణాలను రాసారు. ఒకతోల్ నారాయణ మీనన్ (1890), తపతీ సంవరణ మహా కావ్యాన్ని, దేవీ స్తవం, కృష్ణ శతకం రాసాడు.

## 339. కేరళ స్త్రీ కవులు (1900)

**కే**రళ కవుల్లో మనోరమ అనే స్త్రీ కవి సుమారు 100 ఏళ్ల క్రితం చనిపోయింది. కదతనాట్ ఎదవలత ఆస్థానానికి చెందిన లక్ష్మీ రాజ్ఞి అనే రాణి సంతాన గోపాల శతకం రాసింది. కొచ్చిన్ రాణి సుభద్ర సుభద్రాస్తవం రాసింది. ఈమె 1921లో మరణించింది.❁

## 340. బెంగాల్ కవయిత్రులు (1900)

**1**3 ఏళ్ళ రత్నీదేవి రఘు వంశాన్ని వచన కావ్యంగా రాసింది. రమేశ్చంద్ర కుమార్తె అయిన శాంతసేన 1910లో జన్మించింది. కలకత్తాలోని ఆశుతోష్ కాలేజీలో సంస్కృతాచార్యునిగా పని చేసింది.

జ్యోతీ చంద్ర సేన్ భార్య మాలతీ సేన్ 1903లో జన్మించి కలకత్తా వర్సిటీలో డిగ్రీ సాధించింది. సాహిత్య అలంకార శాస్త్రాలపై అనేక వ్యాసాలు రాసింది. వామనుడి కావ్యాలంకార సూత్రాలకు గొప్ప వ్యాఖ్యానం చేసింది. సతీంద్ర దేవుని భార్య ఉమాదేవి ఆభానక మాల కావ్యం రాసింది.❁

## 341. అనంగ రంగం రంగరించిన-కళ్యాణ మల్ల (1900)

**“అ**నంగ రంగం”ను రంగరించి కళ్యాణ మల్ల ఔద్ రాజు అహ్మద్ ఖాన్ కొడుకు లాడా ఖాన్ లోడిని సంతృప్తి పరచాడు. పది అధ్యాలలో ఇంద్రియ సుఖాలను, స్త్రీలలోని జాతులను గురించి ముఖ్య విషయాలను సంక్షిప్త పరచి రాశాడు. “సులోమత్” చరిత్రలో, “ఓల్డ్ టెస్టమెంట్”లోని డేవిడ్ కొడుకు సాల్మన్ రాజు” గురించి సంస్కృతంలో రచించాడు.❁

## 342. శ్రీ యామవరం రామశాస్త్రి (1900)

మెదక్ జిల్లా కాకుమాను గ్రామంలో జన్మించిన శ్రీ రామ శాస్త్రి, రామకృష్ణ పండితుని మనవడు. కుటుంబంలో అందరూ కవి పండితులే. కాకుమాను రామశాస్త్రిగా ప్రసిద్ధులు. శ్రీ విఠల చంద్ర మౌళి వద్ద వేదాంతాన్ని, పినతండ్రి కృష్ణ శాస్త్రి వద్ద సంస్కృత కవిత్వాన్ని అభ్యసించారు. దొంతి సంస్థాన విద్వాంసుడు వెంకట పౌండరీక యజ్వ దగ్గర కావ్య శాస్త్రాలు నేర్చారు.

పాతికేళ్ళ వయసులోనే(1919) రామశాస్త్రి చిత్ర కవిత్వానికి ఆకర్షితులయ్యారు. 250 శ్లోకాలతో నాలుగు భాగాలుగా, 18 ఖండాలుగా 'గురుస్తుతి' కావ్యం రాశారు. కాని మొదటిభాగంలో 88 శ్లోకాలు మాత్రమే తెలుగు అచ్చులో అచ్చు అయ్యాయి. మొదటిభాగంలో 5 ఖండాలున్నాయి. అవి–ప్రణవాదిశ్లేష ఖండం, బ్రహ్మాది శ్లేష ఖండం, బృహస్పత్యాది శ్లేష ఖండం, సంకీర్ణ శ్లేష ఖండం, చిత్ర శ్లేష ఖండం. గురువు యొక్క గొప్పతనాన్ని శ్లేష, యమక, అనుప్రాస, ఏకాక్షర, ద్వ్యక్షర కవిత్వాలలో చెప్పారు. చిత్ర కవితకు గొప్ప ఉదాహరణగా ఈ కావ్యం ఈ ఇరవయ్యవ శతాబ్దంలో శాశ్వతంగా నిలిచింది. ఇన్ని రకాల శ్లేషలను ప్రయోగించటం వలన 'శ్లేష యమక చక్ర వర్తి' బిరుదు పొందారు. కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం – విష్ణువును గురువును శ్లేషలో వర్ణించే శ్లోకం – "పరతవ బుద్ధ్యా చ ప్రవిష్టాన్–దసస్వ సుదర్శనాభ్యాం–స్వరస్తాన్ గురుః పుణ్య జనాన్ సుసత్వాన్ – కుర్వన్ స దామోదర తాముపైతి".

మరోశ్లోకంలో గురువును స్త్రీని శ్లేషలో పోలుస్తూ చెప్పారు – అభ్రా మధ్యా నయజ్ఞా త్య సమస్త నమితా సుహృత్ –ప్రాతివ్రత్య పరా పాతత్ – భామేవ

హ్యాక్రుతి ర్గురేః
ప్రశ్నోత్తర మాలికి ఒక ఉదాహరణ – "కోపమాన్ విహీనః స్యాత్ ?(కోప మాన విహీనః స్యాత్ )
సద్గురొఃకా మహాత్మా?"(సద్గురేః కా మహాత్మతా )
చిత్ర శ్లేష ఖండం నుంచి ఒక ఉదాహరణ – "పామావాంశ్చ పరాజితః – సుసమితౌ కాపాలికా సన్మతా
విస్టఃకోపమాలా శ్యాస్చ పశుభౌ – లబ్ధ్వా విపద్వి జ్జనితం – కృత్వా తాపాప రాయ ణాస్రిత జనాన్ సర్వోపకారీ మహా
పాపాత్మా పది తోశిరే పరహితత్వం త్వం భావాప్యామలః"
ఇందులో 'ప' అక్షరం ఉన్నప్పుడు ఒక శబ్దం తీసేస్తే వేరొక శబ్దం వస్తాయి. ప ఉంటె చెడు అర్ధం తీసేస్తే మంచి అర్ధం రావటం ఈ చిత్ర కవిత్వ లక్షణం. ఈ విధంగా ఇరవైవ శతాబ్దిలో ద్వ్యర్ధి, యమక కావ్యాలురాసిన కవులు చాలా అరుదుగా మెదక్ జిల్లాలో ఉన్నారు.❁

## 343. 'విద్వత్ చరిత పంచకం'కర్త – కిస్టే నారాయణ శాస్త్రి (1900)

**సా**హిత్యాచార్య కిస్టే నారాయణ శాస్త్రి కాశిలోని సరస్వతి భవన్ గ్రంథాలయాధికారి. 'విద్వత్ చరిత పంచకం' అనే పేరిట అనేక మంది గొప్ప గొప్ప విద్యావేత్తల జీవిత చరిత్రలను రాశాడు. సులభ శైలీ చక్కని వివరణతో పుస్తకం రక్తి కట్టింది.❁

## 344. శ్రీ ఎక్కిరాల శేషాచార్య (19వ శతాబ్దం)

**కా**ళహస్తి కవిగా ప్రసిద్ధులు. 'మదన విజయ భాణం' అనే దాన్ని మదనమంజరి, పల్లవ శేఖరుల ప్రేమ పెళ్ళిగా రాశారు .- బాణాల శేష సూది వాదూల భావనారాయణ శిష్యుడు. శ్రీ కృష్ణునిపై పద్య గద్య రచన చేశాడు.❁

## 345. శ్రీ చంద్రగిరి వేంకటాచార్య (19వ శతాబ్దం)

**శ్రీ**నివాసాచార్య మనవడు. తాతాచార్య కుమారుడు. చంద్రగిరి వాసి. 'శృంగార భూషణ భాణం'ను వామన భట్ట భాణుని రచనకు అనుకరణగా రాశాడు.❁

## 346. శ్రీ ఎస్.హెచ్. రఘునాధాచార్య (19వ శతాబ్దం)

**తి**రుపతి సంస్కృత కాలేజి వైస్ చాన్సెలర్. సంస్కృత వ్యాప్తికి విశేష కృషి చేశారు. 'రామ విజయ కావ్య' రచయిత. 'దశావతార సుప్రభాతం మరొక రచన.❁

## 347. ప్రొఫెసర్ వెంపటి కుటుంబ శాస్త్రి (19వ శతాబ్దం)

**బ**హుముఖీన ప్రతిభగలవారు. రాష్ట్రీయ సంస్కృత సంస్థాన్‌కు వైస్ చాన్సలర్. అనేక విధ కావ్య రచన చేశారు. 'శ్రీశ వింశతి', శ్రీ జగన్నాధ షోడశి, శ్రీ గురు ప్రపత్తి' ధన్యాస్టకంలను రాసి అన్నిటిని కలిపి 'వన మాల' అనే సార్ధక నామంతో ప్రచురించారు. మధుర మంజుల కవిత్వం ఇందులో ప్రవహించింది. జాషువాగారి 'పిరదౌసి, కరుణశ్రీ 'కుంతీకుమారి'లను సంస్కృతీకరించారు. ని ద్రేమే ప్రియ వల్లభే, విధరమే బలవానుగూడా రాశారు.❁



## 348. ప్రొఫెసర్ హరే కృష్ణ శతపధి (19వ శతాబ్దం)

**తి**రుపతి సంస్కృత కాలేజి వైస్ చాన్సలర్. ఒరిస్సా వారైన ఈయన జగన్నాధుని ఒడిలో నుంచి తిరుపతి వెంకటేశ్వర స్వామి ఒడిలోకి చేరారు. సంస్కృతంలో సంస్కృతీ, వారసత్వంలపై యాభై వ్యాసాలూ రాశారు. అనేక అంతర్జాతీయ పురస్కారాలందుకొన్నారు. ఒరిస్సా సాహిత్య అకాడెమి అవార్డ్, దిల్లీ సంస్కృత అకాడెమి అవార్డ్ మొదలైనవి వీరి కీర్తి కిరీటంలో కలికితురాయిలు. సంస్కృతంలో అనేక కావ్యాలు రాశారు. ఆయన కవిత్వంలో పదాలు నాట్యం చేస్తాయి. వీరి 'మహోదధి సుప్రభాతం' విశేష ప్రాచుర్యం పొందింది. ఇందులో ఉన్నవి 28 శ్లోకాలు మాత్రమే. భావన పరమ వైభవంగా ఉంటుంది. మహోదధి స్తోత్రంలో అయిదు శ్లోకాలు, మంగళాశాసనంలో మూడు శ్లోకాలున్నాయి. పూరీ క్షేత్రమైన శ్రీ క్షేత్రంలో ఉన్న సముద్రానికి అక్కడి జగన్నాధస్వామికి ఉన్న సంబంధాన్ని విశేషంగా వర్ణించారు కవి. మహోదధికి జగన్నాధుని అల్లునిగా చిత్రించారు. తన కుమార్తె శ్రీమహాలక్ష్మిని సముద్రుడు జగన్నాదునికి భార్యగా సమర్పించి మామగారైనాడు. హిమవంతుడు తన కూతురు పార్వతీ దేవిని శివుని అర్ధాంగిని చేసి మామగారైనట్లుగా ఇది ఉంది. కవిత్వం పూరీ సముద్రంలా ఉప్పొంగి హృదయాలను రసప్లావితం చేస్తుంది.❁

## 349. శ్రీ వి ఆంజనేయ శర్మ (19వ శతాబ్దం)

**స**ంస్కృతంలో అఖండ పండితుడు మహాకవి 'శ్రీ పరమ హంస, శ్రీ శారదాదేవి' వీరి మహత్తర రచనలు. 'కవిరాజ హంస', 'దర్శన కళానిధి' వీరి బిరుదులు. ✺

## 350. శ్రీ పుల్లాపంతుల వెంకట రామశర్మ (19వ శతాబ్దం)

**గొ**ప్ప సంస్కృత విజ్ఞాని. ఆజన్మ కవి. గద్వాల్ సంస్థానంలో పదమూడు ఏళ్ళకే ఆశుకవిత్వం చెప్పి మెప్పించారు. కర్నూల్ మునిసిపల్ హైస్కూల్ తెలుగు పండిట్‌గా ఉన్నారు. లెక్కలేనన్ని అష్టావధానాలు చేశారు. శర్మగారి సంస్కృత రచనలు – గజేంద్ర మోక్షం పద్ధతిలో 'రాజ రాజ కావ్యం' రాశారు. 'శ్రీ రాఘవేంద్ర ప్రభాత స్తవ రత్నమాల' రాశారు. ✺

## 351. శ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రి (19వ శతాబ్దం)

**వ**రంగల్ ఎస్ వి ఎస్ ఏ కళాశాల ప్రిన్సిపాల్ చేశారు. 'భగవద్గీతా తత్వ ప్రభ 'రాశారు. శ్రీ ఉదయరాజు శేషగిరిరావు 'శారదా స్తుతి, శృంగార తరంగిణి' రాశారు. ✺

## 352. నరసింహ విజయ వ్యాయోగ కర్త – దేవులపల్లి అన్నపూర్ణేశ్వర శర్మ (19వ శతాబ్దం)

**దే**వులపల్లి సుబ్బరాయ కుమారుడే అన్నపూర్ణేశ్వర శర్మ. కౌండిన్యస గోత్రీకుడు. నూజివీడు జమీందారిలోని శోభనాద్రి వాసి. 'నరసింహ విజయ వ్యాయోగం' నాటకం రాశాడు. ఇతని కాలం గురించి తెలియదు. ఈ నాటకంలో మూడవ వంతు భాగమే దొరికింది. ఉన్న పదిహేను పత్రాలలో 3, 5, 7, 10, 11, 15 మాత్రమే లభించాయి. మూడవ పత్రంలో నటి, సూత్రధారుల సంభాషణ ఉంది. ఇందులో కవిజీవితాన్ని చెప్పాడు. ఈ కొద్ది భాగాలలోనే కవి మేధస్సు, కవిత్వ సౌరభం తెలుస్తుంది. లభించని పత్రాలలో ఏమి ఉందో తెలియదు. హరికి సురాచార్యుడు హిరణ్య కశిపుని చేతిలో సూర్యుడు పొందిన పరాభవం వివరించాడు. రంగదాసుడికి శోభనాచల మహాత్మ్యాన్ని గురించి వసంత వివరిస్తుంది. వసంత కుసుమారుడు గరుడ వాహన విశేషాలను వివరిస్తాడు. నారదుడు నరసింహావతార ఆవిర్భావాన్ని వివరించాడు.

"తచ్చా లాస్య స్తంభ తౌంభోధరణి కర సముజ్జృమ్భ గంభీర రావః – శుమ్భా జ్రుమ్భ ద్విషద్విండధర దలనాజ్జృమ్భ దంభోలికేళిః–వీక్షా రూక్ష స్ఫులితంగక్రుమ్భిత దితిసుతా ధ్యక్ష సూతే స్సమక్షం – రక్షా మీక్షా న్వల క్షధృతి వితాతినృహర్యక్ష రూపోక్షరో భూత్"❀

## 353. దృశ్య శ్రవ్య మిశ్రమ కావ్యం రాసిన – వడ్లమాని అన్నయ శాస్త్రి (19వ శతాబ్దం)

**వా**ధూలస గోత్రీకుడు వడ్లమాని అన్నయ శాస్త్రి విశాఖ పట్నం సంస్కృత పాఠశాలలో సంస్కృత పండితునిగా పని చేశాడు. 'సీతారామ రాజాభ్యుదయం' అనే చంపూ నాటకం రాశాడు. సాధారణంగా కావ్యాలు దృశ్యకావ్యాలుగానో శ్రవ్య కావ్యాలుగానో ఉంటాయి కాని ఈకవి దృశ్య శ్రవ్య మిశ్రమం చేసి రాశాడు. ఉపోద్ఘాతంలోనే కవి ఈ విషయం వివరించాడు– "సంతు ఖలు భువి బహూని నాటకాని,అనేకాని చ కావ్యాని ప్రబంధాశ్చ బహువిధాః తాద్రుష్పద్ధతి వ్యతిరిక్తతాయాంపూర్వకల్పితదృశ్య శ్రవ్యత్వో భయ సంబంధ మిశ్రతయా వివిధ కావ్య రాసాని మగ్నానామపి బుధ నామాహ్నదకారిణీ భవే దియామితినిశ్చినుమః ". దీన్ని రాయటాన్ని సమర్థించుకొన్నాడు కూడా.

ఇది మిశ్రమ కావ్యం అనటానికి రచయితలకు, పాత్రలకు మధ్య జరిగే సంభాషణలు దృశ్య కావ్యం అని పిస్తే, సుదీర్ఘ వర్ణనలు శ్రవ్య కావ్యం అనిపిస్తుంది. ఈ చంపూ నాటకంలో నాలుగు స్తబకాలున్నాయి. మొదటిస్తభకం 'నాయక వంశాభి వర్ణనం' లో 'నాయకుడైన సీతా రామరాజు వంశాభి వర్ణనం' చేశాడు కవి. రామ రాజు కాకర్ల వంశస్తుడు. ఆలమందలో ఉండేవాడు. ఇది విజయనగర ప్రభువు ఆనంద గజపతి రాజు పరిపాలనలో ఉండేది. కాకార్ల వంశం వారు విజయనగర రాజుకు సైనికాధికారులు. రామరాజు పూర్వీకుల వర్ణన కూదాచేశాడు కవి. రెండవ స్తబకం 'కృతి సమర్పణం'లో హరిహర రాజ పట్టాభిషేక వర్ణన ఉంది. మూడవది 'యువ రాజ విలాసం ''లో సీతారామ రాజు చేసిన త్యాగం

,అయన వివాహం ,పట్టాభి షేకం రాజు మంత్రి కొడుకుతో వింధ్యగిరి పర్యటన ఉంటాయి .నాలుగవ స్తబకం' సమ్మేళనంలో సీతారామ రాజు పుణ్య క్షేత్ర సందర్శనం, ఇతర రాజులపై యుద్ధాలు విజయాలు, అంతంలో తండ్రీ కొడుకుల సమాగమం ఉన్నాయి. ఈ కావ్యంలో శాంతరసం ఉందని కవే చెప్పాడు.

పండిత ప్రకాండుల ప్రశంసలు అందుకొన్నాడు కవి అన్నయ శాస్త్రి. ఇది అతి అరుదైన సంస్కృత చంపూ కావ్యం. కవి కవిత్వ ప్రతిభకు కొన్ని ఉదాహరణలు చూద్దాం.

"ఆస్తి ఖల్వాఖిల వసుంధరా వలయ ప్రతి నిధిః సహస్ర రధసవిలాస గమన సముచితా విశంక తరధ్యాపయ పధిక జన సతత సంచరణ మసృణిత విపులోపల ఫలక ధటితఘంటా సంతత క్రేతృ జన సముదయ బహు ముఖారవ పూరణ జనిత ప్రతిధ్వానతయా అనపేక్షిత" – ఇలా సాగే కమ్మని కవిత్వం. చివరలో 'శ్రీ మదానంద గజపతి మహా రాజేన పరిపాలయ మానస్య మహా మండలస్య శ్రీమత్పులమండనగరీ' అని పూర్తి చేశాడు.

రెండవ స్తబకంలో – "అహో అస్య శశి మృతోః–సౌభాగ్యం తదాహి – అల్పావశేష తదన్కా పటలీతరూణాం నత్యన్య మండన వతీ వినితేవ భాతి"❁

## 354. దామెర చిన వెంకటరాయలు (19-20 శతాబ్దం)

**తూ**ర్పుగోదావరిజిల్లా జగ్గంపేట జమీందార్ దామెర చిన వెంకటరాయలు19-20శతాబ్దాలకు చెందినవాడు. తెలుగు సంస్కృతాలలో గొప్పకవి. తండ్రి పెద వేంకటరాయలు వేంకటాచల మహాత్మ్యం రాశాడు. తాత లాగా కవుల, పండితుల విద్వాంసుల మధ్య చినవెంకన కాలక్షేపం చేశాడు. గుల్మ శూల నొప్పితో చివరి రోజుల్లో బాధ పడేవాడు. ఈ బాధోపశమనం కోసం సూర్యానుగ్రహం పొందటానికి 'సూర్య సప్తతి' రాశాడు. దీన్ని 11-6-1905న పూర్తి చేశాడు.

'అభ్యక్షి దిగ్గగ్లో సంఖ్యా ర చే శాలివాహనస్య శకే-విశ్వావసు శుక్రసిత శ్రీ విష్ణు దినే ర్కసప్తతి రచితా' అన్నాడు.

ఈ కావ్యం అంతా శ్లేష యమకాలతో నడిపాడు. దీనికి జనసామాన్యానికి తెలిసేట్లు వ్యాఖ్య రాయమని కాకరపర్రువాసి ద్వివేది రామ శాస్త్రిని కోరాడు. ఈ రాజు సత్య దేవ శతకం కూడా రాశాడు. తన బాధను నివారించమని సూర్యుని ప్రార్థించిన శ్లోకం -

'గుల్మాఖ్యో రోగోష్వతి జల్మోమాం బాధనేమ్బర మణోత్వం: నిర్మూలయ తద్వ్యాది నిర్మల మనసా తనోమి నతికర్మ'

దాదాపు ప్రతిశ్లోకం లో శబ్దాలంకారాలను శ్లేషను ప్రయోగించాడు.

"ఆలోకాలోక నగంస్వలోకస్య కలలోకస్తే - హి లోక మిత్ర తత్తన్ననీకానీక కర్మకుర్వంటి".

కవి ప్రయోగించిన ప్రకృతాప్రకృత శ్లేషాలంకారానికి ఉదాహరణ -

'వర వర్ణ దటిత సుపదాద్భుత బహులస్యే చ్చాగీత సుశ్లోకః - ఘన సుకుమార ప్రణయీ,తపన మయూరో వితోధిక క్లేశాత్'

తన పేరున్న శ్లోకం-

'శ్రీ దామెర చిన వేంకటరాయ కృతా సూర్య సప్తతి ర్జయతు - సంతు బహావోపి దోషా క్షన్తవ్యా కరుణయా సాధ్వీః'

శ్రీ సత్యనారాయణ స్వామిపై చెప్పిన సత్య నారాయణాష్టకం నుండి ఒక ఉదాహరణ-

"అత్యాత్వాప త్రీర్నాసత్యాహ్వాయ దేవతవ కృపయా - నిత్యం జనా జయంతి ప్రత్యక్షం సత్యమేవ తత్కరుణాత్"

ఇందులోనూ చివరిశ్లోకంలో తన పేరు చెప్పుకొన్నాడు చిన వెంకట భూపతి. ❋

## 355. విఠల దక్షిణామూర్తి పండితుడు (19వ శతాబ్దం)

**వి**ఠల రాజేశ్వర దీక్షితులు, పరంబల కుమారుడు దక్షిణామూర్తి పండితుడు. ఈ విద్వత్ కవి 19 శతాబ్ది మధ్యకాలం వాడు. మెదక్ జిల్లా సిద్ధిపేట తాలూకా చెప్పేల గ్రామవాసి. మీమాంసా ధర్మ శాస్త్రాలలో అఖండ పండితుడు. కల్ప సూత్రాలపై 'యాజ్నికా భరణం' రాశాడు మంచి కవికూడా. ఎన్నో లఘుకావ్యాలు రాశాడు. వీటిలో మనో నైర్మల్య పంచకం, జ్ఞాన తారావళి, పంచ రత్నావళి, బ్రహ్మానంద పంచకం, కార్య సిద్ధ్యాష్టకం, జీవంముక్తాష్టకం మొదలైన 11 రచనలున్నాయి.

యిదే శ్లోకాలలో మనో నైర్మల్య పంచకం ఉంది – 'ప్రతిక్షణ విశోధనా ద్రిపురిదంబహిర్నిల్మలం –న చేదితమహర్నిశం స్రవతి దుష్టగంధాన్ మలాన్'
జనన తారావళి 27శ్లోకాలున్నాయి. – 'సాక్షాత్ప్రతి బ్రహ్మణి సావ దానే సురూప దేశాను భవాగామేశ్చ–ఏకాగ్ర చిత్తః తదను క్రమేణనిరుద్ధ భూమౌ విహారే రావిదాన్' వ్యక్తీ పరబ్రహ్మ స్వరూపం అని తెలియ జెప్పే శ్లోకాలున్నది 'పంచ రత్నావళి' – ప్రూత్పున్దరీకే పరమధ్య సంస్తే దాప్రాభిదే చిద్గాగనేయ ఆస్తే – సోయం చిదానందమయ స్సుఖస్య దుః ర్వస్య సాక్షీ పరమేశ్వరోస్మి'
బ్రహ్మానంద పంచకమూ ఇదే ధోరణిలో ఉంది. కార్య సిద్ధి అష్టకంలో 8శ్లోకాలున్నాయి. పది శ్లోకాలది ప్రదోషస్తవం. చిత్కలా భుజంగం 20శ్లోకాలు లక్ష్మీ కటాక్ష పంచకం లక్ష్మీదేవి స్తోత్రం శ్యామలా పంచరత్న మాలిక శ్యామలాదేవి గురించి చెప్పినది – 'ఇష్ట కామ్య ఫలసిద్ధిదా సకలలోక వశ్య కర మూలికా – ద్వాదశాబ్ద వయసి స్థితా మృదుల నీల వస్త్ర పరిదానికా
కాళికా గలిత చూలికా వికచ మల్లికా కుసుమ మాలికా – శ్యామలా మమ వరప్రదా భవతు చిత్కలా నవర్జస్వలా'❁

## 356. తట్టిపల్లి నర కంఠీరవ శాస్త్రి (19వ శతాబ్ది చివరి కాలం)

**వ**ట్టిపల్లి వెంకటలక్ష్మి, సాంబశివల పుత్రుడే కాశ్యప గోత్రీకుడైన నర కంఠీరవ శాస్త్రి. తిరుపతి సంస్కృత కాలేజిలో సంస్కృత ప్రొఫెసర్. 19వ శతాబ్ది చివరి కాలంవాడు. 20వ శతాబ్ది ప్రధమ భాగంలో మరణించాడు. ఎన్నోకావ్యాలు రాసినా కొద్ది లఘుకావ్యాలే దొరికాయి. అందులో శ్రీ వెంకటేశ్వరస్తోత్రం, శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా స్తోత్రం మాత్రమే మిగిలాయి. మిగిలినవన్నీ వ్రాతప్రతులుగా ఉండి పోయాయి. 16 ఏళ్ళ వయసులోనే ఆర్యా ఛందస్సులో 296 శ్లోకాలాలో అభినవ వాసవ దత్తరాశాడు శివునిపై శ్లోకంతో మొదలుపెట్టాడు.

"వందామహే మహేశం వందారు జనాభి లాషిత మందారం - బృందారక మణి మకుటీసుందానిత సూన .మురభితా ంఘ్రి యుగం"
తర్వాత పార్వతి గణేశ సరస్వతిలను వాల్మీకిని స్తుతించాడు. వివరంగా వంశ చరిత్ర చెప్పాడు.

జ్ఞాన ప్రసూనామ్బికా నవ రత్నమాలలో 9 అశ్వధాటి శ్లోకాలున్నాయి. అమ్మవారు కాళహస్తిలోని దేవత. "కంతారవో దధుప కంతారిదుర్విహకంఠీర వేంద్రా గమనో - త్కంతానికామ సహితి కంతాను కర్షికలక కంతామలాప లలితా
శృంఠీభవ హనుజ కంఠీరవ ప్రకర కుంఠీకృతిక్షమ బలా - కుంఠీ కరోతు నర కంఠీరవాఖ్య కవి కంఠీరవస్య దురితం". ఈకవి కొన్ని గ్రంధాలకు సంపాదకత్వం వహించాడు అవి - వెలు వెంటి గరుడా చల యజ్వ రాసిన తప్త చక్రాంక విధ్వంసనం, అయ్యాన విద్వత్ రాసిన వ్యాస తాప్తర్యా నిర్ణయం.❀

# 357. శుక సందేశ కావ్య కవి- దేవులపల్లి నరసింహ శాస్త్రి (19 శతాబ్దం)

19వ శతాబ్ది చివరిభాగంలో తూర్పు గోదావరి జిల్లా మండపేటలో జన్మించాడు. తెలుగు సంస్కృతాంధ్రాలలో మహా పండితుడు, కవి. 'వసంత విలాస భాణం', 'మిత్ర భాషితం' రాసి ముద్రించాడు. కాళిదాసమహా కవి మేఘ సందేశ కావ్యానికి అనుకరణగా 'శుక సందేశం' రాశాడు. సింహాచల రాణి చిలుక ద్వారా మద్రాస్‌లోని లాయర్‌కు పంపిన సందేశం ఇది. మందా క్రాంత వృతాలలో రెండు ఆశ్వాసాలలో 179 శ్లోకాలతో ఉన్న కావ్యం. కొన్ని శ్లోకాలు మాత్రమే లభ్యం -.

"కాచిన్మోచత రుసి రుచిరే సింహ శైలస్య కూటే-ప్రజ్ఞా రాజ్ఞీ వసతి మకరో ద్దూర దేశాప్రచారం
ఘీన్కారో ద్యమ్నదకారి ఘటా కింతు భీత ప్రదాత్రీ - స్ఫూర్జగ్గర్జ నినాద కలితా నీల కాదంబినీ వా"

ఆధునిక జీవితాన్ని ప్రాచీన ఛందస్సులో ఇంత గొప్పగా చెప్పటం కవి ప్రతిభకు తార్కాణ. ఇందులో మద్రాస్ సెంట్రల్ స్టేషన్ వర్ణన ఉంది. రైలు పట్టాలు, దాని దగ్గర హెడ్ టెలిగ్రాఫ్ ఆఫీస్, వెయిటింగ్ రూమ్, మెషీన్‌లతో లిఫ్ట్‌తో పనిచేసే విధానం, పైకి వెళ్ళే ఏర్పాటు, స్టేషన్ బంగాళాఖాతానికి దగ్గరగా ఉండటం, ఏనుగుల మేఘ ధ్వనుల వంటి ఘీంకారాలు, వరుస ఇళ్ళు, నల్లని మేఘాలు, వేగంగా దూసుకుపోయే రైళ్ళు అన్నీ స్పష్టంగా వర్ణించాడు.

'రైలేలీలా నరా మృగ పతేః కుత్ర చిత్ తత్ర కానౌ - పాంసు క్రీడాప్రవణ వయసం పుత్ర మంఖే వహంతీ
తత్తన్మాయా వచన రచనో పక్రమైః ఖేల యంతీ-కీరం స్వేరం స్వయముపగతం రాజ పత్నీదదర్శ❀

## 358. పద్మనాభుడు (19వ శతాబ్దం)

**భ**రద్వాజ గోత్రీకుడు కామశాస్త్రి కుమారుడు పద్మనాభుడు. గోదావరిజిల్లా కోటిపల్లిలో జన్మించాడు. అక్కడి దైవం సోమేశ్వరుడు అంటే అవ్యాజ భక్తి ఉన్నవాడు. సంస్కృతంలో 'త్రిపుర విజయ వ్యాయోగం' రాశాడు. కోటిపల్లి తిరుణాలలలో దీన్ని ప్రదర్శించేవారు. శివుడు త్రిపురాసురులను వధించిన కథ. ప్రారంభ శ్లోకం–

'దేవఃస్వార్ధ శివానవాను నయ సంపూ త్కొత్తమంగ నయనాత్ – గంగా భు వ్యపవాహ్నాగౌతమ తపస్సి ద్ధిచ్చలా దుత్సుతః

ఇయం బుద్వదిఏవ కోటి పల్లి సంస్తానే నిరూద్వస్తయా –పార్శ్వ దక్షిణామాప్తయోభయ తరస్సోమేశ్వరః పాతు నః'

సూత్రధార, నటి లమధ్య సంభాషణలో కవి చరిత్ర తెలుస్తుంది. భారద్వాజ గోత్రీకుడైన ఎల్లావధానికి పద్మనాభ కుమారుడు. ఈయనకు కామ శాస్త్రి కొడుకు. ఈయన కోడుకే పద్మనాభ కవి. గంగాధర గురువు అనుగ్రహంతో కవికి సకలశాస్త్రాలు వచ్చాయి. గంగాధరుడు అంటే శివుడు కావచ్చు. అదే పేరున్న గురువూ కావచ్చు. త్రిపుర సంహారం కోసం పరామేశ్వరుడు రథంపై బయల్దేరిన యుద్ధోత్తతి వర్ణన ఇలా సాగింది–

'ఛందో హాటక ఘోటక ప్రఘటితం చందః శిరః ప్రగ్రహం – వాణీ వల్లభ సారధి ప్రచరితం సర్వం సహా స్యందనం

చండా చండ మయూఖ మండల మహా చక్ర ద్వాయోపస్థితంఃవై గానాయత మదద్భుతేన భగవానారుహ్యా నిర్గచ్ఛతి'❋

## 359. ములుమూడి పిచ్చిరెడ్డి (19 శతాబ్ది చివర)

నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డి పాలెంకు చెందిన వెంకాంబికా, వరదరెడ్డిల కుమారుడు పిచ్చిరెడ్డి. 'శ్రీ వేంకటేశ్వర కర్ణామృత స్తోత్రం' రాశాడు. దీనికే 'వేంకట నరసింహ శార్దూల స్తోత్రం' అనే పేరుంది. నృసింహ స్వామిపై రాసిన స్తోత్రం. 108శార్దూల శ్లోకాలతో ఈ అష్టకం రాశాడు. ముందు తన గురించి తర్వాత గురువు గురించి చెప్పాడు. గురువు కామాక్షి, శేషుల పుత్రుడు తమన వెంకవెంకటేశ్వర. గురుపత్ని మంగాంబిక. కవితాధార సరళంగా సాగి చదివించే లక్షణం ఉన్నది.

'శ్రీమద్వేంకట నాయకం మునినుతం సేవ్యాఙ్ఘ్రి పంకద్వయం - పాపాన్ధం కరుణాకరం భవ హరం బాలేందు చూడార్చితం
పద్మాక్షం జగదేక వీర మదిపం బ్రహ్మ స్వరూపం హరిం – కామాక్షీ ప్రియ సోదరం నర మృగాకారం భజేహం సదా'

తెలుగు శతకంలాగానే నాలుగోపాదంగా మకుటం ఉంటుంది. కామాక్షీ అమ్మవారంటే భక్తివలన ఆపేరునూ చేర్చాడు. చివర ఆర్యా శ్లోకాలలో ఫలశ్రుతి రాశాడు. ❁

# 360. రామసూరి (19 శతాబ్దం)

**ఆ**త్రేయ గోత్రీకుడు. బొబ్బిలికి చెందినకృష్ణ గోపాల కుమారుడు రామసూరి. 19వ శతాబ్ది మధ్యవాడు. 13 అధ్యాయాల గోపాల క్షేత్ర మాహాత్మ్యంను బొబ్బిలిలోని గోపాలక్షేత్రంపై రచించాడు. ఈ క్షేత్రం గోస్తనీ - వేగావతి లమధ్య విలసిల్లుతోంది. కథను భవిష్యోత్తర పురాణం నుంచి గ్రహించాడు. ముందుగా ప్రార్థన శ్లోకం-

'శ్రీ లక్ష్మీశం శివ మజం రామం గౌరిం సరస్వతీం - ధ్యాత్వా గణానాధిపం ప్రణమ్య గ్రహనాయకం'. క్షేత్రానికున్న పూర్వనామం గురించి తెలియజేస్తూ-

తస్మాద్దుర్గ సుసంపన్నా పురీ దేశీయ భాషయా - బొబ్బిలీతి ప్రసిద్ధా సా దక్షినార్థేన భోగిలా'

బొబ్బిలిని ఉజ్జయినితో పోలుస్తూ -

'విశాలాయాం దుర్గ వతాచిక భాగేన నిశ్చితా-యదా చోజ్జయినీ సా స్యాంత దాసౌ బొబ్బిలీ పురీ'

రచనా కాలాన్ని తెలియ జేస్తూ-వ్యయాబ్దాశ్వ యుజాంత మారవారే లిఖాదత్రిజః - గోపాల క్షేత్రమహాత్మ్యంరామసూరిస్స్వయం కృతం' అంటే 12-10-1406 లేక 26-10-1886 అని తెలుస్తోంది. ఆరవారం మంగళవారం.

రామసూరి మరో రచన 'భావ మంజరి'. మూడు అధ్యాయాలు సర్దా నీతి కవిత్వం. కొన్ని మచ్చులు-

శ్రీరామో మాధవ స్ఫూర్తిః పాయాన్నో భావ మంజరీం - చంద్రానాలోజ్జ లన్నేత్రం గాత్రం యన్న ప్రభాసతే - కొన్ని నీతులు-

'శరణార్ధి మనః పూర్తీ శరణ్య యేన భావేద్యాది - శోణాదామ సుధా దామ్నోనిర్ధమత్వం న కిం భవేత్ '

'హంసానాం జలదద్వాన న్నాసకరం వరం - హృదస్త దంబు పూర్ణాహిపురా పద్మాశ్రియమ వహో'

చివరి శ్లోకాలలో వేదాంతం ఉంది. 'హ్రుదాంబుజే బిందు మరంద తుందిలేకళా రుచి స్ఫీత సుషుమ్నా మందిరే

స్ఫురన్మహా నాద వినోద మంబరం నమామి విశ్వంభర మిందిరా పతిం'❁

## 361. అభినవ రామానుజాచార్య (19 వ శతాబ్దం)

**'మా**యావాది మదగజ కంఠీరవ ఆచార్య' అనే బిరుదు పొందిన అభినవ రామానుజాచార్య వేంకటాచార్య కుమారుడు. నైధ్రువ కాస్యపస గోత్రం. వాదిభ కేసరి కుటుంబం వాడు. 19వ శతాబ్దికి చెందిన తిమ్మ గజపతికి సమకాలికుడు. ఈయన రాసిన ఏడు కాండల 'శ్రీనివాస గుణాకరం' తిరపతి వెంకటేశ్వర స్వామి గురించిన కథ. దీనిపై తాను వ్యాఖ్యానం రాసుకున్నాడు. మిగిలిన వ్యాఖ్యానాన్ని కొడుకు వరదరాజు పూర్తి చేసాడు.❋

## 362. క్రాణ రామ కవి (19వ శతాబ్దం)

**1**9వ శతాబ్దికి చెందిన జైపూర్ సంస్థాన ఆయుర్వేదాచార్యుడు క్రాణ రామ కవి. ఆయన రాసిన 'కచ్చ వంశ' జయాపుర విలాస కావ్యాలలో జైపూర్‌ను పాలించిన రాజుల ఘన చరిత్ర ఉంది. చాలా కావ్యాలు రాసాడు. అందులో 'ఆర్యాలంకార శతకం, పలాండు శతకం ముక్తకం ముక్తావల్లి' ముఖ్యమైనవి. 'పోలంబోత్సవం, సారస టీక' సంస్కృత సాహిత్యంలో గొప్ప పేరు పొందాయి. 'చందాశ్చతమర్దన' కావ్యానికి మంచి ప్రశస్తి ఉంది.❋

## 363. శ్రీ పేరి కాశీనాథ శాస్త్రి (1858 -1918)

**వి**శాఖలో పుట్టి విజయనగరం చేరిన శాస్త్రీజీ 'గంగా స్తవం, గోదావరి లహరి, యామినీ పూర్ణ తిలకం సంస్కృతంలో రాశారు. గొప్ప గీర్వాణ విద్వాంసులు. వీరి మరణానంతరమే గ్రంథ ప్రచురణ జరిగింది.❀

## 364. శతావధాని వరుకూరు వెంకట శాస్త్రి (19-20 శతాబ్దం)

**పూ**ర్వపు నిజాం పాలనలో గుల్బర్గా జిల్లాలో సూరాపురంలో జన్మించి బేదార్లు అనబడే తెలుగు నాయక రాజుల కాలంలో 19శతాబ్ది చివరనుంచి 20వ శతాబ్దం ప్రారంభం వరకు జీవించాడు వరుకూరు వెంకటశాస్త్రి. కవి సార్వ భౌమ బిరుదాంకితుడు. తెలంగాణా ప్రభువుల ప్రాపకంలో వృద్ధి చెందాడు. అనేక శతావధానాలు చేసి శతావధాని అయ్యాడు. సంస్కృతంలో 'పాండవాశ్వమేధ చంపు' రాశాడు. శరత్ ఋతు వర్ణన-

'శారదారంభ విలోల శుభ్ర జల దవ్రాతాంత రేషు స్ఫురత్ - హరి నీల ప్రతిమాన సూక్ష్మ జలముఖపంజాః పరం జజ్జలుః

కల శంభో నిదివార్ధితేషువిపులేషూర్మి వ్రజేషు స్థితా - రమణీయా ఇవ వారిజాసన గురోశ్యామా అభి వ్యక్తితః'❀

## 365. శ్రీ మామిడిపల్లి సాంబయ్య (1900-1970)

**వే**ములవాడకు చెందిన సాంబయ్య గారు నూట ఎనిమిది శ్లోకాలతో 'వేములవాడ రాజ రాజేశ్వరి శతకం' రాశారు. 'సుప్రభాతం' కూడా చేశారు. దీని మకుటం 'లెంబాల వాటిక విభో తవ సుప్రభాతం'.

– శ్రీ త్రిగుళ్ళ శ్రీహరి శర్మ (19 50

శర్మగారు వేములవాడకు చెందినవారు. అక్కడి సంస్కృత కాలేజి ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. సంస్కృత కావ్యాలు చాలా రాశారు. సంస్కృతంలో అవధానాలూ చేశారు. ❁

## 366. సంస్కృత ఉపాధ్యాయిని- కామాక్షి (1902)

**కౌ**ండిన్య గోత్రికుడైన ముత్తు కృష్ణన్ అయ్యర్‌ను వివాహమాడిన కామాక్షి 1902లో తంజావూరు జిల్లా గణపతి అగ్రహారానికి చెందిన పంచాపకేశయ్య కుమార్తె. ఉత్తర తమిళనాడులోని బాలికల పాఠశాలలో సంస్కృత ఉపాధ్యాయినిగా పనిచేసింది. కాళిదాస కవిత్వాన్ని ఔపోసన పట్టిన కామాక్షి 'రామచరిత' అనే చిన్న కావ్యం రాసింది.

సోదరి బాలాంబాళ్ మద్రాసు నివాసి. దక్షిణ భారతంలో గొప్ప జాతీయ నాయకురాలు. సంస్కృతం నేర్చుకునే వారి కోసం ఆర్య రామాయణం రాసింది. ❁

## 367. సౌదామిని నవలాకర్త- నరసింహాచార్య (1902)

**క**ర్నాటక దక్షిణ ప్రాంతం కోటీశ్వరలోద్వైత మహా బాలకు చెందిన బ్రాహ్మణుడు మహాబాలకు నరసింహాచార్య కుమారుడు. 1902లో జన్మించాడు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోతే పిన తండ్రులు పెంచి పెద్దవాడిని చేశారు. మద్రాస్ విశ్వవిద్యాలయం నుంచి సాహిత్య శిరోమణి అందుకొని బెంగుళూర్లోని శ్రీ చామరాజేంద్ర కాలేజీలో సంస్కృత ప్రొఫెసర్ అయ్యాడు. ఇతని సౌదామిని నవల ఎనిమిది అధ్యాయాలు. మగధ రాజు సూరసేనుడు విదర్భ రాజు కానపాలుని కుమార్తె సౌదామినిని రహస్యంగా వివాహమాడిన కథ ఇది. దీనితో ఆమెను పెళ్ళాడాలనుకొన్న విజయవర్మ చేతిలో పరాజయం పొంది రాజ్యాన్ని కోల్పోయి అడవులలో కొత్త జంట తిరుగుతున్నారు. ఆమెకు అతనిపై ఉన్న వల్లమాలిన ప్రేమ వారిద్దరి దాంపత్య గరిమ ఫలించి చివరికి విజయం సాధించి రాజ్యాన్ని, సంపదను తిరిగి పొందటంలో సమాప్తం. భారత కథ, వ్యాయోగం, ప్రతిజ్ఞా భార్గవం కావ్యాలు గొప్ప పేరు పొందాయి. భారవి రచన కిరాతార్జునీయంను సంగ్రహంగా చెప్పిన తీరు నవ్యంగా ఉంటుంది.❁

## 368. శ్రీ బచ్చు సుబ్బారాయుడు (1902-1975)

**బ**నగానపల్లిలో 'ఔకు' గ్రామంలో పుట్టిన రాయుడుగారి తలిదండ్రులు పార్వతమ్మ, నాగయ్యలు. రాచర్ల శ్రీనివాసాచార్యులు గారి వద్ద సంస్కృతం అభ్యసించారు. సంస్కృతంలో 'సీతా రావణ సంవాదఝురి' రాసారు. దీనికి ఒక నేపథ్యం ఉంది. మైసూర్ సంస్థానకవి చామ రాజ రామశాస్త్రి 'సీతా రావణ సంవాద ఝురి' అనే శ్లేష కావ్యం రాశాడు. ఇందులో సీతా రావణులమధ్య సంభాషణలున్నాయి. రామశాస్త్రి దీన్ని వంద శ్లోకాలలో రాస్తానని యాభై రాయగానే చనిపోయాడు. తన కావ్యాన్ని ఎవరైనా పూర్తి చేస్తే కృతజ్ఞత ప్రకటిస్తానని మరణానికి ముందు చెప్పాడు. మన సుబ్బారాయుడుగారు దీన్ని సవాలుగా తీసుకుని పూర్తిచేసి కవికి ఆత్మ శాంతి కలిగించాడు. ఇదికాక 'శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాతం', 'స్తవ మంజరీ' కూడా రాశారు.❁

# 369. శారదా ప్రసాద కవి-శ్రీ మోచర్ల రామకృష్ణయ్య (1904-1983)

సరసకవి కవిశేఖర, ప్రసన్న మధురకవి, సాహిత్య రత్న బిరుదాంకితులైన శ్రీ మోచర్ల రామ కృష్ణకవి, నెల్లూరు మండలం, కందుకూరు తాలూకా మోచర్లగ్రామంలో 27-5-1904 న రామలింగయ్య,లక్ష్మీ నరసమ్మ దంపతులకు జన్మించారు. నెల్లూరులో ప్రసిద్ధ న్యాయవాది. దుర్భా సుబ్రహ్మణ్యం గారి శిష్యులు. ఇరవై గ్రంధాలు రాశారు. ద్వారకా పీఠాధిపతులచే 'సాహిత్య రత్న' బిరుదు పొందారు. గొప్పనటులు 'ప్రచండ భార్గవం' నాటకం రాసి ప్రదర్శించారు. గ్రాంధిక భాషలో 'గిరిజా కల్యాణం' రాశారు. రమణానంద లహరి 'పార్వతీ పరమేశ్వర వివాహం ఆత్మ బోధ, గంగాలహరి, హంస సందేశం, పొట్టి శ్రీరాములు గారి మరణంపై 'అమర గౌరవం' పద్యకావ్యం శివాజీనాటకం, మహారాష్ట్ర రాజుల చరిత్రకావ్యం' రాశారు. రామభక్తులైన రామకృష్ణయ్య గారు రామాయణ సుందర కాండను ఎన్నోసార్లు పారాయణం చేసి తరించారు. ఎనభైవ ఏట 21-5-1983న మరణించారు.

### సంస్కృత విద్వత్తు

సంస్కృత రచనలు 'శారదా ప్రసాదః' రాశారు. ఇందులో సరస్వతీ దేవి ప్రశంస నివేదనలుమొదలైన వానిపై రాశారు. ఉదాహరణకు ఒక శ్లోకం - "నోదద్యాశ్చే త్పరమ పదవీ సాధకం వాగ్వరం నః నూనం సర్వే వయమిహ మృగ ప్రాయతా మాపను యామః- నిత్యం కృత్యం తవ పద యుగాబ్జా ర్చనం తన్నరాణాందిస్యాతుభ్యం నతిశతమహం భవ్యసిద్ధైత నోమి"

దేవి నామ ఔచిత్య సార్ధకతను తెలిపే శ్లోకం గాంభీర్య భావ సదృశం - "హిరణ్య గర్భాత్స రసః స్రవంతీం, త్రయీ మయై స్స్వర్ణ జలైస్స్ఫురం తీం-స్వరోర్మినాదేన సముల్లసంతీం సరస్వతీ మాయతయే నమామి".

## 370. రంగరాజు కేశవరావు (1904)

రంగరాజు కేశవరావు జననం ఎప్పుడో తెలియదుకాని మరణం 1904. వరంగల్ జిల్లా ఖిలశాపురం వాసి. ఈత తప్ప, సకల కళా ప్రపూర్ణుడు. పర్షియన్ ఆరబిక్‌లతో బాటు చాలా భాషలలో లోతైన పాండిత్యం ఉంది. గొప్ప వీణా వాదనా నిపుణుడు. మంచి చిత్రకారుడు కూడా. సంగీతంపై వివిధ భాషలలో పుస్తకాలు రాశాడు. నవాబ్ ఇఖాబలుద్దౌలా బహదూర్ ఈయనకున్న పార్సీ భాషా పాండిత్యానికి కవిత్వానికి మెచ్చి 'కవి శిరోమణి' బిరుదునిచ్చి సత్కరించాడు. కవి వైష్ణవుడు. వివిధ దేవతలపై స్తోత్రాలు సంస్కృతంలో రాశాడు. అందులో 'శఠ కోప స్తుతి' ఒకటి వేదాంత దేశికునిపై 62శ్లోకాలు రచించాడు. తన గురువు హనుమకొండ నివాసి అయిన నృసింహాచార్యపై 24 శ్లోకాలు చెప్పాడు. భుజంగ ప్రయాత వృత్తంలో 12శ్లోకాలో గురు స్తుతి చేశాడు. సంస్కృతంలో చాలా పెద్ద గ్రంథాలు రాశాడు. కాని అచ్చుకాలేదు. భుజంగ ప్రయాతంలో నృసింహ గురు స్తుతి -

'పయోజాసనస్తం క్రుతాన్జల్యుపేతం స్ఫురద్రను భాసం స్ఫుటాబ్జ చ్ఛాద దక్షం
స్తితంవక్త్రుకామో విప్రుత్యేవ వక్త్రం హనుమద్గిరీశం భజే భాష్యకారం.❁

## 371. 'ఆంధ్ర కళ్యాణ'- స్వయం పాకుల వెంకట రమణశర్మ (1906)

నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకా జరుగుమల్లిలో 4-6-1906న వెంకటప్పయ్య,వెంకట లక్ష్మమ్మ దంపతులకు జన్మించారు. తెలుగులో చాలా రచనలు చేశారు. సంస్కృతంలో 'రత్నాంజలి' కావ్యం రాశారు. అమరవాణిని గురించి అందులో యామాశ్రిత్య చిరంతనో మునివరో వాల్మీక జన్మా పురా- దిజ్ఞారీ పంధాన దాన చతురం ప్రాగల్భ్య మాసీదివాన్- యామశ్రిత్య చ బాదరయణపరివ్రాడ్ విశ్వవాన్వ గ్రహీత్ -తాద్వాణ్యా స్తుతి వర్ణ నాదిక విదే శేషో పినాలంభవేత్.❁

## 372. ఆర్యా త్రిశతి కర్త - పిశుపాటి విశ్వేశ్వర శాస్త్రి (1906)

**స**ంస్కృతాంధ్రాలలో మహాపండితుడైన పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి పరాభవ నామ సంవత్సరం. చైత్ర బహుళ విదియ బుధవారం నెల్లూరు మండలం కరవదిలో సీతారామమయ్య, కనకమ్మలకు జన్మించారు. నెల్లూరు వెంకటగిరి రాజా కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పని చేశారు. 'ఆశుకవి కేసరి శతావధాని' బిరుదులు పొందారు. మహా భాష్యంత వ్యాకరణవేత్తలు. శంకర ప్రస్తాన త్రయాన్ని ఆకళింపు చేసుకున్న వేదాంతి. మంత్రం శాస్త్ర ప్రవీణులు. సంస్కృతంలో 'ఆర్యా త్రిశతి' అనే కావ్యాన్ని ఆర్యా వృత్తంలో భర్తృహరి సుభాషిత త్రిశతిలాగా గొప్పగా రాశారు. 'రాజ ధర్మ' కావ్యానికి సంస్కృతంలో 'జయ వ్యాఖ్య' రాసి మహా వ్యాఖ్యాతగా పేరొందారు.❀

## 373. సూర్య శతక కర్త-శ్రీ గుండుగొలను జగన్నాధ శర్మ (1908)

**1**908లో వంశధార దగ్గర లుకులాం అగ్రహారంలో జగన్నాధశర్మ జన్మించారు. శ్రీ పేరేపు సత్యనారాయణ గారి శిష్యులు. 1955లో 'సూర్య శతకం' అరసవిల్లి సూర్యదేవునిపై రాశారు. "శ్రీ సదన శుభంకర నిజ భాషా వాసవ దిశా విభాస్వ దురు శ్రీ - భాసుర మూర్తి యరస విలి వాసా, దాసజన సౌఖ్య, వరద హే సూర్య - సారసభ హరి ఘనసార సమయాశః ప్రసార సంశ్రిత సంప - త్సార సమున్నతిదా,సంసార సముద్ర తరణ ద్రుత సారస సూర్య - మిహి రహిరణ్మయవిగ్రహ మహిత హిత తత్వ విత్తమ తమో బందీ" అని చాలా సరళంగా, అనర్గళంగా అర్థస్ఫోరకం గా రాశారు.

వెంకటేశ్వర శతకం, ఉమామహేశ్వర శతకం, 'శ్రీకామేశ్వర శతకం పరదేవతా స్తోత్రం' రాశారు. పరదేవతా స్తోత్రంలో సంతారిణీ, కలుష కాంతార సంచరణ తాంతం నితాంతం జనం – భ్రాన్తిం విరస్య విశ్రాన్తిం విధాయ, దుఖాంతేన సంతుష్యతీ–స్వంతం మదీయ మది శాంతం కరోతి నిశ్చింతం చిరం సంతతం – కాంతా శివస్య జగతాంతీవ్ర బాధాంనిహన్త్రీ పరదేవతా ప్రవాహ సదృశంగా భక్తిధారగా రాశారు.❀

## 374. శ్రీ అంబటిపూడి వెంకట రత్నం (1908-1982)

ప్రకాశంజిల్లా ఏదుబాడు అగ్రహారంలో 18-7-1908న అంబటిపూడి సుబ్రహ్మణ్య శాస్త్రి సుబ్బమ్మ దంపతులకు శ్రీ వెంకటరత్నం జన్మించారు. గుంటూరులో చదివి ఎం ఏ. పాసైనారు. శతావధాని వేలూరి శివ రామ శాస్త్రి గారి వద్ద తర్క, వ్యాకరణ, అలంకార శాస్త్రాలు నేర్చారు. స్వయంగా ఆంగ్లాంధ్రాలను తులనాత్మకంగా పరిశీలించారు. ఉద్యోగం చేయకుండా నల్లగొండలో చుండూరు చేరి ఒక ఆశ్రమం ఏర్పాటు చేసుకొని విద్యా అన్న వస్త్ర దానాలు చేస్తూ కృష్ణ భక్తి ప్రచారం చేశారు. రావి నారాయణరెడ్డిగారి సహకారంతో ఒక హరిజన విద్యాలయం స్థాపించారు. 'సాహితీ మేఖల' అనే సంస్థను నెలకోల్పారు. రచనలు చేస్తూ చేయించారు. ఈ సంస్థ ద్వారా 32 గ్రంథాలు ప్రచురించారు. ఎందరినో గొప్ప రచయితలుగా తీర్చి దిద్దారు. దక్షిణ కౌమోదికి, ఇందిరా విజయం, చంద్రశాల సంస్కృతంలో రాశారు. చంద్రశాలను వీరే ఆంగ్లంలోకి అనువదించారు. చూడాల నాటిక, కృష్ణ బోధ షడ్దర్శన రహస్యాలు, తత్వ సమవర్తనం, వేదాంత సారం మొదలైనవి రచించారు. 1943లో హైదరాబాద్ శ్రీకృష్ణ దేవారాయాంధ్ర భాషా నిలయంలో ఘన సత్కారం పొందారు.❁

## 375. శ్రీ మహీధర వెంకట రామ శాస్త్రి (1909)

అమలాపురం తాలూకా ముంగండ లో 1909లో జన్మించారు. 'దాక్షారామం అమలాపురంలలో పని చేశారు. సంస్కృతంలో రాసిన వాటిలో 'సరోజినీ సౌరభం' నాటకం ప్రసిద్ధి చెందింది. 'మానస రాసకేలీ శాంతి' కావ్యం, దహర చంద్రికా తాత్వికం, భారతాంబా సుప్రభాతం, దేశ భక్తీ గీతం, మణి మజీరం, వకుళాభరణం ఖండకావ్యాలు రాశారు.❁



## 376. శ్రీ సువర్చలాంజనేయం కర్త శ్రీ గురజాడ పూర్ణచంద్రశర్మ (1910)

**మే**ము ఉయ్యూరు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో తొమ్మిది పది తరగతి చదువుతుండగా మాకు తెలుగు బోధించిన శ్రీ గురజాడ పూర్ణ చంద్రశర్మగారు ఉయ్యూరు దగ్గర గురజాడ వాస్తవ్యులు. శ్రీ గురజాడ సాల్వపతి శర్మ, శ్రీమతి సూర్యకాంతమ్మ దంపతులకు 23-10-1910న జన్మించారు. కౌండిన్య గోత్రీకులు. శ్రీ శర్మగారు ప్రముఖ కవి శ్రీ గురజాడ రాఘవ శర్మగారి పెదనాన్న కుమారులు. 'శ్రీ సువర్చలాఞ్జనేయం' అనే సంస్కృత కావ్యాన్ని మనోహరంగా రాశారు. దీనిని శ్రీ ఆంజనేయస్వామి కలలో కన్పించి రాయమని ఆదేశిస్తే వారి అనుగ్రహ ఫలితంగానే రాశానని చెప్పుకున్నారు. దీనిని గురజాడలో శ్రీ కోదండ రామాలయం లోశ్రీరాముని ఎదురుగా ప్రతిష్టితులైన శ్రీ ఆంజనేయస్వామికి మేష్టారు 11-2-1976అంకితమిచ్చారు. ఇదికాక 'గురు గౌరవం' అనే సంస్కృత నాటకం' ప్రహ్లాద చరిత్ర, హరిణీ నారదం, జడ భరతచరితం, గజేంద్ర మోక్షం గ్రంథాలు రచించారు. తెలుగులో 'అచ్చ తెలుగు పార్వతీ పరిణయం', గేయ రామాయణం, పుష్పకం, సీతాకల్యాణం, పార్వతీ కళ్యాణం, శివ భాగవతం రాశారు. దాదాపు అన్నీ అముద్రితాలే. నాకు ఒక్క శ్రీ సువర్చలాఞ్జనేయం మాత్రమే లభించింది. దీన్ని ఆధారంగానే వివరాలు రాశాను. నేను రాసిన 'దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు' గ్రంథంలో 'శ్రీ సువర్చలాంజనేయం'ను యధాతథంగా సంస్కృత శ్లోకాలతోబాటు నేను సంక్షిప్తంగా వాటికి రాసిన తాత్పర్యాన్ని చేర్చి సరసభారతి తరపున ప్రచురించి

13-5-2015న శ్రీ హనుమజ్జయంతి నాడు ఉయ్యూరులో మా శ్రీ సువర్చలాఞ్జనేయ స్వామి ఆలయంలో స్వామి సమక్షంలో శాసనమండలి సభ్యులు శ్రీ వై. వి .బి.రాజేంద్రప్రసాద్ చేత ఆవిష్కరింపజేశాం. ఈ గ్రంథాన్ని అమెరికాలో ఉంటున్న మా చిన్న మేనల్లుడు చి.వేలూరి మృత్యుంజయ శాస్త్రి (జయ వేలూరి) శ్రీమతి విజయలక్ష్మి దంపతుల సౌజన్యంతో ప్రచురించి మా చిన్నక్కయ్యా బావా శ్రీమతి వేలూరి దుర్గ శ్రీ వేలూరి వివేకానంద దంపతులకు వారి 'వివాహ వజ్రోత్సవ కానుక'గా అంకితం చేశాం.

## శ్రీ సువర్చలాంజ నేయ కావ్య సౌరభం

ఈ కావ్యంలో నారద తుంబురులు తామలో ఎవరు గొప్ప సంగీత విద్వాంసులో తెలియజేయమని శ్రీ హనుమ దగ్గరకు వస్తే ఆయన శ్రీరామనామ కీర్తనలతో మైమరపిస్తే అక్కడి రాతి అరుగు కరిగి నీరై, దానికి ఆనించిన వీణలు అందులో కూరుకుపోయాయి. హనుమ భక్తి సంగీతానికి ఆశ్చర్యపడి తమ తప్పు తెలుసుకొని భక్తి సంగీతంలో హనుమను మించినవారు లేరని గ్రహించి హనుమను ప్రశంసించి ఆయన హృదయంలో చూపిన సీతారామ దర్శనంతో పులకించి వెళ్ళటం కథ.

మొదటి శ్లోకం- శ్రీ మద్విద్యా దానోద్దండం- అపశబ్ద దోష రిపు ప్రచండం- హస్తే స్వాత్మీయ దంత దండం- వందే ప్రణవ స్వరూప తుండం అని వినాయక స్తుతి చేశారు నారద తుం బురులు భగవతి హనుమతి ధృత్వా మోదం - కుర్వతి మధురం రామ నినాదం - సద రతిబాష్ప వారి యశోదం-సుముత్తితౌ వక్తుం వాదం బాష్పవారి పరిపూర్ణ లోచనుడైన హనుమ వారిని ఆశ్చర్యంగా చూసి కూర్చోబెట్టాడు. "దృష్ట్వా దృష్ట్వా శ్రీహనుమంతం- సంతుష్టువతుర్బహు గాయంతం- పాదోక్షేపణగతి నృత్యంతం- తౌ మే నాతేమహిమా వంతం" పారవశ్యంతో చిందులు తొక్కుతూ రామగానం చేస్తున్న హనుమను చూసి అతని మహిమ తెలుసుకున్నారు. ఇలా మధుర శబ్దవిన్యాసంతో శర్మగారు రాస్తారు. వాళ్ళ వీణలను శ్రీ రాముని స్మరించి కరిగిన శిలాద్రవం నుండి తీసిచ్చాడు. భక్తియే శరీరంగా అవతరించిన మూర్తి హనుమ.

తాము వచ్చిన పని చెప్పి అంతకు ముందు వారిద్దరి విద్యాస్పర్ధను

వివరించారు. సరస్వతి లక్ష్మి కూడా తేల్చలేక పోయారన్నారు. హనుమయే సరైన న్యాయ నిర్ణేత అని పంపారు. వారిద్దరిని గానం చేయమన్నాడు హనుమ చేశారు కాని వారికే నచ్చలేదు. చివరికి హనుమ భక్తికి దాసోహం అన్నారు. భక్తి మహిమకు అపజయం లేదని అర్థం చేసుకున్నారు గర్వం ఖర్వమైంది.

"యహ్ పాషాణౌద్రావ యతీతి– యస్సర్వాన్ విస్మయ యతీతి– యో భక్తాన్ సంతార యతీతి– సమహాన్ నిశ్చిత ఏవ జయీతి" – భక్తి మహిమతో రాళ్ళు కూడా కరిగిపోతాయి. ప్రాణికోటి ఆశ్చర్యంలో మునిగిపోతుంది. తరించటానికి భక్తియే సాధనం. అలాంటివాడే జీవిత విజేత అని అర్థం. హనుమను తమకు రామదర్శనం చేయించమని వారిద్దరూ కోరగా గుండె చీల్చి చూపించాడు.

"తాభ్యాం గర్వ సుస్టూ త్యక్త – తత్రాధిక ప్రసంగో ముక్తః శ్రీ రామ ఇత్యరనత ముక్తః– హనుమాన్ తృస్టోవక్తు మశక్యతః" – ఇద్దరూ గర్వాన్ని వదులుకొని శ్రీరామ సంకీర్తన చేసి హనుమకు ఆనందం కల్గించారు.

"హృదయే దైవం కః స్థాపయతి – హృదయం చిత్వా కో దర్శ యతి – గానేన శిలాః కో ద్రావయతి – సమహాన్ హనుమానేకో జయతి" – అంటే– హృదయంలో ప్రతిష్ఠితుడైన దైవాన్ని, తెర తీసినట్లు తీసి హృదయం చీల్చి దర్శన మిప్పించి, తన అఖండ గాన మహిమతో కఠిన శిలను గానమహిమతో కరిగించిన హనుమ ఒక్కడే జయ శాలి. అప్పుడు దేవతలు పుష్ప వర్షం కురిపించారు.

"సర్వస్మిన్ స్తు వతిసతి– యదా స్వరూపం ధృత్వా శ్రీ భగవాన్– హనుమాన్ సువర్చ లాఢ్యః– సత్కల్యాణం తదాప్త వాన్". విధి విధానంలో హనుమ సువర్చలా కల్యాణం జరిపించి మంగళాభరణాలను సమర్పించి సంతోషించారు.

''రామాలయ నటంతం– సంభాషంతం క్వాపి చ నా వశ్యం– తాద్రుశ్యమాత్రా వశ్యం– శ్రీకపి మితి నారదో మేనే" –కదలాడే, మధురంగా భాషించే శ్రీ రామాలయాన్ని ఎక్కడైనా ఎవరైనా చూశారా?అలాంటి సాక్షాత్తు 'శ్రీ రామాలయం'గా భాసించిన శ్రీ హనుమత్ ప్రభువును సందర్శించే భాగ్యం కలిగిందని నారద తుంబురులు సంతోషం ఆనందం పొందారు. ఈ విధంగా శ్రీ సువర్చలాన్జనేయ స్వాముల కల్యాణాన్ని జరిపించి, సుఖ సంసారం చేయించి వారికి పుస్టుడు, తుస్టుడు అనే ఇద్దరు కొడుకులు జన్మించారని ముగించారు.❁

## 377. పంచకావ్యస్య ధాతు రత్నాకరం రచయిత - శ్రీ పుష్పగిరి వెంకట శాస్త్రి (1912)

**నె**ల్లూరుజిల్లా కోవూరు తాలూకా మోడిగుంట గ్రామంలో శ్రీ పుష్పగిరి వెంకట శాస్త్రి 1912లో అన్నపూర్ణమ్మ దక్షిణా మూర్తిగార్లకు జన్మించారు. నెల్లూరు వేదసంస్కృత కళాశాలలో సంస్కృత ఉపన్యాసకులు. సంస్కృత పంచ కావ్యాలలోని ప్రతి ధాతువుకు ఉన్న దశాలంకార రూపాలు, కోజంత సన్నం తాదులు విశ్లేషించి క్రోడీకరించి పంచ కావ్యస్య ధాతురత్నాకరం 'రెండు భాగాలుగా' రాశారు. గొప్ప విలువైన కృషి. పంచకావ్య ధాతువుకు ఇది 'సిద్ధ పట్టిక'. అపార వ్యాకరణ పాండిత్యం ఉన్నకవి. ఆ పాండిత్యాన్ని ఆ గ్రంథ మంగళ శ్లోకంలో 'చరీకర్తి, బరీ భర్తి, సంజరీ హర్తిలీలయా'- చెప్పారు. ఇందులో పదేపదే వచ్చే క్రియల్ని ముచ్చటగా చూపారు.❁

## 378. శ్రీ అయ్యల సోమయాజుల నరసింహశర్మ (1913)

**కా**వ్య కంఠ వాసిష్ఠ గణపతి ముని బంధువే నరసింహశర్మ. ప్రొద్దుటూరు ప్రాచ్య కళాశాలలో పనిచేసి 'పాండవ ధార్త్ర రాష్ట్ర సంభవం' అనే గణపతిముని కృతికి సంస్కృత వ్యాఖ్యానం రాశారు.❁

## 379. శ్రీ అవధానం చంద్రశేఖర శర్మ (1914-1996)

**క**డపలోని కలశపాడుకు చెందిన శర్మగారు ప్రొద్దుటూరులోని శ్రీమళయాళ స్వామి వారి ఓరియెంటల్ కాలేజిలో పనిచేశారు. 'దేవీ సువర్ణమాలా స్తోత్రం, కన్యాతీర్థ దేవీ సుప్రభాతం, కల్గత సిద్ధేశ్వర సుప్రభాతం, రసా వీటి వీర భద్ర సుప్రభాతం' సంస్కృతంలో రాశారు.❁



## 380. శివ కర్ణామృతం రాసిన సరస్వతీ పుత్ర పద్మశ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు (1914-1990)

**స్వా**మిశివానందచే 'సరస్వతీ పుత్ర' బిరుదాన్ని పొంది, 14 భాషలలో అఖండ పాండిత్యాన్ని సాధించి, తాను రాసిన 'పెనుగొండ లక్ష్మి' కావ్యానికి తానే విద్యార్థిగా ఇంటర్‌లో పాఠ్య గ్రంథంగా చదివిన ప్రపంచంలోనే అరుదైన వ్యక్తి, రెండు విశ్వవిద్యాలయాల నుండి గౌరవ డాక్టరేట్లు పొంది, శతాధిక గ్రంథకర్తయై, పరమ వైష్ణవులైనా 'శివ తాండవ' కావ్యం నభూతోగా రాసి అఖండ కీర్తినార్జించి, భారత ప్రభుత్వంచే పద్మశ్రీ బిరుదాన్ని తమ అద్వితీయ కవితా, పాండిత్యాలకు అందుకొన్నవారు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు. అయితే వారు సంస్కృతంలో కూడా గ్రంథ రచన చేసిన విషయం శివతాండవం మరుగున పడేసింది. అంతేకాదు 50 ఏళ్ళ తర్వాత మాత్రమే వారి 'శివకర్ణామృతం' వెలుగులోకి రావటం కూడా వింత విషయమే అయింది. గీర్వాణ కవుల కవితా గీర్వాణం రెండవ భాగంలో 481వ గీర్వాణ కవిగా వారిని ఆలస్యంగా పరిచయం చేస్తున్నందుకు మన్నించమని కోరుతూ వారి సంస్కృత భాషా వైశద్యాన్ని వివరిస్తున్నాను.

ఆచార్యుల వారి సంస్కృత రచనలు - శివ కర్ణామృతం, త్యాగ రాజ సుప్రభాతం, అగస్త్యేశ్వర సుప్రభాతఃమ్, మల్లి కార్జున సుప్రభాతం, మార్కాపుర చెన్నకేశవ సుప్రభాతం, శివసహస్రం అనే ఆరు రచనలు. ఇవికాక వారి శివ తాండవంలోనూ గీర్వాణ భాషను సందర్భాన్నిబట్టి వాడి, శోభ చేకూర్చారు.

**గీర్వాణ కవుల కవితా గీర్వాణం-2**

ముందుగా శివ తాండవ గీర్వాణ సౌందర్యం దర్శిద్దాం-

**శివ తాండవం**

కడప జిల్లా ప్రొద్దుటూరు శ్రీ అగస్త్యేశ్వర స్వామి ఆలయంలో ఉదయ సాయంత్రాలలో ప్రతి నిత్యం 108 ప్రదక్షిణాలు 40 రోజులు చేసి, అలౌకికానందాన్ని అనుభవించి శివ భక్తీ మహా ప్రవాహంగా మహోధృతంగా జాలువారి శివ తాండవంగా రూపు దాల్చింది. భక్తికి శివ కేశవ భేదం లేదని రుజువైంది. కన్నడంలోని రగడ ఛందస్సును తీసుకొని, ఆ గేయం ఛందస్సులో నర్తించే వైనాన్ని గ్రహించి కవితా తాండవమే చేశారు. నందీశ్వరుని నోట నాందీవాచాకాన్ని పుట్టపర్తివారు సంస్కృతంలో చెప్పించి అఖండ గౌరవం ప్రత్యేకతలను చేకూర్చారు. తాండవాన్ని గూర్చి నంది వివరిస్తూ -

'అర్ధేందూత్ఫుల్ల కేశం స్మిత రుచి పటలీ దంశితంగౌర వర్ణం- తార్తీయీకం, వహంతం, నయన, మహికుల ప్రత్న భూషా వితానం

వృత్తారంభాట్ట హాస విచలిత కకుప్చక్ర, మానంద కందంఃతమ్ వందే నీలకంఠం త్రిదశపతి శిరశ్చుంబి పదాబ్జ పీఠం'

**భావం-** తలపై ఉన్న చంద్ర ఆభరణ కాంతులతో, విచ్చుకొన్ని పరమ శివుని జటలు నిగనిగ లాడుతూ, ఆయన చిరు నవ్వులు మూసుకున్న మూడవ కంటిపై గౌసన తొడగినట్లుగా, గట్టిగా నవ్వుతూ శివుడు తాండవం చేస్తున్నాడు. ఆ నవ్వుకు దిక్చక్రాలు అల్లలాడిపోతున్నాయి. ఆయన పాదం పీఠంపై ఒంగి నమస్కరిస్తున్న దేవేంద్రుని శిరసును తాకుతోంది.

శివుని తాండవ రూపాన్ని వర్ణిస్తూ నందీశ్వరుడు-

'పాటల జటా ఘటిత, జూట రుచి కోటి భ్రుష పాటిత తమిస్ర వలయం- కూట శబరం పటునిశాటకుల, జహాత సుఖ మోటనర సిక నిలయం

కోటి శత కోటి సమ కోటి నయనోత్థిత కృపీట భవ దగ్ధ మండనం - నాటితభువం ప్రళయ నాటక మహా రచన పాటవ చణం హృది భజే'

**తాత్పర్యం–** యఎర్రని జటా జూటం కాంతులతో చీకట్లను పార ద్రోలుతున్నాయి. రాక్షసుల సుఖ హారి, మాయా కిరాతకుడు నూరు వజ్రాయుదాల కాంతితో సమాన కాంతి కల మూడవ కంటి మంటతో మన్మధ దహనం చేసినవాడు, ప్రళయ నాటకం ఆడేవాడు సమస్త విశ్వాన్ని తాండవంతో సమ్మోహనంతో అలరించే పరమ శివునికి ప్రణతులు.

పార్వతీ దేవి కడగంటి చూపుతో శివుని వక్షస్థలం నెమలి పురుల రంగుగా మారిందట. పార్వతి తన అందాలు చూసుకోవటానికి భర్త నేత్రాలే దర్పణాలుగా ఉపయోగిస్తోందట. వేదాలనే స్త్రీకి ఆయన సొమ్ము. జ్ఞాస్వరూపుడు శివుడు. శివాట్టహాసాలతో దిక్కులు పగిలిపోతున్నాయట. చేతులు పైకెత్తి నాట్యం చేస్తుంటే ఆకాశం వెనక్కి పోతోందట. కాలి కదలికలకు భూమి, పర్వతాలు కంపించి పోతున్నాయి. మొలకు చుట్టిన సర్పాభరణం మధ్య మధ్యలో ఊడి పోతుంటే సరి చేసుకొంటున్నాడు. ఇలాంటి శివునికి నందీశ్వరుడు–

'జయ జయ శంకర, శత్రు భయంకర– జయ జయ ప్రధమ పిశాచన శంకర – జయ జయ తాండవ సంభ్రమ సుందర – జయ జయ ధైర్య విచలిత మందర' అని జయం పలికాడు. తరువాత శివతాండవాన్ని చక్కని తెలుగులో రాసి శివునితోపాటు మనల్నీ నర్తించేట్లు చేశారు సరస్వతీపుత్రులు. గీర్వాణ ఆంధ్ర భాషలలో తమ కవితా పాండితీ విభూతిని పండించి జన హృదయాలను రంజింపజేసే కవిత్వం రాసిన పుట్టపర్తి వారు ధన్యులు. చదివి మనమూ ధన్యులమవుతాం. ఆ అనుభూతి నాన్యతో దర్శనీయం.

## శివ కర్ణామృతం లో పుట్టపర్తి వారి కవితా గీర్వాణం

పుట్టపర్తి వారి సంస్కృత భాషా గరిమకు, వారి ఊహా సౌందర్యానికి అద్దం పట్టేదే 'శివ కర్ణామృతం'. కాని దీనిని కొందరు సాహితీ ప్రియులేకాక సాహిత్య వరిస్టులు కూడా తమ రచనలుగా, వారివిగా ప్రకటించుకొన్నారని ఆచార్య వర్యులు మధునాపంతుల సత్యనారాయణగారికి జాబు రాస్తూ బాధపడ్డారు. ఇలా

వ్రాత ప్రతిగాఉన్నప్పుడే చేతులు మారింది ఈ కావ్యం. కాని ఇందులోని శ్లోకాలను ఆచార్యుల వారు పలు సభల్లో చదివి వినిపించటంతో వారి సంస్కృత భాషా వైదుష్యం చాలా మందికి తెలుసు. 50 ఏళ్ళ తర్వాత వారి కుమార్తె శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని గారిని చేరటం, తండ్రిగారు 1990 సెప్టెంబర్ 1న శివ సాయుజ్యం పొందాక, మరణానంతరం 16 ఏళ్ళ తర్వాత ఆమె దీన్ని 2006లో ముద్రించి సాహితీ లోకానికి అందించారు. ఇదీ దీని తెర వెనుక గాథ. పరమ వైష్ణవులైన నారాయణాచార్యపరమేశ్వర భక్తితో శివ తాండవమే కాక, ఈ కావ్యాన్నీ రచించి తమ అద్వైత భావనకు ఉద్దీప్తి కలిగించారు.

శివ కర్ణామృతం అంతా పరమేశ్వరుని గుణగాన లహరీ విలాసమే. ఒకే అంశంతో ఒక గ్రంథాన్ని రాయటం సాహసమే కాక అరుదైన విషయం కూడా. 121 శ్లోకాలతో విరాజిల్లే ఈ కావ్యం శివ పారమ్యాన్ని మనోహరంగా వర్ణించి చెప్పింది. ఉదాహరణకు కొన్ని శ్లోకాల సొగసు చూద్దాం.

'కళానిధి కళావతీ కలిత జూట వాటీ లస - త్రివిష్టప తరంగిణీ లలిత తాండవాడంబరః
మదాంచిత విలోచనో మధుర ముగ్ధ వేషస్సదా-పరిస్ఫురతు మానసే గిరి సుతాను రాగాంకురః'

**భావం-** గిరిపుత్రి పార్వతికి శివుడు అనురాగ అంకురంగా ఉన్నాడు. ఆయన జటా జూటం చంద్రవంకతో శోభిస్తోంది. ఆ జూటంలో గంగానది అతి మృదులంగా తాండవిస్తోంది. అందుకని ఆయనకళ్ళు మదాలనంగా ఉన్నాయి. ఆకట్టుకొనే ఇలాంటి రూపం ఉన్న శివుడు నన్ను అనుగ్రహించాలి.

49వ శ్లోకంలో తమ ధార్మిక నైజాన్ని మనోహరంగా వర్ణించిన శ్లోక వైభవం చూద్దాం.

'శేష శైల శిఖా రాది వాసినః - కిమ్కరాః పరమ వైష్ణవా వయం - తత్తథాపి శశి ఖండ శేఖరే - శాంకరే మహసి లీయతే మనః'

**అర్థం-** శేష శైల శిఖరం పై వెలసిన శ్రీనివాసుని భక్తులం. పరమ వైష్ణవులం అయిన మేము నెల వంక శిరో భూషణంగా విరాజమానమైన ఆ పరమ శివ

కాంతి స్వరూపంలోనే మా మనసులు లీనమౌతున్నాయి' అని తమ శివభక్తిని వైష్ణపరాయణత్వాన్ని చెప్పుకొన్న అద్వైతభావి పుట్టపర్తివారు.

'శివ కర్ణామృతకావ్యం స్తోత్ర కావ్యం. భగవానుని రూప గుణ మహాత్మ్య, తత్వ భక్తీ తన్మయత్వ స్తుతి ఇందులో ఉండటం వలన భక్తుని అభ్యర్ధనం పరమ రామణీయకంగా ఆవిష్కృతమైంది. శబ్దాలంకార శోభ నిజంగా చెవులకు అమృతంగా అంటే కర్ణా మృతంగా భాసిల్లింది. శబ్దార్ధ ఉభయ అలంకార శోభ నెమలిలా పురి విప్పి నాట్యం చేసింది. ఈ కావ్యంలో ఆచార్యులవారు శివునిదివ్య కాంతి స్వరూపునిగా స్తుతించారు. శివుని విభూతిని కాంతి, తేజో రూపాలుగా వర్ణించి దైవం ఒక్కటే అని ఆ దైవం ఆమెకాని అతడు కాని కాదని అదొక దివ్య తేజం అని, ఆ తేజం మానవులకే కాక సకల విశ్వసృష్టికి ఆధారమైనది అని తన మనో భావాన్ని తెలియజేసి వేదోపనిషత్ రహస్యాన్ని విస్పష్టంగా విడమర్చి చెప్పారు' అన్న శ్రీ శశిశ్రీ గారి మాటలు ముత్యాల మూటలే. ఆచార్య వర్యుల ముఖ్య అంతేవాసిగా వారు గ్రహించిన పూర్తి సత్యమే ఇది.

**సాహితీ పుత్రుని జీవిత విశేషాలు**

శ్రీ కృష్ణ దేవరాయల రాజ గురువు తిరుమల తాతాచార్యుల వారి వంశం వారు అనంత పురం జిల్లా చిత్రావతీ నదీ తీరంలోని పుట్టపర్తి చేరి తిరుమలవారు పుట్టపర్తి ఇంటి పేరు వారయ్యారు. పెనుగొండ తాలూకా చియ్యేడు గ్రామంలో మాతామహుల ఇంట నారాయణాచార్యులవారు 28-3-1914న జన్మించారు. తండ్రి శ్రీ శ్రీనివాసాచార్యులు. తల్లి లక్ష్మీదేవమ్మ (కొండమ్మ). నారాయణా చార్యులవారికి తొలి గురువు తల్లి. అణ్ణయ్య ఆచార్యులవద్ద సంస్కృతం అభ్యసించారు. థర్డ్ ఫారం చదివే రోజుల్లోనే 'అల కవితా లోకమునకు' అనే కంద పద్యం అల్లిన కుశాగ్ర బుద్ధి వారిది. పెనుగొండ కలెక్టర్ భార్య పిట్ దొరసాని వీరి కుటుంబ శ్రేయోభిలాషి. ఆమె షేక్స్పియర్, మిల్టన్ ల సాహిత్యాన్ని ఆపోసన పట్టిన విదుషీ మణి. ఆచార్యులవారికి ఆంగ్ల భాషపరిచయం ఆసాహిత్యంపై అభిమానం కలుగజేసింది. రంజకం మహాలక్ష్మి అనే నృత్యకళాకారిణి

వీరి కోరికపై కూచిపూడి, భరతనాట్యాలను నేర్పింది. పుట్టపర్తివారి బంధువు మైసూరులో ఉన్న శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి వద్ద ప్రాకృత భాష, దాని భాషాభేదమైన 'అపభ్రంశం' కూడా నేర్చి అందులోని కావ్యమైన 'జనహార చరిత్ర' అధ్యయనం చేసి కావ్య రచనపై దృష్టి పడి పెనుగొండ గతవైభవం మనసులో మెదిలి 'పెనుగొండ లక్ష్మి' కావ్యంగా రాశారు. అప్పటికి ఛందస్సులో పూర్తి ప్రవేశమూ లేదాయనకు. చిన్నప్పటి నుంచి తిక్కన భారతం వాచో విధేయం అవటంతో తేలికగా రాయగలిగారు. ఆర్థిక స్థోమత లేక ముద్రాభాగ్యం కలిగించలేక పోయారు.

తిరుపతి సంస్కృత కలాశాలలో చేరాలని వెడితే ప్రిన్సిపాల్ కపిత్థలం కృష్ణమాచార్యులు పూర్వపు చదువు ధృవీకరణ పత్రాలు కావాలన్నారు. అవి ఉండటానికి అయన ఎక్కడైనా చేరి చదివితేగా! అసహనంగా బయటికి వస్తూ ఆశువుగా ఆవేశంగా పద్యాలు చెబుతూ బయటికొచ్చిన వీరిని వెనక్కి పిలిచి సీటు ఇచ్చారు ప్రిన్సిపాల్. అదే వారి యోగ్యతా పత్రమైంది, ప్రవేశ పాత్రమైంది. వ్యాకరణ అలంకార శాస్త్రాధ్యయనం చేస్తూ తోటి విద్యార్థులకు వీటిని బోధిస్తూ 'వాలి చరిత్ర', 'ఇందుమతి' అనే రెండు కావ్యాలు రాసి నచ్చక చించి పారేశారు. అవధానాలు చేసి అలరించారు. ఊహాశక్తికి అవధానాలు అడ్డం అని మానేశారు. పాఠ్య భాగాలు ఆయనకు 'ఆనలేదు'. నటనపై ధ్యాస పెరిగి సహ విద్యార్థులతో 'బొబ్బిలి' నాటకాన్ని కడప జిల్లా రాజంపేటలో ప్రదర్శించారు. వీరు తాండ్ర పాపారాయుడు పాత్రను, చలమచర్లరంగా చార్యులుగారు రంగ రాయుడు పాత్రధరించారు. నిరంతర సాహిత్య గోష్టి జరిపేవారు. వారి ధారణాశక్తి అమోఘం. భట్టబాణుని కాదంబరి కావ్యం షేక్స్పియర్ మిల్టన్ షెల్లీ కీట్స్ వర్డ్స్ వర్త్ కవుల రచనలను ఆసాంతం అప్పగించేవారు. వాల్మీకి రామాయణం నాలుకపైఎప్పుడూ నర్తించేది. అలివేలుమంగా పురానికి ఉత్తరాది మఠం స్వామి శ్రీ సత్య ధ్యాన కీర్తుల వారొచ్చినప్పుడు వారి సమక్షంలో సంస్కృతంలో ఆశుకవిత్వం చెప్పి షట్ శాస్త్ర పండితులైన స్వామినే మెప్పించారు. తిరుపతిలో తాను చదవటానికి ఏదీ మిగలి లేదని పెనుగొండకు వెళ్లిపోయి పరీక్ష సమయానికి వచ్చి రాసి

ఉత్తీర్ణులయ్యారు.

1934లో14వ ఏట 'పెనుగొండ లక్ష్మి' కావ్యం రాశారు. 19వ ఏట ముద్రణ పొందిన ఆ కావ్యాన్ని మద్రాస్ ప్రభుత్వం ఇంటర్‌కు పాఠ్య గ్రంథం చేసింది. తిరుపతిలో ఉండగానే ఇంటర్ పరీక్ష రాసి తాను రాసిన కావ్యానికి తానే విద్యార్థిగా పరీక్ష రాసి చరిత్ర సృష్టించారు. పెనుగొండ లక్ష్మిపై ఇచ్చిన రెండుమార్కుల ప్రశ్నకు 40 పేజీల సమాధానం రాసి సమయం అయిపోగానే మిగిలిన వాటి జోలికీ పోకుండా జవాబు పత్రం ఇచ్చేశారు. పార్సీ భాషాధ్యయనం చేసి 170 పద్యాల 'షాజీ', 'సాక్షాత్కారం' రాశారు. పెనుగొండలో వివాహం చేసుకొని భార్య కొన్ని రోజులకే చనిపోతే విద్వత్ కవయిత్రి శ్రీమతి కనకమ్మ గారిని వివాహమాడి 5గురు కుమార్తెలు ఒక కుమారుని పొందారు. ఆమె ఉత్తమ కవయిత్రిగా బహుమతి పొందారు. కాపురం ప్రొద్దుటూరుకు మార్చారు. కన్యకా పరమేశ్వరి దేవాలయంలో సంస్కృతం నేర్పారు. విద్వాన్ పూర్తి కాలేదింకా. భారతి పత్రికలో వీరి రచనలు ప్రచురితమయ్యేవి. మునిసిపల్ హై స్కూల్ తెలుగు పండితులుగా చేశారు. హిందీ సాహిత్యాన్ని అవలోడనం చేశారు. తులసీ తుకారాం కబీర్ రాస్ఖాన్, రాహీం ల కవిత్వాన్ని మధించారు. 'మేఘదూతం', 'శివతాండవం', 'పండరి భాగవతం' రాశారు. కుందూ నది ఒడ్డున చిన్న ఆశ్రమం ఏర్పాటు చేసుకొని శిష్యులతో ఉంటూ దాదాపు 7,000 కృతులు రాశారు. 'విజయనగర సామ్రాజ్య ప్రబంధం' రాశారు. మరాఠీ భాషానుభవంతో 'పాద్యం' అనే కావ్యాన్ని గురువు పూజ స్థానీయంపై రాశారు. పాండి చేరి వెళ్ళి, శ్రీ అరవింద ఘోష్‌తో పరిచయం పెంచుకొన్నారు. అరవిందుల రచనలు తెలుగులోకి కొన్ని ఆవదించారు.

రాళ్ళపల్లి వారి వద్ద సంగీతాన్ని, సంధ్యా వందనం శ్రీనివాసాచారిగారితో కలిసి నేర్చుకొన్నారు. ఫిడేల్ పెద్ద జమాలప్ప, వద్ద 150 కృతులు పాఠం చెప్పించుకొన్నారు. ఘోరా కుంభార్ 'తులసీదాస్', 'కాంగ్రెస్ చరిత్ర' హరికథలు రాసి స్వయంగా గానం చేశారు. 60 వర్ణాలను కొక్కొండ సుబ్రహ్మణ్యం వద్ద నేర్చి 'శివ రంజని', 'శంకరి' అనే రెండు కొత్త రాగాలను కనిపెట్టారు. త్యాగ రాజ స్వామిపై సంస్కృతంలో సుప్రభాతం రాస్తే మంగళంపల్లి బాల మురళీ కృష్ణ మధుర

గానం చేసి అజరామరం చేశారు. ఇది ఆడియో కేసెట్‌గా వచ్చింది. అగస్త్యేశ్వర సుప్రభాతం, చెన్నకేశవ సుప్రభాతం ఆచార్యులవారి ఇతర సంస్కృత కీర్తనలు. అన్నమాచార్యులవారి 100 కృతులకు బాణీల ఓణీలు వేశారు.

'గాంధీజీ మహా ప్రస్థానం'తోపాటు కమ్యూనిస్ట్ భావ ప్రేరితంగా 'మేఘ దూతం', ఇంగ్లీష్‌లో 'లీవ్స్ ఇన్ ది విండ్' కవితా సంపుటిని రాశారు . శంకరం బాడి బాడి సుందరా చార్యుల ప్రసిద్ధ గీతం ''మా తెలుగు తల్లి ''ని ఆంగ్లం లోకి అనువదించారు.సంప్రదాయ శైలి లో ''ది హీరో', 'వైన్ గ్లోరియస్', 'భాగవతం' రాశారు. ప్రొద్దుటూరు నుండి కడపకు మకాం మార్చి శ్రీ రామ కృష్ణ హైస్కూల్‌లో తెలుగు పండితులుగా చేరి, జిల్లెళ్ళమూడి అమ్మ గారు కొనిచ్చిన ఇంట్లో చేరి, మళయాళ నిఘంటువు నిర్మాణం చేసి, ఆ భాషలోని రచనలను తెలుగులోకి తెలుగు నుండి కొన్ని మలయాళంలోకి మార్చారు. మరాఠీ భాషలో 'భగవాన్ బుద్ధ', 'స్వర్ణ పత్ర', 'ఉషః కా''ల్ నవలలు రాశారు .కృష్ణ శంకర్ దేవ్ మరాఠీరచన ను ''సమర్ధ రామ దాసు ''గా తెలుగులోకి అనువాదం చేశారు .

తులసీదాస్ మహాకవి రామ చరితమానస్ ఆచార్యులవారికి కంఠో పాఠం..హిందీలోఉన్న ''గాడీవాలా' నవల 'కబీర్ వచనా వలి' అనువదించారు. ఇంగ్లీష్ నుంచి 'మెరుపులు – తలపులు' అరవిందులు, 'గీతోపన్యాసాలు' అనువాదం చేశారు. 14 భాషలలో అనితర సాధ్యపాండిత్య ప్రకర్ష కలిగి, సృజనాత్మక సాహిత్యాన్ని సృష్టించిన వీరికి, ప్రతిభకు తగ్గ పురస్కారం 'పద్మశ్రీ'ని భారత ప్రభుత్వం 1972 జనవరి 26 న పుట్టపర్తి వారికి అందజేసి గౌరవించింది. 1975 లో తిరుపతి విశ్వ విద్యాలయం, 1978లో శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంల నుంచి గౌరవ డాక్టరేట్ పొందారు. 'జనప్రియ రామాయణం' రాసి, 5వ ఏట ఉర్దూ భాష నేర్చి, ఘనంగా షష్టి పూర్తి మహోత్సవం జరుపుకొని, దేశంలోని అనేక సాహిత్య సంస్థల చేత సమ్మానింప బడి, భార్య కనకమ్మగారి ప్రోత్సాహ, ప్రోద్బలాలతో 140 గ్రంథాలు రాసి తనకు రావాల్సిన 'జ్ఞాన పీఠపురస్కారం' మాత్రం దక్కక, 78వ ఏట అభిమానులకు శిష్యులకు 'అవతారం చాలిస్తున్నానప్పా' అని చెప్పి సరస్వతీపుత్రులు తల్లి సరస్వతీ సాన్నిధ్యానికి చేరారు.

ప్రొద్దుటూరులో 20-9-1991న పుట్టపర్తి వారి విగ్రహం ఏర్పాటు చేశారు. కడపలో వారి శిష్యులు 'సరస్వతీ పుత్ర అవార్డ్' ఏర్పరచి అర్హులకు అందజేస్తూ వారి మధురస్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొంటూ ఋణం తీర్చుకొంటున్నారు. కుమార్తెలు శ్రీ నాగపద్మినిగారు సోదరితో శ్రీమతి అనూరాధ గారితో కలిసి 'సరస్వతీ పుత్ర' నారాయణా చార్య' బ్లాగ్ ఏర్పరచి తండ్రిగారి రచనలను అందరికి అందుబాటులోకి తెచ్చారు.❋



## 381. మహామహోపాధ్యాయ తర్క వేదాంతరత్న బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారు (1916-2008)

**ఆ**ంధ్రదేశంలో తర్క శాస్త్రంలో అద్వితీయులనిపించుకొని, వందలాది శిష్యులను ఆ శాస్త్రంలో తీర్చిదిద్ది వేలాది పురాణ ప్రవచనాలు చేసి విజయవాడకే ఒక గొప్ప శాస్త్రీయ గౌరవాన్ని కల్పించిన వారు శ్రీ మద్దుల పల్లి మాణిక్య శాస్త్రిగారు. చెవులకు కుండలాలు నుదుట విభూతి రేఖలు ఫాలభాగంలో కుంకుమ వంటి నిండా అతి విలువైన కాశ్మీర శాలువా చక్కనివెడల్పు అంచుల ఖద్దరు ఆంధ్రబిళ్ళ గోచీ కట్టు తో స్ఫురద్రూపంతో బ్రహ్మ వర్చస్సుతో శాస్త్రిగారిని చూస్తే అపర శంకరులని పించేవారు. వారు లేని వేదాంత సభ, తర్క సభ ఉండేదికాదు. అందర్లోనూ కొట్టొచ్చినట్లు కనిపించే మహా గాంభీర్య మూర్తిమత్వం వారిది. చాలా సభలలోనూ,

విజయవాడలో మా బంధువుల వివాహ సందర్భాలలోనూ వారిని చూశాను. సభా తాంబూలం వారికిచ్చి ఆశీర్వచనం పొంది యజమానులు ధన్యులయేవారు. ఆ వర్చస్సు అ ఠీవీ ఆ రాజసం ఆ విద్వత్తు, ఆవ్యాసంగం, ఆ ఉపన్యాస ధోరణి, ఆ ప్రతిభా నాన్య దర్శనం అనిపించేవి. రాష్ట్రపతి సన్మాన గ్రాహీతలైన వారి గురించి ఈతరం వారికెవరికీ తెలియక పోవటం ఆశ్చర్యమే. ఎంతోమంది గీర్వాణ కవుల గురించి రాశానుకదా మరి మద్దుల పల్లి వారి గురించి వెలితి ఉండిపోయిందనే విషయం నన్ను బాధించింది. నాకు తెలిసిన వారి నందర్నీ సంప్రదించాను. ఎవరికీ తెలియదన్నారు. నా తపన గమనించిన పొన్నూరు సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు మద్దుల పల్లి వారి అబ్బాయి బావ మరది ఫోన్ నంబర్ ఇచ్చారు. ఆయనకు ఫోన్ చేస్తే మాణిక్య శాస్త్రిగారి అబ్బాయి శ్రీ దక్షిణా మూర్తి గారి నంబర్ ఇచ్చారు. వారితో మాట్లాడి నా తపన చెప్పి సరసభారతి పుస్తకాలు పంపాను. వారు తమ తండ్రిగారు రాష్ట్రపతి పురస్కారాన్ని అందుకొన్నప్పుడు అయన గౌరవార్ధం బెనారస్ విశ్వ విద్యాలయ తెచ్చిన ప్రత్యేక సావనీర్‌ను, శ్రీ శంకరాచార్య ప్రకరణాలపై మాణిక్య శాస్త్రి గారు రాసిన తత్వ ప్రభ గ్రంథాన్ని పంపారు. మొదటిది అంతా సంస్కృతంలో వివిధ లబ్ధ ప్రతిష్ట రచయితలు రాసిన ఉత్తమ వ్యాసాలున్నాయి. అందులో మా గబ్బిట వారైన శ్రీ గబ్బిట ఆంజనేయశాస్త్రి గారి వ్యాసమూ ఉంది. శాస్త్రిగారి కుమారులు దక్షిణామూర్తిగారు హిందీలో తమ తండ్రిగారి గురించి వ్రాసిన వ్యాసం అందులో ఉంది. అదే ఈ వ్యాసానికి ఆధారం.

**జనన విద్యాభ్యాసాలు**

శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రిగారు 1916 ఫాల్గుణ బహుళ పాడ్యమి నాడు ప్రకాశం జిల్లా కలిగిరి మండలం ఆనంద పురాగ్రహారంలో జన్మించారు. తలిదండ్రులు శ్రీమతి చెంచు లక్ష్మి శ్రీ దత్తాత్రేయ శాస్త్రి గార్లు. తండ్రి ప్రకాండ వైయాకరుణులు. జ్యోతిష్ శాస్త్రంలో నిష్ణాతులు. ఆయన రోజులో ఎక్కువ భాగం భగవధ్యానం పూజలోను విద్యార్ధులకు బోధనలోను, ప్రజాహిత

కార్యక్రమాలలోనూ గడిపేవారు. భార్యతో వారి దాంపత్య జీవితం సుఖ సంపన్నంగా ఉండేది. ఈ దంపతుల ప్రథమ సంతానం శ్రీమతి వెంకట సుబ్బమ్మ, రెండు శ్రీ సత్యనారాయణ శాస్త్రి మూడు శ్రీ లక్ష్మీ నరసింహ శాస్త్రి నాలుగు శ్రీ మాణిక్య శాస్త్రి అయిదు శ్రీమతి లక్ష్మీ వేదమ్మగార్లు. జ్యేష్టపుత్రుడైన సత్యనారాయణ శాస్త్రి గారు సంస్కృతాంధ్రాలలో ప్రసిద్ధ కవి. రెండవ కుమారుడు శ్రీ లక్ష్మీ నరసింహ శాస్త్రి సంగీత శాస్త్రం లో సుప్రసిద్ధ విద్వాంసులు. ఆఖరివారైన శ్రీ కృష్ణ మూర్తి శాస్త్రి అధ్యాపకులుగా పని చేసి విశ్రాంతి తీసుకొంటున్నారు.

చిన్నతనం నుండి మాణిక్య శాస్త్రిగారు తండ్రి గారి వద్ద సంస్కృతాధ్యయనం చేశారు. శాస్త్రాలు నేర్వాలన్న ఆ కాంక్షతో 12వ ఏటనే కాశీ వెళ్ళారు. అక్కడ తర్కం వేదాంత శాస్త్రాలు అభ్యసించారు. పది సంవత్సరాల కఠోర పరిశ్రమ చేసి ప్రకాండ పండితులై, కాశీ మహారాజు చేత ఘన సన్మానం అందుకొన్నారు. తర్వాత స్వగృహం చేరారు. శ్రీ వేమూరి రామబ్రహ్మ శాస్త్రి మహోదయుల వద్ద శిష్యరికం చేసి తర్క, వేదాంతాల అంతు చూశారు. గురువుగారి ప్రశంసలు అందుకొన్నారు. శ్రీ గోరుగంత సుబ్రహ్మణ్య శాస్త్రి గురువరేణ్యుల వద్ద చాలాకాలం విద్య నభ్యసించి గురువు గారిచే 'నువ్వు ఇప్పుడు విద్వన్మణి వయ్యావు. గురువుకు కూడా చిర యశస్సు కలిగించి ప్రకాండ పండితుడివై విశ్వ విఖ్యాత కీర్తినార్జిస్తావు' అని ఆశీరభినందనలు అందుకొన్న విద్యా మాణిక్యం మాణిక్య శాస్త్రి గారు.

**వివాహం సంతానం .**

విప్పర్లపల్లి నివాసి శ్రీ వంగల శ్రీ కృష్ణ మూర్తి, ఆది లక్ష్మి దంపతుల సుపుత్రి శ్రీమతి సుబ్బలక్ష్మిని వివాహమాడారు. మాణిక్య శాస్త్రిగారు మొదట్లో ఆగిరిపల్లి సర్వ తంత్ర స్వతంత్ర విద్యాలయంలో అధ్యాపకులుగా సేవ చేశారు. తర్వాత విజయవాడకు చేరి భారత మహిళా మండలిలో పురాణ ప్రవచనం చేస్తూ, శిష్యులకు తర్క, వేదాంత శాస్త్రాలు బోధిస్తూ నేర్చిన విద్యకు సార్ధకత కల్పించారు. 1954లో విజయవాడలో స్వగృహం నిర్మించుకొన్నారు.

మాణిక్య శాస్త్రి గారికి పంచాగ్నుల వంటి అయిదుగురు కుమారులు

జన్మించారు. ప్రథమ పుత్రులు శ్రీ సూర్య నారాయణ ఘనాపాఠీ విద్యార్థులకు వేదాధ్యనం గరుపుతూ 25 మంది ఘనాపాఠీలను తయారు చేసిన ఘనులు. రెండవ కుమారుడు శ్రీ లక్ష్మీ నరసింహ శాస్త్రిగారు చార్టర్డ్ అకౌంటంట్‌గా పని చేసి 20మంది చార్టర్డ్ అకౌంట్స్‌ను తయారు చేసిన విశేష సునిసిత మేధావి. మూడవ కుమారులు శ్రీ కృష్ణమూర్తి శాస్త్రిగారు తండ్రిగారి సేవలో తరిస్తూ జీవితాన్ని సార్ధకం చేసుకొన్నారు. నాలుగవ పుత్రరత్నం శ్రీ దక్షిణామూర్తిగారు పూజ్యపాదులైన జనకుల వద్దనే సంస్కృతాన్ని అభ్యసించి కేంద్రీయ విద్యాలయంలో సంస్కృత అధ్యాపకులుగా సేవలందిస్తున్నారు. తండ్రిగారి వారసత్వాన్ని నిలుపుతూ పురాణ ప్రవచనాలు చేస్తూ ఆర్ష విజ్ఞానాన్ని వ్యాపింప జేస్తున్నారు. అయిదవ కుమారులు శ్రీ దత్తాత్రేయ శాస్త్రిగారు తండ్రిగారు మాణిక్య శాస్త్రిగారి శాస్త్ర జ్ఞానాన్ని ఆపోసన పట్టి ఉత్తరాధికారిగా తర్క, వేదాన్తాది శాస్త్రాలను అధ్యయనం చేసి బహు ప్రఖ్యాతులయ్యారు. విశాఖపట్నం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా వెలుగొందుతున్నారు. మాణిక్య శాస్త్రి గారి పుత్రులు అయిదుగురూ మాణిక్యాల లాంటి వారే. తండ్రిగారి యశస్సును ద్విగుణీకృతం చేస్తున్నారు ధన్య జీవి శాస్త్రిగారు.

**మాణిక్య శాస్త్రిగారి బహు విధ వ్యాసంగం**

విజయవాడలో ఉంటూ మాణిక్య శాస్త్రిగారు త్రిలింగ విద్యాపీఠంలో చాలాకాలం తర్క వేదాంత శాస్త్రధ్యాపనం చేశారు. తరువాత స్వంత ఇంటిలో గురుకుల మేర్పరచి ఎందరో శిష్యులను అద్వితీయ పండితులుగా తీర్చిదిద్దారు. అందులో ప్రసిద్ధులు శ్రీ శ్రీ చతుర్వేదుల రామ లింగ శాస్త్రి, శ్రీ కరిపెద్దు పురుషోత్తమ శాస్త్రి, శ్రీ పొదిలి లక్ష్మీ నారాయణ శాస్త్రి, శ్రీ మేడిచర్ల గోపాలకృష్ణమూర్తి శాస్త్రి మొదలైన దిగ్దంతులైన పండిత ప్రకాండులున్నారు. శివరామ కృష్ణ క్షేత్రంలో 29 సంవత్సరాలు ఏకధాటిగా ప్రతిదినం పురాణ ప్రవచనం చేసిన రికార్డు శాస్త్రిగారిది. సాధారణ జనాలకు కూడాఅర్ధమయ్యేట్లు వారు తర్క వేదాంత విషయాలను ప్రవచించే తీరు మహదాశ్చర్యంగా ఉండేది. ఉప పురాణాలను కూడా సామాన్యులకు

సులభ బోధకంగా చెప్పే నేర్పు వారిది. అందుకే వారి ప్రవచనాలకు విశేషంగా భక్తజనం హాజరై విజయం కలిగించేవారు. చందోలు శాస్త్రిగా పిలువ బడే బాలా త్రిపుర సుందరీ ఉపాసకులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారింట నెల రోజులు ఉండి ఆ బ్రాహ్మీమయ మూర్తికి సర్వ శాస్త్ర పాండిత్యంలో మెలకువలు కరతలామలకం చేశారు. ఈ విషయాన్ని తాడేపల్లి వారే స్వయంగా చెప్పుకొన్నారు. విజయవాడలో శ్రీ మాణిక్య శాస్త్రి గారికి ఘన సన్మానం జరిగినపుడు శ్రీ రాఘవ నారాయణ శాస్త్రి గారు గురుభక్తిగా అభినందన శ్లోకాలు రచించి చదివారు. ఆ మాణిక్యం ఘన పదార్థమైతే ఈ మాణిక్యం వాత్సల్య ఝురీ సదృశం అన్నారు.

**దిన చర్య**

శ్రీ మాణిక్య శాస్త్రి గారి దిన చర్య చాలా నిర్దుష్టంగా ఉండేది. క్షణం తీరుబడి లేనికార్య వ్యగ్రత వారిది. ప్రతి దినం తెల్లవారుఝామున బ్రాహ్మీ ముహూర్తంలో నిద్రలేచి గ్రంథావలోకనాం చేసేవారు. 7 గంటల వరకు పూజ, దేవతార్చనలో నిమగ్నంయ్యేవారు. తర్వాత పురాణ ప్రవచనం చేసేవారు. ఉదయం 9గంటలకు శిష్యులకు శాస్త్రాధ్యాపనం చేసేవారు. తర్వాత మళ్ళీ పూజ. భోజనాంతరం సాయంకాలం వరకు శాస్త్రాధ్యాపనం. సాయంకాలం నుండి రాత్రి 9గంటల వరకు పూజాదికాలు. రాత్రి 10గంటలనుండి ఒక గంట సేపు పునశ్చరణ. ఇదీ శాస్త్రిగారి బిజీ షెడ్యూల్. శాస్త్రిగారి ధర్మ పత్ని శ్రీమతి సుబ్బలక్ష్మి గారు ఛాత్రులకు, పండితులకు అతిధులకు అందజేసే ఆతిధ్యంలో భర్తగారికి చేదోడు వాదోడుగా ఉంటూ గురుపత్నిగా సమాన గౌరవాదరాలను పొందేవారు. ప్రతి సంవత్సరం శాస్త్రి గారి గృహంలో నవ రాత్రి ఉత్సవాలను మహా వైభావంగా నిర్వహించేవారు. ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ సమస్తవేద, శాస్త్ర పండితులు విచ్చేసి శాస్త్రి గారి ఘనమైన ఆదరణ ఆతిధ్యాలను గ్రహించి, సగౌరవ సత్కారాలను అందుకొని సంతృప్తి చెందేవారు.

**రచనా వ్యాసంగం**

అనేక విషయాలపై భాషణలు, ప్రసంగాలు, చర్చలు, అధ్యాపనం పురాణ ప్రవచనం విశేషాలను ప్రముఖ పత్రికలన్నీ వ్యాసపరంపరగా అందజేసేవి. వారి వ్యాసాలను ప్రచురించేవి. దిన పత్రికలైన ఇండియన్ ఎక్స్ ప్రెస్, హిందూ పత్రికలూ ఆంగ్లం లో వారి ప్రసంగాలను అందజేసేవి. శాస్త్రిగారు ఎక్కడ ఏ విషయమై రాసినా, మాట్లాడినా పత్రికలన్నీ వెంటనే ప్రముఖంగా ప్రచురించి వారి భావధారను అందజేసేవి. ఆంధ్రపత్రిక ఈనాడు వంటి తెలుగుపత్రికలు శాస్త్రిగారి బహుముఖీన పాండిత్యం విద్వత్తుల గురించి ప్రత్యేక వ్యాసాలూ రాసేవి. ప్రధాని నెహ్రూ నుండి పొందిన సన్మాన వార్తలను ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ ఘనంగా ప్రచురించి శాస్తిగారి కీర్తిని దశ దిశలా చాటింది. దర్భంగా మహారాజు చేసిన సన్మానాన్ని ప్రముఖంగా ప్రచురించి వారి కీర్తికిరీటానికి మరో కలికితురాయి నందజేసింది.

మాణిక్య శాస్త్రిగారు అనుక్షణ వ్యాసంగంలో ఉంటూ కూడా 'శ్రీ శంకరాచార్య ప్రకరణలపై' 'తత్వ రహస్య ప్రభ' రాశారు. దీనికి రాష్ట్రపతి పురస్కారం ఘన సన్మానం లభించింది. ఇందులో దక్షిణామూర్తి స్తోత్రం, అపరోక్షాను భూతి దశ శ్లోకి, సోపాన పంచకం, ఏక శ్లోకీ మనీషా పంచకం మొదలైన వాటిపై వివరణతో చర్చించారు.

శాస్త్రిగారి రెండవ గ్రంథం 'తత్వ సంవిజ్ఞాన పీఠికా' ఇందులో భక్తీ ముక్తి మార్గాలు అనేక వేదాంత విశేషాలు, ఉదాహరణలు ఉంటాయి వీరి తత్వ రహస్య ప్రభ ఇప్పటికీ లభ్యమే.

**శాస్త్రిగారి గురుకులం**

మాణిక్య శాస్త్రి గారింట ఎందరో విద్యార్థులు ఉండి నిరంతర విద్య అధ్యాపనం చేసేవారు. వారే తర్వాత అగ్రగణ్య పండితులై గురువుగారి కీర్తికి కూడా కారకులయ్యారు. శాస్త్రిగారి సుపుత్రులు డా. దత్తాత్రేయ శాస్త్రి గారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆచార్యులై, పురాణ ప్రవచకులై గురుపరంపరను కొనసాగించటం విశేషం. శ్రీ రాణీమురళీ కృష్ణ కేంద్రీయ విద్యాలయంలో

సంస్కృతాధ్యాపకులై గీర్వాణ సేవలో తరిస్తున్నారు. శ్రీ ధూళిపాళ రామకృష్ణ విజయవాడ మేరీస్టేల్లా కళాశాలలో సంస్కృత ఆచార్యులై భాషా సేవలందిస్తున్నారు శ్రీపాలగుడు సుబ్రహ్మణ్య శాస్త్రి సంస్కృతాధ్యాపనంతోబాటు పురాణ ప్రవచనంలోను అద్వితీయులనిపించుకొన్నారు. ఈ శిష్య పరంపర ప్రతి ఏడాది మాణిక్య శాస్త్రి గారి జన్మ దినమైన ఫాల్గుణ బహుళ పాడ్యమినాడు గురు పూజోత్సవాన్ని అతి వైభవంగా నిర్వహిస్తారు. అంతర్గత వేద, శాస్త్ర సభలను ఏర్పాటు చేస్తూ భక్తి శ్రద్ధలతో పండిత సన్మానాలనూ వైభవంగా చేసి గురుభక్తిని ప్రకటించుకోవటం ఒక విశిష్టమైన ఆదర్శవంతమైన ఆనవాయితీ. దేశంలోని వివిధ ప్రాంతాలనుండి ఇక్కడికి వచ్చి శాస్త్రిగారి అంతే వాసులై శాస్త్ర విద్యనభ్యసించిన వారిలో శ్రీ వేదవ్యాస, శ్రీ శ్రీనివాసాచార్య, శ్రీ కృష్ణ రాజ తంత్రీ మొదలైన మహా పండితులున్నారు. శిష్యులలో మాణిక్య శాస్త్రిగారికి ప్రియశిష్యులు శ్రీ గబ్బిట ఆంజనేయ శాస్త్రిగారు. బెనారస్ విశ్వ విద్యాలయంలో వైదిక దర్శన విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. అనేక మంది విద్యార్థులకు మార్గ దర్శనం చేశారు. గురు కీర్తి దశ దిశలా వ్యాపింపజేసి గురూణం తీర్చుకొన్న శాస్త్రి గారి ప్రియ తమ అంతేవాసి.

**బిరుద సత్కార పురస్కారాలు**

శ్రీ శృంగేరి శారదా పీఠం, శ్రీ కంచి కామ కోటి పీఠం, ఉడిపి పెజావర్ మఠం, తిరుపతి దేవస్థానాలకు శ్రీ మాణిక్య శాస్త్రి గారు ఆస్థాన పండితులై గౌరవం పొందారు. ఇందులో కొందరు పీఠాదిపతులకు శాస్త్రిగారు తర్క వేదాంత గురువులవటం మహా గొప్ప విషయం. 1992లో రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ గారు మాణిక్య శాస్త్రిగారు చేసిన సంస్కృత సేవలను గుర్తించి రాష్ట్రపతి పురస్కారాన్ని అందజేసి ఘనంగా సత్కరించారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నుండి బహు పర్యాయాలు పురస్కారం పొందారు.

శాస్త్రిగారి అపార పాండిత్యానికి తగినట్లు 'తర్క వేదాంతాచార్య, దర్శనాచార్య, తర్క వేదాంతా రత్న మహామహోపాధ్యాయ మున్నగు బిరుదులందుకొన్న సమర్థులైన దేశికులు. శాస్త్రిగారు అగణిత పండితులకు అధ్యాపనం గరపటం వేలాది భక్తులకు

ముక్తి మార్గదర్శనం చేయించటం బహు ప్రశంసనీయం. అనేకమంది శిష్యులు గురువుగారిపై ఉన్న గౌరవ ప్రపత్తులకు నిదర్శనంగా తమ పిల్లలకు మాణిక్య శాస్త్రి పేరు పెట్టటం చిరస్మరణీయం. ఇలా జరగటం బహు అరుదు ఈ అరుదైన ఆ గౌరవాన్ని దక్కించుకొన్న వారు శ్రీ మాణిక్య శాస్త్రిగారు.

**మాణిక్య శాస్త్రి గారి మరణం**

ఒక సుప్రసిద్ధ సంస్కృత శ్లోకం-

"పరి వర్తినీ సంసారే తః కో వా న జాయతే - సజాతో యేన జంతేనయాతి వశః" సమున్నతింలో చెప్పినట్లు జీవించిన వారందరూ మరణించి ఏదోఒక జన్మ పొందుతారు. కానీ ఎవని పేరు అతని వంశానికి ఉన్నతి కలిగిస్తుందో అలాంటి వాని జీవితం ధన్యం ఇలాంటి పేరు ప్రతిష్టలను మాణిక్య శాస్త్రిగారు తన వంశానికి కలిగించి ధన్య జీవులయ్యారు. 92 ఏళ్ళ సార్ధక జీవనం గడిపిన తర్క వేదాంత రత్న మహా మహోపాధ్యాయ శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రిగారు 8-4-2008 బ్రాహ్మీ ముహూర్తంలో బ్రహ్మపదం చేరుకున్నారు.

"జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరః:-నాస్తి యేషాం యశః కాయే జరామరణ వర్జితం".❁

## 382. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ (1917-1996)

**2**1-12-1917న మధురకవి నాళం కృష్ణారావు దంపతులకు లక్ష్మీ కాంతమ్మ పుట్టారు. రాజమండ్రిలో చదివి సంస్కృతాన్ని నేర్చారు. మెట్టినిల్లు బాపట్ల చేరి హితైషిణిసభ్యురాలై మహిళాభ్యుదయానికి కృషి చేశారు. శ్రీహయగ్రీవ గుప్తాను వివాహమాడారు. 1947లో 'ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల' స్థాపించిన ప్రధానాధ్యాపకురాలు శ్రీమతి కామాక్షిగారి షష్టి పూర్తీ ఘనంగా చేసి మొదటి స్త్రీ షష్టిపూర్తిగా రికార్డ్ సృష్టించారు. తెలుగులో ఆత్మకథ, సాహితీ రుద్రమ రాసి పేరు పొందారు. 'ఆంధ్ర సరస్వతి' బిరుదు పొందారు. సంస్కృతంలో 'కావ్య మణిత్రయం', శ్రీ కన్యకా పరమేశ్వరీ స్తోత్రం, సుప్రభాతం సరళ సుందరంగా రాశారు. 1-2-1996న చనిపోయారు.❁



## 383. పుత్రసంజీవనం- కావ్యకర్త- బ్రహ్మశ్రీ ముళ్ళపూడి నారాయణ శాస్త్రిగారు (1918- 1990)

శ్రీ ముళ్ళపూడి నారాయణ శాస్త్రిగారు 10-12-1918 సాధారణ నామ సంవత్సర మార్గశిర శుద్ధ దశమినాడు గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా పెదలంక గ్రామంలో జన్మించారు. తలిదండ్రులు పార్ధ శారదమ్మ, సుబ్బయ్య గార్లు. చిన్నతనంలోనే తండ్రి చనిపోతే తల్లి తానే అన్నీ అయి పెంచి పెద్దవానిని చేసి విద్యాబుద్ధులు నేర్పించి వివాహం చేసింది. ఆమె రుణాన్ని తీర్చుకోలేను అన్నారు శాస్త్రిగారు. అన్నగారు రాజ శాస్త్రి గీర్వాణ భాషలో పండితుడిని చేశారు. శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి గారి వద్ద శాస్త్రాలు అవలోకనం చేశారు. "సాహిత్య మార్గదర్శి శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు అనే చందవోలు శాస్త్రిగారు తన సాహిత్య వృక్షానికి జనస్వామి వెంకటేశ్వరశాస్త్రి బీజారోహణం చేస్తే, చిలుకూరి వరదయ్య శాస్త్రిగారు నీరు పోశారు. మూల్పురు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు మొలకింపజేస్తే, మంగిపూడి వెంకటశాస్త్రిగారు పెంచారు. కంభంపాటి రామమూర్తిగారు పూలు పూయిస్తే, వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కాయలు కాయించారు. యతిరాజు సంపత్కుమారాచార్యులు గారు సొంపు చేస్తే తాతా సుబ్బరాయశాస్త్రి అనే రాయడు శాస్త్రీగారు పండజేశారు" అని శాస్త్రిగారు ఈ ఎనిమిది మందికి కృతజ్ఞతలు చెప్పుకొన్నారు. సీస పద్యంలో వీరు అష్టమూర్త్యాత్మక దేవతలుగా భావించారు. తర్క శాస్త్రాన్ని వేమూరి రామబ్రహ్మ శాస్త్రిగారి వద్ద నేర్చారు. అగమాంతాన్ని దెందుకూరి నరసింహ శాస్త్రి గారి వద్ద చదివి

పారీణుడయ్యారు. ఈ విధంగా నారాయణ శాస్త్రిగారు మహా మహోపాధ్యాయులైన గురువుల వద్ద కావ్య పాఠం, తర్క వేదాంత, అలంకార, వ్యాకరణ శాస్త్రాలను ఆసాంతం అభ్యసించి ఎదురులేని వారి గురువులకు తగిన శిష్యుడు అనిపించుకొన్నారు. 1929లో పోపూరి సీతారామయ్య, పున్నమ్మ గార్ల పుత్రిక శ్రీమతి బాలా త్రిపుర సుందరిని వివాహం చేసుకొని చిన్నక్క పున్నమ్మ గారి అల్లుడైనారు. మేనల్లుడైన శాస్త్రిగారి విద్యాదానానికి ఆమె అన్నదానంతో సహకరించారు. శాస్త్రి దంపతులకు నలుగురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు కలిగారు.

రేపల్లె చిట్టి వారి వీధిలో శాస్త్రిగారు శాస్త్ర పాఠశాలను ఏర్పరచి, శిష్యులకు విద్య నేర్పించారు. గ్రామంలోని ఉదారుల ఇంట వారాలు ఏర్పాటుచేసి, తన ఇంటిలోనూ భోజన వసతి కలిపించి విద్యార్థుల విద్యకు ఆటంకం లేకుండా విద్యాలయాన్ని నిర్వహించారు. ఇది క్రమంగా వృద్ధి చెంది రైలుపేటకు మారి 1940లో శ్రీ శంకర విద్యాలయంగా రూపుదిద్దుకొన్నది. జగద్గురువులు శ్రీ శంకర భాగవత్పాదులపై శాస్త్రిగారికి అపారభక్తీ తాత్పర్యాలుండేవి. భవన నిర్మాణం కోసం ఉన్నది అంతా ఖర్చు చేశారు. ఇది గమనించిన మహాదాత తిమ్మ సముద్రం వాసి శ్రీ గోరంట్ల వెంకన్న చౌదరి ధన సహాయం చేసి శాస్త్రిగారి సంకల్ప సిద్ధికి తోడ్పడ్డారు. వారికి జీవితాంతం శాస్త్రిగారు కృతజ్ఞత చూపించేవారు.

శ్రీ శంకర విద్యాలయం తర్వాత వేద శాస్త్ర పాఠశాలగా మారింది. ఇప్పుడు శ్రీ శంకర సంస్కృత డిగ్రీ కళాశాలగా అభివృద్ధి చెందింది. నిర్వహణకు, ఆర్థికానికి ఇబ్బందులేర్పడి శ్రీ తూములూరి సుబ్బావధానిగారు మొదలైన వారిని ఏర్పాటుచేశారు. శాస్త్రిగారు పొన్నూరు శ్రీ భవనారాయాణ స్వామి వారి సంస్కృత కళాశాలలో ఉపన్యాసకులుగా చేరారు. 1962-67 వరకు శ్రీ డాక్టర్ కే.వి.కే.సంస్కృత కళాశాలలో అయిదేళ్ళు లెక్చరర్‌గా ఉద్యోగించి, తర్వాత రెండేళ్ళు తిమ్మ సముద్రంలో గోరంట్ల వారి పాఠశాల నిర్వాహకులుగా ఉన్నారు. అక్కడి నుండి రేపల్లి చేరి తన విద్యాలయాన్ని సంస్కృత కళాశాలగా రూపాంతరం చెందించి 1969-75 వరకు ప్రిన్సిపల్ పదవిని అలంకరించి కళాశాల అభివృద్ధికి తోడ్పడ్డారు.

గర్వాహంకార, అసూయాదులు లేని శాస్త్రిగారు పదవీ విరమణ తర్వాత కూడా అక్కడే బోధనలు చేసి తన అపార జ్ఞాన సంపదను విద్యార్థులకు అందజేసేవారు.

భారత, భాగవత, రామాయణాలను పురాణాలుగా ఎన్నోసార్లు శాస్త్రిగారు ప్రవచనం చేశారు. 1960లో శంకర విద్యాలయంలో శాస్త్రిగారు భాగవత ప్రవచనం చేయగా పులకించిన శిష్యులు, రేపల్లె పురజనులు సువర్ణ ఘంటా కంకణ పురస్కారాలందజేసి ధన్యులయ్యారు. గుంటూరులో వేద ప్రవర్ధక విద్వత్ సభ కార్యాలయంలో నాలుగేళ్ళు శాస్త్రిగారి చేత ఉపనిషత్ భాష్య ప్రవచనం చెప్పించారు.

**కావ్య రచన**

విద్యార్థి దశలోనే నారాయణ శాస్త్రిగారు సంస్కృతంలో సుబ్రహ్మణ్య విజయం అనే ఏకాంకిక నాటకం రాశారు. ఇందులో శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రిగారి విద్యా విజయాన్ని కథా వస్తువును చేసి గురు ఋణం తీర్చుకొన్నారు. కాని ఇది అముద్రితం అవటం మన దురదృష్టం. పొన్నూరులో ఉండగా కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంను తెలుగులో రచించి కవి కులగురువుపై తమకున్న అరాధనా భావాన్ని తెలియజెప్పుకున్నారు. ఇది ఇతర ఆంధ్రానువాదాల కంటే మేలు బంతి. అందుకే మూడుసార్లు ముద్రణ పొందింది. చాలా విశ్వ విద్యాలయాలలో పాఠ్యాంశమైంది. అంగద రాయబారం అనే ఖండ కృతి తెలుగులో రాశారు. శ్రీ పరాశరం కృష్ణమాచార్యుల గారితో కలిసి ఆపస్తంభ, లౌగాక్షి గృహ్య సూత్రాలును ఆంధ్రీకరించగా విఖనస గ్రంథ మండలి ప్రచురించారు.

**పుత్ర సంజీవన కావ్యావిర్భావం**

శాస్త్రిగారు మూడవ కుమారుడు శివరామకృష్ణ మహా బాల మేధావి. తండ్రిగారు చెబుతుండగానే అమరకోశం మొదటికాండ నోటికి వచ్చేసింది. రెండవ కాండ మొదలుపెట్టాడు. శ్రీ లంకా శ్రీమన్నారాయణ గారి వద్ద మొదటి తరగతి చదివి రెండవ తరగతిలో చేరి ఇరవై ఎక్కాలు బట్టీ పట్టాడు. ఈ 5 ఏళ్ళ బాల కిశోరం. ఈ కుర్రాడు తనంత పండితుడవుతాడని శాస్త్రిగారు ఉప్పొంగిపోయేవారు.

అతని తెలివితేటలకు మిగిలిన శిష్యులు ఆశ్చర్యపోయేవారు. విధి వక్రించి ఈ బాలుడు అయిదేళ్ళ రెండు నెలలకే తలిదండ్రులకు గర్భశోకం మిగిల్చి మరణించాడు.

ఈ శోకాన్ని దాచుకోలేక శాస్త్రిగారు సంస్కృతంలో పుత్ర సంజీవనం అనే కావ్యాన్ని రాశారు. శోకం శ్లోకంగా మారి వారి శోకం ఉపశమించింది. శ్రీకృష్ణ బలరాములు కుచేలురు సాందీపని మహర్షి శిష్యులు. సాందీపుని కుమారుడు చనిపోతే కృష్ణుడు గురుదక్షిణగా ఆ కుమారుని బ్రతికించి తెచ్చి అప్పగించి గురు ఋణం తీర్చుకొన్న కథ. ఈ కావ్యం రాసిన తర్వాత శాస్త్రిగారికి మళ్ళీ మగ పిల్లాడు పుట్టి ఆనందాన్ని కలిగించాడు. ఈ కుర్రాగాకి శ్రీ కృష్ణప్రసాద్ అనే పేరు పెట్టుకొని సంతృప్తి చెందారు. శాస్త్రిగారి మేనల్లుడు మూడేళ్ళ వయసులోను, ఆ పిల్లాడు అయిదేళ్ళ వయసులో చనిపోగా, పెద్ద దౌహిత్రుడు తొమ్మిదేళ్ళకు మరణించి ఆ కుటుంబంలో శోకం నింపారు. కావ్యాన్ని అంకితం ఇచ్చే స్వస్రీయ పుత్ర దౌహిత్ర అనే శ్లోకంలో పాపక్షయార్ధంగా కావ్యాన్ని పరమాత్మకు అంకితమిస్తున్నట్లు తెలిపారు.

**చతుర్దాశా పాదక గురుపూజోత్సవం**

స్వంత కాలేజిలో పదవీ విరమణ తర్వాత శాస్త్రిగారు ఇంటి వద్దే విద్యా బోధనా చేయటం ప్రారంభించారు. 1982లో ఆరోగ్యం దెబ్బ తిన్నది. అప్పటికి రిటైర్ అయి పదేళ్ళు అయినా పెన్షన్ శాంక్షన్ కాలేదు. కావ్యం ముద్రణ జరగలేదు. ఈ రెండూ మనోవ్యధకు గురి చేశాయి. ఈ పరిస్థితి గమనించిన యాభై ఏళ్ళుగా శాస్త్రిగారి వద్ద విద్య నేర్చిన శిష్యబృందం అందరూ కలిసి ఒకసారి కలుసుకోవాలి అని భావించి, శాస్త్రిగారికి ఆ సందర్భంగా సన్మానం చేయాలని నిర్ణయించారు. దీనికి విద్యా చతుర్దశా పాదక గురు పూజోత్సవ సన్మానం అని పేరు పెట్టి 10-8-1986 ఆదివారం రేపల్లె సంస్కృత కాలేజీలో జగన్మోహనంగా నిర్వహించారు. రుద్రాభిషేకంతో ప్రారంభించారు. మధ్యాహ్నం రెండు గంటలకు శిష్యులతో శ్రీ శాస్త్రిగారి వాత్సల్య గోష్టి నిర్వహించారు. సాయంత్రం అయిదుగంటలకు వేద పండితులచే శాస్త్రిగారికి మహదాశీర్వచనం చేయించారు.

మంగళ వాద్యాలతో శాస్త్రిగారి దంపతులను స్వగృహం నుండి ఊరేగింపుగా కాలేజికి సగౌరవంగా తోడ్కొని వెళ్ళారు. రిటైర్డ్ హై కోర్ట్ న్యాయమూర్తి శ్రీ గొల్లపూడి వెంకటరామ శాస్త్రి గారు అధ్యక్షత వహించిన సభలో శాస్త్రిగారి వైదుష్యాన్ని వక్తలు బహువిధాల ప్రస్తుతించారు. బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి గారు శాస్త్రిగారి దంపతులకు శుభాశీస్సులు పలికి "విద్యా చతుర్దశా పాదుక" అనే ఇదివరకెన్నడూ ఎవరికీ ఇవ్వని కొత్త బిరుదును అందజేసి సత్కరించారు. శాసన సభ్యులు శ్రీ యడ్ల వెంకట్రావు శాస్త్రిగారి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాల విశ్రాంత ప్రాచార్యులు బ్రహ్మశ్రీ భాగవతుల కుటుంబరావుగారు పుత్రసంజీవనం కావ్యాన్ని ఆవిష్కరించారు. శిష్య బృందం శాస్త్రిగారిపై ప్రశంసా పద్య కుసుమాలు సమర్పించారు.

తర్క వేదాంత సామ్రాట్, దర్శనాచార్య బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి, అభినవ సరస్వతీ కంఠాభరణ, ఉపన్యాస కంఠీరవ శ్రీ ప్రభాకర శ్రీ కృష్ణ భగవాన్ గార్లు శాస్త్రిగారి సంస్కృత సాహిత్య వ్యాప్తిని బహుధా ప్రసంశించారు. శిష్య ప్రశస్తి అనే కార్యక్రమంలో శిష్యులు అభిమానులు పెద్దలు శాస్త్రిగారి దంపతులకు నూతన వస్త్రాలు సమర్పించారు.

నారాయణశాస్త్రిగారు శ్రీ ప్రమోద నామ సంవత్సర వైశాఖ బహుళ త్రయోదశినాడు 22-5-1990న 72 ఏళ్ళ సార్ధక జీవనం చేసి శ్రీకృష్ణ గోలోకం చేరుకున్నారు.

**ముళ్ళపూడి నారాయణశాస్త్రి గారి పుత్ర సంజీవనం కావ్య విశేషాలు**

శ్రీకృష్ణునికి కావ్యాన్ని అంకితమిస్తూ శాస్త్రిగారు-

స్వస్రీయ-పుత్ర- దౌహిత్రైః వియోక్తోహం యదేనసా- సమూల మేనస్తద్ధగ్ధుం- క్రుతిః

కృష్ణాయ దీయతే అని శోక శ్లోకం చెప్పారు. శ్రీ కృష్ణుని పాదాబ్జాలను నమ్ముకొని భవ భ్రాంతి రహితంగా ఉంటానని రెండవ శ్లోకం చెప్పారు.-

శ్రీ భాగవతుల కుటుంబరావు గారు కావ్యాన్ని చక్కగా విశ్లేషించారు. అందులోని

విషయాలను మీకు తెలియజేస్తున్నాను.

నతి ర్భూయాస్తే స్తు శిఖర సంభావ్య మహిమన్– రతిస్వచ్ఛారిత్రే భవతు మధునో ప్యాహితరవే
క్రుతిర్మే ప్రుత్పద్మే తవ వసతు లక్ష్మీ సహచరీ– మతిస్త్వ త్పాదాబ్జే విహరతు భవ భ్రాంతి రహితా

కాళిదాసు కుమార సంభవం లోక సహజం అయితే శాస్త్రిగారి పుత్ర సంజీవనం అతిలోక అభినందనీయం. వ్యాస భాగవతంలోని 32 శ్లోకాలు దీనికి ఆధారం. దీన్ని 426 వృత్త శ్లోకాలుగా పెంచి రాశారు. మూలంలో కథ మహా వేగంగా సాగితే శాస్త్రిగారు కళ్ళాలు బిగపట్టి దారిలోని దృశ్యాలను చూపించారు. సముద్ర వర్ణన సముద్ర యాత్ర స్నానం సముద్రుడు బలరామకృష్ణులకు చేసిన పూజ, యమ మందిర వర్ణన చూపించారు. బలరామ కృషుకనలకు గురువు సాందీపని మహర్షి ఇచ్చిన ఉపదేశాన్ని వివరంగా రాశారు. ఇది చదివితే మన ప్రాచీన విద్యా వైభవం ఏమిటో తెలుస్తుంది. ఆయన నేర్పిన విద్య పరాపరాలకు సంబంధించింది. సమన్వయ విద్య. భాగవతంలోని కృష్ణలీలలను సంగ్రహంగా చెప్పారు. శ్రీకృష్ణ లీలలను అరవై మూడు శ్లోకాలలో వర్ణించారు. పుత్ర సంజీవనం మానవ సాధ్యమైన విషయం కాదు అతి మానుషం కనుక కృష్ణ మహిమలను అంతగా చెప్పాల్సి వచ్చింది. గురుపత్ని శ్రీ కృష్ణ బాల్య క్రీడలని గుర్తు చేసుకొని తన మాతృ వాత్సల్యాన్ని ప్రకటించింది. దీనివలన వారి పుత్రశోకం కొంత మేరకు తగ్గింది. కావ్యంలో సముద్రుని ప్రసక్తి రెండుసార్లు వస్తుంది. అందుకే బలరామకృష్ణులను చూసిన సముద్రుడు తనకు ఆ అవతారాలకు గల సంబంధం గుర్తుకు వచ్చింది. సోదరులిద్దరు కనపడగానే అయాచితంగా భక్తితో సముద్రుడు నమస్కరిస్తాడు. ఇది లోక సహజం. వారొచ్చిన పని అడిగి తెలుసుకొన్నాడు.

భాగవత కథలో యమలోక వర్ణనం లేదు. శాస్త్రిగారు అతిలోక సహజంగా వర్ణించి యముడు బ్రహ్మ విద్యాచార్యుడని గుర్తు చేశారు. యముడు చేత షోడషోపచార పూజలు చేయించారు. సాందీపుడు కాశిలో జన్మించటం చేత శాస్త్రిగారు కాశీ, అవంతిపుర (ఉజ్జయిని) వర్ణనలను తృప్తిగా చేశారు. సాందీపుని

ఆశ్రమం, శిష్యుల ప్రవృత్తి, ఆశ్రమ గురువులపై పుర జనులకుండే గౌరవం శిష్యుల భక్తి మొదలైనవి రమ్యంగా వర్ణించారు. మూలంలో కొద్ది శ్లోకాల్లో ఉన్న కుచేలోపాఖ్యానాన్ని పెంచి రాశారు. కనుక శాస్త్రిగారి కల్పనలన్నీ ఔచితీ యుతాలే అయ్యాయి.

అస్తుత్త రస్యాం దిశి దేవతాత్మా అనే కాళిదాసు శ్లోక మొదటిపాదాన్ని తీసుకొని కాశీతి విశ్వేశ్వర రాజధానీ అని కాశిని శ్రీ విశ్వేశ్వర రాజధాని అన్నారు. ప్రబంధ లక్షణం అయిన పురవర్ణన చేశారు. సాందీపుని వర్ణన పరమ రమణీయం. కృష్ణుడు యముడికి ఉపనిషద్విజ్ఞానం బోధించటం గొప్ప విషయం. ఉల్లేఖ, పరికర, కావ్య లింగాలంకారాలతో కావ్యానికి శోభ తెచ్చారు. అర్థాంత రన్యాస వినియోగంలో భర్తృహరి గుర్తుకొస్తాడు. సీందీపని ఉదాత్తత గంభీరం.

**శాస్త్రిగారి కవితా గీర్వాణం**

**పుత్రశోకం**

కుమారుడు సముద్రంలో మునిగి చనిపోయాడని తెలుసుకొన్న సాందీపని దంపతుల శోకం వర్ణనాతీతం– అథ మోహ వశం ఉభౌ– వివిధోపాయ విబోధతే సుతం–

అవధార్య నిమగ్న మర్ణ వే– పతితౌ తావపి శోక సాగరే సముద్రంలో మునిగి చనిపోయాడని తెలుసుకొన్న మూర్ఛపోయిన దంపతులు మళ్ళీ శోక సముద్రంలో మునిగిపోయారు. కొడుకు ఇల్లంతా తిరుగాడే దృశ్యం జ్ఞాపకానికి వచ్చి వారికి ఇల్లంతా అగ్ని ఆవహించినట్లనిపిస్తోంది. శాస్త్రిగారు కుమారుని పోగొట్టుకొన్న దుఖం కూడా ఇలాగే ఉంది. అందుకే ఈ కావ్యం రాసి ఊరడింపు చెందారు.

"తనయా మనయామి మానవీయే– ననుతే యుక్తమభాషణం మయీత్థం– వితరామృత వాహినీం గిరం– పితరావద్య విచేత నానభూవ"

కొడుకా! మాతో మాట్లాడు. చైతన్యం లేని మాకు నీ మాటలు అమృతపు సోనలౌతాయి అని దుఃఖపడ్డారు. ఈ దుఃఖం గురువుకు శాస్త్రిగారికీ సమానమే. అందుకే అంత గొప్పగా చెప్పగలిగారు. వ్యాసభగవానుడు ప్రత్యక్షమై శివుడు అనే

పేరు గల నీ కొడకును శివునిగా మనసులో భావించు. ఆ పరమాత్మ మీ ధ్యానానికి కనికరిస్తాడు అని ఓదార్చాడు.

## ఆశ్రమ వాసం

బలరామకృష్ణులు సాందీపని మహర్షి ఆశ్రమానికి చదువుకోవటానికి వచ్చారు. తమను తాము పరిచయం చేసుకొన్నారు. "నమోస్తు వాగంబుధి సాగరాయ నమోస్తు విజ్ఞాన సమృద్ధి దయా- నమోస్తు విద్యార్థి ద్యాప్లుతాయ- నమోస్తు సాందీపని సద్భుధాయ అని కీర్తించారు. అక్కడి మునిబాలకుల నిత్య కృత్యాన్ని తెలుసుకొన్నారు.

ఇతర శిష్యులు లాగే అడివికి వెళ్ళి దర్భలు, సమిధలు ఏరుకొస్తున్నారు కుచేలుడు, సోదరులు. ఒకరోజు అకస్మాత్తుగా ఆకాశం మేఘా వృతమైంది. "ధారా దరైరావ్రుత మంతరిక్షం- గర్జద్భిరుచ్చై స్చపలా విలాసైః తమస్సహాయై రపపాత్ర. భావం- వర్భద్భి రాశా పరిపూర్ణ రూపై- తాత్కాలిక సౌభాగ్యానికి గర్వించి గర్జిస్తూ తామసంతో యోగ్యభూమి అని తెలియకుండా వ్యర్ధ దానానికి పూనుకొని మేఘాలు ఆకాశం కమ్మాయి. చక్కని భావంతో రాసిన శ్లోకం. తలల మీద దర్భల మోపులు, పాదాల నిండా ముళ్ళు, దారి కనపడక నడుస్తుంటే మెరుపులే దారి చూపిస్తున్నాయట. శిష్యుల రాకపోవటంతో కలత చెంది, ముని వారిని వెదకటానికి వెళ్ళాడు. వారు కనిపించగా పరమానందం కలిగి ఒక కథ జ్ఞాపకం చేసుకొన్నాడు. పూర్వం ఉపమన్యుడు అనే శిష్యుడు గురువు భిక్షాటనం చేయవద్దని నిషేదిస్తే జిల్లేడాకులు తిని గుడ్డివాడై, దారి తెలియక ఒక పాడుబడిన బావిలో ఏడి గురు దయకు పాత్రుడయ్యాడు. వీళ్ళను చూస్తే ఆ కథ జ్ఞాపకం వచ్చిందట ఆయనకు. అంత దయాళువు సాందీపనిముని.

## సమస్త శాస్త్ర బోధనం

గురుబోధ ఎలా ఉందో చూద్దాం- విశ్వరూప మభవద్యదాత్మనో- వాఙ్మయం ప్రణవతస్తదా ఖిలం- స ప్రతీక మమలస్య చాత్మనః- స ప్రసూతి

రాఖిలాగమాధ్వనః అని ఓంకార రహస్యం చెప్పాడు. ముని పరమాత్మ నుంచి ప్రపంచం ఏర్పడినట్లు, ఓంకారం నుండి సకల వాజ్మయం ఆవిర్భవించింది. ఇదే సగుణ, నిర్గుణ బ్రహ్మాన్ని చేరటానికి ఆలంబనం. వేదమార్గానికి మూలం. చిన్న చిన్న మాటలతో గొప్ప అర్ధాన్ని పొదిగారు శాస్త్రిగారు. అలాగే నాలుగు వేదాల ఆవిర్భావం, శిక్షా వ్యాకరణ ఛందస్సులు నిరుక్త జ్యోతిష కల్పాల గురించి బోధించాడు. పురాణ దర్శన యోగ, సాంఖ్యాల వివరాలు ఎరుక పరచాడు. మీమాంసా దర్శన కామ గాంధర్వ, ధనుర్వేత అర్ధశాస్త్రాలను బోధించాడు. ఉదకవాద్యం గురించి, ఉదకాఘాతం గూర్చి పూలమాలలను గుచ్చటం, వంటకళ మొదలైన సమస్త కళలు వారికి నేర్పాడు. సూత్ర క్రీడా అనే తమాషా ఆటను నేర్పాడు. నాళికా రచిత సూత్రా మంతరాః– చేద విధి మాచర న్నపి– నిర్వికార ముప దర్శయే ద్యది– క్రీయనాయ విహితా కళా హ్యసౌ గొట్టం మధ్యలోంచి దారాన్ని పోనిచ్చి, ఆ గొట్టాన్ని మధ్యలో తెంచినా కాల్చినా దారం చివరదాకా వచ్చే ఆటను సూత్ర క్రీడా అంటారట. అది నేర్పాడు మహర్షి. పొడుపు కథలు అంటే ప్రహేళికలను నేర్పారు. నోటికొచ్చిన పద్యాలను పరీక్షించుకొనే ప్రతిమలా కళను చెప్పాడు. అంటే మన అంత్యాక్షరి అన్నమాట. శబ్దం అర్థం కష్టతరంగా ఉండి ధారణ చేయటానికి అలవికాని పద్యాలను రాసే దుర్వాచక యోగ కళ బోధించాడు. సమస్యా పూరణం, నాటకం నేర్పాడు. దాతు వాదం, వాస్తు విద్య, వృక్షాయుర్వేదం, శుక శారికా ప్రలాపం, మేష కుక్కుట లావక యుద్ధ విధి అంటే గొర్రెలు, కోళ్ళు, పక్షులకు సంతోషం కలిగించే ద్యూత విద్య, అంటే మహర్షి నేర్పని విద్య లేనేలేదు. అది సాందీపమహర్షి విద్యా విధానం. ఆయన దగ్గర చదివితే విద్యార్థి పరిపూర్ణుడు అవుతాడు. లోకజ్ఞానం అధ్యాత్మజ్ఞానం, అన్నీ అబ్బి సర్వ సమర్ధుడవుతాడు. శాస్త్రిగారికున్న జ్ఞానం అపారం అని మనకు దీనివలన అర్ధమవుతుంది.

**శ్రీకృష్ణ లీలలు**

ముని పత్ని శ్రీకృష్ణ లీలలు జ్ఞప్తికి తెచ్చుకొని చనిపోయిన తన కుమారుని బాల్య చేష్టలను నెమరు వేసుకొన్నది "కృష్ణేన ద్రుష్ట విష పన్నాగభోగ పాశా–

కృష్టేన సా్రశు నయనేః నిజ బంధు వర్గైః- ద్రుష్టేన ఫాద విధి ఘట్టన భగ్న భుగ్న- భ్రస్టాసృగాతత ఫణాసుకిమప్య వర్తి" అంటూ క్లిష్టపదాలతో సమర్థంగా శ్లోక రచన అతి సునాయసంగా చేశారు. కృష్ణుడు కాళీయుని పడగలపై అద్భుతంగా నృత్యం చేశాడని భావం. గోపికా వస్త్రాపహరణాన్ని, గోవార్ధనోద్ధరణాన్ని గుర్తు చేసుకొని రాసలీలా విలాసాన్ని కాంతా యుగాంతర గత ప్రి క్రిష్ణి కాసు- కృష్ణ ద్వయాంతర గత ప్రమదావృతాసు- ద్రుక్వాత శాసిత పరస్పర యష్టి పాత- పాద క్రమాసు విహ్రుతం కిల మదలీషు అనేక రూపాలతో కృష్ణుడు గోపికలతో రాసక్రీడలు చేవాడు. చాణూర, కంస వదలను స్మరించి కృష్ణుని అవక్రపరాక్రమాలను వెల్లడించింది.

## గురు పుత్రుని వెదకటం

గురు పుత్రుని తీసుకు రావటానికి సోదరులు బయల్దేరి సముద్రం దగ్గరకొస్తే సముద్రుడు విష్ణు అవతారాలను గుర్తు తెచ్చుకొన్నాడు- బలే రుపా హృత్య బలారయే శ్రియం- నినీషు రేష స్పుట ఖర్వా వేషయుక్- నఖాగ్ర నిర్నే జన మాత్ర పాధసో- గాభీరతా గర్వ మపాహర నమ్మ బలి నుంచి సంపదలు హరించి దేవేంద్రునికి ఇవ్వాలనుకొని వామనావతారం దాల్చి విష్ణువు త్రివిక్రముడై, నాలోని నీళ్ళను తన చేతి గోళ్ళను కడగటానికి మాత్రమే సరిపోయేట్లు చేసి, నా గాంభీర్యాన్ని పోగొట్టాడు అని సముద్రుడన్నాడు. తాను వచ్చిన పని కృష్ణుడు చెప్పి సముద్ర తరంగాల చేత భక్షింపబడిన గురు పుత్రుని తెచ్చిమ్మని ఆదేశించాడు. భయపడ్డ సముద్రుడు తనలో దాగివున్న పంచ జనుడు అనే రాక్షసుడు భక్షించాడని చెప్పాడు. సముద్ర జలాన్ని కల్లోలపరిస్తే ఆ రాక్షసుడు బయటపడితే వాడితో యుద్ధం చేసి చంపేశాడు. వాడి శరీరం లోపల గురుపుత్రుడు కనిపించలేదు. కాని పాంచజన్యం అనే శంఖం మాత్రం లభించింది. యమ, నిరుతులవైపు సాగిపోయారు ఆకాశమార్గాన రథంలో బలరామకృష్ణులు.

భూమికి 86 వేల ఆమడల దూరంలో సంయమనీ నగరానికి వెళ్ళి యముని చూశారు. మహర్షులతో యముడు వైదిక ఉపాసనా ఫలితం మోక్షమా, వేరేదైనా

అని గోష్ఠి నిర్వహిస్తున్నాడు. ఆత్మ నిత్యానిత్యాలపై చర్చిస్తున్నాడు. ఇంతలో శ్రీకృష్ణ శంఖ ధ్వని విని భయకంపితుడై, స్వాగతం చెప్పి స్తోత్రాలు చేవాడు–

"జయ ప్రభో జామ్ఙహి జంతు సంతతే– ప్రతార యంతీ మసతీం యదా గుణైః– న శక్తి రేతాం వినిహంతుమంతరా– భావత్ప్రసాదాదితి వేదనిర్ణయం– ప్రభూ జయం". ప్రాణాలను మోసగించే మాయను చంపు. నీ అనుగ్రహం లేకపోతే మేము దాన్ని చంపలేము అన్నాడు. తవ స్వరూపం "నిగమాంత చుంబి తం– హరుడా పరిశ్వక్తుముదార దర్మనా– ఉపాసతే త్వా ముదరే హృనాహతే– సహస్ర పత్రే నిగృహీత మానసాః"– వేదాంత వేద్యమైన నీ రూపం మనసులో నింపుకొని సత్పురుషులు మణిపూరక అనాహతాలలో సహస్రారంలో ఉపాసన చేస్తున్నారు.

ఈ సుత్తిని విని సూటిగా మా గురుపుత్రుని అపహరించావు వెంటనే ప్రాణాలతో అతన్ని ఇచ్చెసెయ్యి అన్నాడు. వెంటనే గురు పుత్రుడైన శివ బాలుడిని తెప్పించి కృష్ణునికి అప్పగించేశాడు యముడు.

"యమార్పితం ప్రాణ భ్రుతే ద పశ్యతాం– తపస్వినాం దేహ మకల్పయ ద్విభుః– చరాచరా కార సుక్ల ప్రనావిదః– కిమస్య మాయా మనుజస్య దుశ్శకం". యముడిచ్చిన ఆ జీవుడికి పూర్వం ఉన్న భౌతిక దేహాన్ని వచ్చేట్లు చేవాడు వాసుదేవుడు. సమస్త సృష్టి రూపకర్తకు అసాధ్యం ఉంటుందా? సముద్రంలో మునిగితే యమలోకానికి ఎలా వచ్చానని కుర్రాడు అడిగితే జరిగింది చెప్పాడు. శివ బాలుడు అడిగిన యోగి, మాయ మొదలైన వాటిని అర్ధమయేట్లు చెప్పాడు.

**గురుదక్షిణగా పుత్ర సంజీవనం**

భూమిమీదకు వచ్చి గురు ఆశ్రమం చేరారు. గురువుకు పుత్రుని "సమర్ప మాయస సుతం స దక్షిణా– మివ క్రతో స్సద్గురవే స దక్షిణః" క్రతువు చివర మంచి దక్షిణతో ఇచ్చినట్లు గురువుకు సమర్పించాడు. శిష్యుడైన కృష్ణుని గురువు సాందీప ముని భో రామ కృష్ణ జగతీతల భాగ్య రాశీ– విద్యా విడంబన మయం మామ పుణ్య పాకః– యుష్మద్దయా రస విలాస భావవ్విప శ్రీ– కృష్ణ ప్రసాద ఇతి

సంవ్యవహార మేతు– నీకు నేనేదో విద్య నేర్పటం నా పూర్వజన్య పుణ్యఫలం. నీ దయవలన మళ్ళీ జన్మించిన శివుడనే ఈ పిల్లాడిని ఈ రోజు నుండి కృష్ణ ప్రసాదు అనే పేరుతో పిలుచుకొంటూ నా కృతజ్ఞతను తెలుపుకొంటాను అన్నాడు. శాస్త్రి గారికి కూడా ఈ కావ్యం రాసిన తర్వాత పుట్టిన కుమారుడికి కృష్ణప్రసాద్ పేరే పెట్టారని ముందే చెప్పుకొన్నాం. ఈ కావ్యానికి వారి జీవితానికి ఉన్న అవినాభావ సంబంధం మహోత్కృష్టం.

కావ్యంలో కరుణ రసానికి అధిక ప్రాధాన్యమిచ్చారు. వీర, అద్భుత రసాలు అంగాలుగా అమరాయి. కావ్యనాయకుడు శ్రీకృష్ణునిలో శాంత రసం కనిపిస్తుంది. భక్తి రసం పొంగింది కూడా. శిష్యులకు గురుభక్తి శుశ్రూష ఉండాలి. ఆసుర శక్తిని దైవ శక్తి జయిస్తుంది అనే సందేశం. కావ్యం చివర గురు దంపతులకు శ్రీకృష్ణుడు తన గోలోకాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించాడు.

"కృష్ణో గురూక్త మనుమాన్య తదేతి సర్వం– సర్వోపరిస్తి త మశాంత దియా మగమ్యం
రమ్యం ప్రశాంత ముపదర్మ యతి స్మదివ్యం– గోలోక మేక మనయోర్న యనోత్సవాయ"

గురువు కోరికపై కృష్ణభగవానుడు దివ్యమైన గోలోకాన్ని దర్శింపజేశాడు. మనసు ప్రశాంతమైనది. కన్నుల పండువగా దర్శించి పులకించారు.

"గోలోకాలోక నేన ప్రముదిత వదనశ్రీ– గురుభ్యాం గురుభ్యాం
ఆశీరర్భిః ప్రేష్య మాణౌ కృత నినదై రుజ్జయిన్యాం జనోఘైః
తుస్టౌ శ్రీరామ కృష్ణావ ను కలముదయత్పుత్ర విశ్లేష బాష్ప– స్థానా దేశం స్వ పిత్రో స్సపది విదధతుః లోచ నానాం ప్రహర్షం"

గోలోక సందర్శనం చేత సంతసించిన గురుదేవుల ఆశీస్సులు పొంది, ఉజ్జయిని జనులంతా జయ ధ్వానాలతో వీడ్కోలు పలుకగా, తమ తలిదండ్రుల పుత్ర వియోగ దుఖాన్ని పోగొట్టి సంతోషం కలిగిస్తూ బలరామకృష్ణులు ఇంటికి బయల్దేరి వెళ్ళారు అని కథను సమాప్తం చేశారు. ఈ చివరి అధ్యాయాన్ని విజయ విలాససర్గ అన్నారు. అయిదవదాన్ని లీలా విలాస సర్గ అని నాలుగవదాన్ని

కళా విలాస సర్గ అని మూడవదానిని శుశ్రౌష విలాస సర్గ అని రెండవదాన్ని విధి విలాస సర్గ అని మొదటి దానిని ఉదయ విలాస సర్గ అని సార్థకంగా పేర్లు పెట్టారు. కావ్యంలో శాస్త్రిగారి భాషా, శాస్త్ర పాండిత్యం, అలంకార వైదుష్యం, శాస్త్ర యోగ వేద వేద వేదాంగ రహస్య జ్ఞానం, లోక వృత్తి ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. శ్లోకాలు పరమ మనోహరంగా తీర్చిదిద్దారు. వారి అపూర్వ ప్రజ్ఞకు అంజలి. శాస్త్రిగారి కుమారులు శ్రీ జయ సీతారామ శాస్త్రిగారు కూడా గొప్ప సంస్కృత విద్వాంసులు. నైషదంపై నైషధీయ పరామర్శ అనే సంస్కృత వ్యాఖ్యానం రాసి తండ్రికి తగ్గ తనయుడు అనిపించుకొన్నారు.

పుష్పగిరి పీఠాధిపతులు శ్రీ విద్యా నృసింహ భారతీ స్వామివారు ఆశీస్సులందజేస్తే ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి అవధాన శిరోమణి, విద్యా వారధి, మహా మహక్షపాధ్యాయ శ్రీ కాశీ కృష్ణా చార్యులవారు–

"అక్షీణై ర్గురుశిక్షణై శ్శుభకరై ర్వాణీకటాక్షోత్కరై– ర్వైదుష్యం, యదనుత్తమం, సుకవితా పుష్టం, త్వయా సాదితం
తస్యాన్యంత పవిత్రతా చతురతా గంభీరతా భూ,రహో– శ్రీ నారాయణ శాస్త్రి వర్య సుకవే తేపుత్ర సంజీవనం" అని కవినీ, కవిత్వాన్ని, శేముషినీ మెచ్చి ఆశీర్వదించారు. కావ్యానికి పుత్ర సంజీవనం అనే పేరు అన్నిరకాలా సమర్థనీయంగా ఔచిత్యవంతంగా ఉంది. ❁

## 384. శ్రీ దీవి శ్రీనివాసాచార్య (1920)

**ఉ**పన్యాస చక్రవర్తి శ్రీ శ్రీనివాసాచార్య రాచూరులో పుట్టారు. 'ప్రకృతి విజయం' అనే చమత్కార నాటక రచన సంస్కృతంలో చేశారు. శ్రీమన్నారాయణః రాశారు. ❁



## 385. రామాయణ సారోద్ధరణం చేసిన శ్రీ ములుకుట్ల నరసింహావధాని (1920)

**పు**రాణ ప్రవచనం చేసి, పౌరాణిక విశారద బిరుదు పొంది, సమస్త రామాయణ సారాన్ని ఒక చోట చేర్చి రామాయణ సారోద్ధారం రచించి, రామాయణ సుధా సాగర బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహ శాస్త్రి గారు గుంటూరు మండలం సత్తెనపల్లి తాలూకా నుదురుపాడు గ్రామంలో నందననామ సంవత్సర శ్రావణ శుక్ల నవమీ జయ వాసరం, అనూరాధా నక్షత్ర యుక్త తులా లగ్నంలో శ్రీ ములుకుట్ల శంకర నారాయణావధాని, శ్రీమతి వెంకట సుబ్బమ్మ దంపతులకు జన్మించారు. ఐదో ఏడు వచ్చాక స్వగ్రామం లోనే అక్షరాభ్యాసం జరిగి, తర్వాత మేనమామ ఇంట చేబ్రోలులో ఆంధ్ర, ఆంగ్ల భాషలను కొన్నేళ్ళు చదివారు.

ఉపనయనానంతరం కృష్ణాజిల్లా బెజవాడలో శ్రీ గంటి వెంకటేశ్వరావధాని గారి శిష్యులై వేదాధ్యయనం చేశారు. తర్వాత కన్నడ దేశంలోని బెంగుళూరు చేరి శంకర మఠంలో కావ్య నాటక జ్యోతిష్యాదులు నేర్చారు. విజయవాడ వచ్చి వ్యాఖ్యాన వాచస్పతి బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ విద్వత్ చయనులు వద్ద అంతేవాసులై వేదాంత భాష్యం అభ్యసించారు. తమిళనాడులోని కుంభ కోణంలో వేద పరీక్షనిచ్చి 16-5-1918న ఉత్తీర్ణులై స్వర్ణ పతకం పొందారు. శ్రీమతి సీతారామాంబను

వివాహమాడారు. 1927లో చీరాలలో శ్రీ మదాంధ్ర మహాభారత పురాణ కాలక్షేపం చేసి, శ్రోతల ప్రశంసలు పొంది స్వర్ణ సింహ లలాట, కంకణద్వయాన్ని కానుకగా అందుకొన్నారు. తమిళనాడులోని తిరుచిరాపల్లి మండలంలో ఉన్న కరూరులో తాము శ్రమతో సంతరించిన 'రామాయణ సారోద్ధారం' ప్రవచనం చేసి పండిత పామరజన రంజనం చేశారు. అమూల్య బహుమతులతో పాటు సింహ లలాటాంకిత సువర్ణ ఘంటా కంకణ ద్వయాన్ని అందుకొన్నారు.

24-7-1931 నుండి 19-9-33 వరకు రెండేళ్ళు బెజవాడ రామ మోహన పుస్తక భాండారంలోను, శ్రీ కాశీ విశ్వేశ్వరాలయం, శ్రీ కోదండ రామాలయం, శ్రీకన్యకాపరమేశ్వరి, కొత్త గుళ్ళులోను రామాయణ సారోద్ధార ప్రసంగాలు సభా రంజకంగా చేశారు. అప్పుడు వచ్చిన గోదావరీ పుష్కరాలలో భద్రాచలంలో శ్రీ సీతా రామచంద్ర స్వాముల సన్నిధానంలో రామాయణ సారోద్ధారం బాలకాండ పురాణ ప్రవచనం చేసి భక్తి భావ లహరి ప్రవహింప జేశారు. వైష్ణవ పండితుల అభినందన పురస్కారాలను అందుకొన్నారు.

అవధానిగారి పెద్దన్నగారు, సనాతన భాగవత భక్త సమాజ కార్యదర్శి శ్రీ లక్ష్మీ నారాయణ శాస్త్రి గారు సుప్రసిద్ధ కవి పండితులు బ్రహ్మశ్రీ బెల్లం కొండ రామ రాయ కవి గారి శిష్యులై వ్యాకరణ, వేదాతాలను అభ్యసించారు. తమ్ముడు శ్రీ గోపాలకృష్ణ శాస్త్రి ఉభయ భాషా ప్రావీణ. చీరాల పురపాలకోన్నత పాఠశాలలో తెలుగు పండితులు. వీరి సోదరి రామ సుబ్బాంబ.

అవధానిగారు బహు శ్రమకోర్చి అనేక రామాయణ గాధలను కూలంకషంగా పరిశీలించి సంస్కృతంలో ఉత్తరకాండతో సహా రామాయణ సారోద్ధారం అనే బృహత్ ప్రబంధాన్నిసరళ సంస్కృతంలో రచించారు. ముఖ్యంగా వాల్మీకి రామాయణాన్ని భూమికగా తీసుకొని శతకోటి రామాయణం దగ్గర్నుంచి ఏక శ్లోకీ రామాయణం వరకు దేనినీ వదలకుండా వాటిలోని సారాన్ని అమృతోపమానంగా అందించారు. కుశలవ రామాయణం, ఆధ్యాత్మ రామాయణం, యోగ వాసిష్టం, దుర్వాస రామాయణం, మార్కండేయ రామాయణం, తత్వసంగ్రహ రామాయణం, హనుమద్రామాయణం, నారద రామాయణం, ఆనంద రామాయణం,

అద్భుత రామాయణం, అగస్త్య రామాయణం, తార సార రామాయణం, బోధాయన రామాయణం, బ్రహ్మ రామాయణం, భారద్వాజ రామాయణం, శివ రామాయణం, యాజ్ఞ్య వల్క్య రామాయణం, విశ్వామిత్ర రామాయణం, బృహద్రామాయణం, శ్వేత కేతు రామాయణం, సుతీక్ష్ణ రామాయణం, పులస్త్య రామాయణం, జైమిని రామాయణం, దేవీ రామాయణం అనే 24 రామాయణాలను విపులంగా శోధించి వాటి సారాన్ని మధుర మనోజ్ఞ సంస్కృత శ్లోకాలలో నిక్షిప్తం చేసి మనకు అందించిన పుణ్యాత్ములు శ్రీ నరసింహావధాని గారు. అలాగే అష్టాదశ పురాణాలలో ఉన్న రామ కథను రామాయణ రత్నాకరం, ఉమా సంహిత, అగస్త్య సంహిత, పంచ రాత్రాగమ స్థిత పద్మ సంహిత, పరాశర సంహిత, శ్రీ రామ పూర్వోత్తర పితానుపనిషత్, తార సారోపనిషత్, రామ చంద్ర కథామృతం, రసాన్న రత్నావళి, రామాయణ సార సంగ్రహం, కాల విధానం, కాల నిర్ణయ మహోదధి, మనవాది స్మృతులు, మధ్వన్యక్కారం, శివ తత్వ వివేకం, పురాణ తామసత్వ నిరాకరణం, ధర్మా కూతం, కాల ప్రకాశిక, హోరానుభవ దర్పణం, సూర్య సిద్ధాంతం, ఆర్య భటం, శ్రీ మహా భారతం, శ్రీ శంకర భాష్యం, ఆపస్తంభ బోధాయన సూత్రం మొదలైన వాటిలోని ప్రమాణ వాక్యాలను గ్రహించి సంతరించారు. ఇవికాక అగ్ని వేష రామాయణం, విచిత్ర రామాయణం మొదలైనవాటినీ మధించారు. ఇంతటి గొప్ప పరిశోధన చేసి ఆస్తిక జన హృదయోల్లాసంగా రామాయణ సార సంగ్రహోద్ధారం రచించారు. వారికి జాతి ఏమిచ్చి ఋణం తీర్చు కోగలదు?

అయోధ్య కాండలో సుమారు 80 పేజీలలో పండిత, మహాపండిత అభిప్రాయాలన్నిటినీ క్రోడీకరించి ప్రచురించటం చాలా విశిష్టంగా ఉంది. గ్రంథ గౌరవాన్ని మరింత ఇనుమడింప జేసింది. అవధాని గారిని మనస్పూర్తిగా అభినందించిన మహానుభావులలో మహా మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగ లింగ శాస్త్రి, రాజా విక్రమ దేవ వర్మ, వావికొలను సుబ్బారావు, శ్రీ పంచాగ్నుల ఆది నారాయణ శాస్త్రి, రాజా మంత్రి ప్రగడ భుజంగ రావు, శ్రీ ఆది భట్ల నారాయణ దాసు, శ్రీ వడ్డాది సుబ్బారాయుడు, శ్రీ రాణీ వెంకట నృసింహ చయనులు, వ్యాఖ్యాన వాచస్పతి శ్రీ మల్లాది రామకృష్ణ విద్వత్ చయనులు, న్యాయవాది శ్రీ పెద్ది భొట్ల

వీరయ్య, శ్రీ మరుధూరి తాతాచార్యులు, తర్క వేదాంత విశారద శ్రీ ముదిగొండ వెంకట రామ శాస్త్రులు, ఆమ్నాయ తర్క వేదాంత పండిత శ్రీ శ్రీపాద లక్ష్మీ నృసింహ శాస్త్రి వంటి ఉద్దండులున్నారు. వీరిలో ఎక్కువ మంది స్వచ్ఛమైన గీర్వాణ భాషలోనే అభినందనలు రాసి పంపారు.

శాస్త్రిగారు ఆనాటి దేశాలను వాటికీ సంబంధించిన ఈనాటి పేర్లతో వివరించి తెలియ జెప్పటం గొప్పగా ఉంది. ఉదాహరణకు కోసల దేశం అంటే – ఉత్తర, దక్షిణ కోసలాలు. ఉత్తర కోసలంలో ముఖ్యపట్టణం అయోధ్య దీన్నే ఓద్ అంటారు. దక్షిణ కోసలలో గుజరాత్‌లోని కుశస్థలి రాజధాని. అది గంగానది దక్షిణ తీరంలోని నాగపూర్‌లో ఉంది. కౌసల్య తండ్రి భాను మంతుడు ఉత్తర కోసల రాజు. అదే ఇప్పుడు గౌడ దేశమైంది. దీని రాజధాని శ్రావస్తి. భారత కాలంలో గంగకు దక్షిణంలో ఉన్న దక్షిణ కోసల ఇప్పుడు ఉత్తర కోసల అయిందని వివరించారు. మగధ దేశం మాగధ అని పిలువబడింది. ప్రస్తుతం ఇది దక్షిణ బేరార్‌లో ఉంది. దీనికి పడమర శోధా నది ఉంది. రాజగిరి ముఖ్య పట్టణం. ఇప్పుడు మధ్య పరగణాలు అనే మధ్యప్రదేశ్‌లో ఉంది.

బాల కాండలో సీతా దేవి జన్మ వృత్తాంతాన్ని శాస్త్రిగారు వర్ణించిన కొన్ని శ్లోకాలు–

'సీతా జన్మ ప్రవక్ష్యామి యదుక్తం గ్రంధ కోభిః – ఆసీ త్పురా నృపః కస్చిత్పద్మాక్ష ఇతి విశ్రుతః

స్వాదీయసీం గుణ సుధాం సీతా పిబతి తే ప్రభో–తత్రాక్షిపద్విషం మారస్త్వం భిష గ్రామ రక్ష తాత్'

శ్రీ రామ సద్గుణ సుధారాసాన్ని సీతమ్మ గ్రోలుతోంది. మన్మధుడు అనే అసూయ ఉన్నవాడు సుధారసంలో విషం కలిపాడు. రామా నువ్వు విష వైద్యుడవై సీతనుకాపాడు.

శ్రీ ములుకుట్ల నరసింహావధాని గారు ప్రతి కాండకు' న్యాస ప్రకారం'తో బాటు ప్రతి శ్లోకానికే వారే సుబోధకంగా తెలుగులో తాత్పర్యమూ రాశారు. అవసరమైన చోట్ల వివరణలూ ఇచ్చారు. అయోధ్యాకాండ ప్రారంభంలో శ్రీరాముని స్తుతిస్తూ – 'ప్రసన్నతాం యా న గతాభి షేక –తస్తదా న మమ్లౌవనవాస దుఖితః

– ముఖాంబుజ శ్రీ రఘు నందనస్య – సదాస్తుసా మంజుల మంగళ ప్రదా. శౌర్య ధైర్య స్థైర్య,గాంభీర్య, సౌందర్య, మాధుర్య, చాతుర్య, ఔదార్య వాత్సల్య, సౌశీల్య, ఆనుకూల్య, నైర్మల్య, ఔజ్వల్య, అకౌటిల్య, అచాపల్య, తారుణ్య, కారుణ్య వాల్లభ్య, సౌలభ్య, సౌభాగ్యాలకు చక్కని నిర్వచనాలు చెప్పారు. వనవాసానికి వెళ్ళబోతూ రాముడు సీతా గృహానికి వెళ్లి కొన్ని విషయాలు చెబుతూ 'భరతుడికి ఎప్పుడూ అప్రియం చేయకు, ఈ దేశానికి అతడే ప్రభువు' అని చెప్పాడు. 'విప్రియం నచ కర్తవ్యమ్ భరతస్య కదాచన – సహి రాజా ప్రభుశ్చైవ దేశస్యచ, పురస్యచ' అన్నాడు.

మంగళ శ్లోకంలో – 'పితృ సత్య ప్రతిజ్ఞాయ కైకయ్యా వచనాదపి – చిత్రకూట నివాసాయ సీతారామయ మంగళం' అంటూ 8 మంగళ శ్లోకాలు చెప్పారు.

అరణ్య కాండ ప్రారంభ శ్లోకం – 'సాన్ద్రానంద పయోద సౌభగత నున్బీరాంబర సుందరం – పాణౌ బాణ శరాసనం కటి లసత్తూణీర భారం వరం – రాజీవాయత లోచనం ధ్రుత జటాజూటేన సంశోభితం – సీతా లక్ష్మణ సంయుతం పధి గతం రామాభి రామం భజే' ఈ కాండలో భూగోళం గురించి' భూగోళ విన్యాసం'లో వివరించారు. 8గోధుమ గింజలను వరుసగా పెడితే వాటి మధ్య దూరం అంగుళం లేక వ్రీహి. 12అంగుళాలు 'వితస్తి'. రెండు వితస్తులు హస్తం. 4హస్తాలు దండం. రెండు వేల దండాలు క్రోసు. నాల్గు క్రోసులు యోజనం. ఇదే మూడు మైళ్ళ అరవై అడుగులకు సమానం. మన భూమి యాభై కోట్ల యోజనాల వైశాల్యం కలది. ఆధునికులు ఉత్తర ధృవాన్ని మేరు పర్వతం అంటున్నారు. అక్కడ పర్వతాలేవీ లేవు. మేరు పర్వతం లేదనటం పొరబాటు. వారి అవగాహనా రాహిత్యమే. పౌరాణిక భూ మేరువు, సిద్ధాంత ఖగోళాన్ని బట్టి మహా మేరువు అని రెండు మేరువులున్నాయి. సిద్ధాంత మేరువే నార్త్ పోల్. జంబూద్వీపంలోని పామీరు పీఠభూమికి తూర్పున ఉన్న 'దియన్ షన్' అనే పేరున్నదే మేరు పర్వతం. దియంసన్ అంటే దేవ పర్వతం.

హరి వర్షం అంటే మంచి వెండి రంగు గల మనుషులున్న ప్రదేశం. ఇదే చైనా టర్కీ ప్రాంతం రష్యా టర్కీ స్థానం, పర్షియా టర్కీ స్థానం, అరేబియా ఆఫ్రికాలలో

కొంతభాగం. ఇలా వృతం. అంటే సూర్య చంద్ర నక్షత్రాలు ప్రకాశించని భూమి. రోగాలు ఉండవు చిరంజీవులు ఉంటారు. రమణ వర్షం తెల్లని దీవులలో ఉండే వారున్న ప్రాంతం అవే సైబీరియా, రష్యా ఆస్ట్రియా, హంగేరి ఫ్రాన్స్ ప్రాంతాలు. హిరణ్యాక వర్షం అంటే ధన వంతులు సౌందర్య వంతులు ఉండే కామచాత్కా, సైబీరియా, జర్మనీరష్యా బెల్జియంలు.

ఆంధ్రదేశం అంటే – కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రాంతం. దీనికి 'సింధు యుగ్మాంతరం', 'షట్సహస్ర జగతి' అనే పేర్లున్నాయి. సింధు అంటే నదికి పేరు. ఆరు వేల గ్రామాలున్నాయి. వీరినే ఆరువేలనియోగులు అంటారు. వరంగల్ ప్రాంతంలోని 'త్రిలింగాయన "దగ్గరున్న వారినే తెలగాణ్యులు అంటారు. గోదావరీ తీర ప్రాంతం వారిని వెలనాటి నియోగులు అంటారని అవధానిగారు తెలియ జేశారు.

రామ లక్ష్మణులు ఋష్య మూక పర్వతం చేరటంతో అరణ్య కాండ పూర్తి అవుతుంది. చివరి శ్లోకం– 'తతో మహాద్వర్మ సుదూర సంక్రమః క్రమేణగత్వా ప్రతి కూల ధన్వనం, దర్శ పంపాంశుభ దర్శకాననా మానేక నానా విధ పక్షి జాలకాం'

ఫలశ్రుతి లో 'యో విరాధ వధ0 నిత్యం శ్రుణోతి శ్రావ యేతవా–తస్య పాపాని సర్వాణి వినస్టాని న సంశయః'

మంగళ శ్లోకాలలో ఒకటి–మచ్చుకి – 'మతంగాశ్రమ వాసాయ శబరీ సేవితాయచ – పంపాదర్శన తోషాయ భవ్య రూపాయ మంగళం'❁

## 386. శ్రీ భాష్యం అప్పలాచార్యులు (1922)

శ్రీనివాసాచార్యులు, తిరు వెంగమాంబల తనయుడు శ్రీ అప్పలాచార్య 6-4-1922న విశాఖ పట్నం జిల్లా పద్మనాభం గ్రామంలో జన్మించారు. ఈ కుటుంబంలో వ్యాసమహర్షి బ్రహ్మ సూత్రాలకు రామానుజుల శ్రీభాష్యంపై గొప్ప వ్యాఖ్యానం చెప్పగలిగే వారు ఉండటం చేత అదే ఇంటి పేరు అయింది. రామానుజాచార్య శిష్య పరంపరకు చెందినవారు. అప్పలాచార్య రామాయణంపై తత్వ్వా దీపిక వ్యాఖ్యానం రాశారు. దీనికీ తిరుమల శ్రీనివాసునికి సంబంధం గూర్చి చర్చ చేసి తన ఉపన్యాసాలను 'ఏడు కొండలు-ఏడు కాండలు' పేరిట చెప్పేవారు. రాముడికి ఆరు కాండలవరకు తాను దైవం అనే స్పృహ లేదని ఎడవ కాండలో మాత్రమే తానూ నారాయణ స్వరూపం అని గ్రహించాడని చెప్పారు. అందుకే ఏడవ కొండ నారాయనాద్రిపై బాలాజీ ఉన్నాడని అంటారు. 2003లో విశాఖవాసులు శిష్యులు ఆచార్యుల సహస్ర చాంద్రమాసోత్సవం ఘనంగా నిర్వహించారు. వీరి జీవిత చరిత్రను 'ప్రవచన శిరోమణి'గా శిష్యుడు చిత్రకవి ఆత్రేయ రాసారు. 1992లో రాజాలక్ష్మి ఫౌండేషన్ పురస్కారం పొందారు.❀

## 387. గాన కళాపూర్ణ -శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు (1923- 2000)

15-9-1923 కృష్ణాజిల్లా జగ్గయ్య పేటలో వైష్ణవ కుటుంబంలో శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు జన్మించారు. బాల్యంలోనే సంస్కృతాంధ్రాలలో ప్రావీణ్యం సంపాదించి సంగీతంలో ప్రవేశించారు. పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి వద్ద గురుకులాభ్యాసంలో సంగీతం అభ్యసించి ప్రసిద్ధి చెందారు. పంతులుగారి వద్ద విద్య నేర్చి ప్రసిద్ధులైన వారిలో శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ అన్నవరపు రామస్వామి వంటి ఉద్దండులున్నారు. 1948లో విజయవాడ ఆకాశవాణి ప్రారంభమయినప్పుడే వయోలిన్ విద్వాంసునిగా చేరారు. 35ఏళ్ళు ఉద్యోగించి 1983లో పదవీ విరమణ చేశారు. వయోలిన్‌లో టాప్ ఆర్టిస్ట్‌గా గొప్ప పేరు. స్వీయ రచనలలో, హరికథాగానంలో ప్రసిద్ధులు. ఆంధ్రప్రదేశ్ అకాడెమి వీరి విద్వత్తుకు "గానకళా ప్రపూర్ణ" బిరుదునిచ్చి సత్కరించింది. "సంగీత సాహిత్య కళానిధి, కళాసాగర, "హరికథా చూడామణి" ఇతర బిరుదులు. వీరి సప్తతిమహోత్సవాన్ని శిష్యులు 1995 అక్టోబర్‌లో బెజవాడలో ఘనంగా నిర్వహించారు. విజయవాడ రేడియో స్వర్ణోత్సవాలలో 1998లో వీరికి ప్రత్యేక గుర్తింపునిచ్చి సన్మానించారు.

**త్యాగ రాజ స్వామి శిష్యపరంపరలో అయిదవ తరం వారు**

వీరు త్యాగరాజస్వామి వారి శిష్యులలో అయిదవ తరం వారు కావటం విశేషం. ఆ వరుస ఇది - త్యాగయ్య, మనుబూచవాది వెంకటసుబ్బయ్యర్,

సుసర్ల దక్షిణామూర్తి, పారుపల్లి రామకృష్ణయ్యయ్య, నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు.

**రచనలు**

'బిడాల మోక్షం' అనే ప్రహసనం రాసి నవ్వులు పూయించారు. "త్యాగ రాయచరితం, పరకాల విలాసం, శ్రీ నృసింహ తాడనం తెలుగులో రాశారు. సంస్కృతంలో "నౌకా చరితం శఠగోప చరితం, భూ ప్రశంస, చంద్ర కళా షోడశి రచించారు. నౌకా చరితం త్యాగయ్య తెలుగు కృతికి సంస్కృతానువాదం.

**ఆచార్యుల వారి సంస్కృత కృతులు**

కర్నాటక సంగీతంలో కొత్త కీర్తనలు రాయాల్సిన అవసరం లేదని సంగీత త్రిమూర్తులు రాసిన అమూల్య రత్నాల వంటి కీర్తనలలో కొన్ని నేర్చుకొని పాడటానికే జీవితం సరిపోదని దృఢంగా నమ్మారు. కాని అభిమానుల కోరికపై ఇరవై స్వంత కృతులు వర్ణాలు తిల్లానాలు రాశారు. ఇందులో కొన్ని అపూర్వరాగాలలో చేశారు. సంస్కృతాంధ్రాలలో అపార ప్రజ్ఞావంతులు కనుక దేనికీ వెతుక్కోవాల్సిన అవసరం ఉండేది కాదు. సంస్కృతంలో శుద్ధ అభంగ రాగం లో 'వర్ణం' అనే వర్ణాన్ని, వసంత రాగం లో 'గౌరీ సుకుమారి శంకర నారి కృతిని , "మారాజననిం ఆశ్రాయే" కృతిని నాటరాగంలో, కల్యాణి రాగంలో "శ్రీ కనక దుర్గే కృతిని" "గజవదన మాశ్రయే" కృతిని కేదార రాగం లోను మొదలైనవి రచించారు.

వీరి కుమారుడు స్వర్గీయ జగన్నాధాచార్యులు పేరుమోసిన సంగీత విద్వాంసుడు. కృష్ణమాచార్యులుగారు 2006లో ఎనభై మూడవ ఏట పరమ పదించారు .

**కృష్ణమాచార్యుల సంస్కృత రచనా సౌభాగ్యం**

కృష్ణమాచార్యుల వారి సంస్కృత రచనలలో 'మృత సంజీవనం' అనే ఏడు అంకాల నాటకం విశిష్టమైనది అన్నారు పాలపర్తివారు. భారతంలోని కచ

దేవయాని కథను, మృత సంజీవినీ విద్యనూ గ్రహించి సలక్షణ నాటకంగా తీర్చిదిద్దారు. సంగీత విద్వాంసులు కనుక కచ దేవయానుల మధ్య సంగీత చర్చను ప్రవేశపెట్టారు. చివరి అంకంలో శుక్రాచార్యులవారు "మృత సంజీవిని"కి ఇచ్చిన వివరణ మహాద్భుతంగా ఉండి, నాటకాన్ని చిరస్థాయి చేసింది.

ధర్మః సత్యం దయా శౌచం నీతిః ప్రీతిః మృతా ఇవ– తేషాం సంజీవనే సర్వే స్పృహ యంతాం మనీషిణః

మద్య పాన నిషేధానికి శుక్రాచార్యులు చెప్పిన కారణం మరీ బాగుంది –

బుద్ధేర్మోహ కరం ,విపత్పరికరం సత్కీర్తి నాశంకరం – మాన ప్రాణ హరం ,దశేంద్రియ గుణ గ్రామ ప్రభా తస్కరం

విధ్వంస కరం ,భ్రమణ యుగవత్ త్రైలోక్య సాక్షాత్కారం – శ్రితా రోద్య నిషిధ్యతే ఖలు సురాపానం మయా సర్వతః

ఈ నాటకం లో ఆచార్యశ్రీ కల్పించిన సన్నివేశాలు సంభాషణలు రసవంతంగా ఉన్నాయి. వీరి "చంద్రకళాశోడశి"లో నుంచి ఒక శ్లోకం మచ్చుకి– చంద్రేస్వతే నభసి సాదు విరాజ మానే– శ్రేయః కిమన్యకర దీప వలంబనేన– దోషా కరోస్తూ– ద్రస్టేతస్య గుణ దోష గణాన్వ్యసక్తు

ఆచార్యులవారు సంస్కృతంలో 12 హరికథలు రాసి హరికథలు చెబుతూ భారతదేశ మంతటా పర్యటించి రికార్డు సృష్టించారు. దీనికి ఉజ్జయిని లో "కాళిదాస సమ్మాన్" పురస్కారం అందుకున్నారు. విజయవాడ రేడియో కేంద్రం నుండి సంస్కృత హరికథా చెబుతూ అధికారులను 'రామ చంద్ర సమారబ్దా, వీర భద్రాభి వర్ధితా– రజనీ కాంత విక్రానా నభో వాణీ విరాజతే' అని శ్లాఘించారు. 'లక్ష్మీపతి సుప్రభాతం' కూడా రాశారు.

సంస్కృతం, తెలుగులలో లెక్కకు మించి అవధానాలు చేసిన ఘనులు ఆచార్యులవారు.❁

## 388. డా.యెన్ సి వి.నరసింహాచార్యులు (1923)

**7**-8-1923 జన్మించిన ఆచార్యులవారు సాహిత్య శిరోమణి విద్వాన్ బి ఓ ఎల్ బి ఏ. వేదాంత వారధిని సంస్కృత కళాశాలలో పని చేశారు. 100పైగా సంస్కృతంలో రిసెర్చ్ పేపర్లు రాసిన ఘనత ఆయనది. ఆయన రాసిన 'ముక్తా మౌక్తికమాల' మానవ జీవితాన్ని తీర్చి దిద్దుకోవటానికి ఉపకరించే విలువైన గ్రంథం. ఇందులో 232 ముక్తకాలున్నాయి. దేనికదే సాటి. తిరుపతిలో సుప్రసిద్ధ కవిగా పేరొందారు. 'వాచస్పతి' బిరుదు, రాష్ట్రపతి ప్రతిభా పురస్కారం అందుకొన్నారు. 'పండిత రాజ', సాహిత్య విశారద' గౌరవాలు పొందారు.❀




## 389. శ్రీ జోశ్యుల సూర్య నారాయణ మూర్తిగారు (1924- 2012)

**కృ**ష్ణాజిల్లా అవనిగడ్డ వాస్తవ్యులు శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి గారు 17-08-1924న పశ్చిమ గోదావరి జిల్లా మదుగుపోలవరంలో ఆయన జన్మించారు. సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీ భాషలలో ప్రావీణ్యం సాధించి మహా విద్వాంసులయ్యారు. అవనిగడ్డ ప్రభుత్వ జూనియర్ కాలేజీ జోగయ్యపేట డిగ్రీ కాలేజీలో తెలుగు పండితులుగా, అధ్యాపకులుగా పనిచేసి రిటైరయ్యారు. తేనెల వాకల లాంటి పదాలతో అద్భుత ప్రసంగాలు చేసేవారు. విశ్వనాధ అంటే వీరభక్తి. తాను ఉయ్యూరు దగ్గరున్న తాడంకి హైస్కూల్‌లో పని చేస్తుండగా విశ్వనాధను ఆహ్వానించి కల్ప వృక్షంపై ప్రసంగింపజేసి మహా సత్కారాన్ని చేశారు. నాకూ చాలా సన్నిహితులే. మానాన్నగారు మృత్యుంజయశాస్త్రి గారి విద్వత్తును గూర్చి తరచూ చెప్పేవారు. తరువాత అవనిగడ్డలో శ్రీ మండలి కృష్ణారావు గారు ఏర్పాటు చేసిన "గాంధి క్షేత్రం"లో ఉంటూ అక్కడ సాంస్కృతిక సాహిత్య సేవలందించారు. కృష్ణారావుగారికి, వారికుమారుడు బుద్ధప్రసాద్ గారికి అత్యంత సన్నిహితులే. బుద్ధప్రసాద్ మూర్తిగారి శిష్యులై రామాయణంలోని అనేక విషయాలపై వారు పుస్తకాలు రాశారు. నాకూ అందజేశారు. సంస్కృతంలోనూ అపార పాండిత్యం ఉన్నవారు కనుక గీర్వాణ రచనా చేశారు. ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో సంస్కృతాంధ్రాలలో వివిధ సాహిత్య విషయాలపై ప్రసంగించారు. శ్రీ మండలి కృష్ణారావుగారు అవనిగడ్డ గాంధీక్షేత్రంలో సాహిత్య సాంస్కృతిక సేవలందించారు. పురసుందర ప్రతిష్ఠాపన పురస్కారం, మద్రాసు తెలుగు అకాడమీ పురస్కారం అందుకొన్న సాహితీ నిర్మాణ్మూర్తులు. 7-3-2012న 88వ ఏట శ్రీ సూర్యనారాయణమూర్తి గారు సూర్యలోకం చేరుకున్నారు.

**మూర్తిగారి గీర్వాణ రచన**

మాతృలహరి అనే సంస్కృత కావ్యం మూర్తిగారు రాశారు. అందులో తవ శ్రీ చక్రం మందిరమితి తదన్తర్గత, మహా- సహస్రారం కోశం స్థితి రితి చ యోగీశ్వర వచః
అహం దేవి త్వాంకథ మకృత పుణ్యః పరిచరా- మ్యయోగాధ్యాభ్యాసస్తవ చరణ సేవైక గతికః" అని లలితాపరమేశ్వరిని ప్రస్తుతించారు.

"వేంకటేశ్వర స్తుతి శతకం" కూడా రాశారు- జయత్యనంతః ఖలు వెంకటేశ్వరో - భవాన్ భావాసుప్త జన ప్రబోధకః
సదా పరీక్షా ప్రవిదాన లాససో- జనైశ్చ నిత్యం స్తవనీయ విగ్రహః నిత్యం భక్తులను ఏదో పరీక్ష పెట్టి నిగ్గు తేలుస్తూ ఉంటావు కదా వెంకటేశ్వరా! అని భావం. 'గురుకృపాలహరి' భారత ధీరతా దిలీపః కావ్యాలు రాశారు. నవీన సద్భాత రక్షణాయ - నార్యస్చ వీరాఃపురుషాస్తధైవ-నిశ్చిత్య చిత్తే దృధ బుద్ధి మంతః - సమాప్నుయు సత్యాగ గుణం విశిష్టం మూర్తిగారు 'దుర్గా నాగేశ్వరాస్టకం' 'వాతాత్మజాస్టకం', ఆంజనేయ కరావ లంబ స్తోత్రం' కూడా రాశారు.

**ఇతర కృష్ణా జిల్లా కవులు**

డా.కంభంపాటి రామ గోపాలకృష్ణ మూర్తి 'సౌందర నంద', 'అన్నమాచార్య చరిత్ర' నాటికలను సంస్కృతంలో రాశారు. శ్రీ ఉపద్రష్ట వెంకట క్రిష్నయ్య 'చాణక్య', 'శివాజీ ప్రహ్లాద 'అనే ఏకపాత్రాభినయాలను, 'సనత్కుమార ఆశ్రమం' మహిళానాం మిత్ర బాంధవ్య కల్పకం భోజనం దేహిరాజేంద్ర తరతి శ్లోక మాత్మ విత్ సంభాషణలు, శ్రీ దుర్గా స్తోత్రం, వందేమాతరం రాశారు. 'భాక్తానుగ్రహ పారీణాంసర్వ దుఃఖ నివారిణీం-మోక్షదాం కామదాం దివ్యాందుర్గం దేవీం నమామ్యహం' అని దుర్గా స్తోత్రం చేశారు

శ్రీ రాణి సదాశివ మూర్తి పుత్రావయాం భారతాః జీవ బ్రహ్మైవ నా పరః శివ పాణినీయం నాటకాలను, సరద్విరాగం, ఋతు సందేశం నృత్య రూపకాలను రచించి పైన చెప్పిన అగ్నిపుత్రకు జాతీయస్థాయిలో మొదటి బహుమతి పొందారు. శారదా స్తవమంజరి, గాయత్రీ స్రగ్ధరా సుప్రభాతం, జగన్నాధ సుప్రభాత స్తవమంజరి,

వాస్తు పురుష అష్టోత్తర నామ స్తోత్రం కూడా చేశారు. గాయత్రి సుప్రభాతంలో 'ప్రత్యూష జాత పవనాః ప్రసంతిమందం–పద్మాకరే కమల షండ సుగంధ వాహాః – మాకంద లోల మధుపాస్తవ కీర్తిగానాః–గాయత్రి దేవి, మహితే కురు సుప్రభాతం'అని కమనీయంగా చెప్పారు.

శ్రీ ఎస్.టి జి వరదాచార్యులు 'సుషుప్తి వృత్తం' కావ్యం, 'భాషా శాస్త్ర సంగ్రహం' రాస్తే శ్రీపోలా రామ సుబ్రహ్మణ్యం 'శ్రీ భద్రాచల సీతారామ వివాహ మహోత్సవః 'లో మంద్రం మంద్రంమదన గమకై ర్మంజుమంజీరనా– మాతా సీతా ధవళ ధవలైర్మంద హాసైర్మనొజ్ఞైః–మందం, మందంచరణ చలనైః రామ, నాద వరంత్వాం– ఆగచ్ఛంతీ శుభ మభి ముఖం శోభతే సుప్రసన్నా' అని మంద్ర మంద అందాలతో సీతారామ వర్ణన చేశారు.

'శ్రీ పమిడిపాటి పట్టాభిరామారావు' శ్రీ బాలకృష్ణ చరిత్రం లో 'ఏకా కాచన చుమ్బితేవపిబతి స్వీయాధరం లీలయా –'ఏకా కాచన పీడితేవ కుచయోః స్తౌతి చ– ఏకాకాచన సంగతేవ సురతే సౌఖ్యేన సంజల్పతే– ఏవం రస విలాస సౌఖ్య మతులం గోపీ జనైర్భావ్యతే' అని రాసక్రీడను తనివార వర్ణించారు. "శకుంతలా" కూడా రాశారు. శ్రీ ముళ్ళపూడి జయ సీతారామ శాస్త్రి 'గాయత్రి జయరామం'లో రామే రామే సకల జనతా తన్నిరీదిపస్తం – 'రాజం కర్తుం సమఖిల షతః కింతు దైవేన రుష్టం–కైకేయ్యో ప్రాగ్వర యుగ మదాత్ భూపతి స్తత్ప్రభావాత్– రామోరణ్యం ప్రతి చలితవాన్ సీతాయా లక్ష్మణేన–చాట్దీ – రాయగా, శ్రీ దంటు సుబ్బావధాని 'ధర్మ పథం' శ్రీ కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు 'గురుక్రుపాలహరి'రాశారు. అందులో ఒక మచ్చు –వాణీ యన్ముఖత స్స్వయం క్వణయతే వీణాం పునర్యత్పదే – లక్ష్మీర్యత్ర శివోదయ స్సుకలితా సృష్టిశ్చ యత్రాత్యుతం – రక్షా కార్యమతో జగద్విలయనం యత్రాద్భుతం శామ్భవం – వందే తత్కిమపి త్రిశక్తిక మహా త్రై పూరుషంగౌరవం'

ఆచార్య వెంపటి కుటుంబ శాస్త్రి 'పుష్ప విలాపః కున్తీకుమారీ' అనే కరుణశ్రీ ఖండకావ్యాలను గురుప్రపత్తి, ధ్యానాస్తకం, ఈ శ వింశతి సంస్కృతం లో రాశారు. ఇవికాక 'నిద్రేమే ప్రియ వల్లభే, 'విధరహో బలవాన్' రచించారు. శ్రీ పేరి వెంటేశ్వర శాస్త్రి 'నాగేశ గూడార్ధదీపికా' వ్యాకరణ శాస్త్ర గ్రంథాన్ని ఆగిరిపల్లిలో రాశారు.

శ్రీ పసుమర్తి రంగనాథం 'ఆత్మ తత్వ ప్రకాశికా' వేదాంత గ్రంథం రాశారు.

శ్రీ కూచిభట్ల చంద్ర శేఖర శర్మ 'గాయత్రీ శంకరాచార్య', నవగ్రహ సుప్రభాతం 'రాయగా శ్రీ పోలా సుబ్రహ్మణ్యం' వీరేశ్వర సుప్రభాత స్తవ' శ్రీ మల్లాది సుబ్రహ్మణ్య శర్మ 'మహేశ మాలా స్తోత్ర కదంబం'లో– జిహ్వే కీర్తయ శంకరం పురహరం చేతో భజ శ్రీధరం– పాణిద్వంద్వ సమర్చయేశ్వర కదాఃశ్రోత్ర ద్వయ త్వం శృణు– శంభుం లోకయ లోచనద్వయ విభోర్ఘచ్చాం ఘ్రి యుగ్మాలయం– జిఘ్రు ఘ్రాణ మహేశ బిల్వ సురభిం మూర్ధన్నమోమాపతిం' అని అత్యంత భక్తిని ప్రదర్శించారు శ్రీ ముళ్ళపూడి జయ సీతారామ శాస్త్రి శ్రీ మాత్రుస్తవః రాశారు.

శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి కొవ్వూరులో శతావధానం చేశారు. అందులో 'కర్నాత్మజా ముదవహ ద్విబుదో ప్తై పార్థః' అనే సమస్యకు సంస్కృత శ్లోకం– ధర్మాత్మజం ద్రుపదజాం పరిదృశ్య వేగా– చ్చాన్ద్రాయణా చరణ బద్ధ విదిర్విదేశాన్– పశ్యన్ తదీయ పృధు సుందర మీక్ష్య చక్షుః– కర్నాత్మజా ముదవహ ద్విబుదోపి పార్థః అని చెప్పారు.

శ్రీ రొంపి చర్ల శ్రీనివాసాచార్యులు గుడివాడ తాలూకా నందివాడలో సంస్కృత అవధానాలు చేశారు. ప్రముఖ వాగ్గేయకారులు శ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణ సంస్కృత కీర్తనలు రాశారు. అందులో గురుదేవులు పారుపల్లి రామక్రిష్ణయ్యగారిని ఒక కీర్తనలో 'మహనీయ మధుర మూర్తే – కమనీయ గానమూర్తే– సహన సౌశీల్యాది సద్గుణొ పేతసత్కర్తే – మహతీ మంత్ర సుగాత్ర మాం పాహి గురుమూర్తే ః అహరహ మానందమయ గాన బోధనాను రక్తే– ఆశ్రిత మురళీ కృత మృదు సంగీత సుదాసక్తే– మామ్పాహి చారు మూర్తే– కీర్తించారు .

బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రిగారు, బ్రాహ్మశ్రీ ముదిగొండ వెంకట రామశాస్త్రి గారు విజయవాడలో గొప్ప సంస్కృత పండిత కవులు. తర్క వ్యాకరణాలలో అద్వితీయులు. వీరు సంస్కృత గ్రంథరచన చేసినట్లు విన్నాను కాని నాకు లభించలేదు. ఇంతవరకు స్వాతంత్ర్యానంతరం అరవై ఏళ్ళలో కృష్ణాజిల్లా పండించిన గీర్వాణపంటను వీక్షించం దీనికి ముఖ్యాధారం ముందే మనవి చేసినట్లు 'సంహూతి'. అందులో శ్రీ పాలపర్తి వారి వ్యాసం.❀

## 390. శ్రీ పండిత పద్మనాభాచార్యులు (1925-1992)

**ఆ**త్మ కూరులో 1925లో పుట్టిన శ్రీ ఆచార్యులవారు ఆనంద తీర్థ నాగాంబల కుమారుడు. సంస్కృత వ్యాకరణ శాస్త్రంలో ఇటీవల కాలంలో వీరంత గొప్ప పండితులే లేరనిపించారు. సర్వ శాస్త్ర పారంగతులు. మహా మహోపాధ్యాయులైన గురువులవడద్ద తర్క వ్యాకరణ మీమాంస వేదాంతాలను నేర్చారు. కంచి స్వామి శ్రీ జయేంద్ర సరస్వతి ఆత్మకూరు వచ్చినప్పుడు ఆచార్యుల వారింటికి వచ్చి 'ద్వైతా ద్వైత చర్చ' చేసారు. అంతకు పూర్వం కంచి పరమాచార్యులు శ్రీ చంద్ర శేఖర సరస్వతి పద్మనాభా చార్యుల వారింట 'న్యాయామృతాద్వైత సిద్ధి'పై చర్చించారు. అంతటి మహా పండితులు ఆచార్యులవారు.

వీరి సంస్కృత రచనలు – 'పరిభాషేందు శేఖర వ్యాఖ్య', శబ్దేందు శేఖర వ్యాఖ్య, న్యాయ కుసుమాంజలి వ్యాఖ్య, పంచ సూక్తి వ్యాఖ్య' చాలా ప్రసిద్ధమైనవి. 'అద్వైత తత్వ చంద్రిక' అనే వీరి అపూర్వ గ్రంథం సర్వ జనామోదం పొందింది. పాణిని విద్యాలయం స్థాపించి ప్రిన్సిపాల్‌గా పని చేశారు. కంచి కామకోటి పీఠంసహాయంతో వేద పాఠశాల స్థాపించారు. వీరి కుమారుడు ఆనంద తీర్థ వ్యాకరణ వేదాంత పండితులు.

– శ్రీ పత్రి రాఘవ శర్మ కందుకూరు వాసి. 'శివ సహస్ర నామ స్తోత్రం'కు వ్యాఖ్యానం రాశారు. – శ్రీ మంకాల కృష్ణ శాస్త్రి కరివెన వారి అగ్రహారానికి చెందిన శాస్త్రిగారు గొప్ప వైయాకరణులు. 'అహోబిల సుప్రభాతం' రాశారు. ❁



## 391. శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య (1926-1984)

**1**926 ఆగస్ట్ 11న గుంటూరు జిల్లా బాపట్లలో ఎక్కిరాల అనంతాచార్యులు, బుచ్చమ్మలకు కృష్ణమాచార్య జన్మించారు. ఆంధ్ర, ఆంగ్ల సంస్కృతాలలో పాండిత్యం సాధించి 'పాండురంగ మహాత్మ్యం' కావ్య పరిశోధన చేసి బృహత్ గ్రంథం రాసి పి.హెచ్ డి పొందారు. ఆంధ్రా యూనివర్సిటిలో తెలుగు లెక్చరర్‌గా పనిచేసి ఎన్నో గ్రంథాలు రాశారు. 'వరల్డ్ టీచర్' ప్రసిద్ధులు. 'మాస్టర్ యి కే'గా గుర్తింపు పొందారు. ఎన్నో వేదాంత గ్రంథాలను రాశారు. 17-3-1984 మరణించారు. సంస్కృతంలో అనేక స్తోత్రాలు, స్తుతి సౌఖ్యం రాశారు.❁

## 392. శ్రీ కంచి పరమాచార్యులపై 'గురూపహారం' రాసిన – శ్రీ మట్టిపల్లి మల్లినాధ శర్మ (1926)

**కా**శ్యప గోత్రీకులు, వీరేశ్వర శేషమాంబా పుత్రులు శ్రీ మట్టిపల్లి మల్లినాదశర్మ 1926లో నెల్లూరు జిల్లా కార్వేటి నగరం దగ్గర ముక్కరవానిపాలెం లో పుట్టారు. కుటుంబం ఇందుకూరిపేట చేరి నెల్లూరు వేదసంస్కృత కళాశాలలో చేరి 1960లో భాషా ప్రవీణ పాసైనారు. ఇందుకూరు ఉన్నత పాఠశాలలో తెలుగుపండితులుగా పని చేశారు. బాల్యం నుండి రచనలో పండిన వీరుగీర్వాణ ఆంధ్ర భాషలలో నలభైకి పైగా గ్రంథాలు రాశారు.

### మట్టిపల్లి వారి 'మిట్టీమే సోనా 'సంస్కృత రచనా సోయగం

శ్రీ జన్నవాడ కామాక్షీ సుప్రభాతం, మధుర స్మృతి (6సర్గలు)గురూపహారః ,ఇందుకూర్ పేట కామాక్షీ సుప్రభాతం, భద్ర కాళీ స్తవం, శుభాషితాని అనే చాటువులు, నాటికాత్రయం, చంద్రమండల యాత్ర వీరి సంస్కృత రచనలు. గురూపహారంలో శ్రీ కంచి పరమాచార్యులు శ్రీ చంద్రశేఖర యతీన్ద్రులవారిని 'నడిచే దైవం'గా అభివర్ణించారు. ఆరు సర్గల కామాక్షీ సుప్రభాతంలో అమ్మవారి సేవకోసం సకల దేవతలూ వచ్చారని– "ల్లక్ష్మీః కుశేశ సమాంచిత పాత్ర హస్తా– వాణీ స్వపాణితల మండిత వల్లకేచ – అనాశ్చవాద్య నిపుణామంజూది ద్రుత్వా– కామాక్షి దివ్య నిలయే తవ సుప్రభాతం". ❁

## 393. శ్రీ కోగంటి సీతారామాచార్య (1927-1996)

**చ**తుర్వాణి బిరుదాంకితులైన సీతారామాచార్య గారు 'ప్రతిజ్ఞా కౌసల్యం, అనూర్వం, ఏకలవ్యం, పద్మావతీ చరణ చారణ చక్రవర్తి'లను సంస్కృతంలో రాశారు. ❁



## 394. పద్మశ్రీ, ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు (1927- 2015)

**విద్యా ఉద్యోగసేవ**

అమలాపురం దగ్గర ఇందుపల్లి గ్రామవాసి శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు. తండ్రి సత్యనారాయణ శాస్త్రి గారి వద్దనే కావ్య, నాటక సిద్ధాంత కౌముదిలు నేర్చారు. తెలుగు సంస్కృతాలలో 175 గ్రంథాలు రాశారు. సంస్కృతంలో మూడు మాస్టర్ డిగ్రీలు పొందారు. మద్రాస్ సంస్కృత యూనివర్సిటీ నుండి వేదాంతం సర్వోత్కృష్టంగా ఉత్తీర్ణులై స్వర్ణ పతకం అందుకొన్నారు. బెనారస్ యూనివర్సిటి నుండి హిందీ ఇంగ్లీష్‌లలో కూడా ఎం.ఏ డిగ్రీ సాధించారు. ఉస్మానియా నుంచి 'రస గంగాధరం'పై పరిశోధన చేసి సంస్కృత పి. హెచ్ డి అందుకొన్నారు .

**రచనా శ్రీరామం**

రామాయణాన్ని ఏడు భాగాలుగా సులభ శైలిలో అర్థ తాత్పర్యాలతో

'బాలానందినీ వ్యాఖ్య' రాసి ప్రచురించారు. కౌటిల్యుని అర్థ శాస్త్రం, అలంకార శాస్త్ర చరిత్ర, భరతముని నాట్య శాస్త్రం తెలుగు చేశారు. వక్రోక్తి జీవితం సిద్ధాంత కౌముదిలను తెలుగు చేశారు. కావ్యాలంకార, కావ్యాదర్శ, కావ్య ప్రకాశ, లోచన సహిత ధ్వన్యాలోకంలపై విస్తృత వ్యాఖ్యానాలు రాశారు. పాశ్చాత్య తత్వ శాస్త్రేతిహాసం, బ్రహ్మ సూత్రాలు, భగవద్ గీతా శంకర భాష్యాలకు తెలుగులో అద్భుత వ్యాఖ్య చేశారు. పద్మశ్రీ పొందిన మహా మహోపాధ్యాయులు. సంస్కృత అకాడెమి డైరెక్టర్‌గా రిటైర్ అయ్యారు. సంస్కృత అకాడెమి డైరెక్టర్‌గా, సురభారతీ సమితి కార్యదర్శిగా సుమారు ముప్ఫై గ్రంథాలకు, అప్పయ్య దీక్షితేంద్ర కేంద్ర ప్రకాశ సమితికి వైస్ చైర్మన్‌గా ఎనిమిది గ్రంథాలకు సంపాదకులుగా ఉన్నారు. సంస్కృత భాషా సమితి ప్రచార సభ్యులుగా, ఉప కులపతిగా, కులపతిగా సుమారు ముప్ఫై ఏళ్ళు సేవలందించారు. కేంద్ర సంస్కృత బోర్డు సభ్యులైనారు. లాల్ బహదూర్ శాస్త్రి విద్యా పీఠ సభ్యులుగా పని చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం గ్రంథ ప్రచురణ సంస్థకు సలహా సంఘ చైర్మన్‌గా వ్యవహరించారు.

**బిరుద పురస్కారాలు**

పుల్లెల వారికి 1987లో రాష్ట్రపతి పురస్కారం లభించింది. 1993లో ఉత్తర ప్రదేశ్ సంస్కృత సంస్థాన విశ్వభారతి లక్ష రూపాయల పురస్కారాన్నిచ్చి సత్కరించింది. 1997లో గుప్తా ఫౌండేషన్, 2000 శివానంద ఎమినేంట్ సిటిజెన్ పురస్కారం, 2004లో బిర్లా ఫౌండేషన్ వారి వాచస్పతి పురస్కారం తో లక్ష రూపాయల నగదు బహుమతి, 2007లో అప్పా జోశ్యుల విష్ణుభోట్ల కందాలై వారి పురస్కారం, 2011లో సి పి.బ్రౌన్ అకాడెమి 2,50,000 రూపాయల సర్వోత్కృష్ట పురస్కారం మొదలైన వెన్నో అవార్డులు రివార్డులు అందుకొన్న విద్వన్మణి శ్రీ పుల్లెల శ్రీ రామ చంద్రుడు గారు.

లాల్ బహదూర్‌శాస్త్రి విద్యా పీఠం పుల్లెల వారికి 'మహా మహోపాధ్యాయ' బిరుద ప్రదానం చేసి గౌరవించింది. 2011భారత ప్రభుత్వం 'పద్మ శ్రీ'ని మాత్రమే ఇచ్చి చేతులు దులుపుకొంది. ఎన్నో విద్యా సంస్థలు ఆధ్యాత్మిక సంస్థలు పుల్లెల

వారిని సత్కరించి సమ్మానించి ఆ సాహిత్య సరస్వతీమూర్తికి నీరాజనాల నందించి ధన్యత చెందాయి. పుల్లెల వారిలో మనకు ఒక శంకరాచార్యులు ఒక కౌటిల్యుడు ఒక వాల్మీకి ఒక వ్యాసుడు ఒక కాళిదాసు, ఒక పాణిని, ఒక మమ్మటుడు, ఒక విశ్వనాధుడు ఒక క్షేమేంద్రుడు ఒకరని ఏమిటి సకల అలంకార శాస్త్ర వేత్తలందరూ కనిపిస్తారు. మూలలలోకి చేరి విస్తుతంగా పరిశీలించి నిగ్గు తేలిస్తేనే కాని వారికి తృప్తి ఉండదు. ఎనభై ఏడేళ్ళ వయసులో ఇంతటి మహామహులు శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు 24-6-2015 శ్రీరామ సాయుజ్యానికి చేరారు. ఫ్రాన్సిస్ బేకన్ మాటల్లో చెప్పాలంటే పుల్లెలవారు 'ఎక్సాక్ట్ మాన్'.

**పుల్లెల వారి గీర్వాణీయం**

తెలుగు, సంస్కృత నిఘంటువును పుల్లెలవారు శ్రీ కప్పు గంతుల లక్ష్మణ శాస్త్రి గారితో కలిసి రాశారు. రవీంద్రుని గీతాంజలిని సంస్కృతీకరించారు. 'సుసంహత భారతం' అనే సంస్కృత నాటకం, 'ధమ్మపదం', రాగ రోచి, పారశీక లోకోక్తయః, రూపక పరిచయః, శ్రీ రామ సహస్ర నామ స్తోత్రం, శ్రీ త్యాగరాజ సహస్ర నామ స్తోత్రం, మయూరుని సూర్య దండకానికి సంస్కృత వ్యాఖ్య, వ్యాఘ్రుత న్యాయ సంవాదః, వసంత గమనం, మహాన్ భారతోహం, న కదాచిదానిద్రశం, ఆధునిక కావ్య లక్షణం, భారత దేశస్య స్వరాజ్యాదిగమః, హాస్య గుటికాః, కవికుల కోకిలః, నెహ్రూ విషయే చరమ శ్లోకః, సౌమ్యో దదాత్ సౌమ్యతం, సంస్కృత భాషాః, ముక్తకాని, శ్రీ రామ కృష్ణ పరమ హంస సూక్తః, అద్వైతమతే ప్రాశస్త్య గుణం, అద్వైతం పరమం రహస్యం, అద్వైత మేవ వైదికం దర్శనం, సమస్యా పూర్తయః శ్రీరామ స్తుతిశ్చ, అనూదితాని మహాదేవ వర్మః గీతాని, నగరే శ్రింగాటకం, జీర్ణ చ్ఛత్రం, శిక్షా ఏకాంకిక మొదలైన గీర్వాణ గ్రంథాలు రాసిన మహోదయులు పుల్లెలవారు. ❀



## 395. సద్గురు కందుకూరి శివానందమూర్తి (1927-2015)

**క**ందుకూరి శివానందమూర్తి మానవతావాది, ఆధ్యాత్మిక, తత్వవేత్త. భారతదేశం లోనూ, విదేశాల్లోనూ ఆయనకు ఎంతో మంది శిష్యులు, అభిమానులు ఉన్నారు. విశాఖపట్నంలోని భీమునిపట్నంలో ఆనందవనం పేరిట ఉన్న ఆశ్రమంలో నివసిస్తున్నారు. సంప్రదాయం, సంస్కృతి అంశాల మీద ఎన్నో పుస్తకాలు రచించారు. ఆయన తల్లిదండ్రులు సర్వమంగళ, వీరబసవరాజులు శివభక్తులు, దాదాపు 200 శివాలయాలను నిర్మించారు. చిన్నతనం నుండి శివానందమూర్తి ఆధ్యాత్మిక విషయాల పట్ల, ముఖ్యంగా యోగశాస్త్రం పట్ల ఎంతో ఆసక్తి కనబర్చేవారు. 1949 లో సైన్సు గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి సబార్డినేట్ సర్వీస్ లో చేరారు. పోలీసు డిపార్టుమెంటులో హన్మకొండలో పని చేస్తున్నప్పుడు కూడా ఆర్తులకు, పేదవారిక సేవచేయడం పట్ల, హిందు ధర్మ బోధన పట్ల ఎక్కువ సమయం వెచ్చించే వారు. ఆఫీసరుగా స్వచ్ఛంద పదవీ విరమణ చేసి సేవాకార్యక్రమాల పట్ల, సాంస్కృతిక సేవ పట్ల దృష్టి సారించారు.

సమున్నతమైన భారతదేశం, సనాతన ధర్మంల వేళ్లూనుకున్న ప్రాచీన సంస్కృతి పట్ల ఆయనకు అమితప్రేమ. సన్యాసులతో సహా అందరూ ప్రజాసంక్షేమానికి ట్రస్టీలుగా, సంరక్షకలుగా తమ వంతు కర్తవ్యం నిర్వర్తించాలని తన ప్రసంగాల్లో తరుచూ చెబుతుంటారు. హిందు ధర్మం, దాని చరిత్ర, సంగీత సాహిత్యాలు, నాట్యనాటకాల విషయాల్లో ఆయన ఒక విజ్ఞాన సర్వస్వం.

సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్ స్థాపించి, లలితకళలు విజ్ఞానం సాంకేతికం వైద్యం జర్నలిజం మానవ శాస్త్రాలు మొదలైనవాటిపై ప్రసిద్దుల చేత ఉపన్యాసాలిప్పించి సత్కరిస్తారు. రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయ డాక్టరేట్ అందుకొన్నారు. 87 సంవత్సరాల సార్ధక జీవితం గడపి 10-6-2015 శివైక్యం చెందారు. సైన్స్ ఆఫ్ ప్రాణాయామం, శివానండా కంపానియన్ టుయోగ, లార్డ్ కృష్ణ హిస్ లీలా అండ్ టీచిన్గ్స్ మొదలైన గ్రంథాలు రాశారు. శివపురి కీర్తనలు చేశారు. ❋

## 396. పద్మావతీ చరణ చారణ చక్ర వర్తి నాటక కర్త- శ్రీ మానా ప్రగడ శేష సాయి (1927)

**స**ంస్కృతాంధ్రాలలో మహా పండితకవులైన సాయిగారు విజయనగర సంస్కృత కళాశాల అధ్యాపకులు. సంస్కృతంలో 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' నాటకం, జయ దేవ సరస్వతి నాటిక రాశారు. ఉగాది పురస్కార గ్రహీతలు. ఆకాశవాణి దూరదర్శన్ కార్యక్రమ వ్యాఖ్యాతగా లబ్ధ ప్రతిష్టులు.❁

## 397. శ్రీ ఇచ్ఛంపాటి శఠ కోపాచార్య (1928-1992)

**త**మిళ శ్రీ వైష్ణవ కుటుంబానికి చెందినవారు. ప్రొద్దుటూరు మళయాళ స్వామి కాలేజిలో పనిచేసి గొప్ప పేరు పొందారు. సంస్కృత భాషా వ్యాప్తికి అనన్య సేవలందించారు. రాసిన వ్యాసాలూ కవితలు అన్నీకలిపి 'సుర వాణీ మణి హారం'గా వెలువరించారు. ఇందులో పద్య మణి, గద్యమణి, దృశ్యమణి అని మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలో 'హయగ్రీవ లహరి, సూక్తి ముక్తావళి, అమరావాణీ ప్రశస్తి, శ్రీ సువర్ణ హారం, ఆర్తి విజ్ఞప్తి, మహాదేవీ వింశతి, శ్రీ బగలా నక్షత్ర మాల, కృపా రాజ్ఞీ, భారత భూ వైభవం, సూక్తి సుధానిధి' ఉన్నాయి. రెండవ భాగంలో- 'భక్తిమార్గ ప్రాశస్త్యం, గురు శుశ్రూషయా విద్య' ఉన్నాయి. మూడవ దానిలో 5 నాటకాలున్నాయి- ధ్రువ విజయం, కుచేల విజయం, ప్రహ్లాద విజయం, శ్రీ రామ విజయం, భారతీ విజయం'.❁

## 398. శ్రీ కొల్లేగల్ ఆర్.సుబ్రహ్మణ్యం (1929)

**క**ర్ణాటకలో కొల్లేగల్ అనే చిన్న గ్రామానికి చెందినవారు. హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. ఆంధ్రప్రదేశ్‌లో గొప్ప సంగీత విద్వాంసులుగా పేరుపొందారు. సంగీత విద్యను శ్రీ బాలక్కవాదివరద రాజ అయ్యంగార్, శ్రీ ఆర్ బాల కృష్ణల వద్ద నేర్చుకున్నారు. శ్రీ త్యాగరాజ ఆరాధనోత్సవాలలో దీక్షగా 'ఉంచ వృత్తి' చేస్తూ భక్తిగా పాల్గొంటారు. అన్నిభాషలలో గొప్ప పాండిత్యమున్నవారు. సంస్కృత తెలుగు కన్నడ ,తమిళ భాషల్లో ఎన్నో కృతులు రాశారు. హిందీ మలయాళంలలోనూ కొన్ని కృతులు చేశారు. మొత్తం మీద 450 కృతులు చేసిన ఘనత వీరిది.❁

## 399. శుక సందేశం రాసిన – శ్రీ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు (1930)

**తి**రుపతిలో 1930లో వెంకట నరసింహాచార్యులు, జానకమ్మల సంతానమే శ్రీ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు. నెల్లూరు మూలపేట శ్రీ వేణుగోపాల దేవాలయంలో బాల్యం గడిచింది. వేదసంస్కృత కళాశాలలో చదివి సాహిత్య ప్రవీణ, భాషా ప్రవీణలు పాసైనారు. వివిధ సాహిత్య ప్రక్రియలలో 33 గ్రంధాలు రాశారు.

**గీర్వాణ కవితా గీర్వాణం**

సంస్కృతం లో మొదటికావ్యం శుక సందేశః కల్పిత ఇతి వృత్తం నూట ఒక్క శ్లోకాల ఈ గ్రంధాన్ని గురువుగారు శ్రీ గాజులపల్లి హనుమచ్చాస్త్రి గారికి అంకితమిచ్చారు– గురుస్తుతి విద్యా భూషణ సంజ్ఞితస్య హనుమచ్ఛాస్త్రీ త్యు పాఖ్యావతః– శ్రీమత్సింహ పురీ స్థసంస్కృత కళాశాలా ధీనేతుర్గురోః– పాదాంభోజ యుగే సమర్ప్యతదిదం కావ్యం గురోర్దక్షిణాంఃతేనై తేన వచో విలాస విభవేనా కల్పయం వాగ్ధనః లంకలో ఉన్న సీతాదేవి చిలుక ద్వారా శ్రీరామునికి సందేశం పంపటమే కథ.

"దూరీ కర్తుమ్ సుర మృగ దృశాం దుఃఖ మూర్వీం ప్రసన్నా– దేవీ సీతా మృగమను విభేసాను జాతే ప్రయాతే– నీత్వాలంకా మహర రిపుణా ప్రాపితాశోక వాటీం–కల్పద్యామాం కధమపి నిశామాది మాంతం వ్యనైషీత్ సీతమనోవ్యధను

వ్యక్తం చేసింది. మృదు మధురభావాలు శబ్దాలతో కావ్యం రస రంజితమైంది. 'బుద్ధ చరిత'లో ఒక ఘట్టాన్ని 'సౌగతం'గా రాశారు. గోపాల రెడ్డి గారి 'నిద్ర' ఖండికను 'నిద్రా విభూతిం'గా మలచారు. నారద ముని సుప్రభాతం శ్రీ లక్ష్మీనారాయణ సుప్రభాతం, శ్రీ గోదా సుప్రభాతం, శ్రీ గోదాసహస్ర మాలిక, శ్రీ లక్ష్మీనారాయణ సహస్ర నామ స్తోత్రం ఆచార్యుల వారి సంస్కృత రచనలు. దువ్వూరి రామి రెడ్డిగారి 'గులాబీతోట'ను 'సుభాషిత పుష్ప వాటికా'గా రాశారు. ఆకిలి రామశర్మగారి 'శార్వరి'ని సంస్కృతం లో 'శర్వరి'గా అనువదించారు. పదిముఖ్యమైన లఘు స్తోత్రాలు రాశారు. అన్నీ ప్రసిద్ధి చెందినవే. విశ్వనాధ 'హాహా హుహూ'ను సంస్కృతీకరించారు. బెజవాడ రెడ్డిగారి" నేడు ఖండికను 'ఉల్లేఖ మంజరి'గా గీర్వాణీకరించారు. యజ్ఞాలలో పశువధను నిషేధించటాన్ని సమర్ధిస్తూ దానికి బదులు పిండ పశు ప్రదానం చేయాలని 'పశ్వాలంబన నిషేధ' వ్యాసాన్ని సంస్కృతం లో శ్రీ విశ్వనాధ ముతులు ఆరవత్తూర్ వ్యాసానికి అనువాదంగా రాశారు.

తెలుగులో సుమారు పదిగ్రంథాలు రాశారు. శ్రీ ఆకెళ్ళ అచ్చన్న శాస్త్రి తోకలిసి 'శ్రీ సంస్కృత భాషా ప్రవేశిక' అనే సులభ వ్యాకరణాన్ని రాశారు.

**బిరుద సత్కారాలు**

ప.గో.జి పెంటపాడు ఉభయ వేదాంత సభ వారిచే ఉభయ వేదాంత వాచస్పతి 'తిరుపతి' రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠం చే 'వాచస్పతి' శ్రీ చిన జియ్యర్ చే 'గోపాలోపాయన' సన్మానాన్ని అందుకున్నారు. గుంటూరు ఉభయ వేదాంత సభచే 'శ్రీ మద్గోపాలాచార్య స్మారక' పురస్కారం పొందారు.

తల్పగిరి రంగనాద స్తోత్రంలో స్వామిని – "పినాకినీతే రమ్య శేష పర్యంక శాయినం– నిద్రా ముద్రాభి రామం తమ్ వందే శ్రీ రంగ నాయకం ఉపదాయ కరం వామం దక్షిణం జానుగామినం– కృత్వా సుఖేన శయితం వందే శ్రీ రంగ నాయకం" అని అందంగా ఆ నిద్రా భంగిమను వర్ణించారు కళ్ళకు కట్టినట్లు.❀

## 400. శ్రీ ఓగేటి పరీక్షిత శర్మ (1930 -2007)

**గు**ంటూరు దగ్గర యాజిలిగ్రామంలో శర్మగారు జన్మించారు. పూనాలో సంస్కృతం నేర్చారు. సంస్కృతం లో 'లలిత గీతాలహరి, యశోధరా మహాకావ్యం, శ్రీమత్ప్రతాప రామాయణం, జానపద నృత్య గీతమంజరి, పరీక్షాన్నాటక చక్రం, అక్షయ గీతా రామాయణం రాశారు. ఇందులో ప్రతాప రాణాయనామ్ ప్రబంధ శైలిలో మహోత్కృష్టంగా రచించారు. ❁

## 401. శ్రీ ముదిగొండ నాగ లింగ శాస్త్రి (1930)

**భ**గవద్గీతపై నీలకంఠ భాష్యానికి వ్యాఖ్య రాశారు. 'భగవద్గీత తాత్పర్య నిర్ణయ' సంస్కృతంలో 1950లో రచించారు. ❁

## 402. మహాత్మా అప్పల విశ్వనాథ శర్మ (1930–2000)

**య**శోదా, నారాయణ బాబుల సుపుత్రులే విశ్వనాథశర్మ గారు. మెదక్ జిల్లా మార్కూర్‌లోని పాండురంగా శ్రమంలో జన్మించారు. 'పాండురంగ సుప్రభాతం'ను ద్రాక్షాపాకంలో రాశారు. 'రాధాకృష్ణ సంవాదం' కూడా రచించారు– ఒక ఉదాహరణ శ్లోకం – "నీతం నవ నవ నీతం నీతం నీతంచ కిం తేన – ఆతపాతా పితా భూమై మాధవ మాధావ మధావ
శ్రీ రసారామ ప్రహ్రుత్య శంద్యా స్వీకృతం యది పలాయనంతట్–మానసే మమ నితాంత తమసే నంద నందన కిమహో నిలీయసే"❁

## 403. చింతగుంట సుబ్బారావు (1932)

**శ్రీ** చింతగుంత సుబ్బారావు శ్రీమతి తులసి బృంద శ్రీ చెన్నయ్య దంపతులకు గుంటూరులో 05-04-1932లో జన్మించారు. గుంటూరు ఇ.ఎల్.సి.ఎం. హైస్కూల్, హిందూ కాలేజి హైస్కూల్‌లలో చదివి ఏ.సి,కాలేజీలో డిగ్రీ 1954లో పొందారు. విశాఖపట్నం ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బి.ఏ.ఆనర్స్ 1958లో సాధించి ఎం.ఏ అయ్యారు.

చీరాల వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.యెన్.కాలేజిలో ఇంగ్లీష్ లెక్చరర్‌గా 1957- 1992 వరకు ఉద్యోగించారు. సంస్కృతం హిందీలపై అభిమానం మెండు. స్వయంకృషితో వాటినీ సాధించారు. శ్రీమతి దుర్గాదేవిని వివాహమాడి ఒక కుమారుడిని, ముగ్గురు కుమార్తెలను పొందారు.

సంస్కృతంలో అమృత వర్షిణి, శ్రీ పద చింతనం, ఆదర్శ దర్శనం చంద్రికా ద్వీపే చండాతపః నిర్మాల్యం సవ్య రచనలు. ప్రజాకవిర్వేమః శతపత్రోత్తరీ, కామకోటి సరస్వతి మొదలైన అనువాద రచనలు చేశారు. తెలుగులో వాల్మీకి రామాయణంలో గాయత్రి, శ్రీ సదాశివ బ్రహ్మేంద్రుడు, పలనాడు భారతం, భారత రాజ్యాంగ రచన అనువాదం రాశారు. ఆంగ్లానువాదాలుగా "Devotional songs of Annamacharya, The battle of poland, How sweet is thy name srirama, Venkatachala mahatmyam, The silent melody" రచించారు. వీరి హిందీ అనువాదాలు అన్నమాచార్యకే ఆధ్యాత్మ సంకీర్తన్, విజ్ఞాన దీపికా. గృహ్యా సంగీతం మొదలైనవి.

శ్రీ సుబ్బారావు ఆలోచనామృతం, శ్రీ స్తుతి, శృంగార తిలకం, విష్ణుమాయా

విలాసం, శ్రీరంగనాథ ప్రబోధం, నారద భక్తి సూత్రాలు, బ్రహ్మ సూత్రాలు పాదం 1, కుమార సంభవం ఒకటి నుంచి ఏడు సర్గలు అనే వ్యాఖ్యానాలు తెలుగులోనూ Shree kantha shiva chaaryas; Dasha shloki ఆంగ్ల వ్యాఖ్యానంగా రాశారు. వీరి అముద్రిత గ్రంథాలు రుద్రయామలం ఆరవ పటలం, శివస్తోత్రావళీ, అరవింద కథా సరిత్సాగరం, పతంజలి యోగ సూత్రాలు బ్రహ్మ సూత్రాలు రెండవ పాదం రఘువంశం మొదటి సర్గ మొదలైనవి వెలుగు చూడాలి.

శ్రీ చింతగుంట సుబ్బారావు గారి విద్వత్తుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి లలిత సంగీత విశారద పురస్కారం 2006లో పొందారు. అప్పాజోశ్యుల చారిటబుల్ ట్రస్ట్ వారి గురు పూజా పురస్కారం అందుకొన్నారు. డా. కోడూరు ప్రభాకరరెడ్డి ప్రజ్ఞా పురస్కారం సహజ సాహితి పురస్కారం, శ్రీ పోరూరి లక్ష్మీ నరసింహారావు గారి 13 వర్ధంతి పురస్కారం వీరిని వరించాయి. 83 ఏళ్ళ వయసులోనూ నిత్య గ్రంథ పఠనం, రచనా వ్యాసంగం, సాహిత్య గోష్ఠితో జీవితాన్ని ధన్యం చేసుకొంటున్న చతుర్భాషా కోవిదులు శ్రీ చింతగుంట సుబ్బారావు.❀



## 404. శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ (1932)

శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ గారు 1932 మార్చి 22న కృష్ణాజిల్లా నూజివీడు దగ్గర నరసాపురంలో జన్మించారు. నూజివీడు జమీందారు గారు వీరి తండ్రిగారిని ఆహ్వానించి తీసుకెళ్ళారు. ఎలిమెంటరీ స్కూల్ చదువు లేదు. లెక్కలు వచ్చేవి కావు. మేష్టార్లు కొడతారని బడికి వెళ్ళేవారు కాదు. తలిదండ్రులు శ్రీ కానాదిభట్ల సూర్యనారాయణ, కోటమ్మగార్లు. చిలకలూరిపేట పన్నాల వెంకట సుబ్బయ్యగారికి దత్తత వెళ్ళారు. అక్కడా చదువు సాగలేదు. పెంపుడు తండ్రి స్వేచ్ఛ నిచ్చేవాడు కాదు. బంధువుల ఇళ్ళల్లో ఏదో పని చేస్తూ ఉండేవారు. చదువు లేదు, చట్టుబండలు లేదని ఆక్షేపించారు. పట్టుదల వచ్చింది. కృష్ణాజిల్లా గొడవర్రులో 1945 సంస్కృత పాఠశాలలో చేరారు. దీన్ని త్రిలింగ విద్యా పీఠం ఆధ్వర్యంలో చుండూరి వెంకటరెడ్డి నిర్వహించేవారు. సుమారు రెండేళ్ళు కావ్యాలు చదివారు. గురువు శ్రీ వెల్లంకి సత్యనారాయణగారు. ఇక్కడి నుండి గురువుగారి బావగారు పైడిమర్రి చంద్రమౌళి శాస్త్రిగారి దగ్గర నేలకొండపల్లిలో చేరి వ్యాకరణం మొదలైనవి చదివారు. గొప్ప పునాది ఏర్పడింది ఇక్కడే అని గర్వంగా చెప్పారు. సంస్కృతం మీద అభిమానం బాగా కలిగింది. శ్రీమతి కాత్యాయనిని

వివాహమాడారు. కుమారుడు, కుమార్తె కలిగారు.

గుంటూరు జిల్లా పరిషత్ హైస్కూల్‌లో తెలుగు పండితులుగా పని చేస్తూ 1969లో తెలుగు ఎం.ఏ, 72లో సంస్కృతం ఎం.ఏ సాధించారు. రామాయణం, రామాయణం ఆధారంగా వచ్చిన వివిధ ప్రక్రియలలో "శ్రీరామ శీలాను శీలనం" విషయమంగా గ్రహించి పరిశోధన చేసి 1977లో పి హెచ్‌డి పొందారు. బరోడాకు చెందిన ఒక పరీక్షకుడు "రాముడు దేవుడైతే ఏం కాకపోతే ఏం" అని వ్యాఖ్యానించినందుకు మనసు నొచ్చుకొని శ్రీరాముడినే శంకించినందుకు బాధపడి డాక్టరేట్ పొందినా ఎక్కడా "డాక్టర్" అని రాసుకోలేదని చెప్పిన మహోన్నత వ్యక్తిత్వం పన్నాల వారిది. ఆంధ్రా యూనిర్సిటీలో లెక్చరర్ పోస్ట్‌కు ప్రయత్నించారు. అది తీవ్ర పోటిగా మారి వీరికి అందలేదు. అప్పటికే ఎన్నో గ్రంథాలు సంస్కృత ఆంధ్ర భాషలలో రాసి ఉన్నందున వీరి పేరు విశేష వ్యాప్తి చెంది, ధర్మపురి సంస్కృత కళాశాలలో ఇంటర్వ్యూ లేకుండానే వీరి ప్రతిభ గుర్తించి ప్రిన్సిపాల్ పదవినిచ్చారు. అంతకుముందు నాలుగు నెలలు గూడూరు దగ్గర విద్యానగరం కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పని చేశారు.

జిల్లెళ్ళమూడి సంస్కృత కాలేజిలో "అమ్మ" ఆహ్వానంతో చేరి 1971 నుండి 1987 వరకు ప్రిన్సిపాల్‌గా పని చేసి, అమ్మ చరణార విందమందు మత్త భ్రుంగమై, అమెపై స్తుతి, స్తోత్రాలు ఎన్నో రాస్తూ, ఆధ్మాత్మిక అనుభూతిని పొందుతూ, కళాశాలకు సేవలందించారు. 1978లో స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. మధ్యలో డెప్యూటేషన్‌పై 1981 నుండి 86 వరకు తిరుపతి దేవస్థానం తరుపున వ్యాసభాగవతం శుద్ధ ప్రతి (క్రిటికల్ ఎడిషన్) ప్రచురించే ప్రాజెక్ట్‌లో వీరిని పరిష్కర్తగా తీసుకొన్నారు. ఎన్నాళ్ళైనా అది నత్త నడక నడుస్తుంటే విసుగెత్తి మానేసి హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. వీరి కుమారుడు బిటెక్ పాసై అమెరికాలో ఉద్యోగిగా ఉంటున్నాడు. కుమార్తె బెంగుళూరులో ఉంటున్నది.

పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారమ్మాయి శ్రీమతి ఝాన్సి పన్నాల వారి "పావక ప్రభ"కు ప్రతిపదార్థ తాత్పర్యాలను రాశారు. పావక ప్రభను శ్రీ ఎం దినకర్ ఇంగ్లీషులోకి "The Sojourn"గా అనువదించారు. డాక్టర్ శ్రీమతి

సుగుణ పన్నాలవారు "జిల్లెల్లమూడి అమ్మ" గారిపై వ్రాసిన గ్రంథాలపై రిసెర్చి చేసి పి హెచ్‌డి పొందారు. పన్నాలవారు "యోగ వాసిష్ట సారం, రామదాసు చరిత్ర, శృంగార లహరి, అంబికా సహస్ర నామ స్తోత్రం, అంబికా సుప్రభాతం, అంబికా స్తవ కదంబం, అంబికా కరావలంబ స్తోత్రం" మొదలైన రచనలు చేశారు. అమ్మ ఆశ్రమానికి దాదాపు ఇరవై దాకా పుస్తకాలు రాసి అందజేశానని, తన వద్ద ఒక్క కాపీ కూడా లేదని తాను ప్రచారం కోరుకోలేదని ఆ "జ్ఞాన పండు" అతి వినయంగా నాతో అన్నారు. దీనికి నిదర్శనం వారి రచనల్లో వారి పేరు తప్ప ఏ విధమైన వివరాలు, విశేషాలు ఉండకపోవటమే. తనది ఒక భాషా సేవగా, అమ్మ పద సేవగా వారు భావించి జీవించారు. సంతృప్తి వారి జీవితంలో స్పష్టంగా కనిపిస్తుంది. భేషజాలు లేని వ్యక్తిత్వం, డబ్బుపండు లాంటి ఛాయా మనల్ని ఆకర్షిస్తాయి. గణపతి ముని రాసిన "ఉమా సహస్రం" కావ్యాన్ని అనువాదం చేశానని చెప్పారు. యోగ వాసిష్ట సారం ఇటీవలే రాశారు. 63 ఏళ్ళ జ్ఞాన వయోవృద్ధ శ్రీ పన్నాల రాధాకృష్ణ శర్మ గారిని వారింట్లో అక్టోబర్ 19 సాయంత్రం సందర్శించి మాట్లాడి ధన్యుడనయ్యాను.

ఇప్పుడు వారి గీర్వాణ వాణీ విలాసాన్ని చూద్దాం– ముందుగా "శృంగార లహరి"లో స్నానిద్దాం. పన్నాలవారికి సర్వం జిల్లెళ్ళమూడి అమ్మగా దర్శనమిస్తుంది. ఆమెయే ఆయన శృంగార లహరి.

మొదటి శ్లోకం "యయా శక్త్యా బ్రహ్మ కమల నయన పాలనయన– జగత్ స్రష్టుం పాతుం ప్రళయ ముపనేతు చ కుశలా. యాయా వ్యాప్తం విశ్వం వసతి ఖలు యస్యాం జగదిదం– నమామాద్యాం దీవీం ముకుళిత కర స్తా మభ య దాం" మరొకటి– "నమే సంధ్యో పాస్తి ర్నచ విహిత కర్మ స్వభిరతి– స్త్వ దీయాంఘ్రీ ద్వంద్వం విధి వదసి నాభ్యర్చిత మహో కిమాలోక్య వ్యర్థే మయి భావా సి జనని– తవైత ద్వాత్సల్యం వదతి భవతీం విశ్వ జననీం"

సంస్కృత కవితాప్రవాహం శంకరాచార్యుల సౌందర్య లహరిని తలపింప జేస్తుంది. జిల్లెళ్ళమూడిని "అర్కపురి" అన్నారు. అమ్మ దివ్య చరిత్రయే ఈ లహరి ఆమె హంసత్వాని వర్ణిస్తూ చెప్పిన శ్లోకం పరమ గంభీరంగా ఉంది.

"భజంతే హంసా స్తంవిధి మసి నిషేవ్యోదక పయో- విభాగ ప్రాశస్త్యం తవ తు చరుణౌ సేవిత వతాం

కృతార్థానాం నీరం భవతి విమల క్షీర మహంప్రభవం క స్తోతుం ప్రభవతి శుభే తావక మిహ"

చివరగా ఒక శ్లోకం-

"క్వణన్మంజీరం భో జనని విచారంత్యాం త్వయి భ్రుశం- నటంత స్వానందం సరభస ముం దృశ్యా దివి పదో
ముదాభ్య ద్గచ్ఛంతో విదరతి సుతిం తే శివ కరీం- క్రుతార్థా కృత్వా యాం దదతి పరమానంద లహరీం"

"అమ్మ" శ్రీ లలితా పరా భట్టరికను దర్శించి పులకించి అనుభూతి తను పొంది మనకు ఆ ఐశ్వర్యాన్ని కలిగించారు పన్నాల మహాశయులు.

వీరి రెండవ కావ్యం "పావక ప్రభ" ఇదీ అమ్మ మీద రాసినదే. దీనికి డా. ధూళిపాళ అర్క సోమయాజులుగారు ముందుమాట ఆంగ్లంలో రాశారు. జగన్మాతను స్తుతించి అద్భుత స్తోత్రం అన్నారు. ఇందులో "భ్రూ మధ్యే నవ కుంకు మం" శ్లోకం పరమ రామణీయకం అన్నారు. ఇందులో సాక్షాత్తు శ్రీ రాజ రాజేశ్వరి అమ్మవారిని జిల్లెళ్ళమూడి అమ్మవారిలో తాదాత్మ్యంగా చూసిన "లో చూపు" ఉందన్నారు. అలాగే "యతో విద్యా అవిద్యా, శ్లోకం, 66వ శ్లోకం, 71వ శ్లోకం కవిగారి బావుకతకు, భక్తి తాత్పర్యాలకు పరాకాష్ట అన్నారు.

రెండవ శ్లోకం చూద్దాం-

"ఏకాకితా ముపగతే జన మండలీనాం- మధ్యే చిరన్నివ వినిర్మల శాంతి సౌధే
కల్లోలిత పరమ పుణ్య పదే చ పాపం- చిన్వన్ సచిత్ర మనుజో విలసత్ప్రజస్రం"

చివరగా-

"అనవరత ముపాసే తాం సముద్రాంబు పూరాంకరుణ కిరణ లక్మఖేలయా పీయ భూయే
నవ జలధరం లాలీలయా భూత ధాత్రీ- రచయితి నవ సస్య స్యమాలాంయా సావిత్రీ" అని ముగించారు. అణువణువునా ప్రత్యక్షరంలో అమ్మ ప్రేమామృతమే

కనిపిస్తుంది. ఆమెది పావక ప్రభ అంటే అగ్ని కాంతి అనగా పవిత్రం, పుణ్యలోక ప్రాప్తికరం. తాదాత్మ్య భావనతో శర్మగారు రాసి చిరకీర్తి నార్జించారు. వారు రాసిన స్తోత్రాలు సుప్రభాతాలు అన్నీ నిత్యం జిల్లేళ్ళమూడి అమ్మ గుడిలో గానం చేస్తారు. అంతకంటే వారికి అంకేం కావాలి. ఆ మాటే వారు స్వయంగా చెప్పారు నాతో.

అలాగే అమ్మ సుప్రభాతం, అంబికా ప్రపత్తి, శ్రీ చక్రేశ్వరీ స్తవం, అంబికా నవ మాలికా స్తవం రాశారు. దీనితోపాటు రాసిన "అంబికా కరావ లంబ స్తోత్రం" కూడా ప్రసిద్ధి చెందింది. అందులో నుంచి మచ్చుకు కొన్ని.. ఇది అర్థ తాత్పర్యాలతో ఉండటం విశేషం. మొదటి శ్లోకం– "ఏకైక మిత్రమితిమాం కలుషా స్సమస్తా- కర్షంత్య ధీరమతి దుర్బల చిత్త మేనం

నైరాశ్య భార నిహతస్య శివేనసూయే– మాతార్భవామి మమ దేహి కరావలంబం"

భావం– అనసూయా మాతా శ్రేయస్కరీ దైన్యం తో దుర్బల మనసుతో ధైర్యం చెడి ఉన్న నన్ను మిత్రునిగా భావించి పాపాలన్నీ వశ పరచుకొంటున్నాయి. నిరాశతో కుంగిపోయా. నాకు చేయూతనిచ్చి అదుకో. మరో శ్లోకం–

"త్వత్సన్నిధౌ ప్రశమితైరపి తే పరోక్షే– క్రోధోద్యతై ర్భయద సర్ప రాజై దస్టోప్యనన్య శరణ్యస్యశివే నసూయే– మాతర్భవాని మమ దేహి కరావ లంబం"
భావం– నీ పాదాల దగ్గరున్నప్పుడు నా అనుమానాలన్నీ తీరినట్లే ఉంటాయి. వదిలిపెట్టగానే పాముల్లాగా బుసలు కొడుతూ నన్ను కాటు వేస్తాయి. అలాంటి స్థితిలో నువ్వు తప్ప నాకు వేరే శరణు లేరు. కాపాడు తల్లీ.
"బంధూక పుష్ప రుచి కుంకుమ శోభి తాస్యే– సిందూర రాగ రమణీయ కపోల దేశే
నాసావరీణ కనక ప్రసవే నసూయే– మాతర్భవాని మమ దేహి కరావ లంబం"
మంకెన పువ్వు రంగు కుంకుమ బొట్టుతో నీ ముఖం శోభిస్తుంది. చెక్కిళ్ళు సింధూరం రంగుతో అందంగా, నాసిక సంపెంగ పువ్వును పరిహసిస్తున్నట్లున్నాయి. దివ్య తేజో విరాజమానమైన ఓ పరమేశ్వరీ నాకు చేయూత నివ్వు.

ఈ విధంగా శంకరాచర్యులవారి కరావ లంబ స్తోత్రానికి దీటుగా దీన్ని పన్నాలవారు, ఆపన్న శరణ్య "అమ్మ" చేసాయం కోరారు.

చివరి శ్లోకంలో–

"అంబా పదాబ్ద మధుపాన రతేన రాధా– కృష్ణాఖ్య మత్త మధుపేన కృతం మనోజ్ఞం స్తోత్రం భవదిద మనుత్తమ సౌఖ్య దాయి– తేషాం సదా సుకృతి నామిహ ఏ పఠంతి"

అంబిక చరణ కమలాల సేవ అనే మధువును తృప్తిగా గ్రోలి మత్తెక్కిన తుమ్మెద వంటివాడు. రాధాకృష్ణుడు (పన్నాల రాధాకృష్ణ శర్మ) అతని చేత మనోహరమైన ఈ స్తోత్రం రచింపబడింది. దీన్ని చదివిన పుణ్యాత్ములు సర్వోత్తమ సుఖాలను పొందురుగాక. మనోజ్ఞం, అనుత్తమం అనే పదాలను స్తోత్రానికి విశేషణాలుగా పన్నాల వారు వాడారు. ఇంతకంటే సుఖం లేనిది, సర్వోత్తమమైన సుఖాన్ని ఇచ్చేది అని భావం. ఆ సుఖం మామూలు సుఖం కాదు. మనోజ్ఞమైనది. అంటే మనసుతో మాత్రమే తెలియబడేది. అనగా సచ్చిదానందమైన సుఖం. నిర్మలమైన మనస్సు అంటే ఆత్మ. ఆత్మ యొక్క సుఖం ఆత్మకే తెలుస్తుంది. ఇతరులకు తెలియదు. కనుక ఈ స్తోత్రాన్ని సవిమర్శనంగా పఠించే వారికి రాగ ద్వేషాలు రహితమైన శుద్ధమైన ఆత్మగా మనస్సు ఉంటుందని ఫలశ్రుతి చెప్పారు. వివరణ కూడా వారే ఇచ్చారు. అందరం చదివి శుద్ధాత్ములవ్వాలని పన్నాలవారి అభీష్టం.

చివరగా "శ్రీఅంబికా నవరత్నమాలిక"లోని చివరి శ్లోకంతో సెలవు తీసుకొందాం–

"అంబా దివ్య పదార వింద భజనా– నందామృతా స్వాదిన– రాధా కృష్ణ మధు వ్రతేన కలితం బృందం స్తుతీనామిదం

ఆమోదం జనయత్సమస్త సుమన–స్సంఘస్య పృధ్వీ తలే– జీయాదా రవి చంద్ర తార మమలం– మాత్రా శిషాపోషితం"❁

## 405. శ్రీ గౌరీభట్ల రామకృష్ణ శర్మ (1934)

మెదక్ జిల్లా తోగూటమండలం. వెంకట్రావుపేటకు చెందిన కృష్ణశర్మ గారు మహా పండితులు. అవదానాలలో చేయి తిరిగినవారు. సికందరాబాద్‌లోని లాల్గుడిలో ఉన్న తూములూరి శివ రామ కృష్ణ శర్మ మునిసిపల్ సంస్కృత విద్యాలయం విద్యార్థి. అక్కడే మహా గురువులవద్ద సిద్ధాంత కౌముది, పంచ మహాకావ్యాలు అవధాన విద్యా నేర్చారు. ప్రసిద్ధ అవధానిగా పేరొందారు. సంస్కృతాంధ్రాలలో చాలా అవధానాలు చేసి సమర్ధతను చాటారు. 'కవి శార్దూల కిశోరం' బిరుదును శ్రీ యాదగిరి గుట్ట దేవాలయంలో శ్రీ ఖండవల్లి నరసింహ శాస్త్రి, శ్రీ మల్లాది దక్షిణామూర్తి శాస్త్రి గారల సమక్షంలో అందుకొన్నారు. సంస్కృతంలో విస్తృత రచన చేశారు. 'సహ బాల మానస పూజ' అనే 108 శ్లోకాల భారతంను యమకం లో రాశారు .మచ్చుకి ఒకటి –

"విలాపనం లపనం మామ మామిమాం – కలయ పాలయ పార్ధ కుటుంబినీం
స్వస్తితే స్తితోగ్రపరా భవత్ – నిస్త భారత భార వహ ప్రభో"❁

# 406. సంస్కృత ఊర్వశి కావ్యం రాసిన- శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి (1935)

**నె**ల్లూరు వేద సంస్కృత కాలేజి న్యాయ తర్క పండితులు, ప్రిన్సిపాల్‌గా పని చేసిన శ్రీ ఉడాలిసుబ్బరామ శాస్త్రి తిరుపతి ఓరియెంటల్ కాలేజిలో న్యాయ శిఖామణి కోర్సు చదివేటప్పుడే 'న్యాయ కుసుమాంజలి ప్రకాశిక' బాధ్యతలు చేబట్టారు. వీరి మొదటి సంస్కృత కావ్యం 'ఊర్వశి' రవీంద్రుని రచనకు గోపాలరెడ్డి తెలుగుసుతకు ఇది సంస్కృతీకరణ. ధారా శుద్ధి భావ గాంభీర్యం కావ్యం లో ఉన్నాయి – ఒక శ్లోకం

"దీపైర్మాణిక్య రూపై రనపగత విభా రూషిత ద్వారా దేశైః–కల్లోల ప్లోదిగీతై రపగత మాలిన స్మార వక్త్రాబ్జ శోభ – పర్యంకే విద్రమాణా మదిగత శయనా యాసి నిద్రాం నిశాయాం– క్వాపిత్వం కస్య వామ్కం సముపగత వతీతుల్య జన్మా జగత్యా" అని కవి ఊర్వశిని ప్రశ్నిస్తున్నాడు. నువ్వుపుట్టావా బాల్యం ఉందానీకు, ఎవరి ఒడిలో పెరిగావు, మణిమయ దీప కాంతులతో ద్వారా భూములే తరంగ నాదాలుగా మధుర గీతాలతో ఆనందిస్తూ, ప్రసన్నమైన మందస్మిత వదనంతో, పగడపు పానుపు పై పవ్వళించేనువ్వు ఎవరి ఒడిని పొంది ఉంటావు? మన భూలోక సౌందర్యాన్ని తిలకించి పులకించమన్నాడు కవి– "నిత్యం విలోకయ పవిత్ర భువం విశాలాం తీర్దే త్రభారత మహాజన వార్ధి తీరే– యత్రాక్ష సూత్ర వలయత్వ ముపాగతాభిః ఆఖాతి కానన తతి ర్మధురం నదీభిః" ఇందులోని శీర్షికలూ రమ్యంగా ఉన్నాయి – అమృత కలశం 'కావ్యం మోచర్ల రామకృష్ణయ్యగారి తెలుగు కావ్యానికి సంస్కృతీకరణం. 85 శ్లోకాలు. ఇది శ్రీ హరి చరితామృతం. స్వామి దైవత్వాన్ని బహుసుందరంగా చిత్రించారు. మచ్చుకొక శ్లోకం – "మాయాధ్వాంత నిశూదనాః సముదితాః కారుణ్య వారాశితః – ప్రేమాలోక సుధా రసాః సుజనతా హృత్కైర వామోదినః – క్షీరామ్బోది కన్యకానయన మొరానంద సందాయినః– మాం పాతుస్మిత చంద్రికా సముదయాః విష్ణో స్సదా శీతలాః" అంటే – మాయ అనే చీకటి పోగొట్టి, కనికరం అనే సముద్రం నుండి పుట్టిన, ప్రేమతో వికసించిన చూపులు అనే అమృతరసాన్ని చిలికించే సజ్జనుల హృదయ కమలాలను వికసింప జేసే పాల సముద్ర తనయ లక్ష్మీదేవి కి నేత్రానందాన్ని కలిగించే శ్రీమన్నారాయణుని చల్లని చిరు నవ్వులనే వెన్నెలలు నన్ను రక్షించాలి. ఇవి కాక శాస్త్రిగారు 'మూల స్థానేశ్వర సుప్రభాతం,సరస్వతీ సుప్రభాతం, అవధూత గీత, పూర్వ యక్షః, జవహర్ జ్యోతి సంస్కృత కావ్యాలు రాశారు. కాళిదాసు మేఘ సందేశాన్ని రెండు సర్గల కావ్యంగా సంస్కృతంలో రాసిన ప్రతిభామూర్తి.❁



## 407. పూర్వ మీమాంస భాష్య వార్తిక మత భేదాలపై పరిశోధన చేసిన – ప్రొఫెసర్ శ్రీ బూరగడ్డ నరసింహాచార్యులు (1944)

**జననం**

హైదరాబాద్ బాగ్ అంబర్ పేట చెందిన శ్రీ బి.నరసింహాచార్యులు 16-7-1944న కరీంనగర్‌జిల్లా ధర్మపురి పుణ్యక్షేత్రానికి చెందిన సంప్రదాయ వైష్ణవ కుటుంబంలో జన్మించారు. వీరి జననీ జనకులు శ్రీమాన్ బూరగడ్డ రంగాచార్యులు, శ్రీమతి గోదమ్మ దంపతులు.

**విద్యా సోపానం**

శ్రీ నరసింహాచార్యులవారి ప్రాథమిక విద్య పితృపాదుల వద్దనే ప్రారంభమైంది. బాల్యం నుండి సాంప్రదాయబద్ధంగా సంస్కృతం అభ్యసించారు. వీరి గురువులు శ్రీమాన్ కోవిల్ కందాళై అప్పన్, శఠకోప రామానుజాచార్యుల వారు, శ్రీమాన్ మరిగంటి శ్రీ రంగా చార్యుల వార్లు. వానమామలై పీఠం 27 వ జీయర్ స్వామి వారి వద్ద ఉపదేశం పొందారు. వీరి ఆంగ్ల విద్యా గురువులు శ్రీ మాన్ కె రాఘవాచార్యులు శ్రీ హన్మంతరావు గారు మొదలైన ఉద్దండులు. 1 ఆంధ్రా మెట్రిక్ పాసై, ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి 1963లో బి.ఓ.ఎల్ (న్యాయం) చేసి, తరువాత సంస్కృతంలో ఎం.ఏ 1966లోను, సంస్కృతంలో పి.హెచ్‌డిలు పొందారు. రష్యన్ భాషలో అడ్వాన్స్‌డ్ డిప్లొమా 1985లో, గ్రాండ్ స్టెఫీన్స్ 1966లోను అదే యూనివర్సిటి నుంచి సాధించారు. సంస్కృత సాహిత్యం, కవిత్వాలలో తెలుగు సంస్కృత తులనాత్మక పరిశోధనలో, ప్రాచీన న్యాయశాస్త్రంలోను మిక్కిలి అభిరుచి ఉన్నవారు.

**ఉద్యోగ ప్రస్థానం**

హైదరాబాద్ తాండూర్ ప్రభుత్వ హై స్కూల్‌లో, ఒయాసిస్ పబ్లిక్ స్కూల్ ఢిల్లీ పబ్లిక్ స్కూల్‌లో తెలుగు సంస్కృత ఉపాధ్యాయులుగా ఉద్యోగం ప్రారంభించి, న్యు

సైన్స్ కాలేజి, సర్దార్ పటేల్ కాలేజిలో లెక్చరర్‌గా, 30 ఏళ్ళు లెక్చరర్, రీడర్, ప్రొఫెసర్‌గా సైఫాబాద్ పి. జి.కాలేజ్ ఆఫ్ సైన్స్, ఈవెనింగ్ కాలేజి, ఉస్మానియా యూనివర్సిటి కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్స్ లోను పని చేశారు. 10-11-1993 నుండి 2-3-1996 వరకు జులై 99 నుండి జులై 2001 వరకు, జూన్ 2003 నుంచి జులై 2004 వరకు, ఉస్మానియా సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేసి 2004లో రిటైర్ అయ్యారు.

**పరిశోధన పర్య వేక్షణ**

పూర్వపు ఆంధ్రప్రదేశ్ సంస్కృత అకాడెమి డైరెక్టర్‌గా పని చేశారు. సంస్కృతంలో యు.జి. మరియు పి.జి. బోర్డ్ ఆఫ్ స్టడీస్‌కు చైర్మన్‌గా,1996 నుండి సురభారతి సమితి సెక్రేటరిగా, నేషనల్ అసెస్మెంట్, అండ్ అక్రిడేషన్ కౌన్సిల్ కమిటీ మెంబర్‌గా ఉన్నారు. శ్రీ నరసింహాచార్యులుగారు అలంకార, తర్క, వేద వేదాంత, సాహిత్య, వ్యాకరణ శాస్త్రాలకు సంబంధించి 50కి పైగా పరిశోధన వ్యాసాలను రాసి వివిధ ప్రతిష్ఠాత్మకమైన విద్వత్ సభలలో సమర్పించిన ప్రజ్ఞాశాలి. 45 సభలకు అధ్యక్ష, ముఖ్య అతిథి, ప్రారంభ మరియు సమాపనోత్సవ గౌరవ అతిథిగా వ్యవహరించారు. రాష్ట్రీయ సంస్కృతి సంస్థ వక్తగా, NET, Ph D లకు పరీక్షకులుగా వ్యవహరించారు.

ఆచార్యులవారు 19 మంది విద్యార్థులకు ఎం ఫైల్ డిగ్రీకి , 5 గురికి పి.హెచ్ డి.కి గైడ్‌గా వ్యవహరించారు. 9 గ్రంథాలను రాసి ప్రచురించారు. సిలబస్ రివిజన్ కమిటీ మెంబర్‌గా, సెలెక్షన్ బోర్డ్ మెంబర్‌గా ఉన్నారు. రేడియోలో చాలా విషయాలపై ప్రసంగించారు. ఎన్నో సంస్థలకు గౌరవ అధ్యక్షులుగా ఉన్నారు.

**గ్రంథ రచన**

ధర్మ సూరి జీవితం సాహిత్యంపై క్లిష్టమైన (క్రిటికల్) పరిశోధన చేసి గ్రంథం రాశారు. దీనిని తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠం ముద్రించింది. రొద్దం నరసింహ ఆంగ్లంలో రాసిన 'యోగ వాసిస్టం'ను తెలుగులోకి అనువదించారు. 16వ శతాబ్దికి చెందిన యతీంద్ర మతదీపిక అనే శ్రీనివాసాచార్య సంస్కృత గ్రంథాన్ని తెలుగు చేశారు. వినోబా భావే హిందీలో రాసిన వేద చింతనను తెలుగులోకి అనువదించారు. మార్కండేయ పురాణంలోని హరిశ్చంద్రో పాఖ్యానాన్ని తెలుగు చేశారు. సంస్కృత అకాడెమి ప్రచురించిన యోగ సూత్ర సార, దాతు కారికలకు సంపాదకత్వం వహించారు.

మార్కండేయ పురాణం ఆధారంగా హరిశ్చంద్రోపాఖ్యానం, వినోబా భావే హిందీలో రచించిన వేదం చింతన, యోగ వాసిష్టంల నుండి ఎన్నిక చేసిన శ్లోకాలను తెలుగులోకి అనువదించారు. విశిష్టాద్వైత సంప్రదాయానికి మూలమైన నిబంధనావళిని 16వ శతాబ్దికి చెందిన 'యతీంద్ర మత దీపిక' అనే శ్రీనివాసాచార్యులవారి గ్రంథాన్ని అనువదించారు. దీనినీ తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురించింది.

ఆచార్యులవారు సంస్కృత సాహిత్య వల్లరి, సాంప్రదాయంలో సాహిత్య సౌరభం, ఆలోచనామృత ఝరి, 'వృక్షాయుర్వేద' అనే వ్యాస సంకలనాలను ప్రచురించారు. పద్మ పురాణం పాతాళ ఖండంలో 6 వేల శ్లోకాలు, రామాయణంలో అయోధ్యాకాండ,

వ్యాఖ్యానాలపై విశ్లేషణ చేశారు. సంస్కృత అకాడెమి ప్రచురించిన 'యోగ సూత్ర సార', 'ధాతు కారిక' గ్రంథాలు ఉస్మానియా సంస్కృత పరిశోధన జర్నల్, సంస్కృత అకాడెమి జర్నల్, ఉస్మానియా విశ్వవిద్యాలయ డిగ్రీ సంస్కృత పాఠ్య గ్రంథాలు వీరి సంపాదకత్వంలో వెలువడ్డాయి.

**గౌరవ పురస్కారాలు**

విద్వత్తుకు తగిన పురస్కారాలను, సన్మానాలను శ్రీ నరసింహాచార్య అందుకొన్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం సురభారతీ సమితి, సంస్కృత అకాడెమి, రాష్ట్రీయ సంస్కృత సంస్థాన్, ఆంధ్రప్రదేశ్ శ్రీ వైష్ణవ సంఘం, సర్వ వైధిక సంస్థానం, వరాహ క్షేత్రం మొదలైన సంస్థలు ఆచార్యులవారిని గౌరవించి సన్మానించాయి.

**విశ్రాంత జీవితంలోనూ సేవా కార్యక్రమాలు**

ఉద్యోగ విరమణ తర్వాత 'సురభారతి సమితి' కార్యదర్శిగా అనేక విధాల అధ్యాపన సాహిత్య, ఆధ్యాత్మిక గ్రంథ రచన ద్వారా భాషా సేవ చేస్తూ ప్రస్తుతం సురభారతి ఉపాధ్యక్షులుగా సేవలందిస్తున్నారు.

**వీరి రిసేర్చ్ పేపర్లలో ముఖ్యమైనవి–**

ధర్మ సూరే మల్లినాధస్య, అధమార్ణత్వం, రాసకలిక, సీతారామ విహార కావ్యధూర్త సమాగమం మొదలైనవి. ఈ క్రింది 10 గ్రంథాలకు పీఠికలు రాశారు.

1. Purvamimsa Bhashyavartikayormatabhedanamadhyayanam, M.Phil. Thesis in Sanskrit, A. Yajnaramulu, 1993.
2. Nirnaya Sindhu, Dr.K.Narasimhacharya, 1994.
3. Sri Gayatri mantrakshara mala, Sri K.Suryanarayana, 1995.
4. Sri Alavandar Strotram, Burgula Ranganatha Rao, 1995.
5. Telugu loni vinnapasahitya Samiksha, Ph.D. Thesis, K.Prumallacharya, 1996.
6. Andhralankara Vangmaya Charita, Ph.D.Thesis, S.G. Ramanuja Charya, 1998.
7. Vaidika Chandah Sastram, P.Koteswara Sharma, 2000.
8. Ramanuja Sampradaya Saurabham, Sriman Samudrala Srinivasacharyulu, 2004.
9. Kutova manusham, Dr.A.Prabhavati Devi, 2002.
10. Nuti Manjari, Bhallamudi Radha Krishnamurthy, 2003.
11. Surya Satakam, Ummadi Narasimha Reddy, 1999.

## 408. విద్యావారిధి- శ్రీ చింతలపాటి పూర్ణానంద శాస్త్రి (1935)

నెల్లూరు సంస్కృత కాలేజిలో సంస్కృత వ్యాకరణ పండితులైన శ్రీ శాస్త్రి, ప్రిన్సిపాల్‌గా రిటైర్ అయ్యారు. సంస్కృత సమాస విషయాలను 'సమాసపారిజాతః 'గా రాశారు. రాష్ట్రీయ విద్యా పీఠం నుండి 'విద్యా వారధి' పొందారు. శాస్త్రార్థాలలోను వ్యాకరణ శాస్త్ర నిర్ణయాలలోను అందే వేసిన చేయి శాస్త్రి గారిది. ❁

## 409. బాల నైషధకర్త - శ్రీ సముద్రాల లక్ష్మయ్య (1937)

నెల్లూరుజిల్లా గూడూరు దగ్గర కాట్రకాయల గుంటలో 19-11-1937న జన్మించారు. కొత్తపాలెం ఓరియెంటల్ ఉన్నత విద్యాలయం లోచదివి, ఏర్పేడు వ్యాసాశ్రమ శిష్యులుగా అనేక గ్రంథాలు రాశారు. తిరుపతి ప్రాచ్య కళాశాలలో ఉద్యోగించి అనంతరం 'బాలనైషధ' కావ్య రచన చేశారు. కావ్య వ్యాఖ్యాన గ్రందాలనేకం తెలుగులో రాశారు. శ్రీ మళయాళ 'యతీంద్ర ఉపదేశామృతం'



సంస్కృత కావ్యం రాశారు. స్వామి వారి వేదాంతాన్ని లలిత సుందరంగా అందించారు. "అగ్నేః సందుక్షణే ధూమః ప్రథమం దృశ్యతే తతః - జ్వాలా దేదీవ్య మానా స్యాత్తదాత్మధ్యాన వర్తినాం" ఒక మచ్చు శ్లోకం.
దివ్య జనన్యాఃశారదా దేవ్యాః ఉపదేశామృతం, శ్రీ తిరుమాంబా సుప్రభాతం, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర సుప్రభాతం, గొల్లా పురాంబాస్తుతిః వివేకానంద సూక్తయః వీరి ఇతర గీర్వాణ రచనలు. ❁



## 410. అవధాన సరస్వతి డాక్టర్ శ్రీ ప్రసాద రాయ కులపతి (1937)

23-1-1937 న శ్రీ ప్రసాదరాయ కులపతి ప్రకాశం జిల్లా ఏల్చూరులో శ్రీ పోతరాజు దంపతులకు జన్మించారు. సంప్రదాయ బద్ధంగా సంస్కృతాంధ్రాలు చదివారు. 19ఏళ్ళకే గొప్పకవిగా పేరు తెచ్చుకొన్నారు. ఆశుకవిత్వం అవధానాలులో జగత్ ప్రసిద్ధులయ్యారు. గుంటూరులో బి.ఏ, విశాఖలో ఏం ఏ, పిహెచ్ డి సాధించారు. 1956లో గుంటూరు హిందూకాలేజిలో లెక్చరర్‌గా చేరి క్రమంగా పదోన్నతి పొంది నలభై ఏళ్ళు పని చేసి ప్రిన్సిపాల్‌గా రిటైర్ అయ్యారు. 'అవధాన సరస్వతి, సాహితీ సార్వ భౌమ, రూపక సామ్రాట్, కవితా సుధారా మొదలైన ఎన్నో బిరుదులూ అందుకొన్నారు. 'రసవాహిని, ఆనంద యోగిని, రస గంగ, గాంధర్వ గీతి మొదలైనవి రచించారు సంస్కృతంలో శివత్రిశతి, అంబికా త్రిశతి, ఏంద్రీ సప్తశతి రాశారు. రిటైర్ అయ్యాక కుర్తాళం పీఠాధిపతులై శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వాములుగా విరాజిల్లుతున్నారు.❁

## 411. శ్రీ భూపతి సుబ్రహ్మణ్య శర్మ (1938-2002)

శర్మగారి గీర్వాణ రచనలు 'భద్రాచల రామ సుప్రభాతం, షిర్డీ సాయినాధ సుప్రభాతం, శ్రీ కృష్ణ రక్షణం అనే నాటకం. ఈ నాటకంలో కృష్ణదేవరాయల వైభవ చరిత్ర ఉంది.❁

## 412. విక్టోరియా రాణి చరిత్ర రాసిన- చింతపల్లి నృసింహ కవి (1940)

నెల్లూరుజిల్లా కనిగిరి తాలూకా గురురాజపేటలో చింతపల్లి నృసింహశర్మ జన్మించారు. తెలుగులో 'ఆంధ్ర కాదంబరి' రాశారు. సంస్కృతంలో 'విక్టోరియా మహారాణీ చరిత్ర' రాసి చరిత్ర ప్రసిద్ధులైనారు. ఆ రోజుల్లో అదొక వింతగా విడ్డూరంగా చెప్పుకొనేవారు.❁

## 413. గురుదైవ అద్వై స్థితికర్త – శ్రీ ఆకిలి శ్రీరామశర్మ (1940)

**తె**లుగు సంస్కృతాలలో పండితులై నెల్లూరు నగరానికే శోభామానులైన శ్రీ ఆకిలి శ్రీరామ శర్మ 'గురుదైవ అద్వైతస్థితి' అనే ఉత్తమ సంస్కృత గ్రంథ రచన చేశారు. యాభై 'భుజంగ ప్రయాత' వృత్తాలలో వ్రాయబడింది. కుర్తాళ పీఠాధిపతులుశ్రీ శివ చిదానంద భారతీస్వామి (ప్రసాద రాయ కులపతి) గురించిన స్తుతి, విన్నపాలు వారి వక్తృత్వ విన్యాసం మొదలైనవి ఇందులో పొందుపరచారు. శిష్యునికి గురువుపై ఉన్న భక్తి తత్పరతకు నిదర్శనం ఈ గ్రంథం. నారికేళ పాకం లో ఉంది. తేలిగ్గా మింగుడుపడదు నవిలి నవిలి తింటే అంతా అమృతమే. ఉదాహరణకు ఒక శ్లోకం – "అహంభావనా భావితాత్మాను భూతి ప్రదానే నిదానం నిదానే ప్రధానం– చిదానంద విస్ఫూర్తి సంమూర్తి మీదేశివం సంతతం త్వేక మేవా ద్వితీయం".

"స్థితం స్వేమ హిమ్నీక్షితే యోగి వర్యైః పరేవ్యోమ్ని చామ్నాత ముద్గీ ధనామ్ని– శ్రమేయ స్వహృత్సీమ్ని యత్తదామని ప్రభా భాసి యద్యేక మేవా ద్వితీయం అని ఎకమేవా ద్వితీయం అనే బ్రహ్మ సూత్రాన్ని పొందుపరచారు. రాసిలో చిన్నదైనా వాసిలో విశిష్టమైనది. శర్మగారు 'శ్రీ గురు వసంత పంచకం' పేర అయిదు శ్లోకాలు రమణీయంగా రాశారు.

"భావే భాజయామి పరమాదరిణం శ్రీ తేషు హకారక్రుతిన్వి విహితేషు యదా హితేషు – లోకాతి శాయి మహిమానమ నూన కీర్తిం శ్రీ మౌన విశ్రుత యతీంద్ర మతీంద్ర యజ్ఞం". 'రత్న పంచకం' అనే ఖండిక కూడా రాశారు ఇందులో చిదానంద స్వామివారినే అమ్మవారిగా భావించి, ఆరాధించి రాయటం విశేషం – "నమతాం శివతాం శ్యామాం శివ వామాంక వాసినీం ఆశ్రయే విశ్వ జననీం చిదానందైక రూపిణీం"– కుర్తా ళాన్నిత్రికూటాచలం అనిపిలుస్తారు. ఆ పర్వత ప్రాంతాన్ని వర్ణిస్తూ త్రికూట ప్రపాతోత్పన్ని ర్ఝ రామ్భః ప్రపూతో శ్రమ స్థాన మాశ్రిత్య తిష్టం – లసద్యోగ నిస్టాత్మ ద్రుష్టి ప్రహ్రుస్టస్య పాదాయపాయా చ్చివానంద యోగీ. ❁

## 414. శ్రీ గుణరత్న కోశం కర్త – శ్రీ టి పి శ్రీనివాస రామానుజం (1940)

**ఉ**పన్యాస బ్రహ్మ, తిరుప్పావై ఉద్గాత గా ప్రసిద్ధులైన రామానుజం గారు సంస్కృతంలో నిష్ణాతులు. డబుల్ గోల్డ్ మెడల్స్ ను ఎం ఏ లో పొందారు 'సాంప్రదాయ సమన్వయము – రామాయణంపై పరిశోధన చేసి పి.హెచ్ డి సాధించారు. బెస్ట్ థీసీస్ అవార్డ్ దీనికి వచ్చింది. ప్రభుత్వ డిగ్రీ కాలేజిలో సంస్కృత లెక్చరర్‌గా ఉన్నారు. సంస్కృతంలో 'శ్రీ గుణ రత్న కోశః' ముకుందమాల, గోదా స్తుతి, దశావతారస్తోత్రం, భగవధ్యాన సోపానం రాశారు.❀



## 415. శ్రీ మేళ్ళ చెర్వు సుబ్రహ్మణ్య శాస్త్రి (1940)

ఒంగోలు మండలం ఉప్పుగుండూరు గ్రామవాసి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీ జగన్నాధ శాస్త్రి శ్రీమతి మహా లక్ష్మమ్మలకు జన్మించారు. భారద్వాజ గోత్రం. అనన్య సాధారణ పండితులు. చందవోలు శాస్త్రిగారైన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారి వద్ద సంస్కృత కావ్యాలంకార, వ్యాకరణ శాస్త్రాదులు నేర్చారు. తెనాలి సంస్కృత కాలేజిలో విద్యా ప్రవీణ అయ్యారు. సంస్కృతాధ్యాపకులయ్యారు. ఆంధ్ర సంస్కృతాలలో ఎం ఏ పొందారు. సంస్కృతంలో బహు గ్రంథాలు రాశారు. 'శ్రీ గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రిగారు శ్రీ రాఘవ నారాయణశాస్త్రి గారిపై 'అగ్ని పరీక్ష' అనే చిన్న నవల రాస్తే, అది ఉపవాచకంగా సెకండరీ స్థాయిలో బోధింపబడింది. దీన్ని ఆధారంగా శ్రీ శాస్త్రిగారి జీవితాన్ని ఒక యోగి చరిత్రగా భక్తి, జ్ఞాన యోగాలను చేర్చి మేళ్ల చెర్వు వారు సంస్కృత కావ్యంగా 'శ్రీ గురు చరితం'లో శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి గారిని గురించి సమగ్రంగా రాశారు. "శ్రీ దేవీ మానసానంద హేతవే ధర్మ సేతవే – గుర్వే శిష్య లోకస్య నమోవాకం ప్రశాస్మహే" అని గురు కీర్తన చేశారు. భావనా బృందావనం కావ్యంలో ముక్తక శ్లోకాలు రాశారు. 'సాలభంజికా సూత్ర దారం, లాలితానంద లహరి, స్తన్య ధారా స్తవం రచించారు. ఇందులో ఒక శ్లోకం – "హే నిత్య ప్రసావిత్రీ తే స్తన యుగం ధారా ధారా హ్రీకరం– క్లీం మధ్యాకృతి మాత్రుగాదర గృహీత స్వాదితం భావయే – శ్రీ పీయూష ముపాస్య యస్య కవయ స్వేం బీజ వాజీ కృతా – అన్నాముత్ర జయంతి హస్తః – సుమనస్యో

రాజ్య రారాజితాః

'వేదనాద స్తవం'లో "శరీరే యూపా గహనా కశేరుకా – విజ్ఞాన సంబంధా మనసే మే జడస్య – ఆలస్య కచిద్ గోపికా  హంత సుప్తా – నూనం కించిత్ స్రుప్రశతీ వాద్వ యోక్త్రం" అన్నారు.

'వేదనా నివేదనం' కావ్యంలో శిఖరిణీ శార్దూల విక్రీడి తాలలో కవనాన్ని కదం తొక్కించారు.– "కిం దుఃఖం కిం సుఖం కిం శుభమితి మానసా వర్తమానాతీతం–నిశ్చేతుం పంగ గుబుద్ధిః –సతతామిద మా విశ్వాసజే ధ్యేయ్యమానః

ఇవికాక 'పరి ప్రశ్న మంజరి', లింగ దర్శనం, కర్మ వాద నిర్మధనం, దయా దారిద్ర్యం, పరకాయ ప్రవేశ స్తోత్రం, తత్వ మంజరి, నమశ్శివాయ, బిన్దుమాలినీ స్తవం, రఘు కౌత్సం, నిరపంనప ద్వాదశి, శివ దోష స్తుతి, అంగార కృష్ణాగారః మొదలైనవి రాశారు.

సంస్కృత భాగవత దశమ స్కంధంలోని 'శృతి గీతాలు'కు 'ప్రియతిసా' పేర ఆంధ్ర టీకా, పద్యానువాదం చేశారు.  శాస్త్రిగారు 17 సంస్కృత సాహిత్య రచనలు, ధాతు కోశ పదకోశం వంటి 3 నిఘంటువులు, 12 తెలుగు గ్రంథాలు, జ్యోతిషంపై 3 ఆంగ్ల గ్రంథాలు, 14 తెలుగు వ్యాఖ్యానాలు, శ్రీ రావి మోహనరావు గారితో కలిసి తెలుగులో "సిద్ధాంత సింధు" సంస్కృతంలో స్వీయ సంపాదకత్వం లోనూ, బెల్లంకొండ రామరాయ కవి 'రమా వల్లభ రాయ శతకం'కు సంస్కంత వ్యాఖ్య, 13 ఆంధ్ర అనువాద గ్రంథాలు, సరళీకరణ గ్రంథాలు తెలుగులో 5 రచించిన పుంభావ సరస్వతీమూర్తి.❁

## 416. శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ (1940)

**సి**ద్దిపేట ప్రభుత్వ జూనియర్ కాలేజి తెలుగు లెక్చరర్ అయిన పద్మనాభ శర్మగారు 'అద్వైత గీత' సంస్కృత రచన చేశారు.  తెలుగు వ్యాఖ్యానమూ రాసి 'దర్శన' మాసపత్రికలో ప్రచురించారు.  గురుకుల విద్యాభ్యాసం తర్వాత అద్వైత వేదాంతాన్ని నేర్చారు.  కరీంనగర్, మంధనిలలో సంస్కృత విద్వాంసులున్నారు కాని సంస్కృత రచనలు చేసినట్లు కనిపించదు.❁

## 417. వసుచరిత్ర నాటకకర్త- సుసర్ల కామ శాస్త్రి (1940)

**బొ**బ్బిలిలో సుసర్ల చాయాంబ, సుబ్రహ్మణ్యలకు కామశాస్త్రి జన్మించాడు. బొబ్బిలి రాజు రంగారావు బహద్దూర్, వెంకట గిరి రాజా ఆస్థానకవి. వెంకటగిరిలో వెలుగోటి వెంకట కృష్ణ యాచేంద్రకు ప్రీతిపాత్రుడై, ఆయన సలహాతో 'గిరికా కళ్యాణం' అనే అయిదు అంకాల నాటకం రాశాడు. దీని మాతృక తెలుగులో రామరాజ భూషణుడు రాసిన 'వసు చరిత్ర' ప్రబంధం. వసుచరిత్రను ముందుగా సంస్కృతంలో అనువాదం చేసినవాడు కాళహస్తి కవి అని మనకు తెలుసు. శ్రీధర పేరి సూరి దీనినే 'వసుమంగళనాటకం'గా రాశాడు. బాబానృపాలుడూ ఇదే పని చేశాడు. కామశాస్త్రి ఆ కోవలో మూడవ వాడయ్యాడు.

కామశాస్త్రి ఈ నాటకంలో కొన్ని కొత్త పాత్రలను ప్రవేశపెట్టాడు, కొన్ని మార్పులూ చేశాడు. నాటక శాస్త్ర మర్యాదలనన్నిటికి సమాధానంగా కొత్త సాంకేతికతో దీన్ని చేశాడు. కాని టెక్నాలజీ యే మిగిలింది కానీ నాటక కళ దెబ్బతిని పోయింది. నాందీవాక్యం - "శ్రేయసే భూయసే భూయా ద్రాజ చూడామణి గిరావః - గిరిజా వదనాం భోజ చంచరీక ద్రుగస్చలః".

అయిదు అన్కాలకు 1) గిరికా దర్శనం 2) అమరావతి ప్రస్థానం 3) మహేంద్ర కృత ప్రతిజ్ఞ 4) కోలాహల కన్యాదాన ప్రతిజ్ఞా 5) గిరిక కల్యాణం అని పేర్లు పెట్టాడు. రామరాజకవి వాడిన శ్లేషలను సంస్కృతంలోకి దింపే ప్రయత్నం చేశాడు. వసురాజును చూసి గిరిక లేవ బోతుటే వద్దని మర్యాదగా చెప్పిన శ్లోకం-

"గుణాల నాలాధిక సౌకుమార్యకా - న్యనయద్రుగంబా పానల చుమ్బితానిచ - క్షామాణితన్వంగి మద్విదేషు తే ముదూని గాన్నాన్యప చార కర్మణి" అని మర్యాద ఇస్తాడు.

అయిదవ ఆకంలో వసు గిరిక కల్యాణం వర్ణించాడు. అచ్చమైన తెలుగు ఇంటి పెళ్ళిలా మన పద్ధతిలోనే చేయించేశాడు పెళ్లి. ఫలశ్రుతి చెప్పాడు

"శ్రీ వెంకట గిరి నిలయః కరుణా రసా వృష్టి శమిత జన తాపః - పాయాన్నః కృష్ణ ధనః సమవర్ధిత సుకృతి జన కదంబో యం. ❁



## 418. సంస్కృతాంధ్ర ఆచార్య సార్వభౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి (1942-)

**తె**లుగు, సంస్కృతాలలో ఎం.ఏ.పి.హెచ్.డి చేసిన శ్రీ వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి గారు విద్యలకు పుట్టినిల్లు విజయనగరం జిల్లా దేవాడలో 22-09-1942న జన్మించారు. తండ్రిగారు వేదుల కృష్ణమూర్తిగారు తల్లిగారు మారువాడ వారి ఆడబడుచు వెంకట రమణ, రామలక్ష్మిగార్ల కుమార్తె శ్రీమతి రామలక్ష్మి.

**విద్యా వైదుష్యం**

శాస్త్రిగారు విశాఖపట్నం సి.బి.ఎం.హైస్కూల్‌లో సెకండరీ విద్య నేర్చి, మిసెస్ ఏ.వి.యెన్ కాలేజీలో డిగ్రీ చదివారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేరి తెలుగు, సంస్కృతాలలో ఎం.ఏ.లో ఉత్తీర్ణం సాధించి పిమ్మట ఆ రెండు భాషలపై గల అభిమానంతో పి.హెచ్.డి.లను కూడా పొందారు. విద్వత్ పట్టభద్రులైన తండ్రి కృష్ణమూర్తి శాస్త్రిగారు సంస్కృతాంధ్ర సాహిత్య తత్వాన్ని వాత్సల్యంతో ఉపదేశించారు. దానిని శాస్త్రిగారు సద్వినియోగం చేసుకొన్నారు. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో సంస్కృతాంధ్ర సాహిత్య వైభవాన్ని ఆత్మీయతతో బోధించారు. ఆచార్య గంటి జోగి సోమయాజిగారు. శాస్త్రిగారి గురు పరంపరలో కళాప్రపూర్ణ

దువ్వూరి వెంకటరమణశాస్త్రి, ప్రాచార్య, యశస్వి, ఎస్వీ జోగారావు వంటి ఉద్దండులున్నారు. విద్వత్ శిరోమణి, వాచస్పతి అప్పల సోమేశ్వరశర్మ పుత్రవాత్సల్యంతో ఎన్నో శాస్త్ర విజ్ఞానపు మెళకువలు కరతలామలకం చేశారు. సద్గురు శివానందమూర్తి మహర్షి సత్తముల ఉత్సాహ ప్రోత్సాహాలు అమృతవర్షమై శాస్త్రిగారిని తనియింపజేస్తున్నాయి. త్వమేవాహం భావాన్ని బోధించారు శ్రీ గట్టు నారాయణ గురూజీ సోదరులు. ఇంతమంది మహనీయుల ఆశీస్సులతో తమ విద్యా శాస్త్ర ప్రామాణ్యాన్ని మెరుగుపరచుకొన్న ధన్యజీవులు శాస్త్రిగారు.

## ఉద్యోగ సోపానం

తెలుగు గీర్వాణ భాషల లోతులను తరచి చూసిన శాస్త్రిగారు 1965–75 వరకు విశాఖపట్నంలో తాను విద్య నేర్చిన మిసెస్ ఏ.వి.యెన్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. 1975–2002 వరకు ఆంధ్రా యూనివర్సిటీలో లెక్చరర్‌గా చేరి, వరుసగా పదోన్నతి పొంది రీడర్‌గా, ప్రొఫెసర్‌గా ఎదిగి, తెలుగు శాఖ ముఖ్య ఆచార్యులుగా పనిచేసి పదవీ విరమణ చేశారు. 1976లో అమెరికాలోని విస్కాన్సిన్ స్టేట్ యూనివర్సిటీలో ఉద్యోగించారు. చదువుకున్న గురువుల వద్ద వారితోబాటు పనిచేస్తూ విద్యార్థులకు బోధించే అదృష్టం శాస్త్రిగారికి దక్కింది.

## సాహిత్యార్థంగి

శాస్త్రిగారి జీవిత భాగస్వామిని నిత్య జిజ్ఞాసువు అయిన శ్రీమతి ప్రభావతిగారు ఎం.ఏ. పట్టభద్రులు. సంస్కృతాంధ్రాధ్యయనం చేసిన విదుషీమణి. జీవితంలోనే కాక శాస్త్రిగారి సాహిత్యంలోనూ ఆమె సాబాలు (సగం పాలు) పంచుకొన్నారు.

## రచనా పాటవం

శాస్త్రిగారే చెప్పుకొన్నట్లు సాహిత్య జీవితంలో సాహిత్య ఆధ్యాత్మిక సాంస్కృతిక ప్రసంగాలు సహస్రాధికంగా చేశారు. వీటిని గ్రంథరూపంలోకి

తెచ్చి లోకానికి విలువైన గ్రంథాలను అందించారు. కనీసం 300 గ్రంథాలకు పరిష్కరణ పూర్వకంగా ముందుమాటలు సమీక్షలు రాశారు. వివిధ అంశాలపై ఆకాశవాణిలో అనేక ప్రసంగాలను చేసి శ్రోతలను మెప్పించారు. శాస్త్రిగారి శిష్యపరంపర అగణితం.

శాస్త్రిగారు తమ సంస్కృత విద్వత్తును సార్థకం చేసుకొన్నారు. పఠన, పాఠనలేకాక గ్రంథ రచనా చేశారు. సంస్కృతంలో 1) వరూధినీ 2) కల్యాణం అనే ఏకాంకికలు 3) తత్వ మసి అనే మూడు రచనలు చేశారు. ప్రవర వరూదినుల విషయం పెద్దనగారి మనుచరిత్ర మాతృకగా కలది. ఇదే వీరి తొలి రచన కూడా. కల్యాణం ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వర కల్యాణం. దీనిని గురుదేవులు దువ్వూరి వారికి అంకితమిచ్చి గురూణం తీర్చుకొన్నారు. కాని దువ్వూరి వారి జీవితకాలంలో పుస్తకం రాలేదు. వారి మరణానంతరమే వెలువడింది. మద్రామాయణేపురుషార్ధ వివేకః అనే గ్రంథాన్ని రాశారు– ఇది ఇప్పటికి అముద్రితం.

తెలుగులో చాలా గ్రంథాలు రాశారు శాస్త్రిగారు. అందులో అష్ట దిగ్గజాలు, భాగవత సుధా, పంచతంత్ర చంపుపు, ఆధ్యాత్మిక వ్యాసమంజరి, భారతంలో శాంతిపర్వం, భారత భారతి, సుబ్రహ్మణ్య భారతి, జానపద గేయ సాహిత్య ప్రభ, శంకర భగవత్పాదుల శివానందలహరికి, సౌందర్య లహరిలకు వ్యాఖ్య, ఆధ్యాత్మ రామాయణంలో అపూర్వ కల్పనలు రాసి సంస్కృత ఆధ్యాత్మ రామాయణాన్ని తెలుగులోకి అనువాదమూ చేశారు. అలాగే సంస్కృత అద్భుత రామాయణాన్నీ తెలుగు చేశారు. బాల రామాయణం, రామాయణ ప్రసంగ లహరి రాశారు. ఉత్తర రామాయణం వాల్మీకి మహర్షి రచన కాదని శాస్త్రిగారు తేల్చి చెప్పారు. ఉత్తరకాండ పేరుతో సంక్షిప్త సరళ వచన రచన చేశారు. రామాయణంలో ఇంతటి విశేష కృషి చేసిన శాస్త్రిగారు భాగవతం వైపుకు దృష్టిని మరల్చి భాగవత రసాయనాన్ని కడుపార గ్రోలమని అందించారు. తిరుమల తిరుపతి దేవస్థానం తరపున బ్రహ్మ వైవర్త పురాణానువాదం చేసి లోకోపకారం చేశారు. ఆదిశంకరాచార్యులవారు రాసిన అయిదు ప్రకరణాలు 1) అపరోక్షానుభూతి 2) ఆత్మబోధను తెలుగు చేశారు. శతక సాహిత్యంలోనూ ప్రవేశించి శంభూ శతకం

రాశారు.

మాఘ మహాకవి సంస్కృతంలో రచించిన శిశుపాల పదకావ్యంలోని అమూల్యమైన విశేషాలను రసజ్ఞులకు పరిచయం చేయాలన్న సత్ సంకల్పంతో మాఘ కావ్యామృతం రచించారు. వివిధ పత్రికలలో ప్రచురితమైనవి, జాతీయ సదస్సులలో సమర్పింపబడిన పత్రాల వ్యాసాలను భారద్వాజ వ్యాసావళిగా ప్రచురించారు. వీరి పుస్తకాలను కొన్నింటిని కరీంనగర్ జిల్లా మంథనిలోని శ్రీ సీతారామ సేవా సదన్‌వారు సభక్తికంగా ప్రచురించి అందించారు.

**అందుకొన్న బిరుదులూ సత్కారాలు**

వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ఆచార్య సార్వభౌమ, విజ్ఞాన వివేక భూషణ, వాణీ విభూషణ, ఆధ్యాత్మిక రత్న, వాఙ్మయ కళా ప్రపూర్ణ, సాహితీ కళా సమ్రాట్, ఆంధ్ర రత్న బిరుదులు అందుకొన్నారు. ఇవన్నీ అన్వర్థాలే నని మనకు తెలిసిన విషయమే.

నడిచే సరస్వతి అనిపించే శాస్త్రిగారికి విశాఖపట్నం శ్రీ శంకర మఠం సంస్థానం సువర్ణ సింహలలాటంతో సత్కరించి సన్మానించింది. శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి వారి స్వహస్తాలనుండి సువర్ణ కంకణ సన్మానం అందుకొన్నారు. సద్గురు శ్రీ కందుకూరు శివానందుల సంస్థ నుండి శ్రీ శివానంద ఎమినెంట్ సిటిజెన్ పురస్కారం అందుకున్న పుంభావ సరస్వతులు శాస్త్రిగారు. వివిధ సాహిత్య ఆధ్యాత్మిక సంస్థలు విశిష్ట వ్యక్తులు శాస్త్రిగారికి చేసిన సత్కారాలు లెక్కకు మించి ఉన్నాయి.

73 వసంతాల శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సాహిత్య ఆధ్యాత్మిక విషయాలలో నిత్య యవ్వనులై వాఙ్మయ శారదా పీఠ పాదార్చన చేస్తున్న ధన్య జీవులు. ❁



## 419. అచ్చెరువు గొలిపే డాక్టర్ చెరువు సత్యనారాయణ శాస్త్రిగారి గీర్వాణ భాషా వైదుష్యం (1943- 1996)

**జనన విద్యాభ్యాసాలు**

శ్రీ చెరువు శేషయ్యశాస్త్రి, శ్రీమతి లక్ష్మి దంపతులకు సత్యనారాయణ శాస్త్రి గారు 07-09-1943లో జన్మించారు. మాతామహులు, సుప్రసిద్ధ కవి పండితులు, రుషి కల్పులు మంత్రవేత్త, వశ్యవాక్కు, కంచి పరమాచార్య శ్రీశ్రీ చంద్ర శేఖర యతీంద్రుల వారికి అతి సన్నిమితులు, బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారి ఇంటనే బాల్యం గడిచింది. ఆరవ ఏటనే సంస్కృత పంచకావ్య పఠనం ప్రారంభమై, ఎనిమిదవ ఏటనే సంస్కృతంలో "లింగోద్భవ వృత్తక" కావ్యం రాశారు. పదవ ఏట నైషధ కావ్యాన్ని అవపోశన పట్టారు. వ్యాకరణ సిద్ధాంత కౌముది, వేదాంత పంచదశి, నాటకాలంకార సాహిత్యాధ్యయనం పూర్తిచేశారు. మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులై, ప్రవేశ పరీక్ష రాసి, వ్యాకరణ విద్యా ప్రవీణ, సాహిత్య విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ సాధించి, సంస్కృతంలో ఎం.ఏ.పట్టా పొందారు. 1989 మే నెలలో ఆంధ్ర విశ్వ విద్యాలయం నుండి సంస్కృత మాఘ కావ్యం- ఆంధ్రీకృతులు- అనుశీలనంపై సిద్ధాంత వ్యాసం రాసి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీ సాధించారు.

**ఉద్యోగ సోపానం**

తెనాలి హయ్యర్ సెకండరీ స్కూల్‌లో సంస్కృత ఉపాధ్యాయులుగా ఉద్యోగం ప్రారంభించారు. తరువాత తాడికొండ సంస్కృత కళాశాల ప్రధానాచార్యులుగా,

గుంటూరు సంస్కృత కళాశాల అధ్యాపకులుగా చేసి, ఒంగోలు సంస్కృత కళావాల ప్రిన్సిపల్‌గా పనిచేశారు. తణుకు బాల సరస్వతీ సమాజ ప్రాచ్య కళాశాల ప్రధానాచార్యులుగా పదవీ విరమణ చేశారు.

**వరించిన పదవులు**

ఆంధ్ర విశ్వ విద్యాలయం స్టడీస్ బోర్డ్, ఎక్సామినర్స్ బోర్డ్‌ల ఛైర్మన్‌గా, ఇతర విశ్వ విద్యాలయ స్టడీస్ బోర్డ్ సభ్యులుగా, ప్రశ్నపత్ర నిర్ణాయక సంఘ సభ్యులుగా శాస్త్రిగారి విద్వత్‌కు తగిన పదవులు లభించాయి. ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కళాశాల అధ్యాపక కార్యదర్శిగా, కలకత్తాలోని అఖిల భారత సంస్కృత సమితికి అఖిలభారత కేంద్ర సంఘానికి ఉపాధ్యాక్షులుగా సేవలు అందించారు. చెరువువారి సంస్కృతభాషా వైదుష్యానికి అచ్చెరువు నొంది లక్నో భారతీయ సంస్కృత సమ్మేళనం కార్యవర్గ సభ్యులను చేసింది. ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్స్, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ సభ్యులుగా కొనసాగారు. సజ్జాపురం లయన్స్ క్లబ్ సభ్యులై, తణుకు పట్టణంలోని నన్నయ్య భట్టారక పీఠం కార్యదర్శి పదవిని అలంకరించారు. వీరి సాహిత్య వరివస్య (సేవ ఉపాసన) అపారం.

**కవితా సామర్థ్యం**

ఏడవ ఏట నుండే చెరువువారు సంస్కృతాంధ్రాలలో శ్లోకాలు. పద్యాలు రాయటం ప్రారంభించారు. లెక్కకు మించి శ్లోకాలు, పద్యాలు రాసిన పుంభావ సరస్వతులు శాస్త్రిగారు. వారి నల్లని గుబురు మీసం సంస్కృత, తెలుగు కవిత్వానికి ప్రతీక. అనేక కావ్యాలు రాశారు. వాటిలో మూడే ముద్రితమైన ఖండకావ్యాలు. అముద్రితాలు చాలా ఉన్నాయి. నండూరి వారి ఎంకి లాగా శాస్త్రిగారు గ్రామ్య భాష పరిమళాల నద్దుతూ సుబ్బలచ్మి శతకం రాశారు. సంస్కృతంలో ఎంత ప్రతిభ చూపారో ఇందులోనూ తన జానపద కవితా వైదుష్యం చూపించారు శాస్త్రిగారు. చెరువువారి ఈ కృతీ అచ్చెరువే కలిగిస్తుంది. మచ్చుకొక పద్యం

సల్లా సల్లని సూపు సూసి దయతో సాకేవు నా సామి, ఈ
పిల్లే లచ్చిమి నాగ నున్నది, ననున్ పెమించేనా సామి, జ
న్మల్లా దానికి నీదు నామముతో నోరార బిలుస్తాను రా
సల్లా ఎంకటిసుబ్బ లచ్చి బతుకేలా నీవు లేకుండినన్

చెరువువారి ఈ కృతికి ముచ్చటపడి రిటైర్డ్ సబ్‌జడ్జి శ్రీ గాడేపల్లి సీతారామ శాస్త్రిగారు చెరువువారి సత్తిబాబు పావు శతకం (నక్షత్రమాల) అదే బాణీలో

రాసి తన గురుభక్తిని చాటుకున్నారు. గాడేపల్లివారి పద్యంలో పావువంతు రుచి చూపిస్తా చూడండి–

గుంటా ఎల్లమెగడ్డి కంటివి, బలేగున్నాది నీ ఎత్తు, ఏం
ఒంటో తిమ్మిరి గున్న దేంటి? అరె, మంచోడంటే ఊర్లోని వా
రెంటే తిర్గిరి నమ్మకంతొ చెయి మీదేవావొ తుత్పేస్త బా
గుంటే బాగనె ఉంట చెయ్యి పడితే ఊర్కొంటనా? రాను పో!

చెరువువారి కావ్య పరీమళం ఎన్నదగినది. పది, పన్నెండేళ్ళ వయసులో గజేంద్ర మోక్షం రాశారు. అందులో పోతన గారి అల వైకుంఠపురంబులో జోలికి పోలేదు. పదిహేనవ ఏట ఉమా కల్యాణం రాశారు. అవధానులు కందగల కవిత్వం చెప్పలేరు అనే మాట లోకంలో ఉంది. ఇది నిజం కాదని శాస్త్రిగారు రుజువు చేశారు. దండిమహాకవి దశ కుమార చరిత్రను శాస్త్రిగారు శ్రీ రాజవాహన విజయకావ్యంగా రాసి తన కవితా ప్రతిభను నిరూపించారు. కందగల కవిత్వం ఇందులో పొంగి ప్రవహించింది. 1960లో విప్ర లబ్ధ అనే కల్పిత కథా కావ్యం రాశారు. ఇది జయదేవ మహాకవి గీత గోవిందంకు తెలుగు పద్యమాల. రస భరితం కావ్య పరీమళ భరితంగా రాశారు. దీన్ని సుమారు పది హేడవ ఏటనే రచించారు. 19వ ఏట శ్రీ సుందరేశ్వర విలాసం రాసి బాణుని కాదంబరి, సూరనార్యుని కళాపూర్ణోదయంలలో ఉన్నట్లు మూడు జన్మల వృత్తాంతాన్ని అతి శక్తిమంతంగా ప్రబంధ శైలిలో, నిర్ఝర కవితా ధారగా రాశారు. దేవీ మహాత్మ్యంను శివ లీలా విలాసంగా దివ్య ప్రబంధంగా రచిస్తే, భక్తి జ్ఞాన వైరాగ్యాల త్రివేణీ సంగమంలా శృంగార కైవల్యం రచించారు. ఇది చెరువువారి అపూర్వ సృష్టి. ఇవికాక శాస్త్రిగారు పార్వతీ శతకం, ప్రతికాదంబరి, కళా మంజరి, యాతనా శతకం, సంస్కృత శ్లోకానువాదాలు, మదన విజయం అనే సాహిత్య రూపకం, అనామిక, సత్యం శివం సుందరం, ప్రాస్తానిక పద్య సముదాయం, పద్యమాలికలు రచించి శాస్త్రిగారు కవితా కాసారం (చెరువు) అని అనిపించారు.

సంస్కృతాంధ్రాలలో అలవోకగా అష్టావధానాలు చేయగల నేర్పు ఉన్నవారు శాస్త్రిగారు. తెలుగులో 125 అష్టావధానాలు, సంస్కృతంలో 25 అష్టావధానాలు చేసిన నేర్పరి. పూనా విశ్వ విద్యాలయ సంస్కృత విభాగంలో శాస్త్రిగారు చేసిన అష్టావదానం అక్కడి పండితులను పరవవింప జేసింది. తణుకులో శ్రీ నారాయణ భగవత్పాద సరస్వతీ సాహిత్య సంస్థ అభ్యర్థన మేరకు శాస్త్రిగారు 1996 ఏప్రిల్ 5,6,7 తేదిలలో సంపూర్ణ సంస్కృత శతావధానం చేసి పండిత ప్రకాండుల, సాహిత్యాభిమానుల ప్రశంసల నందుకొన్నారు. ఇది ఆంధ్రదేశంలో రెండవ సంపూర్ణ సంస్కృత శతావధానం. దీనిని శ్రీ నోరి భోగేశ్వరశర్మ గారి విశ్లేషణ వివరాలతో డా. చెరువు సత్యనారాయణ

శాస్త్రి సంస్కృత శతావధానంగా ముద్రించి అందజేసారు. భువన విజయంలో వీరు ఎన్నో పాత్రలు పోషించి మెప్పు పొందారు. శాస్త్రిగారి ధారణాశక్తి అతి రాక్షసం. అబ్బుర మనిపిస్తుంది.

విజయవాడ ఆకాశవాణి కేంద్రం నుండి శాస్త్రిగారు ఎన్నో సారస్వత ప్రసంగాలు చేశారు. కథానికలు వినిపించారు. ధాత ఉగాది కవి సమ్మేళనంలో ప్రధాన ఆకర్షణగా నిలిచారు. ప్రసిద్ధ కవుల గ్రంథాలకు విలువైన పీఠికలను సంతరించారు. వర్ధిష్ణులైన యువకవులను అమృతోపమానమైన ఆశీస్సులతో ప్రోత్సహించారు.

**బిరుదులు- సన్మానాలు**

సత్యనారాయణశాస్త్రిగారి ఆంధ్ర గీర్వాణ పాండిత్య కవిత్వానికి తగిన గుర్తింపు లభించింది. విద్వత్‌కు తగిన బిరుదాలను అందుకొన్నారు. చోడవరం ప్రసన్న భారతి వారు 26-01-1981న అవదాన వాచస్పతి బిరుదునిచ్చి సత్కరించింది. మచిలీపట్నంలో గ్రంథాలయ వార్షికోత్సవం సందర్భంగా 16-11-1986న అవధాన శిరోమణి బిరుదుతో ప్రశంసించి సన్మానించింది. హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ కళావేదిక విద్యా వాచస్పతి అందజేసి ఘనంగా సత్కరించింది. ఉభయ భారతిగా శాస్త్రిగారు సుప్రసిద్ధులు.

ఆంధ్ర విశ్వ విద్యలయం సత్యనారాయణ శాస్త్రిగారికి డాక్టరేట్‌ను ప్రసాదించిన సందర్భంగా సజ్జాపురం లయన్స్ క్లబ్ వారు సాన్మనం చేశారు. 24-05-1989న తణుకు రోటరీ క్లబ్‌లో ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్ గారిచే అభినందన సత్కారాన్ని నభూతోగా నిర్వహించింది. శాస్త్రిగారు ఎన్నో సాహిత్య సభలకు అధ్యక్షులుగా, నిర్వాహకులుగా, అవధాన సంచాలకులుగా, సమన్వయకర్తగా, వ్యాఖ్యాతగా వ్యవహరించి తమ సమర్థతను చాటారు.

**జీవితావధాన సమాప్తం**

ఇంత లబ్ధప్రతిష్ఠులైన గీర్వాణాంధ్ర కవి పుంగవులైన డా. శ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రిగారు దివిజ కవి వరుల గుండియల్ దిగ్గురనగ యాభై మూడు ఏళ్ళకే 14-11-1996 శ్రీ ధాతృనామ సంవత్సర కార్తీక శుద్ధ చతుర్ధి గురువారం ఉదయం అశేష సాహితీ ప్రియులను బంధుమిత్రులను అనంత శోక సాగరాన ముంచి అమరపురికేగారు.

శాస్త్రిగారి తణుకు సంస్కృత శతావధానం ఒక గొప్ప అనుభూతి, ముచ్చట. దానిని గురించి ప్రత్యేకంగా రాయాల్సిందే. రెండవ భాగంలో దాని వివరణలు రాస్తాను.

తణుకు పట్టణంలో శ్రీ కొవ్వూరు పెంద్యాల వెంకట్రాయుడు స్మృతి సభా

ప్రాంగణంలో అవధాన వాచస్పతి చెరువు సత్యనారాయణ శాస్త్రిగారి సంస్కృత సంపూర్ణ శతావధానం 1996 ఏప్రిల్ 5,6,7 తేదీలలో దేదీప్యమానంగా జరిగింది. అదొక పెద్ద పండుగలా, సాహితీ మహోత్సవంలా, అవధాన యజ్ఞంలా నిర్వహించారు. యజ్ఞ భాషలో శాస్త్రిగారిని సంస్కృత శతావధాన సోమయాజి, కొవ్వూరు ప్రాచ్య కళాశాల ప్రధానాచార్యులు డా. శ్రీ దోర్బల ప్రభాకర శర్మ గారిని హోతగా, కొవ్వూరు సంస్కృత కళాశాల అధ్యాపకులు డా. శ్రీ నోరి భోగీశ్వర శర్మ గారిని అధ్వర్యులుగా, ఆచార్య శ్రీ బేతవోలు రామబ్రహ్మం గారిని బ్రహ్మగా, రాజమండ్రి సంస్కృత కళాశాల ప్రధానాచార్యులు డా. శ్రీ విశ్వనాధ గోపాలకృష్ణ శాస్త్రి ఉద్గాతగా, సర్వ సాహితీప్రియులను సాహితీ మహా యజ్ఞ కవితా హోమధూమ సౌరభ ఆఘ్రాతలుగా పేర్కొన్నారు.

ఈ శతావధానంలో 21 వర్ణనలు, 21 దత్తపదులు, 21 సమస్యలు, 21 అనువాదాలు, 21 ఆశవాలు, 3 విశిష్ట ప్రశ్నలను మొత్తం 108ని పృచ్ఛక మహాశయులు సంధించారు. వీరందరూ కాకలు తీరిన సంస్కృత కవి పండితులే కావటం మరో విశేషం. ఇందులో మహిళామణులకూ గొప్ప ప్రాతినిధ్యం లభించింది. అవధానాన్ని శాస్త్రిగారు అతి సునాయసంగా అత్యంత వినోద సంభ్రమ భరితంగా రసభరితంగా రసిక జన మనోరంజకంగా గంగా ప్రవాహ సదృశ్య వేగంగా నిర్వహించి అందరికి మహదానందం కలిగించి అవధానం అంటే ఇలా ఉండాలి అనిపించారు. అనంతరం అవధాన శాస్త్రిగారికి "ఉభయ భారతి" బిరుదు ప్రభాకర శాస్త్రి ప్రదానం చేసి సత్కరించారు. శాస్త్రిగారు, అధ్యక్షత వహించిన శ్రీ దోర్బల ప్రభాకర శర్మ గారికి సంస్కృత శతావధాన ప్రభాకర బిరుదునిచ్చి సన్మానించారు.

ఈ అవధానం జరిగిన ఏడు నెలలకే శాస్త్రిగారు 14-11-1996న ఆకస్మాత్తుగా పరమపదించారు. శోకతప్తులైన గీర్వాణ కవితాలోకం వారి సంపూర్ణ సంస్కృత శతావధానంను గ్రంథరూపంలోకి తెచ్చి శ్రీ నోరి భోగీశ్వరశర్మగారి చేత తెలుగు భావ వివరణలు రాయించి, శాస్త్రిగారికి అంకితమిచ్చి ఋణం తీర్చుకొన్నది. ఈ గ్రంథం వర్ధిష్ణులైన వారికి కరదీపిక. ఇందులో శర్మగారు అందజేసిన విశేషాలను మీ ముందుంచుతున్నాను.

సత్యనారాయణ శాస్త్రి అవధానిగారు కవి మాత్రమే కాదు, శాస్త్ర గ్రంథాలలోని సైద్ధాంతిక గ్రంథాలను గురుముఖతా నేర్చి, మననం చేసినవారు. కాణాద, పాణినీయములను భాష్యంత వ్యాకరణలను నేర్చినవారు. అందుకే వ్యాకరణ శాస్త్ర సమ్మతమైన పదప్రయోగాలను ఈ అవధానంలో చేసి అర్థప్రతిపత్తి కలిగించారు. పాదపురాణాలలో తు.చ లను వాడనే లేదు. ప్రతిశ్లోకం రస అలంకార శోభతో, చమత్కృతి, భావ పుష్టితో విరాజిల్లింది. వేదశాస్త్ర పాండిత్యం జ్యోతిశ్శాస్త్ర నైపుణ్యం, లోకజ్ఞత పుష్కలంగా ఉన్నవారు

కనుకనే వాటిపై వచ్చిన ప్రశ్నలకు దీటైన సంతృప్తికరమైన సమాధానాలను శ్లోకాలలో చెప్పారు. వీరి సాహిత్య పటిమ అనిర్వచనీయం. లోక శాస్త్ర పరిజ్ఞానమూ మిన్నదైనదే. భావాన్ని బట్టి వృత్తాలను ఎన్నుకొని ఛందో వైవిధ్యం ప్రదర్శించారు. శ్లేషనూ సమాదరించారు.

బ్రహ్మశ్రీ చెరువు సత్యనారాయణ శాస్త్రిగారు మొదట తమ విద్యా గురువు మాతామహులు శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారిని సంస్మరిస్తూ మత్తేభ శ్లోకం చెప్పారు–

అవధానం సువిధాన మత్ర భవతా మానందసంధాయకం– భవతాదిత్య హమాశ్రయే యత మతి దీక్షాగురుం సంతతం

శివ మంత్రాక్షర మంత్రం చింతన శివా సేవావిశుద్ధం, హి,రా– ఘువ నారాయణ శాస్త్రి సద్గురు వరం కారుణ్య వారాన్నిధిం

తాత్పర్యం– ఈ అవధానం అందరికీ ఆనందాన్ని కల్గించాలి అని ఏకాగ్రమనస్సుతో నా దీక్షాగురువు, నిత్య శివ పంచాక్షరీ జపపరులు, శివా అంటే బాలా త్రిపుర సుందరీ దేవిసేవలో విశుద్ధులు, దయాసముద్రులు అయిన శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి సద్గురువులను నేను ఆశ్రయిస్తాను.

తర్వాత ఇష్టదేవతా ప్రార్ధన అధ్యక్షులను మిగిలిన వారిని స్తుతించి అవధానం విజయవంతం కావటానికి కారకులయ్యే ప్రస్టలను అంటే పృచ్ఛకులను శ్లాఘించారు.

ప్రస్తారః కమనీయ పూర్వ కవితా సౌందర్య పారంపరీ– ద్రస్టారోవివిధాధ్వరీ తిలసదర్వాచీన కావ్యావళీ

స్రస్టారో రస భావ బంధుర వినూత్నానేక కావ్య స్వయం– ప్రస్తారః పరిపాలయంతు కృపయా సౌజన్య రత్నాకరా: అ.న్నారు భావం– ప్రస్టలారా! మీరు కవితా సౌందర్యాన్ని పరంపరగా కనుగొన్న మంత్ర ద్రష్టలు సాహిత్యంలో వివిధ ప్రక్రియలలో కావ్యాలు సృష్టించిన వారు. రసభావ బంధురంగా ఎన్నో కొత్త కావ్య నిర్మాతలు. సౌజన్య రత్నాకరులు నన్ను దయతో పాలించండి.

మొదట వర్ణనలు గురించి కొన్ని తెలుసుకొందాం. బ్రహ్మశ్రీ రేకపల్లి వీర భద్ర శర్మ– తాడేపల్లి వారి కృతులలో అద్వైత భావన వర్ణించమని అడిగారు ఆధానిగారు.

"అద్వైతం శ్రుతి చోదితం చిద చితో స్వాత్మా సుభూతి స్తితం– కుంభా కాశ తరంగభాను కలనా దృష్టాంతం యుక్తిస్తిరం వెండి

శుక్తౌ రౌప్యవదశ్మని ద్వీరద వన్మృత్యుంభవ ద్యో జగత్– బ్రహ్మేధ్యస్త మితి ప్రదార్య తదదిదం జానాతి ముక్తో భవేత్" అని శార్దూల శ్లోకం చెప్పారు.

ముత్యపు చిప్పలో వెండి ఉన్నట్లుగా భ్రమించటం అదికాదని తెలిస్తే వెండిభావం

నశిస్తుంది. శిల్పంలో ఏనుగు కల్పితం అని గుర్తిస్తే శిలాజ్ఞానం పోతుంది. మట్టిలో కుండ ఉందని తెలిస్తే కుండ జ్ఞానం పోతుంది. నిజమైన వస్తువులలో అసత్యాలు గోచరించినపుడు వాటి కారణాలను అనుభవ పూర్వకంగా గ్రహిస్తే స్వరూప జ్ఞానం లభిస్తుంది. పరబ్రహ్మలో ఈ జగత్తు ఉందని నిర్ధారించుకొని మనన నిధి ధ్యాసలచేత ఘటంలో ఆకాశం లేదని తెలుసుకొన్నట్లే ఉపాధి గత లక్షణాలను విసర్జిస్తే చిత్ రూపమైన బ్రహ్మ ఏకత్వం అని గ్రహిస్తే ముక్తుడు అవుతాడు.

శ్రీ చిర్రావూరి శ్రీరామశర్మ పున్నమినాటి చంద్రుడిని వర్ణించమని కోరారు. శార్దూలంలో శ్లోకం చెప్పారు శాస్త్రిగారు.

దిక్కాంతా కుచ కుంభ యోర్ధ వలిమ ప్రావార మాసంజయన్– కుర్వన్విశ్వ మహోచ్చసౌధ శిఖరే సౌవర్ణ కుంభ భ్రమం

స్పర్శై కోమల శీతలైః సితరుచా తారా వధూ ర్హేపయనన్ జ్యోత్స్నా వైభవ శేష దిర్విజయతే రాకా సుధా ధేధిత

అంటే దిక్కులు అనే స్త్రీ కుంభాకార స్తనాల యందు తెల్లని దుప్పటి కప్పుతూ విశ్వం అనే మేడపైభాగంలో బంగారపు కలశాలేమోననే భ్రమ కలిగిస్తూ మృదువైన చల్లని తెల్లని కాంతి చేత స్పర్శించబడిన నక్షత్ర కాంతలకు కిచ కిచ లిచ్చే సిగ్గు కలిగిస్తూ వెన్నెల అనే సంపదకు నిలయం అయిన చంద్రుడు మహా గొప్పగా ప్రకాశిస్తున్నాడు. ఇందులో ఉత్ప్రేక్ష వైభవం ముచ్చట గొలుపుతుంది.

శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యం అవధానాన్ని గోదావరితో పోల్చమని అడిగితే–

"పూరే పూరే రసిక హృదయ క్షేత్ర మాసేచయన్తీ– నీరే నీరే మధుర మధురం స్వాదిమానం వహంతీ

చేతశ్చేతో హారతి కవితా మద్వాదానే నటంతీ– భూయో భూయః సరస సరసా గౌతమీవ స్రవంతీ" అని మందాక్రాంత వృత్తంలో సరస మనోహరంగా వర్ణించారు.

**భావం–** ప్రతి ప్రవాహంలో రసిక హృదయాలనే క్షేత్రాలను తడుపుతూ, కొత్త కొత్త నీటిని మధురమధురంగా తియ్యదనాన్ని ఇస్తూ, ప్రతి హృదయాన్నీ నా అవధాన కవిత ఆకర్షిస్తూ సరస సరసమైన గౌతమీ నదిలాగా మనసును ఇటువైపుకే ఆకర్షిస్తోంది.

వర్ణన అయిన తర్వాత కొన్ని దత్త పదులను దర్శిద్దాం– శ్రీ ధూళిపాళ మహా దేవమణి– మండపేట, వచ్చేశా, ఏదీ నీ సత్తా అనే పదాలిచ్చి సరస్వతీ దేవి ఆశీస్సుగా చెప్పమన్నారు.

"తపః ప్రీతా వత్స ప్రసభ మధునా త్వద్రుదయ మం–డపేటానీహత్వం జహిహి హృదయేదీన సరణిం

సుధా వచ్చేశా నుగ్రహ మహిత వీక్షా సుఖయతాం– వధానీసత్తా వాన్ విలసతు భవాన్ కీర్తి ధనవాన్"

వత్సా! నీ తపస్సుకు సంతోషించా. నీ మనసులో దైన్యం వదిలేయి అమృతంలాగా శివుని అనుగ్రహంతో పూజింపబడే చూపు నిన్ను సుఖ పెడుతుంది. ఇలా సత్త్వవంతుడివై కీర్తి దక్షతలు కలవాడిగా వర్ధిల్లు.

శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ– అజారుద్దీన్, కటల్, సచిన్ ప్రభాకర్ పదాలతో అవధానాన్ని క్రికెట్ ఆటతో పోల్చమని అడిగారు.

"అజారుద్దీవ దుష్ప్రాపః– కపిలౌల్య వివర్జితః– సచినోతివాదా నేద్యాం– క్రికకెద్వ్యాఖ్యాప్రభాకరః" అని చెప్పారు.

**భావం–** మేకలాగా అరిచే దీనుడికి దుష్ప్రాపుడు, కోతి చాపల్యం లేనివాడు, క్రికెట్ అనే ఆటకు కాంతినిచ్చే వాడైన అవధాని క్రికెట్ క్రీడను అవధాన ఇష్టిచయం చేస్తాడు. ఇప్పుడు సమస్యా వలయంలోకి ప్రవేశించి అందులోనుంచి శాస్త్రిగారు ఎలా తప్పించుకొని రాణించారో చూద్దాం.

సహప్రవధాని డా. గరికపాటి నరసింహారావు "దుర్వారూఢంప్రణమతి జనో విఘ్న నాశాయ నిత్యం" అనే సమస్యను ఇస్తే చెరువు అవధానిగారు మంద్రాక్రాంత శ్లోకంలో

"అర్వాచీనైః విషయ గణనా దూర్వహై ర్దుష్ప్రయం– సర్వారాధ్యం సకల విషయై స్వాగమై స్సంస్య మానం
శర్వా పత్యం గజవరముఖం పార్వతీ తోష హేతూం– దుర్వారూఢం ప్రణమతి జనో విఘ్న నాశాయ నిత్యం" అని పూరించారు.

**అర్థం–** విషయ బాహుళ్యంతో బరువవెక్కిపోతున్న నేటి జనాలకు అంతు పట్టనివాడు, అన్ని కార్యాలకు ఆరాధ్యుడైనవాడు ఆగమాలచే స్తుతింప బడినవాడు, పార్వతీ పరమేశ్వరులకు సంతోష హేతువైనవాడు మూషిక వాహనుడైన గజాస్యుడైన గణపతిని జనం విఘ్ననాశాలకోసం ప్రణమిల్లుతారు.

శ్రీ వారణాసి వెంకటేశ్వర శాస్త్రి ఇచ్చిన సమస్య– హహహాహా, హహహా, హహాహహః హహాహా హః హాహా హాహా ను అందరూ హాహా అనేట్లు మెచ్చుగా ఇలా మత్తేభస్వారి చేస్తూ పూరించారు.

"హహ హాహా హహాహ హహహాహా, హాహాహా, హహాహా, హాహహే
త్యనుయాటం నిజ కాంక్షిణం, పరిముహుప్సం ప్రార్థమానం రహః
అభిమానేన చ కాంక్ష యా ప్రణయతఃస్మేరాస్యయా హుం కృతం
– హహహాహా, హహహా, హహాహహః హ హాహా హః హాహా హాహ"

**భావం–** ఏకాంతంలో తాను ప్రియురాలిని గురించి హంకారం చేసి వెంబడించిన సందర్భంలో తనను కోరే ప్రియునిపై స్నేహం కొద్దీ అభిమానంతో ప్రియురాలిచేత హుంకారాలు చేయబడ్డాయి.

సన్యాసి ప్రతిరోజూ రతి సుఖాన్ని కోరుతున్నాడు అని శ్రీ కొంపెల్ల వెంకటరామశాస్త్రి ఇచ్చిన సమస్యను మహార్థవంతంగా మాలినీ వృత్తంలో చెప్పారు–

"యమనియమ విశిష్టో నైష్టికత్వేచ శిష్టః– శ్రుతిశిరసి నిగూఢంతత్వ మన్వేషమాణః

నిభ్రుత సుఖ మయోయం సంశ్రితో– యోగభూమీ రతి సుఖ మభి వాంచత్యన్వహం శాటికాటః"

**తాత్పర్యం–** యమనియమాలతో కూడిన నిష్టతో శిష్యుడైన శ్రుతుల అంతాలలోని రహస్య తత్వాన్ని అన్వేషిస్తూ, నిశ్చల సుఖమయుడై, యోగ భూమిని ఆశ్రయించిన సన్యాసి లోకాతీతమైన ఆనందాన్ని కోరుతున్నాడు.

చంద్రః ఖేలన మాచ రంతి విబుధాః సంసర్గతో వర్ధతే అనే సమస్యను శ్రీ ప్రభాకర శ్రీకృష్ణ భగవాన్ ఇచ్చారు. శాస్త్రిగారు ప్రశ్నా సమాధాన రూపంగాశార్దూలంలో పూరణ చేశారు–

"రాకాపూర్ణ విలాసినీ నిటలకే లాలాటికః కో భవత్– దైత్యేంద్రే దశ కంధరే వినిహతే కుర్వంతి కిం కే ముదా

దోషశ్చాపి గుణః కదం భవతి చేత్ ఏనం సమాదీయతే– చంద్రః ఖేలన మాచరంతి విబుధాః సంసర్గ తో వర్ధతే"

**అర్థం–** పూర్ణిమా అనే నుదుటబొట్టుగా నిలిచేది ఎవరు? చంద్రుడు. రావణుడు చనిపోతే ఎవరేం చేస్తారు? దేవతలు సుఖంగా క్రీడిస్తారు. దోషం గుణం ఎప్పుడవుతుంది? సహనం వలన అంటూ మూడుభాగాలు చేసి సమాధానంగా చెప్పి తన చాతుర్యాన్ని ప్రదర్శించారు. ఇప్పుడు అవధానిగారి అనువాద ప్రతిభను దర్శిద్దాం–

అనువుగాని చోట అధికులమనరాదు అన్న వేమన పద్యాన్ని సంస్కృతంలోకి అనువదించమని శ్రీ ఆర్ త్రినాధశర్మ కోరితే–

ఆశక్తతాయాం నాదిక్యం యుక్తం దోషో ల్పతా– దర్పణేపర్వతస్స్వల్పో దృశ్యతే ఖలు వేమన అని చెప్పారు.

శ్రీ కాశీభట్ట శేషయ్యశాస్త్రి– అడిగెదనని కదువడిజనునడిగి తనమగుడ నుదువడనినుడి యుదుగున్– వెడెడదచిడి ముడితడబడనదుగిదు జడిమ నదుగిదు వెడలన్ అనే పద్యాన్నిస్తే అంతే అందంగా

"పృచ్ఛామీతి ప్రచలతి– వతివవదతీతి చలతి నచలతి– స్థలతి చ పది పది– వివలతి న భవత్యేక త్ర జడమతిః కమలా" అని సొగసుగా గీర్వాణంగా మార్చారు.

యేమని చెప్పను? దుర్యోధనునిభార్య భానుమతి ఏకాంతంలో కర్ణుడితో చదరంగం ఆడుతోందని ఆకాశంలో తారలు చెవులు కొరుక్కుంటున్నాయి– అని శ్రీ

ఊరకొండల రావుగారి ప్రశ్నకు అవధాని–

"కిముచ్యతే యచ్ఛుతురంగ సక్తా– శుద్ధాంత రాజ్ఞీ కురునాయకస్య– కర్ణేన పాకం విజనే స్తి తేతి– కర్ణేజపావ్యోమ్ని విలోక్య తారాః" అని సంస్కృతీకరించారు.

మరిప్పుడు ఆశువులోకి సులువుగా ప్రవేశిద్దాం.

అవధానిగారి మీసాలపై శ్లోకం చెప్పమని శ్రీ ఎస్.వి.రాఘవేంద్రరావు అడగగా–

"గీర్వాణాంధ్ర గిరాం ధురంధర మతి స్నిగ్ధ ప్రచారోచ్యతే– దర్పా వేశిత చంచ రీక విలస్తృత్రావలీ సుందరే

స్మేరాంకూర సిత ప్రకాశ మిలవాత్ జ్యోత్స్నా తమ శ్రీకరే– కావ్య శ్రీ హృదయం గమే విలసతః మామ శ్మశ్రుణీ" అని మీసాల పద్యం దర్జాగా చెప్పారు.

**అర్థం–** గీర్వాణ, ఆంధ్ర ప్రచారోద్యమాలు, అహంకార ఆవేశాలు గల తుమ్మెద రేకుల్లా అందమైన, చిరునవ్వు మొలకకు సంబంధించిన తెల్లని కాంతి కలియటం వలన వెన్నెల, చీకటి సంపదలను కలగజేసే కావ్యశ్రీ హృదయ మనోహరమైన నా మీసాలు బాగా ప్రకాశిస్తున్నాయి. వెంకట శాస్త్రిగారు కూడా రెండు భాషలకు మేమె కవీశ్వరులం అని తమ మీసాలు చెపుతున్నాయని చమత్కరించటం మనకు తెలిసిందే.

"గజ కేసరి యోగం గురించి శ్రీ గురజాల హనుమంతరావు ప్రశ్నకు శాస్త్రిగారు

గజ కేసరి యోగేనా న ఫలం గజ సింహ యో జాతకే యస్య యోగోయం– స ఏ వైశ్వర్య ముచ్ఛతి" అని శ్లోకం చెప్పారు– గజ కేసరి యోగం గజానికి సింహానికి ఫలించదు. ఎవడికి ఆ గజకేసరి యోగం పడుతుందో వాడు ఐశ్వర్యవంతుడు అవుతాడు అని భావం.

శ్రీమతి చెరువు లక్ష్మీదేవిగారు బాలాస్తుతి చేయమని కోరగా–

"శ్రీ మాతుః పరదేవతా వర చిదావిష్కార మార్గ ప్రదాం–భండా యోధన ఘోర రాక్షస గణాహంకార హుంకారిణీం

నిత్యార్భా పరభక్త మానస చిదా కాం క్షైకసంధాయినీం– బాలాం బాల సుధాంశు ధారి నిటలాం బాలారుణాం భజే అని భక్తి పూర్వకంగా స్తుతించారు.

సంపూర్ణ సంస్కృత శతావధానాన్ని చూసి గోదావరి ఏమనుకొంటొందో అని శ్రీ ధూళిపాళ ప్రభాకర కృష్ణమూర్తి ప్రశ్నించగా అవధానిగారు–

"గ్రీష్మోష్మ నిష్క్వధి సర్వ జలాకులాం మాంఉచ్చూనయత్య హహకో యమమావధారః

కాశ్మీర శీతల మనోజ్ఞ రసార్ద్ర భావైః మామేన శీతల యతీహ వాదాన విద్యా" అని గడుసుగా చెప్పారు.

**అర్థం–** ఎండాకాలంలో ఆవిరిచే తుకతుక ఇగిరిపోతున్న అన్ని నదీ జలాలు కలిగిన

నన్నే ఉప్పొంగేట్లు చేస్తున్నాడే ఈ గొప్ప కవితా రసధార కలవాడెవరు? ఈ పదాన విద్య కాశ్మీర భూముల్లాగా మనోజ్ఞ రసార్ద్ర భావాలతో నన్ను చల్లబరుస్తున్నాయి అనుకొన్నది గోదావరీ మాత.

ఈ విధంగా శాస్త్రిగారు గీర్వాణ అవధానాన్ని రసప్లావితం చేశారు. కండగల ఆశు కవిత్వంతో కదను తొక్కారు. పృచ్ఛక వృశ్చికాల పని పట్టారు. రసజ్ఞులను తనియించారు. అవధాన మహా యజ్ఞాన్ని సునాయాసంగా నిర్వహించి సెభాష్ అనిపించుకొని క్లిష్ట సమస్యలనూ సమయస్ఫూర్తిగా పూరించి, వహ్వా అనిపించారు. వారి పాండిత్య గరిమకు, భాషా పాటవానికి ఈ అవధానం మైలురాయిలా నిలిచింది. తెలుగువారికే స్వంతమైన అవధాన సరస్వతిని శాస్త్రిగారు సంపూర్ణ సంస్కృత శతావధాన స్వర్ణ పల్లకీలో ఊరేగించారు. అవధానాంతరం శాస్త్రిగారికి ఉభయ భారతి బిరుదును ప్రదానం చేసి సత్కరించారు. ఆచార్య దోర్బల ప్రభాకరశర్మ ప్రస్తుతి శ్లోకాలు రాసి వినిపించారు.

ఆకలంకాద్వయ విద్వదున్నత గుణశ్రీసౌరభో దంచితం- లలితాంధ్రీశివ సంస్కృతామృత మయ వ్యాహార విభ్రాజితం

భయ భారా సనయోద్యదమ్ శుభ పరః- శ్రీ సత్య నారాయణోభయ భారత్యభి నూతనావలిత సుష్మశ్రు ద్వయం మన్మహే

డా. కొంపెల్ల రామ సూర్యనారాయణ

"నీ యవధాన వేళవినీల వియత్తల మందు తోచెప- దియోయొక కాంతి పుంజము సదోగత సర్వ జనాళిచుట్టి

హాయని చెరే, తావక కరాగ్రమునన్ మరి వేది జూచి- ద్రాయిత మూర్తి తెల్పు మది దాతాయో హంసయో కీర రాజమో?"

డా. రామడుగు వెంకటేశ్వరశర్మ "బహ్వసాదారణ ప్రజ్ఞ గతా రూఢ, ధారణా మకుట విస్పార కాంతికి" ఉడుగరలు సమర్పించారు.

మహా సహస్రావధాని డా. గరికపాటి నరసింహారావు మీసము గల్గు భారతివి, మీ సములేరి వదాన విద్యలో అని కీర్తిస్తూ-

గ్రీష్మర్తు ప్రతిభా సమాన రవియై, గీర్వాణ పాదోధియై- భీష్మా చార్య షరా ప్రసార నిభమై, వేవేల్గులన్ జిమ్ము, శా

ష్మాకంద రస ప్రవాహమనగా, వాణీశ్రవః కుండలా- ర్చిష్మత్వా కలితావధాన మిదిఅచ్చెర్వున్ ప్రసాదిం చెడిన్" అని కీర్తి కిరీటం పెట్టారు.

ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు అవధానాలలో ఎక్కడో ఒకటో అరా పద్యాలు బాగున్నవి చూశాం. కాని మీ యావత్ అక్షరం ముదం చేకూరించంది అని మెచ్చుకొంటూ

"అవధానంబున నిట్టు బండవలెనయ్యా రండు వీక్షింపుడో- అవధానుల్ గనుడంచు చూపెడు గతిన్ వ్యాహార శోభ సము
త్సవమున్ భావ శశి ప్రభాకవిత సౌందర్యంబు చూపించి నా- డవు, దీక్షా సముపాసితాచ్ఛ శశికంతా సత్యనారాయణా" అని ఇదే అవధానం. అందరు చూసి నేర్చుకొండి అని సవాల్ విసిరారు మెచ్చుకొంటూనే.

డా. నోరి భోగీశ్వరశర్మ అభినందన మందారమాల అల్లి

"నాణ్యాః స్నేహార్ద్రపీన స్తన ఘట జనితః క్షీర ధారా ప్రవేకః- ఛందో లక్ష్మీ వధూటీ వదన గలిత తాబూల శేషః కిమేషః
త్వమ్మేతేహం నుకాళీవచన సువిదితాను గ్రహః కాళిదాసః- సత్యన్నారాయణాఖ్యః కవికుల తిలకః చెర్వు వంశాబ్ధి సోమః"
ఆమల్ల దిన్నె రమణ ప్రాసాద కవి తెచ్చిన భాషా సింధువు అని, వచ్చిన గీర్వాణ మధువు, గొప్ప కవనాన్నిచ్చే సుర తరువు, అంటూ హరువు ఇచ్చెరు, వచ్చెరువు చెరువు ఇది చిరు చెరువా? అని అచ్చెరువు పోయారు.
గొప్ప పాండిత్య విభవంలో, కవిత్వ పటుత్వంలో భద్రాయిత మూర్తి అని, స్నేహ శీలాలలో కలశాంబువు అయిన సత్యనారాయణ శాస్త్రిని చెరువు అనటం హిమాలయాన్ని గుట్ట అనటమే అని శాస్త్రిగారి హిమాలయోత్తుంగ కవిత్వాన్ని బహుదా శ్లాఘించారు.

"కవి అంటే చెరువు సత్యనారాయణశాస్త్రియే అని ఆయన అవధాన యాగం అమేయం, పేయం" అన్నారు శాంతి శ్రీ బొత్స కవి.
కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం సంస్కృత కళాశాల శాస్త్రిగారికి "ఉభయ భారతి" బిరుదు ప్రదానం చేసి ప్రశంసాపత్రం సమర్పించింది. అందులో శాస్త్రిగారిని "సహజ పాండితీ విభవ విలాస, కవితా విలాస సంశోభిత, ఉభయ భాషా వదాన మహా భాష్య కార, సౌజన్య చంద్రికా విరాజిత, నిరర్గళధారా ధారణా ప్రతిభా భాసమాన" అని వారి కవితా వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారు.
శ్మశ్రు భారతీ అని సంబోధించి డా. ఎస్వీ రాఘవేంద్రరావు

"కీరితి కంబ మైతి రస కేళి వదాన మహేస్టిసల్పి కొ- వ్వూరున సంస్కృతంబున మహోత్తమ రీతి నపూర్వ ధారణన్
ఆరని జ్యోతివై వెలుగు మారతి పట్ట బుధల్ సుధీనిధీ"
ఈ విధంగా శతావధానిని పొగడ్తలతో ముంచెత్తేశారు ప్రఖ్యాత కవి పండితులు. ఇంతటి సరస్వతీ పుత్రులు కాలగర్భంలో లీనమై శూన్యాన్ని మిగిల్చారు.

"జయంతిన తే- సుకృతినో- రస సిద్ధాః కవీశ్వరాః- నాస్తి తేషాం యశః కాయే- జరామరణజం భయం" ❁

## 420. డా. జి.ఎస్.ఆర్. కృష్ణమూర్తి (1944)

**ప.** గో.జి లో అరాగవరంకు చెందిన ఈయన సంస్కృతంలో గొప్పకవి. యువకుడిగా ఉన్నప్పుడే 'వానకి', 'సువర్ణ స్వచ్ఛలితం' రాశాడు. ఉత్తరప్రదేశ్ సంస్కృత అకాడెమి ఈయన ప్రతిభను గుర్తించి గౌరవించి సత్కరించింది. 'నవ రూపకం' అనే ఏకాంకికలు రాశారు. ప్రస్తుతం తిరుపతి సంస్కృత విద్యా పీఠంలో ప్రొఫెసర్‌గా ఉన్నారు.

వీరితోబాటు కొందరు రాసిన వాటిని చూద్దాం – నరసాపురానికి చెందిన శ్రీ అత్తిలి గోపాల కృష్ణమాచార్య సంస్కృత లఘుకావ్యాలు చాలా రాశారు. రేలంగికి చెందిన శ్రీ సోమంచి కృష్ణ శాస్త్రి 'విదుర నీతులు'పై భాష్యం రాశారు. శ్రీ కాకరపర్తి కృష్ణమూర్తి శాస్త్రి 'వ్యాజ వ్యవహారం, అహల్యా సౌశీల్యం, సదాముక్తి సుదార్ణవం రాయగా, పాలకొల్లు వారైన శ్రీ మానేపల్లి కుమారస్వామి 'సుస్వరాలు' ఖండకావ్యం రాశారు. శ్రీ ఆచంట వెంకట సీతా రామమూర్తి 'కుమారవిజయం' రాస్తే, శ్రీ భారతం శ్రీమన్నారాయణ 'గాయత్రి సుప్రభాతం', నరసాపురానికి చెందిన శ్రీ పెద్దింటి సూర్యనారాయణ భాగవతార్ అనే దీక్షిత దాసు గారు సంస్కృతంలో ఎన్నో హరికథలు రాసి గానం చేసి ప్రసిద్ధి పొందారు. శ్రీ చిత్రావూరి శివరామకృష్ణ శర్మ న్యాయ వేదాంత వ్యాకరణాలలో దిట్ట. సంస్కృతంలో చాలా రచనలు చేశారు. బందరు జాతీయ కళాశాలలో పని చేసి రిటైర్ అయ్యారు. శ్రీ ధూళిపాల వెంకట సత్యనారాయణ గీర్వాణ 'రామాయణం' రచించారు. ఎందరో మహా కవులు అందరికి వందనాలు. ❁



## 421. శ్రీ హర్ష నైషధ దర్శన పరామర్శకర్త శ్రీ ముళ్ళపూడి జయసీతారామ శాస్త్రిగారు (1945)

శ్రీముళ్ళపూడి నారాయణ శాస్త్రిగారు శ్రీమతి బాలాత్రిపుర సుందరి దంపతులకు 24-02-1945న గుంటూరు జిల్లా రేపల్లెలో శ్రీ జయ సీతారామ శాస్త్రిగారు జన్మించారు. అక్కడే ప్రాథమిక ఉన్నత విద్య నేర్చి 1966లో తెలుగు సంస్కృతాలలో భాషా ప్రవీణ పాసైనారు. గుంటూరులో కొలచల కృష్ణమూర్తి గారి కాలేజిలో సంస్కృత పండితులుగా పని చేశారు. విజయవాడకు చెందిన శ్రీ శొంఠి సూర్యనారాయణ శ్రీమతి లక్ష్మీ ప్రసూనాంబ దంపతుల కుమార్తె శ్రీమతి గాయత్రిని 07-05-1966లో వివాహం చేసుకొన్నారు. వీరికి ఒక ఆడపిల్ల ముగ్గురు కుమారులు జన్మించారు. 1970 నుండి రేపల్లెలో తండ్రిగారు స్థాపించిన సంస్కృత కళాశాలలో లెక్చరర్‌గా పని చేశారు. తర్వాత జిల్లేళ్ళమూడి అమ్మగారి సంస్కృత కళాశాలలో 1994 వరకు సేవలందించి కృష్ణాజిల్లా గన్నవరం దగ్గరున్న బుద్ధవరం కాలేజిలో ఉద్యోగించి 2003లో రిటైర్ అయ్యారు.

నోరి నరసింహ శాస్త్రిగారి ప్రేరణతో క్షేత్రయ్య పద సాహిత్యంను పరిష్కరించి ప్రచురించారు. వీరి సంస్కృత భాషా పాండిత్యం మేరలేనిది. తండ్రికి తగ్గ తనయులు. అందుకే వీరి ప్రతిభకు తగిన గుర్తింపు తీసుకురావటానికి శ్రీ సన్నిధానం సుదర్శనంగారు తిరుపతి సంస్కృత కాలేజికి తీసుకొని వెళ్ళారు. అక్కడ ప్రచురణ శాఖలో సూపరింటెండంట్‌గా ఉన్నారు. సంస్కృత గ్రంథాలను పరిశోధించటం, ముద్రణలో తప్పులు సరి చూడటం చేస్తున్నారు. ఇప్పటికి ఆ ప్రాజెక్ట్ కింద సుమారు 50 సంస్కృత గ్రంథాలను ప్రచురించారు. వీటి ప్రచురణలో శాస్త్రిగారి కృషి అద్వితీయం. ఇప్పుడు శైవానికి చెందిన నీల కంఠ భాష్యం ప్రచురణలో సహాయపడుతున్నారు.

సీతారామ శాస్త్రి గారికి అమరకోశం, రామాయణ పారాయణం ఉపదేశించిన తల్లి శ్రీమతి బాలమ్మగారు. కావ్య శాస్త్రాలను సంప్రదాయ పద్ధతిలో పాఠం చెప్పి

మంత్రోపదేశం చేసినవారు తండ్రిగారైన నారాయణశాస్త్రిగారు. వీరిద్దరూ తమకు ఆది గురువులైనారని శాస్త్రిగారు వినమ్రంగా తలిదండ్రులకు కృతజ్ఞత తెలుపుకున్నారు. భాషా ప్రవీణ చదివే రోజుల్లో ఉత్తర నైషధ కావ్యకర్త శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారి శిష్యరికం చేసి జ్ఞానార్జన శలాకతో చక్షురున్మీలనం పొందానని గురుభక్తి చాటుకొన్నారు. తనను మంచి మనిషిగా, మంచి ఉపాధ్యాయునిగా, సద్విమర్శకునిగా తీర్చిదిద్దిన వారు రేపల్లె వాస్తవ్యులు మిత్రులు అయిన కవిసామ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు అని గర్వంగా చెప్పుకొన్నారు. శ్రీ బాలా త్రిపురసుందరీ ఉపాసకులు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు నైషద కావ్య రహస్యాలను వేలకొలది ఎరుక పరచారని, జ్ఞానజ్యోతిని వెలిగించారని, చింతామణి మంత్రాన్ని ఉపదేశించి ఆశీర్వదించారని, దాని ఫలితమే శ్రీ హర్ష నైషధం– దర్శన పరామర్శ అనే తన సంస్కృత పరిశోధన గ్రంథం అని సీతారామశాస్త్రిగారు సెలవిచ్చారు. శ్రీ కంచి కామకోటి శారదా పీఠాదిపతులు, పరమాచార్యులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారి అనుగ్రహ ఆశీర్వచనాలు వెన్నుదన్నుగా నిలిచాయి. శ్రీహర్షుని తల్లిపేరు మామల్లదేవి. మామల్ల తమిళ పదం. మహాబలిపురానికి మామల్లపురం అనే పేరుంది. ఈ దృష్టితో శ్రీహర్షుని జీవిత విశేషాలను ఎవరైనా పరిశోధిస్తే బాగుంటుంది అని శ్రీవారు సెలవిచ్చిన మాట తనకు ఈ జన్మ అంతా పులకింతలు కలిగిస్తూనే ఉంటుంది అని పరవశంతో శాస్త్రి గారన్నారు.

ఇదికాక శాస్త్రిగారు సంస్కృతంలో శ్రీ మాతృస్తవః రాశారు అమ్మవారి అనుగ్రహంతో. ఒక గంటలో శాలినీ వృత్తంలో పది శ్లోకాలు రాశారు. ఇది దేవీకృప, గురుదేవుల అనుగ్రహం అన్నారు. దీనికి ఆర్ష విద్యా ప్రచారకులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తిగారు తెలుగులో వివరణ రాశారు. మొదటి శ్లోకంలో–

"శ్రీ విద్యాం చిన్ముద్ర యుక్తాం భవానీం– చిత్తోన్మాద ధ్వంసినీం, చిన్మయీం, మాం మోహాతీతాం, ముగ్ధ హృదద్యాం ప్రముదానీం– శ్రీం మంత్రార్ణోద్భవ భాగ్యాం, ప్రణౌమి"

ఎనిమిదవ శ్లోకంగా–

"వాక్కూటస్తాం, వరదాం మౌని పూజ్యం– శ్రీదాం, లహం, మధ్య కూటే వసంతీం జ్ఞాని జ్ఞేయాం, శక్తి కూటేవిహిర్త్రీం– శ్రీం మంత్రార్ణో ద్భవ భాగ్యాం ప్రణౌమి"

చివరిది అయిన పదవ శాలినీ శ్లోకం–

షట్చక్రో పర్యున్మ నీస్థా, మగమ్యాం– యోగీన్ద్రాణా, మాత్మ శుద్ధిం దిశంతీం– సోహంభావో ద్భాస బుద్ధ్యద్య మానాం– శ్రీ మంత్రార్ణోద్భ ద్ధ భాగ్యాం ప్రణౌమి అంటూ ఆశువుగా అమ్మవారి లీలావిలాసాన్ని అత్యంత భక్తితో వర్ణించారు. ఇందులో చివరిపాదం మకుటంగా ఉండటం విశేషం. దీనికి మాత్రు స్తవంను అనుబంధంగా అయిదు శ్లోకాలు రాశారు.

దీనితోపాటు శాస్త్రిగారు ఇరవై అయిదు శ్లోకాల 'గాయత్రీ జయ రామం' అనే చిన్న కావ్యాన్ని సంస్కృతంలో రచించారు.

సీతారామ శాస్త్రిగారు తమ అన్నగారు రామ సుబ్రహ్మణ్య శాస్త్రి, తమ్ముడు శ్రీ కృష్ణ ప్రసాద్ గారలతో కలిసి ముళ్ళపూడి సోదరులు పేరుతో సీతాయాః చరితం మహాత్‌ను 'శ్రీ గాయత్రీ జయ రామ' కావ్య సహితంగా రాశారు.

### శ్రీహర్ష నైషధీయ దర్శన పరామర్శ

శ్రీ ముళ్ళపూడి జయ సీతారామ శాస్త్రిగారు తాను సంస్కృతంలో రాసిన నైషద పరామర్శలోని ప్రధానాంశాలను తెలుగులో అందరికి అర్ధమయేట్లు రాశారు. ఆ విషయాలనే మీ ముందు ఉంచుతున్నాను. శ్రీ హీరుడికి మామల్లదేవికి జన్మించిన కుమారుడే శ్రీహర్ష కవి. చింతామణి వర ప్రసాదుడు. నైషద కావ్యాన్ని సంస్కృతంలో రాసిన ప్రతిభాశాలి. ఈ కవి కాశ్మీర దేశపువాడని శాస్త్రిగారు సోపత్తికంగా నిర్ణయించారు. ఆంధ్ర నైషధంలో శ్రీనాధుడు తెలియజేసిన అనేక శాస్త్రీయ విషయాలపై ఒక వ్యాసం రాస్తే శ్రీ నోరి నరసింహశాస్త్రి ఎంతో మెచ్చారు. 1980లో తిరుపతి ఓరియంటల్ కాన్ఫరెన్స్‌లో ఈ వ్యాసం శాస్త్రిగారు చదివి అందరి ప్రశంసలను పొందారు. శ్రీ గాలి పార్థసారథిగారి వద్ద పి.హెచ్ డి చేయటానికి నైషధీయ దర్శన పరామర్శను ఎన్నుకొన్నారు. నైషధంలో ప్రబంధ ధ్వని ఉన్నట్లు గోచరించింది. కాని సారథిగారు లేనిపోని అర్థాలకోసం పాకులాడవద్దని నిరుత్సాహ పరచారు. అప్పుడు శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారి వద్దకు చేరి సంశయ నివృత్తి చేసుకొని కొత్త వెలుగులను దర్శించారు. శ్రీహర్షుడు మహాభారతం నుండి పూర్తి నలచరిత్రను తీసుకోకుండా నలదమయంతుల వివాహం వరకే తీసుకొని 22 సర్గల మహాకావ్యం రాశాడు. ఇందులో హంస పాత్ర, భీమ నల పాత్రలలో ఉన్న సంకేతర్థాం, ఇంద్రాదులు ప్రవేశించటంలో అంతరార్థం, నలుడిని తమ దూతగా పంపి వెంటనే దమయంతి వద్దకు దూతికలను పంపటంలో ఉద్దేశ్యం, భీమ నలులను సరస్వతిదేవి అనుగ్రహించటం, కలిని ప్రవేశ పెట్టటం, చంద్రవర్ణనతో కావ్యాన్ని పూర్తి చేయటం, ప్రతి సర్గలో ఆనంద పదం ఉండటం, చంద్ర, అమృత, శ్రీ శబ్దాలను ప్రయోగించిన తీరు అన్నీ వింతగా ఉన్నాయి.

బంగారు హంస బ్రహ్మ వాచకం. హంసను చెలులు పట్టుకోబోతుంటే దమయంతి "నైవాశకునీ భావేన్మే" అంటే ఈ హంస నా విషయంలో పక్షి కాదని అనటం ప్రత్యేక విషయాలు. పాఠంలాగా వేదాంత విషయాలను అభ్యసించినప్పటికీ సబాధి స్తితికి వచ్చిన యోగికి మాత్రమే ఆనంద స్వరూపమైన బ్రహ్మ దొరుకుతాడు అని హంస అన్నమాటలు మామూలువి కావు. మానవ శరీరంలో హంస సంచారం అంటే

ప్రాణ సంచారమే. ఆత్మ దర్శనం కోసం యోగి హంసను బంధిస్తాడు. అందుకే నలుడు దేన్నీ చూడటానికి నిన్ను పట్టానో ఆ రూపాన్ని చూశాను అనటంలో పరమార్థ అదే.

రెండవ అధ్యాయంలో హంస నలునితో "సరసీః పరిశీలితుం మయా, గమి కర్మీకర్త నైకనీ వృత్తా" అనే శ్లోకంలో గమి కర్మీకృతం పదం వ్యాకరణ పాండిత్యంతో చెప్పింది కాదని విశిష్టార్థంతో చెప్పినదని శాస్త్రిగారు బావించారు. మన శరీరంలో మొత్తం 21,600 హంసలు ప్రయాణిస్తూ ఉంటాయి. అందుకే శ్రీనాధుడు కూడా ఈ పదాన్ని అలాగే తెలుగు అనువాదంలో వాడాడు. శ్రీగుంటూరు శేషేంద్రశర్మ కూడా ఇదే ఆలోచన చేశారు. దమయంతి దగ్గరకు వందమంది అప్సరసలు చెలికత్తెలుగా వచ్చారు. చాన్దోగ్యం ప్రకారం వందనాడులు మూలాధారం నుండి సహస్రారం వరకు ప్రయాణం చేస్తాయి అని ఉంది. దానికిది సంకేతం. ఇదే సుషుమ్నా నాడి.

దమయంతి ఒక రాజకుమారి మాత్రమే కాదు, విద్యా శక్తి, జ్ఞాన విద్య. ఆమెను పొందిన జీవుడు పరమాత్మ అవుతాడు. ఈమె తండ్రి భీముడు. అంటే కామ క్రోదాదులకు భయంకరుడు. ఇంద్రియ నిగ్రహుడు అయిన దముడు అనే రుషి ప్రభావంతో భీమ రాజుకు దమింపజేసేదైన దమయంతి జన్మించింది. ఆమె సాక్షాత్తు శ్రీయే నంటారు శాస్త్రీజీ. ఏడవ సర్గలో శ్రీహర్షుడు దమయంతిని మూడు భాగాలుగా వర్ణించాడు. కేశాల నుండి చుబుకం వరకు, మెడ నుండి రోమాళి వరకు, మూడవసారి కిందిభాగం వర్ణిస్తాడు. ఈ మూడు మూడు కూటాలు. అవి వాగ్భవ, మధ్య, శక్తి కూటాలు. కూట త్రయ కళేబరం లలితా దేవిది. అలాంటిదే దమయంతి సౌందర్యం. ఆమెయే తమ మధ్యమంలో ఈశిత్వం, సూక్తి రమ్యత్వంలో ప్రాకామ్యం, యశస్సులో ప్రాప్తి అనే అష్ట సిద్ధులతో పరమాత్మ నిన్ను సృష్టించాడని నలుడు దమయంతిని 10వ సర్గలో పొగడటంలో అంతరార్థమిదే నంటారు శాస్త్రిగారు.

నలుడు అంటే సాధకుడైన జీవవుడు. పరమాత్మ సాక్షాత్కారం పొందినవాడు. రలయో రభేదః అంటే రా కి ల కి భేదం లేదు. నరుడే నలుడు అని బావం.

"నిషీయ యస్య క్షితి రక్షిణః కదాః తదాద్రి యంతేనా బుధా స్సుధామసి– నలస్షిత ఛ్చత్రిత కీర్తి మండలః నరాశిరా సీన్మ హసాం మహోజ్వలః అని కావ్య ప్రారంభంలో నలుడిని కవి నిశీయ అనే అవ్యయంతో కావ్యాన్ని ప్రారంభించాడు. అంటే అవ్యయ పురుషుని వర్ణించాడని అంటారు వాస్త్రిగారు. ఈ కథ వినేవారు అమృతాన్ని వద్దు అంటారట. క్షితి శబ్దం కూడా ప్రత్యేకమైనదే. అంటే శరీరం అని, దాన్ని రక్షించేవాడు పరమాత్మ అని దీనిలోని అర్థం. అమృతత్వం లభిస్తుందని అర్థం. హర్షుడు ఇలాంటివి ఎన్నో నిక్షిప్తం చేశాడు. అన్నీ ఉపనిషద్వాక్యాలే నంటారు. జీవుడు

విద్య కోసం ప్రయత్నిస్తాడు. దానికి కొన్ని అర్హతలు కావాలి. జ్ఞాన విద్య తనకు అనుకూలమా కాదా అని తెలుసుకోవాలి. అదే దేవతల ద్యూతం. భీమజతో యోగం పొంది అద్వైతం పొందటమే నలపాత్ర.

పదిహేడవ సర్గలో కలిప్రస్తావనలోను వేదాంతం ఉంది. చివరిదైన 22వ సర్గలో చంద్రోదయ వర్ణన. అగ్ని, సూర్య సోమ ఖండ త్రయాత్మకమైన పంచ దశి మంత్రానికి శ్రీం చేరిస్తే నాల్గవ ఖండం అయి చంద్రకళా ఖండం అవుతుంది. ఇది చంద్రవర్ణన పరస్పరాను బద్ధాలు. శ్రీం శబ్దాన్ని సహస్రారంలో ధ్యానిస్తారు. ఇన్ని అర్థాలు నైషద కావ్యంలో కవి నిక్షిప్తం చేశాడని, ఇది కేవలం నల దమయంతుల కథ కాదని జాగ్రత్తగా గురువుల దగ్గర చదివి అంతరార్థాన్ని గ్రహించాలని శ్రీహర్ష కవి ఒక శ్లోకంలో ముందే చెప్పి హెచ్చరించాడు-

"గ్రంధ గ్రంధి రిహక్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా- ప్రాజ్ఞాన్మన్యమనా హఠేన పఠితీ, మాస్మిన్, ఖల ఖేలతు
శ్రద్ధా రాద్ధ గురుః శ్లదీకృత దృఢ గ్రన్థిః సమాసాదయ- త్వేతత్ కావ్య రసోర్మి మజ్జన సుఖ వ్యాసజ్జనం సజ్జనః అంటే ఈ గ్రంథంలో క్లిష్టమైన ముడిని నేను అక్కడక్కడ కావాలనే ప్రయత్న పూర్వకంగా వేసి ఉంచాను. పండితుడినని, ప్రాజ్ఞుడనని మూర్ఖుడు కావ్యములోకి ప్రవేశించరాదు. గురువులను శ్రద్ధతో ఆరాధించి, వారి అనుగ్రహంతో నేను వేసిన దృఢ గ్రంధిని కొంత కొంత వదులు చేసుకొని, విప్పుకో గలిగిన సజ్జనుడికి మాత్రమే ఈ కావ్యామృతములో సుఖంగా స్నానమాడు గాక అన్నాడు మహాకవి శ్రీహర్షుడు. ఇవన్నీ వ్యంగ్య నిర్ధారణకు సాక్ష్యాలు అంటారు జయ సీతారామశాస్త్రిగారు. ఈ విధంగా ప్రబంధ ధ్వని నైషద కావ్యమంతా విస్తరించి ఉందని ఎన్నో వివరాలతో విపులమైన వ్యాఖ్యానం సంస్కృతంలో రాసి పి హెచ్‌డి సాధించారు. సాధారణ పాఠకులకోసం తెలుగు ఇంగ్లీషులలో వివరణ నిచ్చారు. శ్రీహర్షుని శ్లోకంతోనే తన పరిశోధనా వ్యాసాన్ని ముగించారు శాస్త్రిగారు-

"మదుక్తి శ్చేదంతర్మదయితు సుధీ భూయ-కి మస్యా నామస్యాత్ అలస పురుషా నాద రభరైః"
ఆధునిక సంకేతికతో శాస్త్రిగారు చాలా చక్కగా వేదాంపరంగా విశ్లేషించారని ఢిల్లీ యూనివర్సిటి సంస్కృత శాఖాధిపతి మెచ్చారు. మొత్తం మీద అపూర్వ సిద్ధాంత గ్రంథం శాస్త్రిగారి నైషధీయ దర్శన పరామర్శ. వారి సర్వ శాస్త్ర పాండిత్యానికి, గీర్వాణ భాషాధిషణకు దర్పణం.❋

## 422. చతుర్భాషా పదకోశ నిర్మాత – డా. శ్రీ అమృత వాక్కుల శేష కుమార్ (1945)

**తి**రుపతి సంస్కృత కాలేజిలో చదివి వ్యాకరణ శాస్త్రం ప్రధాన అంశంగా బి ఏ చేశారు. తర్వాత వ్యాకరణంలో ఏం ఏ డిగ్రీ పొందారు. స్వయం కృషితో సాహిత్యంలో ఏం ఏ పాసైనారు. తెలుగు హిందీలలో కూడా ఏం ఏ .ఆంధ్ర యూనివర్సిటి నుండి పి.హెచ్ డి. సాధించారు . భట్టోజీ దీక్షితుల సిద్ధాంత కౌముదికి 'రూప ప్రక్రియా కౌముది' రాశారు. కాళిదాసః అనే లఘునాటిక రాసి ప్రదర్శించారు. ఆకాశవాణి ద్వారా సంస్కృతంలో అనేక కథలు వ్యాసాలూ రాసి ప్రసంగించారు. సంస్కృత భాషకు చెందిన ఆరు వేల పదాలకు విషయ విభజన చేసి, తెలుగు హిందీ, ఇంగ్లీష్‌లలో సమానార్థాల పదాలతో 'చతుర్భాషా పదకోశం' రాశారు. సంస్కృతాన్ని తేలికగా నేర్చుకోవటానికి 'అమృత వాణీ పరిచయ' రచించారు. 2004లో తిరుపతిలో 'అఖిల భారత సంస్కృత సభలు' జయప్రదంగా నిర్వహించారు. ❁

## 423. వ్యాకరణ విద్యా ప్రవీణ – శ్రీ కందాళ లక్ష్మీనారాయణ (1945)

**నె**ల్లూరు సంస్కృత కాలేజిలో వ్యాకరణ లెక్చరర్ అయిన కందాళ వారు వ్యాకరణ విద్యా ప్రవీణ, పి.హెచ్ డి పొందారు. ప్రిన్సిపాల్‌గా రిటైరయ్యారు. కూర్మ నాథ వింశతి, ఆచార్య వైభవః రామానుజాచార్యులవారిపై పద్దెనిమిది శ్లోకాల లఘు రచన చేశారు. ❁



## 424. శ్రీ దోర్బల ప్రభాకర శర్మ (1946)

సంస్కృతాంధ్రాలలో నిష్ణాతులైన శ్రీ దోర్బల ప్రభాకర శర్మ కొవ్వూరు గీర్వాణ కళాశాల ప్రిన్సిపాల్ చేసిరిటైర్ అయ్యారు. అనేక సంస్కృత నాటకాలు పాటలు రాశారు. 'వివేకానంద' గ్రంథం రాస్తే ఇంటర్‌కు బోధనాంశం చేశారు.❁

## 425. శ్రీ వేలూరి సుబ్బారావు (1947)

సంస్కృత విద్వాంసులైన సుబ్బారావుగారు 'సుందరి మేఘ సందేశం', 'దాక్షిణాత్య మేఘ సందేశం' అనే సంస్కృత కావ్యాలు రాశారు. ఇందులో కథ – కొత్తగా పెళ్లి అయిన కవిగారిని ప్రభుత్వం దూరానికి బదిలీ చేసింది. మంగళూరు వెళ్లి సంస్కృతం బోధించమన్నది. భీమవరంలో భార్యను ఉంచి వెళ్ళాడు. భార్యా వియోగం పెళ్లి అయిన కొద్దిరోజులకే జరగటంతో మతి భ్రమించి ఆశాఢ మాసపు తొలి మేఘంతో తన గోడు వెల్ల బోసుకొన్నాడు.❁

## 426. డా.కొల్లూరు అవతార శర్మ (1947)

**వి**జయనగరంలో జన్మించిన శ్రీ శర్మాజీ పి ఆర్ కాలేజి కాకినాడలో ఉద్యోగించి బహు సంస్కృత గ్రంథ రచన చేశారు. కాకినాడ 'ఐశ్వర్యామ్బికా దేవి' పూజా విధానం 'బాలకల్పకం' రచించారు. 'అయ్యప్ప దర్శనం', మందాక్రాంత వృత్తాలలో సౌందర్య లహరి చేశారు.❀

## 427. శ్రీమతి గుమ్మా (అమృతవాక్కుల) శ్రీశైల (1950)

**సం**స్కృత శ్రీ కృష్ణ స్తుతిశతకాలపై పరిశోధన చేసి శ్రీ చంద్ర శేఖర స్వామికి అంకితమిచ్చిన శ్రీమతి శ్రీశైల శ్రీ వరదాచార్యుల కృష్ణ శతకాన్ని సంస్కృతంలో రాశారు.

వీరుకాక శ్రీ యెన్ యెన్ హరిశాస్త్రి కుమారవిజయం, మేఘ దూతం సంస్కృతంలో రాయగా, శ్రీ చావలి లక్ష్మీకాంత శాస్త్రి 'ప్రస్థాన త్రయం' పేర భాష్య త్రయాన్ని వివరిస్తూ వ్యాఖ్యాన సంస్కృత గ్రంథం రాశారు. శ్రీ విక్రాల రాఘవాచార్యులు 'మదన విజయం' కావ్యాన్ని, శ్రీనివాస ప్రసాదః' కావ్యాలు రాసి శ్రీకాళహస్తి ఆస్థానకవులై, 'చతుర్విధ కవితా విశారద', 'కంఠీరవ 'బిరుదులందుకున్నారు. వీరుగాక అనేక మంది కవులు ఉండివుండవచ్చు. వివరాలు తెలియకనే రాయలేక పోయాను.❀

## 428. 'భిషగ్రత్న' - శ్రీ మహేంద్రాడవెంకట జగన్నాథ స్వామి (1940)

**క**ళింగ సంస్కృత కళాశాల స్థాపకులు, ఆయుర్వేద విశారద, వేదాంత భూషణ శ్రీ మహేంద్రాడ వెంకట జగన్నాథ స్వామి సాహిత్య భాషా ప్రవీణులు, భిషగ్రత్న, వేదాంత విద్యా విశారదులు. శ్రీకాకుళం నివాసి. ప్రభుత్వ సహాయం లేకుండా స్వయంగా సంస్కృత పాఠశాలస్థాపించారు. సంస్కృతంలో, వేదాంతంలో దిట్ట. సౌరమంత్రాలకు 'ద్యుమణి నందనం'అనే వ్యాఖ్య రాశారు. శ్రీ సూక్తానికి సంస్కృతంలో 'రమా స్వాగతం 'రాశారు. రంగనాథ సుప్రభాతం, అరసవిల్లి శ్రీ సూర్యనారాయణ స్వామిని స్తుతించారు. తల్లిగారిపై 'మాత్రు శతకం' రాసిన ధన్యులు.❀



## 429. పుష్పగిరి పీఠ ఆస్థాన పండితులు, తత్వశాస్త్ర పారంగత - శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మగారు (1950)

**జనన విద్యాభ్యాసాలు**

**ఆ**ధునిక కాలంలో గీర్వాణ భాషలో లోతైన పాండిత్యం కలిగి మహా ప్రతిభావంతంగా కావ్య రచన చేసి ఆంధ్రదేశానికి చెందిన అసలైన పీఠం అయిన పుష్పగిరి పీఠ ఆస్థాన పండితులుగా గౌరవం పొంది, సహజ పాండితీ గరిమతో, అరుదైన శాస్త్ర పాండిత్యంతో బహు గ్రంథ కర్తృత్వంతో వన్నె కెక్కిన అసమాన పండితకవులు, మన విజయవాడ వాస్తవ్యులు బ్రహ్మశ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజులు శర్మగారు. శ్రీ గరిమెళ్ళ సూర్య నారాయణ ఘనాపాఠీ, శ్రీమతి సూర్య కాంతమ్మల దంపతుల పుత్రులు. తూర్పు గోదావరిజిల్లా కొత్తపేట తాలూకా 'అవిడి' గ్రామంలో 5-8-1950లో శ్రీ వికృతినామ సంవత్సర నిజాషాఢ శ్రీ కృష్ణాష్టమి నాడు జన్మించారు. సంస్కృతాంధ్రాలలో ఎం.ఏ సాధించారు.

**ఉద్యోగ సోపానం**

తూర్పు గోదావరిజిల్లా అమలాపురంలోని ఎస్ .కే.బి ఆర్ .కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా1979 నుండి 89వరకు పని చేశారు. తర్వాత విజయవాడ కే బి యెన్ కళాశాలలో 1989-నుండి 2007 వరకు తెలుగు ఉపన్యాసకులుగా సేవలందించారు. ఉద్యోగ విరమణానంతరం విజయవాడలో స్థిరపడ్డారు.

**వివాహం సంతానం**

సోమయాజులు శర్మగారు ముమ్ముడివరంకు చెందిన శ్రీ నూకల శ్రీ మన్నారాయణ, శ్రీమతి రాజేశ్వరి దంపతుల కుమార్తె. శ్రీమతి రాజ్య లక్ష్మి గారిని 1996లో వివాహ మాడారు. ఈ దంపతుల వంశోద్ధారకుడు, కులదీపకుడు రవి తేజస్సుతో విరాజిల్లే చి.సూర్య తేజ.

**అందుకొన్న బిరుదులూ, పదవులు**

శాస్త్ర సాహిత్యాలలో సోమయాజులుగారి ప్రతిభకు గుర్తింపుగా శ్రీ పుష్పగిరి శంకరాచార్య మహాసంస్థాన పండితులుగా గౌరవస్థానంలో ఉన్నారు. కృష్ణాజిల్లా అధికార భాషా సంఘ సభ్యులు.

సోమయాజులు శర్మ గారు పొందిన 'సహజ పాండిత్య' బిరుదం అన్వర్ధం. శ్రీ పుష్పగిరి శంకరాచార్య స్వామి 'విద్యా విభూషణ' బిరుదునిచ్చి సత్కరించారు. విజయవాడ దేవీఫౌండేషన్ వారు 'తత్వ శాస్త్ర పారంగత' బిరుదు ప్రదానం చేసి సన్మానించారు.

**ప్రవృత్తి**

సంస్కృతాంధ్ర భాషలలో శాస్త్ర, కావ్య గ్రంథ రచన. పుష్పగిరి పీఠ చాతుర్మాస్య సమయంలో అవధానాలు నిర్వహించటం. అముద్రిత తాళ పత్ర, లిఖిత గ్రంథ సేకరణ, వాటిని పరిష్కరించి శుద్ధప్రతులను తయారు చేసి భద్ర పరచటం, సాహిత్య, ఆధ్యాత్మిక ప్రసంగాలు చేయటం శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మగారి ప్రస్తుత ప్రవృత్తి, వ్యాసంగం.

**బహుగ్రంథకర్త**

శ్రీ సోమయాజులు శర్మగారు అనేక గ్రంథాలను గీర్వాణ, ఆంధ్రాలలో రచించారు. అన్నీ ప్రసిద్ధి చెందినవే.

**సంస్కృత రచనలు**

1) ద్వాదశీ వ్రత మహాత్మ్యం (అంబరీషోపాఖ్యానం )-దీన్ని మైసూరు సుధర్మ సంస్థ ప్రచురించింది 2) మహా భారత కంట కోద్దారః 3) కర్నాటసాహిత్య దర్శనం (హిస్టరీఆఫ్ కన్నడా లిటరేచర్ ఇన్ సాంస్క్రిట్) సంస్కృత లఘు కృతులు
1) శ్రీశైల లింగాష్టకం 2) గోపాల కవేః కాలః 3) సుధార్మాభి నందనం 4) సమస్యా పూరణం 5) శ్రీ వినాయక పంచ రత్నం 6) అశ్వధాటీ వృత్త లక్షణ విచారః 7) శ్రీ వెంకటేశ్వర స్తుతిః 8) హల్లోహల శబ్దార్ధ విమర్శః 9) భట్ట వచనం సత్యమేవ 10)

సుధార్మాభి వర్ధనం 11) శ్రీరామ నవమీ 12) ఆమోదః (శ్రీ మహేశ మాలా పీఠిక )13) కళావికాసః (పుష్ప బాణ విలాస పీఠికా )14) ఆనంద మందారః (బెల్లం కొండ రామ రాయ కవిః-అముద్రితం )15) అమృత సందేశః (మేఘ సందేశ పీఠికా)

**తెలుగు రచనలు**

పద్యకావ్యాలు - వాల్మీకి వృత్తాంతం, శ్రీ వెంకటేశ్వర శతకం, శ్రీ వెంకట రామ యశో వికాసం, శివ మహాత్మ్య ఖండం, శివ కర్ణామృతం

లఘు పద్యకావ్యాలు - పంచ రత్నాలు, సరస్వతీ దండకం, దివాకర్ల ప్రశంస, విశ్వనాథ మహా కవి, శ్రీ రామ విభక్తి స్తవం, వారణ మాల, తెలుగు భాషా వైభవం, ఉగాది పద్యాలు, కర్షక నవ రత్న మాలిక.

శర్మగారు అనేక గ్రంథాలకు బృహత్ పీఠికలు రాశారు -ఆంధ్ర మాఘానికి భూమిక, శంకర విజయానికి ఆముఖం, వాసుదేవ మననంకు ఉద్యోతం, సూత సంహితకు న్యాసం ఆంధ్ర బ్రహ్మ సూత్రాలకు వేదాంత దర్శనం మొదలైన బృహత్ పీఠికలను 13 రాశారు.

లఘు పీఠికలు - కొప్పు లింగేశ్వర మహాత్మ్యం, మోక్షసోపానం గాయత్రీ కల్ప వృక్షానికి వరివస్య విష్ణు సహస్ర నామ స్తోత్రానికి ప్రవేశిక, మారుతి రామాయణానికి సంజీవని, పరివ్రాజ చంద్రికకు విన్నపం మొదలైన 33 గ్రంథాలకు లఘు పీఠికలు సంతరించారు.

**వ్యాసాలు**

శర్మగారు శర పరంపరగా వ్యాస వాహిని ప్రవహింప జేశారు. భాగవత సంపద, ఈశాన సంహిత, కల్ప వృక్షం- నావిక పరిభాష, బెల్లంకొండ రామరాయ కవి, కోన సీమ వాఙ్మయ సేవ, కల్ప వృక్షం - నాట్య శాస్త్రం, సంగీత శాస్త్రం, సమగ్రాంధ్ర సాహిత్య సమాలోచనం, మకర సంక్రాంతి, చత్వారి శృంగాః, శ్రీ లంకా వెంకట రాయ శాస్త్రి, ప్రయోగ రత్నమాల మొదలైన 37 వ్యాసాలను వివిధ విషయాలపై రాసి వెలుగు నిచ్చారు.

**అనువాదాలు**

తరల సంగ్రహం, తత్వ బోధ, సర్వ సిద్ధాంత సంగ్రహం, సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి, తైత్తిరీయోపనిషత్, పరివ్రాజక చంద్రిక మొదలైన 6 అనువాద గ్రంథాలు రాశారు.

**వ్యాఖ్యాన లహరి**

సోమయాజులు శర్మగారు అనేక కావ్యాలకు వ్యాఖ్యానాలు రచించారు.

జగన్నాథ పండిత రాయల యమునాలహరికి గంగా లహరి, విష్ణు లహరిలకు – అమృత ధారా వ్యాఖ్య, అనులోమ విలోమ రాఘవ యాదవీయానికి – హరిప్రియా వ్యాఖ్య, అశ్వ దాటీ కావ్యానికి – నవ వీధీ వ్యాఖ్య రచించి ఆ కవుల కవితా ప్రభావాన్ని తెలియ జేశారు.

**పరిష్కరణలు**

శ్రీ శర్మగారు గ్రంథ పరిష్కరనలోనూ తన ప్రతాపాన్ని ప్రదర్శించారు – సూతసంహిత, శ్రీ భద్రాద్రి రామ శతకం, శబర శంతన విలాసం, భోగినీ దండకం, స్తోత్ర ముక్తావళి, తైత్తిరీయోపనిషత్, మైరావణ చరిత్రం, కూచి మంచి సామ్బకవి రాసిన కుమారసంభవం మొదలైన 10 గ్రంథాలు పరిష్కరించి ప్రచురణకు తోడ్పడ్డారు.

**అముద్రితాలు**

సోమయాజులు శర్మగారి అముద్రిత గ్రంథాలు ముఖ్యంగా మూడున్నాయి అవి – కల్ప వృక్ష శిల్ప సమీక్ష, ఆంధ్ర పురాణ సమీక్ష, పోతన కృతులు.

**గరిమెళ్ళ వారిరచనలపై పరిశోధనలు**

1) గరిమెళ్ళ వారి పద్య కావ్యాలపై శ్రీ జి చలపతి రావు (నాగార్జున విశ్వ విద్యాలయం ), 2) కర్ణామృత త్రయం – ఆంధ్రానువాదములు – తులనాత్మక పరిశీలన – శ్రీ షేక్ బాపూజీ (నా వి వి.) 3) గరిమెళ్ళ సంపూర్ణ వాఙ్మయం – శ్రీ పి.ఉమానాధ శర్మ (బెనారస్ హిందూ విశ్వ విద్యాలయం ) పరిశోధనలు చేసి పి.హెచ్ డి పొందారు. మేలు రచనలు గరీయంగా చేసి గరిమెళ్ళ వారు ఆంధ్ర సాహిత్యాకాశంలో ప్రకాశిస్తున్నారు. వారు నిజంగా సాహిత్య యజ్ఞం చేసిన సోమయాజులు. మరిన్ని సార్ధక గ్రంథాలు వారు వెలువరిస్తారని ఆశిద్దాం.❋

## 430. హయగ్రీవ శతక కర్త – శ్రీ చామర్తి కూర్మాచార్యులు (1950)

**సిం**గుపురంలో జన్మించిన కూర్మాచార్యులుగారు సంస్కృత భాషా ప్రవీణులు తెలుగుపండిట్‌గా చేసి రిటైర్ అయ్యారు. సంస్కృత భాషా ప్రచారకులు. 'హయ గ్రీవ శతకం, సీతారామ సుప్రభాతం, ద్వాదశాక్షరీ స్తోత్రం' వీరి గీర్వాణ రచనలు.❋



## 431. 'ధర్మశాస్తా' కావ్య నిర్మాత - శృంగేరి పీఠాధిపతి జగద్గురు శ్రీ శ్రీ శ్రీ భారతీతీర్థ  మహాస్వామి (1951)

**3**6వ శృంగేరి పీఠాధిపతులు శ్రీ శ్రీ భారతీతీర్థ స్వామి చిన్నతనం నుంచి గీర్వాణ భాషలో మాట్లాడేవారు. దేవ భాషా రహస్యాలను తీవ్రంగా అన్వేషించి అవగాహన చేసుకొనేవారు. ఏక సంధాగ్రాహి. బహుభాషా కోవిదులు కూడా. సంస్కృతంలో 'ధర్మశాస్తా' అనేకావ్యంతో పాటు చాలా స్తోత్ర రత్నాలు రాసి తమ సంస్కృత భాషా పాండిత్యాన్ని లోకానికి చాటారు. వారి జీవిత చరిత్రను, వారి గీర్వాణ వాణీ విలాసాన్నీ తెలుసుకొందాం.

### జనన విద్యాభ్యాసాలు - పీఠాధిపత్యం

స్వామి వారి పూర్వాశ్రమ నామం తంగిరాల సీతారామాంజనేయులు. 11-4-1951న శ్రీ తంగిరాల వేంకటేశ్వర అవధాని, శ్రీమతి అనంత లక్ష్మిలకు శ్రీ ఆంజనేయ వరప్రసాదంగా కృష్ణాజిల్లా మచిలీపట్నంలో జన్మించారు. భగవద్భక్తి ఉగ్గుపాలతో అలవడింది. కుర్రాడికి ఒక ఏడాది వయసు రాగానే తండ్రిగారు కుటుంబాన్ని గుంటూరు జిల్లా నరసరావుపేటకు మార్చారు. శ్రీ ప్రతాపగిరి శివరామశాస్త్రి గారివద్ద సంస్కృతం నేర్చి కొద్దిరోజుల్లోనే సంస్కృతంలో మాట్లాడటం ప్రారంభించాడు సీతారామాంజనేయులు. 7వ సంవత్సరంలో ఉపనయనం జరిగింది. ఉపనయన సంస్కారం వలన అతని నడవడి, ఆకారాదులలో గొప్ప మార్పు వచ్చి, బ్రహ్మ చర్య ధర్మాలను అక్షరాల పాటించాడు. నిత్య సంధ్యావందన, అగ్ని కార్యాలను శ్రద్ధగా చేసేవాడు. తండ్రి వద్దనే వేదాధ్యయనం నేర్చి, మంత్రార్థాలను ఆకళింపు చేసుకొన్నాడు. గుంటూరుజిల్లా వేద సభలో పరీక్షనిచ్చి ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. తండ్రికి పూజాదికాలలో చేదోడువాదోడుగా ఉండేవాడు. ఒక రోజు తండ్రి గ్రామాంతరం వెడితే, తండ్రి చేయించాల్సిన ఉపనయనాన్ని ఆంజనేయులే చేయించి ప్రశంసా పాత్రుడయ్యాడు. ఫస్ట్ ఫారం వరకు స్కూల్‌లో

చదివి,10వ క్లాసులో మారిన ఆంగ్ల మాధ్యమంలోనూ రాణించాడు. ఒక్క క్షణం కూడా వ్యర్ధం చేసేవాడు కాదు. తనకు సంప్రదాయ బద్ధంగా వేద, శాస్త్రాధ్యయనం చేయాలని ఉందని తండ్రికి చెప్పి అనుమతి పొందాడు. 1961లో శృంగేరి 35వ పీఠాధిపతి నరసరావుపేట విచ్చేసినప్పుడు మొదటిసారి దర్శనం చేసి వారితో సంస్కృతంలో సంభాషించాడు. స్వామీజీ మళ్ళీ 66లో వచ్చినప్పుడు, 11వ తరగతి చదివే ఆంజనేయులు మళ్ళీ దర్శించగా సంస్కృతంలో ఆ బాలుడితో మళ్ళీ మాట్లాడి పరిపూర్ణంగా అనుగ్రహించారు. ఉజ్జయినిలో జగద్గురువులు శ్రీ అభినవ విద్యా తీర్ధ మహాస్వామి చాతుర్మాస్య దీక్ష చేస్తుండగా తండ్రిగారి అనుమతి పొంది నరసరాపేటకు చెందిన శ్రీ విద్యా రణ్య స్వామితో కలిసి వెళ్ళారు. గురు సన్నిధానంలో అత్యంత వినయ విధేయతలతో ఉంటూ గురుముఖతా "తర్క సంగ్రహం" నేర్చారు .జగద్గురువుల ఆదేశంతో మహాపండితులు ఆయనకు వేద శాస్త్రాధ్యయనం చేసి నిష్ణాతులను చేశారు. గొప్ప తపశ్శాలియై, మూర్తీభవించిన ధర్మ స్వరూపమై, తేజస్సుతో భాసించారు. పీఠానికి ఉత్తరాదికారి అయ్యే అన్ని అర్హతలున్నాయని జగద్గురువులు ఆంజనేయులను తీర్చిదిద్దారు. 8ఏళ్ళు కఠిన దీక్షతో స్వామి సన్నిధానంలో మెలగి గురుదేవుల సంపూర్ణ అనుగ్రహాన్ని పొంది తమ అర్హతను నిరూపించుకొన్నాడు ఆంజనేయులు. 1974 నవంబర్ 11 న తంగిరాల సీతా రామంజనేయులను శృంగేరి జగద్గురు పీఠానికి 36వ పీఠాదిపతిగా 'శ్రీ భారతీ తీర్ధ స్వామి' ఆశ్రమ నామంతో అభిషేకించారు మహాస్వాములు.

**ఆదర్శ పీఠాధిపతి**

శ్రీ గురు చరణులు, శిష్య చరణులు ఒకరి హృదయం ఒకరు ఎరిగి ప్రవర్తించారు. అసామాన్య గురువుకు అసామాన్య శిష్యులయ్యారు శ్రీ భారతీ తీర్ధ స్వామి. 1977లో మహాస్వాముల షష్ట్యబ్దిపూర్తి మహోత్సవాన్ని మహా ఘనంగా నిర్వహించారు. పీఠాదిపత్యం వహిస్తున్నా గురుదేవుల యెడ అత్యంత వినయ విదేయతలను ప్రదర్శిస్తూ ఆదర్శ ప్రాయులయ్యారు. జగద్గురువులు శ్రీ అభినవ విద్యాతీర్ధ మహా స్వామివారు 21-9-1989న మహాప్రస్థానం చెందగా శ్రీ భారతీ తీర్ధ స్వామి పూర్తి అధికారాలతో పీఠాధిపతి స్థానాన్ని అలంకరించారు. దాదాపు వంద ఏళ్ళుగా శృంగేరిలో జరుగుతున్న 'గణపతి వాక్యార్ధ సభ'ను కొనసాగించారు. దేశం నలుమూలల నుండి పండితులను ఆహ్వానించి చర్చలు జరిపించి సన్మానించేవారు. తుంగా నదిపై కట్టిన వంతెనకు 'విద్యాతీర్ధ సేతువు' అని గౌరవంగా గురుస్మరణగా నామ కరణం చేశారు. శారదాధన్వంతరీ వైద్యాలయాన్నిఆధునీకరించారు. ఆయుర్వేద, హోమియో విభాగాలను ఏర్పరచారు. కర్ణాటకలోని 'మల్నాడు' అనే శివ మొగ్గ

చిక్కమగళూరు జిల్లాలలో కేన్సర్ వ్యాధి రోగులకోసం 'ఫోటా గామా ఐసోటోప్ స్కానర్'ను ఏర్పరచారు. 'జగద్గురు అభినవ విద్యా తీర్ధ అవుట్ పేషెంట్ బ్లాక్'ను, రక్తనిధి బ్యాంక్‌ను నెలకొల్పారు. 'వేద పోషక సభ' ద్వారా వేద విద్వాంసులను ఇతోధికంగా సత్కరించారు. 1994లో మూడు రోజులు శృంగేరిలో 'అఖిలభారత వేద సమ్మేళనం' నిర్వహిచారు. శ్రీ సద్విద్యా సంజీవినీ సంస్కృత మహా పాఠశాల శత వార్షిక సభను అత్యంత వైభవంగా జరిపారు. ఈ సందర్భంగా 'నరసింహ వనం'లో 25లక్షల రూపాయలతో 'శత మానోత్సవ స్మారక భవనం' నిర్మించారు. సన్యాసాశ్రమ స్వీకారం జరిగి 25 ఏళ్ళు అయిన సందర్భంగా శారదమాతకు కోటి కుంకుమార్చన చేయించారు. అమ్మవారికి బంగారు రధాన్ని తయారు చేయించారు. దేశంలోని 150 శృంగేరి శాఖలను అత్యంత సమర్ధవంతంగా నిర్వహిస్తూ పర్యవేక్షిస్తూ ఆధ్యాత్మిక, మార్గదర్శనం చేస్తున్నారు. శ్రీవారి దిన చర్య అత్యంత కఠోర నియమాలతో ఉంటుంది. లక్షమందికి పైగా భక్తులకు అన్ని రకాల సౌకర్యాలు ఉచిత భోజనం ఏర్పాటు చేశారు.

జ్ఞాన నిధి అయిన శ్రీ స్వామీజీ మహా పండితుల కంటే మహా పండితులు అన్నది నిర్వివాదం. సదస్సులలో ఏదో ఒక కొత్త అంశాన్ని ప్రస్తావించి దానిపై సమగ్ర చర్చ జరిపించి నిగ్గు తేల్చేట్లు చేస్తారు. శ్రీ అప్పయ్య దీక్షితులు, శ్రీ నీలకంఠ దీక్షితులు మొదలైన వారి గ్రంథాల నుండి సందర్భాను సారంగా శ్లోకాలను ఉదహరిస్తూ అత్యద్భుతంగా ప్రసంగించే నేర్పు వారిది. 'ఇదంతా శారదాంబ కరుణ' అని వినయంగా అంటారు. దయామయుడైన మార్గదర్శి శ్రీ చరణులు. శంకర భాగవత్పాదులపై అనన్య భక్తి ఉన్న స్వామి శృంగేరిలో 'మారుతి బట్ట' అనే చిన్న కొండ మీద 32 అడుగుల శ్రీ శంకర భగవత్పాదుల ఏక శిలా విగ్రహం నిర్మించి దానికి 'ఆది శంకర పర్వతం' అని సార్ధక నామం పెట్టారు. భగవత్పాదుల జీవితం 32 ఏళ్ళు కనుక విగ్రహం ఎత్తు దానికి సమానంగా చేశారు. జగద్గురువులు భాష్యకర్తలలోఅగ్రగణ్యులు.

**జగద్గురువుల గీర్వాణ సాహిత్య రచనా పరామర్శ**

శ్రీశ్రీ భారతీ తీర్ధ స్వాములు బహుభాషా వేత్త మాత్రమేకాదు, కందగల మహా కవిత్వం చెప్పగల దిట్ట కూడా. అప్రయత్నంగా వారి నోటి వెంట సంస్కృత శ్లోకధార జాలువారుతూ ఉంటుంది. కనుక సహజకవిగా సుప్రసిద్ధులు. గురువు, పూర్వా చార్యులు, పరమేశ్వరుడు వీరికవితకు వస్తువులు. వీరి సంస్కృత రచనలలో 1.ధర్మ శాస్తా అనే కావ్యం 2. శ్రీ అభినవ విద్యా తీర్ధ అక్షరమాలా స్తోత్రం 3. శ్రీ చంద్ర శేఖర భారతీ నవ రత్న మాలాస్తోత్రం 4. శ్రీగురు ధ్యానం 5. శ్రీ శారదా పంచ రత్న స్తుతి 6. శ్రీ శంకర భగవత్పూజ్యపాదాచార్య స్తవః 7. శ్రీ చంద్ర మౌళీశ్వర వర్ణమాలా స్తుతిః 8.

శ్రీ శారదా స్వర్ణ రధసమర్పణా పద్యావళిః 9. శ్రీ మహా గణపతి సేవా పద్యావళిః ఉన్నాయి.

**ధర్మ శాస్తా (అయ్యప్ప దేవాలయం) కావ్యం**

1980 మార్చి 15న గురుపాదులు శ్రీ అభినవ విద్యా తీర్ధ స్వామితో శబరిమల సందర్శించినపుడు అపురూప ప్రకృతి సౌందర్యంతో ప్రకాశిస్తున్న ఆ పర్వతం అధిష్టించి ఉన్న 'ధర్మ శాస్త' అంటే అయ్యప్ప దేవాలయాన్ని చూడగానే శ్రీవారి హృదయం మంత్రం ముగ్ధమై వెంటనే వారి నోటి నుండి ఆశువుగా 'ధర్మ శాస్తా' అనే సుమధుర కావ్యం వెలువడింది. ఈ కావ్య రామణీయకతను తెలుసుకొందాం. మొదటి శ్లోకం–

'జగత్ ప్రతిస్టాహేతుర్యో ధర్మః శ్రుత్యంత కీర్తితః – తస్యాపి శాస్తా యో దేవః తం సదా ముపాశ్రయే'

**తాత్పర్యం–** ఏ ధర్మం జగత్తు నిలకడకు హేతువు అని వేదాలలో చెప్ప బడిందో, అట్టి ధర్మాన్ని కూడా శాసించే దేవుడిని ఆశ్రయిస్తున్నాను.

రెండవ శ్లోకం–

'శ్రీ శంకరార్యైర్హి శివావతారైః ధర్మ ప్రచారాయ సమస్త కాలే – సుస్థాపితం శృంగ మహీధ్ర వర్యే పీఠం యతీన్ద్రాః పరి భూషయంతి'

**భావం–** శివావతారమైన శ్రీ శంకర భగవత్పాదులు ఎప్పుడూ ధర్మ ప్రచారం జరగాలనే కోరికతో శ్రేష్ట మైన శృంగేరిలో స్థాపించిన పీఠాన్ని యతీంద్రులు అలంకరించు చున్నారు.

మరో శ్లోకం –

'కాలేస్మిన్ కలిమల దూషితేపి ధర్మః శ్రౌతోయనంన ఖలు విలోపమాప

తత్రః హేతుః ఖల్వయ మిహ నూనమేవ నాన్యః– శాస్తాస్తే సకల జనైక వంద్య పాదః'

**తాత్పర్యం–** కలిమలం చేత దూషితమైన ఈ కాలం లో కూడా వైదిక ధర్మం నశించలేదు – కారణం జనులందరి చేత నమస్కరింప దగిన పాదాలు గల ధర్మ శాస్త ఇక్కడ ఉండటమే. మరో కారణం ఏదీ లేదు .మరోశ్లోకం–

'శబర గిరి నివాసః సర్వ లోకైక పూజ్యః – నత జన సుఖ కారీ నమ్ర హృత్తాప హారీ

త్రిదశ దితిజ సేవ్యః స్వర్గమోక్ష ప్రదాతా – హరిహర సుత దేవః సంతతం శం తనోతు'

**భావం–** శబరగిరి అనే శబరిమలపై నివసించేవాడు, సమస్తలోకాలకు ఏకైక పూజ్యుడు, నమస్కరించే జన సుఖకారి, భక్త హృదయ తాపహారీ దేవ రాక్షసుల చేత సేవింబడేవాడు, స్వర్గ, మోక్ష ప్రదాత, హరిహర కుమారుడు అయిన శాస్త అని పిలువబడే అయ్యప్ప స్వామి ఎప్పుడూ శుభాలనిచ్చుగాక.

## శ్రీ అభినవ విద్యాతీర్ధ అక్షర మాలా స్తోత్రం

1. అఖిలానంద సంధాయి మనోజ్ఞా ముఖ పంకజం– జగద్గురుం జగత్పూజ్యం విద్యాతీర్ధ మహం శ్రయే'

2. వట మూలం పరిత్యజ్య శృంగాద్రౌ నివాసన్ హి యః – తత్త్వం బోధయతే భక్తాన్ దక్షిణాస్యం తమాశ్రయే 'సాక్షాత్తు దక్షిణామూర్తి స్వరూపులైన విద్యాతీర్ధులు వట వృక్షాన్ని వదలి, శృంగేరిలో నివసిస్తూ భక్తులకు తత్వబోధ చేస్తున్న దక్షిణామూర్తిని ఆశ్రయిస్తున్నాన

.

3. 'అర్ధ మపూర్వం శ్రుతే ర్యస్తు యదావ బోధయన్– శిష్యన్ ధర్మ పదాసక్తాన్ కురుతే తమహం శ్రయే'

వేదార్ధాన్ని యధాతధంగా బోధిస్తూ, శిష్యులను ధర్మమార్గాన నడిపిస్తున్న విద్యా తీర్ధ యతీంద్రులణు ఆశ్రయిస్తున్నాను.

ఈ శ్లోకాల మొదటి అక్షరాలన్నీ కలిపితే శ్రీ అభినవ విద్యా తీర్ధ స్వామి పేరు వస్తుంది.

## శ్రీ చంద్ర శేఖర హారతీ నవ రత్న మాలా స్తోత్రం

శృంగేరి శారదా పీఠ 34వ అధిపతి, పరమహంస స్వరూపులైన శ్రీ చంద్ర శేఖర భారతీ స్వాములపై రాసిన స్తోత్రమే ఇది.

'శ్రీమచ్చందిరశేఖర భారత్యభి దాన మాశ్రయే యమినం – నిరవధి సంస్కృతీ నీరధి మగ్నజనోద్ధరణ బద్ధ దీక్షం తం'.

మరో శ్లోకం–

'రాకాశశి నిభ వక్త్రం, పాకారి ప్రముఖ కీర్త్య చారిత్రం – ఆకాశ కేశ భక్తం శోకాపహ మాశ్రయే గురూత్తం'

పూర్ణ చంద్రుని వంటి ముఖం, ఇంద్రాదుల చేత కీర్తింపబడే సత్ చరిత్రం ఉన్న మహేశ్వర భక్తులు, శోకాపహారి అయిన గురు వంద్యునికి నమస్కారం

## శ్రీ గురు ధ్యానం

తమ గురుదేవులు శ్రీ అభినవ విద్యా తీర్ధులపై చెప్పిన శ్లోకాలే ఇవి. మచ్చుకు–

'అజ్ఞాన ధ్వాంత విధ్వంసీ సహస్ర కర తేజసం – సచ్చిత్ సుఖాత్మక బ్రహ్మ నివిష్ట హృదయాంబుజం.

మరో శ్లోకం–

'దేహాది బ్రహ్మ పర్యంతే భోగ్యే తుచ్ఛ త్వదీయతం – ఆర్తానా మార్తి హన్తారం జిజ్ఞాసు విషయచ్ఛిదం'

### శ్రీ శారదాపంచ రత్న స్తుతి

'శ్రీ మచ్ఛంకర దేశికేంద్ర రచితే తుంగాపగాతీరగే – శృంగేరాఖ్య పుస్థితే సువిమలే సన్మౌనిసంసేవితే
పీఠే తాంరవి కోటి దీప్తి సహితాంరారాజ మానాంశివాం– రాజీవాక్ష ముఖామరార్చితపదాంవందే సదా శారదాం'
మరొక శ్లోకం–
'నిత్యా నిత్య వివేక దాన నిపుణాం స్తుత్యాం ముకుందాదిభిః – యత్యాకార శశాంక మౌళి వినుతాంసత్యాపిత స్వాశ్రయం
నత్యా కేవల మేవ తుష్ట హృదయాంత్యక్త్వాన్య దేవానాహం – భక్త్యా మే హృదయాంబుజే నవరతం వందే సదా శారదాం'
నిత్యం అనిత్యం అనే వివేకాన్ని ఇచ్చే నేర్పరి విష్ణ్వాదులచే అర్చింపబడేది శంకరాచార్య రూపశివునిచే స్తుతించబడేది, నమస్కార మాత్రం చేతనే సంతోషించేది. ఐన శారదా మాతను నేను ఎప్పుడూ నా హృదయంలో నమస్కరిస్తాను.

### శ్రీ శంకర భగత్పూజ్యపాదాచార్య స్తవః

'ముదా కరేణ పుస్తకం దదాన మీశ రూపిణం – తదా పరేణ ముద్రికాం నమోత్తమో విరాజితం
కుసుంభ వాస సావృతం విభూతి భాసి ఫాలకం – నతాఘనాశనే రతం నమామి శంకరం గురుం'
మరో శ్లోకం–
'యదీయ పుణ్య జన్మనాప్రసిద్ధ మాప కాలటీ(డీ)– యదీయ శిష్యతాం వ్రజన్ స తోటకోపి పప్రదే
య ఏవ సర్వ దేహినాం విముక్తి మార్గ దర్శకః – నరాకృతిం సదాశివం సదాభజామి సద్గురుం'
ఏ మహనీయుని అవతార క్షేత్రంగా కాలడి ప్రసిద్ధమైందో, ఏ మహాత్ముని శిష్యుడై తోటకాచార్యులు ప్రసిద్ధులైనారో, సకల మానవాళికి ఏ మహా పురుషుడు మోక్ష పదాన్ని చూపారో అలాంటి నరరూపధారుడైన పరమేశ్వరుడైన ఆ శంకరుని సదా సేవిస్తాను.

### శ్రీచంద్ర మౌళీశ్వరవర్ణమాలా స్తుతి

'శ్రీ శాశ్వతాముఖ్య సురార్చితాఙ్ఘ్రిం – శ్రీ కంఠ శర్వాదిపదాభిదేయం

శ్రీ శంకరాచార్య హృదబ్జ వాసం - శ్రీ చంద్ర మౌళీశ మహం నమామి
చివరి శ్లోకం-
'మిత్రం హి యస్యాఖిలశేవదీశః- పుత్రశ్చవిఘ్నౌఘ విభేదా దక్షః
పాత్రం కృపా యాశ్చ సమస్త లోకః - శ్రీ చంద్ర మౌళీశమహం నమామి'

**శ్రీ శారదా స్వర్ణ రథ సమర్పణాపద్యావళిః**

'శ్రీ శంకర గురూత్తంస సమర్చిత పదాంబుజే - శారదే రథ మారోహ సౌవర్ణం సర్వ మంగళే'
శ్రీ శంకర భాగవత్పాదులచే పరిపూజితం అవుతున్న సర్వ మంగళస్వరూపిణి శారదా దేవీ! బంగారు రధాన్ని అధిరోహించు.

మరో శ్లోకం-
'కనకా భరణైర్యుక్తే కవితా విభవ ప్రభే - కార్త స్వర మాయం మాతః ఆరోహ రధముత్తమం'

**శ్రీ గణపతి సేవా పద్యావళిః**

1. 'శ్రీమచ్ఛంకర దేశి కేంద్ర వినుత శ్రీపాద పాదోరుహహ- శ్రీ గౌరీ శశిశేఖర ప్రియ సుత శ్రీశాది సంసేవితః
శ్రీ వాణీప్రద పాద నమ్ర తతయేశ్రీ సిద్ధి బుద్ధి ప్రియ - శ్రీమాన్ దేవదయానిధే గణపతే ఋగ్వేద మాకర్ణయ'

2. సర్గస్థే మలయమ కరోతి జగతాం యోలీల యైన ప్రభుః- భర్గ ప్రీతి కరం యదీయ భజనం స్వర్గాపవర్గ ప్రదం
స త్వం హస్తిముఖ ప్రసన్న జనతా సంరక్షణే దీక్షిత - సుశ్రావ్యం సుర వృంద సేవిత యజుర్వేదం త్వమాకర్ణయ'
'శ్రీ భారతీ తీర్థుల కావ్య రచనలో భక్తి ధారాపాతంగా ప్రవహించి సాక్షాత్తు ఆది శంకరుల రచనేమో అనిపిస్తుంది. అన్వయ క్లిష్టత ఉండదు. సంస్కృత కావ్య నియమాలన్నిటినీ శ్రద్ధగా పాటించారు. ప్రతి శ్లోకం సహజ కవితా ముద్రాలంకార శోభితమై ఉంటుంది. స్వామి వారి శ్లోకాలలో అద్భుత మంత్ర శక్తి ఉంటుంది. భక్తితో చదివితే పుణ్యం, శాంతి సౌఖ్యాలు లభిస్తాయి' అన్న ఆచార్య పుల్లెల శ్రీ రామ చంద్రుడు గారి మాటలు అక్షర సత్యాలు. ❁

## 432. చమత్కార శతక కర్త – శ్రీ పి.టి.జి.వి. రంగాచార్యులు (1952)

**రా**ష్ట్రపతి పురస్కారగ్రహీత, స్వర్ణ ఘంటా కంకణాలంకృతులు బహు గ్రంథకర్త శ్రీ రంగాచార్యులు 1952లో కృష్ణా జిల్లా శ్రీరంగపురంలో జన్మించారు. సంస్కృతాంధ్రాలలో ఎం. ఏ. 'సంస్కృత వాఙ్మయలో వైజ్ఞానిక విశేషాలు' పై పరిశోధన చేసి పి.హెచ్ .డి.పొందారు. పాలకొండలో పనిచేస్తుండగా ఉత్తమ జాతీయ ఉపాధ్యాయ పురస్కార గ్రహీతలు. 1999లో స్వర్ణ ఘంటా కంకణం చేత అలంకరింప బడ్డారు. కూర్మనాధ సుప్రభాతం, అష్ట విధ క్రియ, కరతల సంస్కృతం, చమత్కార శతకం, శ్రీ ధర్మ శాస్త్ర సుప్రభాతం, షిర్డిసాయి సుప్రభాతం, వాజపేయి కవితా సంస్కృత రచనలు. ఒక ఉదాహరణ – "రాత్రౌ తు నూపురధారం బహు సుందరత్వాం – నృత్యంత మద్భుత తనుం,న్ముదీక్ష్య భక్తాః–ఖంజీర వాదక మహో పరి తోష యంతి–శ్రీ షిర్డీ భగవన్ తవ సుప్రభాతం".❁

## 433. శ్రీ దీవి నరసింహ దీక్షితులు (1952)

**క**వి, పత్రికా రచయితా అయిన శ్రీ దీక్షితులు గేయ, పద్య కావ్యాలు సంస్కృతంలో రాశారు. పద్య కావ్యాలు – విశ్వ నృత్యం, సాగర జీవితం, నభో నర్తకి, వందే హనూ మంతం, అంకితం, నృత్య రూపకంగా 'శ్రమ ఏవ జయతే' రాశారు. 'భారతీ భూషణం'లో భారత దేశ ప్రధాన మంత్రుల జీవిత చరిత్రలను రాశారు.

శ్రీ జొన్నా భట్ల గోపాల కృష్ణమూర్తి

సంస్కృతంలో జొన్నాభొట్ల కృష్ణ మూర్తిగారు 'శ్రీ కృష్ణ భాగవతం' రాశారు.❁

## 434. శ్రీ కానాల నల చక్రవర్తి (1953)

**ఆ**త్మకూరుకు చెందిన కానాల వారు తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠంలో పని చేస్తున్నారు. సంస్కృత విద్యపై బహుగ్రంథ రచన చేశారు. వారి రచనలలో 'శ్రీ వెంకటేశ్వర శతకం, శ్రీ మళయాళ యతీంద్ర శతకం, వాల్మీకి మహర్షేః-విప్లవాత్మక భావః, ఆటవిక బాలకః' ముఖ్యమైనవి.

## 435. శ్రీ సత్యసాయి స్తోత్రం రాసిన - శ్రీ మేదూరి సూర్యనారాయణమూర్తి (1954)

**1**954లో పాలకొండలో పుట్టిన సూర్యనారాయణమూర్తిగారు మహారాజ కాలేజిలో సంస్కృతం చదివి తెలుగుపండితులుగా పాలకొండ వగైరాలలో పని చేసి డెంకాడజూనియర్ కాలేజిలో అధ్యాపకులయ్యారు. సంస్కృతంలో దుర్గాంబ శతకం, శ్రీ కూర్మనాథ సుధా, భవానీ శతకం శ్రీ రమణ సుధా శ్రీ సత్య సాయి స్తోత్రం రాశారు. ఇందులోంచి ఒక ఉదాహరణ- 'సత్య ధర్మ శమా కారం సద్గుణానాం జలాకరం - సమస్త సజ్జనాధారం సాయినం ప్రణమామ్యహం - ప్రశాంతి నిలయోద్భాసీ ప్రసాద గుణ భూషణః-అశాంతి వారకస్సాయీ వసేత్ హృది మమానిశం'.



## 436. భాషా శాస్త్ర వేత్త, న్యాయ విద్యా ప్రవీణ, వేదాంతాచార్య శ్రీ గబ్బిట ఆంజనేయశాస్త్రి (1955)

**శ్రీ** గబ్బిట ఆంజనేయ శాస్త్రి 15-8-1955న కృష్ణా జిల్లా పెదపారుపూడి మండలం ఎలమర్రు గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ గబ్బిట మేధా దక్షిణా మూర్తి శాస్త్రి గారు, తల్లి శ్రీమతి భ్రమరాంబ గారు. కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠంలో చదివి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో చేరి 1980లో ఎం ఏ చదివి పాసైనారు. 1979లో శ్రీమతి పద్మావతి గారిని వివాహం చేసుకున్నారు. వీరికి నలుగురు కుమారులు - శ్రీ గోవర్ధన సుందర దాస్, సీతా రామ శర్మ, జయ మాణిక్య శాస్త్రి, శ్రీ యజ్ఞేశ్వర దక్షిణామూర్తి శాస్త్రి. 82లో గుంటూరు విద్వత్ పరిషత్, గౌరవ డాక్టరేట్నిచ్చి గౌరవించింది. తిరుపతి కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం 1985లో గౌరవ డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ పురస్కారమిచ్చి సన్మానించింది.

.

గుంటూరులో డాక్టర్ శ్రీ కొలచల వెంకట కృష్ణ శాస్త్రి గారి సంస్కృత కళాశాలలో 1977నుండి 83వరకు లెక్చరర్ గా పని చేసి 1983-88 కాలంలో తిరుపతిలోని న్యాయ సంస్కృత విద్యాపీఠంలో సేవలందించి, తర్వాత బెనారస్లోని న్యాయ వైదిక దర్శన సంస్కృత కళాశాలలో రీడర్గా ఉన్నారు. 1988నుండి బెనారస్ హిందూ సంస్కృత విశ్వ విద్యాలయంలో సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేశారు.

శాస్త్రి గారి గీర్వాణ రచనలు -1982లో మాణిక్య ప్రభ రాశారు. 1995 మాదూర్ గదాధరో మత భేద విమర్శ రచించారు. 1987 లో 'పంచలక్షణ శతకోటి'కి

సంపాదకత్వం వహించారు. రామ రుద్రీయ వ్యుత్పత్తి వాదం మొదలైన వాటిపై ధారావాహికంగా 1978 నుండి 1981 వరకు నాలుగేళ్ళు రేడియో ప్రసంగాలు చేశారు.

ఆంజనేయ శాస్త్రిగారు 1984–88 వరకు తిరుమల తిరుపతి దేవస్థాన ఉపన్యాసకులుగా ఉన్నారు. వారణాసి కే కే డిలో, హైదరాబాద్ లోని డివైన్ లైఫ్ సొసైటీలో సభ్యులు వక్తలుగా ఉన్నారు. సంప్రదాయ న్యాయ మీమాంస శాస్త్రాలను బోధించటమే శాస్త్రిగారి ముఖ్య అభిరుచి.

1670 కాలపు వాడైన నాగేశభట్టు భట్టోజీ దీక్షితుల భారతీయ పంచాంగం ప్రకారం కాల, తిది నిర్ణయంపై సంస్కృత రచన చేశారు. మాణిక్య ప్రభు తర్కామృతంపై సంస్కృతంలో శాస్త్రిగారు 'సంస్కృత వ్యాఖ్యా విభూషితం తథా మణిప్రభ హిందీ వ్యాఖ్య సంవలితం' రాశారు. దీనిని వారణాసి శారదా సంస్కృత సంస్థానం 2012లో ప్రచురించింది. ఇది న్యాయ తత్వ శాస్త్రంపై మహా వ్యాఖ్యానం. జ్యోతిశ్శాస్త్రంపై కాళిదాసుని 'కాలామృతం'కు చింతలపాటి వెంకట యజ్వతో కలిసి వ్యాఖ్యానం రాశారు. దీన్ని తిరుపతి వేద విశ్వ విద్యాలయం ముద్రించింది. 1600 కాలం వాడైన మధురానాద తర్క వాగీశుని 'మాధురి' 17,18శతాబ్దాలకు చెందిన గదాధర భట్టాచార్య రాసిన 'గదాధరి', 13వ శతాబ్దికి చెందిన గణేశుని 'తత్వ చింతామణి' వ్యాఖ్యానాలను తులనాత్మకంగా పరిశోధించి శాస్త్రిగారు 'మాధురి గదాధర్యో మత భేద విమర్శ' అనే ఉద్గ్రంధాన్ని రాశారు. దీన్ని తిరుపతి పద్మావతీ ప్రకాశన సంస్థ ప్రచురించింది. రామరుద్రి రాసిన నవ న్యాయ సిద్ధాంతంపై రామ రుద్ర భట్టు రాసిన వ్యాఖ్యానంపై వ్యుత్పత్తి వాదః – రామ రుద్రీయ వ్యాఖ్యన సహితః రాశారు. దీనిని న్యు ఢిల్లీ సంస్కృత సంస్థానం ముద్రించింది. ఆదిత్యాచార్య వైదిక కర్మకాండలపై రాసిన 'షడా సితి'పై నంద పండిత వ్యాఖ్యాన పరామర్శ రాశారు. దీన్ని వారణాసిలోని ఇండలాజికల్ రిసెర్చ్ సంస్థ ముద్రించింది.

'న్యాయ విద్యా ప్రవీణ' మరియు 'వేదాంతాచార్య' బిరుదులు. శ్రీ ఆంజనేయ శాస్త్రి గారి న్యాయ, మీమాంసా శాస్త్ర పాండిత్యానికి, వేదాంత ప్రతిభకు సార్ధకతను చేకూర్చాయి. ❀



## 437. శతావధాని శేఖర శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ (1957)

**3**-10-1957న గుంటూరు జిల్లా పొన్నూరులో పూర్ణాంబ, వెంకట సుబ్బారావు దంపతులకు జన్మించిన "అవధాని శేఖర" శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, కృష్ణాజిల్లా అవనిగడ్డలో ప్రాధమిక మాధ్యమిక విద్య నేర్చారు. వీరి సహాధ్యాయి ప్రస్తుత ఆంధ్ర రాష్ట్ర శాసన సభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్. పొన్నూరు శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాలలో చదివారు. శ్రీమతి భానుమతిని అర్ధాంగిని చేసుకున్నారు. తెలుగులోనూ, సంస్కృతంలోను ఎం.ఏ.పాసై ఈ రెంటిలోనూ పి.హెచ్.డి.సాధించారు. సంస్కృతంలో విశ్వనాధ రాసిన రూపకాలపై పరిశోధనచేసి డాక్టరేట్ పొందారు. విజయవాడ సయ్యద్ అప్పలస్వామి సంస్కృత కళాశాలలో సంస్కృత శాఖాధ్యక్షులుగా పని చేస్తున్నారు. విజయవాడలో వీరు పాల్గొనని సాహిత్య సభ లేదు. రేడియోలో ప్రసంగించని విషయం లేదు.

**తెలుగు రచనలు**

మనస్సాక్షి మహాభారతం, పద్మ వంశి, తల్లా పిచ్చయ్య ప్రకాశం, ధర్మ భిక్ష పద్య కావ్యం జైన ధర్మ శతకం, వెంకయ్యస్వామి జీవిత చరిత్ర,

శంకరాచార్యస్వామి కృతికి అనువాదంగా "కాశీ సారం" రాశారు.

**సంస్కృత రచనలు**

సంస్కృతంలో శ్రీ షిర్డీ సాయి సహస్ర నామ స్తోత్రం, శాంతి సూక్తం, కాశీలోని శ్రీ విశ్వేశ్వర స్వామిపై సుప్రభాతం రాశారు. దీనిని స్వామికి సమర్పిస్తే అక్కడి పూజారులు, ఆలయ నిర్వాహకులు ఆశ్చర్యపడి లక్ష కాపీలు ప్రచురించి అందరికి ఉచితంగా అందజేశారు. "పంచారామ పంచభూత లింగ సుప్రభాతం" రాసి భక్తీ రచనలో మేటి అనిపించారు. ప్రసిద్ధ సంస్కృతకవులపై వీరు "ఉత్తమ శ్లోకాః"రాశారు. "వరూధినీ ప్రవరాఖ్యం" గద్య నాటిక రాశారు.

కకపాలీ, ధునీ పాత్రీ, ధూమ నాళీ, విభూతి మాన్ - శ్రీ మాన్ షిర్డీ వాసశ్చ సాయి దేవో భి రక్షతు అని "శ్రీ షిర్డీ సాయి సహస్ర నామ స్తోత్రం"లో అన్నారు. శాంతి సూక్తం లో "చాంద్రీ స్వచ్ఛ శిరీష పేశల భవన్నేత్రాంత వీక్షామహ- స్సీమా దర్శన కౌతుకాః దశ దిశాపర్యాప్త భూమ్యైకసః
నిత్యం మృత్యు భయాత్ ప్రపంచజ సుఖే వైరాగ్య వంతో నరః- నాన్యాశా ఇహ శాంతి దేవి మనసా కుర్వన్తి తే స్వాగతం" అని శాంతి దేవిని ఆహ్వానించారు .

**అవధాన ప్రక్రియ**

2013 డల్లాస్‌లో జరిగిన 19వ తానా సభలో 'అవధాన ప్రక్రియ' పై వివరించారు. శ్రీ గరికపాటి నరసింహారావు గారితో కలిసి అవధానం చేశారు. న్యూయార్క్ లో తెలుగు లిటరేచర్ అండ్ కల్చర్ అసోసియేషన్ వారి ఆహ్వానంపై 'అష్టావధానం' చేశారు. లండన్ నగరం లో 'అచ్చతెలుగు అవధానం' నిర్వహించారు. 25-12-1995లో విజయవాడలో 'ఏకదిన సంపూర్ణ సంస్కృతాంధ్ర శతావధానం' చేశారు. తాడికొండ గోగినేని కనకయ్య సంస్కృత కళాశాలలో సంస్కృతావధానం చేశారు. చిత్రాక్షరిని 'సంస్కృతాంధ్ర కళానందైః పండి తైః పరి శోభితం - కానకీం తాం కళాశాలాం వందే విజ్ఞాన రూపిణీం' అని పూరించారు. మొత్తం మీద 500 అష్టావధానాలు, మూడు శతావధానాలు చేసిన

అవధాన సరస్వతి శ్రీ శ్యామలానంద .

భక్తీ టి.వి లో ధర్మసందేహాలు తీర్చారు. అనేక భువన విజయాలలో నటించి మెప్పుపొందారు. రేడియో స్టేషన్ డైరెక్టర్ శ్రీ మంగళ గిరి ఆదిత్య ప్రసాద్ గారి ఆధ్వర్యంలో జరిగిన 'ఆధునిక గిరీశం – వెంకటేశం ' రూపకంలో ఆదిత్యప్రసాద్ ఆనంద గజపతి వేషం వేస్తే సర్వశ్రీ ధారా రామనాధ శాస్త్రి, పింగళి కృష్ణారావు, పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, జంధ్యాల మహతీ శంకర్, పువ్వాడ తిక్కన సోమయాజి మొదలైన వారు గురజాడ అప్పారావు ఆదిభట్ల నారాయణదాసు మొదలైన వారి వేషాలు ధరించి రక్తి కట్టించారు. భారతదేశ స్వాతంత్ర్య రజతోత్సవ సందర్భంగా విజయవాడ మేరీస్ స్టెల్లా కాలేజిలో 2008 ఆగస్ట్ 11,12 తేదీలలో యు జి సి వారు నిర్వహించిన జాతీయ సంస్కృత సెమినార్ లో కృష్ణా జిల్లా సంస్కృత రచయితల గురించి పత్ర సమర్పణ చేశారు. కృష్ణాజిల్లా రచయితల సంఘ కార్యక్రమాలలన్నిటికి పండితునిగా వ్యవహర్తగా, విశ్లేషకునిగా కార్యకర్తగా పనిచేసి విజయాలకు తోడ్పడుతారు.

**బిరుదులూ సత్కారాలు**

"అవధాన కళాసరస్వతి", అవధాన శారద" "శతావధాని శేఖర "బిరుదులను పాలపర్తివారు వారి అవధాన ప్రక్రియా ప్రదర్శనకు అందుకున్నారు. చతుర్గుణిత అవధానం చేసి మెప్పుపొంది 'అవధాన చతురానన' అనే బిరుదుతో సార్ధక నామదేయులయ్యారు.

శ్యామలానంద ప్రసాద్ ప్రతిభకు తగిన పురస్కారాలెన్నో అందుకున్నారు. మొదటగా తెలుగు విశ్వవిద్యాలయ పురస్కారం పొందారు. అధికార భాషా సంఘం పురస్కారాన్ని అందుకున్నారు. నూతన ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం ఉగాది పురస్కారాన్ని ఇచ్చి సత్కరించింది.

ఎన్ని బిరుదులూ ఉన్నా పురస్కారాలు పొందినా,గీర్వాణ, ఆంధ్రాలలో ఎంతో విద్వత్తు, ప్రతిభా, కవితా సామర్ధ్యం ఉన్నా అతి నిరాడంబరంగా అత్యంత వినయంతో, భేషజం లేకుండా అందరికి తలలో నాలుకగా ప్రవర్తించే వ్యక్తిత్వం శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాదావధాని గారిది.❁

## 438. శ్రీ శ్రీ దూపాటి వెంకట రామణాచార్య (–1961)

**శే**షాద్రి రమణ కవులలో వీరు ఒకరు. 'మేదినీ కోశం, ఏకాక్షర నిఘంటు మాల, విశ్వ నిఘంటు, అమర శేషం' కూర్చారు. 1961లో చనిపోయారు.❀



## 439. శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ (1967)

**సా**మవేదం షణ్ముఖశర్మ ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త, కవి మరియు సినీ గేయ రచయిత. ఋషిపీఠం అనే పత్రికకు సంపాదకుడు.

షణ్ముఖశర్మ 1967లో ఒడిషా – ఆంధ్రప్రదేశ్ సరిహద్దుపైన ఉన్న గంజాం జిల్లా, అస్క గ్రామంలో, పండిత కుటుంబంలో పుట్టి పెరిగాడు. బరంపూర్ విశ్వవిద్యాలయంలో ఆర్థిక శాస్త్రంలో ఆనర్స్ డిగ్రీ పొంది సాహితీ పిపాసను తీర్చుకోవటానికై ఉపాధిని వెతుక్కుంటూ విజయవాడ చేరాడు. 1988లో స్వాతి వారపత్రికలో ఉపసంపాదకుడిగా చేరి అక్కడ ఏడేళ్ల పాటు పనిచేశాడు. తన గీతరచనా నైపుణ్యానికి విజయవాడలోని స్వాతి కార్యాలయంలో పునాది పడిందని శర్మ చెప్పుకున్నాడు.స్వాతి పత్రిక సంపాదక బృందంలో పనిచేసి సంపాదించిన అనుభవం ఋషిపీఠం అనే ఆధ్యాత్మిక పత్రిక యొక్క స్థాపనలో సహకరించింది. ఋషీపీఠాన్ని గుంటూరులో ప్రసాదరాయ కులపతి (ఇప్పుడు సిద్ధేశ్వరానంద భారతిగా పేరుబడ్డారు) వంటి పండితుల సమక్షంలో ప్రారంభించాడు.

శర్మ తొలుత భక్తిగీతాలు వ్రాయడంతో గీతరచనను ప్రారంభించాడు. ఈయన వ్రాసిన భక్తిగీతాలను నేపథ్యగాయకుడు ఎస్.పీ.బాలసుబ్రమణ్యం

సహాయంతో ఒక ఆడియో ఆల్బంను కూడా విడుదల చేశాడు. ఆ ఆల్బం బాగా విజయవంతమవడంతో చెన్నైలోని సినీ రంగంలో కూడా గీతరచనా అవకాశాలు వచ్చాయి. కొంతకాలం పాటు సినీరంగంలో పాటలు వ్రాసిన తర్వాత ఆధ్యాత్మిక ఉపన్యాసాలను వ్రాయటం వాటిపై సభలలో ఉపన్యాసాలు ఇవ్వటమనే మరో ఉన్నత శిఖరంవైపు దృష్టి మరల్చాడు.

పురస్కారాలు: 1) కౌతా పూర్ణానందం స్మారక పురస్కారం, 2) బ్రహ్మ తత్వార్థ నిధి (2008),3) సమైక్య భారత గౌరవ సత్కారం(2003), 4) శ్రీ భారతీ పురస్కారం(2002), 5) వేదిక సేవా ట్రస్ట్–ఉగాది పురస్కారం(2005), 6) వేదాంత శిరోమణి(2007), 7) వేద విద్యా విశారద(2012), 8) కచ్ఛపి తంత్రి విశారద, 9) ధర్మ దర్శన దర్పనః(2003),10) సమన్వయ సరస్వతి (2005), 11) బాదం సరోజినీ దేవి స్మారక పురస్కారం(2008), 12) శ్రీమతి ద్వాదశి లక్ష్మి ప్రసన్న స్మారక పురస్కారం(2009), 13) సాహితీ పురస్కారం(2008),14) వ్యాఖ్యాన వాచస్పతి(2005), 15) సమన్వయ సామ్రాట్(2006), 16) వేద విజ్ఞాన భాస్కరుడు (2008), 17) అర్ష ధర్మోపన్యాస కేసరి (2005), 18) వాగ్దేవి వరపుత్ర(2006), 19) వాగ్దేవీ పుత్ర, 20) విద్యా వాచస్పతి(2010), 21) అద్వైత భాస్కర(2010), 22) అభినవ షణ్మత స్థాపనాచార్య(2010), 23) వేదాంత విద్యా నిధిః(2010), 24) సర్వ శాస్త్ర సమన్వయ శిరోమణి(2010). ❁

## 440. శ్రీ ఒద్దిరాజు సోదరులు (1970)



**ఒ**ద్దిరాజు సోదరులైన సీతా రామ చంద్రరావు, రాఘవ రంగారావులు పాణిని అస్టాధ్యాయికి 'వ్యాఖ్యానం' రాశారు. అలాగే 'భట్టికావ్యం' పైనా వ్యాఖ్య రచించిన విజ్ఞాన సర్వస్వం అనిపించే సమర్ధ జ్ఞాన సంపన్నులు. సంస్కృత పాఠశాల ఏర్పరచి సమర్ధంగా నిర్వహించారు. ❁



## 441. శ్రీశైల తీర్ధ సారం రాసిన శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారు (20వ శతాబ్ది పూర్వార్ధం)

బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు అనే చందవోలు శాస్త్రిగారి పితృ దేవులేవెంకటప్పయ్య శాస్త్రిగారు. తండ్రి హనుమచ్ఛాస్త్రి, తల్లి లక్షమ్మ. పరమ నిస్టా గరిస్టులని పేరొందినవారు. శ్రీమతి హనుమమ్మను వివాహమాడారు. పరమ నిష్టా గరిష్టంగా జీవిస్తూ శిష్యులకు విద్య గరపేవారు. శ్రీరామ కథామృతం అనే మహత్తర కావ్యాన్ని ఆరు కాండలలో రాశారు. ఇది రామాయణమే. ఉత్తర రామాయణాన్ని ఉత్తర కాండగా మహా గ్రంథంగా రచించారు. చివరలో ఉండగా పరమపదిస్తే కుమారులు రాఘవ నారాయణశాస్త్రి గారు పూర్తి చేశారు. ఇదికాక మరొక యాత్రా సందర్భనం వంటి కావ్యం శ్రీశైల తీర్ధసారంను 34 అధ్యాయాలలో విపులంగా వర్ణించారు. వీరి ఇతర రచనలు కవి గుణ ప్రకాశిక, త్రిశంకు స్వర్గం నాటకం, బద్రాయురుపాఖ్యానం, శ్రీ శంకర విజయ కథాసార సంగ్రహస్తోత్రం. వీరు తమ ముఖ్య గురువులుగా శ్రీ కొలిచిన యజ్ఞనారాయణ సోమయాజి దీక్షితులు గారని చెప్పుకున్నారు. దీక్షితులుగారు తర్వాత సన్యాసం స్వీకరించి కళ్యాణానంద స్వామిగా మారారు.

### శ్రీ శైల తీర్ధ సారం

ఇందులో శ్రీ వెంకటప్పయ్య శాస్త్రిగారు 34 వ చివరి అధ్యాయంలో తమ గురించి చెప్పుకొన్నారు. వెలనాటి బ్రాహ్మణులమని వాస్తవానికి తమ వంశమూల పురుషుడు రామభట్టు అని ప్రపితామహుడు సింగరాయ సింహ అని సుబ్రహ్మణ్య అవధాని పితామహులని బుచ్చయ్యగారు తమ సద్గురువులని, తమ తలిదండ్రుల సంతానంలో తానే పెద్దవాడినని శ్రీ కళ్యానంద భారతీస్వామి గురువర్యుల కటాక్షం తమపై ఉందని రామకథామృతం, దత్త పురాణం స్వయంగా రాశానని స్కాంద పురాణంలో ఉన్న శ్రీశైల తీర్ధసారంను సంస్కృతంలో రాసి శ్రీ పరమేశ్వరార్పితం చేశానని సవినయంగా తెలియజేశారు.

ప్రధమాధ్యాయం ఓమిత్యేకాక్షరం బ్రహ్మ శాశ్వతం శివ మచ్యుతం– ఈశానం

భూత భవ్యస్య భర్గో దేవస్య ధీమహి అనే శ్లోకంతో ప్రారంభించారు. మహిత మహిత వర్గ ధ్వంసి మల్లీశితు స్త– చ్చరితం మఖిల హృద్యంసర్వస్సార భూతం– రస యతి యది మర్త్యః కోపి మృత్యం నిరస్యో– ల్లసతి తరతి శోకం ప్రాంచతి బ్రహ్మలోకం అని ఫలశృతి చెప్పారు. మూడధ్యాయాలు ఉపన్యాస ప్రకరంగా రాసి నాలుగులో వ్యాసుడు కాశీ వదిలివేసే కథను చెప్పారు. అయిదులో అగస్త్యర్షి వింధ్య పర్వత గర్వం ఖర్వం చేయటం చెప్పి, ఆరులో శ్రీశైల మహిమ వర్ణించారు. తీర్థం లింగం వనం కుండ మసంఖ్యాతం, తదా గుహాన్– సర్వం శ్రీశైల సంస్థానే జగత్పావన మీరితం అన్నారు. అక్కడి ప్రతిశిలా శివయోగిలా దర్శనమిస్తుందన్నారు.

ఏడవ అధ్యాయంలో శ్రీ గిరి ప్రభావాన్ని చెప్పారు. “సేవే శ్రీ గిరి శ్రుంగ రంగ నటనోదయ ద్విస్ఫుర చంద్రికా– శ్రీ వర్ధిష్ణు సుధా మయూఖ నన లక్ష్మీ భ్రుజ్జటామండలం– ప్రావారోచిత మల్లికా కుసుమ సంభార ద్యాష స్సంభ్రుతి– ప్రావీణ్య ప్రధమా నసద్గుణ గణం మల్లీశ్వరం ప్రత్యహం” అని ప్రభావాన్ని మహాభక్తిగా రసబంధురంగా చెప్పారు. కవిత్వం పాతాళ గంగా సదృశ్యంగా జాలువారింది. ఏడు ఎనిమిదిలలో శిలాతనయుడి శివ ప్రసాద లబ్ధి, తొమ్మిదిలో శ్రీ పర్వతసిద్ధి కథనం, పదిలో చంద్రావతీ చరిత్ర, పదకొండులో మల్లికార్జున పేరు వచ్చిన విధం వివరించారు. పన్నెండులో అమ్మవారు అయ్యవారుల మృగయా విహారం, పదమూడులో విప్రలంభ శృంగారం, పధ్నాలుగులో మల్లికార్జున సమాగమం, పదిహేనులో శిబి చక్రవర్తి శరీర దాన కథ, పదహారులో కపోతాపాఖ్యానం ఉన్నాయి. శివుని పేరుతో అప్పయ్య శాస్త్రిగారికి పూనకమే వస్తుంది”– నమో భవాయ భువన సృష్టి హేతవే– నమో మ్రుడాయ తదను పాలనోద్యతే– నమోహరాయ తదుప సంప్రుతి స్ఫురే– నమశ్శివాయ భవ విముక్తి దాయినే” అని పొంగిపోయి రాశారు. పదిహేడులో శిబి కైలాసప్రాప్తి, 18లో త్రికూటాచల క్షేత్ర వివరణ, 22లో పరదేశియతి నిర్యాణం, 23లో అనంత తీర్థ వివరం, 24, 25లో నందారాధ్య చరిత్ర ముక్తి, 26లో శివ పారమ్య కథనం, 27లో పంచాక్షరీ మంత్రం మహిమను చెబుతూ అక్ష్య్య ఫల మాప్నోతి స ఇష్టాపూర్తయోన్నరః– ఉపాస్తే దీక్షయా నిత్యం మంత్ర రాజం శివస్యయః అని మహిమ వర్ణించారు. 28లో శివపూజా ప్రభావం, 29లో భస్మ ప్రభావం, 30లో “రుద్రాక్ష ప్రభావం చెబుతూ రుద్రాక్ష వ్రత నిష్టస్య జప హోమార్చనాదికం– రక్షోఘ్నంశివ సాయుజ్య దాయకం” అన్నారు. 32లో వైశ్యకుమారుని శివలోక ప్రాప్తి, 33లో అంకినీడు ప్రభువుకు శివ ప్రసాద లబ్ధి, చివరిదైన 34న సర్గలో దుర్గాక్షేత్ర మహాత్మ్యం చెప్పి శ్రీ శైల సారోఖ్యోయంను శ్రీ తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారు పూర్తి చేవారు. చాలా సులభమైన సుందరమైన సరళమైన శ్లోకాలతో గ్రంథ రచన సాగింది. హాయిగా తెలుగు చదువుతున్నట్లే అనిపిస్తుంది. అన్వయ కాఠిన్యం లేని బహు సుందర రచన ఇది. తెలుగు వారికి గర్వకారణం.❁



## 442. డా. శ్రీ ధూళిపాళ అర్క సోమయాజి (20వ శతాబ్దం)

**వే**దగణితంలో డాక్టరేట్ పొందిన శ్రీ ధూళిపాళ అర్క సోమయాజి సంస్కృత కావ్యాలెన్నో రాసి విద్వత్తుకు తగ్గ ప్రశంసలు పొందారు. ఆయన శిష్యులనేకులు పేరు పొందారు. సిద్ధాంత శిరోమణి భాస్కరాచార్య ఇంగ్లీష్ గ్రంథం రాశారు. ఏ క్రిటికల్ స్టడి ఆఫ్ యెన్సేంట్ ఆస్ట్రానమి, సం జెమ్స్ ఇన్ ది ఓషన్ ఆఫ్ సాంస్క్రిట్‌తో బాటు పిల్లలకు ఎన్నో గ్రంథాలూ రాశారు. సంస్కృతంలో లఘు కావ్యం కోహం రచించారు. ఒకటి రెండు శ్లోకాలు చూద్దాం– కుతో దేశ గర్భాత్ అహం సంప్రజాతః – గమిష్యామి కుత్రేతివాహం న జానే చివరి శ్లోకం– నరత్వేన జాతో మహాదేవదేవ– త్వదీయ దయా దదౌ జన్మతాద్రిక్

శ్రీమత్ ప్రసన్నాంజనేయ, నామ హనుమత్సందేశం, మందా క్రాంత సప్తశతి, బ్రహ్మాన్జలినామ పరమేశ్వరార్పిత శ్లోకమాలిక, జ్యోతిర్జీవనమ్ మొదలైన సంస్కృత రచనలు చేశారు.❁

## 443. శ్రీ కందుకూరి రామారావు (20వ శతాబ్దం)

**హి**మాలయ వర్ణనం కావ్యం రాసిన శ్రీ కందుకూరి రామారావు సంస్కృత రచనలో సిద్ధ హస్తులు. ఇందులో ఒక శ్లోకం "బభౌ స హిమవాన్ రాజా, కాంచీ భూత మహార్నవః – ఆవ రోహణ సుస్తంభః సూర్య లోక సుధర్వణః"❁

## 444. శ్రీ వడ్లమాని లక్ష్మీ నరసింహ శాస్త్రి (20వ శతాబ్దం)

'**రై**ల్ యాత్ర' మొదలైన ఖండకావ్య నిర్మాత శ్రీ నరసింహ శాస్త్రి. ఉదాహరణగా ఒక శ్లోకం– "మయా క్రుతమిదం గ్రంధం తీర్ధ యాత్రా విరాజితం – శృణు త్వం సావదానేన శ్యామలే లలితాంబికే"✺

## 445. శ్రీ వేదుల సూర్య నారాయణ శాస్త్రి (20వ శతాబ్దం)

**శ్రీ**పతి చరితంను గొప్ప కవితా ధారగా రాసిన శ్రీ శాస్త్రిగారు బహు గ్రంధ కర్త. ఒక శ్లోకం – "కాన్తానాం సదనం సుధాంశు సదనం చేస్టం సురాన్న ప్రపా – వక్షోజై సుమ కందు కౌ సునయనే నిర్నిద్ర నీలోత్పలం" అని గొప్ప అలంకార యుతం గా రాశారు. మరొకటి – "దంతా మౌక్తిక తల్లజా ఇతిజానా భ్రామ్యంతి మొహాటవీ – మధ్యే త్వ కుస్రాణి మిషా స్తినికరం సర్వం చ త్వంఘ్రీపతే".✺

## 446. శ్రీ కొత్తపల్లి ఘనశ్యామలరావు (20వ శతాబ్దం)

**రా**వు గారు అనేక గీర్వాణ లఘు కవితలు రాశారు. అందులో ''భారత ప్రశస్తి, శ్రీమాతం' కొన్ని మాత్రమే. శ్రీ రాణి సదాశివ మూర్తి 'జగన్నాధ సుప్రభాతం శారదా స్తవ మంజరీయం, ఋతు సందేశం, వాస్తు పురుష అస్టోత్తరం చాక్షుష యుగ్మం, అగ్నిపిత్రకావ్య రచన చేశారు. శ్రీ ఖండవల్లి సూర్య నారాయణ శాస్త్రి 'కాళిదాసకవితా సౌరభం' రాశారు. శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రి కంసవధం, శ్రీ పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రి 'ఆర్యా శతకం', మహీధర వెంకట రామ శాస్త్రి 'కళ్యాణ మైత్రీ', యారం సూరి మల్లికార్జున' రాయ కళాపూర్ణోదయ సంస్కృత గద్య రచన చేశారు.✺



## 447. శ్రీ చర్ల గణపతి శాస్త్రి (20వ శతాబ్దం)

**వే**దం వేదాంగ శాస్త్ర ఉపనిషత్‌లలో నిష్ణాతులు శ్రీ చర్ల గణపతి శాస్త్రి .బహుగ్రంధ కర్త 'వైశేషిక మీమాంసా దర్శనం, గాంధర్వ వేదం సంగీత రత్నాకరం, హరిహర మహిమా స్తోత్రం, గౌడ పాదీయకారిక, వేద విజ్ఞానం మొదలైనవి శాస్త్రిగారి రచనలు.

కాకరపర్రు, పశ్చిమ గోదావరి జిల్లా, పెరవలి మండలానికి చెందిన గ్రామము. పాలకొల్లు మరియు నిడదవోలు ప్రధాన రహదారిపై పెరవలికి మూడు కిలోమీటర్లు దూరంలో ఉన్న ప్రశాంతమైన గ్రామం. ఊరిలో ప్రధానంగా బ్రాహ్మణులకు ప్రాధాన్యం కలదు. ఈ గ్రామం ఒకప్పుడు అగ్రహారం. రాణి రుద్రమదేవి ద్రాక్షారామ సందర్శన సమయములో బ్రాహ్మణులు కొంతమంది వారికి గోదావరి తీర ప్రాంతమునందు ఒక స్థానము కల్పించమని కోరిన వెంటనే రాణి వారికి ఈ గ్రామమును ఏర్పాటు చేసెను. గోదావరి తీరప్రాంత గ్రామము అయినందున వరి పంట అత్యధికంగా పండించువారు కలరు. మలిపంటగా పసుపు, కంద పండిస్తారు. ఇవేకాక పూలతోటలు, కూరగాయలతోటలు కూడా కలవు. ప్రముఖ కవి, వచనకర్త అయిన ఉషశ్రీ అసలు పేరు పురాణపండ సూర్యప్రకాశ దీక్షితులు (1928 – 1990) యొక్క జన్మస్థలం. ప్రముఖ వేద పండితులు, ప్రాచీన గ్రంథ అనువాదకులైన చర్ల గణపతిశాస్త్రి మరియు వీరి తండ్రి సంస్కృతాంధ్ర పండితుడు, విమర్శకుడు అయిన చర్ల నారాయణ శాస్త్రి గార్ల జన్మస్థలం. వీరుకాక శ్రీ అప్పల సోమేశ్వర శర్మ ,శ్రీ మద్దులపల్లి దత్తాత్రేయ శర్మ, శ్రీ పేరాల భారత శర్మ, శ్రీ జి వి ఎస్ సుబ్రహ్మణ్య శర్మ శ్రీ వాసా సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ వేలూరి సుబ్బారావు కూడా గీర్వాణ రచన చేశారు.❁

## 448. శ్రీ శ్రీ భాష్యం విజయ సారధి (20వ శతాబ్దం)

**రా**ష్ట్రంలోనేకాక రాష్ట్రేతరంగా కూడా సంస్కృతంలో ప్రాముఖ్యం పొందారు. సంస్కృతంలో 20 ఖండ కావ్యాలు రాశారు. అందులో మణిపూస 'మందాకినీ' అనే దీర్ఘ కవితా కావ్యం. గంగానది ఆకాశం నుండి దిగినట్లు అతి వేగంగా ప్రవహించినట్లు కవితా ప్రవాహంతో రాశారు. 'బిర్లా ఫౌండేషన్ అవార్డ్' అందుకున్నారు.

– శ్రీ పెరుమ్బుదూర్ రాఘవాచార్య బహు స్తోత్ర స్తుతులు రాయగా, శ్రీ నల్లడిగ శ్రీనివాసాచార్య 'భద్రాచల రామ' శతకం, శ్రీ కల్వ కుంట అలహో శృంగార ఆచార్య మహా వ్యాకరణవేత్త. నృసింహ శ్రీరంగనాధులపై స్తోత్రాలు రాశారు. ❁

## 449. శ్రీ చిదంబరం వీరభద్ర శర్మ (20వ శతాబ్దం)

**ఆ**జన్మ విద్వాంసులైన శర్మగారు కాశీ శివా రాధ్య పీఠంకు ముఖ్యాధికారి. కాశీలో విద్య నేర్చారు. న్యాయ, మీమాంసాలను మధించారు. తెలుగు కన్నడ మరాటి సంస్కృతాలలో రచనలు చేశారు. సంస్కృతంలో కొన్ని శ్లోకాలు తప్ప మిగిలినవి ప్రచురితం కాలేదు. ❁



## 450. ఆచార్య శ్రీ రవ్వా శ్రీహరి (20వ శతాబ్దం)

**ఆ**చార్య శ్రీ రవ్వా శ్రీహరి కుప్పం ద్రవిడియన్ విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్‌గా ఉన్నారు. గురుకులాభ్యాసంలో విద్యనేర్చారు. ఫిరదౌసి గబ్బిలంతోబాటు నారాయణ రెడ్డిగారి 'ప్రపంచ పది'ని కూడా సంస్కృతీకరించారు. ఆయన వ్యాసాలు 'సంస్కృత వైజయంతి'గా ప్రచురితమైనాయి. అన్నమాచార్య సూక్తి సుధను సంస్కృతంలో రాశారు. వారి స్వంత రచన 'మాత్ర గీతి'.

సూర్యరాయాంధ్రని ఘంటువులో లేని 35వేల కొత్త ఆరోపాలతో శ్రీహరి నిఘంటువు తయారు చేశాడు. "అన్నమయ్య పదకోశం" తయారు చేశాడు.❋

## 451. ఎన్ సి పార్ధ సారథి అయ్యంగార్ (20వ శతాబ్దం)

**'రా**మ పాదుకా స్తవం', శ్రీ దాశరథి వెంకటా చార్య' సంస్కృత శబ్ద ధాతు పద వాక్యాలపై వ్యాకరణం, శ్రీ తిరుమల గుడిమెళ్ళ అంతర్వేది నరసింహాచార్యులు' పాంచచ జన్యంపై వందలాది స్రగ్ధరా శ్లోకాలు రాశారు. 'శ్రీ మల్లాది సుబ్బా రాయుడు' శ్యామల, వైద్యనాధ, మాతంగి' స్తోత్రాలు రాశారు.❋

## 452. శ్రీ కోరుట్ల కృష్ణమాచార్య (20వ శతాబ్దం)

**క**రీంనగర్ జిల్లా కోరుట్ల సంస్కృత కాలేజి ప్రిన్సిపాల్ చేసి రిటైర్ అయిన కృష్ణమాచార్య గారు మూడు సంస్కృత కావ్యాలు రచించారు. శ్రీ వైష్ణవ తత్వాన్ని వర్ణించే 'గురువంశ మహా కావ్యం' రాశారు. మెల్కోటేలో ఉన్న రామ ప్రియ దైవానికి బీబీ నాంచారికి ఉన్న ప్రేమను వివాహాన్ని వర్ణిస్తూ 'సంపత్ కుమార సంభవం' కావ్యం రాశారు. కాళిదాసు మేఘ సందేశానికి అనురూపంగా 'మనః సందేశం' రాశారు.❋

## 453. శిష్టానరసింహ శాస్త్రి (20వ శతాబ్దం)

**కా**శ్యప గోత్రీకుడు సీతారామ శాస్త్రి కుమారుడు నరసింహ శాస్త్రి. షట్ దర్శనాలలో మహా ప్రావీణ్యుడు. తర్కంలో అవక్ర పరాక్రముడు. కృష్ణాజిల్లా మచిలీపట్నం నోబుల్ కాలేజిలో తెలుగు సంస్కృత ఉపాధ్యాయునిగా పని చేశాడు. తండ్రి కూడా గొప్ప విద్వాంసుడు. తండ్రి దగ్గరే విద్య నేర్చాడు. కాళిదాసు మేఘ సందేశ కావ్యాన్ని తెలుగు చేశాడు. 'సర్వ తంత్ర విద్వర', విద్వన్మణి, మహోపాధ్యాయ బిరుదాంకితుడు.

ఈయన సంస్కృత కావ్యాలు – ఇందిరా పరిణయం అనే 5అంకాల నాటకం, ఆరు సర్గల శ్రీ కృష్ణోదయ మహా కావ్యం, శృతి రత్న దీపం, వివస్వ ప్రభ అనే బ్రహ్మ సూత్రాభాష్యానికి వ్యాఖ్యానం. ఇందిరా పరిణయ నాటకం సముద్ర మధనంతో ప్రారంభమవుతుంది. నృసింహావతారంతో సమాప్తమౌతుంది. సంస్కృతంపై మంచి పట్టు ఉన్నకవి. నందన వన వర్ణన బాగా చేశాడు.

'కీరాఃకోర కితేషు కల్ప తరుషుప్రారబ్ధ వేదాక్షరా – వాతస్పందన వాటి కాంగణచలద్రంగా పరామ్భ స్పృశః
కిజ్వేతే విరు వంతి పంచమ రవం చూతేషు పుంస్కోకిలాః–కున్జేషు ప్రతి బద్వర్ఘూంక్రుతి రవా దావంత్యమీ షట్పదాః'

శ్రీ కృష్ణోదయ మహా కావ్యంలో ఆరు సర్గలున్నాయి. భాగవత కృష్ణావతార కథ. కృష్ణలీలలను కవితాత్మకంగా వర్ణించాడు.

గర్భిణిగా ఉన్న దేవకీదేవి పృధు పయోధరాలను వర్ణించాడు.

"హారి నీలామణిద్రుతిర్రిః సుదతీ గర్భ ముపాగామస్తతః –కుచ మధ్యా

వినిర్గాతా హరే స్తను కాంతిః కిము చుంచు కా[శితా"

ఇందులోని కొన్నిలీలా శుకుని శ్రీ కృష్ణ కర్ణామృతం ను పోలి ఉంటాయి. తాను రాసిన ఇతర కృతులనూ చెప్పుకొన్నాడు. శ్రీ కృష్ణ వర్ణనలో–

"శ్రీ కృష్ణ పదాంచిత శాద్వలేషు గతాగతం కృష్ణా్రముగా న చక్రుః–
తదీయ భక్త్యా నిజ నామ రూపే జగత్సు కృష్ణాత్మ కతావ గత్యా"

93 శ్లోకాల శృతి రత్న దీపం అద్వైత సారాంశం. మొదటి శ్లోకం–

"జ్యోతిర్వేదే యదిందుద్రుతికలిత జటా బద్ధ లేలీహనేంద్రః–తద్భోగా
రబ్ధానిద్రా పరి చయ చతురం చాపి లక్ష్మీసనాథం"

ఆశ్వాసాంత గద్యం – 'శిష్టా న్వయేన నరసింహ సమాశ్ర యేన శ్రీ కాశ్యపేన రచితే శృతి రత్న దీపే మయావభాస యియతా ప్రథమః పరస్య నారాయణస్య చరణామ్బుజయో ర్పితో భూత్'

నరసింహ శాస్త్రి కృతులలో వివస్వత్ప్రభ కవి ప్రతిభకు పట్టం కట్టిన రచన. వివిధ శాస్త్ర పరిజ్ఞానం లోకజ్ఞానం రాశీభూతమై దర్శనమిస్తుంది. ఇది శంకరాచార్య స్వామి బ్రహ్మ సూత్ర భాష్యానికి మహా వ్యాఖ్యానం. శంకర భాష్యాన్ని సమర్ధించిన భట్ట పాద, శబర స్వామి, పాణిని, పతంజలి, కాశిక యాస్క, మణి దీధితి, గదాధరులను గట్టిగా సమర్ధిస్తూ రామానుజ భాష్యాన్ని తూర్పార బట్టిన గొప్ప రచన. తన వ్యాఖ్యానంపై కవి స్పందిస్తూ–

'ప్రౌఢ ద్వాంతిరాస్కృత శృతి రివసిద్ధాంత ఘంటా పద – స్ఫూర్త్యై ర్నిర్మల చేత సా మియమభూదద్దేతా భాష్యోపరీ
శ్రీమత్పండిత పుండరీక పరిషద్విఖ్యాతశిష్టాన్వయ – శ్రీ విద్వన్నర సింహ తార్కిక మణోవ్యాఖ్యా వివస్వత్ప్రభా'❁

## 454. చర్ల భాష్యకార శాస్త్రి (20శతాబ్ది)

**లో**హిత గోత్రీకుడు, వెంకటాద్రీయం రాసిన చర్ల వెంకట శాస్త్రి మనవడు భాష్యకార శాస్త్రి. పశ్చిమ గోదావరి జిల్లా కాకరపర్రులో 20వ శతాబ్దంలో ఉండేవాడు. సంస్కృతంలో ఉద్దండుడు. శాస్త్రాలలో అద్వితీయుడు. వ్యాకరణంలో దిట్ట. నిఘంటు నిర్మాత. అన్నిటా సాటిలేని వాడు. రచనలలో మేధావిగా దర్శనమిస్తాడు. సంస్కృతంలో 20 గ్రంథాలు రాశాడు. 'మేకాధీశ శబ్ద రత్నాకర కల్ప తరువు' అనే అలంకార శాస్త్రం ఒక శబ్దాన్ని విడగొడితే వెయ్యి అర్థాలొచ్చేట్లు రాసిన ఘనుడు. దీనిపై వ్యాఖ్య కూడా రాశాడు–

'ఏ శబ్దార్థ విచార తత్పరాదియో ఏ యా గుణాలంక్రియాఃదోషాసక్త హృదే విచిత్ర కవనే యేవా ద్వనా వ్రుత్సుఖాః'

మేకాధీశ శబ్దార్థ శతకోటి, మేకాధీశ శబ్ద శతకోటిలలో కూడా ఇలాంటి ఫీట్లు చాలా చేశాడు. నూజివీడు ప్రభువు మేకా రంగయ్యప్పారావు చరిత్రతో సంబంధమున్న రచనలివి. కవి ప్రతిభా వైదుష్యానికి ఆటపట్లు.

మేకాధీశ రామాయణం16 అక్షరాల ఏకశ్లోకి. వీటి పెర్ముటేషన్, కాంబినేషన్‌లతో రామాయణం అంతా దిగుమతి అవుతుంది. అదీ గొప్ప.

32 అక్షరాలతో 'కనక బంధ రామాయణం' కూడా చిత్రిక పట్టాడు. అక్షరాలు చేతి గాజులా ఉండి, ఎడమ నుండి కుడికి కుడి నుండి ఎడమకు కూరిస్తే 64 శ్లోకాలేర్పడతాయి. ఏర్పడిన ప్రతిశ్లోకానికి రెండు అర్థాలు చెప్పాడు కవి. అంటే మొత్తం 128 శ్లోకాలయ్యాయన్నమాట. రుచికి –'రామానా తాభాస, చారా వారా గోపదారా – ధారా ధారా భీమకారా ,పారావారా సీతారామా

ఈ కంకణబంధ కవిత్వం మొట్ట మొదట 1780–1870వాడైన శిస్టు కృష్ణమూర్తి శాస్త్రి ప్రయోగించాడు. రెండవ కవి భాష్యకారుడు దీన్ని మెరుగు పరచాడు .
'వినాయక చరిత'లో శ్యమంతకోపాఖ్యానం చెప్పాడు. 'నృసింహ దండకం', గౌతమీ దండకం, వ్యాప్తి చింతామణి రామాయణం శ్రీరామ విజయ వ్యాయోగం కూడా రాశాడు. వ్యాయోగంలో నటి నాందిలో ఎడారి లాంటి వ్యాకరణ శాస్త్రంలో కవి మాస్టరీ చేశాడని చెబుతుంది. 'తర్క వ్యాకరణ ప్రబంధ కవనైః కర్కస్యయుక్తా ప్యసౌ – వాణీ కావ్య వశాత్ప్ర సాదా గుణ తస్సవైః ప్రశస్య భవేత్
నూర్యో గ్రీష్మ హాత వవ శాదత్య న్యంతతీక్ష్ణోప్యె నన్–వర్షాకాల వశాత్సమస్తజగతస్సంతోష కారీ భవేత్'
'చతురక్షర గీత సారం'లో నాలుగక్షరాలతో సర్కస్ ఫీట్లు చేసి చూపాడు. ఇవికాక రాజ్య లక్ష్మీ పరిణయం, భువన గుణ మహా దర్పణం, సనాతన ధర్మ విజయ వ్యాయోగం, వర్ణమాలా రామాయణం, విజయ విలాసం, దండక రామాయణం, సూర్య దండకం, హనుమద్దండకం, కృష్ణ ప్రసాదీయం అనే అలంకార శాస్త్రం కూడా భాష్యకార శాస్త్రి రచనలే. ❁



## 455. కిడాంబి రాఘవాచార్య (20వ శతాబ్దం)

**ధ**న్నవాడ రాఘవాచార్యగా ప్రసిద్ధుడైన కిడాంబి రాఘవాచార్య శ్రీనివాసాచార్య కుమారుడు. ఆత్రేయస గోత్రం. సంస్కృతాంధ్రాలలో మహా కవి. 'విద్వత్ కవి మణి' బిరుదుపొందాడు. కడప జిల్లా ప్రొద్దుటూరు వాడు. సంస్కృత పాఠశాలలో ఉపాధ్యాయుడు. బాల సరస్వతి తిరుమల బుక్క పట్టణం శ్రీనివాసాచార్యకు సమీప బంధువు. 30 దాకా రచనలు చేశాడు. అందులో సంస్కృతంలో 'కురుమూర్తి వైభవం లేక శ్రీనివాస పాదుకార్పణ నాటకం, శ్రవణానంద ప్రేక్షణీకం, మాణిక్య నగర వైభవ ప్రేక్షణీకం, కోదండరామ ప్రతిస్టాపనా ప్రేక్షణీకం, లక్ష్మీధ్యాన సోపానం, లక్ష్మీ మంగళాస్తుతి, అహోబిల గురు వైభవ స్తుతి ఉన్నాయి.

కురుమూర్తి వైభవ నాటకం 6 అంకాలు. మహబూబ్‌నగర్ జిల్లా అమరచింతలో సంస్థానంలో ఆత్మకూరు రాజు రాజా రామ భూపాలుడు వజ్రాల పాదుకలను కురుమూర్తి గుట్టపై వెలసిన శ్రీనివాసునికి సమర్పించటం కథ. శాంత రస ప్రధానం. ఇది దాదాపు శ్రవ్య నాటకం .1906లో కురుమూర్తిలో చిత్రోత్సవం నాడురాజు గారి పట్టాభిషేక మహోత్సవానికి ప్రదర్శింపబడింది. ఈ నాటకంలో రాజు గారి బంధువులు పాత్రధారులవటం విశేషం జమీందారి సమకాలీన చరిత్రను తెలియజేస్తుంది. నాలుగవ అంకంలో మలయాళీలు గుజరాతీయులు, అంగ

వంగ దేశేయులు ఉంటారు. ఇది విశ్వ గుణాదర్శంలో లాగా ఉంటుంది. సూత్రధారుడు కవిని పరిచయం చేస్తాడు.

'ఆత్రేయ వంశ కలశోదధీ శీత భాసా గోపాల నామ విబుధాగ్ర భువా సహర్షం – శ్రీ శ్రీనివాస బుధ వార్య తనూ భవేన శ్రీ రాఘవార్య విదుషా రచితప్రబందః'

కవి ప్రతిభకు గుర్తుగా నిలిచే శ్లోకాలు.

'ఆభాతి పంకజ ముఖీ సరసీమ్రుణాల శైవాలసైకత భుజాల కసంనితంబా – ఆవార్త నాభి రిహ మీనా పయోజ కేశా, చక్షుఃపయోధర యుతావనితేవ లోకే'

కురుమూర్తి శ్రీనివాస రధోత్సవ వర్ణన–

'యత్కామినీ ముఖ జిత రరాశభ్రుక్తు శాంగః – స్తప్యాత్ససౌ సుర ధునీ శతటేగిరీశే జ్యోత్స్నాపి తస్మిత ధుతాభి ముఖం సిషేవే– నాసాగ్ర లోల నవ మౌక్తిక డింభ నామ్నా'

లక్ష్మీ ధ్యాన సోపాన స్తుతి 10 శ్లోకాల కావ్యం.

'ద్వంద్వే దేవ్యా రుచిరపదయోరున్మిషత్పంచబుదుధ్యా– రేలంబత్వం వహతి కుతుకాన్ మానసం మామకీనం

లక్ష్మీ మంగళస్తుతి 8 శ్లోకాలు.❋

## 456. కర్ణ వీర నాగేశ్వరరావు (20వ శతాబ్దం)

**తె**లుగు సంస్కృతం హిందీలలో గొప్ప పండితుడు కర్ణ వీర నాగేశ్వరరావు. గుంటూరు జిల్లా వేటపాలెం వాసి. తెలుగులో చాలా రాశాడు. సంస్కృత రచనలు– సంస్కృత వాచకాలు అయిదు భాగాలు, స్వాతంత్ర్య సందేశం, వాణివీణ, మృత్యుంజయ తారావళి, చండికా తారావళి, శ్రీ వేంకటేశ్వర తారావళి, పొట్టి శ్రీరాములు బలిదానం జాతీయ గీతం, రెండుభాగాలు, కథామంజరి, వాణీ నిబంధన మణిమాల, తాతా సుబ్బరాయ శాస్త్రి, వజ్ర పాతం, సంస్కృత పత్రావళి మొదలైనవి. వీటిలో చివరివి గద్య రచనలు. కొన్ని–

'శ్రీకరః సంస్కృతాకారః దయా పేతో గుణాన్వితః – పరబ్రహ్మ జగత్కర్తా, రాక్షతాం సంస్కృతం సదా'

సాహాయ్యం కురు సర్వేషాంసాహాహైం సత్ప్రవర్తనం – సాహాహ్యా జీవితెన్నైవ దృశ్యతే సంస్థితం జగత్

మఖార్య రక్షణం మత్వా నిజ భక్తాన్ ప్రబోధయ – నేత్ర యుక్తా హ్యప్రకాశా మాం పాహి గరుడ ధ్వజా'❁

## 457. వీటూరి వెంకట రామశాస్త్రి (20 శతాబ్దం)

**భా**రద్వాజ గోత్రీకులు పద్మాంబ, నాగేశ్వర శాస్త్రిల కుమారుడు రామ శాస్త్రి. శ్రీకాకుళం జిల్లా యలమంచిలి తాలూకా కోరుప్రోలు వాసి. 20వ శాతాబ్ద ప్రారంభం వాడు. వేదశాస్త్ర పండితుడు. తెలుగు సంస్కృతాలలో కవిత్వం చెప్పాడు. ఉర్లాం వేద పరీక్షలలో ఎన్నో బహుమతులు, సత్కారాలు పొందాడు. జ్యోతిష శాస్త్రంలోనూ దిట్ట. సంస్కృతంలో 'హరి స్తోత్రం' రాశాడు. హైమవతీ పరిణయమూ రాశాడంటారు కాని అలభ్యం.

'శ్రస్తా కైశ్యాదివ జలధరాత్తస్తతో నేత్ర యుగ్మం – మాటసా ద్వంద్వ త్తవను చ దశాత్మ ధారా సా విరేజుః ❁

## 458. సంస్కృత 'గాంధీ సూత్రాలు' రాసిన దిట్టకవి సుబ్రహ్మణ్య శర్మ (20వ శతాబ్దం)

**గీ**ర్వాణ ఆంధ్రాలలో దిట్టమైన కవిత్వం చెప్పగల దిట్టకవి సుబ్రహ్మణ్య శర్మ ప్రముఖ గాంధేయవాది. మద్రాస్ ప్రెసిడెన్సి కాలేజి ప్రిన్సిపాల్. గాంధీగారి గొప్పతనాన్ని లోకానికి చాటిచెప్పటానికి 'గాంధీ సూత్రాలు'ను సంస్కృతంలో రాశారు. బహు గ్రంథకర్త. గొప్ప కర్మిష్టి. సర్వేపల్లి రాధాకృష్ణ పండితునికి వియ్యంకుడు. శర్మగారి కుమారుడు శాండిల్యతో రాధాకృష్ణన్ గారి కుమార్తె వివాహం జరిగింది.❁

## 459. శ్రీ ఉపద్రష్ట వెంకట కృష్ణయ్య (20వ శతాబ్దం)

**కృ**ష్ణాజిల్లాకు చెందిన కవి 'చాణక్య', 'శివాజీ', ప్రహ్లాద ఏకపాత్రాభినయం, 'సవత్కుమార ఆశ్రయం', మహిళానాం మిత్ర బాంధవ్య, కల్పకం, భోజనందేహి రాజేంద్ర, తరతిశ్లోక మాత్మవిత్, సంభాషణలు, దుర్గాస్తోత్రం, వందేమాతరం రాశారు. "భక్తానుగ్రహ పారీణాం సర్వదుఃఖ నివారిణీం- మోక్షదాం కామదాం, దివ్యాం దుర్గం, దేవిం నమామ్యహం" అని దుర్గాస్తోత్రం చేశారు.❁

## 460. శ్రీ రాణి సదాశివమూర్తి (20వ శతాబ్దం)

**కృ**ష్ణాజిల్లా కవి. 'పుత్రవయాం భారతాః జీవబ్రహ్మైకవ, నాపరః శివ, పాణినీయం నాటకాలు, సరసన్విరాగం, ఋతు సందేశం రూపకాలు రచించి 'అగ్నిపుత్ర'కు జాతీయస్థాయిలో మొదటి బహుమతి పొందారు. శారతా స్తవమంజరి, గాయత్రీ స్రగ్ధరా సుప్రభాతం, జగన్నాధ సుప్రభాత స్తవమంజరి, వాస్తు పురుష అష్టోత్తర నామ స్తోత్రం కూడా చేశారు. గాయత్రి సుప్రభాతంలో "ప్రత్యూష జాతి పవనాః ప్రసంతి మందం- పద్మాకరే కమల షండ సుగంధ వాహాః- మకందలోల మధుపాస్తవ కీర్తిగానాః- గాయత్రిదేవి, మహితే కురు సుప్రభాతం" అని కమనీయంగా చెప్పారు.❁

## 461. శ్రీ పమిడిపాటి పట్టాభి రామారావు (20వ శతాబ్దం)

**కృ**ష్ణాజిల్లా కవి. 'బాలకృష్ణ చరిత్ర'లో ఏకాకాచన చుంబితే పిలుతి స్వీయాధరం లీలయా– ఏకాకాచన పీడితేవ కుచః స్తైతి చ– ఏకాదన సంగతేవ సురతీ, సౌఖ్యేనిన సం జల్పతే– ఏవం రస విలాస సౌఖ్యమతులం గోపీ జనై ర్భావ్యతే" అని రాసక్రీడను తనివార వర్ణించారు. 'శకుంతలా' కూడా వీరు రాశారు.❋

## 462. శ్రీ కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు (20వ శతాబ్దం)

**కృ**ష్ణాజిల్లాకు చెందిన వీరు 'గురు కృపాలహరి' రాశారు. మచ్చుకు ఒక శ్లోకం చూద్దాం.

"వాణీ యమ్మ ఖత స్స్వయం కృణయతే వీణాం పునర్యత్పదే– లక్ష్మీర్యత్ర శివోదయ

స్సుకరితా సృష్టిశ్చ యత్రాత్యుతం– రక్షా కార్యమతో జగద్విలయనం యత్రాద్భుతం శాంభవం–

వందే తత్కిమ పి త్రిశక్తిక మహాత్రై ప్యరుషం గౌరవం".❋

## 463. శ్రీ మల్లాది సుబ్రహ్మణ్యశర్మ (20వ శతాబ్దం)

**కృ**ష్ణావాశి అయిన ఈ కవి 'మహేశమాల్య స్తోత్ర కదంబం' రాశారు. "జిహ్వేకీర్తయ శంకరం పురహరం చేతో

భజ శ్రీధరం– పాణి ద్వంద్వ సమర్చ యేశ్వర కదాః శ్రోత్రద్వయం త్వంశ్రుణు– శంభోంలోకయ లోచన

ద్వయ విభో గచ్ఛాంఘ్రి యుగ్మాలయం– జిఘ్రఘ్రాణ మహేశ బిల్వసురభిం మూర్ధన్నమోమాపతిం" అని అత్యంత భక్తిని ప్రదర్శించారు.❋



## 464. శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రి (1892- 1967)

**కృ**ష్ణాజిల్లా చిరివాడ వీరి స్వగ్రామం. 1892లో వేలూరి వెంకటేశ్వర్లు, విశాలాక్షి దంపతులకు జన్మించారు. వేదవేదాంగాలలో షట్ శాస్త్రాలను మథించారు. ఇంగ్లీ, ఫ్రెంచ్, గుజరాతి, హిందీ మున్నగు భాషలలో పాండిత్యం వుంది. యోగ, సాంఖ్య, వేదాంత, జ్యోతిషాలలో లోతైన పాండిత్యం సాధించారు. శాస్త్రిగారిని మించిన పాండితీ సంపన్నులు లేరని ప్రతీతి. తిరుపతి కవుల శిష్యులు. 18వ ఏట గురువుల పక్షాన కొప్పరపు కవులతో ఢీకొని అందర్నీ మెప్పించారు. గురు ఆశీర్వబలంతో అష్టావధాన, శతావధానాలు చేశారు. రసగుళికలు లాంటి కథలు రాశారు. బహులోతైన సాహితీ విమర్శలు రాశారు. బెంగాలీ శరత్‌బాబు నవల ''బిందూగారబ్బాయి'' ఆంధ్రులకు పరిచయం చేసిన మొదటి వ్యక్తి శివరామశాస్త్రిగారు. గుజరాతీ భాషలోని గాంధీజీ ఆత్మకథను తెలిగించారు. విక్టర్ హ్యూగో 'లేమిజరబుల్స్' నవలను 'దివ్యజీవనం'గా తెలుగు చేశారు. అరవింద మహర్షి యోగదర్శనాన్ని తెలుగులోకి తర్జుమ చేశారు. శ్రీ గడియారం రామకృష్ణ,

శ్రీ పిసుపాటి చిదంబర శాస్త్రి వంటి ఉద్దండులు శాస్త్రిగారి శిష్యులు. వీరి 'వ్యాసవాణి' శాస్త్రి పాండిత్య ప్రకర్షకు మచ్చుతునక.

కొవ్వూరులో శాస్త్రిగారు చేసిన శతావధానంలో "కర్ణాత్మజా మదవహ ద్విబుధోప్తై పార్థః" అనే సంస్కృత సమస్యను అర్థవంతంగా

"ధర్మాత్మజం ద్రుపద జాం పరి దృశ్య వేగా- చ్చాంద్రాయంగా చరణ బద్ధ

విదర్పి దేశాన్- పశ్యన్ తదీయ పృధు సుందర మీక్ష్య చక్షుః- కర్ణాత్మజా ముదవహ

ద్విబుధోపి పార్థః'' అని చక్కగా పూరించి మెప్పు పొందారు. శివరామశాస్త్రిగారు 1967 మార్చి 17న స్వగ్రామం చిరివాడలో పరమపదించారు. 'ప్రాచీన ఖగోళం' అనే వీరి గ్రంథం ఎన్నో ఖగోళ అద్భుతాలను ఆవిష్కరిస్తుంది. వీరి కథలు అంతర్జాతీయ స్థాయిలో వున్నాయని, 'డిప్రెషన్ చెంబు' కథ అత్యుత్తమమైనదని, అన్నీ పూర్తి సామాజిక స్పృహతో రాసిన కథలేనని రచయిత, విశ్లేషకులు స్వర్గీయ ఎమ్.వి.ఎల్.నరసింహరావు నాతో నూజివీడు నుంచి బెజవాడకు బస్ ప్రయాణం చేస్తూ, నా ప్రక్క సీటులో కూర్చుని సంభాషించినపుడు అన్నమాటలివి.❀



## 465. కాశ్మీర భారతానికి వందనం చేసిన- డా. ధూళిపాళ రామకృష్ణ (20వ శతాబ్దం)

**డా.** ధూళిపాళ రామకృష్ణ గారు కృష్ణాజిల్లా విజయవాడలో 23-11 -1964న శ్రీ ధూళి పాళఅచ్యుత రామయ్య, శ్రీమతి సీతారామమ్మ దంపతులకు జన్మించారు. బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి గారి వద్ద గురుకుల పద్ధతిలో తర్క,వేదాంత శాస్త్రాలను, కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతి మహాస్వాముల వారి వద్ద బ్రహ్మసూత్ర శంకర భాష్యాదులను అధ్యయనం చేసిన అదృష్ట వంతులు శ్రీ రామ కృష్ణ గారు. 1987 నుంచి సంస్కృతాధ్యాపనం చేస్తూ, విజయవాడ మేరిస్ స్టెల్లా కళాశాల సంస్కృత విభాగాధ్యక్షులుగా ఉన్నారు. ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యానంతరం గత 60 ఏళ్ళలో సంస్కృత సాహిత్య రచన"పై -యు జి .సి ఆధ్వర్యంలో విజయవాడ మేరీస్ స్టెల్లా కాలేజిలో డా.ధూళిపాళ రామకృష్ణ గారి ఆధ్వర్యంలో రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం వైస్ ఛాన్సెలర్ ప్రొఫెసర్ హరేకృష్ణ శతపది, శ్రీ వెంకటేశ్వర వేదిక్ యూనివర్శిటి వాస్ ఛాన్సెలర్ శ్రీ సన్నిధానం సుదర్శనశర్మ, మద్రాస్ యూనివర్సిటి వైష్ణవిజం ప్రొఫెసర్ శ్రీ నరసింహాచార్యులు, రాజస్థాన్ సంస్కృత యూనివర్శిటి వైస్ చాన్సెలర్ శ్రీ.వి.రామ కృష్ణమాచార్యులు వంటి ఉద్దండుల సమక్షంలో, 2008 ఆగస్ట్ 11 ,12 తేదీలలో జరిగిన సదస్సులో పత్ర సమర్పకుల రచనల కదంబాన్ని 'సంహూతిః' గ్రంథంగా వెలువరించటంలో శ్రీ రామకృష్ణ గారి పాత్ర అద్వితీయం. ఇది గొప్ప ఆకర గ్రంథంగా, సంస్కృత కవుల గురించి తెలుసుకోవాలనే ఆధునికులకు చాలా ఉపయుక్తంగా ఉంది.

మంచి కవులు అధ్యయన శీలురు అయిన శ్రీ రామకృష్ణ గారు సంస్కృతంలో 'శ్రీ మద్భాగవతే అద్వైత మత ప్రతిష్టా' రచించి భాగవతపురాణంలోని అద్వైత మత ప్రతిస్టాపనం గురించి గొప్ప పరిశోధన చేసి ఎరుక పరచారు. 'వందే కాశ్మీర భారతం' అనే 14 శ్లోకాలు, కార్గిల్‌లో 2016 సెప్టెంబర్ 26 ,27 తేదీలలో కేంద్ర సాహిత్య అకాడెమి నిర్వహించిన ఉత్తర భారత మరియు ఈశాన్య భారత రాష్ట్రాల రచయితల గోష్టిలో కాశ్మీర్‌పై స్పందించి రాసిన గీర్వాణ కవిత.

ఆంగ్లంలో 'ఎ స్టడీ ఆఫ్ సాంస్క్రిట్ ఇన్స్క్రిప్షన్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్' అనే గ్రంథాన్ని ఆంధ్రదేశంలోని శాసన అధ్యయనంపై తమకున్న గాఢ పరిశీలనకు దర్పణంగా రచించారు. కొన్ని సంస్కృత కావ్యాలను తెలుగులోకి అనువాదం చేసి వాటిలోని భావ పరంపరను తెలుగు వారికి పరిచయం చేసి సంస్కృత సాహిత్యంలో ఉన్న తమలోతైన పాండిత్యాన్ని తెలియజేశారు. అందులో 'శ్రీ రామ కీర్తి మహా కావ్యం', 'శివ కర్ణామృతం', 'శివ మహిమ కలికా స్తుతి', 'సుమనో వాగ్విలాసః', కృష్ణ లీలా తరంగిణి' ముఖ్యమైనవి. ఇవన్నీ ముద్రితాలే.

డా. రామకృష్ణ గారి గీర్వాణ పాండిత్య ప్రతిభా  విశేషాలను గుర్తించిన థాయ్ లాండ్ ప్రభుత్వం రాకుమారిచే 2013లో రాజ సత్కారం చేసి గౌరవించింది. 2014 సెప్టెంబర్ 5 వ తేదీ ఉపాధ్యాయ దినోత్సవం నాడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'ఉత్తమ సంస్కృతాధ్యాపన పురస్కారం' అందజేసి వారి విద్వత్ కు నీరాజనం పట్టింది.

ఇప్పుడు రామకృష్ణ గారి 'వందే కాశ్మీర భారతం' కవితా సౌందర్యాన్ని దర్శిద్దాం

1) అల్లా బుద్ధ సరస్వతీ పరిసరే కాశ్మీర దేశే శుభే –నానాభారత వాగ్మి భి స్సుఘటితే సౌహార్ద సంరాజితే

హిందూస్థాన చమూ జయాత్తు విదితేతీర్థస్థలే  కార్గిలే –విద్యా కౌశల దర్శనే కుతుకినా మారాధనా యాంజలిః

2) కల్హణాభినవానంద క్షేమ మమ్మట ధీమతాం –కోశ జాతం చర్వ్య మాణం భారతం వ్యాప్య రాజతే

3) కాశ్మీర శైవాలంకార తత్వ బోధం విదాయనమః –ప్రత్యభిజ్ఞాన మభి వ్యక్తిం చాదాదభినవోతులం

4) గుహా ప్రవేశాత్త స్తైష సహస్రబ్దిః ప్రవర్తతే –కాశ్మీర వాత పూతో స్మిపుణ్య కాలే

యదాగతః

5) లోచనస్యైవ దాతాద్య మహా దాతేతి కీర్త్యతే -తత్కార్యేప్య గ్రణీ రేష ప్రశస్యో భనవో భ్రుశం.

6) నాగేహో న దారా న వత్సా న మాతా -న సంపత్ న రక్తం న ప్రాణో న దేహః

స్వ సర్వస్వ మేవ స్వ రాష్ట్రం హి యేషాం -నమామస్సదా సైనికాన్ సేమ్ని దుర్గాన్.

7) కార్గిల్ శృంగే మహా తుంగే ఉగ్ర శైత్యం ప్రసహ్యాచ -ఉన్మీల్య జాగ్రుతాం నేత్రే వాహినీం దేవతాంనుమః

8) శత్రోః దుశ్చరితం యేషాం ప్రాణ సంకట కారకం -స ఏవ లక్ష్యస్తేషాం హి న పౌరాః శత్రు దేశకే.

9,10) సదా త్యాగాయ సంసిద్దా న భోగాయ కదాచన -మానుషీం తనుమాశ్రిత్య శౌర్య సాఫల్య కాం క్షిణః

మాత్రు భూమేర్గౌరవాయ హ్రుదా సంచార తత్పరాః-భారతీయా స్సైనికా హి విశ్వ వంద్యస్య దా భువి.

11) కాశ్మీర జన సౌభాగ్యం భద్రం భారత భూతలే -స్వయం న్యస్య ప్రసన్నాత్మా రాజా హరి పదం యయౌ.

12) అస్ప్రుస్టాకాశ్యపీం భూమిం భారతీ కర్తనే యుతైః-ద్విధా విభక్తా యాశ్వేత్తై స్త్రిధానః పురతః స్థితా.

13) ద్వైవిధ్యం యద భూ త్వాక్యాం తత్రైవ చ పునః పునః -ఉన్మత్త చేష్టితై స్తేషాం విభాగాః ప్రభవంతిహి.

14) యుష్మద్భక్తి కృతా శ్వాసం -అఖండం భారతం స్థిరం

భవత్సు న్యస్త విశ్వాసా -నిద్రామ స్సోదరా వయం.

అల్లా, బుద్ధ, సరస్వతీ మాతలకు ఆవాస భూమి అయిన కాశ్మీర వైభవాన్నీ, అక్కడ జన్మించిన కవీశ్వర ఆలంకారికులైన కల్హణ, అభినగుప్త, ఆనంద వర్ధన, క్షేమేంద్ర, మమ్మటాదులను కీర్తిస్తూ, వర్ధిల్లిన శైవ మతాన్ని గుర్తిస్తూ, సరిహద్దులలో నిద్రాహారాలు లేక సౌఖ్యం లేక భార్యా తల్లీబిడ్డలకు దూరంగా నిరంతరం రక్షిస్తున్న సైనిక సోదరులకు జేజేలు పలుకుతూ, భూతల స్వర్గమైన కశ్యప మహాముని క్షేత్రమైన కాశ్మీర్ వైభవాన్ని దృష్టికి తెస్తూ అఖండ భారత దేశాన్ని ఆకాంక్షించారు కవి శ్రీ రామకృష్ణ.❁

## 466. కృష్ణమూర్తి కుమార (కాలం తెలియని కవులు)

**మం**జులాచార్య అనే కృష్ణ మూర్తి కుమార వశిష్ట గోత్రీకుడైన సర్వజ్ఞపండితుని కుమారుడు. 'వల్లవీ పల్లవోల్లాస భాణ'కర్త . పల్లవ శేఖర, రస లాలితల మధ్య ప్రేమ సంబంధాన్ని తెలియజెప్పేది ఇదే పేరు మరో భాణం రాశాడు శిష్టు కృష్ణమూర్తి కూడా. క్రిష్ణమూర్తి భాణాన్ని సింహాచల వరాహ నరసింహస్వామి వసంత ఋతు ఉత్సవాలలో ఆడేవారు. కవికూడా విశాఖజిల్లా లేక గోదావరిజిల్లా వాడై ఉంటాడు. శిష్టుకవి కంటే ముందువాడు అయి ఉండాలి.

కృష్ణమూర్తి కవి తన భాణ రచనను 'శ్రీకాంతా తవ జీవితం ఖలు తతో వక్షః స్తలే లక్ష్యతే – నై కాంతా మయి చిత్త వృత్తి రిహ బుద్వోతిముగ్ధా గతిః' అనే శ్లోకంతో ప్రారంభించాడు. ఇందులో ఉన్న భావోద్వేగాలను నాందీ వాక్యానంతరం తెలియ జేశాడు.– 'అద్రుత స్థన మండలం స్వ వపుషా ముచ్చూ వాస లీలా పుషా – మున్మీల ద్రతి లాభ మీలిత దృశా ముత్థాన నభేద స్పృశం'
తన వంశం గురించి ఆరు శ్లోకాలలో కవి చెప్పుకొన్నాడు. సూర్య పండితునికి బుచ్చయా చార్య, వెంకట పండిత, సర్వజ్ఞపండిత కుమారులని, సర్వజ్ఞుని కొడుకు మంజులాచార్య అంటే తానేనని చెప్పాడు. తన రచనా వైభవాన్ని, శైలిని గురించి ఘనంగా చెప్పుకొన్నాడు –

"క్వచిత్ ప్రసూన కేసర ప్రసూన వల్లరీ లల–న్మాదూలికా నిరర్గళక్షర జ్ఝరీ సహోదరీ

కచిత్ప్రభిన్న దంత దాన మారుతా విల – భ్రమాత్కరాభ్రదంత దంభ ఋమ్మితో రువైశ్వరీ". 'రసలాలతిక అనే నాయిక గురించి వచనంలో వర్ణించాడు.– 'సంప్రతి సకల వారచకోర లోచనా జన మాస్త కన్యస్తు మణిః–కుచ వసుంధరా ధర సముల్లల ద్వదు రాజ్ఞాన శంకః కారణాచసరస రముక్త మణిః–కటీ తటసమారూఢ సారశన చారుతహీర ఘంటికసరద్రుణిః–కామన జన మోహపారావార రసలాలతికాయా యవీయసీ'. ఈ ప్రేమ కథ నాగపురం అనే కల్పిత నగరంలో జరిగినట్లు, ఆపుర వర్ణనా చేశాడు.❀

## 467. ఇంద్రకంటి కొండయ

ఇంద్రకంటి నారాయణ అంచమ పుత్రుడు కొండయ. పుట్టిన తేదీ కాలం అలభ్యం. కాశ్యప గోత్రం. నెల్లూరు తూర్పు గోదావరి జిల్లాలో ఇంద్రకంటి వారున్నారు. బహ్వృచ శాఖకు చెందినవాడు. 'మహేశ్వర మానస మహోత్సవం', శృంగార రస భ్రున్గారం అనే ఉద్గ్రంధాలు రాశాడు. మొదటిది శివాలయాలలో అర్చన విధానమంతా వర్ణించి చెప్పాడు. దీని నకలును కొడుకు లింగభట్టు రాశాడు–

'తత్పుత్రేణైవ లిఖితా లింగ భట్టేన సూరిణా ःతాద్రుశేన మహేశస్య పూజా మానసికీ శుభా' అని కొడుకు చెప్పుకొన్నాడు.

రెండవ రచన 'శృంగార రస భ్రున్గారం' భాణం. శ్రీశైల ఉత్సవాలలో ప్రదర్శించేవారు. నాందీ ప్రస్తావన లో మల్లికార్జున స్వామి స్తుతి –

'కైలాసం పరిహృత్య శైల సుతయా సాకం గణేశ్చస్వయం – శ్రీ శైలేత్ర హి మల్లికార్జున ఇతి ఖ్యాతో స్తి సర్వేశ్వరః'

శృంగార రస భ్రున్గార నామకం రూపకం సతాం – ఏషామభి నినీషామిరిరిం జయిషయా హృదః❁

## 468. కోదండ రామయ్య

ఎక్కడ ఎప్పుడు పుట్టాడో కోదండ రామయ్య ఎవరికీ తెలియదు. బొబ్బిలిలో నివసించాడని భావిస్తారు. 'సూర్య శతక'కర్తగా గుర్తుండి పోయాడు.

'శ్రియా సమేతం శ్రిత పారిజాతం వియత్ప్రదీపం వితత ప్రతాపం –నయ ప్రచారం నగ రాజ ధీరం దయా సముద్రం తపనం నమామి'

తేజో మయే మండల మధ్య భాగే సి0హా సనే రత్న మయేబ్జపీఠే–ఆశీ నము గ్రాయుధ దీప్ర హస్తం ఛాయాపతిం చండకరం నమామి'

సూర్య శతకాన్ని ముగిస్తూ చెప్పిన శ్లోకం –

'కోదండ రామార్య కృత స్తుతిం యేపఠింత శ్రుణ వంతిచ భక్తి యుక్తాః–తేషాం శ్రియం పుత్రా కళత్ర సౌఖ్యం, స్వర్గం చ మోక్షం దిననాద దేహి' అని దీన్ని రాసినవారికిభక్తిగా చదివినవారికి భార్యా బిడ్డలతో కలకాలం సౌఖ్యం పొంది చివరకు మోక్షం ప్రసాదించమని సూర్య దేవుడిని వేడుకొన్నాడు.❁

## 469. ఉదయరాజు గంగాధర కవి

**ద**త్తాత్రేయ చంపు రాసిన ఉదయ రాజు దత్తాత్రేయుని కుమారుడే 'మద్ర కన్యా పరిణయ చంపు' రచించిన గంగాధర కవి. ఇతని కొడుకు లక్ష్మణ భోజరాజు అసంపూర్తి 'రామాయణంచంపు' పూర్తి చేశాడు. కరీంనగర్ జిల్లా శనిగరం నివాసి. నియోగి బ్రాహ్మణుడు ఇప్పటికీ ఈ కుటుంబం వారు కరీంనగర్, వరంగల్ జిల్లాలో ఉన్నారు.

'మద్ర కన్యా పరిణయం' 5 ఉల్లాసాల కావ్యం. శ్రీకృష్ణుడికి బృహత్సేనుడి కుమార్తె లక్ష్మణకు జరిగిన వివాహ వృత్తాంతం ఇది. కావ్యాన్ని కవి – 'కళ్యాణ మవ్యహతమాతనేతు సంవ్యాన లీలా క్రుద భూద్రజస్యః–కర్ణానిలేనాహృతేంశు కాంతే,యో వల్లభాయాఃస్మిత పల్లవేన' అంటూ ప్రారంభించాడు. తన తండ్రి దత్తాత్రేయ గురించి కొంత చెప్పాడు. కావ్యాన్ని పూర్తి చేస్తూ–

'నందావా నిందావా మత్కృతి రేషాద్యయత్కృతోత్పన్నా – శైశవ వాణీవ పితుః నంద తనూజస్య నందినీ భూయాత్'❁

# 470. ఏలేశ్వరపు గోపాల

ఏలేశ్వరపు వెంకటలక్ష్మి, సుబ్బరాయలపుత్రుడే గోపాల. కౌశికస గోత్రం. 'యుదిష్టిరాశ్వమేధ చంపు'కర్త. ధర్మరాజు చేసిన అశ్వమేధ కథ. మూలం జైమిని భారతం. హలయాస క్షేత్ర మీనాక్షీ సుందరేశ్వరుల భక్తుడు. మీనాక్షీ దేవిని స్తుతిస్తూ చెప్పిన శ్లోకం -

'శ్రీ హాలస్య వసున్ధరానివాసతే రీశస్య మోదప్రదా-మీనాక్షీ కరుణా కటాక్ష సరణిర్మాం పాతు సా సతతం'

కవిని ఇతర కవులు పొగిడి ఈ కావ్యాన్ని రాయమని కోరిన శ్లోకం -

'మీనాక్షీ వరలబ్ధ దివ్య కవితా ధారా సుధా రాశింసం -భూతా గణ్య మహా ప్రచండ రచనా పాండిత్య సర్వంకషం

శ్రేష్టే జైమిని భారతే సురుచిరం పర్వాశ్వ మేధం మహా - కావ్యం త్వం కురు గద్య పద్య మయమిత్సేతే ప్రహృష్టా ధియః'

ఈ శ్లోకాలలో కవి బహు గ్రంథకర్త అని ధారా శుద్ధి కలకవి అని తెలుస్తుంది. కాని యుదిష్టిర చంపు తప్ప ఏదీ లభ్యం కాలేదు. కవి చేసిన హస్తినాపుర వర్ణన -

"ఆస్తి శ్రీ భారతాన్వవాయ జనుషాంరాజ్ఞాం జ్వలత్సేజసం - సంపజ్ఞాలా వినిర్జితా మరపురీ శ్రీ హస్తి నాఖ్య పురీ".

చివరలో ఉన్న శ్లోకం-

'మైలో రత్నమయం కిరీటమమలం పార్శ్వేనుజాతన్యదా - చిత్తే భూత దయాం కరే వితరణం బాహో ప్రతాపశ్రియం

జిహ్వాగ్రే హరి కీర్తనం విరచయన్ ధర్మాత్మ జాతో ముహుః-సా మోదేనసహోత్యుతేనశకలం గోపాయతి స్మశ్రితిం'

తన వంశ చరిత్రను చివర్లో చెప్పుకొన్నాడు కవి.

'శ్రీమత్కౌశిక గోత్ర పావన మహా ఏలేశ్వరా ఖ్యాన్వయ-మ్భో జా హస్కరతేజస్య కవి సుత శ్రీ సుబ్బయాదీందునా

శ్రీ మద్వేంకట శబ్దపూర్వ విలసల్లక్ష్మాంబికా గర్భాస - ద్రత్నే నేదమ కారీ చంపు కవినా గోపాల నామ్నా ముదా'

గోపాలకవి పుట్టిన చోటు, కాలం తెలియదు. ఏలేశ్వర పు వారు ప్రసిద్ధ బ్రాహ్మణులు ఏలేశ్వరం పవిత్ర క్షేత్రం కూడా. అందులో ఏలేశ్వరోపాధ్యాయులు గొప్ప సంప్రదాయ విద్యావేత్త. సూక్తి వారధి రాసిన పెద్దిభట్ట కూడా ఇక్కడివాడే. నల్గొండ జిల్లా కృష్ణానదీ తీర నివాసులు ఏలేశ్వరపు వారు.❀

## 471. త్యాగ రాజు కవి

**ఈ** త్యాగరాజు సంగీత మూర్తిత్రయ త్యాగయ్య కాదు. కాలం పుట్టుక తెలియవు. కాశ్యప గోత్రీకుడు. ఆనంద నాధుని శిష్యుడు. 1) ఉపదేశ శిఖామణి, 2) పంచ కోశ విమర్శిని, 3) స్వాత్మ స్ఫూర్తి విలాసం రాశాడు. అన్నీ వేదాంత గ్రంథాలే. ఐహికానికన్నా ఆముష్మికానికి ప్రాదాన్యమిచ్చాడు. తానూ ఆంధ్రుడనని చెప్పుకొన్నాడు– 'ఇత్యానంద నాద పద పద్మోప జీవినా కాష్యపసగోత్రోత్పన్నే ఆంధ్రేన త్యాగరాజ నామ్నా విరచితః' ఉపదేశ శిఖా మణిః సంపూర్ణం

రెండవ రచన అయిదు పాదాల 'పంచ కోశ విమర్శిని'. పంచ భౌతిక శరీరం పై కాంక్ష తొలగి పరమ పద సోపానం వైపు దృష్టి మరల్చాలన్న ఉద్బోధ.

మూడవది 37శ్లోకాల స్వాత్మ స్ఫూర్తి విలాసం. ఇవికాక శివమీడే స్తోత్రం శాంతిస్తవం, నవ మల్లికా స్తవం, ఆర్య పంచాదశి, ధర్మాంబికాస్తావం, నవాక్షర స్తోత్రం సంవిత్సతకం కూడా రాశాడు.

ఉపదేశ శిఖామణి శంకరాచార్యుల భజ గోవిందానికి అనుకరణ–

'భజ గౌరీశం భజ గౌరీశం భజ గౌరీశం ముగ్ధ మతే – భజ గౌరీశం భజ గౌరీశం భజ గౌరీశం భజ ముగ్ధ మతే

సత్యం వదరే ధర్మం చరరే క్రుత్యాక్రుత్య విచారం కురురే – కాలో యాతి గృహీత్వా దేహ వ్యర్ధం మా కురు మానుష జన్మ'

పంచ కోశ విమర్శనం–

'న చాహం శరీరం జడత్వాత్ ప్రుధక్త్వాత్ న చ ప్రాణ వర్గః పిపాసాది మత్వాత్ – మనో నాపి సంకల్ప మూలా క్షయత్వాత్ తతసత్యాగ రాజ స్వరూపో హమేవ

చివర్లో–

'న చేశః ప్రభుత్వాత్వ మాయా ప్రుతత్వాత్ న జీవో ప్యావిదాప్రుతత్వాత్ బహుత్వాత్ న మాయస్య స్వరూపో ప్యాస త్వప్రసంగాత్ తతస్త్యాగ రాజ స్వరోపోహ మేవ'

త్యాగరాజ కవి రాసిన స్వాత్మ స్ఫూర్తివిలాసం నుండి ఒక ఉదాహరణ–

'వందే గురు పద ద్వంద్వం వాంఛితా ర్థ ప్రదాయకం – వాగీశ విష్ణు రుద్రేంద్ర వాచారంభణాహేతుకం

స్ఫూర్తి రూపేణ తిస్టామి సద్రూపః ఫలయస్యహి – ఆదా వంతేతదా మధ్యే కటకే హాటకం యదా '

చివరలో–

'సచ్చిదానంద రూపే తు మాయా సత్చిత్సుఖాత్మికా– శర్కరాలం ద్రుకై ర్యద్వత్ శర్కరా రూపమేవ హి

ఏషాహ్వానంద నాధస్య పద పంకో ప జీవినా – స్వాత్మ స్ఫూర్తి విలాస సఖ్యో గ్రందో విరచితోవ్యయః'❁

## 472. దేవాయార్య దీక్షితులు

**శ్రీ**పతి దీక్షితులకుమారుడే దేవాయార్య దీక్షితులు. హరితస గోత్రం. కాలాదులు తెలియవు. 'ప్రసన్న రామాయణం' రాశాడు. ఇందులో 22 సర్గలున్నాయి. మొదటి శ్లోకం – నిత్యాను షంగ దివి చిన్తయ దామ్నో యస్యామ్బుజా వాసుముఖాఃసురేంద్రాః విభాంతివహ్నే రివవిస్ఫులింగా స్తస్మై నమస్యాం వాల్మీకి ని స్తుతిస్తూ రాసిన శ్లోకం – 'సారస్వతాంబు సర ప్రవృద్ధ శాఖాశతాదిస్టితదివ్య మూర్తిం – ఆలింగితంరామకథా లతాభి వాల్మీకి కల్ప ద్రుమ మాశ్రయం ''.తనను గురించి తన పుస్తకాన్ని గూర్చి –

'శ్రీ కాళిదాసాది కవీన్ ప్రణమ్య శ్రీ మత్పదాంకం సరాసాను బంధం – కావ్యం కరిష్యే కవి దేవయార్యః ప్రసన్న రామాయణ మదేయం'

చివరగా – ఇతి శ్రీ దేవ యార్యేణ కృతే శ్రీపతి సూనునా – ప్రసన్న రామే కావ్యే స్మిన్ ద్వివిమ్సాయిరీతి'

ఈ దేవయార్యుడు ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో ఉండి, 'స్మృతి చంద్రిక' రాసిన దేవన భట్టో కాదో తెలియదు. అలాగే 15,16శతాబ్దం వాడైన సంగీత ముక్తావళి రాసిన దేవనా చార్య యో కూడా తెలియటం లేదు.❋

# 473. వారణాసి ధర్మ సూరి

**య**ల్లమామ్బా, పార్వతేశ్వర సూరి కుమారుడైన ధర్మ సూరి వెలనాటి బ్రాహ్మణుడు. హరితస గోత్రీకుడు. వారణాసి కులం కవి చంద్రుడు. కృష్ణా జిల్లా పెదపులివర్రులో జన్మించాడు. పరమ శ్రీరామభక్తుడు. చివర్లో సన్యాసం తీసుకొని 'గోవిందా నంద సరస్వతి' అయ్యాడు. మల్లినాధ సూరికి జూనియర్. సాహిత్య రత్నాకరం రాశాడు. అందులో తన గురించి తనవాళ్ళ గురించి చెప్పాడు – 'గోత్రే చ తస్య సమభూ దభి జాత వంశో వారనాసీత్యుపపదేనభువి ప్రసిద్ధః – తత్ర భవన్ బుధవారాస్త్రిపురా రి సోమ యజ్వాదయ శ్శుభ తప శ్రుతా శీలవృత్తాః '

గొప్ప పండితకవి వంశంలో పుట్టానని చెప్పాడు. ధర్మ భూపాలుడు నారాయణ పండితుని సత్కరించాడని రాశాడు. ధర్మ సూరి చాలా రాసినా మూడు గ్రంథాలే లభ్యం. అందులో ముఖ్యమైనది 'సాహిత్య రత్నాకరం'. పది తరంగాలున్న గ్రంథం. అలంకార శాస్త్ర గ్రంథం ఉదాహరణలన్నీ రామునితో సంబంధం ఉన్న కవితలే. దీనిపై చర్ల వెంకటశాస్త్రి 'నౌక', మల్లాది లక్ష్మణ సూరి 'మంద్ర', మధుసూదన మిశ్ర శర్మ 'నౌక' అనే వ్యాఖ్యానాలు రాశారు.

రెండవ గ్రంథం 'రత్న ప్రభ'. మూడవది నరకాసుర విజయ వ్యాయోగం. ధర్మ సూరి కవిత్వంలో లాజిక్‌తోబాటు కవితా మాజిక్ కూడా ఉంటుంది–

'తర్క కార్కశతాం గతాపి నితరం వాగ్వైఖరీ సత్కవేః మాధుర్య ప్రకటీకరోతి కవితా కాలేషు కిమవదాద్భుతం'

పశ్యత్యంత కఠోర తాముపగతా గ్రీష్మే మయూఖా వలిః – కిం నావిష్కురుతేనవామృత భరం భాసం నిదోః ప్రావృషి'

కవికి అనేక విషయాలలో మంచి ప్రవేశం ఉన్నట్లు చెప్పాడు–

'భామత్యుల్లలిసితా రాతా వివరణే తంత్రే నిరూఢిం గతాః–సచ్చిన్తామణయః సముజ్వల యశో లీలావతీ వల్లభాః

ధర్మ సూరి రాసిన ఇతర గ్రంథాలు అలభ్యం. కవిరాసిన 'కృష్ణ స్తుతి' కృష్ణా నది

గురించే. వ్రుత్యనుప్రాసలో ఉన్న ఒక శ్లోకం–

'కృష్ణా మ్రుష్నాతిసిష్నాస్వభి జనవ్రుజినాన్యశు – వర శౌరాది దారా రుచిర రుచిర హీ భేనాచ్చపేన

శుభ్రా శుభ్రా భ్యదూర్మిభ్ర మకర మకర గ్రామణీగ్రామనీడా –గద్యా గద్యారారేదో వివర భువి వల్లద్వీ వరాదా వరోదా'

100 శ్లోకాల సూర్య శతకం రాశాడు. నాగ బంధంలో సూర్య బింబాన్ని వర్ణించాడు –

'బింబం ధ్వాంత వ్యాదాడం కనక ఘురా శిర రశ్చారి శోణాద్భుదాప్తం –పంచాది ప్రేమ సోమ క్షత దమురుముదః కర్రు కావ్యూహ హారి '

బాలభాగవతం, హంస సందేశం, కంస వధ నాటకం భాష్య రత్న ప్రభ రచించాడు. 'బ్రహ్మ సూత్రా విషయ వాక్య వ్రుత్తి' కూడా రాశాడు. ❁

## 474. నారాయణప్ప మంత్రి

**ఈ** కవి కాలాదులేమీ తెలియ రాకపోయినా 'అభినవ భారతం' అనే 24 సర్గల మహా కావ్యం రాసినట్లు తెలుస్తోంది. మొదటిదానిలో ప్రారంభం చివరి దానిలో సమాప్తం దొరకలేదు. దేవయాని శర్మిష్టల కథ ఇది. మొదటి సర్గలో శంతనుని వివాహ వర్ణన ఉన్నది.

'విజ్ఞాప్య మాత్రే సుర సిద్ధ సూను రంబాలికాంబికయా సహాంబం – పాణిగ్రహం కార యితుం చ తాసాం విచిత్ర వీర్యేణ సముదాతో భూత్'

చివరలో యుదిస్టిరుని పరిపాలన ఉంది.

'తస్మిన్ మహీం శతాని ధర్మ సూనౌ ప్రజాః స్వధర్మే నిరతాఃసమస్తా – కలిస్తదానీంన భూమౌ ప్రవర్తితః కర్తాయుగశ్చధర్మః' ఆశ్వాసాంత గద్యలో ఃఇతి నరసప్ప మంత్రి కృతాభినవ భారతే మహాకావ్యే త్రయో వింశతి సర్గః ❁

# 475. యలగూరి నరసింహ కవి

**పు**ట్టుక, కాలం తెలియని ఈ కవి 18 ఆశ్వాసాల రుక్మిణీకళ్యాణ కావ్యం రాశాడు. దీనికి తానే సాహిత్య చంద్రిక అనే వ్యాఖ్యానమూ రాశాడు. ప్రారంభ శ్లోకాలు పూర్తిగా లేవు. భారతిని స్తుతిస్తూ చెప్పిన శ్లోకం–

"కస్తూరీ కృత గండ పలిశ లతికా ల్యే భ్రమ –భ్రుస్గ స్త్రీకల గాన యోగా విలాస త్కంఠస్వరం గాయనీ

హస్తాబ్జ ప్రవి లోల కంకణ ఝుంకారాభి రామాత్ స్వకం –వీణాయః పరి వాదినీ దిశతు సా భారతీ మంగళం"

ఒక శ్లోకంలో తన పేరు, కవితా సామర్ధ్యం చెప్పుకొన్నాడు –

'ఆలంకారిక మండలేన వినుతౌ నై ఘంటకైర్నిన్దితః –శ్లాఘ్యః శాంతిక నైన కైర్నమసితః పౌరాణి కాగ్రేసరే

వ్యాఖ్యానంతో బాటు కావ్యమూ తానే రాశానని చెప్పాడు–

'సన్నారికేళ ఫల తుల్య తమేస్ఫారం కరోమి నరసింహ కవి ర్వివృత్య – గర్భ స్ఫూర ప్రస వినిర్భర మస్య సార మాస్వాదంత్విహ భ్రుశం భువిః

ఆశ్వాసాంత గద్యం –

'ఇతి శ్రీ విద్వత్కవిజనసింహ యలగూరి నరసింహ విరచితాయాం రుక్మిణీ కళ్యాణవ్యాఖ్యాయాం సాహిత్య చంద్రికా ఖ్యాయాం ఆస్టదశ సర్గః ❋

## 476. కందుకూరి నాగనాధ సూరి

**కా**లాదులు తెలియని ఈ కవి నియోగి బ్రాహ్మణుడని 'మీనాక్షి కళ్యాణ చంపు', 'రామ విజయ' కావ్యాలు రాశాడని తెలుస్తోంది. చంపువులో కవి వివరాలేమీ లేవు. రెండవ దానిలో ఆశ్వాశాంతా గద్యలో కొన్ని వివరాలున్నాయి.

'యత్కటాక్షోప విక్షిప్త నిరూధ నిజ సంపదః – ప్రత్యూహ విన వర్తింతేకలయే తంవినాయకం.

కులశేఖరుదు మలయా ధ్వజుని కూతురు మీనాక్షికి మధురానధుదు శివునికి జరిగిన వివాహమే ఇతి వృత్తం. కులశేఖరుదు ప్రాచీన కల్యానపురిని ఏలిన రాజు. ఒక రోజు రాజుకు శివుడు కలలో కనిపించి తాను నగరానికి పడమరలో ఉన్న చిన్న ఆలయంలో ఉన్నానని, తనకు నగరం మధ్యలో మంచి ఆలయం నిర్మిచి పూజించమని కోరాడు. శివ సన్నిధిని రాజు గుర్తించి కొత్త రాజధాని కట్టి, మధుర అని పేరెట్టి ఆలయం నిర్మించి శివుని ప్రతిష్టించి భక్తితో అర్చించాడు. దీనికి ఆధారం హాలస్య మహాత్మ్యం.

రామాయణాన్ని ఆరుకాండలలో రామ విజయంగా రాశాడు. మొదటి శ్లోకం సరిగ్గా లేదుకాని అందులో చంద్రమౌళి కుమారుడు విష్ణు రాజును ప్రస్తుతించాడు. దీన్ని రాయటానికి కారణం చెప్పుకొన్నాడు.

'కచ ప్రబంధ రచనకాహ మత్యల్పసంమతిః–చంద్ర దానే యదా బాలౌ విధాతుం తమహం యతే'

ఆశ్వాసాంత గద్యంలో – 'ఇతి కందుకూరి చొక్కనాధ శిష్య శేషమాంబా గర్భ సంభవ నాగనాధ విరచితే రామ విజయేయుద్ధ కాండః❁

## 477. ఉద్దేమఱ్ఱి పాపయ

**ఈ** కవికాలాదులు తెలియవు కాని చిన్నదైన 'రాఘవాష్టకం' శ్రీరామునిపై రాశాడు. కొన్ని శ్లోకాలు–

"అంబువాహనీల దేహ, మంబు జాక్ష మవ్యయం – మందమంద గౌర హస మిందు సుందరాననం'

పద్మ జాత పూజితాంఘ్రిపంకజాత యుగ్మ–మంబాధమరాధవం సదా శివార్చితం భజే"❁

## 478. చెరుకూరి బ్రహ్మసూరి

**న**రసాంబా సర్వేశ్వర భట్టల కుమారుడు బ్రహ్మసూరి. చెరుకూరి ఇంటిపేరు. ఉత్తర కాండ చంపు సంస్కృతంలో రాశాడు. 16వ శతాబ్దం నుంచి చెరుకూరి వంశం వారు గొప్ప కవి పండితులుగా ప్రసిద్ధులు. స్వర్ణ మంజరి, రసమంజరి మొదలైనవి రాసిన చెరుకూరి లక్ష్మీ ధరుడు విజయనగరరాజు తిరుమల దేవరాయ ఆస్థానకవి. మనకవి కాలం తెలియలేదు. చెరుకూరు కృష్ణా జిల్లా గ్రామం. మొదటి శ్లోకం–

'ఆనంద కంద లితయ చ్చరణారవింద, నిష్యన్దమాన మకరంద నిపాత పూతా–
దివ్యాఙ్గనా జనిశిలశ్యాభి వంద నీయ, వందామి తమ్ రఘుపతిమిందిరాయాః

రాముడు సీతను అడవికి పంపమని ఇచ్చిన ఆజ్ఞ–

'భో భో భ్రాతరః శ్రుణుత మద్వచనం – మాబ్రూత్ ప్రతి వచనం–
'సీతాపి తాపస నివాస విలోకనాయ మామద్య యాచిత వతీ గమనం చిరాయ –త్వాం త్వక్తు ముధ్యాతమనా అఃహ మష్య భూవం కర్మాను కూల రచన స్సామయో యమస్మిన్'

కావ్యమంతటా సున్నిత పదాలతో ప్రవాహంగా సాగటం ప్రత్యేకత. చివరి శ్లోకం లో తన వంశాన్ని వర్ణించాడు.

'చేరుకూరన్వ య దుగ్ధ సాగర విదుస్సర్వే శ్వరా వ్యయః పితా – జననీ యస్య నృసింహ నామ కలితా సూర్యస్సుదీ రోగ్రజః
పర మధ్యు త్తర కాండ మభ్య చరితం శ్రీ రామ చంద్రాఖిల – వ్యవహార ప్రధన స్సమ గ్రమభవతద్బ్రహ్మ సూరేః కృతౌ'. ❁

## 479. రత్నారాధ్య

**ఆం**ధ్రదేశానికి చెందిన వీరశైవ బ్రాహ్మణకవి రత్నారాధ్యుడు. కాలాదులు లేవు. 'దారుక వన విలాసం' సంస్కృతంలో రాసినట్లు ఉన్నది. దారుకా వనంలో శివ క్రీడల వర్ణన. మొదటి శ్లోకం–

'శ్రీరాధ్యార్చిత పాద పంకజ ముమాకాంతం కటాక్షావిత్ – త్రైలోక్యం ముని మానససైక నిలయం దేవం సమస్తాధికం'

వేద్యం ప్రత్న వచః శిరోభి తతులం మృత్యుంజయం మానసే – ధ్యాయామ్య న్వహమాశ్రితామర తరుం తమ్భూయసే శ్రేయసే'

శ్రీ మద్రౌప్య గిరీ శివా తను రథం భద్రాసనే సుస్తితం – పాయాత్తోషితయా సమం గిరిజయా బాలేందు చూడామణిః'

కవే దీనికి వ్యాఖ్యానం కూడా రాసినట్లుంది.

## 480. పుల్లెల రామ చంద్ర కవి

**క**వికాలాదులు తెలియవు కాని కౌండిన్య గోత్రీకుడని 'పౌలస్త్య రాఘవీయం' రాశాడని తెలుస్తోంది. 20 సర్గాలున్నాయి. రామాయణమే. పుల్లెలవారు అమలాపురంలో ఉన్నారు. పుల్లెల శ్రీరామచంద్రుడు గొప్ప సంస్కృతాచార్యుడు, కవి, విమర్శకుడు అని మనకు తెలుసు. ఏ ఎ కవి వీరి తాతగారో లేక పైతరం వారో? ఒక శ్లోకం–

'వినాయకం పదసరోజ యుగం మునీంద్ర ప్రూత్కేర వైఘా విదు బిమ్బమహం భాజిశ్యే
విఘ్నౌఘ కుద్ర దలనే శతకోటి సారం సారం గిరామజ ముఖాబ్జ వినిస్సృత నాం'

చివరి శ్లోకం–

'రఘుపతిస్య పంపాంవీక్ష్య చంచాత్తరంగాం– ధ్వనిమపి పీక శబ్దం నీల కంఠోఘలాస్యం
మధుకర మదరావం తత్ర సంవీక్ష్య రామః – శృతి హృదయ వినోదాంనాట్య లక్ష్మీం సమేనే '

బాలకాండలో ఆరు సర్గలు, అయోధ్య నాలుగు, అరణ్య నాలుగు కండలు కొన్ని బంధ శ్లోకాలూ రాశాడు. ❁

## 481. రామయ

**రా**మరాయ లేక రామయ కవి గురించి వివరాలు తెలియవు. ఆరు అంకాల 'యయాతి నాటకం' రాశాడు. అదీ దాదాపు శిథిలమే. మొదటి శ్లోకం–

'లక్ష్మ్యా లీలాకలహ కుతుక స్వాప భాజో నిచోలం –మోత్రుం ముక్త సార రుచిమయం మోఘు యత్నేము

యత్నేమురారే'

సూత్రధారుడు కథని, కవిని పరిచయం చేస్తాడు–

'నాన్విదమేవ ప్రతిపన్న దాసి త్వాంమామాశ్వాసయితుం ప్రవృత్తం యుష్మద్వచనం స్మర్యతి

శ్రీ రామయ కవేః కృతిం యయాతం నామ నాటకం – యాత్ర శర్మిస్టాయా దాసీత్వమపి శ్లథనీయం'

చివరగా–

'చూడాన్దోలితనీడ దాడిమ వాణీ కుంజాంత రాలే మనా – గుస్మీలక్త లవి0ఖ మండలగల ద్రోణా ద్రుత ప్రచ్యుతః

విశ్వాండమూర్చిత పశ్య విశ్వవిజయ – స్వేరహోత్కార కింకిణీకలకలా త్కారా నుకరీ రవః'❀

## 482. కందుకూరి రామేశ్వర

**కృ**ష్ణాజిల్లా కళ్ళేపల్లి పార్వతీ పరమేశ్వర భక్తుడు కందుకూరి రామేశ్వరుడు 'పార్వతీ పరిణయ చంపు' రాశాడు. కాలాదులు అలభ్యం. రెండు స్తబకాల అసంపూర్తి రచన. ప్రార్ధన శ్లోకం–

'శ్రేయః కరోతు సతతం మమ చంద్రమౌళేః పాదాబ్జ యుగ్మ మధసంజయ నాశ నిధ్వం

మేరేంద్ర ముఖ్య సుస్వందిత గీయమానం చన్నానుకంపిసమతత్వ దురంధరం తత్'

కవి వినయ విధేయతలను ప్రకటించుకొన్నాడు.

'కాహం విద్వాన్ గ్రంధ కర్తృత్వ బుద్ధిః జానన్ ద్విన్నాన్ యానికాని ప్రకుర్వే – నానా విద్యా భూషితానాం తథాపి గ్రంధం విద్వాన్మనుషాణాం మూడే చ '

హిమాలయ వర్ణన – 'హిమాలయో గోత్ర రాజశ్చతుస్సముద్ర పర్వంత భువో మాన దండ ఇవ స్థితః –బభౌ స హిమవాన్రాజా కాంచీ కృతమ హోర్నవః'

తారకాసురుని చేత పరాభావింపబడిన ఇంద్రుని దైన్యం–

'తారకాఖ్య కరవాల విభిన్న బాహు శాస్విభవాదిజితాశాః – తత్రుప్తా ముకిలీకృత నేత్రా బ్రహ్మ లోక మగామన్ సురరాజః'❁

## మైనేని గోపాలకృష్ణ, సత్యవతి గార్ల కుటుంబం



### పెద్దబ్బాయి కృష్ణ కుటుంబం



### చిన్నబ్బాయి రవి కుటుంబం



